





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

# పల్లెపదాలల్లో ప్రజాజీవనం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071483

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

జాతీయ ఆయం జానపదగేయం

జానపదుల బ్రతుకే కవిత్వం కవిత్వమే బ్రతుకు

# పల్లెపదాలలో ప్రజాజీవనము

(ఉస్మానియా విశ్వవిద్యాలయముచే డాక్టరేటు పట్టమునందిన సిద్ధాంత వ్యాసము)


## డాక్టర్ యెల్దండ రఘుమారెడ్డి

తెలుగు భాషోపన్యాసకుడు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల-జడ్చర్ల



గురుకుల విద్యాపీఠ ప్రచురణలు

: యెల్దండ :

తా॥ కలువకుర్తి, జిల్లా॥ పాలమూరు (మహబూబ్‌నగర్)

ఆంధ్రప్రదేశ్ - శా. శ. ౧౯౦౧

# ముడుపు ★

మంటిని నమ్ముకోని మింటికి సూపులుసేసి
కంటి నిండగ ఆశలు కమకమ్మగ పొదిగేసి
కిలుకిలు సందూన కిన్నెర నాదం బోసి
కాలం కాలం సందున కళ్లం ఆడించేసి
రేపటి కోసం తాము రెక్కలె మిగిలించేసి
దూపకు దుత్తెడు పోసెటి మాపల్లెటూళ్ళ మంటికి
శిరసొంచి ఇస్తున్న ఇది వారిదె కదనన్న
శ్రమజీవికి శ్రమ విలువ కింకెవ్వరు బలమన్న !

★ పల్లెప్రజలపై ముడుపుగట్టిన ఈగ్రంథవిక్రయ ఫలితంగా రాబడి అంచన సుమారు 12000/- రూ॥లు మరియు నావ్యవసాయ క్షేత్రంలో 5వ వంతు భూమికూడ మెల్దండ గురుకుల విద్యాపీఠానికి వర్తింపజేస్తు ఆమోదిస్తు రాస్తున్నాను. పల్లెప్రజల జ్ఞానోదయానికి తోడ్పడు ధార్మిక విద్య ఈపీఠంద్వారా ఒసంగ బడుటకై సంకల్పించినాను. నా ఉద్యోగ విరమణానంతరం అట్టి బృహత్తర కార్యం సాధింపబడుటకై యోజన గావించినాను. గురుకుల విద్యాపీఠ పాలక మండలిని కూడ ఏర్పరచినాను.

## : రచయిత వివరములు :

రచయిత:- యెల్దండ రఘుమారెడ్డి
తల్లిదండ్రులు:- యెన్నం మాణిక్యమ్మ, చెన్నారెడ్డి
స్వగ్రామము:- యెల్దండ
జననము:- 27-9-1941

ముద్రిత రచనలు:- ముత్యపదాలు 1969; పల్లెల్ల పొద్దుపొడిసింది 1973; పల్లెపదాలలో ప్రజాజీవనము 1979.

అముద్రిత రచనలు:- అకాల జ్ఞాన తత్త్వాలు
జానపదసాహిత్య సౌరభము (వ్యాసాలు)
ఇవీ మన బతుకులు (కథానికలు)
మొగలి రేకులు (పద్యాలు)
జానపద గేయనాటికలు

సేకరణలు:- పాలమూరు మండలం పల్లెపదాలు (1, 2. భా.)
పల్లె తట్లు
లు
జానపద కథాగేయాలు

విద్యాభ్యాసము:- యెల్దండలో ప్రాథమిక మాధ్యమిక విద్య; కలువకుర్తిలో ఉన్నత విద్య 1961; హైదరాబాదు చాదర్‌ఘాట్ కళాశాలలో పి.యు.సి. 1962; స్వకీయము (Private) గా ఉస్మానియా విశ్వ విద్యాలయము బి.ఎ. 1965; ఎం.ఏ. 1968; పిహెచ్ డి 1974.

వృత్తి:- గొర్లకుంట తండలో (1962) ఏకోపాధ్యాయునిగా, కడతాల (1963-65), యెల్దండ (1965-68) ఉన్నత పాఠశాలలలో సహాయోపాధ్యాయునిగా; జడ్చర్ల ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో 1968 నుంచి తెలుగు భాషోపన్యాసకుని ఉద్యోగనిర్వహణ.

,,మన జాతీయ జీవితానికి అచ్చపు ప్రతిబింబం మన జానపద వాఙ్మయము. ఈ వాఙ్మయం పల్లీయుల జీవితంతో ఎంతో ప్రగాఢంగ పెనవేసికొని సాగివస్తున్నా పండితులమనుకొనే వారెందరో చాలాకాలం అంతగా పట్టించుకోలేదు. కాని ఇటీవల వ్యక్తుల, సంస్థల, విశ్వవిద్యాలయాల దృష్టిని ఈరంగం ఆకర్షించినది. సేకరణమూ పరిశోధనమూ జరుగుతున్నవి. ఇరుగుపొరుగు వారికంటె తెలుగువాళ్ళు వెనుకబడివున్నా మెల్లమెల్లగానైనా ముందుకు సాగిపోతున్నారు. ఇట్టి ముందంజలో డాక్టర్ యెల్దండ రఘుమారెడ్డి గారి "పల్లెపదాలలో ప్రజాజీవనము" ఒక క్రొత్త మలుపు. రెడ్డిగారు పల్లెపదాలలోని ప్రజాజీవన స్రవంతికి ఏతమెత్తినారు. ఆయన కృషి, నిశిత పరిశీలనం, పరిశోధనం శ్లాఘా పాత్రములు. మన జానపద వాఙ్మయ పరిశోధన రంగంలో ఇది ఉత్కృష్టమైన గ్రంథముగా ఉండగలదు. ఈకృషి నా పర్యవేక్షణలో జరిగినందుకు నాకు మరీ సంతోషంగా ఉన్నది భగవంతుడు రెడ్డిగారికి దీర్ఘాయురారోగ్యాలు ప్రసాదించి ఈ జాతీయ కృషిలో ఇతోధిక సేవ చేయించాలెనని కోరుతున్నాను,,.

ఆచార్య బి. రామరాజు —

# భూమిక

**ప్రేరణ:-** మా పొలాల మీద వినిపించిన పల్లెపదాలు నా చిన్నతనంలోనే నన్ను పాటుకేయించినయి. సుతి పట్టించినయి. పలుకు పలికించినయి. దానికితోడు మాయమ్మ నిత్యం నన్ను దూళ్ళకు సొప్పదెమ్మని వెంటాడే దినాళ్ళో ,,నీ నెత్తి దేవుడు కొట్టా తేపోరా సొప్పకట్టా,, అంటూ తిట్టుతుంటె నా ప్రయాస కాయాంత్య ప్రాసకలిసింది. మెల్లగా నేను ఆలయల్లో పదాలు అల్లుకోవటం జరిగింది. కవిత్వం పుట్టింది. అప్పటి ఆ రుచి పరిశోధ నాతృత లభించినప్పుడు విశ్వవిద్యాలయమిచ్చిన 'పిల్ల వసు చరిత్రయు' అను పరిశోధన విషయాన్ని తప్పింపజేసుకొని 'పల్లెపదాలలో ప్రజాజీవనము' అను విషయాన్ని స్వయంగా ఎన్నుకొని ఆచార్య బి. రామరాజు గారిచేత ,,సై,, అనిపించుకొని నిరంతరం పల్లెపదాలతో ప్రజాజీవనంతో తదాత్మ్యం పొంది రెండున్నర సంవత్సరాలలోపుననే పరిశోధించి, ఉస్మానియా విశ్వవిద్యాలయా నికి సమర్పించి 1974 లో పిహెచ్. డి. పట్టం పొందటమయింది.

**జానపదగేయ స్థానం:-** జాతీయ ఆయం జానపదగేయం. జానపద సాహిత్యంలో ఆ గేయ సాహిత్యమొక ప్రత్యేక శాఖ. దీని ప్రధానోప శాఖయే ముక్తకాలయిన పల్లెపదాలు (జానపద గేయాలు) 1 ఈ శాఖయితర శాఖ లకన్న విశాల మయింది. రాసిలో వాసిలో గూడ బలమయింది. అది పల్లీయ జీవనమంతా అల్లు కొన్నది. పల్లెపాట పల్లెకు పెట్టని కోట. బ్రతుకు బాట: కవిత్వం మూట. అట్టి పల్లె పదాలలో ప్రతిబింబించినప్రజాజీవన దర్శనమే ఈ పరిశోధన విషయం.

1.



**పరిధి :-** తెలుగుదేశమంతా దీనికి పరిధి. ఇంచుమించు అన్ని ప్రాంతాలకు వర్తించురకరకాలైన సుమారు 5000పల్లెపదాల నాపరిశోధనకాధారం. అందులో 900 దాంకా నేను స్వయంగా సేకరించు కొన్నట్టివి (ఇవేగాక 50 దాంకా జానపదకథలు, 20దాంకా జానపద కథాగేయాలు, 200 పైగా తట్లు మొ॥ అదనంగా సేకరించితిని.) మిగతా ఇతరులు సేకరించి వుంచినట్టివి. ఈపల్లె పదాలన్ని ముక్తకాలు. అయినా ఒకటి రెండు సందర్భోచితంగా చిన్నపాటి కథా గేయాలు కూడ ఉదహరించ బడినయి.

**దృక్పథం:-** బ్రతుకే కవిత్వం కవిత్వమే బ్రతుకు అయిన పల్లెపదాలలో ప్రజాజీవనాన్ని దర్శింప జేయటమే నాపరిశోధనా దృక్పథం. పల్లెల్లో. మోటగొట్టే వేళ మొదలుకొని తెల్లవారి నప్పటినుంచి పొద్దువాలి నిద్దుర మోపయ్యే దాంకా ప్రతి పనికి పాట బ్రతుకు బాట. అందువల్ల పల్లెపదాలలో వారి బ్రతుకును సమగ్రంగా చూడగలం.

పరస్పరాశ్రయంతో క్రమ పద్ధతిని అలవరచుకొని స్థిర సంబంధాల పై జీవించే వ్యక్తుల సమూహమే సమాజం. వ్యక్తి మూలంగా కుటుంబ పునాదిపై పరస్పర సామాజిక సంబంధాలతో ఆచారాదులందు అన్యోన్యతను నెరపుకొంటు కలిసికట్టుగా జీవించుటే సామాజిక జీవనం. అందు జాతీయత మౌలికమయింది. పటిష్ఠమయిన జానపద సామాజిక జీవనంలో జాతీయ స్రవంతి దరులొలసి పారు చుండుటకు పల్లెపదం ప్రతిబింబమగుటవల్ల సామాజిక దృక్పథంతో అందలి ప్రజాజీవనాన్ని అన్నికోణాలందు పరిశోధిం చటం జరిగింది. జానపద సాహిత్యరంగంలో ఇదొక సమగ్ర ప్రయత్నం.

**సేకరణానుభవం:-** సేకరణనిమిత్తమై తెలుగుదేశంలోని తెలుగుసీమ, సాగరసీమ ప్రధాన భూములు తిరిగినాను. పరిసరాలు, ప్రత్యక్ష జీవనపథాలు పరిశీలనకందినయి. గోదావరి తరంగాలమీద పయనించి పడవ పాటలతో

పాటు సరంగుల బ్రతుకు తెరువులతో తదాత్మ్యం పొందినాను. వివిధ ప్రాంతాలందు సేకరించి అచ్చొత్తించిన జానపదగేయ సంపుటాలు, అచ్చు కావలసిన సంపుటాలు, అక్కడక్కడ మిత్రులందిచ్చిన పదాలు అందు కొన్నాను. ప్రత్యేకంగా రాజమహేంద్రవర గౌతమీ గ్రంథాలయమున రెండు రోజులుండి కీ. శే. నేదునూరి గంగాధరం గారి సేకరణలను, రచనలను పరిశీలించినాను. ఆరంగమందు బహుముఖ సేకరణ విషయములో వారు ప్రథములు పల్లెపదాల సేకరణకార్యం నాకువినూత్నఆనందాన్ని పుట్టించేది. ఆకార్యం నాకు నిత్యకృత్యాగినట్టై. సేకరణదినాళ్ళో తిరిగినపల్లెతో, దొరికిన పల్లీయులతో తదాత్మ్యంపొందిన నాఅనుభవాలు మరచిపోజాలను. పల్లె వాడ కట్టున, ఇండ్ల ముందరి చెట్ల నీడపట్టున నిలబడి, పల్లెలయలందు ఆవాసలో, ఆయాసలో, నేను పల్లెపదాలుపాడిన మరుక్షణం ఆగూటినుంచి ఈ గూటి నుంచి గున గున గున పల్లెదుడ్డేగాళ్ళు వచ్చి నాచుట్టు మూగుతుండేది. సేలపొంటి పోయి పాడినప్పుడు, వాళ్ళు తమపని యించక ఆపి సెవులూపి సూస్తుండేటి. పనిలోమునిగి దరువేస్తుండేది; ఒకరికంటె ఒకరు తమ కొచ్చిన పదాలు పలుకుతుండేది. కలుపుతీసేచోట, కొలువమలిపేచోట, కొఎలిగాసేచోట, కళ్ళమూడేచోట, దుక్కిదున్నేచోట, మోటగొట్టేచోట, ప్రతక్షంగా నా మాటలు వారి మాటలు ఆ క్షణమే వారి గుండెనుంచి పాటను తోడిపించేది. పాత ముసలవ్వల పక్కకుపోయి విసురురాయి పదాలు, దంపుడుపదాలు, అత్తకోడండ్ల పదాలు, ఆలుమగల పదాలు, పాడుతుంటె, వారి సోరతనాలు శ్రమదినాలు కండ్లల మెదిలినట్లయి పెద్దప్రాణం పెదవులాడిస్తుంటె గప్పగప్ప రాసుకుంటుండేది. అప్పుడు సంటోన్ని సంకకేసుకొని తల్లి ,సందమామరావే జాబిల్లిరావే, అని ఊహ లందించినట్లయ్యేదినాకు. పెక్కుసందర్భాలందు కన్నీటిపాటలు పాడుతుంటె నాకండ్ల పొంటి బొటబొట కారిపోవటం రసానుభూతికి నిదర్శనమే. నవ రసానుభూతులు సహజంగా సూటిగా కలుగుతుండేవి ,,ఆవుతోక నీసెవ్వీక,,

,,కీసనిండ బొంగులు నెత్తినిండ బొంగులు, పసదప్పి మాతాత పండ్లిరుగ వడితె-బిసదప్పి మాయవ్వ కండ్లిరిసి సూసె, గుసులిరిగి మాతాత గూట్ల కూసుంటె - అసలెరిగి మాయవ్వ తోట్ల పండింది, మీతాత మీసం వొడిగడ్డి వాసం,, అంటూ వ్యంగంగా నేను పలుకులప్పటి కప్పుడే కల్పించి ఆటలాడే పిల్లల గుంపులో కలిసి పిల్లవాణ్ణై ఆడుతుంటె నోరారనవ్వుతూవాళ్ళకువచ్చే మాటలు, పాటలు విన్పిస్తుండేది. కోలాటాలాడేవాళ్ళ దగ్గరకుపోయి,అప్పుడున పాటందుకొని నేనుపాడుతుంటె, వారిగుండెలదాగిన పాటలుబయటికొచ్చేవి. ఎంతతెల్వని పల్లెటూరికి వెళ్ళినా నేను వారికిగాని వారు నాకుగాని కొత్త అని పించకపొయ్యేది. ఆ సన్నివేశాల లోవారి ఆప్యాయత, అమాయకత, ఆదరం,హాస్యం, లాస్యం,శృంగారభాష్యం, అమృతహృదయం నన్నిప్పటికి పల్లీయ ముద్రలో భద్రంచేస్తున్నాయి. దీనికంతా ఒకకోయిల కూయంగానే మరో కోయిల, ఒక కోడి కూయంగానే ఇంకో కోడి కూయటానికేది ప్రేరణయో అదే మాకు కారణం. అది ప్రకృతి లక్షణం. అట్లా వాళ్ళనుంచి ఉన్న పాటలను రాబట్టి, రాసుకున్న తరువాత తలాయిన్ని దుడ్లు సేతులపెట్ట బోతె సిగ్గు పడుతుండేది. బలవంతంగా నేను సేతుల పెట్టేవాణ్ణి. అడుగడుగున తృప్తిపడే ఆ నిరాడంబరులను చూస్తేనాకే లజ్జ అయ్యేది. వారితృప్తే మన సంస్కృతిలోని వ్యాప్తి. వారికినేనే ఋణపడ్డాను. ఈ గ్రంథంతో పాటు దీనివల్ల వచ్చు ఆదాయాన్ని కూడ పల్లీయుల కంకితమిచ్చి ఈ జన్మలోనె ఆ ఋణం తీర్చుకుంటున్నాను.

ప్రయాణమొక్కటే కష్టంగా ఉండేది.కాని,సేకరణ మాత్రం సులభంగా తోచేది. నా సేకరణ పద్ధతి ఎంత సంతోషంగా సాగేదో నా సన్నిహిత మిత్రులకు బాగా తెలుసు. ఊరూరికి కనీసం 50 కొత్త పాటలయినా దొరుకుతయి. అక్కడక్కడ ఒక్కొక్క జానపదుడు జానపద విజ్ఞాన కోశం. మొత్తం తెలుగుదేశాన్ని లోపితె లక్షలకొద్ది పల్లెపదాలు దొరుకుతయి. దానికి నూర్లకొద్ది సేకర్తలు తీరికరణ కుదిరిగా పూనుకుంటె సాధ్యమవుతది.

ప్రాచీన తెలుగు సాహిత్యమొక ఎత్తయితే, జానపద సాహిత్యం మరొక ఎత్తు. ఇప్పటికయినా ప్రభుత్వం ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధతీసుకొని జానపద విజ్ఞాన అకాడమీని స్థాపించి, అనంతమైన జానపద విజ్ఞానాన్ని సమకూర్చవలసిన అవసరమెంతో ఉంది. తత్సంబంధంగా బహుముఖ పరిశోధన వెల్లి విరిసేదున్నది. అప్పుడు తెలుగుతల్లి నిండుతనం దేశమంతా వెలుగుతది.

'✻' ఈ గుర్తుగల పల్లెపదాలేగాక, మరికొన్ని ఆ గుర్తులేని చిన్న చిన్న పదాంతర్భాగాలుకూడా ఈ గ్రంథంలో సందర్భోచితంగా ఉదాహరిం బడినట్టివి నా సొంతసేకరణకు వర్తిస్తయి తక్కిన ఉదాహృత పల్లెపదాలు ఇతరుల సేకరణకు చెందుతయి. గ్రంథం చివర ఆ పట్టిక పొందుపరచుటయింది.

**కృతజ్ఞతలు:**—గుండెలోతులదాగిన పల్లెపదాలను పంచిపెట్టిన పల్లీయులకు తొలుదొలుత మోకరిల్లుతున్నాను. పల్లెపదాలను సేకరించి అందించిన సహృదయులకు అభివందనాలు. అమిత వాత్సల్యంతో ఈ సిద్ధాంత వ్యాసాన్ని శ్రద్ధగా పర్యవేక్షించిన మా ఆచార్యోత్తములు డా॥ బిరుదురాజు రామరాజు గారికి నమస్కృతులు. మన స్తత్వ కవిత్వ విషయ చర్చలో తోడ్పడిన అధ్యాపకోత్తంసులు డా॥ పాటిబండ మాధవశర్మగారికిని, వేదమంత్రార్థ చర్చలో తోడ్పడిన ఆత్మీయులు శ్రీప్రణవానందస్వామిగారికిని నమోవాకాలు. సామాజిక శాస్త్ర చర్చలో సహకరించిన మిత్రులు శ్రీ ఎస్. రామరాజు గారికిని, వ్రాత ప్రతులు సిద్ధముచేసిన మిత్రులు శ్రీ మంచన గుండేరావు, శ్రీ కాశీప్రభాకరమూర్తి, శ్రీ విరజాజి రాంరెడ్డిగార్లకును కృతజ్ఞతలు— మరి మా విద్యార్థి చి॥సుధాకరరాజునకు ఆశీస్సులు. ఈ గ్రంథ ముద్రణకు 5000/- ఆర్థిక సహాయ మిచ్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికిని, తక్కువ వెలకు తెల్లకాగితం యిప్పించిన భారత ప్రభుత్వానికిని ధన్యవాదాలు.

జక్చర్ల
20-10-1979

డాక్టర్ యెల్దండ రఘుమారెడ్డి

# పల్లెపదాలలో ప్రజాజీవనము

## విషయ సూచిక

## చతుర్థ ప్రకరణము:- ఆచార వ్యవహార స్వరూపము 263-365



## పంచమ ప్రకరణము:- శృంగార జీవనము 366-419



## షష్ఠ ప్రకరణము:- కవితా స్వరూపము 420-445



## సప్తమ ప్రకరణము:- భాషా స్వరూపము 446-471





# జానపద మనస్తత్త్వము

## ప్రస్తావన

జనపదములలో నివసించువారు జానపదులు. జనపదము, జానపదులు అనునవి సంస్కృత శబ్దములు. తెలుగులో వానిని పల్లె, పల్లీయులు అందురు. పల్లెటూరి వారి పాటలే పల్లె పదాలు. వారి మనస్సంబంధ వ్యవహారమే జానపద మనస్తత్త్వము. జానపద మనస్తత్త్వమను మాటను జర్మను భాషలో Volker psychologie అని, ఆంగ్లములో Folk psychology అని పిలిచెదరు.

జానపద మనస్తత్త్వశాస్త్రమను పేరుతో ప్రత్యేక శాస్త్ర విభాగము లేకున్నను మనస్తత్త్వమును గూర్చి మన ప్రాచీన ధార్మికాది గ్రంథములు సాకల్యముగా సద్భుతావహముగా చర్చించినవి. వ్యక్తి స్వరూపస్వభావములను గాని, పరస్పర సామాజిక సంబంధములనుగాని, తెలిసికొనవలెనన్నచో మనస్తత్త్వశాస్త్రజ్ఞాన మత్యంతావశ్యకము. ఈ సందర్భమున మనస్తత్త్వమును గూర్చి మనవారెట్లు చర్చించిరో సుంత తెలిసికొని, ఆధునిక దృక్పథమును గ్రహించి పిమ్మట జానపద మనశ్శాస్త్ర పరిచయమును రేఖామాత్రముగా తడవుట యగును. వేదములు, ఉపనిషత్తులు, దర్శనములు, పాతంజలయోగ సూత్రాది గ్రంథములు, భగవద్గీత, ఆయుర్వేదశాస్త్రములు, అలంకార శాస్త్రములు మున్నగు హైందవాదర్శ గ్రంథములలో కేవలము మనస్సును గూర్చియే గాక ఇంకను సూక్ష్మాతి సూక్ష్మమయిన ఆత్మను గూర్చిన పరిశీలనము కూడ జరిగినది. మనోవృత్తికి ఆత్మయే ఆధారమని గుర్తించుటైనది. ప్రాచీనపాశ్చాత్య తాత్త్వికులు సహితమాత్మపరిశీలనను మనస్తత్త్వపరిశీలనమనిరి. (Psyche= The soul : Logos=Science). ఈ పేర్కొన్న గ్రంథముల నుండి మనస్సును మానవ వర్తనను గూర్చిన విషయములుదాహరించుచుబోయినచో ఈ పథకమున కనౌచిత్యమేర్పడ గలదని భావించినను ఇంచుక ప్రస్తావింపక తప్పదు.

సకల మానవ ప్రవృత్తులకు ప్రధానహేతువు మనస్సని ఋగ్వేదము తెలుపుచున్నది. కొందరు వైదిక ఋషులు మనస్సును గూర్చి చెప్పుచు, అది

హృదయములోనున్న జ్యోతిస్స్వేయని తలంచి యుండిరి 1. వివిధ మానసికావస్థలను గూర్చి కూడ ఋగ్వేదము ప్రస్తావించినది 2. నాడీ మండలమును, చక్షురాదులైన జ్ఞానేంద్రియములను, వాగాదులైన కర్మేంద్రియములను, తత్సంబంధ ధర్మములను గూర్చి ఉపనిషత్తులు వివరించినవి. మానవునిలోని జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థల విషయమును మాండూక్యోపనిషత్తు తెలుపుచున్నది 3. మనస్సు అష్టదళ పద్మాకారముగనుండునని భావించి, ఏ యే ప్రాంతములో స్పందన కలిగిన ఎట్టి భావము ప్రస్ఫుటమగునో హంసోపనిషత్తు స్పష్టీకరించినది4. హంసోపనిషత్తులోనే చివరి వాక్యమందు "మనోవిలీనే మనసిగళేసంకల్ప వికల్పే దగ్ధేపుణ్యాపాపే సదాశివః శక్త్యాత్మా సర్వత్రావస్థితస్స్వయం జ్యోతిశ్శుద్ధోనిత్యో నిరంజనశ్శాన్తతమః ప్రకాశయతీతి వేదానువచనం భవతీతి 5." అని మనస్సంయమనమును గూర్చి చెప్పుట యైనది. భగవద్గీతను పరిశీలించినచో దానిలో, మనస్సును, మనశ్శిక్షణను గూర్చిన నిరూపణము తెలిసికొనగలము. ఇట్లే యితర గ్రంథములను పరిశీలించినచో బోధపడగలదు.

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనునవి యంతఃకరణ చతుష్టయము. అవియన్ని అంతఃకరణము యొక్క వివిధ వ్యాపారభేదములని చెప్పెదరు. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అంతఃకరణముతో సంబంధించి యుండుటచేత మానసిక వ్యాపారములు నిర్వర్తింప బడుచున్నవి. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనెడు పంచజ్ఞానేంద్రియములలో వరుసగా శబ్దస్పర్శరూప రస గంధములను గ్రహించు పంచ తన్మాత్ర లుండును. శబ్దస్పర్శాదుల స్వభావమును ఉన్న

1. ఋగ్వేదము:- 6-1-9-6
2. ఋగ్వేదము:- 10-1-16-4
3. మాండూక్యోపనిషత్తు:- 3, 4, 5 శ్లోకములు
4. హంసోపనిషత్తు:- పూర్వదళే పుణ్యేమతిః ఆగ్నేయేనిద్రాల స్యాదయః భవన్తి యామ్యేక్రౌర్యేమతిః నైరుతేపాపేమనీషా వారుణ్యాం క్రీడా వాయవ్యాం గమనాదౌబుద్ధిః సౌమ్యేరతిప్రీతిః ఈశాన్యే ద్రవ్యాదానం మధ్యేవైరాగ్యం కేసరేజాగ్రదవస్థా కర్ణికాయాంస్వప్నః లింగేసుషుప్తిః పద్మత్యాగే తురీయం యదాహంసె నాదేవిలీనో భవతి తత్తురీయా తీతం భవతి.
5. హంసోపనిషతు

దున్నట్లు గ్రహించు శక్తిని తన్మాత్ర అందురు. ఎదుటనున్న ఒక వస్తువు యొక్క రూపము నున్నదున్నట్లు చూచెడు కంటిలోని ఒకానొకశక్తి అందలి తన్మాత్ర. తన్మాత్ర వలననే జ్ఞానేంద్రియములు శబ్దస్పర్శాదులను గ్రహించు చున్నవి. ఇంద్రియములు మనస్సంయోగము చెందినపుడు ఆయా తన్మాత్రలు పనిచేయును. ఉదాహరణకు కంటిలోని రూపతన్మాత్రతో బాహ్యరూప సంయోగమేర్పడి మనస్సులోగల రూప తన్మాత్రను చేరినప్పుడు మనస్సున తద్రూప వికారము కలుగుచున్నది. అనగా బాహ్య విషయములతో సంయోగము కలిగినప్పుడింద్రియముల ద్వారా ఆ విషయముల యొక్క స్వరూపము మనస్సునందు ప్రతిబింబించును. మనస్సు సంశయాత్మకమైనది. కాబట్టి దానిని నిశ్చయింప జాలదు. ఆ ప్రతిబింబము బుద్ధికి గోచరించినప్పుడావిషయ సంబంధమైన జ్ఞానము కలిగి ఆ రూపమును నిశ్చయించుచుండుటచేత బుద్ధి నిశ్చయాత్మకమైన దందురు. దీనిననుసరించి 'ఆ రూపమును నేను గాంచితిని' అనునది అహంకారము.

ఇంద్రియముల ద్వారా మనస్సునకు, మనస్సు నుండి కర్మేంద్రియములకు సంబంధముండుటచేత ఇంద్రియములలోని పంచతన్మాత్రలు ఐదు మార్గములుగా లోనికిపోయి మనస్సనెడు కేంద్రమున కలిసికొని అక్కడ నుండి తిరిగి ఐదు వేరు వేరు మార్గములుగా నిర్గమించి పంచ కర్మేంద్రియముల ద్వారా తత్సంబంధ కార్యములను వ్యక్తపరచు చున్నవి. ఉదాహరణకు ఒక పదార్థము యొక్క రుచి నాలుక మీద పడగా నది మనస్సునకు చేరి అందుండి తిరిగి దానిని గూర్చిన విషయము వాక్కు ద్వారా వ్యక్తమగు చున్నది. ఇట్టి నిర్వహణలో ఆయాసంబంధ నాడులు చేయుపని ముఖ్యమైనది. నాడులలో కొన్ని సంకల్ప చర్యలను కొన్ని అసంకల్ప చర్యలను నెఱపు చుండును. ఆత్మరక్షణ ప్రతీకారములను చర్యలందుకు కారణములని భావింప వచ్చును. ఏదేని ఒక పురుగు కాలుమీదుగ దాటు చున్నప్పుడు తలవని తలంపుగా కాలును వెనుకకు తీసికొనుట అనునది ఆత్మరక్షణకార్యము. అనగా అది అసంకల్ప పూర్వక నాడీ తంత్రుల ద్వారా జరుగు చర్య. ఆ పురుగును జూచిన తర్వాత దానిని హింసించుట యన్నది ప్రతిక్రియ. ఇది సంకల్పపూర్వక నాడీ తంత్రుల చర్య. అట్లు వివిధ వ్యాపారములు నిర్వర్తించుటకు ఇంద్రియములు, మనస్సు స్వయముగా చైతన్యము గలవికావు. ఘటదర్శనమునకు సూర్యరశ్మి యెట్లో ఇంద్రియములాయా వ్యాపారములందు ప్రవృత్తమగుటకు ఆత్మప్రేరణకారణమగుచున్నది. శబ్ద స్పర్శ

రూప రస గంధములను ఆత్మయే యెరుగుచున్నది 1. కావున ఇంద్రియముల కంటె మనస్సు, మనస్సు కంటె బుద్ధి, బుద్ధికంటె మహదాత్మ, మహదాత్మ కంటె అవ్యక్త (సమస్త విశ్వమునకు బీజభూతమైనది-మూలప్రకృతి) ముత్తమమైనది 2. మహదాత్మయే జీవాత్మ. అట్టి యాత్మ శరీరము నుండి వైదొలగిన క్షణమున ఇంద్రియములు నిర్వీర్యములై నశించుచున్నవి 3. రక్తప్రసరణ మండలమునకు గుండెయెట్లో చైతన్య ప్రసారమునకు ఆత్మ యట్టిదని చెప్పుకొనవచ్చును. దీనిని ప్రాణము, చిత్, చేతనము, చైతన్యము అనికూడ అందురు. చైతన్యము శుద్ధజ్ఞానమని, చైతన్య వృత్తి విశిష్ట జ్ఞానమని చెప్పుదురు. శుద్ధజ్ఞానమలౌకికము, విశిష్టజ్ఞానము లౌకికమైనది. చైతన్యవృత్తి నుండియే మనోవ్యాపారములారంభమగుచుండును. మనస్తత్వశాస్త్రమిచట నుండియే పరిశీలించుచుండును. చైతన్య వృత్తియే జ్ఞానమనెడు అభిప్రాయము పాశ్చాత్య మనస్తత్వజ్ఞులకు కూడగలదు 4. వ్యక్తి మూర్ఛితుడైనప్పుడు వానిలో చైతన్యముండునే కాని చిత్తవృత్తి యుండదు. ఈ యవస్థను ఆంగ్లమున Unconscious stage అందురు.

మానవునిలో మనశ్శరీరములనునవి రెండు ప్రత్యేక లక్షణములు గల విభాగములు. శరీరము, బరువుగానుండి శారీరక చలనములను ప్రదర్శించును. విషయమును దెలిసికొనుట, అనుభూతిని పొందుట, కోరుట వంటి శక్తులను మనస్సు వ్యక్తపరచును. శరీరమునకెట్లారోగ్య అనారోగ్యములనునవి కలుగునో అట్లే మనస్సునకు గూడ కలుగుచుండును. అయినను మనస్సు (బుద్ధి మొదలగునవి) శరీరము పరస్పరాశ్రయములైనవి. శరీర రథమునకు బుద్ధి సారథి. ఇంద్రియములశ్వములు. మనస్సు కళ్లెము. ఆత్మ రథికుడు 5. అవి యన్ని ఏకముఖముగా నున్నప్పుడే శరీర రథము చక్కగా నడుపగలదు. అందులో దేనియందు లోపమున్నను అది

1. కఠోపనిషత్తు :- ద్వి. అధ్యా-ప్రథమ వల్లి
2. ,, ,, ,, -తృతీయ వల్లి
3. ,, ,, ,, -ద్వితీయ వల్లి
4. R. E. Brennan:-General Psychology-Page. 77
5. కఠోపనిషత్తు-ప్ర. అధ్యా-తృ. వల్లి-శ్లోకము-3

కొనసాగదు. మనశ్శరీరములు వ్యాధులకును ఆరోగ్యములకును ఆశ్రయములై యుండుటచేత శరీరమునకెట్టి వేదన కలిగినను అది మనస్సు పైనను, మనస్సున కెట్టి వేదన కలిగినను శరీరము పైనను ప్రభావము చూపుచుండును. మనస్సు నందేదైన మార్పు జరిగినచో దానికనుగుణముగా శరీరములోను, శరీరమందేదైన మార్పు జరిగినచో దాని కనుగుణముగా మనస్సులోను జరుగుట సహజము. మనస్సున భయము కలిగినచో శరీరమున కంపస్వేదాది వికారములు కలుగును. శరీరమున దాహక్షుధాదులు కలిగినచో మనస్సున శోకవికారములు ఉత్పన్నమగును.

విషయేంద్రియ సన్నికర్షవలన గూడ మనస్సునందు వృత్తులేర్పడును. విషయములు కారణములు, వృత్తులు కార్యములు. కారణగుణములు కార్యమున సంక్రమించును గనుక విషయగుణములనుబట్టి వృత్తిగుణములు రూపొందును. ఈ వృత్తులే రతిక్రోధాది వికారములు. ప్రతి మానసిక వృత్తియు నొక సంస్కారమును జారవిడుచును. ఈ సంస్కారము వాసనారూపమున చిత్తమున స్థిరముగానిల్చియుండును. వీనినే స్థాయి భావములందురు. రతి, క్రోధము, భయము, శోకము మున్నగునవి యిట్టివి. ఇవి సర్వప్రాణులచిత్తములందుండును. తత్తదనుకూల హేతువులేర్పడి నప్పుడివి మేల్కొని మరల వికారముల రూపముధరించును. వీనివాగ్రూపాభివ్యక్తియే కవిత్వము. హృదయవిదారకముగారోదించు క్రౌంచిరోదనము విను చున్న వాల్మీకి మహర్షి చిత్తము స్పందించి ద్రవించి స్రవించిన వాక్యముశ్లోకమై లౌకికసాహిత్య మునకాద్యోదాహరణమైనదికదా. వాల్మీకి చిత్తమున శోకానుభవము సంస్కారరూపమున నుండి క్రౌంచిరోదనము కారణముగా ఉద్బుద్ధమై వాగ్రూపమున అభివ్యక్తమైనది. ఆశ్లోకమాయనచిత్తవృత్తికి ప్రతిబింబము. కవిత్వమేగాక సమస్తకళల ఆవిర్భావమునకు సహితము చిత్తవృత్తియే కారణము.

మనప్రాచీనులు సర్వసాధారణ మనస్తత్త్వమునే గాక అంతస్సంబంధముగల అంతఃకరణచతుష్టయమును, అతీతమైన చిదాత్మను గూర్చి కూడ సమగ్రముగా వివరించినవిషయము అపూర్వమైనది. వ్యక్తియొక్క చిత్తము బహు జన్మల యందలి బహువిధములైన అనుభవముల, సంస్కారముల సంపుటి అని చెప్పినప్పుడు మనస్సు యొక్క తత్త్వమును సంక్షిప్తముగా చెప్పినట్లేయగుచున్నది.

పాశ్చాత్యులు వయస్సును, వారసత్వమును, పరిసరములను, వృత్తిని, కులమును, సామాజిక దశలనుబట్టి మనస్తత్త్వ పరిశీలనమును వివిధ శాఖలుగా జరుపుచున్నారు. జర్మను దేశములో మనస్తత్త్వశాస్త్రవిజ్ఞానము బాగుగా పెరిగినది. ఈ విషయములో విల్ హెలెమ్ఊంట్, టిచనర్, కుల్పె, ఎబ్బింగ్ హావుస్ మున్నగువారెన లేని కృషిసలిపినారు. వివిధప్రాయోగిక పద్ధతుల ఫలితముగా 19వ శతాబ్ది చివర మనశ్శాస్త్రము శాఖోపశాఖలుగా వృద్ధిచెందినది. నూతన పరిస్థితులలో పరిశోధన వికసించినది. (తదన్వేషణాపద్ధతులిందు యథావకాశముగా వినియోగింపబడును). మనశ్శాస్త్రమునకు ఆత్మప్రమేయము కాదని తద్విచారణకు స్వస్తి చెప్పినారు. వివిధ దశలలోని, వివిధ సన్నివేశములలోని మానవ వర్తనను గూర్చియే మనశ్శాస్త్రమెక్కువ శ్రద్ధచూపుచున్నది. విభిన్నకోణములను స్పృశించి వ్యాపించిన మనశ్శాస్త్ర వాహిని నుండి పాయగాచీలి వేరొక ప్రవాహరూపమును దాల్చిన సామాజిక మనశ్శాస్త్రము కూడ ప్రాయోగిక పద్ధతుల నాధారముగాజేసికొనియే సమాజములోని వ్యక్తి వర్తనను పరిశీలించుచుండును 1. అటులనే జానపద మనశ్శాస్త్రముకూడ మనశ్శాస్త్రములోని శాఖగా పరిగణింపబడుచున్నది. ఈ విషయమునుగూర్చి ఊంట్ యిట్లు చెప్పినాడు. "To-day, doubtless, Folk psychology may be regarded as a 'branch of psychology' concerning whose justification and problem there can no longer be dispute. Its problem relates to those mental products which are created by a community of human life and are, therefore, inexplicable in terms merely of individual consciousness, since they pre suppose the reciprocal action of many. This will be for us the criterion of that which belongs to the consideration of Folk psychology" 2. Folk psychology అను మాటను ఈ శాస్త్రవిభాగమునకు మొదట

---

1. "Social psychology is, then, a branch of psychology concerned with the ways in which the individual reacts to his social conditions", - Society:-Maciver & charles H. page-London, Macmillan & Co., Ltd.-1962. P. 5.
1. Krech anb crutchfield:-Theory and problems of social psychology, P. 7.
2. W. Wundt:- (Trans) Edward leroy Schavb- Elements of Folk psychology. Published, George Allen & unwin Ltd. Newyork, P. 2.

లాజరస్, స్టెయింతాల్ అనువారు ప్రయోగించి తమ "Zeitschrift fur Volker psychologie and sprachwissenschaft" అను పత్రికలో దానిని గూర్చి పరిశోధనాత్మకాధ్యయనముగావించిరి. ఇట్టి మనశ్శాస్త్రము ప్రత్యేకముగా భాష, ఆచారములు (customs), ప్రజాసంస్థల (Institutions of people) లో ప్రభావముకలది. 1. ఊంట్ యింకను ఈ శాస్త్రవిషయమున లోతునకుపోయి ప్రాయోగిక మనశ్శాస్త్ర రంగమును సమీపించెను. సాధారణ మనశ్శాస్త్రముకేవలము వ్యక్తిమనస్తత్వమునే పరిశీలించును. దీనితోడనే సరిపుచ్చుకొన్నచో శాస్త్రమసమగ్రమగును. కాని వ్యక్తికి సమాజమునకు గల అన్యోన్య సంబంధములను, వివిధ మానసికాభివృద్ధి దశలను, తదభివృద్ధికి మూలములైన ప్రాక్తన పరిస్థితులను, ఉన్నత నాగరక దశకు చేరుకొనుటకు తోడ్పడిన క్రమపరిణామరూపమును జానపద మనశ్శాస్త్రమే పరిశీలించినది. ఒకవిధముగా చూచినచో ప్రాక్తన మానవ మనస్తత్వలక్షణములు నేటిజానపదులలో గనుగొనవచ్చును. కావున "Thus, then in the analysis of the higher mental processes, Folk psychology is an indispensable supplement to the psychology of individual consciousness" 2.

కుటుంబము, సమూహము, జాతి, స్థానిక సంఘములన్ని పరిమిత సంస్థలు. కాని పెక్కుమానవసంఘములేకమై పరస్పర ప్రభావమునకు లోనగుటవలననే ఉన్నతములైన మానసిక ప్రమాణములు, సిద్ధులు ఉత్పన్నములగుచున్నవి. కనుక జానపద మనస్తత్త్వమే నిజమైన మానవ మనస్తత్త్వమగుచున్నది 3. ప్రాక్తన మనస్తత్త్వమునకు సంబంధించిన అనేక రహస్యములు జానపదుల మనస్తత్వమున ఇమిడియుండుట, ఆది యందవి పిడికెడై. జానపదులలో చేరెడై ఇంకను పెరిగినకొలది దోసెడై పుట్టెడై వికాసము పొందుటయొప్పును. మొదట ప్రాక్తనమానవుని ఆలోచనలను, నమ్మకములను, చర్యలను, సుంతపరిశీలించినచో నేటి జానపదులలోనెంతమటుకు మౌలికమైన మానసిక రహస్యములు నిక్షిప్తములై యున్నవో తెలిసికొనగలుగుదుము. మానసిక, సామాజిక,

---

1, Hubert Bonner-Social psychology, P. 8.
2. Elements of Folk psychology, P. 3.
3. Family, group tribe, and Local Community, for example, are more restricted associations. On the other hand, it is to the Union and reciprocal activity of a number of peoples that the highest mental values and attainments owe their origin. So that in this case Folk psychology really becomes a psychology of mankind - Elements of Folk-psychology P. 4.

ఆచారాదులకు, ప్రాచీన కళలకు, పురాగాధల సంరక్షణకు జానపదులే యిప్పటికిని ఆటపట్టుగానున్నారని చెప్పవచ్చును. కావున ప్రాక్తన మానవుని మనస్తత్త్వమును స్పృశించుచు సామాజికోత్పత్తియైన (జానపద) సంస్కృతిని, పురాశాస్త్రవిషయములను గ్రహించుచు, తెలుగుపల్లె పదాలలో గన్పట్టు వైయక్తిక, సాముహిక, సామాజిక మనస్తత్త్వమునిట పరిశీలింపవలసియున్నది. పల్లెపదాలు—పల్లెప్రజల అనుభవములు, భావములు, ఊహలు, అభిప్రాయములు, ఆశయములు అప్రయత్నముగా ధరించిన అక్షర రూపములు: వారి సుఖదుఃఖములకు, ఆశానిరాశలకు, ఇష్టానిష్టములకు అద్దములు. మనోవృత్తుల వాగ్రూపమైన అభివ్యక్తియే కవిత్వము. అనగా మనస్తత్త్వమునకు కవిత్వము దర్పణమువంటిది. జానపదుల మనస్తత్త్వము వారి కవిత్వమున ప్రతిబింబితమై యుండును గనుక పల్లెపదాల నాధారముచేసికొని వారి మనస్తత్త్వమును నిరూపించుటకు ఈ ప్రకరణమున ప్రయత్నముచేయుటయగును.

## ప్రాక్తన మానవ మనస్తత్త్వము

ప్రాక్తన మానవుని ఉనికి నెఱుంగుట క్లిష్టతరమైనది. ఉనికియే క్లిష్టతరమైనపుడు వాని లక్షణములను, మనస్తత్త్వమును, వర్తనను, గుర్తించుట అంతకంటె చిక్కైన సమస్య. ఈ సమస్యానిష్కృతికి యోచనయే మార్గమగుచున్నది. పురాతత్త్వ శాస్త్రము, నృశాస్త్రముల యొక్క పరిశోధనలఫలితముగా ప్రాక్తన మానవుని ఉనికి చర్చించుట జరిగినది. ప్రప్రథమ దశలో వాడు పశువువలె కేవలమడవిమనుష్యుడుగనే జీవించుచు ప్రకృతిసిద్ధముగాలభించెడు ఆహారమును గ్రహించుచుండెను. శీతాతప వర్షములను సమానముగనే భరింపగలిగెను. కాని ప్రకృతిలోని అతీత శక్తులతో తీవ్రముగా పోరాటమునసలుపుచుండిన కారణమున కరచరణాదులను, పంచేంద్రియాది గ్రహణశక్తులను వినియోగించుకొనుట నెఱింగెను. తద్వారా వివిధములైన పనిముట్లను మొదట చేయనేర్చుకొనెను. కాలక్రమమున ప్రకృతియే పాఠశాలయైనది, ప్రయోగశాలయైనది. ఈ యవస్థలోనే వాని మనస్తత్త్వమును, వర్తనను, సుంత గ్రహింపవీలగును. ప్రాక్తన మానవజాతి మౌలిక లక్షణములుగల జాతులు నేటికిని ప్రపంచమందక్కడక్కడ ఉన్నవి. ఆస్ట్రేలియా దేశములో అనాదిగావచ్చుచున్న మానవజాతికదుంగడు

ప్రాచీనతను నిలుపుకొన్నదనెడు విషయము తద్విజ్ఞులకు విదితమే. పశుపోషణము, సేద్యమువంటి ప్రధాన జీవనోపాధి కల్పనలైనను అజాతికి తెలియవందురు.

ప్రాక్తన మానవునిలో సృజనాత్మకశక్తి, వస్తువిషయావిష్కరణాభిలాష, పురోగమనదృష్టి కొఱవడుటచేత వానికి బాహ్యప్రపంచ సంబంధము స్వల్పమేయని చెప్పవచ్చును. వానికి ఆలోచనాశక్తి మిక్కిలి తక్కువ. తన అనుభూతిని వ్యక్త పరచుటలో మిక్కిలి అశక్తుడు. మానసికస్థాయి కౌరకావస్థలోనుండి యుండును. కనుకనే మార్పునంగీకరింపక మొరటుతనమును త్యజింపక బెదరు బెదరుగా దూరముగనే యుండి కాలము గడపుచుండెను. శ్రీలంకలోని వెడ్డాజాతి యందిట్టి లక్షణములు గల వందురు. మనపల్లెలలో నేటికిని చిన్నకులములనబడు వానిలోగూడ నిట్టి లక్షణములు గలవారున్నారు. వేటయందుత్సాహము, నైపుణ్యము పట్టుదలవంటి లక్షణములు ఆ ప్రాచీన మానవునిలో తీవ్రముగానుండినవి.

ఉరుములు, మెరుములు గాని ఏదేని పెద్ద ధ్వనిగాని వినబడగానే ఆదిమానవు డులికిపడి తనకుమించిన అతీతశక్తులను గౌరవింపవొడగెనని ఊహింపదగును. ఆశక్తులే అనంతరదశలలో దేవతలుగా పరిగణింపబడుచు వచ్చినవి. భయమునుండియే భక్తి జనించుచున్నదని ఋజువగుచున్నది. ఇట్టిభయ శోక జుగుప్సాదిస్థాయిభావములు మానవునిలో పూర్వజన్మసంస్కార వాసనా విలసితములగుటవలన మనస్సు ప్రభావిత మగుచున్నది. ఏమెరుగని పసిపిల్లలుగూడ భయకంపితులగుటకు ఇట్టి సంస్కార రూప వాసనలే కారణము.

భాషోత్పత్తి కాకపూర్వము సైగలపైన, ధ్వనిరూప సంకేతములపైన భావవ్యక్తీకరణ ఆధారపడియుండెను. ఈ దశలో ప్రాక్తన మానవుని మనస్తత్త్వ మంతగాపెరుగలేదని తలంపవచ్చును. అనంతరకాలమున భాషోత్పత్తి జరిగినపిదప ప్రాక్తనమానవుని మనస్తత్త్వము, చేతన, వర్తన స్ఫుటరేఖలతో ఆవిష్కృతమైనది.

గుహయే ప్రాక్తన మానవుని తొలినివాస గృహము. అది ప్రకృతిసిద్ధమైనది కావచ్చును. లేదా తాత్కాలికముగ కృత్రిమముగా నేర్పరచుకొన్నదైనను కావచ్చును.

గుహానివాస కాలముననే వానికి కుక్క యొక్క సహవాసము లభించెను. మొదటినుండి అది విశ్వాసమైన జంతువగుటచేత, వేటవంటి నిత్యకృత్యములలో అవసరమైయుండుట చేత ప్రాక్తన మానవుడు దాని సాహచర్యమును గుర్తించి మచ్చిక చేసికొనుచుచ్చెను. పిడుగుపాటున కురియు కుంభవృష్టి, తుఫానుల కారణమున ఆదిమానవునికిని జంతువులకును ముఖ్యముగా కుక్కకు గుహయే తలదాచుకొనుటకు తావలమైయుండెను. ఇప్పట్టున దానిని మచ్చిక చేసికొనుట జరిగియుండును. మచ్చిక చేసికొను సందర్భమున ఆదిమానవునిలో బహిర్గతమైన ప్రవర్తన వాని మానసిక దశను పెంపొందింపజేసినదని ఊహింపనగును. అట్టి గుహానివాస ఫలితముగా అభివృద్ధిచెందెడువానికి చిత్రకళకూడ అబ్బినది. గుహాంతర్భాగములలో తరచుగా జంతువుల చిత్రములను, ఇంచుక మానవుల చిత్రములను అస్ఫుటముగా గీచియుండెను 1. బుష్మెన్ జాతిలో నేటికిని ప్రాచీన శిలా చిత్రములు మిగిలియున్నవని చెప్పుదురు. ఈ విషయమున నింకను ఊంట్ చెప్పినది గమనింపుడు 2.

మానవుడు తన అనుభవములను వ్యక్తపరచుటకు సంకేతములనేర్పరచు కొన్న ప్రయత్నములో భాష పుట్టి యుండును. ప్రాక్తన కాలములోని అనాగరక స్థితి యందలి మానవుడు గుహాకుడ్యములమీద గీచిన చిత్రములే భాషోత్పత్తికి జరిగిన ప్రయత్నములను వ్యక్తపరచుననికూడ చెప్పుదురు. ప్రాక్తన మానవుడు తనచుట్టునున్న ప్రకృతిపరిసరములలో కన్పించెడు పశుపక్ష్యాదులను, అందును తనకు మచ్చికయైనవానినే చిత్రీకరించుకొనుటవలన వాని మేధస్సు క్రమక్రమముగా పనిచేయమొదలిడెను. పరిసర ప్రకృతిననుకూలముగా మలచుకొనుటయో, అనుసరించుటయోనేర్చెను.

1. W. Wundt:- Elements of Folk psychology P, 23

2. "Thus it was in the cave the first dwelling place of man that the transition was made perhapes for the first time from the beginings of a grap hic art, serving the purposes of adornment or magic to an art unfettered except by memory" - Elements of Folk psychology, P, 24.

అనుకరణ యెక్కువకాజొచ్చెను. ఈ సందర్భమున టైలరు అభిప్రాయమును పరికింపనగును 1.

ప్రాక్తన మానవుని అవసరములుగాని, కోర్కెలుగాని చాల తక్కువ. కావలసిన ప్రాథమికావసరములైనను చుట్టునున్న ప్రకృతిలోనే తీరిపోవుచుండెను. పరిచయమున్న ఇరుగు పొరుగు వారినప్పుడప్పుడు కొద్ది మాత్రము కలిసికొనుట చేత వాని యావశ్యకతగాని, పరిస్థితిగాని మెరుగెక్కుచుండెనని తలంప వచ్చును. ఈ పరిస్థితిని గూడ కొంతవరకు నేడు చిన్నకులములనబడువానిలో జూడవచ్చును. ఆదిమానవుడు అడవులలో తిరుగుచు, గంతులిడుచు, ఆడుచు ఆకలి వేసినప్పుడందు బాటులోనున్న ఆహారము తినుచుండెను. స్వల్పమాత్రావసరములచేత తృప్తిపడిన వానిలో నంతకుమించిన విషయములను గూర్చి గట్టి ప్రయత్నము చేయుటకు ప్రేరణ మృగ్యమైయుండెను. దీనికి వాని ఏకాంత జీవనముకూడ కారణమైయుండును. వాడు నియమితమైనపరిధికి అలవాటుపడియుండెను. వానికొక సంప్రదాయముండినగదా వెనుక ముందరయుట. వాడాచరించు ఆచారములను, అలవాట్లను మార్చుకొనవలెనన్నచో మిక్కిలికష్టము, దురవగాహమైనపని. ఈ గుణము నేటి పల్లీయులలో గూడ గర్భితమై యున్నది. మార్పులు సంభవింపవలెనన్నయెడల ప్రాక్తన మానవుడు సంఘర్షణలకు గురియగుటయో, ఒకచోటునుండి యింకొక చోటునకు తరలుటయో తటస్థింపవలెను. వేటతెలిసిన పిమ్మటనే ఆయుధములను వాని ప్రయోగములనెరిగెను. సహజముగా వాడు ప్రశాంత ప్రకృతిగలవాడు. (పల్లీయులుగూడ ప్రశాంతశీలురు. నీతినిజాయతి గలవారు). ఒకవేళ బాహ్య ప్రమేయములేవేని ప్రాక్తన మానవుని భంగపరచినపుడు వాడు రెచ్చిపోయి రాయినిగాని, రప్పనుగాని, బాణమునుగాని ప్రయోగించుట సహజమేగదా!

1. "If any art can be traced back among savage tribes to a rudimentary state in which its invention does not seem beyond their intelectual condition and especially if it may be produced by imitating nature or following nature's direct suggestion, there is fare reason to suppose the very origin of the art to have been reached."
Tylor:- Primitive culture-Vol, I. Page, 64.
London-John Murray, Albemark street, W. 1920, 6th Edition.

సత్యము, నిష్కపటము, అమాయకత, వాని ప్రధానగుణములు. దొంగతనముకూడ ఎరుగడు. స్వార్థమనునది తెలిసినగదా దొంగతనమనుమాట. ఇట్టి నైతికవర్తన వాడు నివసించు పరిస్థితులమీద ఆధారపడియుండెను 1. ఈ లక్షణములతోగూడిన అకలుషిత ప్రాక్తన సంస్కృతి ఉన్నత నైతికస్థితిని దెలుపుచున్నదని ఎందరోపరిశోధకులు విశ్వసించిరి. టైలర్ సహిత మిటులనే విశ్వసించెను 2. కాని క్రమపరిణామదశలో చిన్నచిన్న గుంపులుగా జేరి జీవించిన కాలమున స్వార్థముపుట్టెను. సంఘర్షణలకు దారి యేర్పడెను. నాగరకతావికాసమునకది దోహదమయ్యెను. దయ్యముల మీద, మంత్రములమీద విశ్వాసములు పుటమరించినవి. పురాగాథలు చోటుచేసికొన్నవి. భాషోత్పత్తి ఫలితముగా సామాజిక సంబంధములు రూపొందజొచ్చినవి. కళలు స్ఫుటరేఖలతో వికసించినవి. వానిపరిసరములు, పరిస్థితులు, అవసరములు, ఆహారము, అలవాట్లు శీలము మున్నగునవి మిక్కిలి పరిణామములకు లోనగుటవలన నాటికిని నేటికిని యెంతో వైవిధ్యమేర్పడినది.

## జానపదుని మనస్తత్త్వము

జానపదునికి నాగరకునికి జీవనవిధానముననే గాక మనస్తత్త్వ విషయమున గూడ వ్యత్యాసముండుట సహజము. అట్టి వ్యత్యాసమునకు ఆర్థిక, సామాజిక, రాజకీయ, ఆనువంశిక, విద్య, ప్రకృతి ప్రభావములే ప్రధాన హేతువులు. ఇట జానపదుని మనస్తత్త్వమును వివరించు సందర్భమున నాగరకుని విషయమానుషంగికాంశము. జానపదునికిగూడ ప్రత్యేకమైన సమాజము, జీవనపద్ధతి, పరిసరములు, సన్నివేశము

1. "As a matter of fact primitive people are much less guided by consciously selfish and ulterior motives than we are, not because of any innate superiority over ourselves in this regard but because of the conditions under which they live"

Paul Radin-Primitive man as philosopher; Newyork & London D, Appleton & Company 1927, P. 69.

2. "Among accounts of savage life, it is not indeed, uncommon to find details of admirable moral and social excellence"-Tylor:-Primitive culture Vol. I-P. 29.

లుండును. నేటికిని మనహిందూదేశమనగా పల్లెలే. అస్పృశ్యదేశీయతకవి అక్షయ నిధులు. పల్లెలలో వ్యవసాయమే ప్రధానవృత్తి. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి మున్నగు వృత్తు లన్నియు వ్యవసాయమునకు సంబంధించియే యుండును. కూలినాలి జనులధికముగా నున్నను పూలపందిరివలె జానపద సమాజజీవనమొప్పును. అవయవముల కలయిక శరీరము. అసీ శరీరమునుండి యేదేని ఒక అవయవమును ఖండించి పరిశీలించినయెడల సరియైన ఫలితము దక్కకపోవుటయేగాక అవయవము నశించుట, శరీరము కృశించుట జరుగును. అనగా శరీరావయవములవినాభావ సంబంధముగలవి. అటులనే జానపదుని లేదా ఆ వ్యక్తిని ఆ సమాజము నుండి విడదీయక సమాజము నందుంచియే వాని మన స త్వమును గమగొనుట ఉచితము.

మనస్తత్త్వము ననుసరించి జీవన విధానము, జీవన విధానము ననుసరించి మనస్తత్త్వము మారుచుండును. ఒక్కొక్క ప్రాంతమునుబట్టి, ఒక్కొక్క సమాజ మునుబట్టి మనస్తత్వము మారును. అది కులము మీద వృత్తి మీద కూడ ఆధార పడియుండును. ఇంతేగాగ ఒక్కకుటుంబములోనే ఒక్కతీరుగనుండదు. క్షణక్షణము మానసికావస్థలు మారుచునేయుండును. అయినను ఆయాసమాజములందంతర్వాహినిగ నుండు సర్వసామాన్య వర్తన అందరికి వర్తించును. ఒకేరకమైన సంప్ర దాయము, సంస్కృతి, సాహిత్యము పరిసరములుండుటచేత వ్యక్తి మానసిక వర్తన సామాజిక వర్తనపై ఆధారపడియుండును. ఒక వ్యక్తియొక్క మనస్తత్వము ఆ సమాజమునందలి అనేక వ్యక్తులను పరిశీలించిన పిమ్మట ప్రత్యేక మౌలిక లక్షణములను బట్టి సాధారణీకరించవచ్చును. ఈ సందర్భమున వ్యక్తియొక్క వ్యక్తిత్వముకూడ తోడ్పడగలదు. వ్యక్తియొక్క వ్యక్తిత్వ నిర్ణయ విషయములో ప్రసిద్ధ మనశ్శాస్త్రజ్ఞుడైన 'ఆల్‌పోర్టు' అభిప్రాయము నిట గ్రహించుట సమంజసము. "Personality is the dynamic organisation with in the individual of those psycho physical systems that determine his unique adjustments of his environment" 1. కావున నొంటరిగా నున్నప్పుడు, కుటుంబమున నున్నప్పుడు, సమూహములో మరియు సమాజములో నున్నప్పుడు జానపదుని యొక్క జానపద స్త్రీ యొక్క మనస్తత్వా

1, Allport, G. W:-Personality-A psychological Introduction-Page, 46.

విష్కరణకు ఆ వ్యక్తి యొక్క ఆలోచన ( Thinking), ఊహాకల్పన (Imagination), వైఖరి (Attitude), భావన (Sentiment), అభిరుచి, అనుభూతి ( Feeling ), ఉద్వేగము (Emotion), విలువలు (Values), ఆదర్శములు (Ideals) అనునవి ప్రాతిపదికలగుచున్నవి 1. వీనిని ఆలోచన, భావన, ఊహాకల్పన, అనుభూతి, వైఖరి, ఉద్వేగము, అభిరుచి, ఆదర్శము, విలువలు అనుపదునలో చెప్పుకొనుట ఉచితముగా నుండును.

పల్లీయుని జీవితమంతయు వ్యవసాయ సంబంధమైన పని పాటలలోనే సాగిపోవుచుండును. సాగిపోవుటయే కాదు, ఆ పని యందు లీనమగుచుండును. వాడు మోటకొట్టునపుడు—

వోరిగుమ్మలో పేరె గుమ్మలో
నా మోటపేరె మోహనాంగి వోరిగుమ్మలో
వోరిగుమ్మలో పేరెగుమ్మలో

నా బొక్కెన పేరు బొడ్డుగిన్నె వోరిగుమ్మలో
నా తొండం పేరె తోపురైక 2, ,,
నా తొండం తాడె కిన్నెరతీగె ,,
నా మోకు పేరె ఆకుతీగె ,,
నా బిల్ల పేరె భీమ రథం ,,
నా కదురు పేరె కన్నెలేడి ,,
నా దాపఎద్దు ధర్మరాజు ,,
నా వొల్పఎద్దు పందర్లాగ 3, ,,
నా కాడి పేరె కట్ల దండ 4, ,,

1. Mathur:-Social psychology.
2. బంగరైక. 3. పందరలేగ-గిత్త. 4. బంగారుకట్లు మరియు నల్లపూసలు కలిపి కూర్చిన దండ.

నా యెద్దు నడిసె నడకలాకు వోరిగుమ్మలో
నా గుడారిమొత్త 1, గుబ్బకొట్టె 2. ,,
గబ్బకొట్టగానె గుండ్లపంపువారె ,, *—అని

పాడుకొను ఈ పాటలో వానివృత్తి పనిముట్లను గూర్చిన ఊహకల్పన సహజ సుందరము. గతానుభవములోని మానసిక చిత్రముల యొక్క తోడ్పాటును గ్రహించి భవిష్యత్ దృక్పథమునకనుకూలమగు రూపముల నేర్పరచు మానసిక క్రియను 'ఊహకల్పన' యనవచ్చును. భూత భవిష్యత్తులను దృష్టి యందిడు కొనుచు జరుగుచున్న కార్యములలో కల్పన ప్రధాన పాత్ర నిర్వహించును. మోహనాంగి, బొడ్డుగిన్నె మున్నగునవి పూర్వానుభవములై వాని స్వరూప స్వభావములు మనస్సునందు చిత్రీకృతమైనవి. వస్తువులు దృష్టిపథమునుండి తప్పిపోయినప్పటికిని అవి తిరిగి ఊహకల్పనకు వచ్చునపుడు మనస్సున స్ఫురించు చుండును. ఇట్లు స్ఫురించు వానిని మానసిక చిత్రములందురు. కార్యసాధనయందీ మానసిక చిత్రములెక్కువగా తోడ్పడగలవు. మనస్సును అలరింప జేసిన మోహనాంగి, తోపు (తోపి) రవిక, కట్లదండ, బొడ్డుగిన్నె, కిన్నెరతీగ అకుతీగ, భీమరథము, కన్నెలేడి, ధర్మరాజు, వందరలేగ (గిత్త) అనువానిని మోటకుపకరించు పరికరములకు పోల్చిచూచుకొని తన్మయుడగుటలో పల్లీయుని అభిరుచి కూడ వ్యక్తమగుచున్నది. ఇట్లేదని యొక పనిని చేయుటలో కనబరచు ఆసక్తియే అభిరుచి. అభిరుచి యుండినప్పుడే తగిన పనులు సాగిపోవుచుండును. ఇచట వృత్తిననుసరించి మనస్తత్త్వమావిష్కృతమైనది.

కాసే గడ్డా కంజూవలికే—ఊపాగడ్డా ఉడుమూవలికే
నీవూ గొట్టే మోటాకాడరా—సోరదుడ్డెగా
పచ్చా గాజుల పాపా వలికే
మూలా సుక్కా పొడియానాయే—మూలామేమో తెలియాదాయే
జామూ కోడీ కూయానాయే—సోరదుడ్డెగా
జపుడామెక్కడ తెలియాదాయే *

—పల్లీయుని మీద ప్రకృతి ప్రభావమనంతము.

---

* ఇట్టి గుర్తుగల పదాలెల్ల 'పాలమూరు మండలం పల్లెపదాలు' అను నా సొంత సేకరణ పదాల నుండి గ్రహింప బడినవని యెఱుంగునది.

1. దోని, కాలువతూము. 2. గుబ్బటిల్లు, ఒత్తుకొనివెలువడి వచ్చెడు నీటిచప్పుడు.

నాగరకుని మీద యింత ప్రభావముండక పోవుటకు వాడు ప్రకృతికి దూరముగా జీవించుటయే కారణము. అసలు నాగరకుని పరిసరములే వేరుగదా. పల్లీయుడు నిత్యము కాసెగడ్డి, ఊపగడ్డి గల పొలములలో దిరుగుటచేత కంజుపిట్టల, ఉడుముల ఉనికి నెరుగు చున్నాడు. కలిగిన ప్రతి ఊహను పరిసరములతో ముడిపెట్టుట వాని మనస్తత్త్వము. మోటగొట్టు వేళలో 'పచ్చని గాజులపాప' (కన్నెపడుచు) పిలుపు కంజుల కలకూజితమును స్మరింపజేయునట! అది వాని ఇంద్రియానుభవము వలన గలిగిన జ్ఞానము. ప్రకృతి యందంతర్భూతమైన పల్లీయుని మనస్సు మూల చుక్క (బృహస్పతీ నక్షత్రము) వంటి నక్షత్రముల నాధారము చేసికొని రాత్రులలో కాల గణనము చేయును. ఉదయము పూట సూర్య గమనమును బట్టి కాల గణనము చేయును. ఈ పద్ధతి అతిప్రాచీనమైనది. పూర్వము సముద్రముల మీద రాత్రులలో నక్షత్రములను దృష్టియందుంచుకొని ప్రయాణము చేయుచుండిరి. అసలు మన జ్యోతి శ్శాస్త్రములు, పంచాంగములు గ్రహ నక్షత్రములపైననే ఆధారపడిన సంగతి మన మెరుగనిది కాదు.

వుంగరాలా సేతిపాపా—బంగరాలూ 1, ఆడుదామా
బంగరాలూ బైలుగానూ—బాలపాయం 2, చిన్నదాన్ని *

వయస్సు వచ్చిన పిదప గూడ ప్రియురాలి పాలిండ్లపై పారాడుటను పిన్ననాటి యనుభవమైన బొంగరాల ఆటగా భావించెడు పల్లీయుని శృంగారభావన చిలిపికృష్ణుని చేష్టలను చిన్నబుచ్చుచు వాని స్వోపలబ్ధిని వ్యక్తపరచు చున్నది. గతానుభవముల నుపయోగించి ఇంద్రియానుభవములను వివరించెడు నిట్టి మానసిక ప్రక్రియనే 'స్వోపలబ్ధి' యందురు. ఇట్లు పల్లీయుని మనస్సుఅడుగడుగున చిలిపి శృంగారమును చిలుకరించుచునే యుండును.

పిల్లులు, పందికొక్కులు, నక్కలు, కొంగలు, తాబేళ్ళు, ఉడుతలు, మొదలగునవన్నియు పల్లీయుని కంటినిండ సహజ లక్షణములతో ప్రత్యక్ష మగు చుండుటచేత వాడు నీరుగట్టి మడి దున్నుట, గొర్రుకొట్టుట, వరిమొలక చల్లుట, వంటి ప్రతికార్యమును ఆయా జంతుజాలముపై ఆరోపించి, తాను ఆడుకొనిన ఆటలందు సహితము పిల్లులను, పందికొక్కులను, రూపకల్పన చేసికొని హాస్యపూరితానందము

1. బొంగరములు 2. బాలప్రాయము

ననుభవించు చుండును. జానపదుని చిత్తవృత్తి విషయమున గూడ లాస్యము చేయు చుండుట గమనింతుము.

పిల్లాలు మద్దేల గోట్టగా—పంది కొక్కాలు కోలాట మేయగా
పిల్లెయ్య నాథూడు పీటేలు ఏసుక—సల్లిమంతరిస్తరమ్మానెగా
నక్కయ్య నాథూడు నాగాలిగట్టుక—నడిగడ్డ పంపంత దున్నేయగా
కొంగయ్య నాథూడు కొప్పేర వెట్టూక — వొంగొంగి వొరహాలు జవిరేనయా
తాబేలు నాథూడు తలగొర్రు గట్టూక—తరిమి తరిమీ గొర్రు కొట్టేనయా
ఉడుత బావాగారు ఉయ్యాల గట్టుక—ఉరికు రికి మొలకంతా జల్లేనయా *

మొలకచల్లిన పొలములో కొంగలు ప్రాలి వరహాలేరినట్లు వరిమొలక లేరుక తినుచున్నవని కూడ చెప్పుట సహజ సాదృశ్య వస్తు వర్ణనకు వాని చిత్త విలక్షణమే మచ్చుతునక.

అమ్మమ్మ ఈ కప్ప అయిదు పాములమింగె- తెలుసుకో దాన్ని తెలుసుకో
తెలిసీన వారికి తెల్లమామిడిపండు- ఇనువారి జనులాకు ఇనుపవి మంచాలు
సారేడు నీళ్లల్ల భూమెల్ల తడిసెమ్మ పుడిసేడు నీళ్లల్ల భూమెల్ల తడిసెమ్మ
అమ్మోంటి వొనముల కుమ్మోటేనిగ పుట్టెకుమ్మోటీనిగ మీద కొడుకు బాలుడుపుట్టె
ఎక్కరాని గట్లన్ని ఎక్కెక్కి దిగేసు *

పల్లీయుని మనసెంత అమాయకమో వేదాంత తత్త్వ విషయములందంత అయఃపిండము. పై పాటవంటి పాటలనేకముగానున్నవి. ఎంత గురిచూసినను, ఎరవేసినను ఇప్పట్టులందు వాడు చిక్కడు. వాని తత్త్వమెంత పరతత్త్వమో ఊహించ వలసినదే.

గొల్లోడ గొల్లోడ గొర్లన్నిపాయె- నిన్నోటి పాయెరా మొన్నోటిపాయె
పోయిన బుదారం పొటేలుబాయె- పోటేలు కొమ్ములు లొట్టల్లువాయె

లొట్టలల్లో నీళ్ళు నిలిసె-నీళ్ళ పుణ్యాన నిమ్మలుకాసె
నిమ్మల్లలాని యముకోని పుట్టె-ఎర్రగడ్డ భూములు యెదన బుట్టె
దున్నంగ దున్నంగ బండబారిపాయె-బండ కింద రొండు బాబిరి పిల్లల్
ఈగుదామంట చూస్తుంటయి-కర్సుదామంట చూస్తుంటయి

ఇట్టి విచిత్రమైన, అద్భుతమైన అభూతమైన కల్పనలు జానపదులలో కోకొల్లలు. ఇట్టి తత్త్వము ప్రాక్తన మానవుని మానసిక తత్త్వమునకు సంబంధించి యున్నదని చెప్పుదురు 1.

బీగుల్ బీగుల్ మంటాది-పులిమామిడికోట
ఆగుల్ బొగుల్ మంటాది.
అత్తెకాదుర పత్తెకాదుర కనుమనూరి గుడెపుగాడు
కత్తిలేదు కఠారిలేదుర మనుబోతు కాపోన్ని సంపిన
అదేకత్తి నాసేతులవుంటె కొల్లంపల్లి తాటిమాకుల
కొట్టికొట్టి ముర్దాల్ సేతుర కోలువోదు పులిమామడికోట ॥బీ॥
వాడు యేసిన గుండుకాదుర వీడు ఏసిన గుండుకాదుర
మదాపురాయుడు ఏసిన గుండు శెట్టుసేమకు తగులకుండర
పాసుగంటికి పగులు సుక్కుర మూసప్యాటకు మూకటేసెర ॥బీ॥ *

పల్లవినుండి తిరిగి పల్లవినందు కొనువరకు ఊపిరి పట్టజాలనంతటి ఉద్వేగము చిత్త విభ్రమము పల్లీయుని ఆటపాటలలో సర్వసామాన్యము. పై పాటలో నుత్సాహాతిరిక్తమైన ఉద్వేగము బహిర్గతమైనది. ఉద్వేగము వలన శరీరము మీద అనేక మార్పులను సూచించు చిహ్నములు కన్పట్టును. ఉచ్ఛ్వాస నిశ్వాసము లధికమగును. కండరములలో సంచలనము రేగును. ఇంతేగాక పెక్కు మనోవికారములేర్పడును. ప్రకృతిరామణీయకమును, కళలను దర్శించినప్పుడు కలుగు ఉద్వేగముకంటె రౌద్రముతో గూడిన ఉద్వేగము అనారోగ్యకారకము. కోలాటమాడునప్పుడు గాని, వీరాద్భుత

1. A. A. Macdonell:-Vedic mythology. P. 1.

రసస్ఫోరకములైన కథలల్లుటలో గాని, చెప్పుటలో గాని జానపదుని చిత్తవిభ్రమములు చిత్రవిచిత్రములు. ఇట్టి ఉద్వేగము సమూహములో నున్నప్పుడెక్కువగు చుండును. దానికి సామూహిక ప్రేరణయే కారణము.

పల్లీయుని శృంగార భావన, ఆదర్శము, నాగరకునికేమాత్రము తీసిపోదు. ప్రియురాలి లక్షణములను గూర్చి వాని భావనలెంత సొగసుదనమును సంతరించు కొన్నవో ఈ క్రింది పాటను నెమరు వేసికొన్న తెలియును,

అరికాళ్ల సన్నమూ అందెలు జవ్వాడె
అదురు పిక్కల దానవే సినబాలి — ఆశంత నీమీదనే
కోలెముక సన్నమూ కొన రొమ్ము మందమూ
కోరికలు నీమీదనే సినబాలి—కోరికలు నీమీదనే
కొత్తకోట సంతలా కొబ్బెరి వానములా
నీకొక్క టెంకాయెనే సినబాలి — గడ్డివామిల దసినా
ఆలూరి సంతనా అకుల బాజునా
పోకల్ల పొడిరాలెనే సినబాలి — సున్నంల సుడిదిరిగెనే *

అన్నప్పుడు జానపదుని అందాల సుందరి మీది ఆశలు, కోరికలు 'కొత్తకోట సంతలా కొబ్బెరి వానములా నీకొక్క టెంకాయనే' అనుటలో దేవత మీది ఆదర్శముగామారి చివరి చరణములో అనులిన శృంగార మమూల్యమైనది.

లాలుగుడెం బోరుమిట్టన దండు దిగిందారె పిల్ల
సిన్నసిన్న సింతల కింద దేర గొట్టిండ్రారె పిల్ల
గాజులంటయి గల్లగల్ల పానమంటది గుల్లగుల్ల
మెట్టెలంటయి సిట్టపట్ట పానమంటది మిట్టమిట్ట * —పంటివి

మరియు మోట పదాలలోని ఇట్టి విషయములు జానపద గ్రామీకులలోని కామాతురత కుదాహరణలు. మనోవిశ్లేషకులు (Psychoanalysts) కామేచ్ఛ (లిబిడో) ను గూర్చి వివరించిన దానికి ఇవి సరిపడుచున్నవి.

ఇక జానపదుడు సమూహములో నున్నప్పుడెట్లు వర్తించునో వాని మనస్తత్త్వమెట్లు దిద్దబడునో సుంత విచారింతము—

యావూరె భామయామాని పేరు—నీ పేరు సెప్పావే నిల్సి మాట్లాడు
నా వూరులేలా నా పల్లెలేలా—నాతోటి ముచ్చట్లు నీకేల పోరా
నీవూరు గావాలె నీవుగావాలె—నీతోటి ముచ్చట్లు నాకుగావాలె
అదిగాదె భామ ఇదిగాదెభామ—నీవూరు పేరేమి నిన్ను పోనియ్య
అయితోలు రాసూరు అయితె ఆమనగల్లు—కందుకూరు దేశాన గుమ్మకొండన్న
సక్కన్ని సెరుకూరు సొక్కన్నపల్లె—బాజూనవొయ్యేది బండోనిపల్లె
కురుస కుప్పనగండ్ల గుండు పెద్దాపురం—దండీగ యెల్లంద గుండాల మాది
వొంగూరు జూపల్లె వొనము తిమ్మాపల్లె—శెట్లల్ల వుండేది శార కొండన్న
బొక్కల్ల వుండేది జకినాలపల్లె—వాగు ఎంగంపెల్లె వాడ జిల్లెల్ల
మాటలకు మార్చెర్ల మాదికురుమిద్దె—మాది మందనగోలు మరి గోలుకొండ
మా పిలలుండేది రేపలెవాడ * —ఇది కోలాటము పాట.

అనగా కొంతమంది చేరి ఆడు సామూహిక జానపద నృత్యము. ఇందు సమూహముగా చేరిన ప్రతివ్యక్తి యొక్క ప్రవర్తన, మనస్తత్త్వమనునవి ఆ సమూహముచేత ప్రభావితమగును. తద్వారా పరస్పరావగాహనము, అన్యోన్యవర్తనము సంఘటితశక్తి సంబంధములు అలవడును. పై పాటలో వ్యక్తమైన స్త్రీ పురుష సంభాషణమాయిరువురి మధ్య నడచినట్లు కనిపించదు. అది సమూహముగా కూడిన వ్యక్తుల ఆలోచనా పైఖరి అనవచ్చును. ఆలోచనలో గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి, ఊహాకల్పనశక్తి, భావనాత్మక శక్తి ఇమిడియుండును. వ్యక్తి యొక్క వ్యక్తాలోచనకు ఇతర వ్యక్తుల ఆలోచనలు జోడింపబడిన సామూహికాలోచన ఆ పాటలో గలదు. అది ఉత్త ఆలోచనకాదు. స్త్రీ సంబంధమైన సంభాషణము వలన చిరునామా విషయమున ప్రత్యేక గ్రామము పేరు, చెప్పబడక, ఆ గ్రామమునకు చుట్టుననున్న తత్సంబంధ గ్రామములపేర్లు చెప్పుట విశాల దృక్పథముగా వ్యక్తమగుటయే గాక ఉద్దేశపూర్వకమైన ఆలోచనా రీతిని తెలుపు చున్నది. మానసిక స్థితిననుసరించి ఆలోచనయుండును. ఇట్టి ఆలోచనాచాతుర్యము సమూహమునందే బలపడును. ఆనందము మూలహేతువగును. ఏకాంతముగా

నున్నప్పటి ఆనందము కన్న సమూహములో నున్నప్పుడు కలుగు ఆనందమే అంచులు దాటు చుండును. ఏదేని ఒక మార్పు జరిగినచో నది వ్యక్తికిని సమూహమునకును వర్తించు లక్షణము.

"అరువుదప్పి అరుకసేను కొయ్యరాదురా ఇట్ల
రండముండ సాముసాము 1 సెయ్యరాదురా
వానవొచ్చె వొర్దలోన ఉండరాదురా–ఇట్ల
నీళ్లతోని సాముసాము సెయ్యరాదురా
శెట్లమీది పాలపిట్టెను కొట్టరాదురా–ఇట్ల
బాలరొమ్ముఆడదాన్ని పట్టరాదురా" * —మరియు
"మనుషులార మీకు ఇంత మమత యెందుకు కల్లుమీదా
సిర్రసెత్తి సింపులరైకకు సింతసేతురు కొందరైనా
సిన్నలొట్టి కల్లులేదని సింతసేతురు కొంతమంది
కల్లునీళ్లు సారనీళ్లు బంగాకు 2. నల్లామందు
కడుపునిండదు కాలునిండదు కానిపోని రోగాలాయె" *

పల్లీయుని సమాజ సంబంధ మనస్తత్త్వమును ఈ పదాలు వ్యక్తీకరించు చున్నవి. సమాజ విచ్ఛిత్తికి దారి తీయు చర్యలను పల్లీయుడు సహింపక నీతిని బోధించుచు తన బాధ్యతను కొంత పంచుకొను చుండును. సామాజికాభిమానమున్నప్పుడిట్టి భావనలు రేకెత్తి విలువలను కాపాడుచుండును. వానికంత యనుభవము కలుగుటకు సమాజమే కారణము. కాబట్టి దుశ్చర్యలను జూచి సహించునా? మన నీతిశాస్త్ర విషయములిట్లు సామాజిక వర్తనకు వర్తించు కట్టు బాట్లే.

కల్లు ముంతా మాయమ్మ నిన్ను మరువజాలనే ॥క॥
కల్లు కోయేటపుడు మనం కలేవడుదమూ
మళ్ల వచ్చేటపుడు మనం మాటలాడుదమూ ॥క॥
సేసుకున్న పెండ్లాన్నె మొ సీకుల కమ్మినా
కాల్వకింది ఎకరం భూమి కల్లు కమ్మినా ॥క॥
ఉడుకుడుకు పకోడీలు ఉడుకుతున్నయీ
అండ్లయేసిన పప్పుగడ్డ లెగురుతున్నయీ ॥క॥ *

1. సహవాసము 2. బంగి + ఆకు

అట్లు కల్లునకు (మత్తుపదర్థములకు) మరగి మనోదౌర్బల్యము చేత సర్వస్వమును నాశనము చేసికొని మితిమీరిన త్రాగుబోతుగా మారిన వాని విపరీత మనస్తత్వమును,

దూరు దూరు దూరు దూరో నాసామి — దున్నపోతుల దండు సూడో నాసామి

.... .... .... .... .... ... ... .... .... .... ....

ఆకలిస్తా నమిలిపోరో నాసామి — పోకలిస్తా నమిలిపోరో నాసామి

రెండు గుట్టల నట్ట నడుమా నాసామి—రేగడిస్తా దున్నిపోరో నాసామి: మరియు,

రాయంటి నామొగుడు రంగామెల్లి తిరిగి రాలేదు

నాచేను దున్నాలి నాకు రైతు మంచివాడు కావాలి

మాయ చెంగలితుంగ మత్తుగా బెరిగింది

తీయలేక వదులు కున్నాను — దిక్కు లేకను మొక్కుచున్నాను

.... .... .... .... ... .... ... .... ....

బీటుచేను నాది వాటంగా దున్నాలి — రాటు పోటుకూ ఆగాలి

ఆ రైతు మోతిబారై యుండాలి— ... .... .... .... ....

కాళ్లెత్తి, నొక్కితే గడ్డంత యేళ్లతో — భళ్ళు భళ్ళున పెకిలి పోవాలి

ఆ బలిసిపున్నా గడ్డి చావాలి — గుండ్రి దిబ్బల పైన రెండు చేతులతోటి

గండ్రి నాగలిమేడి కదలకుండా నిలిపి — కొంగ్రదేసీ నొక్కితే నాగాలీ

పణత రేగడిలోన మునగాలి — .... ... .... .. .... ....

యెవరైన చేయగలిగితెల్లి చూసుకోండి — యీవలావలగట్టు లోపలోపలగాడి

.... .... .... ... .... .... ఇష్టమైతే కౌలుకిస్తాము, *

ఇట్టి పచ్చి కాముకత్వమునకు గురియై ఉద్భృతమైన కామదాహముచేత ప్రవర్తించు స్త్రీ పురుషుల మానసిక స్థితిని మరియు సంఘబాహ్యములైన కార్యములలో వ్యవహరించు పలురకములైన వ్యక్తుల మనస్తత్వములను గూర్చి సైకో పెథాలజీ, సైకియాట్రీ రంగాలలో పరిశోధనలు జరుగుచున్నవి. జానపదులవలె నాగరకులలో గూడ విపరీత మనస్తత్వము గలవారుందురనుట సర్వసామాన్యము.

జానపదుడు కుటుంబమునందున్నను, తోబుట్టువులయెడ మమత, తల్లి దండ్రులయెడ భక్తి, ప్రియురాలిపట్ల చేదోడు వాదోడుగల అనురాగము, పిల్లలపట్ల ప్రేమ కలిగి సుఖదుఃఖములను సమానముగా పంచుకొనుచు కుటుంబ క్షేమమునకు సర్వదా పాటు పడుచుండును. ప్రాథమిక సంస్థయైన కుటుంబము, వ్యక్తిత్వమును దిద్దుటలోను, వ్యక్తి ప్రవర్తనపై ఆధిపత్యము వహించుటలోను, ఒక తరము నుండి

యింకొక తరమునకు సామాజిక వారసత్వము నందించుటలోను తోడ్పడుచుండును. కుటుంబ శిక్షణనుబట్టి వ్యక్తి సమాజమున ప్రవర్తించును. ఒకవేళ సమష్టి కుటుంబ మయినచో కొన్ని సందర్భములందత్తకోడండ్ర కొట్లాటల ఫలితముగ, అడుబిడ్డల పట్టింపుల ఫలితముగ కుటుంబ మనస్తత్త్వము దెబ్బతిని ఆకుటుంబము చీలిపోవుట సంభవించుచుండును. దీనిని కుటుంబ జీవనమను ప్రకరణమున గనుగొనవచ్చును.

## జానపద స్త్రీ మనస్తత్త్వము

జానపద సమాజములో స్త్రీకి నాగరక సమాజములోని స్త్రీ కంటె స్వేచ్ఛ ఎక్కువ. పురుషుడు సంపాదించి తెచ్చిన దానిని కూర్చొని తినదు. సర్వసాధారణముగా పురుషునితో కలిసి అన్ని కార్యములలో పాల్గొనుచుండును. ఇదంత ఆర్థిక వ్యవస్థను, పరిసరములను బట్టి జరుగుచుండును. సమాన ప్రతిపత్తి కొంత ఏరకీసమాజముననే దక్కుచున్నదనవచ్చును.

ఉంగురాపు ఉంగురాపు – జోడు ముద్దూటుంగురాపు – వొల సందమామా
నీజోడు కన్నెల యెడల వాసి–నేటికి నెల దినములాయె–వొల సందమామా
కంచి మ్యాకల పాలుపోసి–పెంచితీని జాజికురులూ ,,
వొన్నెకాని వొలపులాకు–పక్క కిందీ పానుపులాయె ,,
గోలకొండ కొనగుజ్జారిలోన–కొంటినమ్మ కొనమొగ్గలరైక ,,
మడత మడత యిచ్చిసూస్తే–వొన్నెకాని వొలపూలుండు ,, *

వలచిన వన్నెకాని యెడబాటును జానపదస్త్రీ సహింపజాలదు. అడుగడుగున వన్నెకానితో దిరిగిన చోటులను, అనుభూతులను, మరచిపోదు. పాపము! ఏకాంతమున తన దాపుడు రైకను విప్పిచూచుకొన్నప్పుడు అందులో తన వన్నెకాని వలపులే దాగి యుండినవట. ఎంతటి రసధ్వని యామె గుండె నుండి ప్రతిధ్వనించుచున్నదో ఆ పడతి భావనను నెమరువేసిన తెలియును.

రార నాయింటికి – ఒంటిగ నిదుర– రాదు నాకంటికి
కూలికోతె నాకెరార– నాలికోతె నాకెరార
సొప్పుకోసి గూడుపెడ్త– గూట్లనిన్ను కూలపెడ్త
నల్లరేసే కూలి ఏస్తా – ॥రార॥ * ——పల్లె యువతికి గలిగిన ఇటి

మానసికోద్వేగమునకు యౌవనదశారంభములోని లైంగిక సహజాతము మూలహేతువు. యౌవన దశలో గలుగు ఉద్వేగశక్తి మరే దశలోను గన్పట్టదు. యౌవనములోనే ఉద్వేగము లెక్కువగా పుట్టుచుండుట సహజము. దాని వెనుక సుఖకామనామూలకమైన జీవ ప్రవృత్తి గలదు.

అప్పటోడు పోతుండాడు - దుప్పటోడు పోతుండాడు
అమ్మా ఏమిసేతూనే - తల్లి ఏమిసేతూనే
వాడెలీ పోతుండాడు - నాపాణం బోతుండటీ

సద్దిముల్లె లిత్తూనా - సాగదోలి వత్తూనా

దండకడెమిత్తూనా - దండంబెట్టి వత్తూనా
ముక్కుపుల్ల లిత్తూనా - ముద్దువెట్టి వత్తూనా *

అన్నప్పుడు గూడ ఆమె యొక్క మనోద్వేగము, మనసిచ్చుకొన్నవాని మీది ఆదర్శము తులలేనిది. ఇట్టి చిత్తవిభ్రమములు పరిసరములను బట్టియే కలుగుచుండును.

ఎలుగూ 1 మీద కొంగూ పరసి - ఎలుగూదాటి వొత్తామంటే
ముచ్చాలాది పైటాకొంగురా - నా సామిరంగా
ముల్లూదాకి జల్లూమానెరా
అద్దానంపు అడిమీ 2 లోన - అడుగూ సూసి గుర్తూపెట్టి
మొగిలీరేకు లంటానేసురా - నా సామిరంగా
మొక్కీ వొళ్ల పెట్టూకుందూరా *

ఇందలి పల్లెపదతి యొక్క మానసిక విలువ ఇంతయంత యని కొలవగలమా? ప్రియుని అడుగుజాడలను మ్రొక్కి, ఒడిలో బెట్టుకొందునన్న ఆమె మానసిక విలువ తారాస్థాయినంటినది. ఆమె ప్రేమకలాపమంత కంచెలున్న చేలలో, చెట్లు గుట్టలున్న అడవులలో జరుగుటచేత పరిసరప్రభావము ముద్రవైచుకొన్నది.

1. కంచె, గెట్టు. 2. అడవి.

బాల గోపాలరార ఉయ్యాలలూగ — బాల గోపాలరార వెన్నారగించ
నీలవర్ణుడరార కాళింగ మర్దనుడ బంగారు తొట్టెలోనూ చెంగావి మొత్తావేసి
శృంగారించెదనురారా ఓరోరి కృష్ణా—గొల్ల వారిండ్లలోను కుండపెరుగారగించి
దండితనము సేయకూర బాలగోపాలరార .... .... .... .... .... ....
మంగళ వాయిద్య సంగీతాలే పాడుచు—
బొంచు తొట్టెలోను రంగయ్య నిదురపోరా,

కొడుకు పుట్టినచో పల్లెవనిత బాలకృష్ణునిగానో, రామునిగానో, కుమార్తె కలిగినచో సీత, లక్ష్మి, దమయంతిగానో, భావించి రూపకల్పన చేసికొని లాలించుట పరిపాటి. ఆమె లాలనలో ఆలోచనాపైఖరిలో యశోద తొంగిచూచును. పెక్కు సందర్భములందీ యాదర్శము అనూచానముగ గ్రహింపబడుచున్నది. పిల్లలను ఊయలదశ నుండి హాయిగ ఆటలాడు దశవరకు పెంచెడు విధానములో వారికి మానసిక శక్తిని, శిక్షణను అందించుచు, ఆటపాటలతో ఆనందమున తేలించెడు సందర్భములలో పల్లెవనితయొక్క మాతృత్వము, మనస్తత్త్వము అద్దముపట్టి నట్లుండును.

వాన కురువాలేదు మొగులొడ్డాలేదు— అమ్మ మనవాకిట్లో
అమ్మా మనవాకిట్ల వొర్దలెక్కడివే
నువుపోయి బొరుగింట్ల పండుకుంటె కొడుక
నీయాలి సోకమ్మోయ— నీయాలిసోకమ్మ వొర్దలైపారె
అత్తరో ఓయత్త వొలరాస అత్తా— నీలకంఠుండోయ్ నీకొడుకంటా
నీతోని నీకొడుకు ఏమన్నడంటా— నీలకంఠుడంటా నిన్నొల్లడంటా
వొలకుంటె గనిసేడె వొయిభోగమేడా — నీలంపు గాజుల్లో నీడలుంటేసాలు

రచ్చన్న మామయ్య మెచ్చుంటేసాలు— నాయింటి మెట్టులు వొదినుంటెసాలు
నా అరటి నల్లల్లు మెడనుంటెసాలు — నాసాటి యాడంగ్రు లవునంటెసాలు
కాలు కంచూమెట్టె కయిగుంటెసాలు ....
నా నొష్టి కుంకుమ్మ తీయకుంటెసాలూ *

హైందవ సమష్టి కుటుంబమున నుండు స్త్రీ మనస్తత్త్వము నిమ్నగీతము గట్టినట్లు పల్లితము. కుటుంబ, సామాజిక పరిసరముల ప్రభావము వ్యక్తి . పీఠంతి

ఆదర్శమాకనమం(దుచున్నది. ఉదాత్తమైన స్త్రీమూర్తి యొక్క పరిపూర్ణ మనస్తత్త్వము మూర్తీభవించినట్లున్నది. సీతామహాదేవి ఆ కుటుంబమున అలరారినట్లున్నది.

అత్తల సాధింపులుకూడ జానపద సమాజమున మిన్నంటినవి. కుటుంబ జీవన ప్రకరణమున వానిని పరికింపవచ్చును. కోడండ్రపట్ల అత్తకట్టి వైఖరి పరంపరాగతమైనదే. కోడలిని అత్త రాసిఅంపాన బెట్టుట, ఆ కోడలు మరల అత్తయైన పిదప తనయత్త చేసినటులే చేయుట అలవాటైనది. ఇట్టి వ్యవస్థ వలన నెందరో కోడండ్రు బావిగాని చెఱువుగాని చూచుకొనుట జనవిదితము.

పల్లెవనిత సమూహములో నున్నప్పుడు తన ప్రవర్తనను ఆ సమూహము ననుసరించి దిద్దుకొనుట సాధారణము. తెలుగుసీమ (తెలంగాణము) లో బ్రతుకమ్మ ఆట స్త్రీల సామూహిక నృత్యము. అయింటి యాయింటి అమ్మలక్కలంత బ్రతుకమ్మలను పూలతోపేర్చి నలుగురికి కనిపించెడుచోట గుమిగూడి ఆడుచుందురు. సంస్కృతికది చక్కని నిదర్శనము. కళాత్మకమైన ఆచారము—

చిలుక చిలుకున కురిసే వలలో చిత్తారువాన వలలో
ఏరాజు కురిపించె ,, ఏడుగడియల్లా ,,
బాల రంగపుసామి ,, పట్నానా రాంగ ,,
బొడ్డుమల్లెలు కురిసె ,, బోనాగిరి మీద ,,
అక్కడక్కడ కురిసె ,, చెన్నయ్య మీద ,, .... ....

అమాయిక భక్తి విషయమున జానపద స్త్రీలకు పెట్టినదిపేరు. ప్రతి పనిలో వారి మనస్సు దైవమును తలవని దినముండదు. ప్రతి అనుభూతియందు పుట్టింటిమీది మమత, అన్నలమీది ఆప్యాయత వ్యక్తమగుచుండును. కలుపులపుడు గూడ వారి మనస్తత్వమూ గుంపుననుసరించియే యుండును. తత్ఫలితముగ మానసిక ఉత్సాహము పెరిగి శారీరక మైన అలసట తీరిపోవుట యొప్పును.

కానివారితోను కావించు చెలిమి— కట్టె విరిచి పొయిని పెట్టినట్లుండు.
అయినవారితోను కావించు చెలిమి— అకు మడచీ మడత పెట్టినట్లుండు
కానివారి మాట కంట్లోది నలుసు— ప్రాణం బోయిందాక పక్కలో పోటు
.... ...

ఉన్నవూరు విడిచి వుండనేలేము— కన్నతల్లిని విడిచి గడియుండలేము

.... .... .... .... .... .... .... .... .... .... ....

ఆయుస్సు మూడిన ఆకు చినిగినను— బతికించు వారెవరు ఆతుకు వారెవరు

.... .... .... .... .... .... .... .... .... .... ....

ఉన్నవూరే నాకు చెన్నపట్నమ్మ— కన్నతల్లే నాకు కల్పవృక్షమ్మ

ఇత్యాది అనుభూతులతో గూడిన స్త్రీ ఆదర్శములు సమాజపరమైనవి. స్త్రీమనఃపరిపాకము సువ్యక్తము. జానపదస్త్రీ గాని, పురుషుడుగాని ఆ సమాజమునకు ఒక్కని ప్రతీకలు. వ్యక్తికిని సమాజమునకునుగల అన్యోన్య వర్తనలే సమాజపురోభివృద్ధి.

## జానపద సామూహిక వర్తన

పరస్పర సంబంధముగలిగి లక్ష్యసాధనలో అన్యోన్యవర్తననేక ముఖముగా దిద్దుకొనుచు ఒక్కరికన్న అధికముగా నొక్కచోట కూడుటను సమూహము అని నిర్వచింప వచ్చును. వ్యక్తి ఒంటరిగా నున్నప్పుడు వాని ఆలోచనలు, కోరికలు మున్నగునవి ఆవ్యక్తి సంబంధములు. అనగా అవి వాని ప్రత్యేకములు. కాని సమూహములోనున్నప్పుడు వాని మనస్తత్వమా సమూహము మీదనే ఆధారపడియుండును. వ్యక్తిగతముగా వ్యక్తికి స్వేచ్ఛయుండినను, తగిన అవసరములు తీరుటగాని, సంతృప్తి కలుగుటగాని లేదని గమనించుచునే యున్నాము గదా. ఇట్టియవసరములు తీరుట, సంతృప్తికలుగుట యనునది సమూహములోనే సాధ్యమగును. వ్యక్తియందణగియున్న ప్రేరణలు, కోరికలు సామూహికవర్తన ద్వారా వ్యక్తమగుచుండును. అనగా మానవుని స్నేహము, ప్రేమ, భద్రత, బ్రతుకు తెరువు, సమూహమునందు సంతృప్తిదాయకము లగుచుండును. అయినను వ్యక్తి అవసరములు సమూహము యొక్క అవశ్యకతలంద ప్రాధాన్యములు. కాబట్టి సమూహ ప్రయోజనమే సమూహము యొక్క ధ్యేయము. కాని కేవలము వ్యక్తులను కూడదీయుట గూడ కాదు. సమూహములోని వ్యక్తులుమ్మడి ఉద్దేశములతో, లక్ష్యములతో తత్పద్ధతి ననుసరించు చుండుటనునది మౌలిక లక్షణము. ఇందువ్యక్తుల ప్రవర్తనలు పరస్పర ప్రభావములకు గురియగుచుండును. అట్టి వ్యక్తులెప్పుడన్యోన్యాశ్రయము నెఱపుకొనుచు పరస్పర ప్రేరణము మరియు ప్రతిఫలచర్యలు గలిగియుందురో అచ్చట సామూహిక వర్తనయొక్క మౌలికస్థితి యుండును1. ఇట్టి సామూహిక వర్తన మీద సంప్రదాయ ముద్రలు పడియేయుండునని

1. H.Bonner:- Social Psychology- P. 335

చెప్పుట అది వ్యక్తి వర్తనకు గూడ వర్తించునని భావము. కుటుంబమున శిశువు మీద తల్లిదండ్రుల, కుటుంబ సభ్యుల ప్రభావమెట్లు పనిచేయునో అటులనే ఆయా సమూహమునందలి వ్యక్తిమీద ఆ సమూహము యొక్క ప్రభావము పనిచేయును. సామూహిక జీవితమును క్రమబద్ధము చేయును. సమాజమున కట్టి సమూహము పునాది మెట్టు.

కోలాటమాడునప్పుడు, డప్పు దరువు వేయునప్పుడు, భజన చేయునప్పుడు, దున్నుట, విత్తుట, చేనుకోయుట, బంతికట్టుట, కుప్పనూర్చుట వంటి వ్యవసాయపు పనులు చేయునప్పుడు, ఇంకను పెక్కు మంది వ్యక్తులను సహకారయుతమైన కార్యములలో ప్రవేశింప జేయుకూలినాలి వంటి శ్రామికపు పనులపుడుకూడ జానపదుల యొక్క సమూహము లేర్పడును.

కాయీ సున్నపుగాయీ 1. కాయీ సున్నపుగాయీ
కస్తూరి సుక్కబొట్టు కడుగనొస్తాదమ్మ2. మరిటీ నా చిన్నమరిటీ
ముప్పయి మందిలో ముప్పయి మందిలో
ముల్కంచు దోపతులె సుందరొస్తాడమ్మ మరిటీ నా చిన్నమరిటీ
.... .... .... .... .... .... .... .... .... ....
బంగారు శాలువా బంగారు శాలువా
నల్లని జులుపాలు3. నగుత వొస్తాడమ్మ మరిటీ నా చిన్నమరిటీ

పల్లీయులు కోలాటము వేయునప్పుడప్పటికప్పుడు వారల్లుకొను పదాలు పాడుకొనుట సామాన్యము. ఒక్కొకమారు ఒకే వ్యక్తి అనుభూతిని ఆ సమూహములోని వారందరు పంచుకొందురు. ఇంతేగాక స్త్రీలయొక్క అనుభూతిని సహితము తమ యనుభూతివలె భావించుకొని పాడుకొందురని పై కోలాటము పాటనుబట్టి తెలిసికొనవచ్చును. అనగా పల్లీయుల మనస్సు పలురకముల వ్యక్తుల జీవిత రహస్యములను బహిర్గతము చేయుచుండునని భావము.

" యేలో యాలా యేలో యాలా– యెంత బరువున్నదిరా
యెత్తరాఅన్న యేమిసరకుర అన్న– బరువుసరకుర అన్న పంచిసరకుర అన్న
బాగుగా వున్నది –బరువుగా ఎత్తరా "– ఇది తీరప్రాంతమునందు పడవనడపు వారు పాడుకొను పదము. ఆయా సరకులు పడవలోనికెత్తునప్పుడు, దించునప్పుడు

1. సున్నపుకాయ 2. కడుగుటకువచ్చునమ్మ 3. జుల్ఫాలు, లంబకేశములు.

శ్రమజీవుల కర్మేంద్రియములపైబడు శ్రమను మనస్సు గుర్తించి ఆ శ్రమ నివారణో పాయమైన కవిత నందించును. కర్మేంద్రియములు మనస్సంయోగము పొంది ఈ బరువు మోయును. మనస్సెప్పుడు శ్రమజీవులను శృంగార విషయములవైపున కీడ్చు కొనిపోయి కార్యోత్సాహమున ముంచెత్తును. " ఐసా ఐసా ఐసా-

ఏలు రెళ్ళిందొక చిలుక దాని ఎర్రకోక మీద నామనసు ॥ఐసా॥

ఒంగోలెళ్ళిందొక చిలుక దాని వాలుకొప్పు మీద నా మనసు ॥ఐసా" అన్ని పని పాటలలోను ఇట్టి మనస్తత్త్వము సర్వత్ర గోచరించును. ప్రతి పనికి పాట చేయూత.

పన్నెండు పరగణాలు వానదేవుడా పంటల్లు పండాలి వానదేవుడా
పన్నెండు ధాన్యాలు ,, పంటచేలు పండాలి ,,
మా కడుపు నిండాలి ,, పేదసాద బతకాలి ,,

కూలినాలి దొరకాలి వానదేవుడా పారిపోయిన నాబావ వానదేవుడా
పరుగెత్తుక రావాలి ,, ఊరెళ్ళిన నాబావ ,,
ఉరికురికి రావాలి ,,
తల్లిలేని పిల్లలూ ,, తల్లడిల్లు తున్నారు ,,
చేటంత మబ్బుపట్టి ,, చెరుపంత నిండాలి ,,
తూరుపున మొయిలేసి తుళ్ళితుళ్ళి కురవాలి ,,
.... .... .... ....
నాగతల్లి నీళ్ళాడి ,, వీధివీధి నిండాలి ,,
దోసుతల్లి నీళ్ళాడి " దొడ్లెల్ల నిండాలి ,,
పాముతల్లి నీళ్ళాడి పంటచేలో తిరగాలి ,,
కప్పతల్లి నీళ్ళాడి ,, కడప పంచల కుయ్యాలి ,,
కురువాలి కురువాలి ,, కుంభవృష్టి కురవాలి ,,
డబ్బుకు తవ్వెడు బియ్యం ,, మనిషికిద్దరు పెండ్లాలు
వానొస్తె వాణ్ణైనా కురవాలి కురవాలి
మూడు రోజులయెండ ముప్పై రోజుల ముసురు ,,

వానలు కురియవలెనని పొలము పనులుచేయు శ్రామికులు వానదేవుని ప్రార్థించుచు పాడుకొను పై పాటలో పల్లీయుని మనస్సెంత విపులమో, విశాలమో అభివ్యక్త మగుచున్నది. వానకాలపు మేఘమును జూచునప్పుడు కామోద్దీపక మగునను

"మేఘాలోకే భవతి సుఖినో ప్యన్యథా వృత్తిచేతః1" కాళిదాసు భావన— "పారిపోయిన నాబావ పరుగెత్తుక రావాలి, ఊరెళ్లిన నాబావ ఉరిపరికి రావాలి" అను పల్లెపదుము మాటలలో స్ఫురించుటయేగాక రసస్ఫోరకముగా నున్నది. వానలు కురియునప్పుడు ఈగలు దోమలు చెరలాడుట, పంటచేనిలో పాములు పారాడుట, ఇంటిలోని కడవల సందుకు కప్పలు చొరబడుట మున్నగు ప్రకృతి పరిశీలనాంశముల మీద పల్లీయుల మనస్సెట్లు లగ్నమైయుండునో తెలియుచున్నది. ప్రాక్తన మానవుని ప్రకృతి పరిశీలనా దృష్టి పల్లీయునిలో మిగిలియున్నది. ఋగ్వేదము నందలి మండూక సూక్తమును పరిశీలించినచో ఆనాటి వేదఋషులు ప్రకృతినెంత సన్నిహితముగా పరిశీలించిరో బోధపడును. మండూకసూక్తమే యననేల, వేద వాఙ్మయమునందంతటను ప్రకృతి పరిశీలన సునిశితముగా వివరింపబడినది. సమాజ సంక్షేమము, సమస్త జీవరాసుల శ్రేయస్సు అనునవి పల్లీయుల కాదర్శములు. వానదేవుని ప్రార్థించుటలోని అతి ప్రాచీనతను మున్ముందు పేర్కొందును.

శ్రీలక్ష్మి నీమహిమలూ— గౌరమ్మ— చిత్రమైతోచునమ్మా
భారతీ సతివై బ్రహ్మకిల్లాలివై — పార్వతీదేవివై పరమేశు రాణివై
పరగ శ్రీలక్ష్మివయ్యా —గౌరమ్మ— భార్యవైతివి హరికినీ

స్త్రీలు బ్రతుకమ్మలాడునప్పుడు పాడుకొను పాటలందెన్నో విషయములే గాక వారి మనశ్శిక్షణకుపకరించు అమూల్యసందేశములుండును. "శ్రీయన గౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవింప" అను తిక్కన దృక్పథమునకు పైపాటలోని స్త్రీలవిశాల మనస్తత్త్వ మునకును పొత్తు కుదిరినది.

కట్టమీదీ మర్రీ వొలలో కాయల్లా మర్రీ వొలలో
కాయలుండయి నాగా ,, కాకూలాలావు ,,
.... .... .... .... .... .... .... ....
ఆ మర్రి గొట్టించి ,, దొడ్డీగాయించి ,,
అర్న మిత్తుపురారా ,, అన్నా బాలన్నా ,,
అర్న మెక్కడిదమ్మా ,, ఆడీవిల్లలకూ

సారెపోసుక నేను వూరెళ్ళిపోంగా

1. మేఘసందేశము— ప్రథమసర్గము— శ్లో. 3.

వూరి ముండల రెండు వాలలో - పుసిరీకేశెట్లు వాలలో
పుసిరీకె చెట్లల్లా ,, పసిరీకె పాము ,,
.... .... .... .... .... .... .... ....
తోక దిప్పుకునాగా ,, తోడు సెల్లెలినీ ,, *

అనుచు బ్రతుకమ్మ నాడునప్పుడు గాని,

'తంగెడు పూసేటాళ్లా - నాతల్లులొచ్చేటాళ్లా
అచ్చన్న లాడుకుందూ - బాలమ్మ వొచ్చేదారిలో
కొత్తా పూసేటాళ్లా - నా కొడుకువొచ్చేటాళ్లా
అచ్చన్నలాడుకుందూ - మొగిలయ్యవొచ్చేదారిలో" *

" నారీర ఓనారి నాగమల్లె దారిలో - మాదిగొల్లా నారమ్మా నాగమల్లె దారిలో "
"సీరలొచ్చిన జాడలుండే రావయ్యో - భూమయ్య మడిగాలమీద రావయ్యో" *

అని పాడుచు చేనికలుపులు తీయునప్పుడు గాని,

సువ్వి సువ్వన్నలాల సువ్వన్నలాలా - సువ్వంటి రోకండ్లె సూదిపొన్నుల్లె
.... .... .... .... .... .... .... .... .... .... ....
మాయత్త బిడ్డల్లు బర్రెపడ్డల్లు - మాయమ్మ బిడ్డల్లు సెక్కబొమ్మల్లు
మాయత్తకొడుకుల్లు దున్నపోతుల్లు - మాయమ్మ కొడుకుల్లు ఎలమదోరల్లు *

అనుచు దంపులప్పుడుగాని, తదితరమైన పనిపాటలప్పుడు గాని. సమూహములుగా చేరిన పల్లెపడతులందు వివిధములైన మనోవృత్తులు, వైఖరులు, వ్యక్తములగు చుండును. అవి కుటుంబపు పెద్దలనుబట్టి, సమాజమునుబట్టి ఏర్పడుటగాని, మారుటగాని సంభవించును. వీని ననుసరించియే జీవిత విధానము సాగుచుండును. ఆలమందలున్నా అరణమీయని అన్నమీద చెల్లెలికిగల వైఖరి, పదాలలో కుటుంబములోనివారి పేర్లు కలుపుకొని పాడుటయందలి యభిరుచి, ఆలోచనారీతి, జరిగిన సంఘటనలు కథలుగా నల్లుకొని సామూహిక ముద్రలు వేయుటలోని సాంఘీభావన, వైయక్తికమైన దానిని ఆసమూహమునందు బలపరచుటయందలి యభిరుచి, అత్తయింటి మీద తల్లియింటిమీద స్త్రీకిగల విచిత్ర మనోవైఖరి, మనోవృత్తులనునవి పై పదాలవలన తెలిసికొనవచ్చును.

## జానపద సామాజిక వర్తన

వ్యక్తి తానున్న సమాజమువలన ప్రభావితుడై తన వర్తనను సమాజపరము చేయుట సామాజిక వర్తనయని స్థూలముగా చెప్పుకొనవచ్చును. సామాజిక ప్రభావములు వ్యక్తిని రూపొందించును. సమాజములో సమూహమనునది మౌలిక విభాగము కావున సమూహముల మధ్యగాని, వివిధ వ్యక్తుల మధ్యగాని కలుగు పరస్పర ప్రేరణ మరియు ప్రతిచర్యల ఫలితముగా సామాజిక వర్తన తెలిసికొననగును. సామాజిక ఆదాన ప్రదానములు (Social interactions), పరస్పర సామాజికవర్తనలేనిచో వ్యక్తిత్వము గాని మానవవర్తనగాని యుండదు. మానవ పరిసరములలోనే మానవుడు అర్హుడుగా సమర్థుడుగా కాగలుగుచున్నాడు. పుట్టగానే శిశువు మాతృస్తన్యమున కారాటపడునట్లే తనయవసరముల కొఱకు మానవునికి సమాజ మత్యంతావశ్యకమగుచున్నది. వానివర్తన లోని ప్రతి మలుపు చుట్టునున్న సమాజ ప్రభావము చేత మలచబడుచున్నది. "సంఘ ప్రమాణములు, విధినిషేధములు, భాష, వైఖరులు, అవిచారాభిప్రాయములు, రాగ ద్వేషములు, ప్రజాభిప్రాయము ప్రచారము వంటివి సామాజిక వర్తనను రూపొందించు టలో ప్రధానపాత్ర నిర్వహించుచున్నవి".[1] వ్యక్తి వర్తన నదుపులో నుంచుటకు సంప్రదాయము, ఆచారములు, కట్టుబాట్లు, జానపదరీతులు (Folkways) మున్నగు సంఘప్రమాణములుపకరించును. సమాజ విద్రోహకర చర్యలుగల వ్యక్తిని శిక్షించుటకు, అదుపుటాజ్ఞలలో బెట్టుటకును, సమన్వయ మార్గమున సమాజమును ఏకముఖముగా నడపుటకును, విధినిషేధములు సమాజములో విశిష్టమైన కార్యములు సాధించుచుండును. భాష సామాజిక సృష్టియని అంగీకరించినప్పుడు, సామాజీకీకరణమునకు దాని పాత్ర యెంతటిదో వేఱుగా చెప్పవలయునా? భాషోత్పత్తి ఫలితముగానే వ్యక్తులలో క్రియా ప్రతిక్రియలు పెరిగి మనోవ్యాపారములు ప్రస్ఫుటములైనవి. వైఖరులు కూడ మనో వ్యాపార సంబంధముగా అనుభవమునందు గడించుకొన్నట్టివి. ఇవి స్థిరవైఖరులు, అస్థిరవైఖరులని రెండు రకములుగా చెప్పుదురు. మొదటిది తనమతము, వస్తువులు, ధనము, సంతానము, మరియు సాంసారిక విషయములయెడల యేర్పడునట్టివి. వ్యక్తి వయస్సునుబట్టి మారుచు ఇతరులయెడల ఏర్పడునట్టివి రెండవ రకమునకు చెందును. కులము, వృత్తి, అంతస్తుల ననుసరించి కూడ ఈ మనోవైఖరులేర్పడుట గాని ప్రభావితమగుటగాని తటస్థించును. వైఖరులోకవిషయమున నెప్పటికిని అనుకూలముగా

---

1. విజ్ఞానసర్వస్వము— 10వ సంపుటము— పుట 740.

నైనను లేదా ప్రతికూలముగనైననుండ వచ్చును. ఆత్మవిశ్వాసమును, ఆత్మగౌరవమును పదిలపరచుకొనుటకీ మనోవైఖరులు తోడ్పడుచుండును. సవిచారించని అభిప్రాయములే అవిచారాభిప్రాయములు. అవి దుశ్చర్యలకు హేతువులగుచు అట్టియభిప్రాయములు గలవారిని కుజనులుగా చేయును. అటులనే ప్రజాభిప్రాయము, ప్రచారముల వంటివి సామాజిక వర్తనను నియంత్రించును.

వ్యక్తి యొక్క ఆత్మవిశ్వాసము సహితమా సమాజములోని యితర వ్యక్తులతో నిచ్చిపుచ్చుకొను సంబంధమేర్పరచు కొన్నప్పుడే కలుగును. అతని ఆత్మ ప్రభావమాతని మొత్తము ప్రవర్తన మీద పడుచుండును. అట్టివ్యక్తియొక్క సర్వతో ముఖాభివృద్ధి సమాజములో కలుగునని భావము. మానవునిలో నూతన ప్రేరణములను, అవసరములను గూడ సమాజమే పుట్టించును. అనగా మానవవర్తనలో సమాజమొక సృజనాత్మకశక్తి. ఏసమాజమునకైనను పై లక్షణములు ప్రధానాంశములే. జానపద సమాజములో వారి సామాజికవర్తన యెట్లుండుననునదీ క్రింద వివరించనైనది.

సంజెవేళ సుక్క ఓసందమామా తల్లిగావలెమాకు ఓసందమామా
చల్లనీ సెందురుడు ,, తండ్రిగావలెమాకు ,,
ఆదినారాయణుడు ,, అన్నగావలెమాకు ,,
పరషత్రి జానకి ,, వదినగావలెమాకు ,,
దక్షిణపు సుక్క ,, అక్కగావలెమాకు ,,
బంగారి సూర్యుడు ,, బావగావలెమాకు ,,
మాపటేలి సుక్క ,, మరిదిగావలెమాకు ,,
పల్లెల్ల శ్రీలక్ష్మి ,, చెల్లెగావలెమాకు ,,

సూర్యచంద్రులు, నక్షత్రములు, దిశలు, లక్ష్మీనారాయణులు, సీత పల్లీయులకు తల్లిదండ్రులు, అక్కాచెల్లెండ్రు, బావమరదులు. ఈ మనోభావములను వైఖరులను, ఊహాశక్తినిబట్టి వారెంత విశ్వజనీనులో గ్రహింపవచ్చును. ప్రపంచమంత ఒకటే కుటుంబము (వసుధైవ కుటుంబకమ్) అని వారి భావన. ఈ భావనలో భారతీయ సంస్కృతి ముద్రవైచుకొన్నది. ప్రకృతియే వారికి ప్రేరణ. కావున ప్రకృతి యనగా పల్లీయులు. పల్లీయులనగా ప్రకృతి. ఆ వావివరుసల విషయమున వారెంతఔచిత్యము పాటించి విలువలను రక్షించిరో పై పాటయే సాక్ష్యము. ఇట్టి మనోవ్యాపారములు

నిష్కళంకము, నిరాడంబరము, అన్యోన్యము, ఆదర్శము అయిన జానపద సామాజిక వ్యవస్థకు పునాదులు.

మూడు రూపాయలిత్తా – ముత్యాల పోగులిత్తా
సువ్వురాయెపిల్లా – గురిజాల గట్టు మీదికి
మూడు రూపాయలద్దు1, – ముత్యాల పోగులద్దు2,
నేను రానోయిరాజా – దేవుడున్నా గుటమీదికి

దేవుడన్నచో జారకాంతకైనను భయమే పుట్టినది. ఇది పల్లీయుల నైతిక విలువకొక నిదర్శనము. నాగరక జారిణికీపట్టింపకూడ ఉండదు. పల్లెపడుచు యొక్క నైతిక దృక్పథము, మానసికమైన విలువ, సామాజిక విధినిషేధముల మీద గౌరవము అట్టిది.

ముక్కు మొగమూలేని పక్షి ముప్పయ్యారు గుడ్లుపెట్టె
దెబ్బయ్యారు సుట్లుదిరిగె ఇరవయ్యారు పిల్లల్ లేపె
దీని యర్థామేమొగానీ తెలుసుకోండీ జ్ఞానులైతే?

.... .... .... .... .... .... దీని పేరె కుమ్మరిసారె; – ఇదొక పొడుపు (తట్టు) కథ. ఒక సమస్య. తొలుత గూఢార్థ ప్రతిపాదక సమస్యనులేవనెత్తి ఆ తర్వాత భావార్థమును దెలిపి సమస్యా నివృత్తి చేయుటలో పల్లీయుల చాకచక్యమద్భుతము. వారి ఆలోచనా పటిమకును, అను భూతికిని పొడుపుకథలు ఆధారము. (పల్లీయుల మీద ప్రకృతి ప్రభావ మనంతమని మరచిపోరాదు). ఇట్టిపొడుపు కథలు కూడ సామాజిక ప్రయోజనమాశించిన సామాజిక సృష్టియే.

"గుట్టగట్నా3, రెండు గొల్లవారిండ్లు– గొల్లాని కూతురు కలుకల్లరలికి
తొలికోడికూయంగ తొలిబాన చిలుక– మలికోడికూయంగ మలిబానచిలుక
అచల్ల ఈచల్ల ఒకటిగాబోసి– రాజున్నపట్నాన చల్లమ్మ చల్ల
రాజనాలిచ్చేను పోయవేచల్ల– రాజనాలు మాయిండ్ల రాగిగింజాలు
ముత్యాలు యిచ్చేను పోయవేచల్ల– ముత్యాలు మాయిండ్ల మొక్కజొన్నాలు

అవులనిచ్చేను పోయవేచల్ల– అవులు మాయింట ఆడబిడ్డాలు"

1. రూపాయలువద్దు 2. పోగులువద్దు 3. గట్టున

దీనిలో గొల్ల వనిత గర్వము, కులవృత్తిమీద అభిమానము కొట్టవచ్చినట్లున్నది. గొఱ్ఱెల పెంపకము, పాడిబేరము గొల్లవారి వృత్తి సంబంధములు. ఆయాకులవత్తు లార్థికముగా మెరుగు పడినప్పుడిట్టి మనోవైఖరి యేర్పడుట సహజము. అసలు ఆర్థిక స్తోమత యనునది కూడ మనస్తత్వము మీదెంతయో ప్రభావము చూపుచుండును.

వద్దమ్మ సుమ్మా పాలమాదిగన్నా—యాలవొచ్చెవు వాడకు

పూరించు సెలకరా పులపలకు తెల్లజొన్నలకు—సెత్తిన గంపరా సంకనా పిల్లలా
తోపయెంబడిపోతే నాయెంటరాకురా—సీపాటి మనగాళ్లు నామరుదులున్నారు
... .... .... .... .... ... .... ... ...
సేతివి గాజులు గల్లుమనకుండా—కాలువీ మెట్టెలు సిట్టు మనకుండా
వొచ్చెన్న పోరా ఓ మాదిగన్నా—తొల్లి నూరుకుపోయి తోలు తెచ్చినాను
.... .... .... .... .... .... .... .... ....
చెప్పులిలా కుట్టినా తయ్యారు చేసినా—కాలన్న పెట్టవే ఓ కాపుదానా"*

కాపువారిది వ్యవసాయ వృత్తి. వారివద్ద చిన్నకులములవారు జీతముందురు. ఆయా పొలము పని పాటలలో కలిసి కట్టుగా చేరియుండుట వలన, పరిసర సన్నివేశ ప్రభావముల వలన వారితో వీరు వీరితో వారు ప్రేమ కలాపములు రహస్యముగా ఆడుకొనుట జరుగును. అట్టి సందర్భములలో వారి మనోభావములు కుల తత్వమును వ్యక్తీకరించు చుండును. పెద్దకులములకును చిన్నకులములకును మధ్య నెన్నియో పట్టింపులు కనిపించును. ఈ పట్టింపుల వలన చిన్నకులములవారి మనోవైఖరి కూడ పెక్కు పాటలలో సువ్యక్తమగు చుండును. జారత్వ విషయమున పట్టింపులు సడలిపోయి ఉభయుల మనస్తత్త్వ మింకొక విధముగా అదరు బెదరుస కుదురు కొనుట యొప్పును. ఆర్థికముగా కుదుటు కొన్నప్పుడే కులతత్త్వములు సన్నగిల్లుటన్నదీ నాదెక్కువగా కన్పట్టు చున్నది. ఇది జరుగ వలసినదే.

పచ్చపుల బోయి మేదరి పదివేల దబ్బ 1, దెచ్చె
ఎర్రపుల బోయి మేదరి ఏడువేల దబ్బ దెచ్చె
నిలుచోని అల్లెరా నిలువు గాదెలురా—వంగోని 2, అల్లెరా వాలు బుట్టలురా

1. వెదురు బద్దలు 2. వంగి.

చేటల పెల యెంత చెప్పవోయి మేదరీ—చేటకు సీయాలి చెంగు బంగారు రా
మొరిశెలు సీయాలి మొగ్గల రవికెరా—జల్లెడ సీయాలి జడపూల బంతి రా

ఇందు మేదరివాని వృత్తివర్ణితము. వృత్తిని, వృత్తియందుపయుక్తమగు పరికరముల నాధారముగా జేసికొని మనస్తత్త్వమావిష్కరింపనగుచున్నది. అభిరుచి, అనుభూతి, మనోవైఖరి, భావన వృత్తిననుసరించియే కలుగుచున్నవి. చేట, మొరిశె, జల్లెడలపెల చెప్పుటలోగూడ ఆపల్లీయుని మనస్సు శృంగారమును చమత్కరించుచున్నది. వృత్తి పరికరముల వలన సత్ప్రవృత్తియగు వస్తువుల మీద తత్కార్యముల మీద వాని ఊహ కల్పన పెరుగు చుండును. ఇట్టి యూహాకల్పనలో నెన్నియో రకములైన అనుభూతు లేర్పడును. అనుభూతుల ఫలితముగా జీవన విధానము నెరుంగదగును. మనస్తత్త్వము జీవన విధాన మన్యోన్యాశ్రయములని యిప్పట్టులందు సులభముగా గుర్తింప వచ్చును.

కొమ్మనా పండున్నదీ ఉయ్యాలో—కోరితే మన్నొచ్చునా 1, ఉయ్యాలో

| | |
|---|---|
| కొమ్మ బటిగుంజితే | కొంగున పడదును కదా 2, |
| బాయిాల చేపున్నదీ | బమిసితే మన్నొచ్చునా |
| గాలమేసీ గుంజుతే | గడ్డనా పడదును కదా |
| పసుల కాడి బోయలే | జోడు యిద్దరు బాలులే |
| దొడ్డిన కోడున్నది 3, | దోసుతే మన్నొచ్చునా |
| పగమేసి గుంజుతే | దొడ్డిన పడదును కదా |
| గూటినా కోడున్నదీ 4, ,, | గునిసితే మన్నొచ్చునా |
| ఇత్తులేసి 5, పిలిసితే ,, | ఇవతల పడదును కదా |

చెట్లు చేమలు, బావులు, చేపలు, పశువులు, దొడ్లు, కోళ్లు మొదలగునవి జానపదుల పరిసరములలోనివి. కావున వారి ఊహ, అనుభూతి, ఆలోచనలన్నియు వైవానితో ముడి పడుచున్నవి. ప్రకృతి ప్రభావముచేత మానవుడు శారీరకముగనేగాక, ఇంద్రియముల ద్వారా అనేకమైన అనుభవములను గడించుకొని వాని నుండి భావముల నేర్పరచు కొనుచున్నాడు. ఆభావములే వాని జీవన పద్ధతిని నియంత్రించు చుండును. ప్రతి పల్లె పాట పల్లీయుని మనస్తత్త్వమునకు పిల్లబాట. ప్రకృతి ప్రభావముల మూట. సంప్రదాయామృత ప్రవాహపుతేట.

---

1. కోరితే ఏమైన వచ్చునా 2. దుముకదా 3. కోడె + ఉన్నది
4. కోడి + ఉన్నది 5. విత్తులు వేసి.

వ్యవసాయశ్రామికులు, వానలు బాగుగా కురియవలెననుచు పాడుకొను పాటలలో కీర్తింపబడ్డ వానదేవుని ప్రసక్తి అతిసనాతనమైనది. వేదవాఙ్మయములో ముఖ్యముగా ఋగ్వేదములో పెక్కు మంత్రములందు వానదేవునిస్తుతి కలదు తత్సంబంధ పురాగాథలను పరిశీలించినచో మానవుల మానసిక రీతుల చరిత్ర నర్థము చేసికొనవచ్చును. పురాగాథలపై టైలర్ అభిప్రాయమిట గమనార్హము 1.

వానల్లు కురవాలి వానదేవుడా – వరిచేలు పండాలి వానదేవుడా
నల్లాని మేఘాలు ,, సల్లంగ కురుశాలి
సేలన్ని నిండాలి ,, –మూనాలు యెదగాలి
యెన్నుల్లు వేయాలి ,, –పన్నాగ సేలన్ని
పంటల్లు పండాలి ,, –భాగ్యాలు నిండాలి ,,
పండుగలు సేత్తాము ,, –మావూరి సెరువయిన ,,
ముంచెత్తిపోవాలి ,, –కప్పలకు పెళ్ళిళ్ళు ,,
గొప్పగా సెయ్యాలి ,,

ఇట్టి పాటలు నాలుగైదు రకములుగా పాడుకొందురు: పాటలలో ప్రార్థించెడు విధానమంతయు ఋఙ్మంత్రములను తలపింపజేయును పంటలను గూర్చిన ప్రస్తావనలకు ఋగ్వేదమండలి ఋక్కులెన్నియో ప్రమాణము. ప్రకృతి యందంతట దైవ సాన్నిధ్యమును దర్శించుచు పొందెడు పల్లీయ అనుభవములకు ప్రమాణములను వేదములలో గనుగొనవచ్చును. జడదేవతలైన ద్యావాపరుణ ఉషసాది ఖగోళదేవతలను, ఇంద్రాది వాతావరణ సంబంధ దేవతలను, పృథివ్యాది భూదేవతలను గూర్చి సర్వప్రామాణిక మంత్రములను వేదములు చెప్పినవి. పశు పక్ష్యాదులందు మైత్రీభావము కల్పించినవి. పెక్కుసందర్భములందు వరుణాదిత్యుల ఔన్నత్యము కొనియాడబడినవి

1. The Myths shaped out of those endless analogies, between man and nature which are the Soul of all poetry, into those half-human stories still so full to us of unfading life and beauty, are masterpieces of an art belonging rather to the past than to the Present" Tylor:-Primitive Culture-Vol. I P. 317.

దేవతలకు మనుష్యులకేకాక సర్వప్రపంచమునకు వరుణుడేరాజు 1. ప్రకృతి ధర్మములకు వరుణుడు మహాప్రభువు. భూమ్యాకాశములతో గూడిన ప్రపంచ మండలమంతటను వ్యాపించియున్నాడు 2. ఋగ్వేదములో వరుణుడు మరియు మిత్రుడు నదీదేవతలుగా కూడ వర్ణింపబడినారు. వరుణుడు సర్వాంతర్యామి యని కీర్తింపబడినాడు. ఉషస్సు, సూర్యుడు, అగ్ని, వాయువు, వర్షము ఎల్లరకు తల్లిదండ్రులవంటివారని ఋగ్వేదమందలి పెక్కు మంత్రములందు చెప్పబడినది. ఈ నాటికిని పల్లీయులకిట్టి భక్తి కలదు.

,,ఇగనన్న దయ లేద జగమేలు తలివండ్రి వాన దేవా ఓ వాన దేవా,,

అనుచు తన్మయులై పాడుకొనుపాటయే మచ్చుతునక. వేదములందు గన్పట్టు మానసిక ప్రవృత్తి పల్లీయులలో గనుగొన వచ్చును. ఆ మంత్రములందలి మనః ప్రవృత్తినిగూర్చి భారతీయ తత్త్వశాస్త్రము సూత్రీకరించినది 3.

సకాలమునకు వానలు కురియనప్పుడు ఒక గోండ్రుకప్పను దెచ్చి, పసుపు పూసి, కుంకుమజల్లి, పసుపునందద్దిన గుడ్డలోబెట్టి, రోకలికి నడుమ గట్టి ఇరు ప్రక్కలను బట్టుకొని మోయుదురు. ఒక్కొక్కమారు రోకలికి మారు కాడిని కూడ ఉపయోగించెదరు.

---

1. ఋగ్వేదము:- 2-27-10, త్వం విశ్వేషాం వరుణాసి రాజాయేచ దేవా అసురయేచమర్తాః,శతంనోరాస్వశరదో విచక్షేశ్యామాయూంషి సుధితానిపూర్వా. ఋగ్వేదము:- 10-132-4, అసావన్యో అసురసూయత ద్యౌస్త్వం విశ్వేషాం వరుణాసిరాజా మూర్ధారథస్య చాకన్నైతావతైన సాంతకధ్రుక్.

2. ఋగ్వేదము:- 8-42-1, అస్తభ్నాద్ద్యామసురో విశ్వవేదా అమిమీత వరిమాణం పృథివ్యాః; ఆసీదద్విశ్వా భువనాని సమ్రాడ్విశ్వేత్తాని వరుణస్యవ్రతాని

3. ,ఆకాశమండలి సౌందర్యమును, భూమిపైగల యద్భుతములను వీలకించి ధ్యానించి, మంత్రశ్లోక రచనముచే దమ హృదయ భారమును దేలిక పరచుకొనిరి,- భారతీయతత్త్వశాస్త్రము:- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ(తెలుగుసేత-బులుసు వేంకటేశ్వరు) అధ్యా-2, పుట 80 (1వ సంపుటము)

,,కప్పమ్మ నీళ్ళాడే కాలమెండి పాయె-వానదేవా ఓ వానదేవా
ఇగనన్న గురిపించు జగమేలు తలిదండ్రి-వానదేవా ఓ వానదేవా,, ❀

సాధారణముగా స్త్రీలే యిట్టి యుత్సవమును చేయుదురు. బాలబాలికలుగూడ జట్టుగట్టి, కప్ప ఉత్సవము, గావింతురు. కప్ప కావడిని మోసికొని యింటింటికి తిరిగి గింజలు అడుగుకొని పరమాన్నము వండి వానదేవునకు నైవేద్యమిడు చుండుటయును గలదు. తెలుగుదేశమంతట ఈఆచారమున్నది. పర్జన్యునికిని మండూకములకును గల అవినాభావ సంబంధమును గూర్చి ఋగ్వేదములో సమన్వయము తెలుపబడినది. వర్షదేవుని స్తుతికి అంగముగా మండూక స్తుతి చేయబడినది పది ఋక్కులలో మండూకములనుగూర్చి మండూకసూక్తమను ప్రత్యేక సూక్తమే కలదు.

సంవత్సర పర్యంతము నైష్ఠిక వ్రతాచరణశీలురై వేదవాణిని ఉత్తమ రీతిని ప్రవచించు బ్రాహ్మణులతోను, సంవత్సరము పాటు మౌనవ్రతమున పడియుండి వర్షాగవనమున ఉచ్చైస్స్వరముతో బలుకు మండూకములను పోల్చిన సందర్భమును గమనించినచో తద్విశేష మవగతమగును. సరస్సునందు గ్రీష్మకాలములో ఎండిన చర్మ పాత్రలవలె పడియుండినట్టి మండూకములకు ఆకాశమునుండి జలమెప్పుడు భూమినిచేరవచ్చునో అప్పుడు బెకబెకారావములుచేయుటకు నోరువచ్చును 2. అనగా వానలు కురియునప్పుడు కప్పలు మేల్కొనునని, వాని బెకబెకారావములు వరుణదేవునకు స్వాగత గీతములవంటివని, అతనికి కప్ప వాహనము వంటిదని తలంపవచ్చును.

,,కప్పమ్మ గడప తొక్కినది శుభమన్న-సూచనలు చూచు చెప్పినటి
కప్పఎగిరె వానలమ్మా భూములో-కనకమే పండుతాయమ్మా,,

---

1. ఋగ్వేదము:- 7-6-103-1
సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రత చారిణః
వాచం పర్జన్య జిన్వితాం ప్రమండూకా అవాదిషుః 1

2. ఋగ్వేదము:- 7-6-103-2
దివ్యాఆపోఅభియదేనమాయన్ దృతిం నశుష్కం సరసీశయానం
గవా మహానను యుర్వత్సినీనాం మండూకానాంవగ్నురతాత్ర సమేతి

,,కప్పతల్లి పెళ్ళి వేడుక సూడరే - కావిళ్ళ నీళ్ళంపినాడూ
వరుణ దేవుడు పంపినాడూ - వాడలన్నీ నింపినాడూ,,

అని పల్లీయులు పాడుకొను మున్నుగు కప్పతల్లి పదాలలో పైభావములనూచాన ముగా పోషింప బడుచునేయున్నవి. వేదముల ప్రకారము పూజార్హములైన వృషభము, గోవు, మేక, శునకము, మండూకము, కోతి, పక్షి, సర్పము వంటి సమస్త భూతకోటి నేటికిని పల్లీయులకు పూజార్హములు. వేదములందలి భాషా తత్త్వము, భావన, అడుగడుగున అలంకార ప్రయోగము, ప్రకృతి పరిశీలనవంటి లక్షణములు పల్లెపదాలలోగూడ కన్పించును.

పల్లీయులు సూర్యచంద్రులను తలచని సమయముగాని, సన్నివేశము గానిలేదు. పెక్కుపదాలలో తన్నామసంకీర్తనము చేయబడినది.

తెల్ల తెల్లవారంగనూ స్వామి తన పక్షులూ పలుకంగనూ
పక్షులూ పలుకంగనూ స్వామి తన వృక్షలు కదులంగనూ
పొద్దువన్నె సూర్యుడు ఏచాయ నుండునూ - ఓ సూర్యనారాయణా
పొడుచుతా ఆ స్వామి పొన్న పువ్వుచాయ - ,,

.... .... .... ....

పండుకొని పోవయ్య పవళించి పోవయ్య ,,
పండుకొన పొద్దేది - పవళించ పొద్దేది ,,

ఇట్టి భక్తిపూరిత భావములు పల్లీయులకో కోకొల్లలు. వారుచేయు ప్రతి పనికి సూర్యభగవానుడే సాక్ష్యము. వారికేగాదు, సమస్త విశ్వమునకును అతడే కర్మసాక్షి నిత్యము సూర్యభగవానునితోడనే మేల్కొని, అతని తోడనే నిద్రించెడు మానవ మానసమునకు జన్మతః సూర్యోపాసన సహజమే. వేద ఋషులు సూర్యభగవానుని గొప్పగా స్తుతించినారు. ఋగ్వేదమందలి పది మంత్రములలో సూర్యుని వర్ణన కలదు. అనేక సందర్భములందు తత్ప్రస్తా వన కలదు. సకల జీవచైతన్యమునకును, సకల రోగనివారణమునకును అభ్యుదయమునకును అతడే కారణమని తెలుపుటయును గలదు.

ఈ సందర్భమున నొండు రెండు మంత్రములు గమనింప దగును1. అసలు యజుర్వేదోక్తమైన గాయత్రీ మంత్రము సూర్యునిగూర్చి సంబోధింపబడినదే.

> "ఏలియాలా ఏలియాలా ఏలియాలా
> ఐలేసా జోరుసెయ్యి ఐలేసా బారుసెయ్యి
> గంగమ్మ తల్లికి చెంగల్వ దండ - కాళిందికీ తెల్ల కల్వదండ
> జోర్సెయి బార్సెయి జోర్సెయి బార్సెయి
> గోదరి తల్లికి గొజ్జంగి పూదండ - సరస్వతికీ సన్నజాజి దండ
> కృష్ణవేణమ్మకు గేదంగి దండ .... .... .... .... ....
> పిల్ల కొల్లల్నంత సల్లంగ రక్షించి - ఇల్లు చేర్చండి ఓ తల్లులారా,,

అనుచు నదులమీద పడవలు నడుపువారు మరియు చేపల వేటకాండ్రు నదీమ తల్లిని స్మరించని క్షణముండదు. ఏలన, వారి జీవితమంతయు నదులమీదనే గదా. నదీదేవతల ప్రశంసకూడ ఋగ్వేదములో నున్నది. గంగా యమునా సరస్వతీ మొదలగు నదులు స్తుతింపబడినవి. వాని పవిత్రత కొనియాడబడినది జానపద సాహిత్యము వేదసాదృశ్యము, అపౌరుషేయము కావున జానపదులు వేదఋషులకు పరోక్షమైన వారసుల వంటివారు.

సాధారణముగా ఊరివెలుపలను, చేనిగట్టునను, బావుల వద్దను, పొలి మేరలందును గ్రామదేవతలు ప్రతిష్ఠితమైయుండును. చిన్నరాతి బండలచేత గుడియేర్పరచి, పసుపు కుంకుమలచేత అలదిన రాతి ప్రతిమనందుంచి, మొక్కులు చెల్లించుచు, ఉత్సవములుచేయుచు, కోరిన బలులిచ్చుచుందురు

---

1. ఋగ్వేదము:- 2-2-12-4.

ఋగ్వేదము:- 3-3-44-2, హర్యన్నుష సమర్చయః సూర్యం హర్యన్నరోచయః, విద్వాంశ్చికిత్వాన్ హర్యశ్వ వర్ధన ఇంద్ర విశ్వా అభి శ్రియః

ఋగ్వేదము:- 7-5-82-3,

అన్యపాంఖాన్యతృ న్త మోజసా సూర్యమైరయతం దివి ప్రభుమ్
ఇంద్రావరుణా మదే అస్యమాయి నో పిన్వతవ పితః పిన్వతం ధియః

పల్లీయుల మనసెంత నిరాడంబరమైయుండునో యట్లనే వారి దేవతా విగ్రహా ములు సహితము నిరలంకృతమై నిరాడంబరమైయొప్పును. నాగరకులు భోగ లాలసులై ఆడంబరులైయుందురు కనుక వారిదేవతా విగ్రహములుగాని, గుళ్ళుగాని వేషభూషోపపన్నమై కళాత్మకమై డాంబికత ఉట్టిపడునట్లలరారు చుండును. నాగరకునికంటె జానపదునికి అడుగడుగున దైవభీతి ప్రకృతి సిద్ధమైయున్నది. ఎట్టి ఆయాసము వచ్చినను ఆపదమూడినను ఆ దేవతలే శరణ్యము. ఉత్సవములప్పుడుగాని, బలులిచ్చునప్పుడుగాని, మరేదేనిలోపము జరిగినప్పుడుగాని గ్రామదేవత కొందరియందు ఆవేశింపగా (పూనగా) ఆ వ్యక్తిశివమెత్తి ,,నరుడ నరుడ నరుడోం ఒరి నరుడా,, అని హెచ్చరించు చుండ, పల్లీయులు ,ఏటితల్లీ-ఏటపరాదంచేశాం-ఎందోలేతల్లీ-ఈకోపమూ,, అని ప్రార్థించినప్పుడు ,కోకలిచ్చినావా నరుడా-కోరికె తీర్చినావా నరుడా- కోరికె తీర్చినావా నరుడా- కోళ్ళు కోసినావా నరుడా-గొర్రెలిచ్చినావా నరుడా అని యడుగుచు కోరికలు తీర్పించు కొనుచుండును. ఇట్టి సన్నివేశములలో జానపదుల మానసికతత్త్వము అద్దముపట్టినట్లు కనిపించును. వీరికి భయము నుండియే భక్తి యలవడినదని చెప్పవచ్చును. భక్తి, భయము సమపాళ్ళలో రంగరింపబడియుండును. ఇతర దేవతలెందరున్నను వారి మీద గ్రామదేవతల ప్రభావమే యెక్కువ వారిమనోవైఖరిని మార్చతరముగాదు. భయాత్మకమైన వారి మానసిక స్థితినిబట్టి కొన్ని దేవతావిగ్రహములకు భయంకరాకారమును గూడకల్పించుకొనుచుందురు. ప్రాక్తన మానవ మనస్తత్త్వ బీజములిప్పట్టున గర్భితములై యుండును. జానపదుల మనస్తత్త్వము వ్యక్తమైనంత తేటగా నాగరకుల మనస్తత్త్వము వ్యక్తముగాదు. దీనికి ప్రకృతి బాంధవ్యమే ప్రధాన కారణము. మొత్తముమీద పల్లీయుని మనస్తత్త్వమీ విధముగా వృత్తి, ప్రకృతి, పరిసరములు, దేవుడు, శృంగారము అనువానితో నెప్పుడును ముడివేసి కొనియుండును.

# కుటుంబ జీవనము

సమాజములో కుటుంబమే కీలకమైనది. సామాజిక శాస్త్రముల ప్రకారమది ప్రప్రథమ ప్రాథమిక సమూహము. దాని పరిమాణము చిన్నది. నిశ్చలమైనది. రక్తసంబంధము, శారీరకమైన దగ్గర సంబంధము, అన్యోన్యాశ్రయము, నిరంతర సంబంధములు, సమానోద్దేశములు మున్నగునవి కుటుంబ జీవన లక్షణములు. వ్యక్తి మొదట కుటుంబమునకే చెందియుండును. అదియాతని వ్యక్తిత్వమును తీర్చిదిద్దును. అనాది నుండి వ్యక్తుల వ్యక్తిత్వమును తీర్చిదిద్దుటలోను, వారిని సామాజికీకరించుటలోను ప్రముఖ పాత్రవహించుచు వచ్చినది. కుటుంబములో సరియైన సామాజికీకరణ పొందిన వ్యక్తియే సమాజములో నితరసామాజిక సంస్థలలో తన విధులను సరియైన విధముగా నిర్వహింప గలుగును.

భార్యాభర్తలు వారి బిడ్డలు కలిసి యుండు పద్ధతియే కుటుంబము. అది రూపొందుటకు స్త్రీ పురుషుల మధ్యగల స్థిరమైన దాంపత్య సంబంధమే మూలహేతువు

పోదాము తిరుణాల చినదాన_పొదిలి కొండకు మనము కరదాన
పెరుగు బువ్వాసద్ది పదిలంగ కట్టుకొని

నంబి కిష్టమ వనము నరవ గుండా పోతె
తుమ్మ ముల్లుంటాయి బొమ్మ జెముడుంటాది
స్తంబంబు పోయిన బాట గుండా పోతె
సరస మాడుకుంటు సరదాగ పోవచ్చు
కొండ మీదా రెండు కోనేరు లున్నాయి
కోనేర్లలో మనము కొసిరి తానంలాడి
కొంగు ముడేసుకొని కొబ్బరి కాయలను
నరసింహసామికి అర్పించి వత్తాము
ఈసారి తిరణాల నాటికీ మనకొక్క
కొడుకు పుట్టాడంటే కొండంత కప్పురం

నరసింహస్వామికి ఆరతిచ్చి వేగ
నిలువు దోపులు ఇచ్చి నిష్టతో వస్త్రాము

కేవలము లైంగిక వాంఛలతో జత కూడుటను దాంపత్యమనుట కన్న అన్యోన్యాను రాగములతో సంప్రదాయమును పాటించి సంతాన ప్రేమతో చక్కని మాతృత్వ పితృత్వ ధర్మములను నెరవేర్చెడు దాంపత్యమును ఆదర్శమనుట ఉచితము. దానివలన కుటుంబము స్థిరరూపము దాల్చును. పైపాటలో నిట్టి లక్షణములుగల జానపద దాంపత్యమును జానపద కుటుంబమునకు పునాదిగా స్వీకరింప వచ్చును. వివాహముతో దంపతులలో ననురాగము మొగ్గతొడిగి, సంతానముతో నది పుష్పించి, అనుబంధముగా రూపొందును. పుట్టిన బిడ్డకు సకలోపచారములుచేసి సంరక్షించు కొనుట సమస్త జీవులలోగల సృష్టిధర్మము. జానపదమాత—

పాదపట్టుకు మంచినూనె—కనుచెవి ముక్కుల కమ్మని నూనె
దెబ్బె సిబ్బెముల గబ్బున నూనె—ఎడపెడ తొడలకు మడిగెలనూనె
రొమ్ముదిమ్మెనెల రొక్కుంనూనె—రంధ్రం పట్టుల రాసిన నూనె
తలపొర యంటుల గిద్దెడునూనె—కందున పూసిన గాసుగనూనె
సన్నసలుగుతో సాదిన నూనె—పచ్చ పసుపుతో వండిన నూనె
గోరువెచ్చని నీరున నూనె—కుంకుడు నురగున గ్రుక్కిన నూనె

.... .... .... .... .... ....

నీరాజన నిత్యస్నానం—తీర్చి చేకుపన దిద్దికుమారం,,

నిత్యము బిడ్డయొక్క పాదపట్టునను, కనుగొలకులలోను, చెవి ముక్కు రంధ్రములలోను మంచినూనె యంటించి ఇతరావయవముల నన్నింటినిగూడ నూనెతో చక్కగా మర్దించి, చేపదేరునట్లుచేసి, గోరువెచ్చని నీటితో స్నానము చేయించి తొట్టెలో పరుండబెట్టి "మంచి గంధం మాచికాయ—ఊదొత్తు ఉమ్మకాయ కప్పురంబు కచ్చోరంబు—గుగ్గిలమ్ము కుందలమ్ము కస్తూరికా గైరికమ్ము—సన్న వేరు సాంబరాణి—గంధ ధూపములు గండాదీపం — హారతిహోమం అగ్నిధూమములు— దేవల సత్తువ దివికే జోతల—పురిటి సుద్దికే పున్నెము జోతల"—గంటెలో నిప్పులుగొని తొట్టెల క్రింద చేర్చి దానిలో మంచిగంధము, మాచికాయ, కప్పురము, గుగ్గిలము,

కస్తూరి, సాంబ్రాణి, మున్నగు వాని చూర్ణమును వేయును. అందుండి మెల్లగా పొగలు గ్రమ్ముకొనును. ఆపొగలు బిడ్డకు ఆరోగ్య దాయకములై హోమధూపము లను తత్ప్రయోజనములను దలపింపజేయును. అనగా తల్లితన బిడ్డ ఆరోగ్యమును దేవతల దీవనలను ఆశించు చుండునని భావము. జానపద మాత పసిబిడ్డ నుయ్యాలలో బెట్టి యూపుచు " జోలల్లు పాడితే బాలలకు నిద్ర — నాగస్వరము పట్టితే నాగులకు నిద్ర,, అనుచు జోల పాడుచు, " లాలి లాలీ లాలి లాలమ్మ లాలీ—లాలమ్మ గుర్రాలు లంకల్లమేసూ—అబ్బాయి గుర్రాలు అడవుల్లమేసూ—చిన్నమా అబ్బాయి సిరిమొగము సూసీ—సిగ్గుపడు చంద్రన్న పొడవగా జడుసూ,, అనుచు లాలించుచు, ఏడ్చినచో నెత్తుకొని "ఏడవకు ఏడవకు వెఱ్ఱి అబ్బాయి—ఏడిస్తె నీకళ్ల నీలాలుకారు నీలాలు కారితే నేజూడలేను— పాలైన కారవే బంగారు కళ్లు,, అని బుజ్జగించుచు, ఇంకను ఊరకుండనిచో "ఊపిరి పట్టక సుండన్న—యుక్కట మిందిన చక్కన్న— తల్లిపాలురా తనుపన్న—రొమ్ము కుడుపుము రోయన్న,, అనుచు రొమ్ము గుడిపి ఒడిలోనే జోకొట్టుచు "నిద్రపో నాబాబు నిద్రపో నాన్న—నిద్రలకు నూరేళ్ల—నీకు నూరేళ్లు— నిద్రపో బలభద్ర రాజకుమార — నినుగన్న తండ్రికి నిండ నూరేళ్లు,, అని పాడి నిద్రబుచ్చుచు తనభర్త, బిడ్డ చల్లగ నూరేండ్లు బ్రతుక వలెననియేగాక "కొండంత దేవునికి మేడంత పత్రి — బ్రహ్మంత ఆయుష్షు నీకు నాబాబు,, అనుచు నాతల్లి ఆశించుట కన్నని యనుబంధము గాక మరేమి యగును? శిశుపోషణలో నిట్లన్యోన్యాను రాగాను బంధములు పెరిగి కుటుంబ జీవన పద్ధతి ఏర్పడి సామాజిక జీవనారంభము స్థిరీకరింపబడు చుండును. సమాజ నిర్మాణమునకట్టి కుటుంబమే పునాది.

## కుటుంబము: సంప్రదాయ సంరక్షణ - వ్యక్తిత్వ నిర్మాణము సామాజికీకరణము.

తరతరములనుండి సంక్రమించెడు మంచి చెడ్డల సత్ఫలితమును సంప్రదాయ మని స్థూలముగా చెప్పుకొనవచ్చును. దానిలో మంచి ఆచారములు, కట్టుబాట్లు, విశ్వాసము లుండును. మంచిని తోడుచేసికొన్నప్పుడే యవియన్ని సత్సంప్రదాయ బద్ధములగుచున్నవి. సంప్రదాయ మేర్పడు విధమును గూర్చి భగవద్గీత యిట్లు చెప్పుచున్నది,

" యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే'' 1

(శ్రేష్ఠుడు లేదా ఉత్తముడే కర్మనుఆచరించుచుండునో దానినే మిగిలిన వారాచరించుచుందురు. దేనినాతడు ప్రమాణముగా గ్రహించుచుండునో దానినే మిగిలిన వారంత అనుసరించుచుందురు.) అదియే సంప్రదాయమగుచుండును. సత్సంప్రదాయమునకు చావులేదు. అది హృదయమును శుభ్రపరచి మనల నున్నత స్థాయికి నందించునని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు వచించినాడు. 2

ఊటలేనిది జలాశయము లేదుకదా. అటులనే సంప్రదాయము లేనిది సమాజ జీవనముకూడ లేదు. పాత మరియు క్రొత్త నీటితో కలిసి సాగు గంగా ప్రవాహము వలె, గతములోని మంచిని ప్రస్తుతములోని మంచితోముడివైచుకొని సామాజిక జీవనము సాగినప్పుడే ఆ సమాజము వర్ధిల్లును. పూర్తిగా గతమేయని పూర్తిగా వర్తమానమే యని బిగ్గరగ పట్టుకొనుట మంచిది కాదు. ఆ రెంటింటియొక్క చక్కని మేళవింపే ఆచరణీయము. సత్సంప్రదాయమును బట్టి వ్యక్తికి ని. కుటుంబమునకు గాని, సమాజమునకు గాని మంచిపేరు వచ్చుచుండును. మనది వైదిక జీవన సంప్రదాయము. వివిధ జీవితావస్థలలో నది స్ఫూర్తిదాయకమైనది. దానినెంత రక్తమున రంగరించుకొన్నచో వ్యక్తి అంత వికాసము పొంది సజ్జనుడగుచున్నాడు. ఈనాడు జానపదులలో వైదిక సంప్రదాయము చెక్కుచెదరక నిలిచియున్న దనుట కెన్నియో నిదర్శనములు గన్పట్టును. నిరక్షరాస్యత అధికముగా నున్నను ఆ సమాజములో కుటుంబము యొక్క పాత్ర విశిష్టముగా నుండును.

పిల్లలను తీర్చిదిద్దుటలో తండ్రి కంటె దల్లి బాధ్యత యెక్కువ. చనుగుడుపు నుండి చంకబలమబ్బువరకు పిల్లలు తల్లి కంటిలోనే నేతివత్తులు వెలిగించుకొనుచుందురు. తల్లియేగదా వారికి తొలిదైవము, తొలి గురువు. సంప్రదాయము, ధార్మిక శిక్షణ మొట్టమొదట ఆమె నుండియే అలవడును. చంకలు గొట్టుచు చనుబాలనెంత జీర్ణింపజేసికొని లేగదూడవలెనగునో అట్లు సంప్రదాయామును నరగించుకొన్న బిడ్డ సానబట్టినవజ్రమగును. సామాజిక జీవన సౌధనిర్మాణమునకు మూలశిలయగును. ఆమె వలన బిడ్డ పొందు వ్యక్తిత్వ నిర్మాణమును, సామాజికీకరణమును వఠకింతము.

1. భగవద్గీత:– అధ్యా. 3 శ్లో. 21
2. A living tradition influences our inner faculties, humanizes our nature and lifts us to a higher level.-Hindu view of life P. 18.

మన దైనందిన జీవితము తొలుత దైవప్రార్థనతో నారంభమగును. అనగా భగవద్ధ్యానమే జీవుని యొక్క తొలి కర్తవ్యము. జీవమిచ్చిన శక్తికి నివాళి యెత్తుట ప్రధాన ధర్మము. అది వైదిక ఋషులనుండి వచ్చుచున్న సత్సంప్రదాయము. అసలు తొలివేదమైన ఋగ్వేదారంభములోనే అగ్నిదేవుడు ప్రార్థింపబడినాడు. పల్లెటూరి తల్లి తనయునకు ఉగ్గుపాలతో దైవభక్తిని నూరిపోయుచుండును. ఇట గణపతిని ప్రార్థింపజేయుచు ప్రకృతిని పరిచయము చేసినది.

"వెనకా వెనకా వేములతోట_కనకా పండ్లూ కాముని రూపులు
వాగూనీళ్ళూ వనముల పత్రి_మెత్తని కాళ్ళూ మేచక శంకులు
దూవీమడుగులు దుప్పటిరేకులు_ తెల్లని గుల్లో నల్లని వినాయకా

నాలుగు చేతులా నమస్కారమయా"_ వినాయకస్తవము చేయుటలోని ప్రత్యేకత నందరు గుర్తించియే యున్నారు. పై పాటలో తల్లి తన బిడ్డకు వేపచెట్లు (వేములతోట). నానిపండ్లు కనకా (కనకమువంటి) పండ్లు, కాముని రూపులు అనుటతో గ్రీష్మఋతువును, 'వాగూనీళ్ళూ వనముల పత్రి_మెత్తని కాళ్ళూ మేచక శంకులు' అనుటతో వర్షఋతువును; 'దూవీమడుగులు దుప్పటిరేకులు_తెల్లని గుళ్ళు' అనుటతో శరదృతువును పరిచయము చేయుచు ప్రకృతిని వర్ణించినది. "శరదృతువే దేవునికి కట్టని పెట్టని దేవాలయం. భాద్రపదమాసం వర్షాకాలానికి మధ్యమం. ఈ కాలంలో పండే నల్లని నేరేడు పళ్ల రాసులూ ,నల్లని మేఘముల గుంపులతో విరాజిల్లు ప్రకృతి మూర్తియే వినాయకుడు. ఈయనయే కాలమూర్తి. తెల్లని గుళ్ళో నల్లని వినాయకునికి, అంటూ తల్లి ప్రకృతిని, కాలమూర్తిని వర్ణించుతూ బిడ్డలకు ప్రబోధంచేస్తుంది" 1. ఈ యర్థము వేదార్థమునకు సమీపమైనది. వేదము ప్రకారము గణపతి యనగా పరబ్రహ్మ. కాని పార్వతి తనయుడైన గణపతి యనికాదు. తల్లి తన చేతులతో పసిపాప చేతులను బట్టుకొని మోడ్చి బొజ్జ వెంకయ్యకు నాలుగు చేతుల నమస్కారమనిపించుచు ధార్మిక శిక్షణ గరపును. వైదిక యుగమున పూజా విధానములలో స్తోత్ర పఠనములు నమస్కార రూపములే. 'నాలుగుచేతులు' అనుటతో నాలుగు ముఖముల బ్రహ్మ, నాలుగు వేదములు అను నర్థములు స్ఫురించు. సాంప్రదాయక విజ్ఞానము నిక్షిప్తమైనదని ఊహింపనగును. చేతుల జోడింపు వలన ఏకోన్ముఖమైన మనోవాక్కాయకర్మలను ప్రబోధించు విధానము వ్యక్తము.

1. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి_నేదునూరి గంగాధరం_పు. 93

సంజదీవికి, గుడి దీపమునకు, మంగళహారతికి, రామారతులకు, బాలదృష్టికి, వేగివెల్లునకు (ఉదయకిరణ సమూహమునకు), గురుస్వాములకు, దేవునికి ,,జేజే'' లు పలికించుచు నగ్నిసుర్యాది వైదిక దేవతా స్తోత్రములను దలపింపజేయుచు

సంజదీవికి చక్కని జేజే—గుడిదీపానికి గుప్పెడు జేజే

.... .... .... .... .... ....

మంగళహారతికి మక్కువ జేజే—రామారతులకు రంగుగ జేజే

బాలదృష్టికి పాళము జేజే—వేగివెల్లునకు సాగిలి జేజే

గురుస్వాములకు గుర్తుగ జేజే—చిట్టి పాపల చిరుహస్తాల

దేవుని కెత్తాలి దీవన జోత—పలురకములైన వాని మీదికి భక్తి వినయము లను బోనిచ్చుచు నా భక్తి పారవశ్యమున బిడ్డను చేతుల మీదికి దీసికొని యింతుక పైకి లేపనెత్తి యూపుచు, చిందులు ద్రొక్కుచు—

శ్రీరామ రాముడోయి రామభజన—రామన్న రాముడోయి రామభజన

అయోధ్య రాముడోయి రామభజన—కోదండరాముడోయి రామభజన

భద్రాద్రి రాముడోయి రామభజన—పట్టాభిరాముడోయి రామభజన

గోవింద రాముడోయి రామభజన—గోపాల రాముడోయి రామభజన

శ్రీరామ భజన చేయుచు బిడ్డ యందా రాముని దర్శించెడు తల్లి హృదయ మెంతటి సంప్రదాయామృత కలశమో తెలియదగును. అంతేగాదు, రాముడన్నను, గోవిందు డన్నను, గోపాలుడన్నను ఒక్కడే యన్న సత్యమును గూడ అందించును.

ఆడుబిడ్డ పుట్టినచో తల్లి త్రిమూర్తుల భార్యలైన సరస్వతిగానో, లక్ష్మిగానో, గౌరిగానో భావించి;

కాత్యాయనీ దేవి కరుణించె మమ్ము—ఒడినిండె హోస్నలా ఒయ్యారిబొమ్మ

పట్టినా నోములూ పండి వచ్చాయీ—చేసిన వ్రతములూ సిద్ధించినాయీ

శ్రీగౌరీదేవి మా చింతలు దీర్ప—అమ్మాయి రూపున అవతారమెత్తె

నిత్యకల్యాణమ్మ పచ్చ తోరణము—పాపాయి పూసులే పండుగలు మాకు"

అని మురిసి పోవుచు పూజలు, నోములు, పండుగలు అను వానిని పిన్ననాటనే పరిచయము చేయును. వివాహము దలపెట్టుట తల్లి దండ్రుల కొక సమస్య. మిక్కిలి వ్యయ ప్రయాసములతో గూడుకొన్నట్టిది. అందును, తగిన వరుని వెదకుట మరింత కష్టము. దొరకినచో కట్నములు, కానుకలు చెల్లించు కొనవలసి యుండును గదా. కనుకనే ఆడుబిడ్డ పుట్టగనే సహజముగా మాతృత్వముట్టిపడి తల్లి మురిసిపోయినను భవిష్యద్విషయములను దలపోయక మానదు,

ఎక్కడున్నావోయి వెర్రి శంకరుడ—'ఉంగాయి' నీ కొరకు దెంగతో వుంది

పాలేన తాగివదూ పరగి పట్టెంది—జోలపాటలు వింటు సోలబోదింత

ఆలించరావోయి పాలించ రమ్మ—ఆలించి పాలించి ఆదరించేవ

అమ్మాయి నిచ్చేము అల్లుడా నీకు—కాదనక చేపట్టి కనికరించాలి

కన్నెల నవ్వులే కట్నాలు నీకు—లల్లమ్మ చూపులే లాంఛనాలన్ని

చిట్టెమ్మ పలుకులే పట్టు వస్త్రాలు—పిల్లనే పదివేలు పెట్టుపోతల్లు

చుట్ట పక్కాలతో శుభలగ్నమందు—తరలిరాగదవయ్య పరమేశ్వరుండ

పెళ్లి పనులూ బాగ తలపెట్టినాము—మాట తిరుగుటలేదు మనువు నిశ్చయము

గౌరమ్మకు తగిన భర్త శంకరుడని, ఆ శంకరునే యల్లునిగా దలపోయుట హైందవ మాత ఆదర్శము. ఇట్లు తలంచినచో కట్నములు, లాంఛనములవసరముండదు. అనురాగము, భక్తి దాంపత్యమునకు మూల ధర్మమని, పార్వతీ పరమేశ్వరులనే యాదర్శముగా గొని తల్లి యొడినుండి ప్రియుని యొడికి చేర్చునంతవరకట్టి యాదర్శములను రంగరించి పోయుచుండును. "లాలి బంగరుబొమ్మ లాలి మా యమ్మ—లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మ" అని భావించి సీతమ్మ పాతివ్రత్యమును బిడ్డకు ప్రసాదించును. తప్పటడుగులు వేయుచు పడుచు లేచుచుండిన ప్రాయములోని బిడ్డ చేతులను ముద్దాడుచు; "చిన్నారి పొన్నారి గాజుల శెట్టి—తేవె మా అమ్మాయికి తేనె గాజుల్లు, నవ్వుతూ తొడిగిస్తు నల్ల గాజుల్లు—పాడుతూ తొడిగిస్తు పచ్చ గాజుల్లు ఏడేరి తొడిగిస్తు ఎర్ర గాజుల్లు—నిలుచుని తొడిగిస్తు నీలి గాజుల్లు"—అనుచు రంగు రంగుల గాజులు తొడిగించి అతివ యొక్క అలంకార లక్షణమును తీర్చిదిద్ది ఐదువ

తనమునకు తొలిముద్రవేయుచుండును. "కన్నతల్లి నీవు కాటుక పెట్టించుకోవే—
వాళ్ల అమ్మాయి చూడు నినుచూసి నవ్వుతోంది" అనుచు సమాజములోని యితరులను
జూపి నేర్చుకొనదగిన విషయమును మనసున కెక్కునట్లుచేసి బిడ్డ యొక్క
మానసిక తృప్తిని గ్రహించి కాటుక దిద్దుచు "కాటుక పెట్టిన కన్ను అన్నారు—లేత
మామిడి చిగురు అన్నారు" అనుచు ముద్దులందుకొని 'ఆట మాణిక్యమే పాట
మాణిక్యమే—మా యింటి అమ్మాయి మంచి మాణిక్యమే—నట్టింట అమ్మాయి
రత్నమాణిక్యమే" యని ఆటలతో పాటలతో లాలించుట ఆ బిడ్డ శారీరక మానసిక
వికాసమునకందలము పట్టినట్లుండును. ఇంచుక అల్లరి పెట్టినచో; "చింతాకు
చిగురాకు ఏడవున్నాది— చింతమ్మ తోటలో శాన వున్నాది- అబ్బబ్బ దనిలో బూచి
వున్నాది—బూచికి నాచేత మందు వున్నాది- మందూకు నాచేత మంత్రమున్నాది—
మంత్రానికీ మావిపండున్నాది- పండ్లన్ని అమ్మాయి నోట వున్నాయి—సారి గిలగిల
చక్కిలి గిలగిల" అనుచు చక్కిలి గింతలు పెట్టి అదరు బెదరున గాక హాయి
నగవులతో భూతముల మీద, మంత్రముల మీద, నమ్మకముల మీద విశ్వాసమును
పాదుకొల్పు చుండును.

హైందవులది ఆధ్యాత్మిక జీవనముతో ధార్మిక శక్తిని యలవరచుకొను
పద్ధతి కాబట్టి హైందవ మాతలలో ముఖ్యముగా జానపద మాతలలో నెట్లు వైదిక
సంప్రదాయ జ్ఞాన మిమిడి యుండునో మచ్చునకిది పరిశీలించిన తెలియగలదు-

లాలి చిద్రూపుడా లాలి చైతన్యా—లాలి స్వప్రకాశా లాలి పరమాత్మ
ఓంకార మనియెడు ఒక తొట్టిలోను—తత్త్వమనియెడు చలువ పొత్తిళ్లు బరచి
ఎరుకగల పాపన్ని ఏర్పాటుజేసి—యేడు జగములవారు ఏకమై వూచా

అని జోలపాటలో బిడ్డకు పరతత్త్వమును, దానిని సిద్ధించుకొను మార్గము
నుపదేశించుచు "అంగరక్ష ఆదిరక్ష దివ్యరక్ష జీవరక్ష—చిన్నినా అబ్బాయికి
శ్రీరంగ రక్ష" అనుచు లౌకిక మాయను (దృష్టి దోషమును) దిగదుడిచి జీవాత్మకు
పరమాత్మయే తోడునీడ యనెడు సత్యము నందించుచు భగవంతుని యొక్క
విశిష్ట నామమైన "ఓమ్" ను స్మరింప జేసెడు తల్లి సంస్కారములో బిడ్డలు రత్న
మాణిక్యములు గాక మరేమి యగుదురు! సమస్త వేదాది శాస్త్రములలో సర్వత్ర
సర్వేశ్వరుని యొక్క విశిష్టనామము 'ఓమ్' అనియు సర్వము ఓంకారమయమనియు
నుడువబడినది. అట్టి నామము లాలి పాటలో చక్కగా కుదురుకొన్నది. అంత

లోతైన విషయముల నాతల్లి యెఱుగ కున్నను, అనుశ్రుతముగా వానిని పట్టు కొనుచు వచ్చుచుండును.

కుటుంబమున తల్లిదండ్రులు బిడ్డలను కంటికి రెప్పవలె కాపాడుచు భగవంతుని మీద భారము పెట్టుకొందురు. తల్లిగాని తండ్రిగాని వెల్లకిల పరుండి కాళ్లపైన బిడ్డను వేసికొని కాస్త కాళ్లు పైకిని క్రిందకినూపుచు 'ఉయ్యాలోయ్ జంపాలోయ్—కొత్తకొండోయ్, కొమిరెల్లోయ్—ఐలేనోయ్ మల్లన్నోయ్—అల్లల్లల్లల్లా" "ఊగూ వూగూ బసవన్న—ఉలవలు తిసరా బసవన్న—అంకాలమ్మ గుడి వద్ద—గంతులు వేయరా బసవన్న", అని పాడెడు పదాల ద్వారా కొత్తకొండ 1, కొమిరెల్లి 2, ఐలోని 3, అంకాలమ్మ గుడి వంటి పుణ్యస్థలముల పేర్లు గూడ తెలియజేయుటలోని యాసక్తి అపూర్వము. ఉగ్గు పట్టించునప్పుడు మ్రింగక పోయినచో "ఊఊ ఉంగన్న బుంగలు పెట్టక గ్రుక్కన్న—ఓర్వని సవతుల దిష్టన్న—ఒప్పుగ మసలరా బుస్సన్న" అనుచు దృష్టిదోషము మీదకూడ విశ్వాసమును వదిలపరచును.

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం—గుర్రం తిన్న గుగ్గిళ్లు జీర్ణమై
ఏనుగు తిన్న వెలక్కాయ జీర్ణమై—భీముడు తిన్న పిండివంట జీర్ణమై
అర్జునుడు తిన్న అప్పాలు జీర్ణమై—అబ్బాయి తిన్నపాలు ఉగ్గు జీర్ణమై
కుందిలాగ కూర్చొని నందిలాగ ప్రాకి—లేడిలాగ లేచి తాంబేలు లాగ నడవాలి",

అగస్త్యుని పొట్టలో వాతాపి, భీముని పొట్టలో పిండి వంటలు జీర్ణమైనట్లు బిడ్డ తినే పాలు, ఉగ్గు కూడ జీర్ణమైపోయి నందివలె బలిసి, లేడివలె చురుకుదనము గలిగి, తాబేటి నడక నడవవలెనని తల్లి కోరుకొనుటలో సాంప్రదాయక విజ్ఞాన బీజములు నాటబడినవి. అంతేగాక, బిడ్డల పెంపకములోని ప్రతి సన్నివేశ

1, 2, కరీంనగర మండలములో గలవు.

3. ఓరుగలు మండలములో గలదు.

సందర్భములందు రామాయణ భారతాది కథలు పాటల రూపమున అందించుచు మన సంప్రదాయ ధర్మమును కాపాడుటలో తల్లి పాత్ర సర్వతోముఖమైనది. దినదిన ప్రవర్ధమాన మగుచుండిన పాపనుజూచి,

,,ముదురుగ పాపడు గుమ్మడికాయ— విరిసిన పాపడు విఘ్నేశాయ
చెలగిన పాపడు శ్రీకృష్ణాయ—అందెల పాపడు ఆంజనేయాయ
బొజ్జన్న పాపడు పూర్ణబ్రహ్మాయ—ఆడిన పాపడు ఆనందాయ" అని మనసార మురియుచు బిడ్డను పూర్ణబ్రహ్మ పదార్థముగా భావించుట తల్లి యెంతటి తాత్త్వికురాలో వేరుగా చెప్పవలెనా!

అల్లుడుగాని, బంధువులు గాని వత్తురన్నను, లేక వచ్చినను "ఇల్లలికి ముగ్గెట్టి—అకేసి పీటేసి—పప్పెట్టి బువ్వెట్టి—పాలోసి పెరుగోసి (అత్తారింటికి తొవ్వేదంటే—కితకిత కితకిత- కిలకిల కిలకిల)" చేసెడు మన మర్యాదను బిడ్డకు ప్రయత్నముగా నేర్పును.

"మాపాప మామల్లు మత్స్యావతారం......................నట్టింట నాయత్త నరసింహావతారం" అనుచు కుటుంబములోని యితరులతో తనకు గల సంబంధ లక్షణములను వ్యక్తపరచుట చేత మున్ముందు బిడ్డకు గూడ అట్టి వైఖరియే యేర్పడుచుండును. కాని "చిట్టి నా కన్నోడు శ్రీకృష్ణావతారం" అనుచు కుమారుని మానసిక వికాసమునకు తల్లి దోహద మగుట లెస్స. అట్టి పరిపూర్ణ మాతృత్వము జానపద మాతలో మూర్తీభవించినట్లుండును. "అరటిపళ్లు కొబ్బరికాయ అమ్మవారికి—చేతిలోని చెల్లని కాని పూజారికి" అని పండ్లు, కొబ్బరికాయ దైవమున కర్పించు ఆచారమును దెలుపును. కుటుంబము చిన్నప్పటినుండి వ్యక్తుల కోరికలను దీర్చుచుండును. "చెయి పూచమ్మా చెయి పూచు—సంతకు పోతా శనగలు తెస్తా చల్లగ తింటాం మిఠాయి తెస్తాం. . . . . . . . . .తేరుని చూస్తాం తిరిగివస్తాం—కమ్మలు తీస్తాం చెవిలో వేస్తాం"
"చందమామరావే జాబిల్లిరావే—కొండెక్కిరావే కోటిపేలు తేవే. . . . . . . . . , బండిమీదరావే బంతిపూలుతేవే పైడిగిన్నెలోన పాలుపెరుగు తేవే—అన్నింటిని

దెచ్చి అబ్బాయికీవే—"*ఇంతేగాక "వీధిసెందరు ఉన్న విసరదే గాలి—పచ్చసెందరు ఉన్న రాదమ్మ గాలి - నా చిన్ని అబ్బాయి వీధి నిలుచుండ—మొగలి పువ్వుల గాలి ముత్యాలవాన, అనుచు తల్లి తన బిడ్డను ఆత్మాభిమానమున ముంచెత్తుచుండుట అమోఘము. తల్లి చేసెడు వ్రతములు, నోములు మున్నగు వానిలో ఎదిగిన బాలికలు పాల్గొని ఆమె ననుకరించుచు నాచారముల నభ్యసింతురు. ప్రతిమాటకుగాని, ప్రతిపనికిగాని కుటుంబమున బిడ్డలు తల్లినే ముందాదర్శముగా గొనుట సహజము. ఆమె చలువలో భావి మూల్యములను గుర్తించి "కన్నతల్లిని బోలు చుట్టాలులేరు—పట్టు చీరను బోలు చీరల్లు లేవు—వేదములను బోలు చదువుల్లులేవు" అను సిద్ధాంతము నేర్పరచు కొనుటలో విశేషమేమున్నది! వేదములే యఖిల ధర్మములకు మూలమని మనుస్మృతి వచించిన సత్యము జానపదులలో "వేదములను బోలు చదువుల్లు లేవు" అను విశ్వాసమును బ్రతికించి యుండును. నీతిననుసరించి ఋజువర్తనముతో న్యాయమును పాటించుటయే ధర్మమని చెప్పుకొనుట జరుగును. బిడ్డల శీల నిర్మాణమున కట్టి సమాజసంబంధమైన సంప్రదాయామృత బిందువులు, కుటుంబ పరిసరములు పునాది. వీనితో వ్యక్తిత్వము వికాసము పొందును. ఇట్లు సామాజిక సంప్రదాయములు మరియు కట్టుబాటుల ప్రకారము వ్యక్తి ప్రవర్తింప నేర్చుకొను ప్రక్రియను సామాజికీకరణమందురు. వ్యక్తి యొక్క సామాజికీకరణమునకు కుటుంబము యొక్క తోడ్పాటు ముఖ్యమైనది.

"ఆటలుముద్దు పాటలుముద్దు—ఆలాపించిన హరికథ ముద్దు
వేషముముద్దు భాషలు ముద్దు—దైవత గురువుల దండం ముద్దు
సదువులు ముద్దు సౌఖ్యము ముద్దు—సాటివారిలో సాగిన ముద్దు
అందం చందం అందరి ముద్దు—పొత్తుల ముద్దు పోల్తుల ముద్దు
భక్తి శ్రద్ధలు పరువ ముద్దు—సత్యము ముద్దు శౌచము ముద్దు
దానధర్మములు ఒక్కిన ముద్దు—పూజలు ముద్దు పునస్కారము ముద్దు
పూజసేయ పుక్కటము ముద్దు—ఆలన ముద్దు పాలన ముద్దు

అమ్మలయ్యల కడుగిన ముద్దు—పాడి ముద్దు పంటలు ముద్దు
అల్లన ముట్టిన మెల్లన ముద్దు—ఇల్లు ముద్దు ఇల్లాలు ముద్దు
ముట్టినుల ముక్కారుల ముద్దు—ముద్దుపాప ముల్లోకము ముద్దు' ఈ

పాటలో తల్లి సంస్కృతీ సంప్రదాయములను, ఆచారములను, ఎవరిపట్ల ఎట్లు మెలగదగు కట్టుబాట్లను దెలిపి బిడ్డనట్లు ప్రవర్తింప జేయుటయే సామాజికీ కరణము. ఈ పునాది మీద బిడ్డ పెరిగి పెద్దవాడైన కొలది వ్యక్తిత్వము నిర్మాణ మగుచుండును. ఈ దశయందే కుటుంబములో వ్యక్తికి సమాజమును గూర్చిన జ్ఞానముబ్బుచుండును.

## కుటుంబము—వినోదములు

ప్రప్రథమమున సంప్రదాయముతో బాటు సంస్కృతిని చవిచూపునది కుటుంబమే—ముఖ్యముగా పల్లె కుటుంబమే. ఒకతరము నుండి యింకొకతరము నకు సామాజిక వారసత్వమందించుటలో పల్లె కుటుంబమే మిక్కిలి ప్రభావము గలది. వ్యక్తి నిర్మాణమునకట్టి కుటుంబములోగల ఇతర వ్యక్తులచేత తగిన చేయూత వివిధ దశలలో లభించుచుండును. పిల్లలయొక్క శారీరక వికాసమునకు కుటుంబములో ఆటపాటలతో గూడిన వినోదములెన్నియో కలవు. మన సంస్కృతిష్టములైన దాగుడుమూతలు, గుడుగుడుగుంచం, అప్పాలో చెప్పాలో, తిరుగు తిరుగు జల్లెడ, వానావానా వల్లప్ప, స్తంభాలాట వంటి ఆటలన్ని యింటి పట్టున నాడదగినవి. వీనిలో బాలబాలికలందరు పాల్గొందురు. కుటుంబములోని పెద్దలు (తల్లి లేక అక్క మొ॥) గూడ కొన్నింట వారితోగలిసి యాడుచుందురు. అప్పుడప్పుడిరుగు పొరుగు కుటుంబములోని పిల్లలుగూడవచ్చి పాల్గొనుటయును జరుగును.

**దాగుడుమూతలు:-** తల్లి, అక్క, అత్త, అవ్వ మొదలగు వారిలో నెవరేని ఒక్కరు తీరిక వేళలలో కుటుంబములోని పిల్లలనొక్కచోటజేర్చి చిన్న నియమమునుబెట్టి అందులో నొక్కరిని దొంగగా నెన్నుకొని తాను గూర్చుండి

ఆ పిల్ల కన్నులకు తన అరచేతులను గప్పి "దాగిల్లో మూగిల్లో దండావార్ కోయిల్లో—పిల్లీ వచ్చే ఎలుకా భద్రం—ఎక్కడి దొంగా అక్కడనే గప్‌చిప్"* అని పాడుచుండగా మిగిలిన వారంత తలుపు చాటుననో, గుమ్మి దాపుననో, గోడమూలననో దాగు కొందురు. పాటపాడి విడిచిపెట్ట బడిన తర్వాత ఆ దొంగ దాగుకొన్న వారి నెవ్వరినైన ఒక్కరిని ముట్టుకొనుటకు ప్రయత్నించుచుండగా ఆ దాగుకొన్నవారు దొంగకు చిక్కకుండ పరుగెత్తుకొని వచ్చి దాగుడు మూతలు మూసి నామెను తాకుదురు. అట్లు తాకలేనట్టి పిల్లను దొంగ ముట్టు కొన్నచోనది దొంగగా గణింపబడును. అట్లే ఈ పిల్ల దాగుడుమూతలు మూయించుకొనుచుండ పూర్వపు దొంగ, దాగుకొనెడు మూకలో చేరిపోవుట యొప్పును. ఇట్లే తిరిగి తిరిగి తీరిక ఉన్నంతవరకాడుదురు. దీనిని 'సునిమీలితికము' అందురని వాత్స్యాయనుడు పేర్కొనెను 1. సాధారణముగా తల్లియే దాగుడు మూతలు మూయుచు నాడించును. ఆట మధ్యలో మొండికెత్తిన వారిని "గుగ్గూగూ గూనసింత—సిప్పదెచ్చుకో సీమిదేస్త" అనిగాని "సగమాటలో పోయినది సాకిలి వాని పెండ్లము—మధ్య ఆటలో పోయినది మంగలోని పెండ్లము—ఆటవిడిచి పోయినది హస్యగాని పెండ్లము" అనిగాని హేళన చేయుచు వెక్కిరించి పెట్టెదరు. ఈ లక్షణము సామాన్యముగ నన్ని యాటలకును వర్తించును. బాలబాలికలాడు ఆటలను గూర్చి మన ప్రాచీన కావ్యములు కొన్ని ప్రస్తావించినవి. అట్టి వానిలో శ్రీ కాళహస్తి మహాత్మ్యము 2,

1. వాత్స్యాయన కామ సూత్రములు—(3-3-7)

2. సీ॥ చిట్లపొట్లాకాయ సిరిసింగణాపత్తి, గుడుగుడు గుంచాలు కుందెనగుడి
డాగిలి మ్రుచ్చులాటలు గ్రొచ్చకాయలు, వెన్నెల కుప్పలు తన్నుబిల్ల
తూరన తుంకాలు గీరన గింజలు, పిల్ల దీపాలంకి బిల్ల గోడు
చిఱుగుడప్పల పోటి చెండుగట్టిన బోది, యల్లి యుప్పన బట్టెలప్పళాలు
చిక్కనాబిల్ల లోటిల్లు చిందరాది—యైన శైశవ క్రీడా విహార సరణి
చెంచు కొమరులతోడ నుద్దించుకాడు—తిన్నడభినవ బాల్య సంపన్నుడగుచు"
—ధూర్జటి—శ్రీకాళహస్తి మహాత్మ్యము—ఆ 3 పద్య. 33

కళాపూర్ణోదయము 1, హంస వింశతి 2, మున్నగు వానిలో పేర్కొన్న ఆటలలో చాల మట్టునకు నేటికిని మిగిలియున్నవి. వీనిలో గొన్ని కుటుంబ సంబంధమైనవి. మరికొన్ని ఇరుగు పొరుగు కుటుంబ సంబంధములైనవి.

## గుడు గుడు గుంచము:-

ఆట ఆడించెడు నామె, పిల్లల యొక్క పిడికిళ్లనొకరి పిడికిళిమీద నింకొకరివి వరుసగా పేర్పించి అందరికన్న మీదుగా నుంచబడినవారి పిడికిళి రంధ్రమున చూపుడు వ్రేలిని జొనిపి త్రిప్పుచు "గుడుగుడు గుంచం గుండే రాగం—పాముల పట్నం పడిగే రాగం—చిన్నన్న గుఱ్ఱం చిట్టికిపాయె—పెద్దన్న గుఱ్ఱం పెండ్లికి వాయె—ఘంగలోని గుఱ్ఱం మాద్గుల వాడె-సాకలోని గుఱ్ఱం నవుట్లవాడె—వేన్నీళ్లా చన్నీళ్లా"* అనుచు వేన్నీళ్లన్నవారి పిడికిళిని గట్టిగాను, చన్నీళ్లన్న వారిని మెల్లగాను గిచ్చగా వారివారి పిడికిళ్లను వీపువైపున దాచుకొందురు. అందరు దాచుకొన్న తర్వాత ఆమె క్రింది విధముగా ప్రశ్నించగా పిల్లలందరేక కంఠముతో సమాధాన మిచ్చుట యగును.

| | |
|---|---|
| ఆమె (తల్లి):—చేతులెక్కడ వాయె? | పిల్లలు:—పెంటకు |
| ఆమె:—పెంటేమిచ్చింది? | పిల్లలు:—ఎరువు |
| ఆమె:—ఎరువేం జేసినవు? | పిల్లలు:—పొలానికి |
| ఆమె:—పొలమేమిచ్చింది? | పిల్లలు:—గింజలు |
| ఆమె:—గింజలేంజేసినవు? | పిల్లలు:—వంటకు |
| ఆమె:—వంటేం జేసినవు? | పిల్లలు:—ఉట్టిమీద పెడితె |

1. "దినముల్ గొన్ని చనంగ నంత గడు నర్థిన్ బొమ్మ పెండ్లిండ్లు, గుజ్జెన గూళ్ళచ్చెన గండ్లు, పింపిళులు, కుచ్చిళ్లు, గీరనగింజ, లోమన గుంటల్, కనుమూసి గంతనలు, కంబాలాట లోనైన ఖేలనముల్ మీఱగ బోంట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్.

పింగళి సూరన్న:—కళాపూర్ణోదయము—ఆ. 6. పద్య. 202

2. హంస వింశతి:—ఆ. 3. పద్య. 147; ఆ. 5. పద్య. 159

"మా తాతింత తాగిపాయె— మా వొళ్ళ పిల్లి చ్చి ఆయింత నాకిపాయె"* అనగానే అందరు "చేతులొచ్చె చేతులొచ్చె" అనుచు దాచుకొన్న చేతులతో చప్పట్లు కొట్టుచు మురిసిపోవుచుందురు. ఇట్లే తిరిగి తిరిగి ఆడుదురు.

ఇదే పద్ధతిలో పిడికిళ్లకు మారుగా అరచేతులు బోర్లించి "అప్పాలో చెప్పాలో—ఆలంపెల్లి తాళాలో—చిన్నన్న గుర్రం చిట్టికి పాయె—పెద్దన్న గుర్రం పెండ్లికి వాయె"* అనుచు ఆడుకొందురు. పై పాటలవంటివే అస్సాము పిల్లలు కూడ చేతులు దాచుకొని యాడునప్పుడు పాడుకొనుటయును గలదు 1.

## తిరుగు తిరుగు జల్లేడ:-

పిల్లలందరు లోవాకిటనో వెలుపలి వాకిటనో కూడి చేతులు బారలుగా చాచి గుండ్రముగా తిరుగుచు "తిరుగు తిరుగు జల్లేడా—తిరుగవోకు జల్లేడా—మావొల్లింట్లా పల్లేపుప్వ—తురుకొల్లింట్లాతుమ్మపుప్వ—ఒడ్డోళ్ళ బండి ఒచ్చింది—మావోళ్ల బండి పోయింది."* అనుచు పాడుకొందురు. చిన్నపాటి పందెములు వేసికొని ఒకరినిఖించి యింకొకరు తిరుగుచుందురు. కొద్దిపాటి చినుకులు చిటపట వార్లు చున్నప్పుడు పై మాదిరిగానే పిల్లలంత తిరుగుచు "వానావానా వల్లప్ప వాకిలి తిరుగు చెల్లప్ప—తిరుగు తిరుగూ చెల్లప్ప తిరుగలేనూ చెల్లప్ప—అన్నము తిను చెల్లప్ప ఆకలిలేదు చెల్లప్ప—విసురూ విసురూ చెల్లప్ప విసురలేను చెల్లప్ప"—పాడుచుండగా వాన బాగుగా పడుచున్నచో తడుచుచు గాని, మోసాలలోనికి దూరిగాని "వానల్లు కురవాలె వానదేవుడా—వరిచేలు పండాలె వానదేవుడా—మాయమ్మ పండాలె వానదేవుడా—మాబొజ్జ నిండాలె వానదేవుడా" అనుటలోని వారి యుత్సాహమునకు మేరయే లేదు. అట్లు తిరుగుటలో కండ్లు శరీరము గిమ్మున తిరుగుట వలన అది కొన్నాళ్ల కలవాటయి పోవును.

---

1. Folk literature of Assam (An Introductory Survey.) 1954-P. 42

## స్తంభముల ఆట:-

ఇంట చతుశ్శాలలోనున్న స్తంభములను పట్టుకొని ఆడుటవలన దీనికాపేరు వచ్చినది. కంభముల ఆటయని కూడ వ్యవహరింతురు. ఈ యాటలో పాల్గొను పిల్లల సంఖ్య స్తంభముల సంఖ్య కన్న ఒక్కటెక్కువగా నుండవలెను. ఆటకు నాయకత్వము వహించువారిని 'పెంబ' అందురు. ఈ పెంబ వారందరిని ఒక్క తావునకేర్చి "స్తంభముల నెవరు పట్టుకొందురరో" అని కేకవేయగా పెంబతో సహా అందరు గూడ ఉరికి ఉరికి రివ్వున స్తంభములను పట్టుకొందురు. స్తంభమును దొరకించుకొనలేక మిగిలినట్టి పిల్లను 'గొల్లభామ' అనిగాని 'దొంగ' అనిగాని పరిగణింతురు. ఆ గొల్లభామ "నల్లమ్మ నల్లో" అనుచు తిరుగుచు నున్నప్పుడు, స్తంభముల నింతకు మునుపు పట్టుకొని యున్నవారు·

"నాలుగు స్తంభాలాటా నడిమికి తొడిమికి_తానక తప్పక తనపేరేమంటే
ఉట్టిమీద బెల్లం పొట్టి కాకరకాయ_బావా బావా బరుకూ బరుకూ
తన్నులు తింటే తల కొకబే,,_పాడుకొనుచు గొల్లభామకు చిక్క నీయకుండ ఒకరి స్తంభము నొకరు మార్చుకొనుట జరుగును. అట్లు మార్చుకొను నప్పుడాలస్యము జరిగి స్తంభము ఖాళీగా నుండినచో రివ్వున బోయి గొల్లభామ దానిని పట్టుకొని యుండును. ఆ యవకాశమును బోగొట్టుకొన్న పిల్ల ,గొల్లభామ, గా గుర్తింపబడును. ఆట యెప్పటివలె పాడుకొనుచు ఆడుట పరిపాటి. ఇది నేటి Musical Chair అను నాటకు పూర్వరూపమో లేదా దగ్గర సంబంధము గలదియో కావలెను. ఇట్లే ప్రత్యేకముగా ఆడపిల్లలకు పింగిరిపూత, చెమ్మచెక్క, అచ్చన గాయలు మున్నగునవి కలవు.

## పింగిరి పూత:-

ఇద్దరాడపిల్లలొకరిచేతుల నొకరల్లి బిల్లిగా పట్టుకొని పాదముల నెదురెదురుగా అమర్చి వీపు తట్టు కొంచము వ్రేలాడబడి గుండ్రముగా తిరుగుచు

,,పింగిరి పింగిరి పుల్లన్న—రాగిచెట్టు రంగన్న—కొత్తకుండల గోలిగుండు— పండు పండె రేగిపండు,,* అనిగాని, ,,ఒప్పులకుప్ప ఒయ్యారి భామా—గూట్లో రూపాయి నీ మొగడు సిపాయి,, అనిగాని మరెన్నియో విధములైనవి గాని పాడుకొందురు. ఇట్లు తిరుగుటలో బాలికలు తమతమ దేహములు వశము తప్పి నేలబడకుండ చూచుకొనుట మిక్కిలి నేర్పుగా నుండును. వారి యుత్సాహ మురకలు వేయుచుండును ,,నీ మొగడు సిపాయి,, అనుటలో వీరపత్ని గాదగు సూచన గలదు. ఈ యాటను 'చిప్పచిప్ప గోళ్లు' అనికూడ అందురు.

## చెమ్మ చెక్క:-

సాధారణముగా నిద్దరిద్దరు బాలికలెదురుపడి నిలిచి వెనుకకు ముందర కెగురుచు తాళలయబద్ధముగా నొండొరులచేతులను తట్టుచు మిక్కిలి యుత్సాహ ముతో ,,చెమ్మచెక్క చారడేసి బుక్క— అట్లు పోయంగ ఆరగించంగ—రత్నాల చెమ్మచెక్క రంగులేయంగ—ముత్యాల చెమ్మచెక్క ముగ్గులేయంగ—పగడాల చెమ్మచెక్క పందిరేయంగ—పందిట్లో బాలుడు పారాడంగ,,* పాడుకొనుట యొప్పును. ఈ యాట ఇరుగుపొరుగు పిల్లలతో గూడ ఆడుకొనుట జరుగును. ఇందు, ఈడు వచ్చినను సమర్త కానట్టి వారికిని మరియు సంతానము కానట్టి వారికిని మందులు చెప్పబడినవి. ఈ విజ్ఞానాంశములు మున్ముందు పేర్కొందును.

## అచ్చన గాయలు:-

బాలికలిద్దరభిముఖులై కూర్చుండి పది గచ్చకాయలను క్రింద పోసికొని ఒకరి తర్వాత మరొకరు, ఒక గచ్చకాయ నెగురవైచుచు నది క్రింద పడక పూర్వమే దానిని మరియు క్రిందనున్న వానిని లెక్క ప్రకారముగా ,,ఒక్కాయ ఒక్క—రెక్కాయ రెట్టి—ముక్కాయ మువ్వ—నక్కాయ నంది—బదుం బొడ్డు— అరింకతాళ—ఏడికాబొద్దు—ఎనమాకన్ను—తొంబా పరక—తొట్టి కంగి,, అనిగాని ,,ఒక్క ఓ చెలియా, రెండు రేగుల్లూ,, అనిగాని పాడుచునే ఒక్కొక్కటి

చొప్పున గాని రెండేసి, మూడేసి, నాలుగేసి, ఐదేసి, ఆరేసి, ఏడేసి, ఎనిమిదేసి, తొమ్మిదేసి చొప్పున గాని కాయలను చేయితప్పి క్రింద పడకుండ గుప్పిట పట్టుకొనుట జరుగును. ఒకవేళ తప్పి క్రిందపడినచో రెండవ బాలిక ఆట నారంభించి పై విధముగా నాడును. ఎవరెక్కువ తప్పిదములు చేసినచో వారోడినట్లు భావించెదరు. కొందరు బాలికలు అప్పనగాయల సంఖ్య పెంచుకొని 20 కాయలవరకు నొకేసారి గుప్పిట నిండ అందుకొందురు. గచ్చ కాయలకు మారుగా చిన్నగులక రాళ్ళనేరుకొని దెచ్చికూడ ఆడుట యున్నది. ఇద్దరికన్న నెక్కువగా కూడ పాల్గొనుట జరుగును. ఇట్టి యాటలలో లెక్కలకు సంబంధించిన విద్యాబోధన యున్నది. పూర్వ మీయాటను షట్పాషాణకమనిరి 1.

ఇవిగాక కుటుంబమున చేతాడమ్మ చేతాడు, కాళ్లగజ్జి, ఓమనగుంటలు, అత్తాకోడళ్లు, తిందాం తిందాం, ఒత్తునా పోదునా ఓ రామ శిలకా వంటి చిన్న చిన్న ఆటలు లెక్కకు మిక్కిలిగా నుండును. వీని మొత్తమును గూర్చి చెప్పుటకవకాశము లేనందున తెలుగుదేశమంతటికి వర్తించు కుటుంబ పరిమితమైన కొన్ని ముఖ్యమైనవి మాత్రమే ప్రస్తావించుటైనది. వానివలన పిల్లలకు చిన్నప్పటి నుండియే ఆనందోత్సాహములు, ఊహాశక్తి, లయజ్ఞానము, స్నేహము, తగిన అవయవ నిర్మాణము, ఆరోగ్యములలవడి వ్యక్తిత్వ వికాసమునకు దోహదమైనది. ఆటపాటలలో వివిధములైన విషయములు గూడ దడవబడుచుండును. తెలుగుదేశమంతట పల్లె కుటుంబములలో ఇట్టి ఆటపాట లున్నప్పటికిని ఆయా ప్రాంతమును బట్టి యాడెడు గతులలో గాని, పాడెడు ఋతులలో గాని, ఇంచుక మార్పులు చేర్పులుండుట సామాన్యము. చెడుగుడు, గోటీకాయలు, గిల్లిదండు, కోతికొమ్మచ్చి, పులిమేక, బొంగరము, బంతి, వెన్నెలకుప్పలు, బొమ్మలపెండ్లి, కుంటిపీసు (తొక్కుడు బిళ్ల), కుమ్మి, గుజ్జన గూళ్లు మున్నగు ఆటలిరుగు పొరుగు పిల్లలు కలిసి యాడుకొనుట వలన

1. వాత్స్యాయన కామ సూత్రములు:— కన్యాసంప్రయుక్తాధికరణము—బాలోప క్రమాద్యధ్యాయము-సూ. 7 (3-3-7)

సామాజిక సంబంధములారంభములై సామాజిక జీవనమునకు తోడ్పాటు లభించుచుండును. ఇరుగుపొరుగు పిల్లలమధ్య గన్పట్టెడు స్నేహము, ఆనందము తలచుకొని తలచుకొని నోరార నవ్వుకొనెడు తీరు, అమలిన హృదయము అను లక్షణములు భారతీయములు. భారత దేశపు పిల్లలను గూర్చి యొక పాశ్చాత్యుడు నుడివిన సత్యమిట గమనార్హము 1.

## కుటుంబము - విద్యాబోధన

కేవలమక్షరములు నేర్చుకొనుట, పుస్తకములు చదువుటయే విద్య కానేరదు. జ్ఞానేంద్రియములకును, కర్మేంద్రియములకును, క్రమశిక్షణాయుతమైన పనులు కల్పించుట కూడ విద్యయే. అనగా ఆయా యింద్రియములు లౌకికా లౌకికజ్ఞానము నెఱుంగుట యని చెప్పుకొనదగును. కనులార చూచిన సత్యమును చూడగలుగుట, మనసార గ్రహించవలసినది గ్రహించుట, చేతులార చేయ వలసినది చేయనేర్చుట, వీనులార విన్నది వివరింపదలచుట యంతయు విద్యయని చెప్పుకొనవచ్చును. ఈ ప్రకరణమున నింతవరకే అటనట పిల్లలకు కుటుంబమెట్లు లౌకికాలౌకిక జ్ఞానములనందించినది యెఱింగి యున్నాము. కుటుంబమున లోకజ్ఞానములవడు విధానమును మరికొంత యిట తెలియుదము.

చుట్టములు వచ్చినచో బొటనవ్రేలితో తిలకము దిద్దవలెనని, సాక్ష్యములకు చూపుడువ్రేలని, మధ్యవ్రేలికిట్టి పనులుండవని, నాలుగవ వ్రేలు ఉంగరములను దాల్చెడిదని, చిటికెనవ్రేలు పెండ్లినాడు దర్భతో చేసిన ఉంగరమును మరియు ముద్దుటుంగరమును అలంకరించుకొనెడిదని, వధూవరులు చిటికెనవ్రేలి బంధముతో అగ్నికి ప్రదక్షిణము చేయుదురని, కూడిక, తీసివేత వంటి

1. "The children of India are the friendliest children I have ever seen. They trust people, their smile is whole-hearted, warm and gay."
-In the minds of Men-Gardner Murphy-P. 46

అనేకమైన లెక్కలు వ్రేళ్ల మీద చేయబడునప్పుడు చిటికెన వ్రేలితోనే గణిత మారంభమగునని తెలుపుచు వానివలన నాచారములను, కట్టుబాట్లను గూర్చి తల్లిగాని కుటుంబములోని పెద్దవారు గాని పిల్లల కిట్లు బోధించుట జరుగును. "చుట్టాల సురభి బొటనవ్రేలు— కొండీల కొరవి చూపుడు వ్రేలు పుట్టు సన్యాసి మధ్యవ్రేలు—ఉంగరాల భోగి ఉంగరపువ్రేలు పెళ్లికి పెద్ద చిటికెన వ్రేలు, చిన్నాచిన్నా చిటికెన ఏలా ఒక్కటి అంటూ లెక్కా పెట్టూ,,

తెల్లవారుటకు కోడికూత కాకుల యఱపు సంకేతములని, తెల్లవారిన వెంటనే అజ్ఞానమును విడిచి జ్ఞానమును బొందవలెనని అమ్మ పడకనుండి పిల్లలను లేపి కార్యోన్ముఖులుగా చేయుచుండును. ,,కోడీ కోడీ కొక్కొరోకో-కాకీ కాకీ కావు కావు—తెల్లవారింది తెలివొచ్చింది — అమ్మ లెమ్మంది ఆడుకొమ్మంది,, తల్లి స్వయముగా బిడ్డలకు చుట్టునుండెడు పరిసర ప్రకృతిలోని పశు పక్ష్యాదులను గూర్చి పిన్ననాటి నుండియే పరిచయము చేయును. లాలించుచు, ఆలించుచు, పాలించుచు పరిసర వస్తువులను వర్ణించుచు బిడ్డల మానసికశక్తిని పెంచి లోకజ్ఞాన మందించును. కుటుంబములోని వావివరుసలను, చుట్టపక్కముల సంబంధములను పాడుకొలుపుచు నామె ప్రథమ ప్రబోధకు రాలగును. తాను తలచినట్లు బిడ్డను మలచదలచును. ,,అమ్మన్న ముద్దును ఏమన్నారూ—అచ్చమావుల పాలన్నారు, అప్పుడు కాచిన నెయ్యన్నారు—దోరగ వేగిన గారన్నారు, పాకము వచ్చిన అరిశెన్నారు-పటిక పంచదార పొడు మన్నారు." అచ్చమావులపాలు ( గోక్షీరంక్షీరాణాం ), అప్పుడు కాచిన నెయ్యి మున్నగునవి, ఆరోగ్యవంతమైన శరీర నిర్మాణమునకు జీవధారయని బిడ్డకు తల్లి ఆరోగ్యపాఠము చెప్పుట లేదా? ఒడినుండి దేవుని గుడి మ్రోల చేర్చనగునంతవరకామె వలనను, కుటుంబములోని యితర వ్యక్తుల వలనను పిల్లలు మాతృభాష మాట్లాడ నేర్చుకొనుచుందురు. భాష ద్వారా సామాజికీకరణ మధికముగా నబ్బును. భాష యబ్బిన పిమ్మట పెక్కు విషయములు నేర్చుకొన గలుగుదురు. ప్రొద్దు పొడిచినప్పటి నుండి రాత్రి నిద్దురబట్టు వరకాటపాటల ద్వారా వారికి నద్భుతమైన కథలు, కమ్మని నీతికథలు తల్లిచేతను, ఇతరుల చేతను

గబపుట జరుగును. అట్టి సందర్భములలో తల్లి ప్రశ్నించునప్పుడు బిడ్డ డూకొట్టుచు నిర్భయముగా చూచుచుండును.

నూకలిస్తాను మేకలు కాస్తావా ? . . . . . . . . .ఊఁ
పెద్దపులి వస్తే జడపవు కదా ? . . . . . . . . .ఊఁ
చిరతపులి వస్తే జడవవు కదా ? . . . . . . . .ఊఁ
తోడేలు వస్తే సింహం వస్తే. . . . . . . . . .ఊఁ

సివంగి వస్తే ఎలుగు బంటొస్తే. . . . . . ,ఊఁ*— ఇట్లనుచు బిడ్డ కంటిలో తల్లి ,,ఉఫ్,, అని ఊదగా వాడు కండ్లు మూయును. అప్పుడామె వాని వీపు తట్టుచు 'ఏల భయపడితివని' నవ్వుచు ధీరత్వమును నూరిపోయును. ఇంతే గాక, పిల్లలు వివిధములైన ఆటపాటల ద్వారా పదముల పొందికను, వస్తు గుణమును, కల్పనాశక్తిని, లయను, ధారణాశక్తిని శ్వాసను, బిగబట్టుటను కుటుంబములోనే అలవరచుకొనుటను గమనింపదగును. ,,పిట్టమ్మ పిట్ట—ఏమి పిట్ట—చిలకపిట్ట—ఏమిచిలక—తెలుపు చిలక—ఏమి తెలుపు—హంసతెలుపు—ఏమిహంస రాజహంస—ఏమిరాజు—మృగరాజు....................."అనుచు పెద్దగా నల్లుకొని పాడగలుగుదురు. ,,ఒక్కటి ఒప్పందం రెండూ తలి దంఢీర్రి—మూడు తిరిమూర్తి నాలుగు వేదాలు—ఐదు ఆయుధముఆరు కర్మాలు—ఏడు వారాలు ఎనిమిది దిగ్గజము తొమ్మిది దోరాలు 1 పదింటి కవతారం,, ,,కిట్టమ్మ గోపాల బాల కిట్టమ్మ భజ గోవింద బాల—మూడు మూళ్లు తొమ్మిదైతే నాలుగు మూళ్ల పన్నెండైతే ఏడుమూళ్ల ఇరవై ఒకటి—ఎనమిది మూళ్లు ఇరవైనాలుగూ—హరిరో రంగ హరి హరిరో రంగ హరి,, అనుచు ఎక్కములు చదువునప్పుడు గూడ లోకజ్ఞానమును, ఆదర్శమును, ఆధ్యాత్మికతను కుటుంబ పరిసరములలో అనాయాసముగా నభ్యసింతురు. ఉత్త ఆటపాటలలోనే గాక పిల్లల నడువుటాజ్ఞలో బెట్టుటకు, చెడ్డ అలవాట్లనుండి దూరముగా నుంచుటకు తగిన సామాజిక నియంత్రణము నెఱపుచు కుటుంబము సామ దాన భేద దండోపాయములను ప్రయోగించును.

1. ద్వారములు

,,చదువంటె అబ్బాయి చండి కేశాడు—బద్దె పలుపా 1 రావే బుద్ధి చెప్పాలె,, అని బెదరించి అదుపులోనికి దెచ్చుకొని తిరిగి నయముతో తల్లి, ,,చదువుకో నాయన్న చదువుకో తండ్రీ చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను—పొరుగు పిల్లలతోడ పోట్లాడబోక—చక్కగా నీ చదువు చదువుకో తండ్రీ,, అని నీతి గఱపుచు పొరుగు పిల్లలతోడ పోట్లాడ కుండునట్లును, చెడ్డ అలవాట్లకు గురి కాకుండునట్లును, తగు జాగ్రత్త వహించుచు బిడ్డల భవిష్యత్తునకామె యెంత గానో తోడ్పడుచుండును.

బాలికలైనచో ఆచారాది విషయముల నభ్యసించుట యందు బాలురకన్న మిగుల శ్రద్ధ చూపుదురు. వారికి ఓర్పన్నది సహజగుణము. అనుకరణాభిలాష కూడ మెండు. పెద్దల ప్రవర్తనలను, నోములను, వ్రతములను, పండుగపబ్బ ములలోని ఆచార వ్యవహారములను, పెండ్లి తంతు వంటి మున్నగు వానిని తొందరగా ననుకరింతురు. ,,నాగుల చవితికి నాగన్న—స్నానం సంధ్యలు నాగన్న—పువ్వులు పడగలు నాగన్న... ... ... ... ...పూజలు గొనరా నాగన్న,, అనెడు నాగపూజను నేర్చుకొందురు. సంక్రాంతి సందర్భమున గొబ్బి తట్టుచు, ,,గంగమ్మ గౌరమ్మ అప్ప సెల్లెండ్రూగొబ్బియళ్ళో—ఒక తల్లి పిల్లలకు వైరమూ లేదూగొబ్బియళ్ళో,, అని పాడుచు నృత్య భంగిమను, ఒక్క తల్లి బిడ్డలకు వైరముండకూడదను నీతిపాఠమును అలవరచుకొనుటలో పెద్దల ప్రభావ మనంతము.

'బొమ్మలపెండ్లి' ఆటలలో నూటికి నూరుపాళ్లు పెద్దల ననుసరించిన విధానమునకు అరచేతి అద్దము. సంస్కృతీ సంప్రదాయములకు నిలువుటద్దము. పెండ్లి సంబంధములతో మొదలుకొని అత్తవారింటి కంపువరకు జరుపు పెండ్లి తంతు బొమ్మల పెండ్లిలో ప్రవేశపెట్టబడును. ఇరుగు పొరుగు బాలికలు కూడ వచ్చి పాల్గొనుచుందురు. బాలికలు పొందు సామాజికీకరణమునకు బొమ్మల పెండ్లిళ్లు ప్రబల నిదర్శనము.

1. త్రాడు

1. జట్టు:—గుజ గుజ రేకుల గుజ్జారేకుల
స్వామీదండల సహరాజుల తామర మొగ్గల్లా

2. జట్టు:— ,, ,, ,,

1. జట్టు:—చిట్టీ మీరేటి వారె—చిట్టక్కా మీరేటి వారె
పూర్ణీ మీరేటి వారె—పూర్ణక్కా మీరేటివారె—తామర మొగ్గల్లా

2. జట్టు:—చిట్టీ మేం వ్యాపారస్తులం—చిట్టక్కా మేం వ్యాపారస్తులం
పూర్ణీ మేం వ్యాపారస్తులం—పూర్ణక్కా మేం వ్యాపారస్తులం—తామర మొగ్గల్లా

1. జట్టు:—గుజ గుజరేకుల పిల్లోడున్నాడా—గుజ్జారేకుల పిల్లోడున్నాడా
స్వామీ దండల పిల్లోడున్నాడా—సహరాజులు మెచ్చ పిల్లోడున్నాడా—తామర మొగ్గల్లా

2. జట్టు:—గుజ గుజరేకుల పిల్లోడున్నాడు—గుజ్జారేకుల పిల్లోడున్నాడు
స్వామీ దండల పిల్లోడున్నాడు—సహరాజులు మెచ్చ పిల్లోడున్నాడు తామర మొగ్గల్లా

1. జట్టు:—పసినిమ్మ పండుకు చాలును—పరహాల కుప్పకు చాలును
ముద్దు బాలునికి చాలును-మోహన రూపునికి చాలును-తామర మొగ్గల్లా

2. జట్టు:—గుజ గుజరేకుల చీనాంబరాలు తెచ్చాము—గుజ్జారేకుల జల్తారు రవికలు తెచ్చాము
స్వామీ దండల పసుపు కుంకుమ తెచ్చాము—సహ రాజులు మెచ్చ పెళ్లికి వచ్చాము

బాలికలంత పిల్ల వైపున ఒక జట్టుగా పిల్లవానివైపున రెండవ జట్టుగా నేర్పడి పై రీతిగా పాడుకొనుచు మనువు సంబంధములను, ఇచ్చి పుచ్చుకొనెడు కానుకలు కట్నముల వివరములను గూర్చి చక్కగా సంభాషించుకొనుటలో బాలికల యొక్క సామాజికీకరణము తేటతెల్లము. బొమ్మల పెండ్లి చూడముచ్చటగాను,

వినసొంపుగాను ఉండును. ,,తాటాకు బొమ్మలు చేశాము—బొమ్మకు బట్టలు కట్టేము అకూబూరలు ఊదేము,, పెండ్లి సంబంధముల తర్వాత తాటి యాకులతో చేసిన బొమ్మల నలంకరించి క్రొత్త బట్టలు కట్టి బొమ్మరిండ్లలో పేర్చి ఆకు పీకెలు ఊదుచు;

,,చిట్టి బొమ్మల పెళ్లి చేయ వేడుకలు శ్రీ రెండు వాకిళ్ల సిరితోరణాలు-
రంగు గుమ్మము ముందు రత్న కంబళ్ళు—పసి బాల తలమీద పచ్చ
అక్షతలు—అరటి స్తంభాలలో అమరె పెళ్లరుగు—చిన్నన్న పెట్టేను
చింతాకు చీరే,, అనుచు పెండ్లిచేసి ,,ఇరుగూపొరుగును పిలిచాము—

బందుగు లెల్లరు వచ్చారు— పెళ్లికి విందులు చేశాము,, విందులు చేయుచు ,,వియ్యంకున కన్నం లేదు—వియ్యపురాలికి నెయ్యి లేదు,, అనుచు వేళాకోళము లాడి ఆ తర్వాత చేసెడు తంతు నడిపి వరుని వెంట వధువు నత్తవారింటికి సాగనంపుచు;

వీధిలో తలవిప్పి ముడువకే బొమ్మ—పల్లెత్తి గట్టిగా పలుక బోకమ్మ
పొరుగిళ్ల కెప్పుడూ పోవకే బొమ్మ—నలుగురి నోళ్లలో నానకే బొమ్మ

అని బుద్ధులు గఱపి అంపుటలోని సామాజిక మర్యాదలు, కట్టుబాట్లు కొట్టవచ్చినట్లు కన్పట్టును. ఆ తరువాత అది గతిమాలిన సంబంధమని తెలిసినప్పుడు

,,1. జట్టు:—సిబ్బిలేనింటికీ నా బిడ్డెనిస్తి డమ్మ దాలిమ్మలో
2. జట్టు—అప్పుదేంజేసినవు అరికాలు సెప్పా డమ్మ దాలిమ్మలో,, అనుచు

మాటలతో ఎత్తిపొడుచు కొందురు. ఇట్లు కుటుంబపు పెద్దలను బట్టి పిల్లలు నడుచుకొనుటచేత వ్యక్తిత్వమన్నది ప్రకృతి సిద్ధమైనది కాదని, అది క్రమముగా కుటుంబ పరిసరములలో నిర్మిత మగునని తెలియుచున్నది. సామాజికవేత్త G. D. Mitechell కూడ ఇట్లే యభిప్రాయ పడినాడు 1.

1. "Personalities are not born, they are 'made' and developed in the socialising proces through the child's interaction with parents of the same and opposite sex and with siblings"
-G. D. Mitechell:-Socialogy-The study of social systems P. 156

మొత్తము మీద కుటుంబమున నేర్చుకొను విద్యయంతయు సైద్ధాంతికరీతి (Theoretical) కాదు. ప్రయోగాత్మక (Practical) మైనది. అందుచేత కుటుంబమును ప్రయోగాత్మక ప్రాథమిక పాఠశాల యనదగును. అది చక్కని సామాజిక పౌరులుగా మలచెడు శిక్షణ కేంద్రము.

## కుటుంబము : ఆర్థికవిధులు - భద్రతలు

కుటుంబ జీవనోపాధికై కొన్ని ఆర్థిక విధులు కుటుంబ పరిమితమై నిర్వహింప బడుచుండును. ఆర్థిక విధులవశ్యకర్తవ్యములు. ప్రాచీనకాలమున కుటుంబమే అన్నిరకములైన ఆర్థిక విధులు నెరవేర్చియుండినది. యాంత్రిక యుగారంభము నుండి ఇట్టి విధులు వికేంద్రీకరింపబడినవి. నగర కుటుంబమీనా డెక్కువగా యంత్రముల మీద ఆధారపడి యుండుటవలన ప్రతి కార్యమునకు యంత్రముల వైపు ఎదురుచూడవలసి వచ్చినది. పల్లె కుటుంబము కూడ కొంత వరకిట్లాధారపడ వలసియుండినను దంపుట, విసురుట, వడుకుట, కుట్టుట, చిన్నచిన్న చేతిపనులు చేయుట, ఇండ్లు కట్టుకొనుట, ఆయా వృత్తి సంబంధ కుటుంబములో వృత్తిపనులు చేయుటవంటి ఆర్థిక విధులు స్వయముగా నిర్వహించును. వడుకుట, కుట్టుట వంటి పనులీనాడు పూర్తిగా యంత్రములే చేయుచున్నవి. దంపుట, విసురుటకు కూడ యంత్రములున్నప్పటికిని అందుబాట్లు తక్కువ. దగ్గర పట్టులనున్నవారు మధ్యమధ్య అక్కడకుపోయి తాము చేయు పనులు వాని కప్పగించుచుందురు. లేవిచో రెక్కలే యంత్రములు.

„సువ్వి గిరి రామలింగ—సువ్వి కస్తూరి రంగ
సువ్వి యనుచు పాడరమ్మ—సుదతులందరు
అంచు లంచు లరగవేసి—పంచ వన్నె ముగ్గువేసి
పాడి పాడి దంచురమ్మ- పడతులందరు
ఉల్లిపూల జల్లెడమున—శ్యామపూవు కుందనమున
శ్యామ పూవు కుందనముకు నెరుకు రోకళ్లే... ... ... ...
చిన్నవడ్లు పెద్దవడ్లు పేరైన రాజనాలు

కృష్ణా నీలాలు దంచి కీర్తి పొందారె
దంచి దంచి కన్యలంతా దాహము కొన్నారె

ముత్యమంత చెంబుతోన దప్పికందిరే,, పరిపంట రాగానే కుటుంబము లోని వారు కుందెనబట్టి తగినన్ని వడ్లుబోసి పోటువేసి దంచి, చెరగి, జల్లెడ బట్టి బియ్యము చేసికొందురు. ఒక్కొక్కమారు విరామము లేకుండ దినమంత దంచుటచేత దాహము గొనుటయే గాక అలసిపోవు చుండుట జరుగును. రెక్కల కష్టము తప్ప రొక్కము వెచ్చించుట యన్నది జరుగదు. దంపుడు బియ్యము వారి ఆరోగ్యమునకు శ్రేష్ఠమైనవి ,,రోలికి రోకలికి వొక్క దండమ్మ—మము గన్న తలి దండ్రికి వెయ్యి దండములా,, నిత్య జీవితమున కుపకరించునట్టి పరికరములకు మ్రొక్కి ఆ పని యారంభించుట, తిరిగి ముగింపున మ్రొక్కుట పల్లీయులలోని కృతజ్ఞతా భావము.

పిండి కొరకుపయోగించు విసురురాతిని తిరుగలి అనికూడ అందురు. పిండి చేయుదానిని చోళ్ల తిరుగలి, పప్పుగా విసురునది పప్పు తిరుగలి, గింజల మీది పొట్టు మాత్రమే పోవునట్లు విసురునది ఆళ్ల తిరుగలి అని అందురు. ,,చీకటి కోనల్లోనేనొక్కదాన్నీ—శివుడు నా కిచ్చిండు చిన్ని బాలల్ల—నా చిన్ని బాలలకు పాలు లేవాని—పరమేశుడిచ్చిండు పాడావు మంద—పాడావు మందాకు నీళ్లలేవాని—వసుదేవు డిచ్చిండు వరద కాల్వల్లు—కాల్వల్ల నీల్దాగి పొర్లె బొల్లావు బొల్లావు పేరేమి భోగి పేరేమి—బొల్లావు బసవన్న భోగి రైతన్న—రైతునకు మనతల్లి అలవేలుమంగ*,, అని పాడు చున్నప్పుడు విసురుటలోని వారి ఆయాసమును మనోభావములు మ్రింగివేయుచుండును. దున్నెడు పశుపులను రైతును స్మరించుకొని జీవింతురు. కుటుంబమునకు సరిపడునట్లు పిండి విసరి సంకటిగాని, అంబలిగాని, రొట్టెలుగాని చేసికొని చల్లగా డొక్కలు నింపు కొందురు. విసురు రాతి వలన చేయు పిండియే శ్రేష్ఠము. మరవలన గింజలోని పోషక పదార్థముల యొక్క గుణ మించుక మార్పు చెందుటకు వీలున్నది.

రాట్నము, కదురు పల్లెటూరివారి ఆర్థిక జీవనమునకు స్వాతంత్ర్య భిక్ష.

ముఖ్యముగా స్త్రీలు గృహములో గూర్చొని ప్రత్తి గింజలు తీయుట, ఏకులు చేయుట, దారము వడుకుట వంటి పనులలో నిమగ్నమై స్వయముగా ఆర్థిక స్తోమతను పెంచుకొనుచుందురు. దీనివలన ఆర్థిక స్వాతంత్ర్యము చేకూరుట చేత కుటుంబమున స్త్రీ "కదురు సల్లంగుంటె కదిలింతు గోల్కొండ—మొగ దెందుకే," అనుకొని ప్రతిదానికి భర్తమీదనే ఆధారపడి యుండకపోవుట జరుగును. "వడుకు వడుకూ కదుర వడుకవే కదురా—ఏకుల్ల బుట్టంత ఎల్లుంకి సంత—ఏకేకు ఒక బార ఎల్లుండి సంత—నా ఏకులైపోయె నాకేమి సింత—ఏకుల్ల ఎల్లక్క పత్తి పుల్లక్క—రాటాల రామక్క రావె పోదాము," ఇట్లు వడికిన దారమును సంతకుపోయి అమ్ముకొని జీవించుటయైనది. గడచిన కాలములో "కవ్వమాడని యిల్లు కదురు తిప్పని కొంప—మగ్గములేనూరు," కాన రాకుండెడిది. ప్రతి వ్యవసాయ కుటుంబములోని కాపుటింతులు అరమరికలు లేకుండ అమ్మ లక్కలను బిలుచుకొనుచు కాలయాపన జరుగనీయక వడిపడిగా రాట్నములు బుచ్చుకొని "ఎడపదెన దొడ్డుగాపైచి యేకులెల్ల—గెలన బలువగ వేపుడు గింజ లునిచి—చేవపీటల మీద నా సీనులైన—వారలై వావి వరుసలు వదరికొనుచు," 1 ; "ప్రాయంపు వడుచుల బని గొంటిపే దూది, యనెడి పాటల దేనె చినుకు లీన 2," పాటలు బాడుకొనుచు చక్కని దారము తీయుచుండిరి. కాలచక్రమునకు జీవిత చక్రమున కానాడు రాట్నమొక ప్రతీక యైనది. ప్రత్తి పంట విరివిగా పండినది. ఎంత రంభయైన ఏకులె వడికినది. ప్రత్తి చెట్టు ఆడ కూతురున కందము దిద్దిన దన్నచో నాటి కుటుంబ మార్థికముగా మెరుగుపడి యుండినదని యర్థము. స్త్రీ కట్టి ఆర్థిక స్వాతంత్ర్యము సిద్ధించిన విషయము మాతృస్వామిక సంప్రదాయాను గతమని చెప్పుదురు 3. ఈనాడిట్టి పరిశ్రమ పెద్ద పెద్ద యంత్రములు చేపట్టుట చేత కుటుంబ ఆర్థిక వ్యవస్థ కుంటుపడినదని చెప్పవచ్చును. అంతేగాక వృత్తి

1. శుక సప్తతి:—పాలవేకరి కదిరీపతి నాయకుడు—ఆ. 2. పద్య. 421

2. శుక సప్తతి:— ,, ,, —ఆ. 2. పద్య. 422

3. B. O. R. Ehrenfels:-Mother right in India-Published by Humphrey Milford-Oxford University Press. 1941-P. 11

సంబంధ కుటుంబములోని ఆయా వృత్తి పనులను గూడ యంత్రములు చేయు చున్నవి. ఉదాహరణకు అగసాలె, కంచరి, వడ్రంగి వారి వృత్తిపనులు పెద్ద మొత్తముగా యంత్రములే చేయుచున్నవి. కాని పల్లెలో నింక నిట్టి స్థితి ఏర్పడలేదు.

"అన్న పిండేటిపాలు కిన్నెర్లమోత— వదినె చేసేటి సల్ల కవ్వాలమోత అవ్వ అమ్మేటి సల్ల రేపల్లె వాడ-రేపల్లె మాపల్లె దేవునిపల్లె-ముత్యానికి మాసల్ల మూడుగురుగుల్లు పగడానికి మాసల్ల పాతికెగురుగల్లు,, కుటుంబమునకు సరిపడు పాడి నుత్పత్తిగావించుకొనుటయే గాక అమ్మదగినంత పాడినిగూడ వృద్ధి గావించి ముత్తెములకు పగడముల కమ్ముచుండిరి. చిన్న చిన్న చేతి వస్తువులు సిద్ధము చేసికొనుట, కుటుంబములోని వారందరు కలిసి ఇల్లు కట్టుకొనుట వంటి కార్యములుగూడ పల్లియ కుటుంబ పరిమితములు.

ఆర్థిక విధులతోబాటు ఆస్తిపాస్తుల సంరక్షణకు కుటుంబమొక చట్టము వంటిది. బాధ్యతాయుతమైన భద్రతామండలి వంటిది. ఈ లక్షణము జానపద మరియు నాగరక కుటుంబములకు సమానముగా వర్తించును. ఆస్తి సంరక్షణకే గాక వ్యక్తి భద్రతకు కుటుంబమే కంచుకోట. కుటుంబములోని ఒక వ్యక్తితో అన్యులెవరేని వాగ్వాదమునకుగాని, కయ్యమునకుగాని తలపడినప్పుడు ఆ కుటుంబములోని ఇతర వ్యక్తు లందరన్ని విధముల తోడ్పడుట యన్నది సామాన్యము. జానపద కుటుంబ యజమానురాలు తన కుటుంబ వ్యక్తులనందరిని గొప్పగా చెప్పుకొనుటలోని వారి యొక్క భద్రతకు క్రింది పాట తార్కాణము.

,,చిలుకల్లు చిలుకల్లు అందురే గాని-చిలుకలకు రూపేమి పలుకులే గాని
చిలుకల్లు మా యింట చిన్న కోడళ్లు
కోయిల్లు కోయిల్లు అందురే గాని—కోయిల్లకు రూపేమి గోషలే గాని
కోయిల్లు మాయింటి కొత్త కోడళ్లు
హంసలు హంసలు అందురే గాని— హంసలకు రూపేమి ఆటలే గాని
హంసల్లు మా యింట ఆడ పడుచుల్లు

పార్వాలు పార్వాలు అందురే గాని—పార్వాలకు రూపేమి పాటలే గాని
పార్వాలు మా యింట బాల పాపల్లు,—చిన్న కోడండ్రు చిలుకల్లు,
క్రొత్త కోడండ్రు కోయిలలు, ఆడబడుచులు హంసలు, బాలపాపలు పావురాలు

అనుచు కుటుంబ యజమాను రాలిట్లు స్వోత్కర్షగా చెప్పుకొనుటలో వ్యక్తులకు తగిన సంరక్షణ, భద్రత లభింపక పోపు నేమి!

# కుటుంబ సంబంధములు

## యజమాని-యజమానురాలు:-

సామాజిక సంస్థలలో కుటుంబమొక ప్రాథమిక సంస్థ. సామాజిక జీవనారంభ మిటనుండియే రూపు దిద్దుకొన్నది. ముఖ్యముగా పుట్టిన శిశువు తల్లి పోషణలో నైదారు సంవత్సరము లుండుట వలన వారిమధ్య స్థిరమైన అనురాగ పూర్వక సంబంధము లూపిరి పోసికొనుచుండును. ఆ సంబంధములు బహుముఖముగా విస్తరిల్లి కుటుంబ సంబంధములు ప్రస్ఫుటమగుచు వచ్చినవి. సామాజిక సంప్రదాయమున కొక నిదర్శనముగ జానపద సమాజములో సాధారణముగ అవిభక్త కుటుంబపద్ధతియే నిలిచియున్నదని చెప్పవచ్చును. జానపద సమాజములోనే యననేల వైదికసమాజములోనే అట్టి పద్ధతి యుండినది. ఆ విషయమును ధర్మశాస్త్రకర్తలు కూడ పేర్కొన్నారు. తల్లి దండ్రులు అవివాహితులైన ఆడ, మగ బిడ్డలు, వివాహితులైన కుమారులు వారివారి భార్యాబిడ్డలు కలిసి ఒక ఇంటనే నివసించుచు, ఒక వంటనే భుజించుచు నొక్కటిగా జీవించుటయే అవిభక్త కుటుంబ పద్ధతి. ఈ విధమైన జానపద కుటుంబములోని సభ్యులమధ్య నుండెడు సంబంధములకు పల్లెపదములెట్లు నిలువుటద్దము పట్టి తెలుగు కుటుంబ జీవనమును ప్రతిబింబింప జేసినవో పరిశీలింపనగును.

కుటుంబమునకు తండ్రియే యజమాని. అది పితృ క్రమానుగత సంప్రదాయము. అతడు కుటుంబములోని వారందరిని దృష్టిలో పెట్టుకొని అధిపత్యము

౯రపవలసి యుండినను తగిన స్వేచ్ఛ గలవాడు.

"....     ....     ....     ....     ....     ....

పూవోలె సీతాను వలలో — పుట్నింట పిలచిరీ వలలో
మల్లెశాలల వున్నా ,, — ఓ మామా గారూ ,,
మా యన్నలొచ్చినరు ,, — మమ్మంప రయ్యా ,,
ఏరి మీ యన్నల్లు ,, — ఏవే గుర్రాలూ ,,
అదుగదుగో అన్నల్లు ,, — ఇదుగో గుర్రాలు ,,
సీత మీ పుట్నింట ,, — ఏమీ పండుగలు ,,
శ్రీరాము పుట్నింట ,, — సీతా నోముల్లా ,,
దయగల పుట్నింట ,, — తమ్ముల్ల పెండ్లి ,,
అట్లయితె నేనెరుగ ,, — మీ యత్తే గానీ ,,
వంట శాలల వున్న ,, — ఓ యత్త గారూ ,,
మా యన్న లొచ్చినరు ,, — మమ్మంప రమ్మా ,,
అట్లయితె నేనెరుగ ,, — నీ మరదే గానీ ,,

...     ...     ...     ...     ...     ...     ...     ...     ...

అట్లయితె నేనెరుగ ,, — నీ భర్తే కానీ ,,
శ్రీరామ చంద్రుడ ,, — ప్రాణా వల్లభుడ ,,
మా యన్న లొచ్చినరు ,, — మమ్మంప రయ్యా ,,
కట్టుకోవె కావిచీర ,, — కదలు నీ భూమీ ,,
తొడుగు కోవె తోపురవిక ,, — తొక్కూ నీ భూమీ ,, *,,

ఈ పాట అవిభక్త కుటుంబవ్యవస్థను గూర్చి కన్నులకు కట్టించుచున్నది. కోడలు పుట్టింటికి పోవలెనన్నచో దొలుత యజమాని యగు మామ యొక్క అనుజ్ఞ పొందవలసి యుండును. తర్వాత అత్త యనుమతి, ఆ తర్వాత కుటుంబములోని వారందరి యనుమతిని ముఖ్యముగా భర్త యనుమతిని పొందవలయును. అవిభక్త కుటుంబమందలి కోడలి బాధ్యత అట్టిది. కొన్ని కుటుంబ

ములలో పెలుత అత్తగారి యనుమతిని యర్థించ వలయును. తాను స్వయముగ అనుమతించినచో బాగుగా నుండదనుకొని యజమాని ఆ బాధ్యత కుటుంబమునకే యప్పగించును. అట్లందరి యభిప్రాయముతో నేకీభవించుచుండినప్పుడా కుటుంబము ప్రశాంతముగ నడచుచుందును. పై పాటలోని కోడలు ఇంటికి పెద్ద కోడలైయుండును. ఆమె భర్త కుటుంబములో రెండవ యజమానిగా గుర్తింపబడుట జరుగును. భర్త యనుమతి బడసిన పిమ్మట నామె ''ఇరుగక్క పొరుగక్క ఇదె పోయి వత్తు-మరదుల పెళ్లికి మరలి వచ్చెదను,, అనుచు నిరుగు పొరుగు వారికి గూడ చెప్పి తల్లిగారి వాడలకు బోవుట యొప్పును. అత్తగారింటినుండి తల్లిగారింటికి గాని, తల్లిగారింటినుండి అత్తగారింటికి గాని బయలు వెడలునప్పుడు సాగనంపుటకిరుగుపొరుగువారు వచ్చి కలియుట చక్కని సామాజిక సాక్ష్యము.

యాజమాన్యములో తండ్రితోబాటు తల్లికి గూడ తగిన ఆధిపత్య ముండును ప్రతి విషయములో వారిద్దరి యనుమతి ముందు గైకొనుట జరుగును. స్థిర చరాస్తుల సంరక్షణలో యజమాని బాధ్యత ముఖ్యమైనది. వాని సంబంధమున ఏవేని మార్పులు చేర్పులవసరమై యుండిన యెడల నతడు తన భార్యతో, పెద్ద కుమారునితో సంప్రదింపులు చేయును. కుటుంబాభిమానముగల యజమాని గాని, యజమానురాలుగాని ''పుణ్యమ్ము మాయింటి పెద్దలకు వచ్చు-బుద్ధుల్లు మాయింట బాలలకు వచ్చు-ఆచారం మాయింటి ఆడపడచులకు ఆజ్ఞలు మాయింట కోడళ్ల కగును ,, ఇటు తలంచి కుటుంబ గౌరవమును కాపాడు చుందురు. మధ్యయుగమున కుటుంబాధిపతి నిరంకుశముగా నుండెడువాడని చెప్పుదురు కాలానుగుణమైన మార్పులకులోనై కుటుంబ యాజమాన్యములోనే గాక కుటుంబ వ్యవస్థలో సహితము మార్పులు వచ్చినవి. సామాన్యముగ యజమాని సామరస్య పూర్వకముగ వర్తించుట పొసగుచుండును.

## తల్లి దండ్రులు-కొడుకులు-కుమార్తెలు:-

అత్తవారింటి నుండి వచ్చిన ఆడబడుచునకు పుట్టింట ఆప్యాయత లభించుట పరిపాటి.

ఇల్లలికి ముగ్గుపెట్టి వలలో—ఇంటీ సుందారీ వలలో
ఈ ఇంటి సుందారి ,, —ఎందూ వోయింటీ ,,
తల్లి గారి వాడల్లు ,, —చూడా వోయింటీ ,,
అమ్మ ఏమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
అమ్మ ఆరు నెలలూ ,, —ఉండీ పొమ్మానే ,,
అయ్య ఏమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
అయ్య పొత్తుల అన్నం ,, —తీని పొమ్మానే ,,
అక్క ఏమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
అక్క అద్దపు రవికే ,, —తొడుక్కొ పొమ్మానే ,,
చెల్లెలే మన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
చెల్లెలు చెట్ల రవికా ,, —తొడుక్కొ పొమ్మానే ,,
అన్న ఏమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
అన్న ఆవు పెయ్య ,, —కొట్కొ పొమ్మానే ,,
వదినె ఏమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
వదినె వన్నెల దేవీ ,, —వండీ లేదానే ,,
తమ్మడే మన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
తమ్ముడు తనపెండ్లీ ,, —సేసి పొమ్మానే ,,
మరదలేమన్నాదే ,, —ఓ రామా చిలుకా ,,
మరదళ్లు మంచినీళ్లు ,, —లేవు పొమ్మానే,,* ,,

కుటుంబములో నాడబడుచు సంబంధమున తల్లి దండ్రులకు, అన్నదమ్ములకు, అక్కా చెల్లెండ్రకు, వదిన మరదండ్రకు గల సంబంధములు సూటిగా వ్యక్తమైనవి. రక్త సంబంధముగల తల్లి దండ్రులు, తోబుట్టువులు చూపెడు ఆదరణ అమలినమైనది. కాని వదినగాని, మరదలుగాని ఆడబడుచు నమర్యాద చేయుదురు. ఆమె కొన్నాళ్లుండినచో నోర్వలేరు. సారె చీరలతో నామెకు ఒడినింపుటను సహింపజాలరు. ,,యెండేటి ధాన్యము ఎత్తుకొని పోమ్మ—వండేటి వంటకము వార్చుకొని పోమ్మ,, అని యెత్తి పొడుచుటయే గాక ఆమెను పరయింటి

గృహిణిగా గణింతురు. తాము మాత్రమే సర్వహక్కులు గలవారమని భావించు కొందురు. అంతేగాదు, ,,ఆడ బిడ్డ కళ్లు అవి రెండు పోతే—గట్టు మీది గంగమ్మకు గారెలు వండి పెడుదు,, నని కూడ మ్రొక్కు కొనుటలో వెనుకాడని వారును గలరు.

అన్నలు తన్ను బలుకరించనిచో ఆడుబిడ్డ వారిని ఉపాలంభించుటలో వెనుకాడదు,

,,మూడేసి పెట్టెల్ల ధనము నీకుంటే—ముక్కు పోగుఁదాన్ని అన్నరోనేను
నాలుగేసి పెట్టెల్ల ధనము నీకుంటే—నక్కి రైకల దాన్ని అన్నరోనేను
ఐదేసి పెట్టెల్ల ధనము నీకుంటే—ఏళ్ల వుంగరము దాన్ని అన్నరోనేను*,,

పెరిగి పెద్దవారైన తరువాత అన్నదమ్ములకు, అన్నా చెల్లెండ్రకు నడుమనిట్టి యెడపెడ సంబంధములుండుటకు స్వార్థమే కారణమగుచున్న దనవచ్చును. కష్టించి యామెకు సారె చీరలెందుకు పెట్టవలె ననెడు భావము కొందరి అన్న దమ్ములలోను, తల్లి దండ్రుల ఆస్తిపాస్తులలో మాకు కూడ భాగమున్న దనెడు భావము అక్కచెల్లెండ్రలోను ఏర్పడుచున్నవి. చిన్నతనము నుండియు నీ స్వార్థము బీజ రూపమున గన్పట్టుచునే యుండును.

చెల్లెండ్రు తమ్ములు, తల్లి తర్వాత అక్కమీద అనురాగమును బెంచు కొనుట సహజము. ఆమె యత్తవారింటి కరుగునప్పుడు వారి యనుబంధములో నశ్రువులద్దుపడుచుండును. శకుంతల అత్తవారింటి కేగుచున్నపుడిట్లే మృగాదులు చిన్నవోయినవి:

| | | | |
|---|---|---|---|
| ,,మా బావ వచ్చాడు | ఓయి సెల్లులా— | నేనెల్లి వత్తాను | ఓయి సెల్లులా |
| నన్ను మరువాకండి | ,, | —నామాట మరువాకు | ,, |
| అమ్మ మాటా యీను | ,, | —అన్నాకి తమ్ముడికి | ,, |
| అమర్చి పెట్టావె | ,, | —ఇరుగు పొరుగోరితో | ,, |
| ఇష్టంబుగా వుండు | ,, | —పక్కనుంచి లెగిసి | |
| పటిరోజు గుడికిని | ,, | —పదిలంగ ఎల్లిరావె | ,, |

అనుచు చక్కని బుద్ధులు గరపుట యగును. ఒక్కొక్క మారామె వెంట చెల్లెలు గాని, తమ్ముడుగాని పోవుచుండుట కూడ గలదు.

,,అక్కలను చెల్లెండ్ల నొకర్కారి కిచ్చి—వొక్కడే అన్నయ్య వొచ్చెన్న పోడూ
వచ్చెన్న పోతుంటె ఏరడ్డ మాయే—ఏటికీ ఎంపలీ తీగడ్డ మాయే

తీగకీ తిరుపతీ కొండడ్డమాయే—కొండ పక్కన రెండు గోదుమ్మ చెట్లూ*

అక్క సెల్లెండ్ర నొక్క యూరి కిచ్చినప్పటికిని చూచిపోనన్నలు రాలేకున్నచో వారు దుఃఖించెదరు. కుటుంబ యాజమాన్యమున దల్లి దండ్రులు నిర్వహించు పాత్రను గూర్చి, అత్త యింటనున్న పడతి పరిస్థితిని గూర్చి పైపాట తెలుపుచున్నది. కొన్ని కారణముల వలన అత్త యింటివారికి పుట్టింటివారికి మధ్య అభిప్రాయ భేదము లేర్పడగా రాకపోకలకు కూడ అనుకూలముండదు. అప్పుడా పడతి బ్రతుకడకత్తెరలోని పోకవలెనుండును. పరిస్థితులు మెరుగెక్కిన పిదపనే ప్రాణము కుదుటపడగలదు. చుట్టమువలె జూచిపోవుట కైనా వచ్చినప్పు డత్త వారింటిలోని సంసారపు టిబ్బందులను విన్నవించుకొని కుమిలెడు సెల్లెలిని అన్న ఓదార్చును. ఆమెను పుట్టింటికి దోలుకొనిపోవుట కతడు వచ్చినప్పుడు, ,,వయిడి సెంబుల నీళ్లు పాదములకిచ్చి–స్తంభాల మరుగుకుపోయి కన్నీరునింపి,, నది. అదిగాంచి చెల్లెలి నత్తవారెంత కష్టపెట్టిరో యని భావించి వెంటనే ,,తుడుచుకో కన్నీరు ముడుచుకో కురులు—ఎత్తుకో పాపని ఎక్కు అందలము" అని అభయమివ్వగా నామె అత్తమామల సెలవు దీసికొని కుటుంబములోని వారందరికి జెప్పి ,,ఇరుగుపొరుగులార ఓ యమ్మలార—చెల్లెళ్ల పెళ్లిళ్లు సేవించ బోయి—మరదుల పెళ్లికి మరలి వచ్చేను,, అనుచు నిరుగుపొరుగు వారలకు కూడ చెప్పి పుట్టింటికి బయలుదేరును. ఆమె మనసు నొప్పింపక నామె కిష్టమైనవి సాధ్యమైనంత మటుకన్నలు సమకూర్చి పెట్టెదరు. అన్నింటికన్న ,,పుట్టింటి సంపత్తు పొగడికలు దెలుపూ—ఆపుతరపుల్లిచ్చె ఆడుబిడ్డలకు,,

,,చింతపూవు చింతపూవు రాలంగ-చిన్నారి కొప్పులు బెట్టంగ
పండుబాయె దండుబాయె మాయన్న-దంట దెచ్చె మాయన్న
సూర్యాపేటకు బాయె మాయన్న-సూసిన రైకలు దెచ్చె మాయన్న
పట్నం బాయె మాయన్న-పట్టు చీరలు దెచ్చె మాయన్న

.... .... .... .... .... ...

అన్న లయిదారుగురున్నచో చెల్లెలికి సౌకర్యము లెక్కువగ సమకూరును. వారందరి ప్రేమలో ,,ముగ్గురన్నలతోడ నే బుట్టినాను-నా నడుము ముప్పంచు చీర గోరింది... ..... ..... .... ... ...అయిదుగురన్నలతోడనే బుట్టినాను-నా వొళ్లు అద్దాల రవిక గోరింది,, అనుచు కోరికలు దీర్చుకొనుటలో వారి అన్యోన్యానురాగములు గుబాళించును. ఆడుబిడ్డకు పుట్టింటి మీద ఎల్లకాలము మమత గొట్లాడకపోదు. అందుకే ,,పుంటికూర తిన్నా పుట్టి నిల్లు,, నకు సాటి రాదను లోకోక్తి పుట్టినది. పుట్టినిల్లు చల్లగ నుండిననే గాని తనకు సారెచీరల కొదవ యుండదు. కనుక ,,పాటిమీద పచ్చజొన్న పండీననాడు-పదిపుట్ల గాదె పోసిననాడు-పసుపు కుంకుమ దాన్ని అన్నరో నేను- ఏటిమీద ఎర్రజొన్న పండీననాడు-వెయ్యి పుట్లా గాదె పోసిన నాడు-అంగి రవికెల దాన్ని అన్నరో నేను,, అని భావించుచుండునే గాని యిబ్బందులలోనున్న వారిని మరింత యిబ్బందుల పాలు జేయజాలదు. ఆమెకు పుట్టింటి మీద గల మమతలో తల్లి మీద మమత మరింత మిక్కుటమైనది. ,,పుట్టిన్నాటినుండి పువ్వొల్లేసాకి-కన్ననాటి నుండి గారాన సాకి,, నందుల కామెకు "ఏరుపారిన పోదు ఏటి మీదిసుక-తలచు కున్న పోదు తల్లిపై మరులు,,. ఇంతేగాక పుట్టింటి వారి కాడుబిడ్డ ఒక దేవత వంటిది. ఆమె శపించినచో ఆ యిల్లు నెగడదను విశ్వాసము గలదు. ఈ విషయమును మనువు గూడ వచించినాడు 1. అందుకే పంటలప్పుడు, పండుగ

---

1. ,,జామ యోయాని గేహాని శపంత్య ప్రతి పూజితాః
తాని కృత్యాహ తానీవ వినశ్యంతి న మంతతః
-మనుస్మృతి-అధ్యా. 3-శ్లో. 58

పబ్బము లప్పుడామెను దోలుకొనివచ్చి అన్నదమ్ములు తమకు గలిగినట్లొడి నింపుచుందురు. ఒడి నింపుట యన్నదొక విధముగా నామెను పూజించుటయే. అత్త గారి యింట నున్నప్పు డామె నప్పుడప్పుడు సోదరులు వచ్చి చూచి పోవు చుండవలెను. రాకపోయినచో ,,అంచెగా మాయన్న లొస్త మన్నారా—వారెందు కొస్తారు రాజులఖిల్లు,, అని దెప్పి పొడుచును. పెద్దన్న యెప్పుడు రానందులకేమో ఆమె ,,నేరేడు పండంటి అన్న నాయన్న—నేడు వస్తానని నెలకన్న రాడు తాను వస్తానని తమ్ముణ్ణి పంపు—ఏమోయి పెద్దన్న ఎన్నటికీ రావు,, అనుచు చిన్నబోవగా ,,ఏచేట పెళ్లిళ్లు కుప్ప నూర్పుల్లు—ఎడలేదు చెల్లెలా నినుచూడ రాను,, అనుచు పెద్దన్న తీరుబాటులేని తన యవస్థను దెలుపుకొనును. అన్న దమ్ములకు పండెడు ప్రతి పంట కాడుబిడ్డ పంటదేవత. దేవతకు నైవేద్యమిడుట యెట్లో ఆడు బిడ్డకు కూడ బాగుగా పంటలు పండినచో సారె చీరలు పెట్ట వలసి యుండును. దీని వలన సోదరులకు ఫలితము కూడ మెరు గెక్కును.

,,ఎన్నాళ్లో కొచ్చినాయి జొన్నల బండ్లో—దారిలో జొన్నల బండ్లో
జొన్నల బండ్లు గాపు అన్నల బండ్లో — ,, ,, ,,
అన్నలా బండ్లయితే కొంగు లొడ్డాలె — ,, ,, ,,
... ... ... ... ... ... ... ... ...
నా ఏడ్గురు వొదినెల్లు తట్ట మొయ్యంగో — ,, ,, ,,
తట్టా తట్టాకు నేను సుట్టానైదో— ,, ,, ,,
నా ఏడ్గురు అన్నల్లు బాయి తోడంగో— ,, ,, ,,
బాయి బాయాకి నేను బతుకమ్మనై దో— ,, ,, ,,
నా ఏడ్గురు అన్నల్లు నాగలి దున్నంగో— ,, ,, ,,
నాగటి నాగటికి నేను నాగమ్మనై దో— ,, ,, ,,
నా ఏడ్గురు వొదినెల్లు ఇత్తున మెయ్యంగో— ,, ,, ,,
ఇత్తూ ఇత్తూకు నేను ఈ దమ్మనై దో— ,, ,, ,,
... ... ... ... ... ... ... ... ... ... ... ...*

అన్నదమ్ములు తమకు కలిగినప్పుడెల్ల ఆడుబిడ్డకు సారెచీరలు పెట్టినచో నామె అన్నలు తోడే బావిలో నీరై, వదినలు మోసెడు తట్టల క్రింద తలచుట్టలై, దున్నే నాగలికి పదునై, వేసెడు విత్తనమునకు జీవమై, పెరిగెడు చేనికి కాపలై చక్కని పంటలను చేకూర్చునదగును. ఆడుబిడ్డ అన్నదమ్ములపాలిటి అపరలక్ష్మి. వారితో నామె సారెచీరలందుట ఒకయెత్తు వియ్యమందుట మరొక యెత్తు. ,,పచ్చనీ కుచ్చుల్ల పాలకీ నెక్కి—బలంబు జూడొచ్చె దుర్గయ్య లక్ష్మి అన్నతో వియ్యంబు అందవచ్చింది—వదినెతో వరపొసుకు ఆడవచ్చింది". ఇట్లు వియ్యమందుటను మేనరికమందురు. ఈ విధాన మెక్కువగా తెలుగునాట ఆచరణ మందున్నది.

మారు దల్లి బిడ్డయైనచో ఆ చెల్లెలితో అన్నదమ్ముల సంబంధములు వేరుగా నుండును. వారి మధ్య ప్రేమలంతగా నుండవు. అసలు సొంత చెల్లెలి మీదనే కొందరికి ప్రేమ అంతంత యుండినచో మారు చెల్లెలిమాట చెప్పవలెనా? ,,మామిండు పూచినవీ మాటలొచ్చినవీ—మర్వన్న చెల్లెలా మాకాశపడకూ తంగెళ్ళు పూచినవీ దారులొడ్డినవీ—దయగల్ల చెల్లెలా మాకాశపడకూ,, అందురు. అట్టి మారు చెల్లెలి పెండ్లి సేసి అత్తవారింటి కంపి లాలన పాలన విషయములో పట్టించుకొనరు. పాప మామెకు తండ్రి యున్నను లేనట్లే. తల్లితోడనే తరము వాసి పోవును.

ఆలు మగలు:-

కుటుంబములో ఆలుమగలు మూల స్తంభముల వంటి వారు. వారి సంబంధములు కుటుంబ జీవన మార్గారంభములు. జానపద కుటుంబములో వారన్యోన్యానురాగ బద్ధులై చేదోడు వాదోడుగా నొండొరులు సహకరించుకొను చుందురు. సముద్రములోని ఆటుపోటులవలె వారిమధ్య అప్పుడప్పు డెత్తి పొడుపులు, ప్రణయ కలహములు సామాన్యము. పరస్పరము పేర్లుపెట్టి పలుక రించుకొనుట అరుదు. భర్తను పలుకరించవలసినప్పుడు 'విన్నావా', 'ఇగో', యనియును, ఇతరులతో నతని గూర్చి చెప్పవలసినప్పుడు 'ఆయన' 'వారు'

మరియు సరసజీవనములో 'బావ, 'మామ, అనియును వ్యవహరించును. ఇంచు మించుగ నిదేరీతిలో భార్య విషయమున భర్త వ్యవహరించుటయేగాక చిలుక, హంస అని ముద్దుగబిలుచుట ఒప్పును. ,,చిలుక నీళ్ళుతోడె జలకమాడేను—హంస అన్నము వండె ఆరగించేను వెలది మంచము వేయ వెన్నెలబైట—పడతి పానుపు లెయ్యి పవ్వళించేను - ఆకుతేవే పోకతేవే అడకత్తి తేవే—చూడ సున్నపుకాయ చుట్టియ్యి మడుపు సన్నంగ చుట్టియ్యి సగము కొరికియ్యి—యెంగిలెంగిలి శివుడ యెగ్గు పట్టేవు – మనకేమి ఎంగిలి పుణ్యపురుషులకు,,. పని తీర్చుకొని భర్త యింటికి రాగానే భార్య నీళ్లు తోడగా నతడు స్నానమాడును. అన్నము వడ్డించగా ఆరగించును. మంచము వేసి పానుపు పరచగా మేను వాల్చును. ఆకు విడెము లందించ సగము కొరికించుకొని సగము నెమరువేసి నిద్రించుచుండ జాము రాతిరి వరకామె విసనకర్రలతో విసరి హాయిగా నిద్రబుచ్చును. కాని యే కారణముననో భర్త భార్యను కౌగిట చేర్చుకొనక పోవుటచేత ఆమె తన ప్రక్క నున్న స్తంభమునకొరగి తెల్లవార్లు కన్నీరు కార్చుచుండును. అంతసేవ చేసిన పిదప కూడ కరగించ కున్నచో ఆమె కన్నీరు మున్నీరు కాదా! అయినను పల్లెత్తు మాట ఆ యిల్లాలనదు. తెల్లవారగానే రాత్రి విషయమును కనుమరుగున దాచి కర్తవ్యోపదేశము చేయుచు గృహిణి—,,చుక్క తెల్లవారె తూర్పు తెల్లవారె తులసెమ్మ పెనిమిటిని ఏమున్ని లేపు—కలవల చెర్లోకి నీళ్ళు చేరేయి—కాళ్ళు కడుగ మీకు వేళాయె లెండి—మొగ్గల చెర్లోకి నీళ్ళు చేరేయి—మొహము కడుగ మీకు వేళాయె లెండి,, అనుచు మెల్లన సుప్రభాతము పలుకుటలో విభుని పాదములను కలువల కాంతిగాను, మొగమును వికసించనున్న మొగ్గలుగాను దర్శింపగోరినది. విభుడు లేచి తన్నుజూచి విసుగు జెంద కూడదని, కలువల సుకుమారత్వము పాదములలో నుండవలెనని, మొగ్గల సువాసన వంటి గుండె తీపి మొగమున ఉట్టిపడవలెనని ధ్యానించుటలో పతిని దైవముగా సాక్షాత్కరింప దలచినది.

ఆలుమగల మధ్య ఎత్తిపొడుపులు గూడ సహజమైన కుటుంబజీవనము నెలుగెత్తి చాటుచుండును. ,,పున్నమ నాడైన బూరెలొండు కొనీ—పుణ్యుడా రమ్మని పిలిచిరా మీవాళ్లు—అమవాస్య నాడైనా అట్లు పండుకొనీ—అల్లుడా రమ్మని

పిలిచిరా మీ వాళ్లు,, అనుచు భర్త భార్యను దెబ్బ కొడుచుచుండ నామె వంకర చూపులతో మూతి త్రిప్పుచు ,,మా వాళ్ళు పేదవాళ్ళు మాకేమి కలదు—పెట్టగల పెద్దింట పెండ్లాడ రాదా— అచ్చటలు ముచ్చటలు అప్పుడే తీరేను,, అనుచు చేతులాడించగా భర్తకు పౌరుషము, చిరుకోపము రాక మానదు. వెంటనే ,,ఎడమ మీసం దువ్వి పాంకోడుతో తన్నె" ను. భర్తతో కీచులాడిన భార్య తల్లి వారింటికి పోవుట జరుగును. కనుక ఆమె ,,మువ్వల పాపన్ని చంకబెట్టూ కోని—వెళ్లెనే—సుభద్ర అన్నవాడఁకూ". అన్ని యంశములుండ కాలినడకతో ఆడుబిడ్డ వచ్చుట తల్లి దండ్రులకును అన్నదమ్ములకును గుండె గుభిల్లుమనును. ,,ఏనుగులు వుండంగా గుర్రాలుండంగా—పల్లకీలుండంగ బానిసలుండంగా—కాలి నడుకను రాను కారణం బేమీ,, యని సంభ్రమ చకితులై యడుగుదురు. అప్పుడావడతి తనకు భర్తకు మధ్య జరిగిన తగవును గూర్చి వివరించును. అంతనామె సోదరులు ,,అటక మీదున్నాయి అంచు బిందెల్లూ—ఇదిగోనె చెల్లెలా నీకు హరణమ్ము—మందలో వున్నాయి పాడి ఆవుల్లు—ఇదిగోనె చెల్లెలా నీకు హరణమ్ము—పసుపు కుంకుమ నీకు పళ్లాలా పోస్తీ—ఇదిగోనే చెల్లెలా నీకు హరణమ్ము—గౌరవమున నీవు కలిసి మెలిసుండూ,, అని చెప్పి కావలసినవి యిచ్చి యామెను తిరిగి అత్తవారింటి కంపుచుందురు. తల్లిగారింటినుండి కట్నాలు కానుక లెన్ని యెక్కువ తెచ్చుకొన్నచో నంత గౌరవమూ యిల్లాలికి దక్కును. భర్త దెబ్బ కొడుచుటకు వీలుండదు. భార్యా భర్తల మధ్య సంబంధములు కుదుట పడగలవు. భార్య కూడప్పుడప్పుడలుకతో నుండి నట్లయిన ,,వడ్డాణ మిదిగోయె వయ్యారి భామా—నీ నడుముకైన పెట్టుకోయె సుందరిపిల్లా—నీ నడుము చక్కగుంటుందె నాయుడోలమ్మి,, అని నగలు తెచ్చి పెట్టగా అలుక తీరిపోవుచుండును నగలన్నచో స్త్రీలకు ప్రీతి. అవి పండుగ సందర్భములలోగాని యెక్కడికైనా వెళ్లినపుడుగాని ధరించుటపరిపాటి. అందుకే ఆమె 'ఎప్పుడెట్టుకోవాలో అప్పుడెట్టుకోవాలి-పండుగపున్నానికి సోకుదారిమగడ' అని మురిసిపోవును. ఇంకను వారిమధ్యగల అలక పట్టింపులను తడక, పిల్లి, పావురము, చిలుక, మున్నగునవి మధ్యవర్తిత్వము వహించి తీర్చుచుండును.

భార్య:- వంకాయ వండాను - వరికూడు వార్చాను
తినమనీ చెప్పవే - తడికా తడికా

భర్త:- వగలాడి మాటలకు - ఒళ్లంత మండింది
వద్దనీ చెప్పవే - తడికా తడికా
పట్టుచీర తెచ్చాను - పెట్టెలో పెట్టేను
కట్టమని చెప్పవే - తడికా తడికా

భార్య:- చీర కంచులులేవు - చుట్టూ చెంగులు లేవు
వద్దని చెప్పవే - తడికా తడికా

భర్త:- సంతలోకి వెళ్లి సరిగంచు చీరను
అద్దాల రవికను అతివ తెచ్చెద కట్టుకోవే

అలుకలో పలుకరించుకొనకుండ నుండ వలెననుకొని ఉండజాలని ఆలుమగల సంభాషణలో తడిక రాయబారము వ్యంగ్యాత్మకమై సరసస్ఫోరకమై యలరారును.

అలవోకగా అన్నదమ్ముల మీద పాటలను గట్టి పాడుకొనుచున్నప్పుడామె మీద కన్నెఱ్ఱజేసి భర్త "అన్నల్ని పాడేవు తమ్ముల్ని పాడేవు నన్నేల పాడవే సిరిగౌరిదేవి,, అన్నప్పుడు "ఏమని పాడేది వెర్రి మాధవుడా,, అనగానే "తర తరంబుల వారు తరియించపాడు - కాకి బాణము తొడిగి కంచు రథమెక్కి- కాముడూ నావాడు వచ్చెనని పాడు - పూల బాణము తొడిగి పుష్ప రథమెక్కి- పుణ్యుడూ నావాడు వచ్చెనని పాడు" మని కోరుకొనును. వారి ముచ్చటలందు చేదు తీపి కలిసిన విధముగ చమత్కార పూర్వక సంభాషణలు చకిత చకితముగా నుండును.

భార్య:- సిన్నంగ పుట్టిన సిలుకల్ల బాలుసీకి
సిరిబొమ్మరిల్లంట ఏసింటిరా— నేను
సిలుకల్ల పెండ్లంట సేసుంటిరా
వొగసీకి కాలిచ్చి వొగసీకి సేయిచ్చి
వొగాని మీద నే నొరిగుంటిరో —నేను

వొగాని మీద నే వొరిగుంటిరో

భర్త:- ఎవనీకి కాలిచ్చి ఎవనీకి సేయిచ్చి
ఎవ్వాని మీద నువు వొరిగుంటివే — నువ్వు
ఎవ్వాని మీద నువు వొరిగుంటివే

భార్య:- కంచరోనికి కాలిచ్చి గాజులోనికి సేయిచ్చి
వాడ్లోని పీట మీద వొరిగుంటిరో — నేను
వాడ్లోని పీటమీద వొరిగుంటిరో
వొగన్ని నోటబట్టి వొగన్ని సేతవట్టి
వొగన్ని కాలుతోని రాకుంటిరా — నేను
వొగన్ని కాలుతోని రాకుంటిరా

భర్త:- ఎవ్వన్ని నోటవట్టి ఎవ్వన్ని సేతవట్టి
ఎవ్వన్ని కాలుతోని రాకుంటివే — భామ
ఎవ్వన్ని కాలుతోని రాకుంటివే

భార్య:- పోకబద్ద నోటబట్టి ఆకుసంచి సేతవట్టి
ఉమ్మిని కాలుతోని రాకుంటిరో — నేను
ఉమ్మిని కాలుతోని రాకుంటిరో

ఇట్టి సంభాషణలో ఉత్త చమత్కారమే గాదు, భార్య తన భర్తను సందేహము లోను, ఆనంద సందోహములోను ముంచెత్తును. ముంచెత్తుటలోగూడ నీ క్రింద తాను దినాంతమున చేసెడు గృహకృత్యముల నెట్లు చమత్కరించుచున్నదో గమనింపుడు. భార్యాభర్తలకు పడకటింటిలో జరిగిన సంభాషణమిది.

భార్య:- వొగన్ని గట్టేసి వొగన్ని ఇడిసిపెట్టి
వొగన్ని కోసమై పొయ్యుంటిరో — నేను
వొగన్ని కోసమై పొయ్యుంటిరో

భర్త:- ఎవ్వన్ని గట్టేసి ఎవ్వన్ని ఇడిసిపెట్టి
ఎవ్వన్ని కోసమై పొయ్యుంటివే — భామ
ఎవ్వని కోసమై పొయ్యుంటివే

భార్య:— బర్రెన్ని గట్టేసి దూడను ఇడిసిపెట్టి
దుత్తాకంట పేను పొయ్యంటిరో — నేను
దుత్తాకంట పేను పొయ్యంటిరో
వాగన్ని మూసిపెట్టి వాగిళ్ళి కప్పిపెట్టి
వాగన్ని కొంగుతో ఇసిరుంటిరో — నేను
వాగన్ని కొంగుతో ఇసిరుంటిరో
భర్త:— ఎవ్వన్ని మూసిపెట్టి ఎవ్వన్ని కప్పిపెట్టి
ఎవ్వన్ని కొంగుతో ఇసిరుంటివే — భామ
ఎవ్వన్ని కొంగుతో ఇసిరుంటివే
భార్య:— కుండాలు మూసిపెట్టి కంపాటి కప్పిపెట్టి
దీపాన్ని కొంగుతో ఇసిరుంటిరా — నేను
దీపాన్ని కొంగుతో ఇసిరుంటిరా* భార్య, ఇంటి కోడలు కావున సంజ ప్రొద్దున ఇంటికి వచ్చిన బర్రెను గట్టివేచి, కొంతసేపయిన తర్వాత దూడను విడిచి చనుగుడిపించి, దుత్తనిండ పాలు పిండిపెట్టి, పెద్దలు పిన్నలు భోజనముచేసిన పిదప మిగిలిన వంటకుండలు మూసి, కుంపటి తొట్టిలో నిప్పుగప్పి అందరు పండినది చూచి దీపమునార్పి పడకటింటికి బోవుటతో నాటి గృహకృత్యము ముగియుచుండును. పడకటింట నున్న భర్త ఆమె ఆలస్యముగ వచ్చుటను గమనించి యడిగినప్పుడు పైరీతిగా చమత్కరించుచు నర్మభాషణము చేసినది.

భర్త దేశాంతర గమనుడగుచున్నాడని తెలిసిన తక్షణమే భార్య సహింపదు. మొదట గుండెలో దిగులు చొరబారును. కన్నీరు కడవలై దుముకును. ఏమితోచక కాలి బొటన వ్రేలితో మన్ను గీరును. అంతేకాదు— అతను వెళ్లిన పిదప కుశలముగ తిరిగి రావలెనని కాంక్షించుచు దేవతార్చన గావించును. "తలె నిండ బువ్వ పెట్టి తనమొకమటువెట్టి— కంట కన్నీరు దీసేవా ఓ భామా— గోట మన్నులు గీరేవా— ఈనాడు ఈవూళ్ల రేపేమొ ఆవూళ్ల — మర్నాడు మానందిల ఓభామా— మర్నాడు మానందిల— సింగోటం కట్టమీద నరసింహ గుడికాడ— పూలు సల్లితే

పుజ్జేమా ఓభామా- బుక్కసల్లితె పుజ్జేమా,, * తాను దేశాంతరము పోయి వచ్చు విషయము దైవాధీనమే గాని పూలు, 'బుక్క సల్లినంత మాత్రమున పుణ్యము దక్కునని భావించుట అమాయకత్వమని భార్య నోదార్చి వెడలి పోవుట ద్యోతకమైనది.

కూలినాలి వర్గములో భార్యాభర్తలిద్దరు చేయి చేయి కలిపి కష్టించి పొట్ట గడపు కొనుచుందురు. వారి సంబంధములలో రెండు సమస్యలు ముఖ్యముగా గమనించదగును.

భర్త - ర్యాలీ ర్యాప్రులపాడు రేలంగి సంతలోన
చాప్పె పలిగె తెచ్చినానె ముక్కేయ్యవే పిల్ల ముక్కేయ్యవే
భార్య - ఓరోరి నా మగడ ఒయ్యారి నామగడ
ఎర్రిబాగుల నామగడ ఏబ్రాసి నామగడ
రెక్కలున్న సేపకి ముక్కలుంటాయా
భర్త - నరసాపురం పాలకొల్లు మాటేరు సంతలోన
కోడిపెట్ట తెచ్చినాను గుడ్డెయ్యవే పిల్ల గుడ్డెయ్యవే
భార్య - ఓరోరి నామగడ ఒయ్యారి నామగడ
ఎర్రిబాగుల నామగడ ఏబ్రాసి నామగడ
జుట్టున్న కోడికి గుడ్డురబడ్డా.... ....

అమాయకుడైన భర్తను జూచుకొని భార్య ఆడించుట అక్కడక్కడ గన్పట్టును. వండిన చేపల ముక్కలు, తెచ్చిన కోడిపెట్ట గుడ్డును వేయుమని అడుగగా నామె చేపలకు ముక్కలుండవని కోడిపెట్ట గుడ్డుపెట్టదని చెప్పుచు భర్తను వెఱ్ఱివానిని చేయుచు కొంత నేపథ్యంతో హాస్యమాడును.

భర్త కొట్టినను తిట్టినను ఆమె యే పని చేయక ముడుచుకొని పండు కొనును. ఎంత బతిమాలినను వినదు. ఆడదాని కోపమంత తేలికగా శాంతించదు. భార్య నమనయించుటలో భర్తయొక్క ప్రయత్నములన్ని విఫలమగుచుండును.

భర్త:— సోలిపూరం బోయి సోలెడోడ్లు తెచ్చీన
దంచనన్నా దంచుదువు లేవవే
నాకన్న పెడ్దూవు లేవవే—నువ్వన్న తిందూవు లేవవే
భార్య:— నాతిర్నె కొట్నెవు నాతిర్నె తిట్నెవు—నేన్దంచనె దంచను

... ... ... ... ... ... ...

భర్త:— పొట్టి శాపద్దెచ్చీన వుట్టిమీన పెట్టీన
పొండనన్న పొందూవు లేవవే
నాకిన్న పెడ్దూవు లేవవే—నువ్వన్న తిందూవు లేవవే
భార్య:— నాతిర్నె కొట్నవు నాతిర్నె తిట్నవు—నేనొండనె పొండను
భర్త:— పొండకుంటె మానాయె తినకుంటెమానాయె
సాపన్న ఏతూవు లేవవే—పండనన్న పందూవు లేవవే
భార్య:— నాతిర్నె కొట్నవు నాతిర్నె తిట్నవు—నేనెయ్యనె ఎయ్యను*

భార్యాభర్తలలోని యిట్టి ప్రణయ కలహములలో సత్యభామా కృష్ణులు తొంగి చూచిరా యన్నట్లుండును. అయినను ఈ కలహము లెప్పటికి నుండవు. ఆ దినమంత యుండిన నుండవచ్చును. మరుసటి దినమునుండి యథావిధియే. ఇంకను వారిమధ్య అప్పుడప్పుడు సంభవించెడు చిలిపి కయ్యములలో ఒకరిని మించి యింకొకరెత్తుకు పై యెత్తులు వేయుచుందురు.

భర్త:— కొట్టకుండ తిట్టకుండ వుంచుకుంటాను—పిల్ల
చల్లంగ మెల్లంగ నీవుంటవా
భార్య:— చల్లంగ మెల్లంగ నేనుంటను గాని
నవ్వేటి నవ్వు మొగం ఎట్ట పెట్టేది
భర్త:— నవ్వేటి నవ్వు మొగం నీవు పెట్టితే—
చేతిలో దుడ్డుకర్ర చెండాడదా
భార్య:— చేతిలో దుడ్డుకర్ర చెండాడితే—నీ బండారం బయటికీ నే జెప్పనా

భర్త:– బండారం బయటికి నీవు చెప్పితే
మీ అమ్మ గారింటి కెళ్లి నే చెప్పనా
భార్య:– అమ్మ గారింటి కెళ్లి నీవు చెప్పితే
నే కూటి నీళ్ల కాయకుండ దిగ నూకనా
భర్త:– నీవు కూటి నీళ్ల కాయకుండ దిగనూకితే
నే స్టేషనుకి పోకుండ ఎగనూకనా
భార్య:– స్టేషనుకి పోకుండ ఎగనూకితే
బాయిలో గుంటలో నేను పడనా
భర్త:– బాయిలో గుంటలో నీవు పడితే నే
పెట్టోణ్ణి పిలిపించి ఎత్తించనా
భార్య:– పెట్టోణ్ణి పిలిపించి ఎత్తించితే
నే దెయ్యమై భూతమై నిన్ను పట్టనా
భర్త:– దెయ్యమై భూతమై నన్ను పట్టితే
నే భూతగాన్ని పిలిపించి వదల గొట్టనా
భార్య:– భూతగాన్ని పిలిపించి వదల గొట్టితే
నే తిరుపతి కొండెక్కి తిరిగి చూడనా
భర్త:– తిరుపతి కొండెక్కి తిరిగి చూస్తే
చెన్నపురి రేవుకెల్లి చెక్కెయ్యనా

మొత్తము మీద యిట్టి సంవాదములు సరసమునకేగాని విరసమునకు గావు. విరసమే యయినచో ఆలుమగల మధ్య 'రోలెక్కి తల్వాలు' (తలంబ్రాలు) పోసికొన్నట్లే యగును. నోరు మెత్తని మగని జూచుకొని పెత్తనము నెరపు గడుసుదనపు భార్యతో నడచు నట్టి దాంపత్యము మరొక విలక్షణ మొలకబోసి కొనును.

"కంబదూరు కట్టకింద వోరి మొగుడా–నేను కందికలుపు తీయబోతె వోరి మొగుడా
యెంద్రగిత్తి యేలు గొరికె వోరి మొగుడా–నా యేలుమింద గోరుమొలిచె
వోరి మొగుడా

నాకి 1 గొడ్డు గొర్ని 2 కొయ్యరాద వోరి మొగడా-నువు కందిపప్పు చేసుకోర
వోరి మొగుడా

నాకి విసనకర్రతో విసరరాద వోరి మొగుడా—నాకి నిద్దురొచ్చే దాంక విసరు
వోరి మొగుడా,,

ఇట్టి అలుకుగల సంబంధమును గూర్చి వినువారికి హాస్యమే పుట్టును. కాని యీ సంబంధము అరుదుగా గన్పట్టును.

## అత్త - కోడండ్రు:-

జీవితమను నాటకములో కుటుంబ మొక ప్రథమ రంగమైనచో అత్తా కోడండ్రు రంగము మీద విలక్షణమైన పాత్రలు. సాధారణముగ సంసార జీవితములో వారికి పరస్పరము గిట్టదు. అత్త యాజమాన్యములో కోడలణగి మణగియే యుండును. అత్త కోడలినొక దాసిగా గణించునే గాని తన బిడ్డ వంటిదిగా భావింపదు. తానుగూడ ఒకనాడు కోడలి పాత్ర నిర్వహించిననాడు తన యత్త పెట్టిన కష్టముల ననుభవించి నట్టిదే కాని తా నత్తగా మారిన పిదప తన యనుభవములను మరచిపోయి తన్ను తనయత్త యెట్లు కష్టపెట్టినదో యట్లే తన కోడలిని కూడ కష్టపెట్ట జూచును. అత్తా కోడండ్ర మధ్య సామరస్యము అనుస్యూతముగా లోపించుచున్నది. వారివలన కుటుంబ జీవన మెన్నియో అగచాట్లకు లోనగుచున్నది.

అత్తగారింట నడుగు మోపునప్పుడు కోడలు తన తల్లిదండ్రులు బోధించిన బుద్ధులన్ని మతికి దెచ్చుకొనుచుండును. ఎవరితో నెట్లు మెలగవలసి యున్నది గమనించుకొని ప్రవర్తింప నేర్చును. ,,అత్తయింట నడుగుపెట్టి—మొగడురాగ మొగము దాచి—ఎందు కింత సిగ్గు పడుదు వేల నీకు ఇంత సిగ్గు,, మగని చూడగనే సిగ్గుబడువున ముఖమును దాచుకొనుట సహజము. ఎంత దాచుకొని

1. నాకు 2. గొడ్డెను

తిరిగినను, ఎంత అణగిమణగి మసలుకొన్నను కోడలిపైన అత్తగారికి నెనరుండక పోవుట దురదృష్టము. ఇంటి చాకిరి యంత కోడలితో చేయించును. ఎంతో ప్రేమగల దానివలె పనిచెప్పి మోయలేని మోత మోయించును. ,,తమ్ముని బిడ్డాని తన కోడలాని—దయతోడ బెట్టింది తక్కెడేకూలు—బిడ్డాకు పెట్టింది బీరాకు ఎత్తు—తాను బెట్టుకుంది తపుల పాకెత్తు,, ఇట్లు పక్షపాతబుద్ధితో ప్రత్తి వడకు పని కల్పించి ,,అడుకడుకు కోడలా కుడుక కొనిత్తా,, అనుటయే గాక ఇచ్చిన ఏకులను వడక కున్నచో ,,బూడార పంగట్ల బుద్ధి సెప్పిత్తా అయిలార పంగట్ల పంగ బెట్టిత్తా,, ననుచు బెదరించును. దారము తక్కువగా వడికినదని ఆమెను కొట్టబోవగా ,,పుంజమ్మ నూలుకు పోగు తక్కువ—కొండ మీద పొద్దుంది కొట్టబోకత్త,, అని అడుగుకొని పనిచేసి పెట్టుట జరుగును. కాని నిత్యమట్లేయైనప్పుడు కోడలు మాత్రము మనిషి కాదా? కుర్చీక మీద కూర్చొని పని చేయించు అత్త నెంతవరకు సహించు కొనగలదు. అయినను అత్తను ధిక్కరించి మాట్లాడకుండ ,,సింతసెట్లామీద పొద్దులున్నాయి—సింత బడకత్తా సీరెకడికిత్తా—రాగిసెట్లా మీద పొద్దులున్నాయి—రంది పడకత్తా రైక కడికిత్తా,, నని అత్తకు తగినట్లు మారు బలికి ,,అడికినట్టడుకుతది—తడుక కొరుగుతదీ,, ఇట్లు నటించెడు కోడలిని అత్త మరింత ఆరడి పెట్టుచుండును. ఆ కోడలు లోలోపల కుమిలిపోవుట జరుగును. అది చూచిన కొడుకు ,,అవ్వ నీ కోడల్ని ఎవ్వరేమనిరే,, అని యడుగగా నత్త సామాన్యమైనదా? ,,ఎవ్వ రేమనలేదు నే వినను లేదు,, అని బొంకుటయే గాక ,,నీ సిన్న సేతులా సద్ది గట్టుతాను,, అని కొడుకును మంచి చేసికొని తన వైపునకు మలచుకొన ప్రయత్నించును. కుటుంబములో ప్రత్తి వడకుట యన్నది నేడు లేదనియే చెప్పవలెను. ఈ విధముగా మేన కోడలినే ఓర్వని యత్త కొన్న కోడలి నోర్చుకొనునా? అసలు కొడుకు పుట్టగా ఆనందించునే గాని కోడలు వచ్చినచో మొత్తుకొనును. (,,కొడుకు పుడితే ఎత్తుకో కోడలొస్తే మొత్తుకో,,). ,,కోటాకి పేటాకి ఎంత దూరమ్మ—కొని తెచ్చిన అత్తాకి యెంత కోపమ్మ,,

కోడలిని సాధించుటలో నత్త యెంత గడుసుదనమును ప్రదర్శించునో క్రింది పాటను చూడదగును. నిత్యమింటిలో అత్తయెక్క ఆజ్ఞననుసరించి వంట చేయవలసి యుండును. ఒకనాడు పండుగ వచ్చినది. అత్తను సమీపించి కోడలు ,,పండుగా వొచ్చింది ఓ యత్తగారు_పండక్కి బియ్యమ్మో ఎన్ని వోసేది,, అని యడిగినది. ఇత్తు గొట్టి ఇరువై మండికి బెట్టు మన్నట్లత్త ,,పెయ్యవే నిచ్చెనా తియ్యవే గాది_వొయ్యవే తలగీసి తవ్వెడు బియ్యం ఆ బియ్యం నానేసి పిండిగా దంచి- పిండి వంటలు చేసి అరిసెల్లు వండు-ఇరుగు పొరుగూ వారి కింతంత పెట్టు_ఇంట్లోని పిల్లలకు కసరకా పెట్టు_మాపటికి మాపకు మారు మూతెట్టు_మరునాటి చద్దులకు మద్దులకు పెట్టు _మన యింటి పాలేర్లు మురియంగ బెట్టు_మన యింటి మరదలకు మనసుతో పెట్టు,, మని కోడలి నాజ్ఞాపించినది. తవ్వెడు బియ్యముతో జేసిన పిండివంట మాపటికిని, మరునాటికిని, ఇంటి వారందరకు, ఇరుగుపొరుగు వారికి, పాలేర్లకు మురియునట్లు సరిపుచ్చుట మానవులకు సాధ్యము కాని పని. కోడలన్నచో అత్తకు కొరకొర. ,,ఒల్లని కూరలో ఉప్పు విషం,, అన్న సామెత యిప్పట్టున అనుభవమునకు వచ్చును. అత్తల ఆరళ్ల కంతుండదు. ఆమె చిత్తవృత్తులే చిత్ర విచిత్రములు. కోడలిని పిలిచి ,,కోడలా కోడలా కొలికి ముత్యమ్మా_గంగ రేగుపండు బంగారు బొమ్మా,, అనుచు స్తుతినింద చేసినట్లే చేసి ,,దివ్వెట్టి నా కొక్క పేను నొక్కమ్మా_కూటి కుండా మీద గుర్తు లేవమ్మా_పచ్చి పాలమీద మీగడేదమ్మా తేనెకుండల మీద తెప్పలేమాయె-నూనె కుండల మీద నురుగులేమాయె,, అని యడుగగా కోడలిరుగు పొరుగమ్మలను బిలిచి,

,,ఇరుగు పొరుగులార ఓ అమ్మలారా
ఎన్నడూ మా యత్త చోద్యాలు విన్నారా
కూటి కుండా మీద గుర్తులేవనునూ_పచ్చి పాలమీద మీగడే దనునూ
వేడి పాలా మీద వెన్నలే వనునూ,, చెప్పుకొని, ఆ తదుపరి యత్తతో,
,,అత్త నువు బెట్టిన ఆరళ్లకళ్లు_అట్టబొయి అడవిలో మానుగానె తి

మానన్న గానైతి మేకలారగించు—కాయన్న గానైతి కాకులారగించు
పందన్న గానైతి పక్షులారగించు—బలుడు మా తండ్రి పాలు పిండంగ

బంగారు చెంబులో ధారగానైతి—సిరిదేవి మాయమ్మ చల్ల చేయంగ—చిల్లిపోయి కవ్వాన చిటుపగానైతి,, నని వాపోయినది. గుండె లోతున బొరలు దుఃఖమున తల మునకలు వేసినది. ఆడజన్మ యంతటి నికృష్టము మరేది లేదన్న సత్యమును ఆ కోడలు గ్రహించుటలో నతిశయోక్తి గన్పట్టదు. నిత్య జీవితములో నత్తల పోరుకు తట్టుకొనలేని కోడండ్రెందరో బావినో, చెరువునో చూచుకొనుట జరుగును. ఇంతేగాక కోడలిమీద నేరములు మోపి కొడుకుచేత కొట్టించుట యగును. ఆమె తనవలె నొక మనిషియే యని గుర్తింపదు. ఊపిరి సలుపనట్టి పని పెట్టినది. పాపము! ఆ కోడలెంతని చెయ్య గలదు? ధాన్యము చెరగుచు చెరగుచు ,,చేటలో చెయ్యేసి చేనిద్ర పోవ,, గా ,,అంతలో వచ్చింది ఆరళ్లఅత్త—ఏ తల్లి గన్నదే ఏబ్రాసి నిన్ను,, అని గ్రుడ్లు మిటకరించగా నామె ఉలికిపడినప్పటికిని కోపము తెచ్చుకొని మగని దగ్గరకుబోయి ,,రచ్చలో కూర్చున్న రాజేంద్ర భోగి—మీయమ్మ యేదుండు లేచి రావయ్య,, అని మొరపెట్టుకొనగా నతడు వచ్చి ,,అమ్మరో మాయమ్మ మముగన్నతల్లి—నీవు తెచ్చిన కోడల్ని ఏమిటన్నావు,, అడుగగానే ఆమె ,,పొద్దున్నె పొరుగిళ్లకెళ్ల వద్దంటి—మూడిళ్ల ముంజూరు దుయ్య వద్దంటి—నడుస్తూ తలకురులు విప్పవద్దంటి—వాల్చిన రోకల్ని దాట వద్దంటి—చిన్న గడప మీద కాలు వుంచవద్దంటి,,; ,,రోటి కాడి చిట్టునుక తొక్క వద్దన్న—సందెకాడ దీపంబు పెట్టేటివేళ—సప్పుడు కాకుండ పెట్టి రమ్మన్న మాపుకాడ దీపంబు మలిపెటప్పుడు—మర్లి చూడకుండ మలిపి రమ్మన్న—సాపెడు బియ్యమ్ము సరిపోటు వేసి—సాటి యారాలుతో సరితూగమన్న,, అనుచు కానివి పోనివి కల్పించి కల్పించి చెప్పినప్పుడు కొడుకు తల్లి మాటలే నమ్ముచుండును. ఆ కోడలు తన్నభర్త యొక్క అసహాయ స్థితిని గమనించి అలిగి పండును. ,,అత్తింటి కోడలు అలిగి పడుకుంటే—అలుకిల్లు తీర్చేది ములకల్ల కఱ్ఱ,, కనుక తల్లి నేమనలేని కొడుకు భార్యను చేతనున్న ముల్లుగఱ్ఱతో బాదును.

కుటుంబములో అత్త మరియు భర్త మధ్య కోడలి స్థితి కాకులు చితుకబొడిచిన కోయిలపిల్ల వలెను, తల్లి మరియు భార్యల నడుమ కొడుకు పరిస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యిగా నుండును. ఒక్కొక్క మారు భర్త చేత తన్నులు భరింపలేక కోడలు ,,అత్త గారవమ్మ ఆరడి శాయకమ్మ-వత్తులు వత్తాకమ్మ వత్తిగిలుండవమ్మ-కొండెము లన్నీ గూర్చి కొడుకుతో జెప్పకమ్మ-సరిసరిగా నువు వుంటె పడిపడి దండాలమ్మ,, అని వేడుకొనును. అయినను కోడలు తనకు జంకుచున్నది గదా యని యూరుకొనక మరల కొండెములు జెప్పి కొడుకుతో గొట్టించును.

సామాన్యముగా భార్యాభర్తలకు పడకటింటికి బోయినప్పుడే ముచ్చ టాడుట కవకాశము లభించును. అప్పుడే గదా వారు మనసు విప్పుకొని మంద లించుకొనుట యగును. అత్తచేత బొందిన బాధలన్ని భర్తతో ,,చాయ పసుపు లాగ నను దెచ్చినావు- సరసుడా మీతల్లి సాధింపుచూడు-ముద్ద పసుపు లాగ నను దెచ్చినావు-ముద్దుడా సీతల్లి మూతిరుపుచూడు,, మని నచ్చచెప్పు కొనును. అతనికి గూడ కొంత మనసున కెక్కుచుండును. ఇరువైపుల నర్థము చేసి కొనును. కొన్నాళ్లకు వాస్తవమును గుర్తించి భార్యమీద నిత్యము తన తల్లి మోపెడు నిందలను గమనించి ,,అమ్మరో ఓయమ్మ నా ముద్దు తల్లి-ఇందులో తప్పేమి వివరించవమ్మ-అబలను దానట్లు నింద శాయగనూ-మనసెట్లు ఒప్పెనే తల్లిరో నీకు,, అని అడుగ మొదలు బెట్టి నప్పటినుండి కొడుకు మీద కూడ చిర్రుబుర్రు లాడుచు ,తల్లీ అంటె దయ్యం పెళ్లామంటె బెల్లం, అనుచు ప్రేళ్లు విరుచుకొనుట జరుగును. కుటుంబములో నత్తాకోడండ్ర సంబంధ ఫలితముగా

,,ఆడదాని నయి పుట్టుటకంటె అడివిలో మానయి పుట్టుట మేలు,,

,,అత్తమీది కాపురము కత్తిమీది సాము,,

,,ఆడదాన్ని నేను అయి పుడితిగాని-గండర్రి గొడ్డలి క్రింద కొమ్మనైనగాజాలు,,

,,అత్తలేని కోడలు ఉత్తమురాలు-కోడలు లేని అత్త గుణవంతురాలు,,

నీళ్ళ మీది పూదోట నీ యత్తవాడ,, ,,అత్తవారిల్లీది కత్తులబోను,,
,,అత్త చేజారినది అడుగోటి కుండ—కోడలు చేజారినది కొత్తకుండ,,
,,అత్త చచ్చిందని కోడలేడ్చినట్లు,, ,,కొడుకు పుడితే ఎత్తుకో కోడలొస్తే మొత్తుకో,, అను సామెతలు కుటుంబ జీవితములోని వెతలను గ్రథించిన కథలుగా విలసిల్లినవి.

కంటికి కాటుక దిద్దుకొన్నను, సిగల మల్లెలు ముడుచుకొన్నను కోడలిని జూచి మంచిరోజుననే యోర్వని యత్త కొడుకు ఊరలేనప్పుడసలే యూరుకొనదు. గుండె పగిలెడు నిందలు మోపుచుండుట పరిపాటి. ,,కోడలా కోడలా కొడుకు పెళ్లామా—కొడుకు ఊళ్ళోలేడు మల్లెలెక్కడివే,, యని దెప్పి పొడచును. పాపమా కోడలి గుండె యవిసి పోవును. ,,అరటి పూసింది అరటి కాసింది అత్త పెట్టిన ఆరళ్లు మరపునకు రావు,, అని కుమిలిపోవు చుండెడు కోడలికి పుట్టింటి మీదనే మనసు పోవుచుండును. తననిట్టి మనుమిచ్చి పాడుచేసినదని తల్లిగారిమీద కొంత నిష్ఠురపడి ,,కాకర్లు పూసెనే కల్లాకి 1 వారిగే—మాయమ్మ కనింది మండికిచ్చింది—పుట్టిల్లు దవ్వాయె పోరు మోపాయె,,; ,,నెల్లి పూసెనేమో నా నేరమేమో—నెలకన్న రారైరి మముగన్నవారు,, అనుచు తలుపు దాపుననో గోడదాపుననో కంటికి పుట్టెడు కన్నీరు కార్చును. కన్నీరే గదా ఆమెకు ఓదార్పు. తుద కింటిమీదవ్రాలి యరచెడు కాకి అరపే కొంత దుఃఖోపశమనము చేయును. ,,కాకమ్మ నీ కాల కట్టేను గజ్జె—రత్నాల మావారు రాగుయ్యే కాకి కాకమ్మ కూతలు కల్లలూ గావు—కన్న వారొచ్చేటి వేళలుగావూ,, అని విశ్వసించి నేపోమాపో పుట్టింటివారు వచ్చి తన్ను తోడుకొని పోదురని భావించుకొని యెప్పటివలె గృహకృత్యములలో మునిగిపోవుచుండుట నిత్యకృత్యము. దంపుట విసురుట వంటి నిత్యకృత్యములు చేయునప్పుడత్త పక్షము వారిపట్ల, తల్లి పక్షము వారిపట్ల అనుభవమును బట్టి యేర్పడిన యిట్టి వైఖరితో ,,మాయత్త బిడ్డెల్లు

1. ముండకంచె

బర్రెపడ్డల్లు—మాయమ్మ బిడ్డెల్లు సెక్కబొమ్మల్లు—మా యత్త కొడుకుల్లు దున్న పోతుల్లు—మా యమ్మ కొడుకుల్లు ఎలమ దోరల్లు,,* అనుచు పదాలు గట్టుకొని పాడుచు కష్టసుఖములను కలియగలుపుకొని తృప్తిపడుచుండుట కుటుంబమున కోడలి స్థానమెట్టిదో సువ్యక్తము. అత్తా కోడండ్ర మధ్య నేర్పడిన అసూయల కిట్లు కారణము సూహింపవచ్చును. తల్లి, తన కొడుకుమీద చిన్నప్పటినుండి సర్వహక్కులు గలదై యుండుట వలన ఆ కొడుకు వివాహితుడైన పిమ్మట వాడు సహజముగా భార్యపట్ల మెలగదగిన విధముగా మెలగుచుండ, అది చూచి కొడుకు తన అదుపు టాజ్ఞలకు దూరమగుచున్నాడు గదా యని భ్రమించి కొడుకునకు మారు కోడలిమీద అసూయ పెంచుకొనును. అటులనే కోడలు, కన్నవారినందరిని విడిచి భర్తనే నమ్మికొనియుండ ఆ భర్త తన్నుగాదని కష్టార్జితమును ఆతని తల్లికి,తోబుట్టువులకు పెట్టుచున్నాడు గదా యని భ్రమించి భర్తమీద గాక అత్తమీద అసూయను ప్రదర్శించుట జరుగును. ఇది వారి మనస్తత్వము.

అత్తల పోరే గాక ఆడుబిడ్డల పోరు, ఏరాండ్ర ఎక్కెసక్కెములు గూడ గోరుచుట్టుపై రోకటి పోటన్నట్లుండుటచేత, కొందరు కోడండ్రత్త మామలకు చెప్పకుండగనే దగ్గరపట్టుననున్న తల్లిగారి వాడలకు పోవుచుందురు ,,అత్తగారి పోరు గుమ్మడే—ఆడబిడ్డలపోరు గుమ్మడే—పడలేకనేను గుమ్మడే—మా వూరు పోతున్న గుమ్మడే,,. అత్తా కోడండ్ర కొట్లాటలను పట్టించుకొని బుద్ధిచెప్పగల పెద్దవారు బుద్ధిహీనులగుట చేతనే పుట్టింటికి పోవుట యగును. ఇట్టి కష్టములు పడలేక ,,అత్తలేని యిల్లు తుమ్మెదా—ఆరళ్లు వుండదు తుమ్మెదా,, అని వాంఛించుటలో సత్యము లేకపోలేదు. అత్తగారు తిరిగి తోడుకొని పోదలచి వచ్చినచో కోడలు పోనిష్టపడదు. తల్లిగారింటినుండి అత్తగారింటికి బయలుదేరు నప్పుడెల్ల ,,మా యత్తగారు నన్ను తోలుక పోవచ్చినారు—ఊళ్ళోనున్న ఓ కుమ్మరన్నా పచ్చి కుండలు ఎదురుంగ తేరా... ... .... ...వాడనున్న ఓ యక్కలారా ఒక తుమ్మునన్న తుమ్మంగ రారా,, అనుచు అపశకునములు

కోపగొనుటలో అత్తగారిల్లు నరకకూపమని వెలుగందుటయే. ఏదేమైనను తుద కత్తగారింటికి బోక తప్పినది కాదు. అక్కడికి పోయిన పిమ్మట ఆ యవస్థలన్ని పడజాలక భర్త మనస్సున కెక్కనట్లు ప్రవర్తించుచు అదను జూచి భర్తతో ,,నందమామకన్న నక్కాని మొగుడా వేరె పోదామా—అత్తమామల పోరు నేను పడలేను—ఆడబిడ్డల పోరు నేను పడలేను—ఉంగరాల చేయి ఊగెరా మొగుడా కందిరీగా నడుము కదిలెరా మొగుడా—కొప్పుపై జాజులు వాడెరా మొగుడా,, అని పలికి సరసోక్తులలో భర్తను ముడివైచుకొనుటయే గాక, వేరుబడినచో బ్రతుకు భారమును తానే మోయుదునని గూడ అతనికి బల మిచ్చుచు,

,,ఏరు బడితేనమేలు మొగడా—మనము పొత్తు లుంచేనె పోరు మొగడా

మక్కజొన్నచేను మనపాలికేవస్తె—నక్క బెదురుబెట్టి నా ప్రజ్ఞ చూపించి

ఇద్దామ పండేది పుట్టెడు పండిస్తు,, నన్నది. ఇంతేగాదట, తాను భర్త నెట్లు చూచుకొనదలచినదో సంసారమెట్లు చేయదలచినదో యిట్లు చెప్పుచున్నది,

,,గిద్ద పెసరాపప్పు గిన్నె తోడను వండి
వద్దు వద్దన నీకు వడ్డించి నే తినగా
ముద్దచేసి కొంత మూల దాచిపెట్టి
పొద్దున చద్దితో పొలమునకే పంపింతు
పది రూకలకు నీవు పాడి గేదెను కొంటే
ముదర కాచిన పాలు ముందు నీకు బోసి
ఉదయాన పెరుగయిన వుంచి నీ కొడ్డించి
కడమ పెరుగుతో నెలకు కడవ నెయ్యిజేతు
ఒట్రె మాటలు గావు ఒక ఏటికీసంత
బర్రెపాల మీద పయి ఖర్చు గడిపేను

కోడి కుయ్యంగలేచి తోడిన వడ్లన్ని
తోడి కోడాలైన తోడు లేకను దంచి
కూడొండి వంకాయ కూరతో తినిపింతు
మాడుచెక్కలు తినను మనకేమి గతి మొగడ,,.

ఇంకను భర్త సందేహించినది కనిపెట్టి ,,కలత చెందక నీవు కష్టమనకను రేపు—నలుగురి పనగూర్చి న్యాయమెంచామని-పొలమునందుయిల్లు పొద్దుననే పంచితే-మొలతాడు చేయింతు మొదటి నెలలో నీకు,, అని మనసు నాట జెప్పుటయే గాక ,,ఏ వల చూచినను యెవరు పొలము పోరు—బావ పెత్తనదారు బైట తిరిగివచ్చు-నీవలన కాపురము నెరవేరుచున్నది-నావలన లాభమ్మ నన్నడుగు చెప్పేను,, అనుచు పొత్తుల జరిగెడు వ్యవహారము నెగదోసి అంతకు చాలక పోయినచో ,,కలవారు మావారు కరువైన మనకేమి-కలదు మాపుట్టింట కాపురము చేపచ్చు,, నని నిర్మొగమోటముగా బలికి వేరు కాపురము పెట్టించును. ఇట్లత్తాకోడండ్ర వ్యవహారములు ముదిరిన ఫలితముగా అవిభక్త కుటుంబము చీలిపోయి విభక్త కుటుంబమగుట గాంచగలము. వ్యక్తిగత స్వేచ్ఛ లోపించుటచేత, వ్యక్తిగత స్వార్థమధికమగుటచేత, నేటి ప్రభుత్వపు చట్టముల ఫలితముగా కూడ కుటుంబ జీవనము దెబ్బతినుచున్నది.

అత్తకు దగిన గడుసు దనపు కోడండ్రు లేక పోలేదు. కొందరత్తలు కోడండ్ర నెంత సాధింతురో అట్లే మరికొందరు కోడండ్రు వారి అత్తలనే గాదు ఆ కుటుంబము లోని వారందరిని సాధించుచు పెత్తనము నడుపుదురు-

,,ఇల్లలికి ముగ్గుపెట్టి రింటి మగవారు—పేడకళ్ళు దీయు పెదబావగారు ఇంటి పనులు చేయు ఇంకో బావయ్య-అంటులన్నియు దోము అత్తయ్యగారు,,. ఇట్లు చాకిరి చేయించుకొని కోడలు దొరసానివలె బారెడు పొద్దెక్కిన దనుక పవళించి యుండగా వారందరు ,,ఇంటి పనులనయ్యె విడిది లేవమ్మ,, అని మేలుకొల్పగా,

„పలుదోము పుల్లేది పంచటరుగేది-చిట్టిముంత నీళ్లేవి చిరు పసుపేది
కుంకుమ బరిణేది అద్దమూ ఏది_పళ్లెముల అన్నమేది కట్ల పీటేది
పంట మంచమేది దూది పరుపేది„ అని బింకముగా ప్రశ్నించుచుండగ
నామె పురుషున కప్పుడు పౌరుషము మొలకెత్తి చింతబరిగెతో బాది విడువ
ఆ కోడలు,

„ఆరునెలలబాల చంక బెట్టుకోని-పుట్టింటి కప్పుడు మరి దౌడు తీసె„
అప్పుడు „అల్లంత దూరాన అన్నలూ చూసి-ఏమమ్మ చెల్లెలా ఇట్ల
వచ్చేవు„ అని యడిగి ఓదార్చి తమ యింట నుండుమన్నారు.

ఇట్టి కోడండ్రత్తమామలు వచ్చినచో „మాయత్త మా మామ వస్తరను
కోని_నీళ్ల సంకాటొండి ఓ నిద్రపోదు-మా అత్త మా మామ వచ్చే తోవాకు-జిట్ట
రేగి కంప దిట్టంగ కొడుదు„ మని యట్టి మర్యాద చేయుదురు.

„మొగనికైన మల్లెపువ్వుల పక్కేస్తాను
అత్తకైన నూతిమీన పక్కేస్తాను
మామకైతె నల్లేరు పక్కేస్తాను
వదిన కంటె ఆవపిండి బాగా రాస్తాను„

వారి వారి సంబంధములను బట్టి అట్టి మనోవైఖరులేర్పడు చుండును. అత్త
గారింటనున్నప్పుడు తల్లి దండ్రులు వచ్చినచో „మ్యాకపోతుల కోసి మాలెక్కి
సూతు„రు. వారు వచ్చు త్రోవలో „సన్న సన్నా ముత్యాలు సాలు వడపోతు„రు.
పుట్టింట నున్నప్పుడు బావలు వచ్చినచో „పందిట్లొ సొరకాయ బల్లి తలకాయ„ను
అన్నలు వచ్చినచో „అడవి చిక్కుడుకాయ అలచంద పప్పు„ను వండి
వడ్డింతురు.

మరొక విధమైన కోడలత్తకు దగినట్లు నటించెడు విధమిట్లున్నది,

అత్తింటి కోడలు ఉయ్యాలో—అలుగకా మానదు ఉయ్యాలో
పనిచెప్పపోలేను ,, —పలుక దాయేనమ్మ ,,
ఒడ్లు దంచామంటె ,, —ఒగలోగల పోశేసి ,,
తప్పేట్ల తాలుంచి ,, —తరిమి సెరిగేనమ్మ ,,
గాలించి గోలించి ,, —రాళ్లు పడ గాలించి ,,
ఉప్పు ఎయ్యని కూడు ,, —ఓకిరింపు రాంగ ,,
మంచి నీళ్లడిగితే ,, —మదన పడ్డాదమ్మ ,,

అత్తకేయాపద వచ్చినను నవ్వుకొనుటయే గాక నలువురామెను "ఛీ, ఛీ," అన్నచో కోడలు సంతోష పడుట వింత యేమిగాదు. తన్ను ముప్పు తిప్పలు బెట్టినందుకు అదను జిక్కగానే ఆమెపైన కసితీర్చుకొనును. అత్తకు తెలుగుట్టగా కోడలిటు కసికసిగా పరిహాసము చేయదొడగును.

"సద్దా రొట్టెలు సేసి ఉట్టిమీద వెట్ట
అంతట్లనె మా యత్తకు తేలేమొ కుట్టె
మా యత్త పూళ్ల కురుక నేనుట్టి కురుక
మా యత్త బొబ్బవెట్ట నేను బుక్కవెట్ట
మాయత్త రోలెక్క నేను రొండిసెక్క
మా యత్తను పిల్సిరి సావడి ముందలికి
నన్నేమొ పిల్సిరి ఊరీ ముందలికి
మా యత్తను గట్టిరి సావడి గుంజాకు
నన్నేమొ గట్టిరి సల్లా గుంజాకు
మా యత్త కెత్తిరి మోట్లల్ల బండ
నాకేమొ ఎత్తిరి ముత్యాల దండ
మా యత్తను 'సీ' యంద్రి నన్ను 'సయి' అంద్రి,,*

అనుచు చంకలు గొట్టుచు నామె "మూడు సోళ్లు కాకెరొడ్లు దెచ్చుకుంటి—దబ్బా దిబ్బాన నేను దంచుకుంటి—గుబ్బా గుబ్బాన నేను వండుకుంటి—కోపమొచ్చి

కోడిపిల్లను కోసుకుంటి,, ననుచు జిహ్వా తృప్తిపుడుల్ల వండుకొని కడుపునిండ కమ్మగ తిని ,,అత్తా మామల నేన్వెల్నకుంటి—నా లెక్కడలేని జగడమొస్తె పెట్టుకుంటి,,* జగడమాడినది. వారిని హేళన చేయుటయును గలదు. ,,మా యత్త మామామ పూరేగుతుంటె—చట్టపీకెలు రెండు చూడొచ్చినాయి—మట్ట గిడసలు రెండు మాట్లాడినాయి—కందిరీగలు వచ్చి కతనడిపినాయి—బోదురు కప్పలు వచ్చి భాగోతమాడు,,నని వెక్కిరించెదరు. ఇట్టి కోడండ్రు ,,అత్త చస్తే కోడలేమాని ఏడ్చు—అడివి తంగెడు పూసు ఆరళ్ల మాసు—మామచస్తే కోడలేమాని ఏడ్చు పొయికాడ చిద్రంబు పోయెనని ఏడ్చు,,దురు. వీరత్తలను మించిన వారుగా గన్పట్టుదురు. వీరికి అత్తనోరు గట్టిపెట్టు మంత్రములు తెలియనట్లున్నది. తెలిసినచో ప్రయోగించువారే. (,,అత్తవాకట్టు మంత్రంబు లడిగె నొకతె 1,, అని శుకసప్తతిలో గలదు.)

ఈ విధముగా నత్తా కోడండ్ర అంతః కలహములు కుటుంబ జీవన జలధిలో నాటుపోటుల వంటివని చెప్పదగును. మనసున చిచ్చు రేపెడి యిట్టి వ్యవహారములు చూచి, కన్యలు వివాహమునకు ముందే జాగ్రత్త పడదలచి ,,సామల దేశానికి నన్నివ్వబోకవ్వ—నేను తినలేను సామల బువ్వ—వడ్లు బండే దేశానికి నన్నివ్వబోకవ్వ—నేను దంచలేను వడ్లన్నీ... ... ... ... ... యారాండ్ర మీదికి నన్నివ్వబోకవ్వ—యాపకాయ చేదు నే దినలేను............ సవతుల మీదికి నన్నివ్వ బోకవ్వ—సముద్రము లోతుదిగిచూడలేను,, అని వేడుకొందురు.

### అత్త - అల్లుడు:-

అల్లుని మీద అత్తకు, అత్తమీద అల్లునకు పరస్పరమైన ప్రేమలుండుట సామాన్యము. అత్తయింట నతనికి స్వాతంత్ర్యమెక్కువ. ఆమె తన బిడ్డ

1. శుకసప్తతి—ఆ. 3—పద్య. 122

నల్లునకు ధారపోసినది కాబట్టి యతడన్నచో నాప్యాయత, ఆదరము. కనుకనే ,,పండుగొచ్చిందంటే తిండికి ప్రేమ—అల్లుడొచ్చిండంటె అత్తకు ప్రేమ,,. తన బిడ్డను చక్కగా నేలుకొనవలెనని భావించి యాతనికి దగిన మర్యాదలు చేయును.

అల్లుడు వచ్చినది గమనించి ,,ఆటకూటమ్మలో ఆడేటి నెమలీ—వేట గాడొచ్చాడు ఆట చాలించు—బంగారు మేడలో నవ్వేవు తల్లీ—నా అల్లుడొచ్చాడు నవ్వు చాలించు,, మనుచు ఆయింట నీయింట అమ్మలక్కలతో గూడి యాట పాటలలో మునిగిన కూతురును హద్దుపద్దున నుండుమని సూచించుచుండును. అల్లుని ముందు తన కూతురట్లు తిరుగుట మంచిది కాదని హెచ్చరించి యాతని మనసున కెక్కునట్లు వర్తింపజేయును. ఆతడింట నున్ననాడు వారణగి మణగి మసలు కొందురు. రక రకములైన పిండివంటలతో తృప్తి పరతురు.

సాధారణముగా అల్లుని ముఖమత్త, అత్త ముఖమల్లుడు చూడకూడదను నొకనియమ మనూచానముగా పాటింపబడుచు వచ్చుచున్నది. బహుశః తన భార్య యొక్క రూపురేఖలత్తలో గన్పట్టుట చేత అల్లునిలో నప్పుడప్పుడు కామ వికారములు పుట్టుట కాస్కార మేర్పడగలదని కాబోలు అట్టి నియమము వచ్చి యుండును. కామవికారములు పుట్టుటకేగాదు, వారిరువురు కూడుకొనుట యనునది కూడ వాస్తవమే ,,అల్లుడు వచ్చేను కొత్త బెల్లము దెచ్చేనూ గారెలు జేతూన అల్లుడ బూరెలు జేతూనా—గారెలు వద్దు బూరెలువద్దు పుణుకులు జేయత్తా

.... .... .... .... .... ....

బిడ్డను తోలుదునా అల్లుడ నేనే వత్తూనా—బిడ్డను తోలితె కేకలు బొబ్బలు నువ్వే రావత్తా,, ఇట్టి సంబంధము మిక్కిలి అరుదైనది. అయినను దీనివెనుక గల రహస్య మనస్తత్వ మెట్టిదో మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు, జెన్యూ శాస్త్రవేత్తలు పరిశీలింప దగినది. ఈడుజోడు కుదిరిన యత్తను గూడ వివాహమాడు ఆచార ముండి యుండవలెను. రాధాకృష్ణుల మధ్యగల వావివరస ఇట్టిదే గదా.

అత్త, అల్లుని నడుమగల మరికొన్ని విధములైన సంబంధములున్నవి. అవి కొంతవరకు మర్యాద భాజనములు. ఒక అత్త „కోరుకొండ నుంచి కొత్తల్లుడొస్తే—గీసిగీసి వండింది గిద్దెడుబియ్యమ్మ„. అతడది „తినలేక తిన్నాడు తీపుల మారోడు—లేవలేక లేచాడు నేలపట్టుకొని„. అపుడు „అత్తపోసిన గంజి సత్తువలులేవు—అల్లుడు సిరిపురపు గట్టెక్కలేడు„. ఇటువంటి అత్తలు „పండు గొచ్చికేను పిండికేచేటు—అల్లుడొచ్చితేను అత్తకే చేటు„ అని భావించెదరు. అల్లుడిట్టి యత్తకు అద్దాల రవిక తెచ్చి యివ్వగా „ఇప్పుక తొడుగబోతె నిప్పులు రాలె—మరగేసి తొడిగితే పల్లెలురాలె„ నట. ఈ వింత చోద్యం బేమిటియని యడుగగా „నిత్య మల్లెలరైక నీకు అందమ్మ—నువు కన్న కూతురు నాకు అందమ్మ„ అని చనువుగానో వేళాకోళముగానో మారుబలుకుట యైనది.

నిమ్న కులములనబడు వానిలో గూడ సంబంధములిట్లే యున్నను తన కూతురును అల్లుడేమైన కష్టపెట్టినచో అత్త సహింపదు. అట్టి యల్లుడు భార్యను తోడుకొని పోవుటకై వచ్చినప్పుడామె „పిల్లాను తోలపోర పిల్లపైక మీయపోర—దావన్న సెయ్యిబోరో అల్లుడ నాగయ్య„ అని మందలించును. అతనితో బిడ్డ సంబంధ విషయమున ఏ మాత్రము గిట్టని యెడల అతని నుండి బిడ్డను విడిపించుకొని వేరొక మనువిచ్చుకొనుటయును పొసగుచుండును.

## వదిన మరదండ్రు:-

వదిన మరదండ్రి మధ్య గల సంబంధములు నిత్య మడుగడుగున హాస్యానుబంధములు. వీరు సంభాషించు కొన్నప్పుడొకరిని మించి యొకరు చమత్కారము చిలుకరించుకొనుచుందురు. మాటల ద్వారానే గాక చిలిపి చేతల ద్వారా కూడ వారి పరిహాసములు చూడ ముచ్చట గొల్పును. వదిన ముఖము కడుగుచున్నను, స్నాన మాడుచున్నను, తలదువ్వి దిద్దుకొనుచున్నను మరదండ్రు పరిహాసము చేయుట సామాన్యము.

వదిన గర్భము దాల్చినది గుర్తించి మరదండ్రు ,,వదినా వదినా వేవిళ్లా,, అని ప్రశ్నించగ నామె ,,నీతో ఎవ్వరు సెప్పేరు,, అనగా, ,,నాతో మా అన్న చెప్పేడు,, అనుచు నుత్సాహముతో ,,వదినా వదినా వల్లంకి పిట్టా–గదిలో పెట్టా గంజి నీల్లోయ్యా–నీ కొడుకుట్టా నా పేరెట్టా–మా అన్న కొట్టా నువ్వేడ్వ నేను నవ్వా,, పరిహాసము చేయుచు గంతులిడుచు ఆమె చుట్టు తిరుగుచు కొంగు కొసరి కొసరి గుంజుచు ,,వదిన వదిన వాసింత–పన్నెండేళ్ల కడుపంట–పత్తిగింజ కొడుకంట–తిరుపతి రాయుడు పేరంట–తిరిగి చూస్తే లేడంట–మళ్లి చూస్తే మంచాన్నున్నడంట,, అని కడుపుబ్బ నవ్వింతురు. వదిన వంట చేయుటను జూచి–

,,మా వదిన గడుగాయి దండు సిపాయి
ఇల్లెక్కి వండింది ఈసె బూరెల్లు
పొయ్యెక్కి వండింది పొంగు బూరెల్లు

... ... ... ... ... ...

నీళ్లతో వండింది నూరు గారెల్లు,, అనుచు నవహాస్యము చేయుదురు. మరదండ్ర కంటె వదిన వయస్సులో పెద్దది కాబట్టి వారెంత వెక్కిరించినను కోపము తెచ్చుకొనదు. కాని ఒక్కొక్కమారు మాట్లాడకుండ మూతి బిగ్గరగ ముడుచుకొని యుండుటను గమనించి మరదలు,

,,ఏమే మాట్లాడ వెత్తుగాళ్ల ఎర్ర వదినె
దమ్మిడిస్త తీసికో దాశన పొట్లం తెచ్చుకో
అందమైన పండ్లాకు ఏసేసి రుద్దుకో
పైసిస్త తీసికో పాను వీడెం తెచ్చుకో
అందమైన దౌడలాకు ఏసేసి నములుకో
మూడేకాలిస్త తీసికో కుంకుమ పొట్లం తెచ్చుకో
అందమైన నొసటికి ఏసేసి రుద్దుకో
రూపాయిస్త తీసికో పట్టు రైక తెచ్చుకో

అందమైన రెట్టలాకు ఏసేసి తొడుక్కో
పది రూపాయలిస్తె తీసికో పట్టు చీరె తెచ్చుకో

అందమైన నడుముకు ఏసేసి కట్టుకో,, అన్నప్పుడు వదిన మూతి ముడుపును విడిచిపెట్టకుండ ఉండజాలదు. తాను మాత్రము తక్కువ తిన్నదా! మరదలి యొక్క ఒడ్డాణ మమ్మి వడ్డీలకిచ్చి, చెవుల పుల్లలమ్మి శరతులు గట్టి దండ కడియమమ్మి దండుగ బెట్టి, గంటీలు అమ్మి గెలిచి వచ్చి, సందె టొంకమ్మి సాయి చెంతబెట్టి, గుండ్ల జెక్క అమ్మి గుర్తులుపెట్టి, కడియము లమ్మి కర్చులైన బెట్ట, పెద్ద పూసలమ్మి మరదలి పేరైన నిలిపెదనని పొంకముగా బింకముగా బలుకుచున్నది.

,,ఒడ్డాల మమ్మేను ఒడ్డీల కిచ్చేను
మారుదాలా ఓ మాదిగొళ్ల మాణెమ్మ
సెవుల పుల్లలమ్మేను సెర్తులైన పెట్టేను
మారుదాలా ఓ మాదిగొళ్ల మాణెమ్మ

కాడాలు అమ్మేను కర్సులైన పెట్టేను
మారుదాలా ఓ మాదిగొళ్ల మాణెమ్మ
పెద్ద పూసలమ్మేను పేరైన నిల్పేను
మారుదాలా ఓ మాదిగొళ్ల మాణెమ్మ,,*

వదినగారి బింకపు మాటలను విని మరదండ్రు ,,చింత చెట్టు మీద చిగురు—వాలు గొమ్మ మీద వగరు—అన్నయ్య బట్టలకు తొగరు—వదినకు వచ్చింది పొగరు,, అని చేతులు త్రిప్పుచు చక్కిలి గింతలు బెట్ట జూతురు. ఆమె చీర సింగారించు కొనుచున్నది చూచి ,,పొద్దోయి పొద్దోయి అన్నయ్య వస్తే—జల్తారు చీరల్లు కట్టు వదినమ్మ,, అని వేళాకోళము చేయుదురు. అలిగి యుండిన వదినను సమీపించి ,,అట్లు తిన్నా అన్నయ్య అలిగి పడుకుంటే—తిట్లు తిని వదినమ్మ తీపు లందింది,, అని అలుక దీర్చుట పొసగుచుండును.

దేశాంతరము పోయి చెప్పిన గడువునకు రానట్టి భర్తను దలచుకొని దుఃఖించెడు వదినను జేరి మరదలోదార్చుట వలన నా దుఃఖము కొంత ఉపశమిల్లుచుండును. ,,ఏ మొదినా ఏ మొదినా ఎందుకేడుత్తావు—ఎర్రి నా ఒదినా నువ్వేంటనె సెప్పు,, మన్నది మరదలు. ,,దేశమెళ్లిన మీ అన్న తిరిగి రాలేదు తిరుగొత్తె బాగున్ను తీర్త మెలుదూము,, అనుచు వదిన దిగులు బడియుండ ,,ఎల్లినోడెల్లినట్టె ఉండిపోతాడ—రేపోమాపో గాని తిరిగొత్తాడొదిన,, అని మరద లోదార్చుచుండ ,,సెప్పెల్లిన గడువూలు దాటి పోనాయి—సెట్టెక్కి సూడోలె వొత్తున్నదేమొ,, అన్నట్టి వదిన విచారమును బోగొట్ట ప్రయత్నించుచు ,,సెట్టొద్దు సేమొద్దు ఊరుకో ఒదిన-రాబోయె మాయన్న రాక మానాడు,, కావున గుండె దిటవు చేసికొమ్మన్నది. కాని వదినకు ,,సూసీ సూసీ కళ్లు కాసినై కాయాలు,,. పాపము! ఆమె విచారమును ఆవులు గూడ పంచుకొన్నవి. ,,మేసేటి ఆవులు మానినై మేతాలు,,.

వదిన తన మరదలి పట్ల కూతురు మీది మమతను ప్రదర్శించును. ఆ మరదలు సహితము ,,వడ్డింప నేర్చితే వదినయే తల్లి,, అని వదినను తల్లిగా భావించి మసలుకొనును.

కొందరు వదినలు మరదండ్రను ఈసడించుచుందురు. దానికి మారుగా మరదండ్రు వదినల మీద చాటు పోటు కొండెములు చెప్పి తల్లితో అన్నతో తిట్టింతురు. పెండ్లియైన మరదండ్ర (ఆడబడుచు)కు వదినల ( కోడండ్ర ) కు ఉండెడు సంబంధము లింతకు పూర్వమే సుంత ప్రాసంగికాంశముగా మనవి చేసియుంటిని. కొందరు వదినలు మంచి వారైనచో మరదండ్రు మంచివారుగా నుండరు. కొందరు మరదండ్రు మంచి వారైనచో వదినలు మంచివారుగా గన్పట్టరు. వివిధ కుటుంబ వాతావరణములను బట్టి ఆయా సంబంధములొప్పును. ప్రతి విషయమునకు పాటలు దాహరించ దలచినచో గ్రంథ విస్తరణమగును గదా. కంఠ దఘ్నముగా గాక కడుపునకు దగ్గ ఆహారమును గ్రహించు రీతిని విషయ పరిశీలన చేయుట జరుగుచున్నది.

వదిన మరదులు:-

వదిన మరదుల సంబంధములు గూడ వదిన మరదంద్ర వలెనే యుండును. చిన్న వయస్సయినచో నొండొరుల మధ్య సంబంధములు చనవుగా గన్పట్టును. ఇంచుక వయస్సులో భేదమున్నచో, వదిన పెద్దదైనచో పరిహాసములు సైతము మర్యాద నతిక్రమించవు. ఔచిత్య భాసురములై యొప్పును.

చూడరే మరదిగారు షోకుగకూసున్నారు
గాడిద ఘనము వేరు గానము పాడుతారు
ఎడమది కుంటికాలు ఎప్పుడు తల్లోపేలు
కుడిచెయ్యి పిల్లి ఏలు కూటికి రానిజూలు
ఒక్కటి కన్ను గుడ్డి నడచిన కాలు దొడ్డి
తిండికి రాని సిగ్గు దేహము నల్లబొగ్గు
మొండిది కళ్లె దగ్గు మొహము చూడ సిగ్గు
మాటలు ఎంతో నత్తి మగువరో! బట్టనెత్తి
చుట్టాల ఎల్లప్పుడు చూడగ వెళ్లుతారు
పెట్టిన పంచల చాపు చిరిగిన దాక పోరు

అచ్చముగా పై లక్షణములు మరది కున్నను లేకపోయినను ఆతని నామె పరిహాసము చేయుచుండుట వారి వావివరుసల సంబంధమెట్టిదో తెలుగునాట సుపరిచితమే. మరదిని వెక్కిరించుట వేళాకోళము చేయుట హాస్యమునకే గాని వేరొండునకు గానేరదు. ఇదే రీతిగా మరది ,,వొదినే వొదినే వొంకాయె—వొదినే ముక్కు టెంకాయె—అడ్డాగోడా సుబ్బమ్మ—అల్లాడొచ్చె లేవమ్మ—సద్ది గట్టా బట్టాలేదు—సాగదోల మనిషి లేడు,,* అని ఆమెను పరిహాసము చేయును. (ఇట్టి పాట మరదలు కూడ పాడును). వదినతన తల్లిగారింట నున్నప్పుడు రాకరాక వచ్చిన మరదినిట్లు హాస్యము చేయుచున్నది—

,,ఏనాడు రానివారు మరది వచ్చారు—ఇంటిలో జొన్నలులేవు నేనేమిసేతు

సన్న బియ్యమెట్టి జొన్నలూ దెస్తు-జొన్నలూ ఒక జాము జారకుమ్మేను
తడిపిడక పొడిపిడక దాయలువేసి—ఏడు చిల్లుల కుండ నెసరెట్టినాను

మూడు చిల్లుల కుండ మూతెట్టినాను,,—అనుచున్నప్పుడు దారిబడలికచేత మరది ,,దాహము పదినగారు దాహాలనిమ్మ,, అని యడుగగా ,,ఉడికేది జొన్న కూడు ఉండుము మరది—వెళ్లితే వెళ్లండి వేగంబుగాను—దయయుంచు నామీద దండములు మరది,, అనుచు సమాధాన మిచ్చెడు వదిన గారి మర్యాద హాస్యమునకు చమత్కరించినట్టిదే గాని నిజమున కట్లే యైనచో అది విరసమగును. హాస్యమునకే యైనను ,,మన్నింప నేర్చితే మరిదియే కొడుకు,, అను పుత్ర వాత్సల్య మాతని పట్ల ఆమె వ్యక్తపరచును. ఇంతేగాదు— ,,మరిది దేవుడని మరి వేడుకుందు,, నని పవిత్ర భావమును వదిల పరచుకొనును.

కామాతురులకు కండ్లేకావు వావివరుసలు కూడ నుండవు. కన్న కూతునునే కామించిన విషయములకు మానవ చరిత్రలో సాక్ష్యములు లేకపోలేదు. పాశ్చాత్యులలో కన్నతల్లినే విధివశమున పరిణయమాడిన ఐతిహాసిక వృత్తాంతము తద్విజ్ఞు లెఱుంగకపోరు. వదిన మరదినో, మరది వదిననో కామించెడు సంబంధము లాయా పరిస్థితులకు లోనై ఏర్పడుట తటస్థించుచుండును. రామాయణమున మాయలేడి ఘట్టమందు సీత లక్ష్మణుని శంకించుటలో ఈ రహస్యము లేదనగలమా? అతి ప్రాచీన కాలమున కేవలము సంతానార్థమై స్త్రీకి నియోగ పద్ధతి చెప్పబడినది. ఇట్టి పద్ధతిలో 'దేవర న్యాయము' పేర్కొనుట జరిగినది. దేవర అనగా రెండవ భర్త. ,,దేవరః కస్మాద్ద్వితీయో వర ఉచ్యతే 1.,, అనగా భర్తయొక్క తమ్ముడో అన్నయో మరే యుత్తమ వర్ణస్థుడో కావచ్చును. భర్త యొక్క తమ్ముని (మరది)తో నియోగమయిన పద్ధతి కొంద రనంతర కాలమున కామోపభోగములకు మాత్రమే వర్తింప జేసికొన్నట్లున్నది. ఇదేగాక

1. నిరుక్తము—అధ్యా—3. ఖం—15.

అక్షత యోని స్త్రీ విధవయైనచో నామెను శాస్త్రప్రకారముగా మరది వివాహమాడ వచ్చునని మనువు చెప్పిన ధర్మము 1 కాలక్రమేణ సడలిపోయినది. క్షతయోని స్త్రీ విధవ యైనను వివాహ మాడవచ్చునను వరకు సడలింప జేసికొన్న జాతులీ నాటికిని కూడ గలవు. హిమాలయ ప్రాంత మందలి కొన్ని జాతులలో ఒకే స్త్రీకి అనేక భర్తలుండుట, భర్త మరణించిన గాని, అసమర్థుడైన గాని ఆతని తమ్ముడు వదినను భార్యగా స్వీకరించుట మొదలైన ఆచారము లిప్పటికున్నవి. ఆ యాచారముల యొక్క జాడలు జానపద సమాజములోని వదిన మరదుల కామ సంబంధము లందు కనుగొన వచ్చును.

„బిజినాల కాట్ల మీన బీడన్న తాగు వాదినె
బీడి మీన మన్నుపోతు నా బిడ్డె యాది కొచ్చె
కందనూలి కాట్లమీన కల్లన్న తాగు మరిది
కల్లు మీన మన్నుపోతు కన్న తల్లి యాదికొచ్చె
పట్నంల సీటి గొడ్తే పల్లెల్ల నాడమెల్లె
సంకాల సంటిబాల నాకు సుడడాయె మరిది
ఒక పిల్ల తల్ని మరిది ఉసి కాల వెట్టివొస్త
మడుగుల్ల బొంద వెట్టి కనుకుంటవోద్దం మరిది,,*

జారత్వమునకు మరగి చంటి పిల్లను చేతులార చంపుకొని పల్లెనే విడిచి పోవు నిట్టి వదిన మరదులు చాల అరుదు. ఇట్టి మరది యట్టి వదినను „లొట్ట కన్నులకు లోటువైన మిట్ట నొసలునకు—తట్ట చెవులకును తుట్ట పెదవులకును—మట్టు మీరిన పొట్టి కాళ్లకు—బెట్టులేని చట్ట మూతికి—బాన కడుపునకు ఘనమైన బొడ్డు—గూని

1. యస్యా మ్రియేత కన్యా యా వాచా సత్యే కృతే పతిః
తామనేన విధానేన నిజో విందేత దేవరః

మనుస్మృతిః—అధ్యా—9—శ్లో—69

పీపునకు అనువుగాని అందమపు కుచముౢల నుచు కన్నుల చన్నుల వరకును హాస్యమున జిక్కించుకొనుటలో అరమరికలేదు.

అన్న ఉండగానే యాతని భార్యతో తమ్ముడు కామ సంబంధములు నెఱపుట విపరీతమే. ఏకాంత స్థలమునకుబోయి తమ్ముడు తన భార్యతో సంభోగించుట నెఱింగి అన్న భగ్గున మండిపడుచు వారిద్దరిని చిత్రవధ చేయుటయును జరుగుచుండును.

ౘరామన్న భీమన్న రథము రెండెడ్లు రమణ తందాన
రామన్న పోయిండు రేగళ్ల దున్న ,, ,,
భీమన్న పోయిండు పిట్టలేటలకు ,, ,,
పిట్టలేటకు పోయి భీమన్న వచ్చె ,, ,,

... ... ... ... ... ..

చూడుచూడు అని తలగుడ్డ తీసె ,, ,,
ఇంత చక్కని పూలు ఎక్కడివి మరిదీ ,, ,,
పువ్వులుండే వనము చూడ వస్తావా ,, ,,

.... .... .... .... .... ....

పువ్వులుండే వనము చేరబోయింద్రు ,, ,,
వారి సంబూరాన వారుండ రమ్మా ,, ,,
రేగళ్ళు దున్నేటి రామన్న వచ్చె ,, ,,

... ... ... ... ... ... ...

పువ్వులుండే వనము చేరబోయిండు ,, ,,
తాళు తాళు అని తలగోపి నాడె ,, ,,
మేలు మేలు అని మెడ గోపినాడె ,, ,,

... ... ... ... ... ...,,

ఇది పురుష లక్షణము. ఇట్టి వ్యవహారము లప్పుడప్పుడు తటస్థించుచుండును. మానాభిమానము లున్నవారైనచో ఆత్మహత్యకు కూడ పూనుకొందురు.

## బావ - మరదలు - మరది:-

వసంతము రాగానే ప్రకృతి పులకించినట్లు ఇంటికి బావ వేంచేయగా మరదండ్రు, మరదులు ఉత్సాహ పూరితులగుదురు. యుక్తులు, ఛలోక్తు లతని విషయమున ప్రయుక్తము లగుచుండును. బావగారి హృదయమే గాక దాపు దాపున గమనించు చుండెడు అక్కగారి హృదయము కూడ ఆనంద వీచికలలో తేలియాడును. కుటుంబ నాటకములో వారి ప్రదర్శన హాస్యరస స్ఫోరకము.

బావ వచ్చిన క్షణముననే మరదండ్రు మరదులు ,,బావా బావా బక్ బాయిలా బూడ్డి బుక్—తెచ్చిన పుట్నాలు పెట్ట్—అక్కా కాళ్లు మొక్క—వచ్చిన బాటా పట్ట్,,* అనుచు మిక్కిలి పరిహాసము చేయుదురు. బావగారుకూడ వారితో సరసమాడుచు తెచ్చిన పుట్నాలో పండ్లో చేతుల కందించుచు చెంపలు గిల్లుచు చక్కిలి గింతలు చేయును.

ఒకరాతని గోచిపట్టి లాగిబోవు చుండ మరొకరు తలపాగ బట్టి లాగుచు ఇంకొకరు దొంగమాటున వచ్చి చక్కిలి గింతలు రేపుచు ,,బావా బావా పన్నీరు బావను బట్టుక తన్నేరు—మూలకు మంచం వేసేరు—ముంతెడు గంజి పోసేరు వీధి వీధి తిప్పేరు వీశెడు గంధం పూసేరు—చావడి గుంజకు కట్టేరు—చప్పిడి గుద్దులు గుద్దేరు,,* అని పాడుచు బావ నాడించుచుందురు. వసంతోత్సవమునకు బావ వచ్చినచో వారి యుల్లాసమునకు మేర యుండదు. చిమ్మకొనెడు రంగులలో చిత్రమే చిత్రము. వారి సరసములలో అక్కగారు కూడ పాలుగొనుటయు నొప్పును. మరదండ్రు మరదులందరు ,,చెట్టు మీద కోతివలె బావ ఉన్నాడు చెరువులో చేమంతి వలె అక్క వున్నాది,, అని బావను వెక్కిరించుచు అక్కను

మెచ్చుకొనుచు పొంగి పోవుట కనిపెట్టి బావగారు అక్కాచెల్లెండ్రి జడలను ముడివేసి త్రిప్పుటయో, కడుపుబ్బనవ్వునట్లు గిలిగింతలు పెట్టుటయో కావించును. మరదులను జిక్కించుకొని ముసిపూయుటయో, కాళ్ల సందున నిరికించుకొని నొక్కుటయో చేయును. మరదలిలో తన భార్య పోలిక యుండుట వలననేమో ఆమెపట్ల మనోగతముగ పొడము కామ వికారము చేత నామెను మరింత చక్కిలి గింతలందు ముంచును.

భోజనము చేయుచున్న బావగారిని ,,బావగారు మీరు ప్రతిభ గలవారు నిండున్న సభలోన పిండి బుక్కేరు—చక్కిలాల బుట్ట చంక బెట్టుకొని—సభలోన మాబావ సంగీత పరుడ,,ని పరిహసించుచు పదార్థములమీద పదార్థములను వడ్డించి కుత్తుక బంటి మెక్కింతురు. అతడు కాసింత మేనువాల్చి భుక్తాయాసమును దీర్చుకొనుచుండ ,,పదేళ్ల నాటిదే పాత దూలమ్ము—పడిపాయె మా బావ పట్టెరున మీద—పళ్లన్ని పిప్పాయె నోరెర్రనాయె—వీధిలో బావగారికి విన సిగ్గులాయె—రచ్చలో మా బావకు రాసిగ్గులాయె—సభలోను మా బావకు తలవంపులాయె,, నని అల్లరి పెట్టుచు నిద్దుర పోనీయరు. మరదండ్రు మరదులే గాక, అక్క స్వయముగా బావతో (భర్తతో) సరసమాడును. తనకు బావ తెచ్చిన చీర మొల తిరుగ (ఒక చుట్టు చుట్టుకొనుటకైన) లేదని, రవిక ముడి కందలేదని చెప్పి పొడుచుచు ,,అత్త కొడుకొచ్చిండు పంది రెయ్యండీ—పందిట్లో బావకీ పీట వెయ్యండీ—పీట ముందర బుడ్డి చెంబు పెట్టండీ—పీట ముందర కోడిగుడ్డు పెట్టండీ—కోడిగుడ్డు మీద కూరారబోయండి—బావకు బలుహారం బాగా పెట్టండీ పల్లేరు తెప్పించి పక్క వెయ్యండీ—నల్లేరు తెప్పించి నలిచి విడువండీ—నల్లేరు చేతాను నయము కాకుంటే—దూలగొండి తెచ్చి దులిపి పంపండి,, అనుచు మోటు సరసము లాడి ,,అత్త కొడుకా నీకు అందింద మరియాద—నువు తెచ్చిన కోక మొల తిరుగలేదు—నువు తెచ్చిన రైక ముడి కందలే,,దని చిలిపిగా మూతి త్రిప్పును. ఇట్లందిన మర్యాదకు బావ ,,మామ కూతుర నువ్వు చేసిన మేలా—దూల గొండి చేత దులిపిందే చాలు,, నని యోటమి నంగీకరించును.

అసలు కొత్తల్లుడు వచ్చినప్పుడే మరదండ్రు మరదులొక్కటై పెట్టిన హాస్యమాడుచు బావను బిత్తర పోవునట్లు చేయ ప్రయత్నింతురు. "అత్త వారింటికి కొత్తల్లుడొస్తేను కొత్త సున్నం దెచ్చి మెత్తరమ్మా కొత్త సున్నంతో కోపల్లు పూస్తేను నల్లేరు దెప్పించి నలుపరమ్మా.... ... ...
అత్తోరి యింటికి వస్తే సుఖమేమంటే—వచ్చిన దారిని పట్టమనండమ్మా", ఈ సరస మెరుగని పిరికి బావమ్మే యైనచో కోతుల మధ్య చిక్కినట్లుండిపోవలసి వచ్చును. సామాన్యముగా నట్లు జరుగదు. అంతెందులకు? మరదండ్రు మరదులు లేని యింటితో సంబంధము చేయుట సుఖము కాదందు రిందులకే.

అత్త పట్ల అల్లునకు, వదిన పట్ల మరదికి, మరదలి పట్ల బావకు కామ వికారము ఉదయించుటకు గల లక్షణములను మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు, జెన్యూ శాస్త్రవేత్తలు, నృశాస్త్రవేత్తలు పరిశీలింప దగినవి. అట్టి విషయములు జానపద సాహిత్యమ్ముపై శాస్త్రములకందించు విలక్షణమైన సమస్యలు. ఒక విధముగా దలంచినచో, వావి వరుసలు లేని పశుదశయందలి ప్రాక్తన మానవ జాతి లక్షణము లిట్లు మిగిలిపోయి గర్భితమై యుండినవని చెప్పుకొన వీలున్నది.

## సవతులు:-

భర్త కిద్దరు లేక అంతకన్న మించి భార్యలుండుట వలన వారిని సపతులని, సపత్నులని యందురు. ఒక్క పురుషుడిద్దరిని ముగ్గురిని పరిణయ మాడుటకు ప్రేమగాని, భోగదృష్టిగాని, సంతానాపేక్షగాని కారణమై యుండును. ఒకే వస్తువును నలుగురుపయోగించుటలో సుఖశాంతము కుదరక పోవుటయే గాక ఐక్యమత్యము ప్పతిల్లుట సహజము. "ముప్పది జుట్లు ముడివడును గాని మూడు సిగలు కూడవు" న్న సామెత ఊరక రాలేదు. సవతుల సంబంధములకైక్యములకు సంరంభములకు భర్తకు గండరగోళము. సంసారమల్లకల్లోలము. దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణునకే ఆ తలపోటులు తప్పలేదు. సవతుల

కయ్యములకు గంగా గౌరి, రుక్మిణీ సత్య లుదాహరణలు. సవతులకు నిత్యము పరస్పర మగ్గిపై గుగ్గిలము పేసినంత పని యగుచుండును. ‹‹వడ్లుదంపిన బియ్యం నీ వుంచుకుంటే_ఉత్త ఊకాకేల ఈ వాదులాట- చల్ల చేసిన వెన్న నీ వుంచు కుంటే_చల్ల నీళ్లాకేల ఈ వాదులాట- విడెము చేసిన కల్మి నీ వుంచు కుంటె_వట్టి పప్పీకేల ఈ వాదులాట _ పట్టె మంచం పరుపు నీ వుంచుకుంటె నులక కుక్కికేల ఈ వాదులాట-వయసుపాయమెల్ల నీవుంచుకుంటె-వార్ధక్యానికా ఈ వాదులాట పప్పేరుగవమ్మ ఈ పొక్కరుచియు_ఈ లాగువాదిమ్మ సవతులు చేయ,, సవతుల నడుమ మితిమీరి ఇట్టి ఈర్ష్యాసూయలుండుటచేత ప్రతి చిన్న విషయమును కయ్యములే కడతేర్చు చుండును. భర్త ఏ భార్య మీదనైన కాసింత ప్రేమ అధికముగ కనబరచినచో నతనికి కందిరీగ లెగ బొ్కినంత పని యగును.

సవతి పోరునకు సత్యభామ, కయ్యములు బెట్టుటకు నారదుడు పేరెన్నిక గన్నవారు గదా. ఈ క్రింది పాటలో తాటి చెట్టు కొబ్బర చెట్టు మధ్య జరిగిన సంవాదము చమత్కారముగా చిత్రింపబడినది. వీని మధ్య గూడ నారదుడే కయ్యము కల్పించినాడు. ఈ సంవాదములో సవతుల వాదోపవాదములు ఈర్ష్యా సూయలు వ్యంగ్యముగా వర్ణితము.

‹‹నాగలోకమునుండి నారాద మౌని_స్వర్గలోకము వరగు శోధించి చూచె
తిరిగి మూడు లోకాలు తిరిగి వేంచేసె
నమస్కారమయ్య నారాద మౌని_వర్ధిల్లు వర్ధిల్లు ఓ తాటి చెట్టా
నినొ్నక్క మాటానే కొబ్బెర చెట్టు
నన్నెవతంటాది నా సవతి నన్ను_నిన్న గాక మొన్న నెగడింది తాను
కత్తికి జుట్టూకు కడతా వన్నాది_ఇంటి కొచ్చిన వాని విడువ వన్నాది
సభవారి పిలపించి సాక్షులబెట్టి_పదవోయి నారదుడ పంతంబు కడకు
కొంచేము దానా వే కొబ్బేర చెట్టా_కొంచేము లెంచితె దంచేద చూడు

దంచితె పరికుంచ ధాన్యామెపోతు—పలుమారు పట్నాన పండుకొబ్బేరసు
పలుమారు పట్నాన పండేద పైతె — నీళ్లజేదూకూనె తాడునేగానా
నీళ్లజేదూకూనె తాడు నీపైతె — సభవారు గూర్చుండె చాపనేగానా
చోద్యపేరంటాలా బుట్టి నీవైతె — ఎరుకాల బుట్టికి గిరుకనేగానా
ఎరుకాల బుట్టికి గిరుకా నీపైతె — శివుని గుడిలోన శివపూజనాది
కాకుళ్ల గాచేటి కారడవి నీది — గద్దల్ల గాచేటి పెద్దడవి నీది,,*

పరస్పర మిట్లు దెప్పి పొడుచు కొనుట ఒక్కొక్కమారు చూపరులకు చోద్యముగా నుండునేమోగాని అవి ముదురు పాకమున బడినచో నిరుగు పొరుగులకు కూడ అంత ఆరోగ్యకరము కాదు. మొదటి భార్య యుండగానే ఇంకొక భార్యను చేసికొన్నట్లయినచో ఆ మొదటి భార్యకు తన పుట్టింట జరిగెడు మర్యాదలు సన్నగిల్లి పోవుచుండును. ఆ మొదటి భార్య యొక్క ఆవేదన ఇట్లున్నది—

,,ఎరుగని రాజ్యం బోతివయా—నా వొక్క దేవూడ నా వొక్క దేవూడ

.... .... .... .... .... ....

నాకు సవితిని దెస్తివయా—నా వొక్క దేవూడ నా వొక్క దేవూడ
సవతి మీద మన్ను వోతు ,, ,,
కంచాన తీనలేదు ,, ,,
మంచాన పండలేదు ,, ,,
నా ఏడ్గు రన్నగార్లు ,, ,,
నాకు సారె వోతురేమో ,, ,,

... ... ... ... ... ..

కనుకనే ,,స్వారాజ్య మిచ్చినా సవతి పోరేల,, అని యిల్లాలు వాంఛించుటలో సవతి పోరెంతటిదో తేట తెలము.

## తాత - అవ్వ - మనుమలు - మనుమరాండ్రు:-

తాత, అవ్వ, మనుమలు మనుమరాండ్రు సంబంధములు గూడ చిలిపి హాస్య పూరితములు. తాత అవ్వల బోసినవ్వులు, మనుమల మనుమరాండ్ర పసిడినవ్వులు ఒకే కొమ్మన ముకుళించనున్న వికసించనున్న పువ్వులు. బాల్యమున తల్లిదండ్రుల మీద, యౌవనమున భార్యాబిడ్డల మీద, వార్ధక్యమున మనుమల మనుమరాండ్రమీద ప్రేమానురాగము లేర్పడుట అనుభవసిద్ధము.

మనుమడు చెంగున గంతు లిడుచు తాతమీద తై తై మనుచు "తాతా తాతా తంగేడి పుల్ల, అన్ని పాడగా దొంసినీ యక్క కుందేటి పిల్ల" అనుచు తాత మనుమని బట్టుకొనబోగ నతడు చిక్కవడక మరింత మురిసి పడుచు "తాతా తాతా ముంజికాయ మూతా కొండపల్లి పెట్టె కొత్తా నంజు నా చేత వావు నీ చేత" అని గేలిసేయును. మనుమడు "కొండ మీద కోతి" అనగానే తాత అందుకొని "కోతి గుద్దల నీ మూతి" అని చక్కిలి గింతలు చేయును. తాత దగ్గర కొంతత పైకముండుటచేత నప్పుడప్పుడు వారి చేతులలో చిల్లర డబ్బులు పెట్టుచుండుట వలన వారు చంకలెగుర వేయుదురు. అట్లలవాటుపడిన మనుమలు మనుమరాండ్రు తాత దగ్గర పైసల మూట యున్నది పసిగట్టి బెల్లము మీద ఈగల్లు ముసరు కొన్నట్లు తాత చుట్టు మూగి తై తక్క లాడుచు "తాతా తై బొమ్మలాట నీ వున్నది సామర్లకోట కోట చుట్టూ బొమ్మలాట నీవు కూసుంది కుర్చీల పీట పీట క్రిందున్నాది వరహాల మూట అ మూట మాకిస్తే మా దొడ్డ మాట" అన్నప్పుడు వారికి తాత పైసలివ్వకుండ ఉండలేడు.

చేత ఊతకఱ్ఱ బట్టుకొని వంగి నడచుచు వచ్చెడు తాతను జూచి మనుమరాలు "ఊచ కఱ్ఱొ చేత ఉగ్గమో చేత ఊగుతా వచ్చినా తాతెవ్వరమ్మా" అని మందలించగా "మానికా నిండాను మాడలేసుకొని మనుమరాలా నిన్ను

మనుమడుగవస్తి,, అని సరసముగా బలుకును. శృంగారముడిగిన తాత శృంగార మెరుగని మనుమరాలిని మనువడుగుట అదియొక హాస్యము. అది వారి వావి వరుస. మనుమరాలు కూడ సామాన్యమైనది కాదు. ,,వాడిన పూవుల్లు వాసనలు గలవా—ఓ తాత ఈ మనువు వొద్దయ్య నాకు,, అని సూటిగా చమత్కారముగా మాట్లాడును. అంతేగాదు, మనుమరాండ్రు మనుమలందరు గూడి ,,ముసలోడు మా తాత పసి నిమ్మపండు—ముసల్దాన్ని పెళ్లాడి మూల గూర్చుండు—పడుచు దాన్ని పెళ్లాడి పై కావలుండు,, నని తాత కాపురమును నవ్వులపాలు సేయుదురు. ఆతడు పడుచు దానిని పరిణయమాడి పడుచుండెడు అవస్థను జూచి ,,ముసలాడి నడ్డి బాగ ఒంగినప్పుడు—మూతి మీద మీసాలు నెరిసినప్పుడు—మాటుంటె పిల్లొస్తది తాతా నీకు—ముద్దాడితె కరుస్తుంది తాతా నిన్ను—ఒంగుండి మొక్కవయ్య తాతా నువ్వు,, అనుచు నతని గిల్లుకొనుచు ,,దగ్గు దగ్గు పెండ్లి కొడుక దుగ్గాణిస్తావా—పయనమయ్యె పాపిరెడ్డిపడుచు దాన్నిస్తావా,, చప్పట్లు కొట్టుచు అపహాస్యము చేయుచుందురు. వారి యాటపాటలలో నలవోకగా కూడ అతని మీద పాటలల్లుకొందురు.

అవ్వను గూడ ఇట్లే పరిహాసము చేయుదురు. ఆమెను మందలించుటలోని హాస్యమునుగనుడు. ,,ఇవ్వాళ్ల చచ్చేవు రేపు చచ్చేవు—ఏమోలె ముసలమ్మ పిడక లేరేవు,, అని వెక్కిరించి చూతురు. తాత అవ్వల ద్వారా యెన్నో ఆటలు పాటలు కుటుంబమున పిల్లలు నేర్చుకొనుచుందురు. వీరి వలన ఆ పిన్నవారికి కొంత లోకజ్ఞానమలవడు చున్నది. సంప్రదాయ మందింపబడుట జరుగుచున్నది. పండుకొనునప్పుడు తాత లేదా అవ్వ వారికి చిన్న చిన్న కథలు చెప్పుట యొప్పును. అవియే జానపద కథలు. వానివలన వారి ధారణ పెరుగుటయే గాక మానసిక వికాసమునకు దోహదమగుచుండును.

తాత: నీ చేతు లెక్కడికి వాయె; మనుమడు: కోరుకొండకు
తా: కోరు కొండే మిచ్చింది; మ: గుడ్డి గవ్వ యిచ్చింది

తా: గుడ్డి గవ్వేం జేసినవు;  మ: మా తాత కిచ్చిన
తా: మీ తాతే మిచ్చిండు;  మ: మొకం కడుక్కోని నూతిలో పడేసిండు
తా: నుయ్యే మిచ్చింది;  మ: నీరిచ్చింది
తా: నీరేం జేసినవు;  మ: మొక్కలకు పోసిన
తా: మొక్కలే మిచ్చినయ;  మ: పువ్వు లిచ్చినయి

తా: పాలేం జేసినవు;  మ: పరమాన్న మొండిన
తా: పరమాన్న మేం జేసినవు;  మ: పరమేశ్వరఅర్పనం జేసిన

ఇట్టి సంభాషణల ద్వారా చక్కని శిక్షణ తాత గరపుచుండును. పుణ్యము పురుషార్థము గూడ అందింప బడును. తనకు తెలిసిన విషయములు అనుభవములు వారికి తెలుపుటలో తాతకు మిక్కిలి యాసక్తి. తల్లి దండ్రులు కొట్టినగాని తిట్టినగాని మనుమలు మనుమరాండ్రు తాత అవ్వల వెనుకబడి తలదాచుకొను చుందురు. ఈ విషయములలో తాత గాని అవ్వ గాని మిక్కిలి గారాబమున జూచుట వలనను కొన్ని సందర్భములలో చెడ్డ మాటలు నేర్పుట వలనను, వారిని కొంత వరకు చెడగొట్టుచుందురని చెప్పకొనక తప్పదు. మొత్తముమీద జానపద కుటుంబములలో ఒక్కరికొరకందరు, అందరికొరకొక్కరు పాటుపడుచుందురని బోధపడగలదు.

# సామాజికజీవనము

మానవ సమూహమును సమాజమని చెప్పుట సామాన్యమైనది. అట్లనుట కంటె పరస్పరాశ్రయులై క్రమ పద్ధతిని అవలంబించుచు స్థిర సంబంధములతో జీవించెడు వ్యక్తుల సమూహమును సమాజ మని నిర్వచించుకొనుట యుచితము. అట్లు పరస్పర సామాజిక సంబంధములతో ఆచారాదికము లందన్యోన్యతను నెరపుకొనుచు కలిసి జీవించుటయే సామాజిక జీవనము. పరస్పర సామాజిక చర్యల పర్యవసానమే సామాజిక సంబంధములు, సామాజిక జీవనము. సమాజములోనున్న ఆయా వ్యక్తుల నడుమ జరుగు పరస్పర చర్యల ననుసరించి సామాజిక జీవన పద్ధతి రూపొందుచుండును. స్థిరమైన రూపమును దాల్చు పరస్పర చర్యలను సామాజిక ప్రక్రియ లందురు. సమాజ జీవనములో వివిధ సామాజిక ప్రక్రియలుండును. సంప్రదాయము, జానపదరీతులు, కట్టుబాట్లు, అలవాట్లు, అభిరుచులు మున్నగునవన్ని సామాజిక ప్రక్రియలు అవి అన్ని సమాజములలోను గన్పించును. ప్రతి ప్రక్రియ వాని వాని లక్షణములతో వైలక్షణ్యమును ప్రదర్శించును. వానిని విశ్లేషణము గావించి సామాజిక దృక్పథమున పరిశీలించునది సమాజ శాస్త్రము. సామాజిక జీవనములోని వ్యక్తుల మనస్తత్త్వమును దెలిసికొన్నప్పుడే వారి సామాజిక సంబంధములు బోధ పడగలవు. అనగా మనస్తత్త్వమునకు, సామాజిక సంబంధములకు అవినాభావ సంబంధమున్నదని భావము. అందుచేత సామాజికాభివృద్ధి జరుగవలెనన్నచో నా సమాజములోని మానవులలో తగినంత మానసికాభివృద్ధి కూడ జరుగవలెను.

మానవుడు లేదా వ్యక్తి సామాజిక జీవి. సమాజము లేనిది వర్ధిల్ల జాలడు. తన యవసరములు దీరుటకై మనుగడ కొనసాగుటకై సమాజములోని వ్యక్తులతో సంబంధము పెట్టుకొనుట సహజము. అట్టి సంబంధములే అన్యోన్య వర్తనలకు దారితీయును. సామాజిక సంబంధములు పెరుగును. అవియే సామాజిక లక్షణములను భద్రపరచి సంవర్ధించుచు పశువుల నుండి మానవుని

వేరుచేయుచున్నవి. సమాజము మరియు వ్యక్తి వేరు వేరుగా రూపించినప్పటికిని క్రమాభివృద్ధి విషయములో నవి అన్యోన్యాశ్రయములు. వ్యక్తుల చేతనే సమాజమేర్పడు చుండును గదా! అట్టి వ్యక్తుల ప్రభావము సమాజముపైనున్నను సమాజమే వ్యక్తులను సామాజిక జీవులుగా చేయును. వ్యక్తి జీవితమున సామాజిక ప్రభావములు మిక్కిలి ప్రధానాంశములు. పుట్టినప్పటినుండి గిట్టునంత వరకా ప్రభావము లతనిని తీర్చిదిద్దును. కుటుంబదశలో తత్ప్రభావమెట్లు పని చేసినది గత ప్రకరణములో పరిశీలించితిమి. కుటుంబము తరువాత వ్యక్తి అభివృద్ధికి తోడ్పడునది సమాజము. అందులో సామాజిక, ధార్మిక, ఆర్థిక, మత, రాజకీయాది సంస్థ లుండుటచేత వ్యక్తి వానితో సంబంధము పెట్టుకొనుట జరుగును. వాని ప్రభావములు వ్యక్తిని మరింత సంస్కరించును. పుట్టగానే పసి పాపకు తల్లి మొదలగు వారెట్లవసరమో, అట్లే పెరిగిన పిదప వ్యక్తికి సమాజమత్యంతావసరమై యున్నది. వ్యక్తి సమూహమునకు దూరముగా నుండి నప్పుడు గూడ వాని యాలోచనలు, జ్ఞాపకములు, ఆ సమూహముతో దగ్గర సంబంధము గల వ్యక్తులతో ముడిపేయబడుచుండును. ఏ సమాజములోనైనను ఇట్టి సంబంధములు సాధారణమైనవియే. నాగరక సమాజములో కంటె జానపద సమాజములో నిట్టి సంబంధములు పటిష్ఠమైన సామాజిక జీవనమును దృఢ పరచును. ఈ ప్రకరణమున తెలుగు పల్లెపదాలలో ప్రతిబింబించిన జానపద సామాజిక జీవనమును పరిశీలించుట జరుగును. అది సమస్త తెలుగు జాతి జీవనము. భారత జాతీయ జీవనములోనది మౌలిక విధానము.

## వ్యవసాయ జీవనము - సామాజిక వ్యవస్థ

మన దేశములో గుణకర్మ విభాగమును బట్టి ఏర్పడిన వర్ణ వ్యవస్థ కాల క్రమమున కులవ్యవస్థగా మారుట వలన పల్లెలలో ప్రజా జీవనము కులవృత్తి మీద ఆధారపడి యున్నది. వృత్తులన్ని ఆయాకులక్రమాను గతములు. కుల

మనగా ఒకానొక వృత్తి సంబంధమున ఏర్పడిన సమూహము. ప్రధాన వృత్తి వ్యవసాయ జీవనమే యగుటచేత వివిధ వృత్తి జీవనములన్ని దానికి అనుబంధితములై యుండును. పల్లె యొక్క పరిమాణము గాని, జనసంఖ్య గాని దానిమీదనే ఆధారపడియుండును. పల్లె పల్లెకు సాగుచేయబడు భూమి యొక్క విస్తీర్ణము కొన్నిమైళ్ళ వరకు వ్యాపించి యుండును. పరిశుభ్రమైన గాలి, వెలుతురు, ప్రకృతి సౌందర్యము ప్రకృతి సంపద మున్నగునవి పల్లెల యొక్క సహజ సంపదలు. కనుక వ్యవసాయవృత్తి సంబంధముగనే పల్లెలలోని ప్రజా జీవనము మలచబడుచు హద్దు లేర్పడుపబడును.

దున్న పొద్దున్న పొద్దుక్కి లెందుకు బన్నవ్ 1
పసులోడు గాయంది నన్నేమంటవ్
ఏమిర పసులోడ ఎందుగ్గాయవ్
పాలేలు జీతమియ్యంది నన్నేమంటవ్
పాలేల పాలేల జీతమెందు కియ్యవ్
సోల దొరుకంది నన్నేమంటవ్
ఏమే సోల ఎందుకు దొరుకవ్
వాడ్లోడు జెక్కంది నన్నేమంటవ్
ఏమిర వాడ్లోడ ఎందుకు జెక్కవ్
బాడిసె తెగంది నన్నేమంటవ్
ఏమే బాడిసె ఎందుకు తెగవ్
కమ్మరోడు జరువంది 2 నన్నేమంటవ్
ఏమిర కమ్మరోడ ఎందుకు జరువవ్
తిత్తూదంది నన్నేమంటవ్
ఏమే తిత్తి ఎందుకు వూదవ్
బక్కది జావంది నన్నేమంటవ్
ఏమే బక్కదాన ఎందుకు జావవ్
ఆయుసు మూడంది నన్నేమంటవ్

1. పండినావు 2. చలచి పదును పెటనిచో

భౌతిక, సామాజికాది పరిసరములెల్ల ప్రకృతి మరియు వ్యవసాయ వృత్తి సంబంధములై యుండుటవలన జానపద సామాజిక వ్యవస్థ యెట్టిదో పై పాట చాటుచున్నది. దున్నుటతో నారంభమగు వ్యవసాయపు పనికి పశువులు, పశువుల కాపరులవసరము. వారికి పటేలు (కాపువాడు) జీతమిచ్చుచుండును. జీత మిచ్చుటకు కొలమానము సోల. సోల మున్నగు వానిని చేయువాడు వడ్రంగి. వడ్రంగికినుపకరించు పరికరములు బాడిస మున్నగునవి. వానిని సిద్ధముచేసి యిచ్చువాడు కమ్మరి. అట్లే తదితర వృత్తులన్నియు వ్యవసాయము మీద ఆధార పడియుండును. ఇట్లాధారపడి యుండుటచేతనే పల్లెలోని ప్రజా జీవనము పందిరివలె నల్లుకొనిపోవును. తీగను లాగినచో పందిరి మొత్తము కదలినట్లుగానే ఒకవృత్తి వాడు తనపనిని చేయకున్న యెడల ప్రధాన వృత్తి దెబ్బతినుటయే గాక తత్ప్రభావ మన్ని వృత్తులపైన బడుచుండును. ఆర్థిక జీవనము కుంటు పడక తప్పదు. అందుచేతనే ఏ వృత్తి వాడా వృత్తి పనిని చేయుట అవశ్యకర్తవ్య మైనది. సాధారణముగా కాపు కులమువారే వ్యవసాయమునకు ముఖ్యులు. 'పండించి తెచ్చేరు పంట కాపుల్లు'; దుక్కి దున్నిన దేశమందు దుఃఖముంటుందా కాపు నడచిన భూమి మీద ఏపు తగ్గిందా' అన్నట్టి గట్టి అభిప్రాయములు కాపువారి మీద ప్రజలకేర్పడినవి.

## ఏరువాక :-

జ్యేష్ఠ మాసమునుండి వర్షకాల మారంభమగును. ఏరులు నదులు పొంగి పొరలాడుట భూమి తల్లి గంగ తానమాడినట్లుండును. నల్ల నల్ల మేఘాలు నాట్య మాడుచుండును. 'పాడుతూ కోయిలా పరుగులెత్త'గా మరియొక వంక 'ఆడుతూ నెమలి అలసిపోవు' చుండును. ఎరుపు తెలుపుల యెండ యెడనెడ కాయుచుండ 'ఏ కొమ్మ మీదనో ఎండ తాకిన పిట్ట ఏటితోవలు పట్టి ఎగిరిపోవు'ట కన్పించును. పిట్ట పిట్ట ముద్దుపెట్టుకొనుట, ఏటి గాలికి చిలుకలెగిరి పోవుట, లేదూడలు

గిత్తలు తోకలెత్తుకొని గంతులిడుట కనుల పండువుగా నొప్పారును. ఆకాశమున మబ్బులవతరించినప్పుడు, 'ఉఱుమొక్కటావేళ ఉఱిమి పోకపు' కాపు పిల్లల మనసు కదలిపోవుట, వచ్చెదనన్న వాన రాకుండుట వలన పొలము వెంత నెదురు చూచెడు కాపు పడుచు గుండెలు చెదరిపోవుట ప్రకృతికి పులకరింతలు పుటము రించినట్లగును. ఇంత చక్కని వర్షారంభమున వ్యవసాయ జీవనము ఏరువాక[1] తో ప్రారంభమగును. ,,తెల్లవారితే సంవత్సరాది వచ్చె ననగా ఏరువాక సాగుదురు. దీనికి దొంగ ఏరువాక యని పేరు. ఇదియొక విధము. ఇదిగాక శ్రావణ శుద్ధ పౌర్ణమినాడు ఏరువాక పండుగ చేయుదురు. అది యొక రకము[2],,. కాని సాధారణముగా జ్యేష్ఠ శుద్ధ పౌర్ణమి నాటి ఏరువాక తోడనే వ్యవసాయ జీవన మారంభమగును. ఆరంభమునకు తిథి వార నక్షత్రములతో గూడిన మంచి ముహూర్తము గూడ చూచెదరు. ముఖ్యముగా ఎద్దుల నర్చించుట యన్నది ప్రథమ కర్తవ్యమై యున్నది. ఇట్టిది ,ఉద్వృషభయజ్ఞము'ను పేర బొత్తరాహాలు చేయుదురని జైమినీ న్యాయమాలకు బుక్క రాయల మంత్రియైన సాయణ మాధవాచార్యులు ,,విస్తరము,, అను వ్యాఖ్య వ్రాయుచు అందులో ,,ఉద్వృషభ యజ్ఞాదయ ఉదీచ్యైః, జ్యేష్ఠ మాసస్య పౌర్ణమాస్యాం బలీవర్దసమ్యర్చ్య ధావ యంతి సోఽయ ముద్వృషభయజ్ఞః,, అని చెప్పినాడు [3]. బహుశః తర్వాతికాలమున ఈయాచారమన్ని ప్రాంతములకు ప్రాకినట్లున్నది. లేదా పూర్వము నుండియే దేశమంతట నుండి యుండును. గాథాసప్తశతిలో నేరువాక ప్రసక్తి కలదు [4].

---

1. నాగలితో దున్న నారంభించుట, ఎద్దుల నమరించిన నాగలి.

2. జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి:- పు-23

3. జైమినీయ న్యాయమాల-(హోలకాధికరణము)

అధ్యా. 1, పాద. 3 అధికరణము ___ 8.

4. గాథాసప్తశతి:- హాలుడు:- 2-65

విష్ణు పురాణ మీ యేరువాకను ,,సీతాయజ్ఞ,, మన్నది 1. (సీత యనగా కఱ్ఱు-నాగటి నాలు) ఒకే నాగలి క్రింద తగిలియున్న తీక్షణపు ఇనుప కఱ్ఱులతో బాగుగా భూమిని దున్నవలెనని మాత్రము వేద మందున్నది2. ,,పడమట కొఱ్ఱు వేసె పదును వానగురిసె-పోపొయ్య రఘురాముడు పదును జూసొచ్చె ,,పొలము లదనైన పదును జూచి వచ్చి వ్యవసాయము జేయువారందరు, కమ్మరి వద్ద కఱ్ఱులను పద్రంగి చెంత క్రొత్త నాగళ్లను చేయించుకొని వచ్చి, స్నానములు చేసి క్రొత్త వస్త్రములు ధరించి—

ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ—ఏళ్లు నదులు పొంగి వెంబడొచ్చాయి
ఏరువాకమ్మకు ఏమి కావాలి—ఎర్ర ఎర్రని పూలమాల కావాలి
ఎరుపు తెలుపుల మబ్బు చెండ కావాలి—బసవన్న కొమ్మలకు పచ్చన్ని పూలు

... ... ... ... ... ... ...

కొత్త బట్టలు గట్టి కొత్త నాగళ్లతో—కొత్త దూడలతో కొత్త పాలేళ్లతో
ఏరువాకా సాగి మురుసుకోవాలి..... ... .... .... ...
కలుపరా అబ్బాయి కొత్త దూడల్ని
దున్నరా ఓ అయ్య దుక్కుల్ని మీరు

... ... ... ... ... ..

1. మంత్ర యజ్ఞ పరా విప్రా సీతా యజ్ఞాశ్చ కర్షకాః
గిరి యజ్ఞా స్తథా గోపాః ఇజ్యోస్మాభిర్గిరిర్వనే
—విష్ణు పురాణము:- 2—16—9

2. ,,.... ....శునం సుఫాలా వితుదంతు భూమిం,,
—ఋగ్వేదము—4-5-57-8.

గోర్తి ఎద్దులకేమొ కొమ్ము కుప్పెల్లు
గుంట ఎద్దులకేమొ కుచ్చుల్ల తాడు
బోరు బోరు గజ్జెల్లు బొడ్డు గంటల్లు ... ... ,,. ... ...

కుచ్చుల్ల పణకట్లు కురుమల్లి తాడూ,, నాగళ్లకు ఎద్దులకు పూలమాల లలంకరించి పసుపు కుంకుమలలంది, ముఖ్యముగ నెద్దుల కొమ్ములకు నూనె పసుపులు రుద్ది, కొమ్ముల చివర కొమ్ము కుప్పెలు, నొసట చుంచులు కురుమల్లె త్రాళ్లు మర్చి, నిలువుబొట్లు దిద్ది మెడకు గంటలువేసి (కొన్ని ప్రాంతములలో పులగము కూడ వండి పెట్టెదరు.) దీప ధూపములిడి పూజించి నాగళ్లకమరించి— ,,మంగళమమ్మా మాపూజలు గైకొమ్మా — మంగళమమ్మా నాగలి నీకు కష్టమనక భూమి దున్ని—కరువుమాపి కడుపునింపి,, యనుచు మంగళములు పాడి మురియుచు పొలములకు పోవుచుందురు. మొద్దు నిద్దురలువోవు రైతన్నలను వారి భార్యలు ,,కోడికూతేసేను లేవోయి బావా—లేచి నువు వెనువెంట కోపేరు వేయి—ఎల్లెద్దు నల్లెద్దు రంకేస్తు వుండాయి—రంకెవిని చంటోడు లేచాడు లేవోయి..........,,అని పడక నుండి లేపి ,,కారు మబ్బులు గ్రమ్మి కాలమే మారింది-కామందులంతాను కదిలి వెళ్తున్నారు-ఏరువాకొచ్చింది ఏరువాకొచ్చింది" అని కర్తవ్యమును గూర్చి తెలుపుచు తమ కర్తవ్యమును పాలించుచుందురు. ఇంత వరకు కాడి మోపబడని కోడె దూడలను బట్టి కాడికి మేకొను నట్లలవాటు జేయుట ఈ సందర్భములోనే యధికముగా జరుగును. పాత జీతగాండ్రు పాలేర్లు మారుట, క్రొత్త వారు కుదురుట యన్నది కూడ ఇప్పుడే పొసగుచుండును. క్రొత్త జీతగాండ్రకు పాలేర్లకు క్రొత్త వస్త్రము లిత్తురు. (,,కొత్త బట్టలు నీకు కొత్త పాలేర—కొత్త గోచనీకు కుర్రపాలేర,,) ఏరువాక యన్నది వ్యవసాయ సంబంధమైన తొలిపండుగ. ,,కొత్తల్లు దొస్తాడు కోడలొస్తుంది-కొత్త బట్టలు దెచ్చి దాచండి మీరు,, అనుచు సంబరపడుచుందురు. ముత్తైదువ లిండ్లలో క్రొత్త కుండలు దెచ్చి జాజు సున్నము పట్టెలతో నలంకరించి విభూతి గాని

పసుపు కుంకుమలతో గాని బొట్లు పెట్టి, కలిపిన విత్తనములను మ్రొక్కుచు కుండలకెత్తి "యితనాల కడవాకి యీబూతి బొట్లు—యెత్తి బోదపురండి ముత్తైదలారా," అనుచు పిలుచు కొనుచు ఏరువాక వెంబడి పొలమునకు బోయెడు ఆయొయ్యారము చూడ ముచ్చట గొలుపును. ఇంటికి ఆడబడుచు వచ్చినచో, గృహలక్ష్మి కాబట్టి ఆమెచేతనే విత్తనములు కలిపించి విత్తనపు కడవనింపించి అది నెత్తినబెట్టి పొలమున కంపించి, తొలి విత్తనమామె చేతనే వేయింతురు. ఇట్లు చేయించుట శుభమని, చక్కని పంటలు పండునని విశ్వాసము. ఏరువాక సాగబోవునప్పుడు ఏరుమీద టెంకాయ కొట్టి ముత్తైదువలు—

"ఏరువాకమ్మకు ఏమికావాలి—టెంకాయ వడపప్పు తెచ్చి పెట్టాలి
పొలము గట్టున నిలిచి వేడుకోవాలి—ఏరువాకమ్మకు ఏమి కావాలి
ముత్తైదలందరు పాటపాడాలి—పుణ్య స్త్రీ లందరు పూజసేయాలి
రోజు రోజు గోవు పూజసేసేము—ఏడాది కోమారె కోడెలకు పూజ
సాగిరావమ్మ మా ఏరువాకమ్మ—ఏరువాకమ్మకు ఏమి కావాలి
పాటపాడుతు తల్లి పాదాలు మొక్కాలి—ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలు పండి పరవశించాలి," అనుచు పూజలు సేసి, మ్రొక్కులిడుచు

కోరికలు కోరుకొనుచు నిష్కల్మష హృదయములను నివేదించుకొందురు. ఇట్లు విత్తుటకు ముందు చేయవలసిన పూజా విధానమును గూర్చి రెట్ట మత శాస్త్రము "తొలుత గంధాక్షత ధూపోపహారముల్గొట్టు జడ్డిగమున కొసగవలయు; హర్షంబుతో జొన్నలాదిగా ధాన్యముల్విత్తిన ఫలియించు వెలితి లేక 1," అనియు "చెలగి పుణ్యాంగనల్సేసలు చల్లిన ముదమున వేదముల్లదువుచున్న 2,"ను

---

1. రెట్ట మతశాస్త్రము:— (తెనుగు సీత) అయ్యల భాస్కర కవులు.
ఆ. 3. పద్య. 24

2. రెట్ట మతశాస్త్రము:— ,, ఆ. 3. పద్య. 25

సస్యములు ఫలించుననియు చెప్పియున్నది. ఏనాటినుండియో కర్షకులిట్టివి ఆచరించుచునే యున్నారు. ‘‘మృగశిరా కార్తిలో ముంచెత్తు వానా—విత్తనాలు దీసి విరజిమ్మవయ్యా—ఒకగింజ కోటి అయి వర్ధిల్లు మీకు’’. విత్తనము వేయు కార్తె సాధారణముగా మృగశిరకార్తె. కాబట్టి ఆ కార్తెలో పడెడు వానలు చల్లెడు విత్తనములకు చేవనిచ్చి ఒకటికి కోటిగా పంటలు చేతికి వచ్చునట్లు సేయునని శుభము పలుకుట వ్యవసాయ జీవనమునకు స్వస్తి వాచకము. ఇట్లే నూరు చేతులతో విత్తనాలు చల్లి వేయి చేతులతో పుష్కలమైన పంట పొంద వలెనని చెప్పిన వేదోక్త విషయ మిట గమనార్హము 1. ఏయే నక్షత్రముల (కార్తెల)లో ఏయే విత్తనములు వేసినచో బాగుగా ఫలించునో అట్టి బీజావాప లక్షణములను గూర్చి కూడ రెట్టమతశాస్త్రము వివరించినది 2. ‘‘చిక్కిపోయిన వళ్లు చియ్య బట్టిందాక—హాయిగ ప్రతినోటి కన్నమందిందాక—పేదరాలి యింట పిల్లి లేచిందాక—పెద్ద పెద్ద బంజర్లు పదును కొచ్చిందాక—పదును కొచ్చిన చేలు వచ్చ బడిందాక—దూరమైనా సిరులు చేరువయ్యిందాక—చేరువయిన సిరులు చేతి కందిందాక’’ ఏరువాక సాగవలెనని కర్షకులను దీవించని జనులుండరు! అది పల్లీయులలోని చక్కని సామాజిక భావన.

సమయమునకు వర్షములు పడనప్పుడు పల్లె ప్రజలు కనులెత్తి ఆకసము వంక చూచుచుండెదరు. ఆకసమున తెప్పలు కనబడనిచో వారి గుండె బిగువు తప్పి మొగము సిన్నవోవుచుండును. అటనట కన్పించినచో రెప్పల దాపున ఆశలు తెప్పరిల్లుచుండును. మొగమున మురిపెమొక విరుపు విరుచుకొని చూచును. నోట తేటతేనియ లొలుకు పాటల మూట విప్పబడగ నా మొయిళ్ల ననేకవిధములుగ ప్రార్థించుచుందురు—

1. శత హస్త సమాహర సహస్ర హస్త సం కిర కృతస్య కార్యస్య చేహ స్ఫాతిం సమావహ—అథర్వ వేదము!— 3-24-5
2. రెట్ట మత శాస్త్రము:- అ. 3. పద్య. 2 నుండి 19 వరకు

,,కారు మేఘమా రావే రావే—పువ్వుల మబ్బా దిగవే దిగవే
పింజ మేఘమా ధూళి మేఘమా—చెమటను ఊడ్చి దిమ్మరించవే
కబోది మబ్బా చిట్టి తమ్ములను—పన్నెండుగురినీ పట్టుక రావే
కొంచెము నీళ్ళను విడిచి పెట్టవే—అన్నం కడుపుకి తింటాము
తిన్నని మబ్బా దిట్టా రావే—సోమరి మబ్బా చిట్టీ రావే
ముక్కు పుడకనే నమ్మీ నీకొక—గొడుగును కొంటా వేసుకు రావే
మెత్తని వానా మెల్లగ దిగవే—ఇంట నాగలీ మూలలో చేరే

సూరన్న పేడిమి సొమ్మ సిలజేసి—నవ్వు మొగముతో రావే రావే,,
అనుచు వానదేవునకు తమ హృదయములను విప్పి చూపుకొనుటలోని ఔచిత్యము గమనార్హము. ఎల్లప్పుడు ప్రకృతి పరిశీలనలో వారి దృష్టి కేంద్రీకృతమై యుండును. వేసవి ఎండను భరింపలేక—కారు మేఘమా, పుష్వులమబ్బా పింజమేఘమా, ధూళి మేఘమా, కబోది మబ్బా, తిన్నని మబ్బా, సోమరి మబ్బా మెత్తని వానా యనుచు నెనిమిది రకములుగ పలుకరించుచు తగిన కాలమై మేలైన పంటలు పండవలెనని వారి ఆశయము. రెట్టమత శాస్త్రములో నీ యెనిమిది రకములైన వానిని పుష్కలా వర్తక, మధు, వాయు, రాజ, బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర, నీలమేఘములనుచు పేర్కొని వాని లక్షణములను మరియు నవి యెప్పుడెట్లుండినచో వర్షించునో తెలిపినాడు 1. వాన రాకపోకలను గూర్చిన విజ్ఞానమనుశ్రుతముగా నేటికిని కర్షకులలో మిగిలి యున్నది. అవసరమును బట్టి ఒకప్పుడు కారు మేఘములతో, ధూళిమేఘము(సుడిగాలి వాన)లతో, మరొకప్పుడు పింజ మేఘములతో, తిన్నని మబ్బులతో మెత్త మెత్తగ వానలు కురియవలెనని ఇండ్లలో మూల బడిన నాగళ్లకు పని కల్పించవలెనని వేడుకొనుట యగును. ముక్కు పుల్లలమ్మియో అప్పు సప్పులు సేసియో సేద్యము సాగించి ఇంత మాత్రము కడుపు నింపు కొందుమని విన్నవించుకొనుచుందురు. తొలకరికి ముందిట్టి పాటలు పిల్లలు గూడ—

1. రెట్టమత శాస్త్రము:— అ 2. పద్యములు 33 నుండి 47 వరకు.

,,వాసల్లు కరువాలె వానదేవుడా—వరిసేలు పండాలె వానదేవుడా
మా యిల్లు నిండాలె వానదేవుడా—మా యమ్మ పండాలె వానదేవుడా
మా జొన్న నిండాలె వానదేవుడా,,* అనుచు నుత్సాహముతో బాడుట వేదోక్తమై యొప్పినది 1. వానలు మరింత ఆలస్యమైనచో వాన దేవునికి దయ రాదేదేమోయని శంకించి గ్రామస్థు లందరు కలిసి ఒకచోట (ముఖ్యముగ గుట్ట మీద) ఆ దేవునికి నైవేద్యముగ వరద పాయసమునిడి అందరు దానిని ప్రసాదముగ స్వీకరించుట ఆచారమైనది. కప్ప కావడి కట్టి ఉత్సవమును చేయుట గూడ జరుగును. ఇట్లు చేసినచో వానలు పడునని పల్లీయుల విశ్వాసము. ఈ విషయమును గూర్చి మొదటి ప్రకరణములోనే వివరించుటైనది. (వాన రాకకై ప్రపంచ మంతట వివిధ జానపద సమాజములలో వివిధ ఆచారము లున్నవి).

చేలు పెరుగ జొచ్చినప్పుడు కూడ వర్షములు తగినంతగ గురియవలెను. అట్లు గానిచో పల్లీయుల బ్రతుకులు గడువవు. ఒకవంక నెడ నెడ వర్షములు లేక పోవగ, మరొకవంక ,,ఈనుచున్న చేనులన్ని ఎండిపోవు చున్నాయి పండుచున్న చేలన్ని పండు బారి పోతున్నాయి,, ,,ఏనుగులాంటి మొగోళ్లు ఎత్తులడి పోయారు,, కనుక కొందరు పురుషులు ఆకలి కోపముతో వచ్చి భార్యలను ,,కూడొండ లేదంటు కుండెట్ట కొట్టారు—మండెడు గంజి లేదని మండెట్టి కొట్టారు,,. అందుకే వారు ,,మొఱ్రో మొఱ్రో వానదేవుడా—మొరొఱ్ఱి మొఱ్రో వానదేవుడా—మమ్మింక దయజూడుమయ్య వానదేవుడా—మా వాడకే రావయ్య వానదేవుడా,, యని మొరపెట్టుకొనుచుందురు చెల్లెండ్రు అన్నల నడిగి కోరికలు దీర్చుకొనునట్లుగ పల్లె వనితలు, ,,వరుణ దేవుడ నీకు వరుస చెల్లెల్ని

1. అయంనో నభస్పతిః సంస్ఫానో అభిరక్షతు అసామతిం గృహేషునః,
అథర్వ వేదము;- 6—79- 1.

చక్కగా కురిపించు సస్యాల మీద,, యని అడుగుకొనుట వారి ప్రకృతి సంబంధమునకొక చక్కని తార్కాణము. ప్రకృతి సంబంధమునకే గాక ప్రకృతి యారాధనకు కూడ సాంప్రదాయక వ్యవసాయ జీవనము ప్రబల నిదర్శనము. అది వైదిక సంప్రదాయము.

## చేలకావలి:-

కాలమొక యెత్తైనచో కాలముతో బెరిగి వెన్ను విరిసి ఊగే చేలను కావలకాసి చేతికి దక్కించుకొనుట మరొక యెత్తు. గింజలు మొలకెత్తి నప్పటి నుండి చేను కోతల వరకు వాని కావలి కాయవలసి వచ్చును. అప్పుడప్పుడు పశువులు చేలలో విరుగబడి మేయుచుండును. అడవి పందులవంటి అడవి జంతువులు త్రొక్కి పొరలాడుచుండును. ఎలుకలు సరేసరి. గింజ పట్టిన పిదప పిట్టలు కాకులు వ్రాలు చుండును. రకరకములైన క్రిమి కీటకాదులవలన తెగుళ్లు వారు చుండును. ఇంతేకాదు, పంటచేలను దొంగలు కోసికొని పోవుట గూడ జరుగును. వాని బారినుండి కాపాడుకొనలేక పోయినచో కాయ కష్టము వరద గలిసినట్లగును. అందుకే పసుల కాపరులు జీతగాండ్రు అవసరమై యుందురు. పొలము యజమానులు వారిని పోషించుచుందురు. ఏపుకాపునకు వచ్చిన చేని మధ్యలో నెగాత్తు మంచెవేసి దాని మీద ఉండి కావలికాయుట జరుగును. అట్లు కావలికాయువారు కొన్ని గులక రాళ్లనేరి తెచ్చి మంచెపై పోగుచేసి వడిసెలలో బెట్టి ,,లేలేలే,, యనుచు గిర గిర త్రిప్పి గురిచూచి చేనిమీద వ్రాలిన పిట్టలను కాకులను కొట్టుచుందురు. కేకలువేసి అదర గొట్టుచుందురు. చచ్చిన కాకి నొక దానిని చేనిగట్టుననున్న చెట్టుకొమ్మకో లేక ఏపుగా పెరిగిన ఒక కర్రకో బెదరు గట్టి కాకుల బెడద తప్పింతురు.

చెలుముడి చెల్లెల్ని చేనుకావలుంచి—ఈసీలు బొండ్లొలిచి మంచెలేకావించి
వెండిటీ వడిశాల పయిడిటీ అరాయి—గిరగిరా తిప్పుతూ గుప్పిరాయెదల

టక్కునా తగిలెనా తల్లకిందుగ పడును-పొమ్యేటి పిట్టలను బోరలేపగలేసె

.... .... .... .... .... ....

ఆ పిట్ట నీ పిట్ట గుదిగట్టుకొనివచ్చె-వండుమని వదినెను వాకిట్లోవేసె

మంచె మీది నుండి చేని కావలి కాయుచు కాపు వడుచు వడిసెలలో రాయి పెట్టి విసరివైచి పిట్టలను గొట్టి ఏరుకొని గుదిగుచ్చి వండుకొని తినుటకింటికి తెచ్చుకొనును. మంచె మీదినుండియే పశువులు విరుగబడినది గమనించి పార ద్రోలెదరు. అయినను చేని కాపరులు అంత కఠిన హృదయులు గారు. పైరు కంకుల మీద వ్రాలిన పిట్టలను ,,కొట్టకుండా నువ్వుతిట్టకుండా నువ్వు-అదిరి బెదిరించితే అవతలకు పోవురా,, యని భావించి మ్రోగెడు ఒక డబ్బాను పుచ్చుకొని కేకలిడుచు మ్రోయించుచుండ పిట్టలు, కాకులు మున్నగునవి బెదరి మలలకెగబ్రాకి పోవుచుండును. సందర్భమునను సరించి చేని కావరులల్లుకొని పాడెడు పాటలు చేలకు లాలి పాటలు.

పైరును కాపాడుకొనుటకు రైతులు మంత్ర తంత్ర యంత్రములను గూడ ప్రయోగింతురు. ఎలుకలు శాఖాహారులు. ఫలములు, ధాన్యములు, కాయగూరలు కొరికి కొరికి తినివేయును. చేలలో గూడ సన్నని రంధ్రములు చేసికొని మొక్కలకు చెట్ల పాదులకు ముప్పుదెచ్చును. వానివలన పైరుకు నష్టముండుటను గమనించి కర్షకులు ,,కోతగాడు కోతగాడు నీపేరు-ముట్టకు అంటకు నా పైరు-గుడ్డి దానవై పో ఎలకమ్మా-చెవిటి దానవై పో ఎలకమ్మా దూరకు దూరకు నా యిల్లు-దూరాలంటే ఒక యిల్లు-ఊరంత యిల్లా పాతల్లాను,, అనుచు చేనిచుట్టు తిరుగుచు ఎలుగెత్తి పాడుచుండగా చేలనుండి యవి పారిపోవునని విశ్వసింతురు. ఇవివారి వారి విశ్వాసములను బట్టి చేయుదురు. ఇట్టి పద్ధతి యించుక వైవిధ్యముతో గుజరాతీయులలో గన్పట్టుచున్నది 1. ఇట్లు పంటను

1. A. M. T. Jackson:- The Folk-lore Notes-Vol. I British India Press, Mazgaon, Bombay 1914 P. 154

నాశనము చేసెడు ఎలుకలను, మిడుతలను, అడవి జంతువులను మున్నగువాటిని చంపవలెనని వేదోపదేశమున్నది 1. చిక్కుడు, బీర, పొట్ల, కాకర వంటి పాదు మొక్కలకు గాని ఆకు కూరలకుగాని సన్నని పేను పురుగు తగిలినప్పుడు కుమ్మరి వామిలోని బూడిద తెచ్చి చల్లుటయును గలదు. ఆకు తెగుళ్లు, ఎర్రి తెగుళ్లు బూజు తెగుళ్ళు, పచ్చ తెగుళ్ళు రాకుండుటకై చేనికి నలువైపుల పిడక నుగ్గులతో దాలిచేసి నిప్పంటించి పొగపెట్టుచుందురు. రేయింబవళ్లా పొగలు చేల మీదుగా పారుచునే యుండును. ‘‘తోటలకూ, పాదులకూ, మొక్కలకూ, పచ్చ పురుగులు పట్టినప్పుడు రైతులు శ్రీవత్సగోత్రపు బ్రాహ్మణుని వద్దకు వెళ్లి తాటి యాకు మీద గాని కాగిదము మీదగాని ‘శ్రీవత్సగోత్రము వారి సింహము వచ్చినది పచ్చ పురుగుల్లారా విచ్చిపొండు, అనే మంత్రాన్ని వ్రాయించి, వ్రాసిన పత్రాలకు పసుపురాసి సాంబ్రాణి ధూపము వేయించి పచ్చ పురుగులున్నచోట కడతారు. పచ్చ పురుగులు విడిచిపోతాయని వారి విశ్వాసము 2,, అని శ్రీ నేదునూరి గంగాధరం గారు తెలిపి యున్నారు. రైతులనేకములైన సస్య రక్షణోపాయములెరింగిన వారై యుందురు. అది వారి యనుభవ పాఠము. చేలు విరుగబడి నిండుదనమున ఊగుచుండ రైతుల ఆనందమునకు మేరయేలేదు. కాని యట్టి చేలు పరుల దృష్టి దోషమునకు గురియై చెడిపోవునని శంకించి చేని మధ్యలో కన్పించునట్లు ‘‘దిష్టిబొమ్మ,, నుంచెదరు. దానిని పాత బట్టలతోనైన లేదా వరి గడ్డితోనైన చేసి విచిత్రమైన ఆకారమును కల్పింతురు. చూచెడు వారి దృష్టిని చేని మీది నుండి దిష్టిబొమ్మ మీదికి మరలునట్లు చేయుటకే యట్టి ఏర్పాటు. కొందరు దానిని దూరమునుండి చేని కావరిగా భ్రమించి దొంగతనము కూడ చేయుటకు వెరతురు. అవిగాక ఈనాడు మందుమాకు లెక్కువగా నుపయోగించుచున్నారు. తత్ఫలితముగ ప్రకృతి కలుషితమై క్రొత్త క్రొత్త తెగుళ్లు పుట్టుచున్నవి.

1. అథర్వవేదము:- 6-50-1, 2, 3.
2. మిన్నేరు:- నేదునూరి గంగాధరం-పు. 383

చేల కావలి కాసెడు పడుచు వారి మధ్య జరుగు ప్రేమ సంబంధములకు మంచెలు, చేలు, చేని గట్టులు మున్నగునవి రంగ స్థలములు. తెలుగు దేశములో జొన్న చేని కావలికాయుటకొక ప్రత్యేకత కలదు. వెన్ను విరిసి ఊగెడు జొన్న చేలు, పాల కంకులు, పాలపిట్టలు, పైరగాలులు, ఆలమందలు, ఆమని పిలుపులు చేని మధ్య మంచెలు మున్నగునవి చేని కాపరులైన పడుచువారి శృంగార జీవనమునకు ప్రబోధకములు. తత్సంబంధమైన పదాలధికముగా నున్నవి. మంచె మీద పడుచుది మేని వంపుల ఒయారమొలుక చేతి ఎడిసెలలోని గులకరాయి విసరజూచి పడుచువాడు, ,,ముద్దు మొగముదాన ముక్కుపోగుదాన—కాకి వేషము దాన—కామంచి పడుచా మంచెదిగవే,, యని పలుకరించినాడు. ఆకాంత అంత తేలికగా మారుబలుకలేదు. వాడు, ,,అవకచేనులోన ఆవులున్నాయి భామ ఆలమందానన్న అదిలించి రావే,, యని ఉత్తగనే ఆమె మంచెదిగి వచ్చుట కుపాయమును రచించినాడు. అప్పటికి గూడ దిగిరాలేదు. ,,రూమాల మూటలో రూకలున్నాయి భామ—మంచె కిందికి రావే పంచుకుందాము,, అన్నాడు. అదికూడ ఆమె చెవికెక్కకపోగా, ,,ఒంచీన తలయెత్తి వాలూ సూపులుసూసి—మంచెదిగవే పాంచాల సిలకా,, యనుచు దాని వంపు సొంపులను నాలుక మీద నర్తింప జేయగా నప్పుడా పడుచుపిల్ల మందలివ్వకుండ నుండ గలదా? ,,సెబాసు కుర్ర నాడా—సెవుల పోగుల వాడా—మా బావ విన్నకన్నా మరియాదదక్కునా—మంచె దిగనూ నేను కంచెదాటిరాను,, అన్నది. ,,అల్లాము బెల్లాము తెల్లా కొంగున కడుదు—తెల్లా కొంగున గట్టి తెల్లవారేసరికి పోదు,, నని వాడాశలు రేపినను ఒల్లనన్నది. అన్నదమ్ములు చూచినచో మంచిది కాదన్నది. కానివాడు, ,,కాలులో ముల్లుదిగెను కాసంత ముల్లు దీయవే,, యని నటించినచో దిగవచ్చుననుకొన్నాడు. పెద్దలమాటుననున్న ఆ పిల్ల చాకచక్యము గలది కాబట్టి మంచెదిగదు. మాట లాడదు. మనసు కుదురలేదు.

మనసు కుదిరిన జంటల నడుమ నడచెడికథ, కంటికి కనుగుట్టినట్లుండును. చుక్కల నిక్కు చూపులలో చందమామకు చక్కిలి గింతలు కావా! మల్లియల మీది కమ్మ తెమ్మెరలో తుమ్మెదలకు దిమ్మెక్కదా!

నల్లనల్ల మబ్బు నుండి లగ్గోపిల్లా- అదె తెల్ల తెల్ల చంద్రుడొచ్చె లగ్గో పిల్లా
అల్లి బిల్లి తీగెచూడు ,, - అల్లో నేరేడు క్రింద జూడు ,,
చల్లనైన చలమ చూడు ,, - నేరేడు నీడలోన ,,
నీ చారడేసి కళ్ళ చూపు ,, - మారేడు నీడలోన ,,
నీ చారెడంత జడను చూపు ,, - నిండూ పున్నమనాడు ,,
పండూ వెన్నెలగాసె ,, - నా కన్ను పండువ సేతురాదె ,,

... ... ... ... ... ... ...

తెల్ల జొన్న రొట్టెజేసి ,, - మంచి వెన్నబూసి వెంటతేవె ,,
పల్లెదరి తోటకాడ ,, - మంచి తెల్ల మల్లెపూలు తేవె ,,
నా చేను పండిపాయె ,, - నీ చేను పండవాయె ,,
చేను చేను కలిసినట్టు ,, - మేను మేను కలపరాదా ,,

సంజవేళ చేని పొంత ప్రేమికులలోని చిగురింత కెంతటి పరిసర వాతావరణ ముండునోకనుడు. నల్ల నల్లని మబ్బులు, అందుండి తెల్ల తెల్లని చంద్రుడు క్రింద అల్లిక జిగిబిగి పూటీవెలపొద, అక్కడనే చెలమ, ఆ చెంతనే అల్ల నేరేడుచెట్టు, ఆ నీడలో ప్రియురాలి యొక్క చేరెడేసి కను చూపులలో బారెడంత జడ కోపులో నిండుపున్నమి పండు వెన్నెల కాయగా వారి కన్నులకు పండుగ గాక మరేమి యగును! ఈ పండుగకు తెల్లజొన్న రొట్టెలు జేసి మంచి వెన్న మట్టముగా పూసి చేనిపద్ద కలిసికొన్నప్పుడు ప్రియురాలిని (మల్లెలు కూడ) తెమ్మన్నాడు. ,,జోడుకు జోడుంటే జొన్నసేల కోవాలె......జోలెట్టు కోవాలె,, నని ముచ్చట లాడుట యొప్పును. ఆ తర్వాత, గాలి తాకున పైరగాలి ఊపున చేను చేను గలిసినట్లుగా వారి మేను మేను అల్లుకొని పల్లె పందిరగుచుండును.

అట్టి మల్లె పందిర్లలుటకు ,,కారు మబ్బు లొచ్చినాయి పిల్లవాడ—నాకు దారి జూపు లేచివచ్చి పిల్లవాడా,, అనికోరుకొన్నది. పల్లె పడుచు అల్లుకొను చున్నప్పుడే చిటుకు పొటుకు వానపడుట పన్నీటిజల్లు గురిసినట్లే—అయినను ,,చూడు తడిసి వణుకుతాము పిల్లవాడా—గుడిసెమంచె 1 కెళ్ళదాము పిల్లవాడా,, యన్నది.

,,నీ చేను గుడిసె మంచె లగ్గోపిల్లా—నా చేను ఒట్టి మంచె లగ్గోపిల్లా
తెప్ప మీద తెప్పవచ్చె ,, —తెప్పతోటి చినుకువచ్చె ,,
అంగట్లో మెున్నగొన్న ,, —కొత్తగొంగడన్న కప్పుకోవె ,,
దగ్గరికి రారాదే ,, —నీవు సిగుపడితె తడుస్తావు ,,
వాన వెలిసి వెన్నెలొచ్చె ,, —మనం తానమాడినట్టులాయె ,,

గుడిసె మంచె ముద్దుగా నుండదని కాబోలు, అట్లు చేనిలో తెప్పలతోడ వచ్చెడు చిటపట చినుకులలో హాయిగా నుండవచ్చునని పడుచువాని కోరిక. తడిసిపోకుండ సిగ్గు పడు గుమ్మను చేరువకు చేదుకొని అంగడిలో దెచ్చుకొన్న క్రొత్తగొంగడి కప్పినాడు. అంతలో వాన వెలిసినది. వెన్నెల పిలిచినది. పన్నీట జలక మాడినట్లయినది. ఆ తబ్బిబ్బులో ,,ఒట్టలన్ని తడిసిపోయె పిల్లవాడా—నేను పట్టుకోక తెచ్చుకుంట పిల్లవాడా,, యనగా, ,,నీవు పట్టుకోక తెచ్చుకుంటె లగ్గో పిల్లా—నేను పట్టంచు దోతిగడత లగ్గోపిల్లా,, యని ,,లగమైన మనసుతోటి లగ్గో పిల్లా—మనం లగ్గమైతె బాగుండు లగ్గోపిల్లా,, యనుచు చినుకు తడియారని బాహు బంధములలో మనసిచ్చిన, చనువిచ్చిన చక్కనిబొమ్మతో మనసు విప్పుకొన్నాడు. చందమామ సాక్షిగా ఆ చేని మీది ఒట్టుగా వానదేవుని వరముగా లగ్గమాడుద మన్నాడు. ,,ఊరు పల్లె విడిచిపెట్టి ఈ ఊరిబైటలగ్గమేంది—బాజా బజంత్రీ లేవి మంచి మోజుమీద సవ్వదేది—కులము కులము కలసినాక పొలముకాడ

1. మంచె మీద గుడిసెవేయ బడినట్టిది.

కొందరేమి,, యన్నదా పడుచు. నిజమే- ఎప్పుడు పొలములో పలుకరింపులు పులకరింపులుండనేయున్నవి కదా! కులము కులము కూడకలిసినది. గాంధర్వ వివాహమైనట్లే యయినను, సంప్రదాయానుకూలముగా ఆచార బద్ధముగా అందరి యెదుట సన్నాయి చప్పుడులతో పరిణయ మాడవచ్చునన్నది ఆ చక్కని వెన్నపూస.

కలిమి గల ఒక ప్రియకాంత ఒక బావిని గుత్తకుగొని సేద్యము సేయుమని తన ప్రియునకు సలహా యిచ్చినది. ,,బావి గడ్డన చేను జెయ్యారో చన్నంగి రామా—బావి నీళ్ళకు నేను వచ్చేనూ,, కాని వాడు పేదవాడు కాబట్టి ఏది చేయబోయినను అనుమానము తప్పదు. ,,బావి గడ్డన చేను జేస్తేనో జాలారి పాపా— చేను గుత్తామీద బడితేనో,, యని శంకింపగా ఆ పడుచు ,,చేను గుత్తామీద బడితేనో చన్నంగి రామా—చెవుల కమ్మాలమ్మి కట్టేనూ,, అనుచు ప్రోత్సహించి వ్యవసాయము పెట్టించుటలో వెనుకాడదు. ఇట్టి చేదోడు వాదోడు గల వనితలు జానపద సమాజములో పెక్కుమంది.

చేని కావలి కాయుచుండ, వలపు కత్తె గడ్డి కోయ వచ్చినచో పైటలో పాటగట్టి ముద్దుల మూటగట్టి, మోపెత్తి మాట మూటకు మలకలేసి పంపును. మిరపతోటలో, గోంగూర తోటలో, వంగ తోటలో, పూలతోటలో చెరకు తోటలో జరుగు సరసములు సరేసరి. రైతులు చాలమట్టుకు రాత్రులందు కూడ చేని పొంతనే నిద్రపుచ్చుకొను చుందురు. పంట యింటికి వచ్చునంతవరకు రేయింబవళ్ళక్కడనే కాలము గడుప వలసియుండును. అందువలన వారి దాంపత్య సుఖము కూడ అచ్చటనే తీర్చుకొనుట యగును. చేలలోని వారి ముద్దు ముచ్చటల విషయములలో పగలు రేయికి భేద ముండదు. అయినను చేని కావలి కాయుటకు వచ్చి సరస సల్లాపములలో మునిగి పోవువారు కారు పల్లీయులు. పురుషుడు విధి నిర్వహణలో అజాగ్రత్త వహించినను స్త్రీ మాత్రము కర్తవ్యమును హెచ్చరించుచునే యుండును.

ఏటి గడ్డా చేని వాడా ఏపకవురూ మంచెవాడా
ఎన్ను మీదా గువ్వ వాలెనురా—బంగారి సామీ
నన్ను మీదా సెయ్యి దీయరా,,*—సర్వాంగ పరిష్వంగ మందు వలపు నిండిన తలపులో ప్రణయమును పంచుకొని ఆనందపుటంచులు దాటు చున్నప్పటికిని భార్య తన ధర్మమును విస్మరింపక కంటిమీది, చంటిమీది అనుభవములు ప్రస్తుతమునకు చాలించి ఆ చేనుమీద వ్రాలిన గువ్వలనదలించి రావలసియున్నదని భర్తకు విధి నిర్వహణలో తోడుపడుట అపురూపమేమికాదు.

## పసుల కాపరులు - జీతగాండ్రు:-

వ్యవసాయమెంత ముఖ్యమో దానికి పసులంత ముఖ్యము. విత్తుటనుండి పంట యెత్తుట వరకు పసుల మీదనే ఆధారపడి యుండుట యగును. పసులకు మారుగా యంత్రములనుపయోగించుట మనదేశములో పది శాతమునకు తక్కువే యనవచ్చును. పాడి, పంట, పసులు ప్రజా జీవనమునకు ప్రధాన పోషకములు. పసుల నెంత చక్కగా కాపాడు కొన్నచో వ్యవసాయ మంత నికరముగా సాగును. అందుచేత వానిని నిత్యము గుట్టల వారన, చెట్ల నీడన, అడవులపొంత నీటి వనరుల చెంత మేపుచు కాపలకాయుచు సాయం సమయమునకు తోడుకొని వచ్చి పొలము పసుల నచటిదొడ్లలోను ఇంటి పసులను ఇండ్ల ముందరను సురక్షితముగా చేర్చుటకై పసుల కాపరులు నియమితులగుదురు. పసుల కాపరులుగా పిల్లలు గాని పెద్దలు గాని యుండవచ్చును. అయినను పిల్లలే యెక్కువగా నియామకమగుట కలదు. వారికి నెల జీతము పెద్దల కన్న చాల తక్కువే. వ్యవసాయరంగమున వారు నాలుగవ తరగతి ఉద్యోగుల వంటి వారనవచ్చును. పసుల వెంట తిరుగగల ఉత్సాహ మా పిల్లలకున్నంత పెద్దల కుండదు. పసులొక్కచోట నిలువకుండ ఎప్పుడు తిరుగుచు మేయుచుండును. అట్లే వారు కూడ ఒక్కచోట కాళ్లు ముడుచుకొని కూర్చొనలేరు. గుట్ట లెక్కి

తిరుగుట, చెట్టునకు మేసురాచుకొనుట, ఆమడుగు ఈమడుగున పొరలాడుట, ఒక పశువును మించి ఇంకొక పశువు ముందునకు త్రోసికొనిపోవుట, అప్పుడప్పుడు కొమ్ములతో కుమ్ములాడుట రంకెలు వేయుట వంటి పశువుల లక్షణములు పిల్లల చేష్టలకు సరిపోవుచుండును. కాబట్టి పసుల కాపరులుగా పిల్లలే కుదురుట జరుగును. అందుకేనేమో పసుల విషయమునను దృశ్యమానమగు ప్రకృతి విషయమునను వీరి కుండెడు అనుభవములంతగా మిగత వారికి నుండవనిపించును.

పసుల కాపరులంత కలిసి మందలు మందలుగా నుండెడు పసులన్నింటి నొకచోట చేర్చి మేపు చుందురు. మంద యెంత పెద్దదైనను కాయుటకు కాపరి వెనుకాడడు. భూస్వామి ,,ఎల్లబోడెల్ల బోడెడ్లెన్ని గాన్రో—అన్ని గావిన్ని గావు తొమ్మిది నూర్లెడ్లు,, అన్నప్పుడు కాపరి ,,తొమ్మిది నూర్లెడ్లకు జీతమెంతిస్తో పిడికెడు రూపాలు, పిల్లనగొయ్య—దోసెడు రూపాలు దోతుఁజోడు—కుంచెడు రూపాలు కుచ్చుల గొంగడి,, కావలెనని యడుగును. సాధారణముగా ప్రతియేడు వానికి చెప్పులు, గొంగడి, దోవతులజోడు, నెలకు కొంత గ్రాసము కట్టడి చేయుట యొప్పును, ,,అవన్ని గట్టి ఏడేడ మేపుతవ్రా,, యన ,,ఎక్కరాని గుట్ట లన్ని ఎక్కెక్కి మేపుత—దిగరాని గుట్టలన్ని దిగిదిగి మేపుత,, నని వాడు ఒప్పుకొను చుండును. వీరికి గోపాల కృష్ణుడాదర్శము. పిల్లనగ్రోవి కూడ అభీష్టమైనది. వివిధ జానపద ప్రక్రియల ద్వారా వీరికి రామాయణ భారత భాగవతాది కథలు తెలిసి యుండును. గోపాల కృష్ణుని మీద ,,ద్వారా పాలా—గోపాల,, వంటి పల్లవిలో అనేకమైన పాటలు కట్టుకొని పాడుకొందురు. తమకు తామే గోపాల కృష్ణునిగా భావించుకొని ,,బాలుడనై పుట్టి—బాల రాజునై పెరిగి—పాలన్నమార గంటి చేపుతో పన్నెండేండ్లు—బాల కుమారుడనై ఎత్తి గోవుల కాయగా—గోవు కాడికిపోయి గోవులా వర్ణించి—పేరు పేరున పిలువగా గుంటనీరు తాగి—పెంట కసువులు మేసి—అవులేపన ఆవులు—తుంగభద్రాయో తులసి వనమాయె

తుమ్మెదల మోతలాయెరా,, పాడుచు అడుగులు వేయుచు పసుల వెంట తిరుగు చుందురు. ,,మర్లి మర్లి పొడిచెరా మాదిగోని బోడది—వంగబెట్టి తొక్కెరా నింగ రెడ్డి పుల్లది—ఇడిపిచ్చుకొచ్చెరా దశరథికోడె,,. ఇట్లు పసులకు వ్యక్తుల పేర్లు యజమానులపేర్లు కులముపేర్లు పౌరాణిక పురుషుల పేర్లు పెట్టి పిలుచుకొను చుండుట వారి యభిరుచి. పోట్లాటలలో గెలిచిన దానికి భీముడని, ఓడిన దానికి దుశ్శాసనుడని, చెప్పినట్లు వినుచు పోట్లాడకుండ దొంగ మేతలు మేయకుండ నుండెడు దానికి ధర్మరాజని, రాముడని, యింకను ఆయా పసుల చేష్టలను బట్టి ఆయా పేర్లు పెట్టుకొని పిలుచు కొనుచుందురు. ,,ఏటీర లచ్చువన సీత—పర్న సాలాల లేదెందుసేత,, అనుచును ,,ఒరె ఒరె ఒరె ఇరన్నైకసిపుడరా — నిన్ను ఇరుసుక తింటనురా— ఒరె ఒరె ఒరె నరసిమ్మ సామినిరా— నిన్ను నలుసుక తింటనురా,, అనుచును యక్షగాన దరువులలో రామాయణ పరముగనో భాగవతాదుల పరముగనో పాడుకొనుట పరిపాటి. ఎవరేని కొట్టినగాని తిట్టినగాని వారి పేర్ల మీద విచిత్రమైన పదాలల్లుకొనుట తేలికపని. తోడి కాపరులలో నొకనిని హేళన చేయదలచినచో ,,ఔరాదుస్సాసనా నీపీ.....ద్దం తాసనా,, వంటివి అప్పటి కప్పుడే స్ఫురించినట్లనుటలో సందేహించరు. పెక్కు బూతులు వారి కల్పనలో తావుచేసికొన్నప్పటికినీ వాని యర్థ విషయమున వారి కాలోచనలు తట్టవు. అది వారి మనస్తత్త్వము. కంటిలో పడినవారి రంకు తనములు వారి నాలుకల మీద ప్రచార సాహిత్య మగుచుండును.

,,పట్టూ సీరా దెస్తానాని భీమయ్యా—పాటీనెల్లాటీసమాయె దొర భీమయ్యా
పట్టూ సీరా పాడుగాను దొర భీమయ్యా-పసులా పిల్లాల కెరుకాయె దొర
భీమయ్యా,,*

కోడె వయసుగల కాపరులకు వారి ముద్దు గుమ్మలకు నడుమ అనేకమైన రహస్యములు జరుగును. గుట్ట దాపున, గెట్టు దాపున, చెట్టు మాటున, చేనిపాటున వారి పిలుపులు కలకూజితములు. కాని, పరులకవి గోప్యములు. పసుల మేపుచునే యొక పశువును మందలించినట్లు మందలించగా వారి గుమ్మలు గునగున బోయి

కలిసికొందురు. అందుకే ,,పెద్ద చెరువూ గట్లామీద—ఎడ్ల మేపే చిన్నవాడా ఎడ్లకేసే పొలికేకా నాకు యేస్తే సేనూరానా,, యన్నదొక రబ్బరి బొమ్మ. ప్రియునితో లేచి పోదలచినచో వాని కిట్లు చెప్పుచున్నది. ,,మా వొళ్ళేమంటేనూ చుక్క పొద్దుకు నీవు లేవోయీ—చూరుకొమ్మా లూడబీకోయీ—కర్నపోనీ దున్నపోతానీ—యెల్ల గొట్టానేసె వస్తానూ—నువ్వు నేను గూడు కొందాము—ఏరు దాటి యెల్లి పోదాము*,, అని ప్రోత్సహించుటలో వారి కాముకత్వము వెన్నెల విహారము చేయుచున్నది. వారి రహస్యవు చేష్టలెట్టివో తెలియుచున్నవి.

పసుల కాపరులు ప్రొద్దుననే లేచి చద్ది ముల్లెలు చంకబెట్టుకొని దున్నల మీదనో గేదెల మీదనో యమునివలె గూర్చొని మందల నడలించుకొని పోవు నప్పుడు వారి యుత్సాహమును చూడవలెను—ప్రకృతి తమ కనులలో జిక్కినట్లు తలంచి అందలి ప్రతి వస్తువును గూర్చి ఆశు కవిత్వము చెప్పు కొనుచు పోవు చుందురు. చేలమీద వ్రాలిన పిట్టలను కాకులను—వరిమళ్ల లోని కొంగలను మున్నగు వానిని జూచి పదాలు గట్టి పాడుట పరిపాటి. నక్క అగుపించిన దంటె చాలు—నక్కకు ఊల వచ్చినట్లు వారికి వచ్చును. ,,నక్క నీయక్కని...ంగో మొక్క జొన్న పొత్తెక్కడిదే—బాబోనీ కాళ్ళకు దణ్ణం—పంతం వెంకడిచేలోది,, అని కేకలిడుచు బెదరించు నప్పుడానక్క పిరికి గంతుల మీద కంచెలు దాటు చుండ ,,అడ్డం రారాబుడ్డెంకా—అడ్డంరారో బుడ్డోడో,, అనుచు తరిమి చూతురు. ఇట్టి పదాలలో గూడ వారు తమ యనుభవమునే జోడించుకొందురు. ఏచేని కంకుల కినియోవెళ్లి తన్నులు దిన్న సంగతి నక్క మీదనో కుక్క మీదనో అంటగట్టుదురు. ,,కోమటి కొయ్య రొట్టెమీది రొయ్య,, ,,వానొస్తుందో వర దొస్తుందో—చాకలోళ్ళ పిల్లకు చన్నొస్తుందో,, వంటి కొంటె పదాలు పసుల కాపరులకు ఊత పదాలు. మొత్తము మీద పసుల కాపరుల వ్యవహారములలో హాస్యము—అందులో అపహాస్యమధికము. ఇల్లు విడిచి తిరిగి యిల్లు చేరుకొను వరకు వారేవేవియో పాడుకొనుచునే యుండుట గమనించగలము.

అప్పుడప్పుడే మిసమిసలాడెడు చేని కంకులు, చెట్ల మీది ఫలములు వారి ఆకలికి ధర్మ సత్రములు. చేలుబాటు పోయినప్పుడందలి పరిగలేరి అమ్ముకొన బోయినప్పుడు కోమటులు కొలిచెడు దొంగ కొలతలకు వారిని దిట్టి కోలాటము వంటి ఆటలలో నావిషయములను ఎగిరెగిరి గొంతెత్తి పాడుదురు. కోలాట మాడుటలో పసుల కాపరులు చిక్కాలి నైపుణ్యమును ప్రదర్శింతురు. దసరా పండుగ వంటి పండుగల రోజున కోలాటము లెక్కువగా వేయుదురు. కాముని పున్నమ రోజులలో తెలుగు సీమ (తెలంగాణ)లో ఎలుగుబంటు వేషములువేసి ఇల్లిల్లు దిరిగి భిక్ష మడుగు కొందురు. ఇప్పట్టున వారు పాడెడు పదాలలో సామాజిక విమర్శ కన్నులకు గట్టును. వారెంత కొంటెవారో అంత అమాయిక హృదయులు.

,,అరి పిల్లా పాప సల్ల గుండాలి
అరి అవుల్ని గోవుల్ని మేము కాయాలి
కాసి నందుకు కాను కివ్వాలి
పల్లెటూళ్ళు బాగుండాలి—పట్నాల కడుపులు నిండాలి
సిన్న పెద్దలు కలిసి మెలిసుండాలి
ఏ వూరు కావూరెంతో బాగుండాలి,,

ఇంత ఉదారమైన విశ్వ శ్రేయస్సును కోరగలవారెవరు? ఏదో పసుల గాచి నందుకు ఇంచుక కడు పాడితే చాలునట. పల్లెలు పట్నాలు, పిన్నలు పెద్దలు చల్లగ బ్రతుకవలెనట. ఏయూరు కాఊరు ఎంతో బాగుగా నుండవలెనట. ఇంతటి భావన ఈనాడే నాగరకున కుండగలదు? రామ రాజ్యమును ధర్మ రాజ్యమును గాంచిన వారేమో పల్లీయులు. అందుకే విశ్వైకకుటుంబమను భావన వారిలో దప్ప మరెవ్వరిలో గన్పట్టదన్నచో నతిశయోక్తి కాదు. ప్రపంచమందలి వివిధ జాతులలోని జానపదులలో ఏకైక జీవన సూత్రముండుట సహజము.

పసుల కాపరులేగాక, మోటగొట్టుట, దున్నుట, పొలము కావలి కాయుట వంటి సేద్యపు పనులకు తగినంత మంది జీతగాండ్రుందురు. పేదరైతులైనచో ఒకరిద్దరితోనే సరిపెట్టుకొందురు. భూస్వాములైనచో మొత్తము వ్యవసాయ మంత జీతగాండ్ర చేతనే చేయింతురు. సాధారణముగా వ్యవసాయ జీవను లందరు మాధ్యమిక స్థాయి జీవనము గలవారు. కొందరు భూస్వాములు జీత గాండ్రను నిరంకుశముగా జూచుట వలన వారి దైన్యస్థితి యిట్లుండుట యగు చుండును—

,,ఏరన్న రాకముందే ఎరుగాక వొచ్చేవన్న
ఎవరింట్ల నుందువన్న ఓరన్న జీతగాడ
భూమీని దున్నిడోకి పైరూలనెల్లసాకి
సోమరి పోతులాను మేపాలె ఎల్లకాలం
పొద్దున్న సద్దికూడు మద్దాన్నం నీళ్ళకూడు
కమ్మాని కందిపప్పు కినరాదు నేతివొట్టు
పుంటాకు నీ మొఖాన గొప్పోరి జీతగాడ,,* పేద రైతులకు జీతగాండ్రకు మధ్య నుండెడు సామరస్యము పెద్ద భూస్వాముల మధ్య కన్పించదు. వీరు జీతగాండ్రను రేయింబవళ్ళపిరి యాడకుండ పని చేయించుకొందురే గాని వారి పొట్టను జూడరు. ఆస్తి అంతస్తులలోనే పొద్దు గడపుదురు. జీతగాండ్రకు కూడ ఒక బ్రతుకుండునని యాలోచన చేయనేరరు.

## మోట కొట్టుట:-

పల్లపుపంటలునిత్యము నీటిపారుదల మీద ఆధారపడియుండును. చెరువులు, కుంటలు, కాలువలు, బావుల క్రింద వరి మున్నగునవి పండింతురు. తెలుగు దేశములో జొన్న, మొక్కజొన్న, సజ్జ, తమిదలు, ఆముదములు, శనగ, పేరుశనగ, నూనెగింజలు, పప్పు గింజలు మొదలగునవి ముఖ్యమైన

మెట్ట పంటలు. వరి, చెఱకు, కూరగాయలు మొదలగునవి పల్లపు పంటలు. సామాన్య జనులకు జొన్న ముఖ్యమైన ఆహారము. సాగర సీమలో పల్లపు పంటలకు నదులు కాలువలు ఆధారమైనచో, తెలుగుసీమ, రాయలసీమలలో నెక్కువగా బావులాధారమై యున్నవి. బావు లెక్కడనుండునో యచ్చట మోట కొట్టుట యన్నది యుండును. సాగరసీమలోనదిగన్పట్టదు. అందుకే తెలుగుసీమ, రాయలసీమలలోనే మోట పాటలు వినిపించుచున్నవి. ఈ ప్రాంతములలో వీని సంబంధమున ఒక విలక్షణమైన జీవన విధానము కన్పట్టును. [రాయలసీమలో మోటకొట్టుటను కపిలె తోలుట అందురు,] గాథాసప్తశతి గాథలవలె మోట పాటలు గూడ ముక్తకములు. ప్రజా జీవన ప్రయుక్తములు. శృంగార రస స్ఫోరకములు.

,,సుక్కా పొడిసే జారెడెక్కే—సూతామన్నా కానారాడూ
పాపా జాతిర మూలాసుక్కా—సోర దుద్దెగా
పక్కా భామల పాయేదీసే—,,* మోట కొట్టు వారు నిత్యము రాత్రి మూడవ జామున మూల చుక్క పొడిసేవేళ సగము నిద్దురకే నోచుకొని, పడక మీద ప్రక్కనున్న తమ తమ పడతులను విడువలేక విడిచి, కనులు పులుము కొనుచు ములుకోలలంది బావుల పద్దకు వెళ్లి మోట కొట్టుచు ఆ నిద్దర మబ్బులో ఎలుగెత్తి రెండు మూడు క్రోసుల వరకు వినిపించునట్లు పాడు చున్నప్పుడు వినవలె— పల్లెలకవి సుప్రభాతములాయన్నట్లొప్పు చుండును. తెల్లవారు జామున ప్రకృతి మారు మ్రోగు చుండును. కాలి బాటన నడచే బాటసారుల కవి తోడునీడలు. దొంగలకు బెదరు జాడలు.

రాతిరి ప్రొద్దుపోయిన దనుక యుండి పొలము నుండి యింటికి వచ్చిన పిమ్మట జాము నిద్దుర మాత్రములో ముచ్చటలు తీరకపోవుట వలన నేమో కొందరు తమ ప్రియ కాంతలను బావుల చెంతకు పిలుచుకొని బావి గడ్డ వెనుకనో, తోట మూలననో సందుచూసికొనుట (గమనించి) చుక్కలు చంద్రుని చెఱజిక్కినట్లుండును.

,,మోటా కంటా నీవేపోతే—మొత్తూకుంటూ ఎట్లా పందూ

మోటా కాడర సందూలేదూ_సోర దుడ్డెగా
తోటా మూలకు తొలగాదియరా,,*

భర్తలు తమ భార్యలను విడిచి పోవుటయే గాక, తాము పాడే పాటలు ఆ ప్రియ భామినులకు కల కూజితములై చెవుల గింగురులెత్తవారు నిద్దుర పోలేరు. కనుకనే తమ పురుషుల జేరబోవుట జరుగును.

,,కాటికే కన్నూలాసూసీ_కూటికేడా వాసీనవురా
నిలువూ సక్కాదనమూ సూసీ_సోర దుడ్డెగా
నిదురాకేమో సొకూ్కతవురా,,*

యువకు (సోర దుడ్డెలు) లైనవారు మోటమీద మోహంపు నిదురలు తీయుట, బహుశః వారు వలపు గత్తెల వలల జిక్కిన యనుభూతులకు చొక్కుట కారణమై యుండును. నిలువు చక్కదనములో చొక్కెడు వారికి మోట ఆటంకము గాక మరియొకటగునా! కోరి వచ్చిన కోమలి కొంగందు కొనుటకు రాగమెత్తి చక్కగా పాడవలెనట,

,,..... ... ... ... ... ... ...
రాగీ మానుర సిలకావాలే_సిన్నా విలగో
రాగా మెత్తీర బాగా పాడూ,,*
,,నిన్నూ జూడక నిలువాలేనూ_నీళ్లారేవున జొన్నా బెట్టూ
జొన్నా మీదా దేగా నిడువూ-దేగా పిలుపుల నన్నూ బిలువూ,,*

అనెడు ప్రేయసి యొక్క కోరిక ప్రియుడే వ్యక్తీకరించుట యగును.

,,మోటాకేమో మొగిలీ దండో_ఎద్దూలకురా కుచ్చుల దండా
మోటా గొట్టే మోగా వానికి_సోర దుడ్డెగా
ఎడుమా సేతికి ఎంకీ కడెమూ,,*

ప్రియురాండ్రు మోటకు మొగలిదండ, ఎద్దులకు కుచ్చులదండ, మోట కొట్టెడు ప్రియుల చేతికి వెండి కడియము లర్పించు కొనుట వారి శృంగార జీవితమునకు దాపుడు కట్నములు. తొలికానుకలు.

,,వొగలా వొగలా రుమాలు గట్కా—మొగిలీ పూలా తురాయి పెట్కా
వాడా వాడల నీవే వొస్తే—సోర దుడ్డెగా
వాసానలకే మోసాపోతీ,,*

సోకుగా రుమాలు గట్టి వగలొలుక బోయుచు వాడ వాడలు తిరుగ నేర్చిన వానిని వలచినచో—ఆ వాడు మోట కొట్ట బోయినచో ముద్దుల గుమ్మ ముచ్చటకు మోసమగును.

,,తిరుపాతమ్మా గట్లా నడుమా—తీగే మెర్పుల జానాపండో
ఆకాటికీ తిన్నా పండూ—సోర దుడ్డెగా
ఏ కాటమ్యే దెరుగానై తీ,,*

వయసు పొంగున వన్నె కానిని వలచి వనగూడగా గర్భము వచ్చుట ఎరుగని జానపదముగ్ధలు మల్లె మొగ్గలు.

,,యిశనాగిరీ నిమ్మాపండూ చేతబడితే చెమ్మాగించూ
మామా గారీ కన్నే పడుచూ గుబ్బా బడితే బెబ్బారించూ,,

అనుభవ శృంగారమును జెప్పు కొనుటలో ఎగ్గు సిగ్గులు పడరు పల్లీయులు. అరమరికలు లేని తద్రహస్యములను బట్ట బయలు చేయుట పరిపాటి. అసలు మోటతోలెడు వారి జీవితము శృంగారమయము. వాచ్యలక్ష్యవ్యంగ్యాత్మక భావ పూరితహృదయులు వారు. ప్రతి మోటపాట నిత్య జీవితములోని ఒక శృంగారపు మూట. కావున వారు స్వవిషయములనే గాక—

,,లంజకు లజగిరి కొప్పు మిండగానికి పుట్టెడప్పు

అప్పులోడూ అడుగవస్తే కొప్పుగోసీ సేతికిచ్చే,, వంటి వ్యభిచారుల వృత్తాంతములను,

,,యాళ్ళ పొద్దూ మీరిపాయే బువ్వగంపా రాకపాయే
కపిలెదోలె చిన్నవానికి కాళ్ళు సేతూ లెంటరావూ,,

అనెడు తమ కూటి తిప్పల విషయమును ,,కోలారు కొత్తకోట, కోపయినా బెంగుళూరూ–రానిపోనీ రంగంపేటా కోటి గూసే కొత్తకోటా,, వంటి వివిధ ప్రాంతముల యనుభవములను, ,,బాయిబాయి గంగమ్మ తల్లీ–బళ్ళారి దుర్గమ్మ తల్లీ–బాయి గడ్డన బాలులమ్మా బాగుగా కాపాడుమమ్మా,, అనుచు దేవతల సంస్మరణను మరియు మున్నగు సంఘటనలను గూర్చి కూడ పాడుచు శ్రమ మరచి పనిచేయుట నిత్య వ్యవహారమైనది. ,,తాగేదేమో త్రైదా గంజీ–కొట్టేదేమో కోలామోటా–,, మోట కొట్టుట చిన్నపని కాదు. గంజి మాత్రమే త్రాగి ప్రొద్దుగానక నిద్దుర గానక మోటమీదనే క్రుగ్గిపోవుట జరుగుచుండును వారికి.

మోటకు మారుగా సాగరసీమలో చిన్నపాటి సేద్యము సాగించుటకు గల బావినుండి నీటిని ఏతము ద్వారా తోడుదురు. దానికి ఎద్దుల సహాయ మక్కర యుండదు. మనిషియే త్రొక్కును. ఆ విషయములో ఆతనికి కొంత ప్రమాదము కూడ లేకపోలేదు. కృషీవలులు తమతో సహా అందరు చల్లగ బ్రతుకవలెనని ఆశింతురు. ఏతము త్రొక్కుచు ,,ఏతాము తోడరా తమ్ముడా–నీ చేతైన సాయ మదే తమ్ముడా–ఏతాము తోడి మెరకసేలన్ని తడపాలి–గూళ్ళునొప్పనకుండ గూనలు లాగాలి బేగి–సేలన్ని తడిసి మరి మూనలు బాగెదగాలి–కట్టతెగిపోకుండ కట్టండి గట్లన్ని–బద్దెపై సిన్నోడ భద్రముగా నడవాలి–పట్టు తప్పితె పళ్ళు పలపల రాల్తాయి గాని–ఏతమెక్కినవాడు–ఏరు కట్టినవాడు–ఏ'పేట పంటలతో యెలగాలి పదినాళ్ళు,, అని పాడుదురు. ఏతము త్రొక్కుట అంత సులభమైన

పనియేమికాదు. త్రొక్కువారికి కొంత విసుగు జనించినను, ,,కోతల వరకే ఏతాము-ఊపిలెదాలు ఏతాము,, అని సరిపుచ్చుకొనుచుందురు. ఏతము మోటవలె కాదు. బావి కొక్కటి చొప్పున ఉండును. మోటలైనచో ఒక్కొక్క బావికి పది వరకు కూడ ఉండును. ఐదారుగురు కలిసి మోటకొట్టెడు వారి యుత్సాహమే వేరు. ఇవిగాక కాలువల నుండిగాని, మడువలనుండి గాని నీరు తోడుటకు ,,గూడ,, నుపయోగింతురు. అది వెదురు బద్దలచేత గుండ్రముగా చేయబడును. దాని యడుగు భాగము తోలుచేత అంట గుట్టబడి యుండును. రెండు కొనలకు త్రాళ్ళు గట్టి ఇరువైపుల నిద్దరు పట్టుకొని నీటిని మళ్లలోనికి గుప్పుదురు. దీని వలనను చిన్నపాటి సేద్యమే చేయుటకు వీలుపడును.

,,పాతాళ గంగ మాయమ్మ తల్లీ—చెంగు చెంగున పైకి పొంగి రావమ్మా
పంట కాలువలనుంచి పయనించి పయనించి పంట భూముల కలయ
ప్రవహించవమ్మా—,,

అని పాడుచు ,,గూడ,, వేయుదురు. ఇట్లు మోట, ఏతము, గూడలచేత నీరు తోడి మళ్లకు పారించగా, మళ్లలో నీళ్లు కట్టెడువారు కట్టలు వేయుచుందురు.

,,కన్న తల్లి కానుగసెట్టు—ఎర్రి తల్లి ఏపసెట్టు
నీడలేని వాడ గన్నేరు బంగారు సెట్టు—రంగురంగుల సీమ రేగుల్లు
నీలి పాప నేరేడు సెట్టు—జోలె యిప్పె మఱ్ఱి సెట్టు
తాళిగట్టె తాటి సెట్టు—ఏలపాడె ఎఱ్ఱి గన్నేరు,,

నీరు గట్టి వరిమళ్లు దున్నిన పిదప దాని యందు కానుగాకు, వేపాకు, గన్నేరాకు, నేరెడాకు, మఱ్ఱియాకు వంటి వివిధములైన ఆకులు కుప్పలు కుప్పలుగా దెచ్చి మురుగవేసి ఎరువుగా చేయుదురు. అటు తర్వాత మళ్లను మరింత మెత్తగాదున్ని, గొఱ్ఱు దోలి విత్తనములుకుట జరుగుచుండును. ఎరువు నింపు నప్పుడు, పారడోకు నప్పుడు, త్రవ్వునప్పుడు శ్రమనివారణకు ఉచ్ఛ్వాస నిశ్వాసముల కనుగుణమైన లయలతో పాడుకొనుచు పనులు చేయుదురు. జీవితానుభవములను తిరుగ దోడుటకు పల్లియుల పనిపాటలు చేపురికొర్దులు.

## చేని కలుపులు:-

పళ్లలో వరి మొలక చల్లిన పిమ్మట ఇరువది ముప్పది దినములకు వానిని పీకి అందుండిన బీడు మొక్కలను తీసివేయుటను కలుపుతీయుట అందురు. వరి మొక్కలను కలిపి నాటుటను కలుపు నాటుట, కలుపు వేయుట అందురు. మిరప, బెండ, టమాట వంటి కూరగాయల తోటలలో ననవసరముగా మొలిచెడు బీడు మొక్కలను దీసివేయుటను గూడ కలుపు దీయుట అందురు. సాధారణముగా వరి నాటుటనే కలుపు లనుట జరుగుచున్నది.

,,యెగజామున లెగి ఏమి పనులు చేసి
ఎంటరాయె ఎల్లి యింటి ముంగటికి
సూర్యాడు పొడిసేను సుక్కల్లు పోయేను
కళ్ళాపుసల్లేటి ఏళ్ళాయెరాయే
అంబాలి కాయాలె అంటండు కోవాలె
మంచి నీళ్ల బాయికాడ కడవాలు తేవాలె
పొలాల గట్టుకాడ పోచవ్వకు మొక్కి
నాటు బెట్ట దిగుదాము నాంచారిరాయే
చేలోకి పోవాలె చింగులూ చెక్కి
కలుపులు తీయాలె కామాచ్చిరాయే
నడినెత్తి మీదికినాపొద్దు అచ్చేను
సద్దిని తిందాము సమ్మక్కరాయే
మాపాటి ఏళాయే గుడిసెకు పోదాము
కూడండ ఏళాయె కూనమ్మరాయే
ఇంటికాడి పనులన్ని ఎప్పుడు సేయాలె
పొద్దు గూకింది పోదామురాయే

వరి నాటెడు కూలినాలి జనులు (స్త్రీలు) వేకువనే నిద్ర నుండిలేచి సూర్యుడు పొడుచు లోపున ఇండ్ల ముంగిట సాన్పు (కలయంపి) జల్లి అంబళ్లు కాసికొని, త్రాగి కొంత చద్ది గట్టుకొని పొలమునకు బోయి గట్టునున్న పోచమ్మకు మ్రొక్కి, చింగులు (చుంగులు) పైకి జెక్కి నడుము చుట్టు కొంగు జుట్టివైచు కొని వరిమళ్ల లోనికి దిగి వరుసగా వంగబడి పదాలు పాడుచు వరి నాటుదురు. వ్యవసాయపు పనులు సామూహిక శక్తి మీద ఆధారపడుచుండిన కారణమున తత్సంబంధమైన పదాలు సామూహిక ముద్రవైచుకొని బృంద గానములుగ వెలయు చున్నవి. ఒకరు పాట చెప్పుచుండగ తక్కినవారందుకొని పాటలో పనిలో మునిగిపోవు చుందురు. కలిసి కట్టుగ చేయుపని పాటలలో అలసట యగుపించదు.

„ఇడదీసి వరిమొక్క లెడమెడముగా పాతండీ
బాదనక బందనక పాటు పడినామంటే
మారాజు పనిసూసి మనకీనామిస్తాడు
ఆవూరి మారాజు ఐదాణాలిస్తేను
ఈ వూరి మారాజు ముప్పావలిస్తాడు„

వరి మొక్కలను విడదీసి ఇంచుక దూరము దూరము నాటుచు చకచక పని చేసి చూపినచో యజమానులు మెచ్చుకొని వారికి కూలియే కాకుండ „ఇనాము„ (బహుమానము)లు కూడ ఇచ్చెదరు. చుట్టుప్రక్కల సమీపమందున్న పల్లెలకుపోయి కూడ కూలినాలి జనము కలుపునాటి వచ్చుచుందురు. పొట్టచేత బట్టుకొని తిరిగిననే గాని గడవదు. ఏయూర నెక్కువ కూలి యిచ్చెదరో గమనించుకొని పోవుచుందురు. కొన్ని ప్రాంతములందు పైసలను, మరికొన్ని ప్రాంతములందు గింజలను కూలిగా ఇచ్చెదరు. ప్రొద్దు పడమట దిరిగినప్పుడు మళ్లనుండి బయటికి వచ్చి చద్ది తినుటకు కూలి వారికి రవంత విశ్రాంతి చిక్కుచుండును. చంటి పిలలు గలవారు ఇండకుబోయి చను గుడిపి వత్తురు. ఇండ్లకు

పోలేని వారు చంటి పిల్లల నక్కడికే తెచ్చుకొని చెట్ల నీడన ఉంచుకొందురు. పొద్దు గ్రుంకినదనుక పనిచేసి కూలి కొంగుల బట్టుకొని తిరిగి యిండ్లకు పోదురు. అయినను వరి నాటుట యన్నది శ్రమతో కూడినపని. కాబట్టి శ్రమ నివారణకు రకరకములైన పాటలు పాడుకొనుట యొప్పును. వానిని కలుపు పాట లందురు.

ప్రతి ఊరిలోని కూలినాలి జనులలో మాల మాదిగలే (హరిజనులు) యెక్కువ. తొండములు, చెరణ కోలలు, ఎద్దుల మెడకు తోలు పట్టెడలు (బ్యారణ్లు) చెప్పులు మున్నగునవి చేసి యిచ్చుట, కళ్లములు, అలికి పూయుట వంటి పనులు మాదిగలు చేయుట కలదు. అనగా వారికి, కర్షకులైన కాపులకు సంబంధము లధికముగా గన్పించును. కాపుకులము వారిని పటేండ్లు, రెడ్లు అని పిలుతురు. గ్రామాధిపత్యము వహించు చుండిన కారణమున వీరికి రెడ్డి, పటేలు చౌదరి అను పేర్లు వచ్చినవని చెప్పుదురు. వ్యవసాయ జీవనములో మాదిగలకు నితర కులపు కూలినాలి వారికి, కాపులకు మధ్య జరిగిన శృంగార విషయములు గూడ గలవు. ఈ క్రింది కలుపు పాటలలో నిట్టివి చూడవచ్చును.

రామిరెడ్డి యను పటేలొకడు సెన్నమ్మ యను బోయ వనితను పిలిపించుకొని కళ్లములో పనిచెప్పినాడు. ఆమె తీగ బోడియట. ,,సెన్ని అంటె సెన్నిగాదు రామతుమ్మియలో—తీగ మెర్పుల బోయె సెన్ని రామతుమ్మియలో,,. అందుకే ఆమెపై రామిరెడ్డి కన్ను బెట్టినాడు. సెన్నమ్మ కళ్లములో కుప్ప నూర్చి రాశిపోసి చంటి బిడ్డకు పాలు కుడుప నింటికి బోయి వచ్చెదినన్నది. కాని యతడు పోనీయలేదు. అప్పుడామె, ,,సన్నవిల్ల తల్లినయా రామ తుమ్మియలో సంటి సేపులొచ్చెనయా రామ తుమ్మియలో—,,అని చెప్పుకొన్నది. అతడేమో, ,,వొద్దొద్దు ఓసెన్ని రామ తుమ్మియలో వొలబుద్ధి ఇనవమ్మా రాము తుమ్మియలో,, అని తన బుద్ధిలోని రహస్యమును వెలిబుచ్చి ,,మూడుమోట్ల బాయి యిస్తా రామ తుమ్మియలో—వొస్తావా బోయె సెన్ని రామ తుమ్మియలో,, అన్నాడు. ఆమె

వినక— ,,వొద్దన్నా పోతాసు రామ తుమ్మియలో—మూడు మోట్ల బాయి వ్రాల్లా రామ తుమ్మియలో,, అన్నది. అప్పుడాతడు పది మోట్ల బాయి యిచ్చెద నన్నాడు. అప్పటికిని వినకపోగా రామిరెడ్డిలో రాక్షసత్వము శిపమెత్తినది. పదును కత్తిని బట్టి ,,పట్టాలని ఆ సెన్నిని రామ తుమ్మియలో—పాడేసి కొట్టిండు రామ తుమ్మియలో—నిలపెట్టి సెన్నిని రామ తుమ్మియలో—నిలువూన కోసిండు రామ తుమ్మియలో,,*. ఇంత చేసినను అడిగెడు వారు లేక పోయినారు. ఒక్కొక్క పల్లెలో నొక్కొక్క రెడ్డి మాటకు తిరుగుండదు. కాబట్టే యిట్టివి అప్పుడప్పుడు సంభవించుచుండును.

మాదిగ సెన్నమ్మకు సాయిరెడ్డి పటేలుకు మధ్యన సన్నివేశ మిటులనే సాగినది. సెన్నమ్మ భర్త ఎల్లడు (ఎల్లయ్య) కలువకుర్తికి వెట్టిపని మీద పోయినది కనిపెట్టి సాయిరెడ్డి, ,,సెన్నమ్మా సెన్నమ్మా యెన్నెలాలో మాదిగోల్ల సెన్నమ్మా యెన్నెలాలో—దొడ్లల్ల పెండాలా యెన్నెలాలో—తీయాలే సెన్నమ్మ యెన్నెలాలో,, అని పిలిచినాడు. ఆరోజు తనవంతు గాదన్నది సెన్నమ్మ. ,,సెట్టెదురా రావమ్మ యెన్నెలాలో,, అని తిరిగి చెప్పినాడు. తన మీద సాయిరెడ్డికి గల మర్మము తెలిసికొని-,,నువుసూస్తె సాటేలవు యెన్నెలాలో నేను-సూస్తె మాదిగదాన్ని యెన్నెలాలో,, యన్నదామె. సాయిరెడ్డి మాత్రము పట్టు పట్టినాడు. గట్టిగా ఈరోజే చెట్టెదుర రమ్మన్నాడు. ఇక పటేలుకెదురు మాటాడ గుండెలు చాలక దేవుడే దిక్కనుకొని బిడ్డకు ఏరాలుకు సెప్పి సెట్టెదుర పోయి పని చేయుచుండ సాయిరెడ్డి కామార్తుడై ,,నీ మీనా మనుసందా—మను సంతా పొందిందీ—కురుసాకొంగులు పట్టి కూసుండావెట్టిండు— బారీ కొంగులు పట్టి—మరి గుంజానె గుంజిండు,,. ఆమెకు పట్టరాని కోపము వచ్చింది. ఏమిసేయగలదు? ,,ఎట్టిపోయిన ఎల్లాడూ—వొస్తే నూ పాటేల—కత్తి కొగాతునుకా కండిస డు పాటెలా,,* అని బెదరించినది. పటేలుకు మరింత కోపము వచ్చినది.

చెలచెల చెట్ల సందున కామె నీడ్చుకొని పోవుచుండ పాపము! మధ్యనే ప్రాణము లెగిరిపోయినవి. ఆరెడ్డి కోపము చల్లారినది. ఇల్లు సేరుకొన్నాడు. ఆ లోపున అదే త్రోవన ఎల్లయ్య వచ్చుచు భార్య శవమును జూచి నివ్వెర పోయినాడు కన్నీరు మున్నీరుగ నేడ్చినాడు. అంతకంటె నేమి సేయగలడు? శవమును భూమి గర్భమున దాచి యిల్లుచేరినాడు. ఇట్టి వ్యవహారములో పేదవానికి సొంత బ్రతు కన్నది కన్పట్టదు. ఇదే విధమైన మరొక సంఘటనలో మాదిగ నారమ్మను చెరపిన పాపయ్య పటేలును మాత్రము ఆమె భర్త పోశయ్య చిత్రవధ చేయుట జరిగినది. ఇట్టివేగాక ఉభయులకు మనసు కుదిరిన సంబంధములు గూడ గన్పట్టు చుండును. కాపు వనిత చంద్రమ్మ మాదిగ వెంకయ్యను వలచిన విషయము వెంకయ్య చంద్రమ్మ పాటలో గలదు. వారి కథ తెలుగునాట సుపరిచితము. ఈ విధముగా కలుపు పాటలలో నిట్టి సంఘటనలే గాక వివిధ విషయములు గూడ సంఘటించుచుండును. చేను బాగుగ పండవలెనని చిన్న పెద్ద బ్రతుకవలెనని ఆశించు చుండుట సామాన్యము.

## చేని కోతలు:-

పంటకు వచ్చిన జొన్న వరి మొదలగు చేలను కోయుటలో స్త్రీ పురుషులు కలిసి పనిచేయుదురు. వ్యవసాయపు పనులన్ని సమష్టి బాధ్యత మీద ఆధారపడి యుండును. ప్రతి కూలి వానికి కొడవలి యొక ముఖ్య సాధనము. చేను కోతలకు వారందరు కొడవళ్లు పుచ్చుకొని పోవుచుందురు. వారిమధ్య చక్కని సాంఘీభావ ముండును. కూలికి పోవునప్పుడు పరస్పర మొకరి నొకరు పిలుచుకొనిపోవుట సామాన్యము. పోవునప్పుడా ముచ్చట లీ ముచ్చటలాడుకొనుట యలవాటు. అందరొక వరుసన చేను కోయుటలో మునుము బట్టి—

కోత కొయ్యండమ్మలాలా సేలు కోరు కున్నామమ్మలాలా

ఆరు మూడు కాలమైన అసరుక మరికొసరు లేదు
సోడిసేలు యెన్ను వేసి సోలెడు గింజలైతే
పాలికాపు బత్తాలకు పనికొచ్చును కొయ్యండి
దసరా బోగాలంటే ఆసరా తీరుస్తాయి
పసరాని కసవుంటె భాగ్యాలె పండ్తాయి
సాలొచ్చిన మహరాజు సెయి ములగా యిస్తాడు

కాసుసేత పడితేను గగన మందేను సేను,, అని పాడుచు కార్యోత్సాహమున బడిపోవుదురు. పంటలు బాగుగా పండవలెనని పశువులకు తగిన మేతలుండవలెనని కోరుకొనుట అది వారికి గూడ క్షేమదాయకమే. అవి యన్ని సమృద్ధియై మహారాజులకు సంపదలు చేకూరినచో కూలివారికి చేయి ముసుగ తిండి చేకూరును. కాలమయినచో మొదట సుఖపడువారు భూస్వాములు, ధనికులు. కాని ఆకాలమే వెనుకకైనచో కఱవునకు మొదట కూలినాలి పేదలు మాత్రమే గురియయ్యెదరు. కనుకనే కాలమునకు స్వాగతము పలుకువారు వీరే. మంగళము పట్టువారు కూడ వీరే. వరిచేలు కోయునప్పుడు గూడ కూలివారంత వరుసదీర్చి ఆకొననుండి ఈ కొనదనుక రాగమందుకొని—

,,కొయ్యండల్లా కొయ్యండీ కోసి బఱుపు లెయ్యండీ
వానల వరదల మునిగిన సేను వెన్నులు ఈనిన వన్నెల సేను
తిన్నగదీసి మొదలుకోసీ పనలన్నీనీ పంజెట్టావా

గింజలు, బందలు పడిపోకుండ,, పాడుచు పండి తలవంచిన చేలను చక్కగ పాయదీసి గింజలు రాలకుండ కోసి వరుసగా మెదలువేయుచు ,,కాలం సూత్తే సీతాకాలం-కొడవలిపాటు జాగ్రత్తర్రో,, అని హెచ్చరించుకొనుచు ,,కాలూ సెయ్యీ ఆడితేనే-కుండలో కూడు కనిపిస్తాది,, అనుచు నొకరి మేలొకరోర్చుచు, రెక్కాడనిదే డొక్కాడదని నమ్మికొని చకచక పనిచేయుచుండెడు స్వయంసేవకులువారు. కోసిన తర్వాత పంటను కళ్లమునకు చేర్చుట యొప్పను.

చేను పంటకు వచ్చినప్పుడు కొడవలితో కోయు పద్ధతి వేదకాలమున గూడ ఉండినది 1.

కోతలకు వచ్చేడు కోడె వయసు వారి సంబంధములు పరికింపదగినవి. వారు బావ మరదండ్ర వరుసలుండియో వరుసలు బెట్టుకొనియో సరసములాడు కొనుచు పోవుట అపొక ముచ్చట. బావ ,,కూలికొత్తావంటె పిల్లా మరీ,, అన్నాడు. కూలికి పోవుట మరదలికి మరింత ఉత్సాహమే. ఇంటిలో పెద్దల క్రింద అణగి మణగి యుండుట వలన నిట్టి వారికి కూలికి పోయినప్పుడే స్వేచ్ఛ లభించును. అందుకే ,,కూలంటే కులాసఅయ్యోమాకు,, అన్నది. ,,కోతకొత్తా వంటె పిల్లా మరి,, అన్నప్పుడు ,,కోతంటే కోలాటం అయ్యోమాకు,, అని ,,ఉల్లి మల్లా చీరగట్టి, కచ్చెలూ పైకెగాగట్టి,, ఉన్నవారిపిల్లనని కులికింది. బావ తక్కువ వాడా! కన్నుగీటి రమ్మన్నాడు. అప్పుడది ,,కంటి బాసలు నాకు వద్దురా,, అన్నది. ఇంత సోకుగా కూలికి పోయినచో చేనివారికి కోపము వచ్చు నన్నాడు బావ. కాని ఆ పిల్ల వినలేదు. ముద్దుగా సిద్ధమయి బావ వెంట బయలు దేరి ఓరచూపులతో చేయి చేయి కలుపుకొని చేలుకోయ దొడగినప్పుడు వారికి ఆయాసమనిపించదు. అయినను ,,తలమీది కొచ్చాడు తండ్రి సూరీడు–కోసికోసి ఇలలోన జనులెల్ల యిసిగ్గి పోనారు,,. ఆ మరదలు బావ వంక చూసినది. అతని ,,మొకమ్మెల్ల కప్పింది ముత్యాల సెమటా–ఒడలెల్ల పసివాడి కందిపోనాడీ,,. దాని మనసు చిన్నవోయినది. అందులో వాని మోము బంగారు మోము! ,,కొడవలి మొలసుంచి కోత సాలించి–రావోయి బేబేగ రంగన్న బావా,, యని పిలుచుకొని కొంచెము సేపు నీడ పట్టున అలసట తీర్చుకొన బోయినది.

---

1. యు నక్త సీరా వి యుగా తనోత కృతే యోనౌ వపతేహ బీజం
విరాజః శ్నుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్ సృణ్యః పక్వమాయవన్
—యజుర్వేదము:- 12-6

వయసు మ్రగ్గిన ముదుసలి వాడొకడు వయసు పిల్లను మనుమరాలిగ జేసికొని చేను గోయపిలిచినాడు. చిఱెడు చిఱెడు ముత్యాలు, సోలెడు సోలెడు రతనాలు, కుంచెడు కుంచెడు పగడాలు ఇచ్చెదనన్నను ,,కుంచెడు కుంచెడు పగడాలొల్ల—కుసుమ పువ్వు దండ లొల్ల—తాతనీది జొన్నచేను వాడిపోనియ్యోయ్,, అనుచు నప్పుడప్పుడే పండిన ,,వచ్చ జొన్న రొట్టెలిస్తే—వచ్చిసజ్జ రొట్టెలిస్తే కప్పుకునే కంబళిస్తే—కొయ్య వచ్చేనోయ్,, అని కోరినది మనుమరాలు. తాత మనుమరాలి వడుచు కోరికలు విని, అవియే గాక అదనముగా ,,కాపుగాచే మగణ్ణిస్తా,, రమ్మన్నాడు. ఇట్లెన్నియో సరసములైన సన్నివేశ సందర్భములు వ్యవసాయ జీవనములో పెరగాలి తరంగములు.

పల్లీయులు గడ్డి కోయునప్పుడు గూడ ,,కడుపూ సల్లని తల్లి గడ్డి మా తల్లి పిడికిటికి రావమ్మ కొడవలికి రావే—గడ్డి కూడే తింటు గడ్డిలోనే వుంటూ—గడ్డిలో పాన మొదిలి కైలాసం సూత్తాము,, అని పాడెడు పదములో వారి జీవనపథమే గాక పరమపదము గూడ విడమరచి చెప్పబడినది. అనల్పమైన వేదాంతమును అలతి యలతి పలుకులలో బలుకుట వారి వైలక్షణ్యము. గడ్డికోయుట, మోపులు కట్టి యెత్తుకొనుట, ఆపడి ఈమడి దాటుట వంటి సన్నివేశములలోని సరస సల్లాపములు పచ్చని గడ్డికే తీయని వెచ్చదనము సోకి నట్లుండును. ప్రతి పనిలో పాటలో ప్రకృతి పులకించి పోవుచుండగా వారికిక దైవమనుకూలించక పోవు టెట్లు?

కళ్లము:-

కళ్లము వ్యవసాయ జీవన ప్రతిఫలముల బట్టెడు పళ్లెము. ,,ఉత్తరా వచ్చెరా ఎత్తరా గంపా—కారుమేఘా లాకాశమునిండే,,. జొన్న సజ్జ వంటి చేలు ఏరిపోయుట ఉత్తర కారెలోనే జరుగును. ఆకాశమున కారు మొయిళ్లు

క్రమ్ముకొని వచ్చును గాబట్టి ఉత్తర జూచి చేలేరి కళ్లమునకు చేర వేయుదురు. తర్వాత చొప్పకోసి గూళ్లు వేయుదురు. వ్యవసాయపు పనులు చేయుచు పాడెడు పాటలలో తత్ సంబంధ ఋతు ధర్మములు పేర్కొ_న బడుట సామాన్యము. జొన్న కంకులు, వరి కంకులు మున్నగు వాని పంటలు కళ్లములో కుప్పవై చి గింజలు రాల్పుదురు. గింజలు రాల్ప బోవుటకు ముందొకడు చేత కొంచెము పంట (ధాన్యము)ను బట్టుకొని (కొన్ని ప్రాంతములలో కుప్ప కొట్టి గింజలు రాల్పిన తర్వాతనే పొలి దిరుగుటాచారము). కుప్పచుట్టు వెనుకకు తిరిగి చూడకుండ మూడుచుట్లు గాని అయిదు చుట్లు గాని తిరుగుచు-,,పోలిగోలిగా 1 పొలిగోలిగా_పొలిగ పొలిగ పొలిగ పొలిగో,, అందురు. దానిని పొలిదిరుగు టందురు. అట్లు దిరిగిన వానిని ప్రత్యేకముగా జూచెదరు. ,,పొలి దిరిగినోడికి పొంగు బూరెల్లు,, పెట్టెదరు. పొలితిరిగి తొలికట్ట కొట్టగా మిగిలిన దంత ఒకరి వెంబడి యొకరు కట్టలు కొట్టుచును లేదా మరికొన్ని ప్రాంతములలోవలె రాల్పిన ధాన్యమును తూర్పార బట్టుచును_

ఒలియొ ఒలియొ ఒలియో ఒలియాలే
రావేలు గలవాడ రార పొలిగాడా 2
రావేలు మీవయ్య రాశి మీదయ్యా
పొలిగాడే గొట్టంగ పోయరారాశీ
వచ్చెరా పొలిగాడు వాయువేగానా

దాగెరా పొలిగాడు దండ కట్టుల్ల 3, అనుచు లాభకరమైన పంటలను సమృద్ధిగా నిచ్చెడు (దేవుడైన) పొలి గానిని సంస్మరించు చుందురు. కళ్లములోని

---

1. పొలిగలుగని; పొలి అనగా లాభము, పంటవృద్ధి
2. గుణవాచక శబ్దమైన ,,పొలి,, నామవచక శబ్దము (పొలిగాడు)గా మారినది.
3. తూర్పారబట్టినప్పుడేర్పడు ధాన్యపుచార; తూర్పార బట్టునప్పుడు ప్రోగగు గట్ట గింజల రాశినుండి చేతి (దండ)తో వేరుచేయబడు తాలు ధాన్యము.

రాశిపోతలకు, కుప్ప నూర్పులకు సతడే బలము. కోటివేలుగలవాడట. తొలికట్ట క్రింద, దండ కట్టుల క్రింద పొలిగాడు దాగుకొని లాభము పలుకుచుండువాడు. కళ్లమునందు ధాన్యమును రాల్చి తూర్పార బట్టి శుభ్రముచేసి అన్న సమృద్ధిని ఆశించుట 1 యను విషయము వైదికయుగము నుండియు పల్లీయులలో పై రీతిగా పోషింపబడుచునేయున్నది. ప్రతి కార్యమునకు ముందు దేవుని దలచుట పల్లీయుల యొక్క నిష్కల్మషమైన నిండు భక్తియది! వారికెంత లాభము సమకూరినచో నంత తన్మయత్వములో తరించిపోవుచు, నిండు భక్తిని దైవమునే ముందు ప్రార్థించుచుందురు. రాశి ఎదిగెదిగి పోవుచుండ—

„వా యెక్కి పొలిగాడు వాలలాడంగా
కుప్పెక్కి పొలిగాడు కూకాపేయంగా
మఱ్రెక్కి పొలిగాడు మాటలాడంగా
జువ్వెక్కి పొలిగాడు జూదమాడంగా

రాసెక్కి పొలిగాడు రంపటిల్లంగా„ పొలిగాడు ప్రోగుచేసి పొరలాడినట్లు కన్పించగలదు. వారి ప్రతి యానందానుభూతికి అధిదైవమే ఆదర్శము. కళ్లములో నింకొక ప్రక్కన కోడెలను, ఎద్దులను. దున్నలను, పెయ్యలను బంతులు గట్టి కంకులను గొట్టిన కట్టలను ద్రొక్కించుచు „కోడెలూ తొక్కంగా కొల్లలై రాశీ—ఎద్దులూ తొక్కంగ ఎదిగెరారాశీ—దున్నలూ తొక్కంగా దిన్నలై రాశీ—పెయ్యలూ తొక్కంగ పెరిగెరారాశీ„ యనుచు మురిసిపోవుదురు. అట్లు పెరిగిన కొండయెత్తు రాశిని గాంచియును రైతులు దైవమును మరచిపోలేరు. „శ్రీశైల పర్వతము శిఖతేలెరాశి—తిరుపతీ గట్టులాదివ్యమైరాశీ—కాలహస్తిలాగు కళలూరెరాశీ—కోటప్పకొండలా గొప్పదైరాశీ—మంగళగిరిలాగ పొంగెరారాశీ వేదాద్రి గట్టులా వెలిగెరారాశీ—దుర్గగట్టు లాగ తోచెరా రాశీ—సింహాద్రి గట్టు లా

1. ఉపోహశ్చ సమూహశ్చ క్షత్తారో తే ప్రజాపతే, తా విహా వహతాం స్ఫాతిం బహుం భూమాన మక్షితం—అథర్వ వేదము:—3-24-7.

చెన్నొండెరాశీ,, అని పాడుచు రాశిని శ్రీశైల పర్వత శిఖరమునకును, తిరుపతి కొండకును, కాళహస్తి దేవాలయమున జీవముట్టపడెడు కళలకును, కోటప్ప కొండ, మంగళగిరి, వేదాద్రిగట్టు, దుర్గగట్టు, సింహాద్రి గట్టు లకును పోల్చుకొని వానివాని దివ్యత్వమును రాశిలో దర్శించుట వారి యపురూప మనస్తత్త్వము. ,,పోలో పొలిపొలిపొలి–తిరుపతెంకన్నిచ్చినపొలి–విను కొండెంకన్నిచ్చినపొలి పోవేలుగా చాల పొలి,, యని తమకు గలిగిన ఆ కలిమిని భగవత్ప్రసాదముగనే భావించుకొందురు. కట్టలు గొట్టునప్పుడు విఘ్నేశ్వరుని గూడ దలచుచుందురు. ,,దండాము బెట్టరాదండి విఘ్నేశు–కొట్టరా పడికట్ట కొట్టరోరన్న–ముక్కాలు సెల్లించి మమ్మేలు తండ్రి–దండాలు బొజ్జయ్య మమ్మేలు దేవ–రాశిపైనుండి రావయ్య నీవు–రావయ్య విఘ్నేశ రావయ్య నీవు–ముడుపూలు సెల్లించి మొక్కేము నీకు–రాశిపైనుంచే రావయ్య నీవు,, అని పాడుచు విఘ్నేశ్వర ప్రాముఖ్యమును మరువజాలరు. పౌరాణిక గాథలు వారిలో జీర్ణమైపోయి నిత్య జీవితమందడుగడుగున ప్రతిబింబితమగుచుండును. ఇంతేగాక, ,,పొలి పొలోపొలో,, యనుచు ,,సరస్వతీ నినుదలవాక సాగవూ పనులూ–గణపతీ దలవాక గడవావు పనులూ, ఊళ్ళో వినాయకా ఉండాళ్ళ భోగి–పొలములో వినాయకా–పొగునాళ్ల భోగీ–గట్టుమీద వినాయకా–స్వామి విఘ్నేశా–,, యని స్మరించుచు వినాయక పూజసేయుటయును గలదు. అట్టి వినాయకునకు ,,కర్రావు నేతులూ–కరకు బెల్లాలూ–ఖండించిన చెఱుకులూ–గానుగా చిమ్మిలీ–చిప్పతో గంథములు–సిరుసెనగపప్పు – దొప్పతో గంథము దోరాపుసెయ్యీ–అల్లాలు బెల్లాలూ–అమృత పాణీలు–టెంకాయ కొబ్బెరలు తేనరటి పండ్లూ,, ఆరగింపులుగా బెట్టి పూజ సేయుదురు. (ఇది అన్ని ప్రాంతములలో ఈ సందర్భముననే జరుగుట మృగ్యము). ,,పొలిగలిగి సీతమ్మా–పొలిబాడుదామా,, అని సీతమ్మ తల్లికి కూడ పొలిబలుకుదురు.

రైతులు పండించు వరి ధాన్యములనేకవిధములైనవి కలవు. ఈ క్రింది పాటలో కొన్నిరకములైన వడ్లు పేర్కొనబడినవి:–

"పెద్ద వరి ధాన్యాలు కాపోళ్లు తిన్నా-వెలమలూ తిన్నవీ వెల్లరకణాలూ
తెలగలూ తిన్నవీ తెల్ల బాలోరి-మాలోళ్లు తిన్నవీ గవిరి వడ్లాణాలు
మురిగివడ్లాణాలు మాదిగోళ్ళు తిన్నా-సెగిడోళ్ళు తిన్నవిరా శామంచనాలు
వాయిలపాటి సన్నాలు చాకళ్ళు తిన్నా-మంగళ్ళు తిన్నవిరా మల్లిసన్నాలు
దూది భోగములన్నీ దూదేకు లోడివి-కాకిమూతి సన్నాలు కమసాళ్ళు తిన్నా
యర్రబాలూ ధాన్యం యాతోళ్ళు తిన్నా-కాయిరి ధాన్యాలు కాజోళ్ళుతిన్నా
బలరామ భోగాలు బ్రాహ్మర్లుతిన్నా- రక్తసరిధాన్యాలు రాచోళ్ళు తిన్నా
సుఖాసులు తిన్న వి రాసన్ననూదుల్రా-బంగారు తీగలు బైరాగులుతిన్నా
బోద్దనాధాన్యాలు బట్లోళ్లు తిన్నా-దిళవాధాన్యాలు జాలర్లుతిన్నా
సత్తికపుధాన్యాలు సాలోళ్ళు తిన్నా-గుత్తు బాసికాలుకుమ్మరోళ్ళు తిన్నా
బుడుబుడకలోల్లు తిన్నవిరా బుడమ ధాన్యాలు-మడిలోను పండినవి
మడిరాసికాలూ

చెరువులో పండినవీ చేమంచనాలు-గుంటలోను పండినవీ గుత్తు బాసికాలూ
అచ్చికలు బుచ్చికలు యెల్లంకణాలు_మాచేని కాటికలు మల్లీసన్నాలూ
అమ్మవారు తిన్నవిరా అమృత పాణీలు,,_ఇన్నిరకములైన ధాన్యములు
పండినచో కళ్లము కళకల లాడదా! (వడ్లలో రెడ్లలో తెగలు కోకొల్లలు).
ఇంతకన్న నెక్కువ రకములు హంస వింశతి లో పేర్కొనబడినవి. 1

కళ్లమున ధాన్యములను త్రొక్కించుటకు "రాగిపల్లా పోతులలంకి-పెద్ద కర్రి పోతులలంకి_సెత్తిచుక్కా పోతులలంకి రామలక్ష్మణ ఎడ్లూలంకి,, దున్నలను ఎద్దులను జతచేసి లంకెవేసి బంతిత్రిప్పుదురు. కొట్టిన ధాన్యములను బంతి త్రిప్పిన ధాన్యములను నూర్చి యెత్తుగ కాడి మాకులతో మెట్టు గట్టి దానిమీద నిలబడి చేటలతో నందించగా "తూర్పారబట్టరీ తుమ్మల క్రింద జల్లెండ్లు పట్టరీ జిల్లేండ్ల క్రింద,, గాలికి తేలిపోయి "సుంకేమొ వాయెరా రాసూరుజేర,, అనగా

1. హంస వింశతి_ఆ_4 పద్య. 128

సుంకు, తాలు దూరముగాపోయి పడును. గట్టి గింజలన్ని ఒక్కచోట రాశిగా పేరుకొనును. కళ్లమందలి యిట్టి పనులలో కూలినాలి వారేగాక రైతుల యొక్క కుటుంబములోని వారందరు పాల్గొని పనిచేయుట జరుగును. కూలి జనులంత ,,పాడి పంటలు సల్లగుండాల—కూలి రైతుల కడుపు నిండాల—మాకామందులూ సల్లగుండాల,, అని కోరుకొనుట, చిట్టిపొట్టి తట్టు కథలు కూడ చెప్పుకొనుట సామాన్యము. ముప్పై మూర్ల పాగజుట్టి—ముద్దెరపల్క చేతబట్టి—ముట్టి ముట్టి ముద్దెరలేతువో పాపేల—ముప్పైయారు రాసుల మీదనో—అంది అంది ముద్దెర వేతువో,, ప్రోగైన రాసులను సమమట్టముగా సరిచేయుచు రైతులు లేదా పాలేండ్లు ముద్దెరపలకతో వానిమీద ముద్దెరలు వేయుదురు. రాసులపై ముద్రలు వేయువాడు తలపాగ తప్పనిసరిగా కట్టుకొనవలసి యుండును. ముద్దెర పలకను చెక్కతో చేయించి దానిమీద శ్రీకారమును చెక్కింతురు.

దాని గుర్తులు రాసులమీద పడగలవు. కొందరు కళ్లము ప్రక్కనున్న దాలి నుండి బూడిదను తెచ్చి రాసులమీద శ్రీకారములను వ్రాసెదరు. రాసుల మీద గింజలను దోచుకొనిపోకుండుటకై యట్టి ముద్రలు భద్రములుగా పని చేయును. అంతేగాక యవి భగవద్రక్షకములుగా భావింపబడుచున్నవి. ముద్రలు వైచిన పిమ్మటనే కొలిచి బండ్ల కెత్తించెదరు. జొన్న సజ్జ మొదలగు మెట్ట పంటలు సంక్రాంతివరకిల్లు చేరుకొనును. వరియైనచో ముక్కారు పంట కనుక ఆయాకాలములలో నిల్లు చేరును. ధాన్యమును బండ్ల మీదికెత్తుటకు ముందే యొకవంక బుడుబుడుకలవారు, గంగిరెద్దులవారు, శారదకాండ్రు, పిచ్చుక గుంట్లు వంటి బిచ్చగాండ్రు వచ్చి అర్థించుచుండ కర్షకులు వారికి రాసులనుండి తీసి దానము చేయుచుందురు. వచ్చిన యాచకావళికి పండిన పంటనుండి దానము చేయనిచో పాశక మత్స్యఘాతీ వ్యాధ శాకునికులవలె కర్షకుడు సమానమైన పాపము గలవాడే యని పరాశర స్మృతి చెప్పుచున్నది 1. అట్లు కళ్లములోని

1. ,,పాశకో మత్స్య ఘాతీచ వ్యాధఃశాకునికస్తథా - అదాతా కర్షకశ్చైవ సర్వేతే సమభాగినః,,—పరాశరస్మృతి—ఆచారకాండము—ద్వి. అధ్యా. శ్లో. 9

ధాన్యమును దానరూపమున ధర్మము చేయుటను ఖలయజ్ఞమందురు. ఖలమనగా కళ్లము; కళ్లము తెర్చుట.

„వృక్షాన్ ఛిత్వా మహీంభిత్వా హత్వాతు క్రిమి కీటకాన్
కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే,, 1

(వృక్షములను ఛేదించుట వలనను, మహిని దున్నుటవలనను, దున్నుట యందు క్రిమికీటకములు చంపబడుటవలనను కర్షకుడు తనకు చెందెడు ఈ సర్వ పాపములను ఖలయజ్ఞము చేత హరింప జేసికొనుచున్నాడు). మరొక వంక గుగ్గిళ్లు, కల్లు అమ్మువారక్కడకు వచ్చికళ్లము చెంత నున్న చెట్టు క్రింద కూర్చొనగా రైతులు వారికి గింజలుపోసి వాటిని పుచ్చుకొని కళ్లమున పనిచేసెడు వారందరికి పంచి సంతోష పెట్టుచుందురు. ఈ సందర్భమున కల్లునకు మరగిన ఒకరైతు త్రాగుటకై యెంతకు సాహసించెనో చూడనగును-

„కల్లు దుర్గామొచ్చి గూ గుమ్మడీ—కళ్లములో కూకుండె గూ గుమ్మడీ
చేత పైసాలేదు ,, —ఏంపెట్టి తాగ్రేది ,,
కాడియెద్దులనమ్మి ,, —కల్లు త్రాగయ్యా ,,
... ... ... ,, — .. ... ... ,,
పాడిబర్లానమ్మి ,, —కల్లుత్రాగయ్యా ,,
.... .... .... ,, .... .... .... ,,
తల్లీ దండ్రులనమ్మి ,, —కల్లు తాగ్రయ్యా ,,

తుదకు పెండ్లమునమ్ము వరకు పరిస్థితి యేర్పడినది. కాని అప్పుడు వానికి బుద్ధి వచ్చినది. మగడు చచ్చిన వెనుక ముండ బుద్ధిమంతురాలైనట్లు వీడును

1. పరాశరస్మృతి—ఆచారకాండము—ద్వి. అధ్యా. శ్లో. 10

ఉన్నదంత పాడుచేసికొన్న తదుపరి కల్లు త్రాగుట మానుకొన్నాడు. ,,కల్లు దుర్గా మపుడు గూ గుమ్మడీ—కళ్ల మొదిలీపోయె గూ గుమ్మడీ,,-ఇట్టి రైతులు అరుదుగా గన్పించెదరు.

ముద్రలు వైచిన రాసినుండి రైతులు కళ్లములోనే ఆయా పని పాటల వారికి, దేవతలకు, బ్రాహ్మణులకు ధాన్యము తీసిపేరుగానుంచెదరు. జీతగాండ్రు కోతలప్పుడే దాపుడు కట్టలు తీసియుంచుకొనుట ఆచారము. వారి భార్యలు కళ్లములో చేటముంచుకొనుట జరుగును. ,,గంగికియ్యరా గంపలముంచి—సీతి కియ్యరా సేటలముంచి—రాముడుకీయరా మూడు తూములు — పంతులు పంతుకు పందుసేయరా,,—

పాలికాపు జీతాలు తీసేయ్యరన్నా—బాపలికి భత్యాలు తీసెయ్యరన్నా
గొల్లోళ్ల భత్యాలు తీసెయ్యరన్నా—వెనకపాటోళ్ళకి వీని కట్టియరా
చాకలి మడేలుకీ పందుమియ్యరన్నా-బారిక్కి మంగలికీ పందుమియరన్నా

అమ్మగతికి మానె డిచ్చెయ్యరన్నా,, — పాలి కాపులకు పంతులుకు గొల్లలకు, చాకలి మంగలి మున్నగు వారికీయవలసిన వాటాలు రాసినుండి తీసి యుంచుట యొప్పును. ఇంతేగాక దేవతలకు, బ్రాహ్మణులకు కూడ వాటాలు తీసియుంచుటలో జానపదులెట్లు స్మృత్యుక్త ధర్మము 1 నాచరించుచు వచ్చు చున్నారో తెలియగలదు. పిమ్మట రాశిని కుప్పించి కొలిచి బండ్లకెత్తించుచుండ కళ్లమునూడ్చు స్త్రీలు ,,అయిపోయె గౌరమ్మ అయిపోయెనమ్మ—అపైన గిరిమీద అడిరావమ్మ — మాగింజలయిపోయె మేము పోతాము — మళ్ళొచ్చి నీ పాటలెల్ల పాడేము,, అనుచు ముగింపులో కూడ గౌరమ్మను తలపకుండ నుండలేరు.

---

1. ,,రాజ్ఞేదత్వా తు షడ్భాగం దేవానాం చైకవింశకమ్
త్రింశద్భాగం బ్రాహ్మణానాం కృషిం కుర్వన్న దోషభాక్,,
పరాశర స్మృతి—ఆచారకాండము- ద్వి. అధ్యా. శ్లో. 12

పుణ్యాత్ముల పొలమున రాజనము సౌభాగ్యము పండినదని, పాప కర్ముల పొలములో పదిపుట్ల పల్లేరు పండినదని ఆ మంచి పెద్దలను గుర్తింతురు. ధర్మ మూలమైన మన సమాజ వ్యవస్థకు వ్యవసాయ జీవనము పునాది మెట్టు.

ధాన్యము బండ్ల మీద ఇల్లు చేరుకొన్న పిదప రైతులు గ్రామదేవతల ఉత్సవములు జరుపుచుందురు. ,,పూ కొల్ని అమ్మోరికి చాటించురన్నా-పురటాలు పోలమ్మ ఘటమెత్తించురన్నా- వీధిలో శిడిమాను తిప్పించురన్నా - ఆశిడి తల్లి గుడికి పెళ్ళొస్తున్నా-అసువు కూళ్ళు పెట్టి అనిపెట్టురన్నా,,. నూవుల నూనెతో నూటొక్క దీవియలు పెట్ట తిరుపతి తిమ్మప్ప పూజలు సేయుదురు. అంతేకాదు ప్రతియేడు కళ్ళమున పంట యుండగనే పొలములోనున్న పంటలక్ష్మికి నైవేద్య మిడదలచి బావిగట్టుననున్న పంటలక్ష్మి గుడికి మరియు పొంతనున్న వేప, చింత, మఱ్ఱి మామిడి చెట్ల మ్రానులకు జాజుతో, సున్నముతో పట్టెవర్ధనములిడి దీపధూప నైవేద్యము లర్పించుకొనుట ఆచారమైనది. ఈ సందర్భమున కుటుంబమంత పొలముపద్దకు వచ్చి ఆ రోజు వంటలు చేసికొని కోతలయిన వరి మళ్లలో గూర్చొని ఆనందముగా భుజింతురు. జీతగాండ్రకు వచ్చిన బీదసాదలకు అన్నముపెట్టి తమ సౌభాగ్యమును సార్థకము చేసికొందురు. సంవత్సరమున కొకమారు ఉగాది పండుగనుందు వచ్చెడు వరిపంటలప్పుడు వాకిండ్లకు పచ్చ తోరణములు కట్టి లోళ్ల లోకిండ్లనలంకరించి ముత్తైదువలా క్రొత్త ధాన్యము దంచి, చెరగి ఉడకబెట్టుచు శనగ లేక పెసర పప్పును కొంచెముగా కలిపి గంజి వార్చకుండ అన్నము వండి రోటికి, చల్లగుంజకు, కూరాటికుండకు, ఇలువేల్పునకు నైవేద్యమిడి హారతి పట్టెదరు. ,,అంటకుండ వెండకుండ వంట చెరకు పేరకుండ_అంటుముట్టు లేనిచోట వంట జేయరే-భక్తితోను వంటజేసి పళ్ళెరమున తీసినారు-పద్మజాక్షిని కొలువ పాట పాడరే,, ఇట్లు చేయుటను ,,క్రొత్త పెట్టుట,, యందురు. పంటలింటికి వచ్చిన కాలములో రాత్రులందు భాగవతములు కూడ ఆడించుట గ్రామమంత ఆనందమున మునిగినట్లుండును. ,,తొలిమేళ భాగోతులాడించురన్నా-చుట్టాలు బంధువులకీ చెప్పించురన్నా,,

చుట్టములను పిలిపించుకొని క్రొత్తరుచుల పిండివంటలు వండుకొందురు. ,,పాతళ్ల నిండగా కూతుళ్ల పెళ్లిళ్ళు,, చేయుటకు సంకల్పింతురు.

## రైతుల దైన్యావస్థలు:-

రైతులెంత రెక్కలు చెక్కలు చేసికొని ఆడుచు పాడుచు సేద్యము చేసినప్పటికిని దురవస్థలు తప్పవు. వారికి నుండెడు కష్టనష్టములు మరెవ్వరికి నుండవనియే చెప్పవలెను. నవమాసములు మోసి బిడ్డను కని అల్లారు ముద్దుగా పెంచుచుండగ, ఆ బిడ్డ గతించినచో లేక నిష్ప్రయోజకుడైనచో లేక తలకు మించిన చిక్కులతో సుక్కిరి బిక్కిరైయుండినచో తల్లి కెంత హృదయ వేదన కలుగునో అట్లే అనేకమైన యిబ్బందులకు గురియై విత్తనమునుండి చేయెత్తు చేనుగా పెంచుకొన్న దశలో చేలెండిపోయిన గాని లేక పంటకుఁ చ్చి అతివృష్టి వలన వరదగలిసినగాని లేక పండిన పిదప సాహుకార్ల చేత దొరలచేత ప్రభుత్వము చేత పీడింపబడినగాని రైతులనుభవించెడు బాధలు వర్ణింపనలవికావు.

నేనేమి సేతు నేనెట్లుగాతూ—మొగులు మెత్తనాయె భూమి బురబుర పొంగె
నల్లని రాగట్ల తెల్లజొన్నలేస్తె—మొలసిమొలవక ముందె కోతింత పీకె
కోతి పీకిందాని కోపాన నేనుంటె — ఉరికుఁరికి వచ్చేటి ఉడుతింత పీకె
ఉడుత పీకిందాని ఉరిమురిమి నేనుంటె— వసవస వచ్చేటి పందింత పీకె
పంది పీకిందాని రందితో నేనుంటె — ఆవులేగా వచ్చి ఆయింత మేసే
ఎన్నిల కాలమందు ఏదుల మందవచ్చి—పడమటి భూమిలో పంటంత మేసే
బాకి సాకిసేసి బక్కలను సేగొంటె — బాకి తీరక ముందె బక్కలే తరలే
కరణాలు కాపులు పన్నులడుగ వస్తే—పన్ను గట్టకపోతె పట్టి తన్నేరు
వాసీగ భద్రాద్రి ఈశుణ్ణి నమ్మితే—ఆరువైయారు పుట్ల జొన్నలెల్లునురా

మొగులు మెత్తనయి వర్షింపగా భూమి బురబుర పొంగి అదనుకాగా రైతులు నల్లరేగడి పొలములో తెల్లజొన్నలు వేయగా అవి మొలకెత్తినప్పటి నుండి కోతులు, ఉడుతలు, పందులు, ఏదులు, ఆవులు మున్నగునవి పీకి వేయుటయో విరుగ ద్రొక్కుటయో మేసిపోవుటయో జరుగుచుండును. ఎంత కావలి కాసినను వాని బారినుండి తప్పించుకొనుట కష్టముతో కూడినపని. రేయింబవలు కంట వత్తులు వేసికొని చేనికావల కాయవలసి వచ్చును. వేళకు నిద్రపోవుటగాని ఆహారమును గ్రహించుటగాని పొసగదు. పాపము! పేద రైతులు అప్పులు చేసి అంతమాత్రము బక్కచిక్కిన పశువులను గొని సేద్యము చేయుదురు. చేసిన సేద్యమునకు పశుపక్ష్యాదుల వలన నష్టమే చేకూరుచుండును. అప్పు తీరకమునుపే కొన్నట్టి బక్క పశువులు కూడ చనిపోవుచుండును. దెబ్బ మీద దెబ్బ తగిలినట్లు కరణాలు, కాపులు 1 తమకు చెల్లింపవలసినవి శీఘ్రమే చెల్లించ వలసినదని రైతులను పీడించుటవలన వారికి బ్రతుకు దెరువు తోచకుండ అగును. తుదకు రైతులకు దేవుడే దిక్కగుచున్నాడు. అతని నమ్ముకొని యుండిననే మున్ముందు పుట్లకొలది పంటలు పండగలవని విశ్వసింతురు. ముఖ్యముగా మన దేశములో ప్రతి కార్యము యొక్క ఫలభారము పరమాత్మని అధీనమని తెలిసికొనుట జరుగుచున్నది. గీతోపదేశము కూడ ఇంతే!

మిడుతలు, పురుగులు, తెగుళ్ళు కూడ కృషీవలునికి తీరని నష్టము గావించు చుండును. ,,జొన్న పైరులువేస్తె మొదలేపాయె — సద్దలు వెడితె మొదటనే మిడుతలు దినిపాయె — అందెం సేలు పురుగు తినిపాయె - ఆరుకలేస్తె మల్లెవాడి మట్టుమూసిపాయె,, ఇక ,,బుడ్డలు మస్తుగా పండినయీ,, కాని,, ధరలు తగ్గి దాపబెద్దులమ్ముకున్నాం,,రు. ఎన్ని విధములుగనైన రైతులకే నష్టములు వాటిల్లును ఇంకొక రైతు ఏటి క్రింద వ్యవసాయముచేసి వేయిపుట్లు పండించగ వానికి గంజిగాని గంజిలో నొకమెతుకుగాని దొరకలేదు. మోట వేళకు లేచి ,,పొడిపొడీ తంగెళ్ళ బొక్కెనెత్తుకోని — సుక్క వొడిసిందాని నిక్కి సూడావోయి,,నాడు.

1. ఇట కాపులనగా గ్రామాధికారులైన పటేండ్లు (రెడ్లు)

పాపము! 'నక్కదరువుకొచ్చి బొక్క బోర్లా పడి'నాడు. ,,కొణ్ణెయి కడుక్కొని కట్టమీద కూసుంటే" కాకి తన్నిపోయినది. కాకి పిల్ల తన్నిపోయినది. బహుశః పండించిన పంట అప్పులు తీర్చుటకే చెల్లుబడియైపోయి యుండును. పన్నులు మున్నగువాని విషయములలో నిస్సహాయుడై యుండగ గ్రామకరణము వీపులు బగులగొట్టి పోవుట, అదిగాంచి చులకన జేసికొని కరణమయ్య కొడుకు గూడ తన్ని పోవుట చూడగలము. ,,పోరకు జాల్లేక పొయికాడ కూసుంటె,, చేతగాని వాడనియో లేక ఆలిపిల్లలను బ్రతికించుకొను తెలివి లేని వాడనియో వాని భార్యా పిల్లలుగూడ ఈసడించుకొందురు. పొట్ట కెండబెట్టుదురు. ,,పోకంత పిండిపెట్టి ఆకంత రొట్టెగొట్టి,, ఇవ్వగా వాడు ,, రొట్టె ఉరుసా వొతెరన్నా — రెట్టిరిగి పోయిందర,,ట. కూటికిమాడి నిస్సత్తువ గల వాడైనాడు. బయటగాని, ఇంటగాని పరిస్థితులు చెడిపోయినవి. అంతేగాకుండ శరీర బలముకూడ క్రుగ్గినది. అందుకే ,,నాదేటి బతుకాయెరన్నా — సేనాడే సావక పోతిరబ్బా,, * అనుచు విరక్తుడై కుమిలిపోవుట తటస్థించును. వీడు దైవోపహతుడు.

వ: రొక రైతు ,,ఏటి ఒడ్డునబట్టి సేద్యంచేస్తే—ఈడ్చికొడితే ఇరవై పుట్లు—అర్చికొడితే అరవై పుట్లు ,, పండినవి. పండినవిగదా యని అవి ,, అన్ని కొంచవోయి—అప్పయ్యదొర,, కివ్వగా నతడు వానిని ఊది ఊది యిటు చెరగి అటు చెరగి దొంగ కొలమానముతో కొలుచుకొని ,, ఇసుకో ఇసుకో ఇద్దుమే ఉంచే—మన్నోమైలో మానెడే ఉంచి,,నాడు. ఇట్టి దొరదోపుల వలన ఉప్పులేని గంజియే గతియైనది. అది త్రాగి నిర్వీర్యుడైపోయి చొప్పకట్టెల వలె సోలి కుక్కిమంచములో కూలిపోయినాడు. ఆకలి రోగముచే నట్లు మంచము పట్టగా మంచమునకున్న నల్లికి కూడ సందు దొరకినది. పేదవాడు ప్రతి వానికి లోకు వగుచుండును గదా! కోమటు లెదుటి వారిని ముంచి లాభము లార్జించి కూడ బెట్టెదరే తప్ప ఖర్చు పెట్టజాలరు. కడుపునిండ తినలేరు. వీరి వ్యవహారమెట్టిదో అందరికి తెలియును. సమాజమును గూర్చి పట్టించుకొనరు. పిల్లల వెక్కిరింపుల వరకు కూడ వీరి పిసినారితనము చోటు చేసికొన్నది. కనుకనే పిలలు—

,,కోమటి కోమటి కొత్తబెల్లం కొంటావా! తింటావా!

కొంటే డబ్బుకష్ప—తింటే కడుపునొప్పు,, అని గంతులిడుచు పాడు చుండుట గమనించగలము.

రైతులకు మితిమీరి ఉల్లిగడ్డ పండినది. కాని అమ్మబోతె అడవి కొనబోతె కొఱవి. ధర ఏమాత్రములేదు. రైతు ,,ఉల్లిగడ్డలమ్మా సెడిపోతవమ్మా—ఏకాణ సేరయితె ఎవరొల్లరమ్మా—అర్ధాణకు సేరయితె—అయిపోతవమ్మా,, అని విచారించుటలో వాని దైన్యావస్థ కన్నులయెదుట ప్రత్యక్షమగుచున్నది. పండక పోయినచో ఒక కష్టము—పండినచో మరొక కష్టము. కొనుమని అడుగబోవగ ,,కోమట్లు కొనజాల్లు కోసీరనా—ఇట్ల—తక్కెట్ల తూకాలు వట్టేరనా,,. కోమటులు అక్రమమైన కొలతలు పాటించి రైతును ముంచుచుందుదు. ఉల్లిగడ్డ లమ్మబోగ ,,గంపదించింతాన గుంపులేదనా-మూడుబొట్లకన్న వొల్లలేరనా,,. కొనువారందరు శేరొక్కంటిని ,,అర్ధణకన్న ఏసిపోరనా,,* అని అడుగ మొదలు పెట్టినారు. అంత కష్టించి పండించినచో రైతుల కిట్టి యవస్థ ఏర్పడుచున్నది. సూక్ష్మముగా నాలోచించినచో రైతులకు పండినను కరువే ఎండినను కరువే యనిపించుట దేశభవిష్యత్తునకే గొడ్డలిపెట్టు. వేరుశనగ బాగుగా పండ గలదని విత్తినచో ,,పట్టరాని పురుగేమొ—పుట్టి ఎగ వారినది—పుట్లా లెక్క మునిగినది,,. ,,ఎర్ర ఎర్రా ఎద్దులు—ఎర్రశాము ఎద్దుల — సిన్న సిన్న జీత గాళ్ళ—ముప్పైయారు గాసాగాళ్ళను,, బెట్టుకొని రైతులు చేసిన శ్రమయంత నిష్ఫలమైనది. ఇట్లయినచో ఆ విత్తనమును ముందు కాలమున నెవ్వరు కూడ వేసి పండించుటకు వెనుకాడగలరు. ,,ముందూ కెవ్వరొల్లారే—న్యాలా సెనిగె బుడ్డమ్మా,,*

,,బాయిలో బండబడె బక్కొద్దునేలబడె
సాలించు నరసప్ప చెరుకుతోట
అయ్యొ ఏలేస్తివి నరసప్ప సెరుకుతోట

చుట్టుపట్ల తోటలన్ని సుట్టుకొని పోయినాయి
నరసన్నా తోటలోన నక్కదిన పిచ్చెలేదు
ఏతేస్తీవి నరసన్న సెరుకుతోట
సాలించు నరసన్న సెరుకుతోట
ఎందుకేస్తీవి నరసన్న సెరుకు తోట,,

నరసప్పయను రైతు అందరిని జూచి చక్కగా పండించవలెనని చెఱుకుతోట వేసినాడు. తగిన బావిని త్రవ్వించగా నందులో నీటికి మారుగా పెద్ద బండపడినది. అదిగాక, చిలుకలు, కొంగలు, పందులు, అడవి పందులు, నక్కలు, జింకలు మొదలగునవి తగిలి తోటను పాడుజేయ జొచ్చినవి. అసలు నక్కకుకూడ బుక్కెడంత దొరకలేని స్థితికి వచ్చినదాతోట. కోనసీమ చిత్తూరు సీమలలో చెఱుకు పంట లెక్కువగా పండించుట వలన నిట్టి దురవస్థలచ్చట జూడవచ్చును. కాని గుంటూరు, ఏలూరు, చీరాల, పేరాలవంటి సాగరసీమ ప్రాంతములలో దొరపొగాకు (వర్జీనీయా పొగాకు) బాగుగా పండగలదు. అది సీమదేశమున బుట్టి ఈ దేశము వచ్చినదని మురిసిపోవుచు అచట రైతులు ఈ పంటనే యధికముగా పండించుచు ,,ఎంతజేస్తివే దొర పొగాకు నీవెంతజేస్తివే దొరపొగాక—అమ్మ నిన్ను నమ్మినవారు—ఆస్తిపాస్తులు పెంచేరు..........బీద సాదలనెల్ల ప్రేమతో పోషించి—రైతులను రాజులుగ రాణింపజేసేవు,, అని దానిని అభినందించకుండ నుండలేరు. ఈ పొగాకు పండించుటలో నష్టపోయిన రైతులు కూడ లేకపోలేదు.

,,ఏమిపువ్వాకో రాజబీరాకో
రైలుమీదొస్తుంది రైతుపువ్వాకో
నాల్గువేలుపెట్టి నాగరం కొంటే
నాగరాము తెగనమ్మె ముష్టిపువ్వాకో
మూడువేలుపోసి వుంగరాముకొంటే
ఉంగరాము తెగనమ్మె నల్లపువ్వాకో,,

పొగాకింతపని చేసిన దన్నచో రైతు చేతికి చిప్పవచ్చినట్లే గదా! రైతులే యిట్టి

దుస్థితికి వచ్చినచోనిక వ్యవసాయపు కూలి జనులకు పట్టెడు గతి వేరుగా చెప్ప వలెనా! శ్రమధారపోసి గొప్ప గొప్ప వారు చెప్పినట్లు చేయుచుండగ దొరలు అంతురాల మేడలు కట్టించుకొని సౌఖ్యాలందు చుండగ శ్రమజీవులు ,,ఎండ వేడికి మాడుతున్నా—తిండిలేక ఎండుతున్నా,, ఎవరినేమనజాలరు. వారి గంజి ముంతకు బరువులేదు. ఎన్నాళ్లు పాటుపడినను వారివారి పనిముట్లే వారికి మిగులు చున్నవి. (కరువు వచ్చినచో ముందు చచ్చునది బీదలు, కాలమైనచో ముందు బ్రతుకునది దొరలు) రైతులవలెనే ,,ఎందుకో ఈ జన్మ ఓరన్నా,, అనుచు నిరాశలో గొట్టుమిట్టాడుచుందురు. వ్యవసాయము దెబ్బతిన్నచో దేశమే దిక్కు తోచక పడియుండగలదు. మనదేశము వ్యవసాయదేశము కాబట్టి ఇప్పటికైన తగిన శ్రద్ధ చూపక పోయినచో జాతిక్షేమమునకే భంగము కలుగక తప్పదు.

## ఇతర వృత్తులు:-

బ్రాహ్మణులు పౌరోహిత్యమును, వైశ్యులు (కోమటులు) వ్యాపారమును, కాపు (రెడ్డి) వారు వ్యవసాయమును, కమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి మొదలగువారు వారి వారి కులవృత్తు అను నిర్వహించుచు అందరు కృషీవలులపై నాధారపడి ప్రత్యక్ష సంబంధములు కలిగి జీవించుచుందురు. కులవృత్తులన్ని సాంకేతిక సంస్థలు. బ్రాహ్మణ వైశ్య కులములున్నత కులములుగా గణింపబడు చున్నవి. కాపు కులమువారు సాధారణముగా సామాజికాధిపత్యమును నెఱపు చుందురు. బహుశః ఇది రెడ్డి వంశ రాజులనుండి సంక్రమించియైన నుండ వచ్చును లేదా ఆర్థిక జీవనమునకు వీరివృత్తియే కేంద్రమై యుండుట చేతనైన కావచ్చును. మొత్తముమీద సామాజిక జీవనము మీద వ్యవసాయ ప్రభావము ముఖ్యమైనది. మాలమాదిగలనబడు కులములుమాత్రమధమమైనవిగను అస్పృశ్య మైనవిగను పరిగణింపబడు చున్నవి. ఆర్థిక స్థితిగతులు, అభిరుచులు, అలవాటుల విషయములలో నించుక భేదము కనిపించినను కులములన్ని పరస్పర మాధార

పడి యుండుటచేతనే పల్లె జీవితమాదర్శమైన సామాజిక జీవనపద్ధతి గలదియని చెప్పుకొనదగును.

కులవృత్తులన్ని సంప్రదాయ బద్ధముగా కొనసాగుచుండి నప్పటికిని వ్యవసాయము, వ్యాపారము వంటి వృత్తుల నించు మించుగా నేడందరు చేయు చున్నారు. కాని పౌరోహిత్యము, అగసాలె, కుమ్మరి వృత్తి పనుల నితరులెవ్వరు చేయుటలేదు. చాకలి, మంగలి మరియు కొన్ని చిన్న కులములవారు తమ తమ వృత్తి పనులను చేయుచుండినను గూడ వ్యవసాయ శ్రామికులుగా పని చేయుదురు. ఆర్థిక విధులు కులవ్యవస్థ మీదనే ఆధారపడియుండుట వలన నిరుద్యోగ సమస్య యన్నదే కన్పించదు. కులములో బుట్టిన ప్రతివానికి భవిష్యత్తు నిరాటంకమై యుండును. జీవనోపాధికై వేరొకపని చేయుటగాని వేరొకచోటికిపోయి ప్రాకులాడుటగాని జరుగదు. వాని పూర్వులు చేయుచువచ్చెడు కులవృత్తియే జీవనాధారమగుచుండ భవిష్యత్తును గూర్చిన ఆలోచన వాని కెందుకు పట్టును?

ఆచారాదికములందు బ్రాహ్మణుని కమిత గౌరవము లభించును. ప్రతి కార్యమునకును ముహూర్త నిర్ణయము చేయుటలో నాతని సలహాయే వేదవాక్కు. ప్రతి కుటుంబమునుండి సంప్రదాయముగ చెల్లించవలసిన సంభావన సమర్పించు కొనుట జరుగును. దేవాలయ నిర్వహణమునకీయబడిన మడి మాన్యములు కానుకలు, కట్నములు బ్రాహ్మణులే అనుభవించుచుందురు. దేవాలయములను కేంద్రములుగా జేసికొని జాతికి ధర్మోపదేశము చేయుట పోయి స్వార్థమునకై వానిని తమ సొంత మందిరములుగా భావించుకొనుచున్నారు. ఇట్టివారు నామ మాత్రబ్రాహ్మణులని పరాశరుడెప్పుడో నుడివినాడు. చాకలి, మంగలి, వడ్రంగి కుమ్మరి, కమ్మరివారికి ఫలితమప్పుడే చేకూరదు. ఆయా ఋతువులలో పండెడు పంటమీద కట్టడి ప్రకారము కర్షకులు ధాన్యమిచ్చుచుందురు.

కప్పనూర్చి నాడమ్మ చందమామ
రైతు అప్పులన్ని తీర్చాడమ్మ చందమామ
భూసామి జాకిసాకి చందమామ
సావుకారి సిల్లెరపద్దు చందమామ
పనివాండ్ల బాదరబంది చందమామ
ప్రభువుల పన్నులరంది చందమామ
కష్టించి పైరుల పెంచి చందమామ
పండించి ప్రజలకు పంచి చందమామ
మేలురకం అమ్మతడమ్మ చందమామ
తాలురకం తింటాడమ్మ చందమామ
లోకాన్ని బతికిస్తాడే చందమామ
శోకాన్ని బరిస్తాడే చందమామ
ఎన్న కన్న మెత్తని వాడే చందమామ
నీ కన్న చల్లని వాడే చందమామ*

పంటలు పండగానే పనిపాటల (చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, వడ్రింగి మొ॥) వాటికి, సాహుకారుల చిల్లరఅప్పులకు, ప్రభువులపన్నులకు పంచి మేలురకమే అమ్మకొని తాలురకమే తిని శోకమునేభరించి లోకమునేబ్రతికించెడు రైతుల హృదయము వెన్న కన్న మెత్తన. చంద్రునికన్న చల్లన. వివిధవృత్తి జీవనములకు జీవగఱ్ఱ. దేశమునకు వెన్నెముక. కనుక తాను కరగి వెలుగునిచ్చు క్రొవ్వుపత్తి వంటి వాడు రైతు.

మాల మాదిగ లొకటే యైనను సూక్ష్మభేదములను పాటించుట జరుగు చున్నది. మాదిగలనువారు మాలవారికంటె తక్కువ. ,,నువ్వేడ నేనేడ సెల్లూరి దేశమ్మలో—మాదిగోల్ల పోరడా—మాదిగోల్ల పోరడో—మాలోల్ల పిల్లమీద మను సెట్లా పొందెరో—మాదిగోల్లా పోరడా,, అనుటచేత బంధుత్వ విషయములో

సహితము వారిమధ్య అంతరము కన్పించుచున్నది. అయినను సామాన్యముగా వారంత ఒకటియే. మాలలంటే హీనముగా జూచుట తగదని ఋజువు చేయు నీ పాటను గమనింతము—

,,మాల మాల జపమాల—శివునికి శివకంఠమాల
సూర్యచంద్రుల చేతుల జపమాల
అఖిలాండకోటి బ్రహ్మాండ విష్ణుల జగముల జపమాల
ఆకాశానా లోకగంగకూ నక్షత్రం నమాలా
నాగలోకాన నాగేంద్రుని వారి గోపురానమాల
దండి దండి పండితుల మెడలో ఉన్నది ఉన్వాలా
జోలె జంగము మెడలో ఉన్నది రుద్రాక్షమాలా
పన్నెండు బిరుదులు విత్తినాడు యమధర్మరాజుమాలా
మాల మాల జపమాల... ... ... ...,, మాలలు మాలలేయనుచు

చాటెడు పవిత్రత గోచరింపకపోదు. నిజముగా నీ పేరు పూజ్యార్హమైనది. మాలలను చండాలురుగా, నీచులుగా జూచుట పాడిగాదు. వీరు బ్రాహ్మణులతో రక్తసంబంధముగలవారే 1. ఆర్థికముగా వెనుకబడి జ్ఞానమునకు దూరమగుట వలన వీరిట్లు పరిణమించిరే గాని ఆ జన్మాంతము నిక్కముగా చీకటిలో కలిసి పోవలసినదికాదు. ఆర్థికముగా మెరుగు పడిన వారిని స్పృశించుట నేడు జరుగు చున్నది. ఇంత యేల, జ్ఞానము పొందిన వాల్మీకి వ్యాసాదులు మొదట అధమ కులజులే గదా! అనగా గుణకర్మ విభాగమును బట్టియే అంతర మేర్పడిన విషయము మరచి నేడు కులమును బిగ్గరగా బట్టుకొని జీవించుట జరుగుచున్నది. ,,కృణ్వంతో విశ్వమార్యమ్,, (విశ్వము నార్యమయము చేయుడు) అను వేద నినాదమును విస్మరించుటవలన, నాటి సమానత్వమును 2 న్యూనత్వముగ

1. అమరకోశము:— ద్వి. కాం. శూద్రవర్గము—సూ. 4
2. యేసమానాః సమనసో జీవా జీవేషు మకాః
తేషాం శ్రీర్మయి కల్పతామస్మిల్లోకే శతం సమాః,,—యజుర్వేదము: 19-46

నెంచుటవలన బ్రాహ్మణులనబడువారు అగ్రాధికులుగా మారుటవలన కులభేదములు ప్రౌఢ్యముగా ముదిరిపోయినవి. మన సామాజిక వ్యవస్థను మానవ శరీరమునకు పోల్చుట జరుగుచున్నది. శిరమును బ్రాహ్మణునిగా కాళ్లను శూద్రునిగా చెప్పుకొనుట జరిగినప్పుడు వీనికిని మొత్తము శరీరమునకు నెంతటి యవినాభావ సంబంధమున్నదో వేరుగా చెప్పవలెనా! శిరమెంత ముఖ్యమో కాళ్లును అంతే. అటులనే సమాజములో బ్రాహ్మణులును శూద్రులును ముఖ్యులే. కాని శూద్రులను నీచులుగా జూచుట జరుగుచున్నది. ఈనాడు పైదిక మర్యాద కొరవడి సామాజిక వ్యవస్థ చీలికలు పేలికలై అస్తవ్యస్తమై పోవుచున్నది. గతమును నెమరువేయనిదే వర్తమానమునకును భవిష్యత్తునకును గతియుండదు.

,,తోలు తెచ్చినా అప్పులు వోసిన—బండకిందేసినా
బేగం బాజున తగురంబోసిన—చెప్పులు కుట్టినా
తయ్యారు చేసినా,,* మాదిగలనబడువారు చెప్పులు కుట్టుటయే గాక తొండములు మున్నగునవి చేసి బ్రతుకుదురు. దానిని తోళ్ల పరిశ్రమ యనవచ్చును. పొలములోని కళ్లములను అలికి శుభ్రపరచుచుందురు. అందరి వాకిండ్లూడ్చుట కూడ వారి పనియే. వెట్టిచాకిరికి కూడ ఉపయోగపడుచుందురు. వివాహ సమయములలో డప్పు కొమ్ములను వాయించుట మరణించినప్పుడు పాడెకట్టుట, కాటియందు కాష్ఠము పేర్చుట బొందత్రవ్వుట వంటి పనులు కూడ వీరే చేయుదురు. నిత్యజీవితములో వీరు వ్యవసాయ శ్రామిక జీవులు. చాకలివారు చవుడ సున్నములతో బట్టలను నానబెట్టి ఉతుకుదురు. ,,సవుడు సున్నంబెట్టి సవుసంగ నానబెట్టి బండకేసినాది—బంకంత వదులంగా—నాది బాగొట్టయ్యో ఓ సాకలయ్యా,,—మూటెడు మూటెడు బట్టలను మూపున మోసికొనిపోవుట వారి కలవాటు. బండమీద ఉతుకుచున్నప్పుడు చూడవలె వారి దరువు బరువును దింపినట్లుండును. చాకలి మంగలి కుమ్మరి కులములవారికి వివాహము మరణము వంటి కర్మకాండలలోను నిర్దిష్టమైన విధులుండును. సంక్రాంతి, ఉగాది

ముఖ్యముగా గ్రామదేవతోత్సవములలో కుమ్మరి వారికి ప్రత్యేకత కలదు. ఆ సందర్భములలో క్రొత్త కుండలు ప్రత్యేకముగానిత్తురు, కుమ్మరి—

,,నల్లగుంటలో మన్ను నాలుగు తట్టలుతెచ్చి
ఎఱ్రగుంటలో మన్ను ఏడు తట్టలు దెచ్చి
నల్లగుంటలో నీళ్ళు నాల్గు కుండలు తెచ్చి
ఎర్రి గుంటలో నీళ్ళు ఏడు కుండలు తెచ్చి
ఆ మన్ను ఈ మన్ను కలరాశిబోసి
పిసికెనే కుమ్మరి బీర పువ్వోలే,,*

ఇట్లు చక్కగా పిసికి సారెమీద పెట్టి త్రిప్పి కుండలుచేసి, ,,పెట్టినే ఆవమ్మ పుట్టపూదార—తీసెనే ఆవమ్మ సంక్రాంతికి,, కాల్చి తీసిన కుండలను గ్రామములో నిచ్చుటయేగాక చేరువనున్న గ్రామములకు బండ్లమీద గొంపోయి అందించెదరు. అట్లేయవచ్చిన కుమ్మరిని గాంచి యొక కోడలు ,,అత్తరో ఓయత్త కుండ లొచ్చినవత్తా,, అని యడిగి వరహాలో పగడాలో పెట్టబోగా కుమ్మరి తీసి కొనలేదు. కాని ,,పదియేండ్లనాటి పచ్చ వడ తవుడు-మూడేండ్లనాటి ముక్క పడ తవుడు-ముంచి మూడుదోసిళ్ళు పెట్టగా-మురుసుకుంటు కుమ్మరి మూడుకొంగులు పట్టె-నవ్వుకుంటు కుమ్మరి నాల్గు కొంగులు పట్టె,, అనగా రూకలకన్న ధాన్యమునకే వారు ప్రాధాన్యమిత్తురు. పల్లెలలో ధాన్యమే వస్తుమార్పునకు వర్తించుచుండును.

తెలగ కులమనువారు ఆయా కాలములలో పండే పండ్లను, దుంపలను, కాయలను, ఆకుకూరలను అమ్ముకొని జీవింతురు. చేపలను కూడ అమ్ముదురు. ,,వట్టపగులు వానకురిసె—పలుగురాళ్ళు సెరువునిండె—బుడ్డ పరుక లేదురక్కే—తెలుగు పిల్లలు మెరుగువెట్టే,,* అది చెరువుకుంట లున్న ప్రాంతములలోని వ్యవహారము. వీరు కూలినాలి కూడ చేసికొందురు. గౌడ, గావుండ్ల, ఈడిగ అనబడు కులము వారిది కల్లమ్ముకొను వృత్తి. ,,అందగాడు మాగౌడువచ్చె-కల్లు

కావడి భుజానపెట్టుక,,—. ,,ఎంకిపోతున్నాది ఎంకడు పోతున్నాడు ఎంకిమీది కల్లు ఎగురుతు పోతున్నాది—గుర్రము పోతున్నాది—గునుకడు పోతున్నాడు గుర్రము మీది కల్లు గుసుసుతు పోతున్నాది,,.* ,,అంగులొట్టి—పొంగులొట్టి సేతూలొకసేరు లొట్టి—ధారావడ పంపమ్మో—గొండ్లోల్లంతమ్మా,,.* ,,కల్లు కల్తిజేసినవు—బండికయిన పోసినవు,, ఇట్టి పదాలన్ని ఈడిగ కులము వారిని గూర్చి తెలుపుచున్నవి. కల్లు కడవలు భుజము మీద మోసుకొని గాని కావడి కట్టుకొనిగాని గుఱ్ఱము మీద మోయించుచు గాని బండిమీద తిత్తులలో పోసి చేరవేయుచు గాని కల్లమ్ముకొనుట యగును. కల్లమ్ము వారిలో స్త్రీలే యెక్కువ. కావడిగట్టి అమ్ముపద్ధతి సాగరసీమలో చూడగలము. గొల్ల, సాలె, దర్జీ, కటిక, ఎరుకలి, వడ్డెర, బెస్త మున్నగు చిన్న కులములవారు కూడ వారి వారి వృత్తి పనులు చేయుచు జీవించుచుండుట సామాన్యము. కాని వృత్తులు లేని కూలి నాలి జనము దినదినము పెరిగిపోవుట గమనార్హము. రోడ్డు పనులకు ఆనకట్టపనులకు నేడధికముగా ఉపయోగపడుచున్నారు.

జానపద సమాజములో పెద్ద కులములవారి మాటయే చెల్లుబడియైనను సమష్టి జీవన విధానము నెలకొని యుండును. తత్సంబంధములు పట్టణ వాసుల కన్న ప్రత్యేకమైనవి. పట్టణవాసులవలె మితిమీరిన పోటీలు గూడ పల్లీయులలో గన్పట్టవు. వీరికి కనీసావసరములు తీరినచో చాలు. చక్కని జీవిత దృక్పథము గలవారని తలంపవచ్చును. పల్లెలను ధాన్యాగారములుగా పోల్చుకొనవచ్చును. ప్రతి కుటుంబమున కన్ని కుటుంబములును ప్రతి కులమున కన్ని కులములును ఆదరణీయములు. ప్రేమాస్పదములు. (నేటి నాగరకత ముదిరిన కొలది ఇది కొంత లోపించుచున్నది.) కులము పట్టింపులున్నప్పటికిని శృంగార (కాముకత్వ) విషయములో అవి పటాపంచలగుచున్నవి. ఒక ఏటిలో బ్రాహ్మణుడు స్నాన మాడుచుండగ ఒక మాదిగ వనిత కట్టెలకని వచ్చినది. వారి మధ్య మనసు కలిసినది. గుడిసెకు తోలుకొనిపోయి ఏదో మాంసము వండి ,,చిప్ప

సియ్యాలు—దొప్పతోటి కల్లు,, తినిపించి త్రాగించి, ,,అప్పాలు తిన్ననోటికి ఎట్లా ఉన్నదయ్యా,, అని యడుగగా నా బ్రాహ్మణుడు—

,,మంచీగ వున్నాది మరి తెడ్డెడు వేయవే
బాజార్ల కెళ్లిపోతే బ్రాహ్మడా అని పిలువవే
అకిట్లనుంచి వెళ్లిపోతే అయ్యవారని పిలువవే
సావిట్లనుంచి వెళ్లిపోతే చౌదరని పిలువవే

మనఇంటికి వచ్చినంక మాదిగోడనవే,, యని విన్నవించుకొని దానితో కామసంబంధములు నెరపుటయైనది. కాముకత్వమునకు వావి వరుసలుగాని కుల మతములు గాని ఆటంకములుకానేరవు. మన పురాణములలో నిట్టి సంబంధములు నెరపిన కథలును గలవు. ఒకనితో లేచిపోవుట వంటి విషయములు చిన్నకులము లనబడు వానిలోనే యధికముగా జూచెదము.

,,ఎవ్వడవుర మాకెలవుడె తొవ్వ కడ్డము వచ్చినావు
కాళ్లమొక్త గులాపోన్ని టప్పామోసెటోన్ని
ఎవ్వడవుర జోరుకెలవుడె తొవ్వకడ్డము వచ్చినావు
కాళ్ళమొక్త గులాపోన్ని ఊరు తిరిగె చాకలోన్ని
ఎవ్వడవుర మాకెలవుడె తొవ్వకడ్డము వచ్చినావు
కాళ్ళమొక్త గులాపోన్ని కుండలుజేసె కుమ్మరోన్ని
ఎవ్వడవుర జోరుకెలవుడె తొవ్వకడ్డము వచ్చినావు
కాళ్ళమొక్త గులాపోన్ని సౌరంజేసె మంగలోన్ని
ఎవ్వడవుర మాకెలవుడె తొవ్వకడ్డము వచ్చినావు
కాళ్ళమొక్త గులాపోన్ని ఆటలాడె దొమ్మరోన్ని,,

నైజాము పరిపాలననాటి గ్రామీణ సామాజిక వ్యవస్థకు పైపాట అద్దము పట్టినది. స్వాతంత్ర్యము రాకపూర్వము పోలీసుపటేలు, మాలీపటేలు, పట్వారి

అనువారే గ్రామాధికారులు. వారి నిరంకుశత్వమునకు ప్రతివాడు తలయొగ్గి అణగి మణగి యుండవలసినదే వారి కెదురుగా కంటపడినను కూడ కష్టమే. తిట్టి అదరింతురు. ఇప్పటికిని గూడ కొన్ని పల్లెలలో పటేలు పట్వారీలే గాక భూస్వాములైనవారు కూడ చిన్నకులములను బెదరించుకొని అధికారమును, అహంకారమును ప్రదర్శించుట వింతయేమికాదు. చాకలి, మంగలి, కుమ్మరి, దొమ్మరి, టపామోయు ఉద్యోగి మున్నగువారు అధికారులముందు వంగి ఎంగి దండములిడుచు సాగిపోవలసి వచ్చును. పెద్ద తగవులైనచో గ్రామాధికారుల చెంతకు పోవునే గాని సామాన్యముగా ఆయా కులములలోని తగవులు కులము పెద్దల సమక్షమున తీర్చబడుచుండును. ,,కూకట్లపల్లికాడ కులమెల్లు చాలమంది—కల్లందుజాలదత్తో ఓ యత్త జంగిలమ్మో,,. కులములోని తగవు తీర్పులకు తగవులాడిన వారు తీర్పరులుగావచ్చిన కులమువారందరికి చాలినంత కల్లుపోయించ వలసియుండును. ఒకడు తన కుమార్తెను మగతనములేని వానికిచ్చి పెండ్లిచేసినాడు. కాని ఆమె అత్తవారింటికి పొమ్మన్నను పోవుటలేదు. ,,ముక్కిడి ముక్కోడు మూగిముచ్చులోడు—మొగతానం లేనోని మొగమెట్లా సూతూను—గతిలేనియింటిలో సంసారమే సెయ్య,,నని పట్టుపట్టినది. స్త్రీకి మగని మగతనమే తగినసిరి. అట్టి వ్యవహారములలో కులము వారు పట్టించుకొనక పోలేరు. ,,కులమెల్లొచ్చిండ్రు పంచాతి పెద్దారు—నలుగిట్లకు పిలుస్తారు—నామాటపోతాడి—పోబిడ్డ మొగనింటికి,,* అని తండ్రి కులమువారికి జడిసి ఆమెను గీములాడుట జరుగును, ఆలి తగవులలో పాలి తగవులలో గ్రామాధికారులు మంచములు, లంచములు కూడ ఆశించుచుందురు. ,,వొగనాల్ని పట్టేదెందుకీ వూరూర కలిసేదెందుకీ—పదిమంది కూడేదెందుకీ—పంచాయతి జేసేదెందుకీ—వొంటిగాణ్ణి గొట్టేదెందుకీ—వూరూర కూడేదెందుకీ—మంచాలు ఎక్కేదెందుకీ లంచాలు తినే దెందుకీ,,. అందువలన జానపద సమాజములో తొలుత కుటుంబము తరువాత కులము ఆ తదుపరి గ్రామము ముఖ్యముగా మతము అనునవి వ్యక్తిని నియంత్రించుచుండును. నేడు వివిధ పరిస్థితుల ప్రభావమువలన ఆర్థిక స్వరూపము దెబ్బతిన్నది. వృత్తిజీవన మసంతృప్తిగా మారిపోయినది.

## పరిశ్రమలు:-

ప్రతి వృత్తి ఒక పరిశ్రమయే యైనను వృత్తికిని పరిశ్రమకును సూక్ష్మమైన వ్యత్యాసము గోచరింపకపోదు. వృత్తి ప్రత్యేకముగా కులమునకు సంబంధించినది. పరిశ్రమ వివిధ కులములవారు చేయదగినది. వృత్తులమధ్య పడుగు పేకలవంటి సంబంధముండును. పరిశ్రమ లేమో యెగుమతి దిగుమతులతో గూడి యుండునవి. బెల్లము పరిశ్రమ, నూనెపరిశ్రమ, వస్త్రపరిశ్రమ, మత్స్యపరిశ్రమ వంటి చిన్న పాటి పరిశ్రమలమీద ఆయా ప్రాంతపు పల్లియుల జీవితము గడచును.

చిత్తూరు, కోనసీమలలో చెఱకు సమృద్ధిగా పండుటచేత సామాన్యముగా ప్రతి చెఱకు తోటవద్ద ఒక గానుగ, బెల్లము చేయు పరికరములుండుట చూచెదము. పండిన చెఱకు గడలను ముక్కలుగా నరికి గానుగలో వేసి రసము దీసి పాకము చేయుదురు. ,,సైరానాగానిగిల్లా—ఇట్లసెరక లోకమేలేటి నాముద్దు గానిగా—కొత్త కోటోళ్ళొచ్చి కొలత బెట్టించిరి—గుండ్లూరువారొచ్చి గుర్తుబెట్టించిరి—బారాల వారొచ్చి సెరకు నాటేసిరి... .... .... ...గానుగింట్లో ఆసెరకు గజ్జె వాగినట్లుంది-కరణంకాడ ఆసెరకు కంచువాగినట్లుంది,,. గజ్జె మ్రోగినట్లు, కంచు మ్రోగినట్లు కరకుబారి చేపదేరిన వెంటనే చెఱకు తోటను నరికి గానుగలోవేసి ఎద్దులను గట్టి త్రిప్పుదురు. ఇట్లు ,,పంట పంట సక్కెరాయె,, అది ఇంచుక ,,పాకుదప్పిన బెల్లమాయె,,. పాకముబట్టిన బెల్లమును రకరకములైన ఆకారములలో అచ్చులుపోసి ముద్దలుగా చేయుదురు. అమ్మకటకది సిద్ధముకాగానే వర్తకులు వచ్చి బేరమాడి పోవుచుందురు. వస్తువు మంచిగా లేకపోయినచో పేరు పెట్టుట సరేసరి. ,,రాయపేట వర్తకులు రంగులేద,,నిరి. మంచిదేయయినచో బాగున్నదందురు. ,,చౌడేపల్లి వారు సరుకు బాగనిరి-పలమనేరు వారు పైక మిచ్చిరి,,. బెల్లమేగాక నువ్వులు, వేరుశనగలు, కుసుములు గానుగకుపోసి త్రిప్పించి నూనె తీయుదురు.

,,గంపల్లి నూగులన్ని గానిగెంబోసి-గానిగెల కొమ్మలాకు ఏనిగల గట్టి
ఏనిగల కొమ్మలకు జేనిగలగట్టి-ఎక్కొక్కి లొక్కలంగ ఎల్లెనమ్మనూనె,,*

ఇట్టి నూనె పరిశ్రమ ఈనాడు పల్లీయుల చేతులలో నుండి జారిపోయినది ఏవృత్తి లేని కూలినాలి వారు (ముఖ్యముగా మాలమాదిగలు) తంగెడు కట్టెలను దెచ్చి వాని బెరడును జీసి ఎండబెట్టి యమ్మట కూడ జరుగును. ,,కానొచ్చె సిరిబండ మీద నాసామి—చెక్క గొట్టె సోరపిల్లో నాసామి,,* అను పదము చెక్క పరిశ్రమను గూర్చి తడవినది. మేదరి వారు గుల్లలు, తడకలు, పెట్టెలు మొంటెలు, సిబ్బలు, చేటలు మున్నగునవి అమ్మకొందురు.

,,గుమ్మడాకు సీరిందో గుల్లలిందో
తాటాకు సీరిందో తడుకలల్లిందో
పేటాకు సీరిందో పెట్టెలల్లిందో
మొగులాకు సీరిందో మొంటెలల్లిందో
చిక్కుడాకు సీరిందో సిబ్బులల్లిందో
చాపట్లల గుల్లలు గుజి గుచ్చుకోని
పోయేనే ఆ బండి రాజుల వాడల్లా,, ఇట్లల్లినవన్ని గ్రామములోనే గాక చుట్టుముట్టు పల్లెలకు కూడ పోయి అమ్మకొని వత్తురు. అల్లికలో చక్కని నైపుణ్యమును గూడ ప్రదర్శింతురు

స్త్రీలు రాట్నముమీద దారము వడికి దగ్గరున్న సంతకుపోయి అమ్మకొని జీవించుట ఇటీవలి కాలము వరకు జరిగినది. ఇంటింట ,,రాట్నాల మ్రోతమ్మ రవ్వలామ్రోత,, లేనట. ఇట్టి ,,ఏకుల్ల రాట్నము కాళ్ళ సంకెళ్ళు,, గాను, కలవారి అల్లుడి కాళ్ళ సంకెళ్ళు,,గా నుండెడిది. స్త్రీలు విరామము లేకుండ పరిశ్రమించు చుండిరి. ,,ఏకేకు ఒకబార ఎల్లుండి సంత,, వడికిన దానిని సంతకు బోయి అమ్మకొని దిన వెచ్చములు తెచ్చుకొని జీవించుట జరిగినది. ఈనాడు ప్రత్తి పంటలు పండెడు ప్రాంతమున ముడి ప్రత్తిని ఎగుమతి చేయుచున్నారు. మిల్లు వస్త్రముల వాడుక హెచ్చినది.

గొల్లలు మొదటినుండి పాడి పరిశ్రమకు పెట్టినది పేరు. మగవారు గొర్రెలను మేకలను కాసినచో ఆడవారేమో పాలు, పెరుగు, వెన్నలను నెత్తిన బెట్టుకొని అమ్మెదురు. తెల్లవారుజామున లేచి చూచినచో ఊరంత ,,కనకగిరి గొల్లోరి కవ్వాలమోత,, లే వినిపించుచుండెను. పాడి పరిశ్రమ నేడు గొల్లల నుండి వికేంద్రీకరింపబడినది. ప్రభుత్వము చేతిలో పెద్ద పరిశ్రమగా మారినది. గొర్రెల ఉన్నిని కత్తిరించి గొంగళ్ళు నేసి అమ్మట కురుమ గొల్లలకే చెల్లి యున్నది.

చేపలను బట్టి అమ్మెడు మత్స్య పరిశ్రమ మీద ఆధారపడి జీవించు వారు బెస్తలు, జాలరులు. ఇట్టివారు మన తెలుగు దేశములోని సముద్ర తీర మండలి విశాఖపట్టణము, మచిలీపట్టణము వంటి ప్రాంతములలోను, గోదావరి కృష్ణా తీర ప్రాంతములలోను ఉందురు. వీరు తెల్లవారినది మొదలుకొని సంజపొద్దు వరకు చేపలను వేటాడి తెచ్చుకొనుట నిత్యకృత్యము. చేపలను పట్టునపు డుత్సాహముతో పాటలు పాడుట పరిపాటి. ,,గంతులేసే గండు మీన—పరుగులెత్తే పండుగొప్ప—వాలలాడే వాలు చేప.........బెదిరిఎగిరే బేతిసపిల్ల—రండి రండి నా వలల్లో పడండి,,. నీటిమీద రకరకములైన చేపలెల్లెట్లు ఎగురుచు మునుగుచు కన్పించునో అట్లట్లు జాలరులు ఒడుపుతో వలలొడ్డి వానిని పట్టెదరు. పట్టిన చేపలను వలలనుండి దులుపునప్పుడు ,,కట్టె చేపలన్ని కారిపోతున్నాయి—బేడిస పరిగెలు బెదిరి పోతున్నాయి—చేదు పరిగెలన్ని చెదిరి పోతున్నాయి—మట్టగిడస లన్ని కొట్టుకుంటున్నాయి—పండు గొప్పలన్ని పారాడు తున్నాయి గండుమీను లన్ని గంతులేస్తున్నాయి—వొంజి పిల్లలన్ని వొరిగి పోతున్నాయి—ముక్కు—జెల్లలన్ని మూలుగుతున్నాయి,,. కాని, మిడసరముతో ,,చెంగున యెగిరేటి చేపల్ని పట్టుకొని—బుంగలో వేసుకుని—బంగమేమి చేయకుండ (చంపకుండ),, అన్నింటిని అంగడిలో నమ్ముకొని వత్తురు. పైపాటలో జాలరులు బట్టెడు చేపలలో అనేక రకములు పేర్కొనబడినవి. జాలరులు నీటిమీద చూపెడు సాహస మద్భుతమైనది. వారల్లుకొనెడు బుట్టల యొక్క, వలల యొక్క పనితనము జానపద కళాత్మకము. నిత్య జీవితములో గలిసెడు వ్యక్తులకు

సహితము గుణమును బట్టి చేష్టలను బట్టి ఆయా పత్న్యై నామములను పెట్టుకొని పిలుచుటలో వారి యభిరుచి, చాతుర్యము వెల్లడి యగుచుండును. జాలరులంత చిన్న చిన్న పడవలు, దోనెలు వేసికొని ఈ తీరమునుండి ఆ తీరమునకు చేరుకొనుచుండుట వలన కొందరు వారి సహాయముతో తీరములు దాటు చుందురు. తీరము దాటించు సందర్భములో నొక పడుచునకు జాలరికి మధ్య నడచిన సన్నివేశము వారి శృంగారమున కొక నిదర్శనము. "ఏరు మీద ఏరొచ్చె జాలేరన్నో—నన్నేరు దాటెయ్యాలో జాలేరన్నా," అని యడుగుచు ముక్కెర, వడ్డాణము, కడియము లెన్నియో యిచ్చెదనన్నదా చిన్నది. కాని జాలరి చిన్న సన్నవాడు కాడు. ఆమె చేత "మళ్ళి వచ్చినప్పుడూ జాలేరన్నా—మంచిగ మాట్లాడుతాను జాలేరన్నా," అనిపించుకొని ఏరుదాటించుట మొనగినది.

## నావిక జీవనము:-

శాతవాహనుల కాలముననే తెలుగు జాతి సముద్రయానమున ప్రసిద్ధి కెక్కినది. ఇప్పటికిని సాగరసీమలోని తీర వాసులలో నిట్టి సంప్రదాయము మిగిలియున్నది. పొగబండ్లు, మరబండ్లు వచ్చిన పిదప వారిలో సహితము మార్పు జరిగినది. అయినను పడవ నడుపుకొని బ్రతుకుటయే వృత్తిగా నెంచిన వారు సముద్ర తీరమందు నదీ తీరములందే కన్పింతురు: ముఖ్యముగా విశాఖ పట్టణము, కాకినాడ, ఎలమంచిలి, భీమునిపట్నము కళింగ పట్నము వంటి ఓడరేవులే వారికి మజిలీలు. ఈవలినుండి యావలి దరికి సరకులు చేరవేయుట ప్రయాణికులను తీసికొనిపోవుట వారి దినచర్య. నీటిని నమ్ముకొని కూటికి ఆశపడు శ్రామికులు. వారి జీవన రచనకొక ప్రత్యేకమైన శైలి కలదు.

లంగరెత్తి గడలువేయుచుండ సముద్ర తరంగములను చీల్చుకొనుచు రివ్వురివ్వున పడవ సాగిపోవు చున్నప్పుడు కళాసుల (పడవ నడుపువారి) హృదయము సముద్రమువలె నుప్పొంగి పోవుచుండును. గడ యెత్తుటలో

దించుటలో గలుగు ఉచ్ఛ్వాస నిశ్వాసముల కనుకూలముగా మొట్ట మొదట ,,హైలేసా హైలేసా, హైలేసా, ఏలియాలా ఏలియాల ఏలియాలా,, ఏలియాలా ఐలేసా జోరుసెయ్యి—ఐలేసా బారుసెయ్యి-ఏలేలో-ఏలేలో,, ,,హవ్వారి హవ్వ,, ,,జంబై లే జోతులంగరు,, అనునవి ఊతపదములు. లయబద్ధముగ వెలువడు చుండును. ఊత పదములమీద వారి యుత్సాహము శ్రమను గమనింపదు. అవి పల్లవిగా వర్తించును. పడవ నడకను బట్టి కూడ లయ మారు చుండుట గమనించెదము. అటునిటు పడవ సోలుచుండుట గమనించి తోడిసరంగులను (కళాసులను) హెచ్చరించుచు ,,అయిలపట్టు-బల్లకట్టు-అద్దిరబాబు—అక్కడపట్టు,, మని చురుకుదనమును కల్గించుచు ఒడుదుడుకులు లేకుండ నడుపుచుందురు. ఉప్పొంగు కెరటములు, సుడిగుండములు వారిని అదరగొట్టు చుండును. రాత్రులందు దరిదాపులు గానక తికమకపడుచు ,,దండాలు గంగమ్మ—దండాలు గౌరమ్మ—కళ్ల కనిపెట్టండి మాకన్నతల్లులూ,, అని నదీ దేవతలకు చేయెత్తి మ్రొక్కుచుందురు. పడవ చక్కగా సాగిపోవుచున్నప్పుడు గాలి గలగలయు ఏటి అలల మిలమిలలు వారి పగటి కలలకు ప్రాణము పోయుచుండును. క్రొంగ్రొత్త ఊహలకు చిగిరింతలగుచుండును. ,,రవ్వ మువ్వల తెప్పరవ గాలికి,, వెళ్లుచుండ వారి మనః స్థితిని ఊహించ వలసినదే. కనిపించియున్న, కనిపించుచున్న, కనిపించనున్న కాంతల మీద కమ్మని కథలు కట్టుట వారికి కరతలామలకము.

జీవితమంత పడవ మీదనే గడచుట, ఆనందమంత అలల మీదనే తీరుట వలన ప్రతిక్షణము పాటయే తోడునీడ. ఆ తోడునీడలో మదన విహారమే జాడ. ప్రవాహపు మలుపులో పాట కలుపులో మదనుని పిలుపులో బడి ఏటిబోటి ఎద మీద పారాడు నప్పుడు చూడవలె వారి ప్రణయ సామ్రాజ్యపాలన! వెన్నెల రాత్రులేయైనచో వెన్నెలకు వన్నె బెట్టినట్లుండును. ,,అంతరాల పడవ మీదహైసా అందిపూలు కొయ్యబోతె హైసా — కొమ్మతూగి కొప్పు నిండు హేసా,,

పడవ ప్రయాణములో కొమ్మలెక్కడివి? పుప్పులెక్కడివి? ప్రక్కనుండిన గుమ్మ మేకొమ్మ. ఆ కొమ్మ కొప్పునిండ పూలే. అవి అందుకొని సరసమాడ బోవుట ,,లేని పోని రప్పలొచ్చు,,నట. వీరిలో రంకుతనము లెక్కువగా గన్పట్టును. సరంగు ,,నట్టేట పడవకీ పడుచుదానా-గట్టు లేదు పుట్టలేదు పల్లెదానా,, అన్నప్పుడు ,,సందె చీకటి పడ్డాది పల్లెమామా-గడవేసి ఒడ్డుకురా పల్లెమామా,, అని పడుచుది మారుబలికినప్పుడును, ఒకఅర్థములో ఆయాసములకు సంబంధించిన వ్యవహారము, మరొక అర్థములో శృంగారమునకు సంబంధించిన వ్యవహారము సర్వసాధారణముగా ద్యోతకమవుచుండును. ఈ రెండవ యర్థమే వారి ఉద్దేశము.

ఓడ మీద చిన్నవాని చేతికి వ్రేళ్ళనిండ ఉంగరములు చూచి యొక ముండ మనసు ఉండలేకపోయినది. పాపమా చిన్నవాడు దానితో ,,మూడునెల్లా ముండపోరు,, జేయ ,,ఆరునెల్లా జన్మకైదు,, అనుభవించినాడు. అంతే కాదు ,,ఎక్కరాని పడవమీదా సెప్పరానీ దుఃఖ మొచ్చినది,,. గతానుభవములన్ని అప్పుడప్పుడు పడవ నెమరు వేయుచుండ వారికి దుఃఖముండకపోదు. లంగరు త్రాడు తీరమునకు లాగుచున్నప్పుడు కూడ వారి కన్నులు ఏ చిన్న దాని మీదనో పోవుచుండుట పరిపాటి. ,,జంబైలో షోకుల లంగరి-చిన్నదాని ముచ్చట చూడు-కళ్లనిండ కాటుక చూడు-వాలు జడల చిన్నదాన-ఎల్లిపోయే చిన్నదాన,, అనుచు నఖశిఖ పర్యంతము చూపులలో దాని రూపమును జిక్కించుకొని, త్రాడు ,,లాగి నోడేలాలుకాడ,,ని, అట్లు చేయని వాని కన్ను ఆ చిన్నదాని మీదనే పోయినచో ఆ ,,లాగనోడే లంజకొడ,,ని నిశ్చయించుకొందురు. ఇంకను ,,లాగనోడే నల్లరాయి-రోసమేల లేదురోరి-మీసమేల లేదురోరి-మీసముంటే మిరపకాయ-లేకపోతే దొండకాయ,, అనుచు పౌరుషమునకు పురి యెక్కించుచు ఆ పనిని నెరవేర్చుట జరుగును.

ఎంత కఠినమైన పనిగాని పల్లీయుల చేతులమీద అవలీలగా జరుగుటకు

శ్రమనివారణకు ఏదోయద్భుతమైన మంత్రపు బిగువువారి పదాలలో అందలి లయలలో ఇమిడి యుండవలెను. లేనిచో వారి అప్పపు పలుకులలో అనుభవైక వేద్యమైన మధుర భావలహరులు లాస్యము చేయుట యేమి? నిండుదనముతో పరిశీలించవలెగాని కనిపించుటలో మొరటు దనముగా, వినిపించుటలో మురళీ రవముగా అనిపించెదరు వారు. ఏరువాక సాగుచున్నను, ధాన్యమిల్లు చేరుచున్నను, చెమట లొలుకు చున్నను, చేదు మ్రింగుచున్నను ప్రజలందరన్యోన్యముగా బ్రతుకవలెననియే ఆశించుచుందురు. అట్లే పడవ నడుపు వారు కూడ ,,నేలను నమ్మి ఏలేలో_చెట్టూ వున్నది హైలెస్సా_చెట్టును నమ్మి ఏలేలో_కొమ్మా ఉన్నది హైలేసా_కొమ్మను నమ్మి ఏలేలో_రెమ్మా ఉన్నది హైలేసా,, అనుచు నొకరి కొకరు అండగానుండి కలిసిమెలసి యుండవలెననుటకు వారినిర్మల మానసమే కారణము.

కూలికి గాని కులుకుటకు గాని పడవల మీద స్థలాంతరమునకు, రంగమునకు (రంగూన్) పోయెడు వారికి రేవు చక్కని తావు. కాని, ప్రేయసీ జనమునకు దిగులులావు. ప్రేమించి పరిణయమాడిన ప్రియుడు తన ప్రియురాలి నొంటరిజేసి ఓడమీద స్థలాంతరమునకు పోవుట పాడియా? అట్టి వాడొకడు అందమైన ప్రియురాలి మోమును చంద్రబింబముగా నెంచి ,,చూస్తుంటే గుండె చల్లబడత దాని గునిశాడిన మారాజు,, ,,కంచాన సద్దెట్టుకొని తెల్లాని వెన్నెలోనా కసిగాటు గొట్టుకుంటూ కలువరించిన మారాజు,,. ఇట్టి వానిని ఆ ప్రేయసి నమ్ముకొని మనసిచ్చు కొనగా ,,భీమారం పట్నంలోనా పెద్దలందరుజూడ పెద్దాపందిరిలోనా పెళ్ళాడి,,నాడు. కాని, కొన్నాళ్ళు ముద్దు ముచ్చటలు దీర్చు కొని యెందుకో స్థలాంతరమునకు పయనమైనాడు. పాపమాపడతి కాటుక కరగి పోయినది. ఆ ,,కాటుక కన్నుల జూచి_కన్నీళ్ళు చేత తుడిచి కావలించు,,కొన్న ఆ మహారాజు ఓడయెక్కి బయలుదేరినాడు. అప్పుడా ముద్దరాలు ,,ఓడెళ్ళి పోతున్నది_మారాజు_ఓడెళ్ళి పోతున్నదీ,, అనుచు వలపు దివెలలో చుట్టుకపడి

విలపించుచుండ ఆరేవంత ఆశకొట్లాడినట్లుండును. ఇట్టి యెడబాటును బొంద నున్న మరొక వనిత ప్రియునితో ,,వచ్చేవరకు పక్కలోను ఎచ్చుగాను తన్నెల్లిరా—వచ్చినదాక చెప్పుకుంటాను,, అనుట దాని అనురాగమునకు పుర: పతాక పట్టినదా గుండెలోతులోని మర్మము.

మరొక కోడెవయసు కాడు తన చెంచు (భార్య)తో సరస విలాసములు చాలకనో యేమోగాని రంగము పోవుచు తాను ,,మళ్ళీ వచ్చిందాక మర్లామరవ నంటూ శేతులో శెయ్యేసి శెప్పాలి శెంచూ,, అన్నాడు. కాని, చెంచుకు వాని మర్మము తెలిసినది. ,,ఏపూర నేపల్లె దేనిమీద కన్నేశినవో—యెంటాననొస్తీవు తుంటారిమామా—కూడొండి పెడతాను గుడ్డుతికి పెడతాను కూడా తోడుకపోవా జోడుగా మావా,, అని వేడుకొనుచు తన ధర్మమును పాటించెదనన్నది. అవి ఇవి తెచ్చెదనన్నచో ఊరుకొనుననుకొని వాడు ,,కోకాజరీ తెస్తా కొప్పుబిళ్ళ తెస్తా—నవ్వుతా శెలవిచ్చి నన్నంపెశెంచు,, అన్నప్పుడు కూడ అది వినలేదు. ఒల్లనన్నది. తోడునీడగా తోలుకొని పొమ్మన్నది. వాడు మాత్రమందుల కంగీక రింపక ఉత్తుత్త ప్రేమ కనబరచుచు దాని ,,శెంపా ముద్దెట్టకొని శెల్లోబాయ్ ఏడవకు,, మని విడిచి పోయినాడు. సముద్రమును చేరజాలక ఇంకిపోయిన నదివలె అయినదాచెంచు. ఉత్త మెరుగులబడు మిటారి కత్తె లను గూడి మోస పోవుట నగరముల కనుభవమే. రంగము వచ్చి వాడు తళుకు బెళుకుల జూచి కష్టార్జితమంత కానుకలు పెట్టి భంగపడినాడు. ఉన్నచోట హృదయ మిచ్చిన కన్నియను విడిచి వచ్చినందులకు పడ్డపాటులను దలచుకొని పశ్చాత్తాపమున కుములుట జరుగుచుండును. ,,ముద్దుగుమ్మ నేడిపించి సిరిసిరిమువ్వ — పాడు ముండలకు బెట్టినానె సిరిసిరిమువ్వ—సముద్రాలు దాటిపోతె సిరిసిరిమువ్వ—పైసా యైన లేకపాయె సిరిసిరిమువ్వ—బుద్ధి లేక రంగమెళ్ళి సిరిసిరిమువ్వ—ఈ రద్దిపాలు బడ్డానే సిరిసిరిమువ్వ,, అనుచు బుద్ధి తెచ్చుకొనుట యగును. ఒడిసిన పిమ్మట విడువదా తలదిమ్మ! ఇట్టి వివిధ సంఘటనలను గూర్చిన పాట లన్నియు పడవ నడుపువారు పాడుచుందురు.

## తాత్త్వక జీవనము:-

పరమాత్మని నిజస్వరూపమును, నిజస్థితిని తెలిసికొనుటను తత్త్వము (తత్—అది (పరమాత్మ); త్వం—నీవు (జీవుడు) అని స్థూలముగా చెప్పవచ్చును. తత్త్వమునే వేదాంతమని వ్యవహరింతురు. నిరంతర మిట్టి తత్త్వ చింతనమున మునిగి మనుగడ సాగించుటయే తాత్త్వక జీవనము. అది జీవాత్మ పరమాత్మ సంబంధ బంధురమైనది. సృష్టి రహస్యమునకు రాచబాటయైనది. పరమోత్కృష్ట మైన జీవిత లక్ష్యమైనది. విశ్వములో ప్రప్రథమమున తత్త్వాన్వేషణలో ముందంజవై చి ఋజు మార్గమును జూపినది మన వైదిక జాతియే. మన భారత దేశమే. అందుకే పాశ్చాత్యులు దీనిని తాత్త్వకుల దేశమనిరి. పాశ్చాత్య దేశములలో తత్త్వమున కంటె ముందు మత భావనమే యున్నది. అదే తత్త్వముగా మారినది. గ్రీకుల తోడనే తొలుత ఆ దేశములలో తత్త్వాన్వేషణము ప్రారంభమైన దని తత్త్వజ్ఞులు చెప్పుచుందురు. అసలు "జ్ఞానమునకు తెలివికి తూర్పు సీమలకు యాత్ర అవసరమని గ్రీసులో సామాన్య విశ్వాసము" 1. అట్టి "గ్రీసులో మత సూత్రములు, సిద్ధాంతములు తత్త్వముగా పరిణమించినవి. భారత్‌లో తత్త్వ చింతనమే మతమైనది" 2. కనుక, మొదటి నుండియు భారతీయులది తాత్త్వక జీవనమే. పాశ్చాత్యులది మత దృక్పథమైనచో మనది తాత్త్వక దృక్పథము. వ్యవహారములో మతమున కంటె తత్త్వమునకే విశిష్ట మైన, సువిశాలమైన పరిధి యున్నది. "జీవప్రకృతుల స్వభావ మెట్టిదో తెలిసి కొనుటకై చేయు సమాలోచనయే తత్త్వము. సత్యమును గూర్చిన చింతన రెండు మార్గములుగా సాగినది. ఒకటి దివ్యానుభవము—సంప్రదాయముతో ఆరంభించి అటనే ఆగిపోవును. అదియే మతము. రెండవది తార్కికుల

---

1. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర—ప్రథమ సం. పుట 14
2. " " " " పుట 8

యుక్తులపై ఆధారపడి యున్నది. అదియే తత్త్వము,, 1. పాశ్చాత్యులలో ఈ రెండును రెండు దృక్పథములలో సాగుచు ఒకొక్కొకప్పుడు పరస్పర ప్రభావములకు గురి యగుచు ఉండినప్పటికిని దానివేరాత్మకత కుదరలేదు. కాని మన దేశములో మతమును, తత్త్వమును వేరువేరుగా చేసి పరికించుట కూడదు. విడదీయ లేని విధమున ఇదే యది అదే యిది అన్నట్లుండును.

తత్త్వచింతనములో మనవారు ,,అహంబ్రహ్మాస్మి,, ,,తత్త్వమసి,, ,,సర్వం ఖల్విదం బ్రహ్మ,, అను వరకు పోయినారు. తన్నుతాను తెలిసి కొనుటయే పరమ రహస్యము. ఆ పరమ రహస్యములోనే జగద్రహస్య మిమిడి యున్నది. ,,జగద్రహస్య సమస్యల నర్థము చేసికొనుటకై చేయు మానవ ప్రయత్నమే తత్త్వ శాస్త్ర కర్తవ్యము గాన నది జాతి, సంస్కృతుల సంస్కారమునకు లోనై యుండును 2. జాతి సంస్కృతుల సంస్కారమునకు సామాన్య జానపదులు మూలభిత్తికలు. తార్కికమైన నిగూఢ తత్త్వము వారి కెరుక లేకున్నను ,,అయ్యో దైవమా ఎందుకీ పుటుక పుట్టించినవు—ఈ ఆటంత ఉత్తదే—కొంచపోక ఎందుకుంచినవు—అంతా నీమాయ,, అను రహస్యము వారి బ్రతుకు దెరువు నందడుగడుగున వినగలము. ,,నేను,, (జీవుడు) ఉత్తదే, ,,నీవు,, (పరమాత్మ) నిత్యము, సత్యము, అనెడు సత్యము వారి ఊపిరిలో గలిసిపోయినది. ,,నాకు సావన్న రాకపాయే,, అను వారి నిర్వేద భావన జీవిత సమస్యల నుండి విముక్తి పొందదలచియే. బుద్ధ భగవానుడు కూడ జీవిత సమస్యను కడ తేర్చుట కొరకే సంసారమును త్యజించి తపస్సు చేసి తుదకు సిద్ధిని వడసి, తత్ సమస్యా నివృత్తి మార్గమును గనుగొన్నాడు. కాని భగవంతుని విషయములో నతడు దాసీనుడైనాడు. సమస్యా నివృత్తి మార్గమును దెలిపి

1. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర—ప్రథమ సం. పుట 10
2. భారతీయ తత్త్వశాస్త్రము—1వ సంపుటము—అధ్యా. 1 పుట 4

కొనలేక, పాటింప జాలక, పల్లీయులకు భగవంతుని మీద చూడకు ఆవు మీద నున్నంత మమత, అనుబంధము. ఈ యనుబంధమే జీవాత్మ పరమాత్మకున్న అవినాభావ సంబంధము. అదే అద్వైతము. పరమాత్మయందు సంలీనమగుటకు జీవాత్మ పడు యాతన పల్లియ హృదయములో పరిశీలింపవచ్చును. అసలు ఇది తత్త్వము అని వారికి తెలియ కున్నను తద్బీజములు వారిలోనే కలవు. పంచ భూతాత్మకమైన ప్రకృతికిని వారికిని దగ్గర సంబంధ మున్నందు వలననే నేటికట్టి బీజములు మిగిలి యున్నవి. గ్రీకు తత్త్వ విషయమున చెప్పబడినది కూడ దీనినే బలపరచుచున్నది 1. తత్త్వమును గూర్చి ఎవరెట్లు చెప్పిరి, దాని స్వరూప స్వభావముల మీమాంస యెట్టిది యనుట కాదిట. సూక్ష్మముగా తత్త్వమననేమి? పల్లీయులలో బీజప్రాయముగా నది యెట్లు గోచరించు చున్న దనునదే ప్రస్తుతము.

పగ్గము బట్టిన రైతు, మగ్గము నేయుసాలె, ఉగ్గు బట్టించు తల్లి, ఉరకలిడు బాలుడు, మ్రగ్గిన ముదుసలి, ముగ్గులిడు బాలిక, కూలినాలి జనులు, కుమ్మరి, కమ్మరి మొదలగు వృత్తుల వారు తమ తమ పనులలో ఒక్క మారైనా తాత్త్వికముగా బలుకని దినముండనేరదు. ఏ కష్టమునకో నష్టమునకో భగవంతుడు వారి హృదయములలో భజింపబడుట సామాన్యము. అసలు హిందువులలో తాత్త్విక చింతన లేని కార్యముండదు. ఇచ్చట పొట్ట చేత బట్టుకొని కడప కడప చెంత చేయి చాపెడు బిచ్చగాండ్ర నాలుక మీది నుండి తాత్త్విక వాసన లొలుకు చుండును. అంతేగాక, తత్త్వము ద్వారా సంఘ సంస్కరణమును, నీతిని, యోగమును, వైరాగ్యమును మున్నగు వానిని బోధించుట కూడ పొసగును.

---

1. "పర్యవసానమున గ్రీకు తత్త్వము కలా కవిత్వముల వలె జనసామాన్యుల మనసులవృద్ధి అయి హెలెనిక్ సంస్కృతిలో సజీవాంశమై అలరారెను."— ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర—2వ సంపుటము పుట 23

పల్లీయులు పాడెడు తాత్త్విక పదాలు,కీర్తనలు మున్నగునవి ఉపనిషత్సారమును దేశమంతట వ్యాపింపజేసి భారతజాతికి పరమార్థ చింతన గల ధార్మిక జీవనమును నిలిపినవి.

,,నాదేటి బతుకాయరన్నా—నే నాడె సావకపోతి రన్నా,, ప్రాపంచిక ప్రయాసలలో జిక్కుపడి విరక్తుడైనవాడు తక్షణమే చావునుకోరు కొనుట సహజము. చచ్చినచో దుఃఖము నుండి విముక్తి కలుగునని విశ్వాసము. అనగా జీవాత్మ పరమాత్మలో కలియుటకై పడు తపన పై పదములో నున్నది.

,,అంగములో ప్రాణలింగమై వున్నంగ—ముందు మా గతి చెప్పరో లింగయ్య—ముందు మా గతి చెప్పరో... ... .... ....కాశికే కద నిద్ర కనక పురమూ తేరు—కైలాసమంపించరో లింగయ్య కైలాసమంపించరో,, అంగములో ప్రాణలింగ మనగా దేహములో దేహియని అర్థము. సంసార బంధమున నిరికి యమ యాతన పడుచు జన్మరాహిత్యమునకై భగవంతుని వేడుట భాగవతములోని గజేంద్ర మోక్ష ఘట్టమును దలపింపజేయును. అనంత దుఃఖ సీమయైన సంసారములో మధ్యనున్నట్టి దేహికి సుఖ మన్నది లభించదు 1.

,,గడ్డికూడె తింటు గడ్డిలోనె వుంటు

గడ్డిలో పాణమొదిలి కైలాసం సూత్తము,, అను పదము తత్త్వ రహస్యమున కొక మచ్చు. అనుభవములోనే జానపదులు జీవ ప్రకృతుల స్వభావమును గ్రహించు చుందురు. అదే తిని అదే యై అందులోనే కలిసి పోవుట అనునది దేహము పంచ భూతాత్మకమైనదని భావము.

---

1. ,,సంసార ఏవ దుఃఖానాం సీమాంత ఇతి కథ్యతే—తన్మధ్య పతితే దేహే సుఖమాసాధ్యతే కథమ్,,-యోగ వాసిష్ఠము-ఉపశమ ప్రకరణము సర్గ. 9 శ్లో-52

,,దేముదయా దేముడూ మాయదారి దేముడూ

నల్లని మేకాల పాలు తెల్లచేసె దేముడూ

తెల్లని పాలల్ల నీళ్ళు తెల్లచేసె దేముడూ,,—నల్లని మేకల పాలు తెల్లగా నగుట, ఆ తెల్లని పాలలో గలిసెడు నీరు గూడ తెల్లగానే యగుట యంతయు విచిత్రమే. సృష్టి వైచిత్ర్య మంత దేవునిమాయ. జగత్తంతయు భగవంతుని మాయయే అన్న తాత్త్విక చింతన పల్లీయులలో ముద్రవైచుకొన్నది.

,,అవ్వారె బతుకు లోకాపెగాని—పరమాత్ముని దయ ఏమున్నదో

కోడికి నెమలికి మరి కోయిలకు—కూత గలిపి మరి ఇడిసినదెవరో

గొఱ్ఱెకు బఱ్ఱెకు మరి ఏనూగకు—నలుపు గలిపి మరి ఇడిసినదేవరో,,*

సమస్త జీవులలోని ఆత్మ ఒక్కటే యను సత్యమెరిగి, అంతయు పరమాత్ముని దయమే అని ప్రగాఢ విశ్వాసముతో నుందురు. అతని కృపలేనిచో ఏ పని కావనెడు అచంచల విశ్వాసము వారిది.

,,ఎంత దొడ్డవాడమ్మ యమధర్మరాజు

ఇన్ని పనులు విడిచి వెంట రమ్మనెను

పుట్టిన బిడ్డల విడిచి పుట్టిల్లు విడిచి

కలికి వైకుంఠము కలదు రమ్మనెను,, ఇల్లు, పిల్లలు జెల్లలు, ఎవ్వరు తనవారు కారు. తాను ఇహమునుండి పరమునకేగునప్పుడు వారందరిని విడిచియే పోవుట సహజము. ,,ఆలుబిడ్డలచూసీ అతిమోహ పడకే—నీకన్నీ జన్మములా వారేరీ మనసా—సిరిసంపదలు చూసి మురువాకె మనసా—ఇది తేరచాటు బొమ్మలాట తెలిసీ తెలియక నీవు చెడిపోకే మనసా—పరతత్త్వమార్గము కనుగొనవే మనసా,, అను భావనలో ,,ఆత్మ ఒక్కటే తెలిసికొనదగినది,, 1 అను తత్త్వరహస్య మిమిడి యున్నది. పునర్జన్మమును గూర్చిన ఆలోచన గూడ పల్లీయులలో

1. మాండూక్యోపనిషత్తు:—శ్లో॥ 10

సుస్పష్టము. తార్కిక సిద్ధాంత రాద్ధాంతములతో పాడుకొన్న భావములు గావు ఇవి. ఇంతంత మాటలలో అంతంత జీవిత రహస్యములను, లక్ష్యములను అప్రయత్నముగా రంగరించుకొన్నట్టివి. విగ్రహారాధన విషయములో ,,రొక్కితే రాయి మొక్కితే దేవుడు,, అన్నట్టి వారి పసిడిపలుకులలో అనంతమైన తాత్త్విక చింతన సూక్ష్మీకరింపబడినది. జీవాత్మ పరమాత్మలో గలియుట అనునదెంత సత్యమో వారిలో తత్త్వము అంత సహజ భూతమైనది.

,,ఈ పేళ యింట్లోను రేపు మంట్లోను,, కలిసెడు సంగతిని, ,,ఇంత తెలిసీ నరులు విస్తరించేరు,, గదా యని నరులలోని అజ్ఞానమును వేలెత్తి చూపగలరు వారు. ఈ భావములో, సృష్టి స్వప్న మాయా స్వరూపమైనది1 యను రహస్యము ద్యోతకమగుచున్నది. అనగా ,,జగన్మిథ్య,, యని యర్థము.

,,దొడ్డికి తలుపులు తొమ్మిది తోపలు
తోటకు తెరువెది భామా—పూల—తోటకు తెరువెదిభామా,,
,,తొమ్మిది తొర్రల గుడిసె లోపల

సొమ్ములెక్కడ దాతు సుమ్మీ,,*—మానవుడు తొమ్మిది త్రోవల దొడ్డి వంటి, గుడిసెవంటి వాడు. కనుక ఒక మార్గము గాని, ఒక లక్ష్యము గాని ఎరుంగ లేకపోవుచున్నాడు. చిల్లుల కుండలో నీరు నిలువనట్లే వానిలో పరమాత్మ జ్ఞానము చిక్కువడుటలేదు. ,,పచ్చికుండలో నీళ్ళు నింపితే ఇచ్చుక పదహారాయె సుమ్మీ,,. అనగా మానవుడు పచ్చికుండ. ఐహిక భోగభాగ్యములు నీరు. పచ్చి కుండలో నీరు నింపగా నది యెట్లు విచ్చుకొని పగిలిపోవునో అట్లే భోగ భాగ్యముల నాశించెడు మానవుడు గూడ ముక్కు మొగము గానక నశించి పోవును. కొందరిట్టి భావములు గల తత్త్వములను ఏకతార మీటుచు వారిలో వారు తన్మయమందు చు పాడుకొనుచుందురు.

---

1. ,,స్వప్నమాయా స్వరూపా ఇతిసృష్టిః ,, గౌడపాదకారికా—శ్లో॥ 7

బంగారపు తీగమీద కొంగయున్నది
కొంగముక్కులోన శివలోకమున్నది
సెట్టు సేమ లేనిచోట కాకియున్నది
కాకి కడుపులోన జగలోకమున్నది
నీళ్ళు లేని సెరువులోన కప్పయున్నది
కప్పకడుపులోన సప్తసముద్రి మున్నది
సింతమాని తొర్రలోన సిలకయున్నది
సిలక కడుపులోన జగలోకమున్నది
సింతతోపు దోవలోన కోతి యున్నది
కోతి కడుపులోన పరంజ్యోతి యున్నది*

ఈ పాటలోని తాత్త్వికి పరిభాషననుసరించి; బంగారపుతీగ = ఆత్మ. కొంగ = దేహము. ముక్కులోన = నాసికాగ్రమున (దృష్టినిల్పినచో) శివలోకమున్నది = బ్రహ్మలోకమున్నది ( బ్రహ్మపదార్థ దర్శనమగుచున్నది) సెట్టు సేమ లేని చోట = నిరాధారమైనట్టి, నిలువనీడలేనట్టి ఇహమందు కాకిఉన్నది = జీవుడున్నాడు. కడుపులోన = అట్టి జీవుని ఆత్మలో (జగమున్నది). నీళ్లలేని సెరువులోన = ఇహమందున్నట్టి. కప్ప కడుపులోన = జీవునియందు. సప్త సముద్రమున్నది = పంచభూతములు, కాలము, దిక్కు అను సప్త ద్రవ్యములు. సింతమానితొర్రలోన = దేహమందు. సిలకయున్నది = ఆత్మకలదు. సింతతోపు లోన = అంతఃకరణ చతుష్టయములో. కోతియున్నది = మనసుఉన్నది. అట్టి మనసును నిల్పినపుడు పరమజ్యోతి స్వరూపుడైన పరమాత్మ ప్రాప్తించును.—ఇత్యాది పాటలెన్నియోకలవు. వానిలో నిగూఢముగను, అద్భుతముగనుత త్త్వము నిక్షిప్తమై యుండును. ఇట్లే మరొక పదములో—

"బ్రహ్మ పట్నం పోదమంటె అడవులడ్డము అన్నయా
బ్రహ్మ పట్నం పోదమంటె చీకటవుతది సెల్లెలా,,

దానికి అవప్పు అద్దమైనట్లు, కంట చీకటి పడినట్లు బ్రహ్మజ్ఞాన మెరుంగు ప్రయత్నములో పెక్కు ఆటంకము లెదురై అయోమయ స్థితి ఏర్పడునని దీని భావము. గొప్ప గొప్ప తాత్త్వికులు సహితమిట్టే తత్త్వచింతనలో తల మునకలైనారు. పల్లీయుల తత్త్వములకు ఉపనిషదాది శాస్త్రములలో ఆధారములు లభింప గలవు. ,,జ్యోతి వెలుగుచున్నదమ్మా—దానిలోతు తెలియరావె కొమ్మా,, అనునది పరమాత్మని నిజస్వరూపమును, స్థితిని చక్కగా చెప్పినది. ఇది తెలియుట చేతనే అమృతత్వము సిద్ధించును. ఇతర మార్గమింకేదియును లేదు 1.

,,వాసములకెల్ల వాసము శ్రీరామ—ఏ వాసము మంచిదే
పంచరంగుల మీదికి శ్రీరామ—విశ్వాసము మంచిదే,,

విశ్వాసముండవలెను గాని, తత్త్వము యొక్క లోతు కొంత తెలియక పోవునా? చాలమట్టుకిది కొలువడుట వలననే అజ్ఞులు కొందరు తత్త్వమును గూర్చి పిచ్చిగా తలంతురు.

మగ్గము మీద బట్టలు నేయుచు పాడెడు క్రింది పాటలో బట్ట నేతకును బ్రతుకు తత్త్వమునకును సామ్యము కల్పించుకొనుట జరిగినది.

అగ్గువాయెరా ముక్తి అగ్గువాయెరాయిట్లు
మగ్గము బట్టకు నేత మరిగినేసే వారికెల్ల
వేదాంత సారమిది తెలసిన పడుగుదడపాలె
నాదాంతముని యేటి కుంచెతో సరిచెయ్యవలె
నాదు బిందు కళల మంచి నాటకాన నవ్వవలె

---

1. వేదాహమేతం పురుషం మహాంతమాదిత్య వర్ణం తమసః పరస్తాత్
తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేయనాయ
యజుర్వేదము:—అధ్యా. 31 మండలము. 18

పాడుకున్నా ప్రణవరవము ప్రబల జేసే వారికెల్ల
గంటనాదం యినుడించి గజ్జలు పల్కాకు గట్టి
ఒంటి స్తంభం మేడలోపల ఒనరజేసే వారికెల్ల
నగవుల తిమ్మప్ప గురుని నమ్మి మడతవేయవలె
తగ చెలిమి ఒక్కాటి చేసి దట్టించే వారికెల్ల
అగ్గువాయెరా ముక్తి అగ్గువాయెరా యిట్లు

ఇందు, ముక్తికి జ్ఞాన యోగములు రెండును పడుగు పేకలవలె చెప్ప బడినవి. ముక్తి పడయుటకు జ్ఞానము మరియు యోగము నభ్యసింపవలెనని యోగ తత్త్వోపనిషత్తు ,,తస్మాద్దోష వినాశార్థముపాయః కథ యామితే – యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్ ॥ యోగోపి జ్ఞానహీనస్తు నక్షమో మోక్ష కర్మణి – తస్మాద్ధ్యానంచ యోగం చ ముముక్షుర్దృఢ మభ్యసేత్॥ అని చెప్పినది.

తత్త్వము అనుభవము మీద గడించుకొనదగినదే గాని కేవలము శాస్త్ర పఠనము వలన గాదని, పల్లీయుల తత్త్వమునుబట్టి తెలియనగును. ఒక్కొక్క పట్టున వారి తత్త్వమును విడమరచి చెప్పుట కష్టమగుచుండును. వారి మార్మిక తత్త్వములు తెలుగునాట నాలుగు చెరగుల వ్యాప్తి గాంచినవి. ప్రతి భిక్షుకుని నోట తత్త్వము ప్రాణభిక్ష. పనిపాటలందు మునిగియున్న ప్రతి పల్లీయుని నాదములో తత్త్వము లెన్నియో ఊపిరి నింపుకొన్నవి.

,,పెమిదల నూనె ఉన్నంతసేపే దివ్వె వెలుగులంతా
ఆ పెమిదల నూనె అయిపోగానే దీప మారునంటా,,*

నిత్యానుభవమందు సుపరిచిత వస్తువులతో తత్త్వజ్ఞానమును పోల్చుకొని, జోడించుకొని సూటి మాటలలో తేల్చి చెప్పుట అపూర్వముగా నుండును. నిత్య పరిసరములలోనే జీవితమును, తత్త్వమును, కవిత్వమును దర్శించు నేర్పు ప్రకృతి సిద్ధముగా వారికి సిద్ధించినది. ప్రమిద = దేహము. నూనె = చైతన్యము.

(ఆత్మ). దివ్వెవెలుగు = పరమాత్మ ప్రకాశము. ఇట్లు భావించుట ఎంత సూటిగా ననుభవైక వేద్యముగా నున్నదో సెమరు చేసిన తెలియును. దేహములోని ఆత్మను బట్టి పరమాత్మ నెరుంగదగునని భావము. దేహమునుండి ఆత్మ పైదొలగగానే పరమాత్మజ్ఞానమెరుకనుండి దూరమగుట, దేహము నశించుట యగును. దృశ్యమానమైన జగత్తంతయు పరమాత్మ ప్రకాశము చేతనే ప్రకాశించు చున్నదను 1 సత్యమును పైపాట రంగరించుకొన్నది. తత్త్వమున ఇది మౌలికమైన జ్ఞానము. ముఖ్యముగా అద్వైత జ్ఞానము పల్లీయుల జీవితమున రంగరింపబడిన విధమట్టిది. అసలు అద్వైత తత్త్వమే వారి తత్త్వము. గ్రంథస్థమైన తెలుగు వాఙ్మయమున కంటె పల్లీయుల ఊపిరినుండే తత్త్వ మధికముగా సమకూర్చబడినది. దానిని వారు తమ పదాలలో నల్లుకొని ఉల్లముల్లసిల్ల బాడుకొనుచుందురు.

,,చిల్లర రాళ్ళకు మ్రొక్కుచునుంటే-చిత్తము చెడునుర ఒరే ఒరే
చిత్తమునందున చిన్మయరూపుని-చూచుచునుండుట సరే సరే
ఒక్కపొద్దులని యెండుచు నుంటె-ఒకరుగ చెడుదువు ఒరే ఒరే
ఏకమైన యా వైభవ మూర్తిని-చూచుచు నుండుట సరే సరే
నీళ్ళలో మునిగి గొణుగుచుయుంటె-నిలకడ చెడునుర ఒరే ఒరే
నీళ్ళలో వుండే నిర్మలజ్యోతిని-చూచుచు నుండుట సరే సరే,,*

సర్వమునందు సర్వోత్తమమై వెలుంగు ఆత్మస్వరూపమైన అపరబ్రహ్మమును తెలిసికొనుటయే కర్తవ్యమను ఉపనిషద్వచనమును 2 దలపించు భావములు

---

1. ,,మూ॥ నతత్ర సూర్యోభాతినచంద్ర తారకం నేమా విద్యుతో భాన్తి కుతోయమగ్నిః — తమేవభాన్తమను భాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి,,-ముండకోపనిషత్తు—ద్వితీయ ముండకము; ద్వితీయ ఖండము.

2. ,,మూ॥ ఆవిస్సన్నిహితం గుహాచరం నామమహత్పదమత్రైతత్సమర్పితమ్ ఏజత్ప్రాణన్నిమిషచ్చయదేత జ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్య ద్వరిష్ఠం ప్రజానాం,,-ముండకోపనిషత్తు—ద్వితీయ ముండకము—ద్వితీయ ఖండము.

వారికి అనాదిగా వచ్చుచున్నవి. వారి జీవితము పిండిన సారమది.

పూర్వదేశాన తుంగ మడుగులోన
నంది కడుపులోన పంది పుట్టెరోరన్న
బర్రె కడుపుల గొర్రె పుట్టేరన్న*

ఒకజాతి పొట్టన వేరొకజాతి శరీరము పుట్టుట యను విచిత్రములు వారు చూచియే యుందురు. కేవలమిది వారి యూహ కల్పిత మన వీలులేదు. ఇప్పటికినిట్టి వార్తలు పత్రికలలో వచ్చుచున్నవి. ఇట్టి విచిత్రము లేనాటి నుండియో జరుగు చుండినట్లు మన ప్రాచీన సాహిత్యము గూడ చెప్పుచున్నది. దాశరాజునకు వ్యాసమహర్షి జననియైన మత్స్యగంధి మరియు మత్స్యరాజు, చేప పొట్టనుండి ప్రాప్తించినట్లు మహాభారతాది పర్వములో చెప్పబడినది 1. అట్లే భాగవత దశమస్కంధములోనుత్తరభాగమున ప్రద్యుమ్నోపాఖ్యాన మందిట్టి సంఘటనము గూర్చి కూడ చెప్పబడినది 2. ఇటువంటి సృష్టి వైచిత్ర్యములు గూడ పల్లీయులను తత్త్వమున కీడ్చుకొని పోవుచున్నవి. భవిష్యత్తును దర్శింప జేయుచున్నవి. భగవన్మాయను గూర్చిన విశ్వాసమును పదిల పరచుచున్నవి.

బిడ్డను తొట్టెలో పరుండబెట్టి లాలించుచు తల్లి:—
"లాలిచిద్రూపుడా లాలిచైతన్యా
లాలి స్వప్రకాశ లాలి పరమాత్మా
ఓంకారమని యెడు ఒక తొట్టెలోను
తత్త్వ మనియెడు చలువ పోత్తిళ్లు బరచి
ఎరుకల గల పాపన్ని ఏర్పాటుజేసి
ఏడు జగములవారు ఏకమైవూచా", అనుచు పాడిన దంతయు తత్త్వమే.

---

1. భారతము:—ఆదిపర్వము
2. భాగవతము:—దశమస్కంధము—ఉత్తరార్ధము—అధ్యా 55 శ్లో॥ 3, 4, 5, 6

చిద్రూపము, చైతన్యము, స్వప్రకాశము, ఓంకారమన్నను పరమాత్మయే. ఆ పాటలో యౌగికతత్త్వము చెప్పబడినది. బిడ్డ నూయలలోపెట్టి తల్లి తత్త్వమును దదపుట యన్నది మన దేశములోని అన్ని జాతులలోను కనుగొనవచ్చును. మచ్చునకు శ్రీ గోస్వామిగారాంగ్లమున కనువదించిన ఆస్సాము జానపద గేయమును పరిశీలించినచో బోధపడగలదు 1.

పిల్లలు హాస్యమునకు పాడుకొను సందర్భములందలి ,,నారాయణ నారాయణ నక్కతోక_నారాయణ పెండ్లం కుక్కతోక_నన్నెందుకుంచినావు కొంచపోక-వోశిగల్ల 2 గంపకాడ వుంచిరాక-మంచినీళ్ళ బాయికాడ ముంచిరాక,, వంటి పాటలలో తత్త్వము ఛాయామాత్రముగ భాసించును. నారాయణుడనగా నరులకు (జీవులకు) ఆశ్రయుడు (ఉపగతుడు). ఆయన నక్కతోకవలె చక్కగ (శుద్ధముగ) నుండును. ఆయన పెండ్లము ప్రకృతి. కుక్కతోకవలె వంకర తనమును, చాపల్యమును గలిగి అసాధ్యమైనదై యుండును. ఆ ప్రకృతి పొత్తు జీవులకయోమయ మనిపించినది. కనుక పరమార్థసిద్ధినందుటకై నారాయణుని వేడుట జరిగినది. ఇంతటి వైరాగ్య చింతన పిల్లల హాస్యములో దాపుకొని యుండుట గమనించదగినది.

1. ''Sleep, oh sleep dear baby mine
   King Divine

   Sleep my child, in sleep recline
   Heaven's king
   All glittering

   Full of grace as lilies rare:-G. P, Goswami-Folk Literature of Assam (An Introductory survey)-P. 46.

2. ఓశిగల

భక్తి :-

భగవంతునియందనురక్తియే భక్తి. భగవంతునికి సత్తు, చిత్తు, ఆనందములను మూడు నామములు. అనగా సద్రూపుడు, చిద్రూపుడు, ఆనందుడు. అతడు మార్పులేకుండ, నిరంతర జ్ఞానుడై, సదాదుఃఖరహితుడై యున్నాడు. ఈషణత్రియముల (దార, పుత్రి, ధనములందాశ) నుండి విముక్తుడై సచ్చిదానంద మయత్వమునకై జీవుడు చేయు ప్రియత్నము భక్తి. అది అమృతము, శాశ్వతము, అనిర్వచనీయము. తత్త్వమెరిగిన భక్తి ముదురును. అనగా భగవానుని గూర్చిన జ్ఞానము పొందినప్పుడే భక్తి నిజమైనది. దానికి ఆజ్ఞానమే ముఖ్యసాధనము 1. మోక్షప్రాప్తికట్టి జ్ఞానము మరియు భక్తి రెండును పక్షికి పక్షద్వయమువలె అన్యోన్యాశ్రియములై యుండవలెను. అప్పుడు భగవంతుడు ముందర నిలుచును. కనుక భూత భవిష్యద్వర్తమానకాల సత్యముల కంటె భక్తియే గొప్పది 2. సులభమైనది 3. అదియే సాధనము, సాధ్యము. చిన్న, పెద్ద, స్త్రీ, పురుష, కుల మతాది వ్యత్యాసము ఎల్లరకిది అనాయాస గమ్యము. ఎంత దురాచారుడైనను తుదకు భగవచ్చింతన యందు నిశ్చలుడైనచో సత్పురుషుడేయగును 4.

మన సాహిత్యములో కర్మవీరులకంటె, జ్ఞానులకంటె, భక్తుల సంఖ్యయే అధికము. ముఖ్యముగా శైవవైష్ణవ సాహిత్యములలోనెల్ల భక్తులకథలే విశేషము. మానవులకే గాక తిర్యక్కులకు సహితము భక్తి మార్గము సులభము. భక్తి చేత భగవంతుడు తొందరగ చిక్కువడుట గలదు. భక్తిచే హనుమంతుడు

1. "తస్యాః జ్ఞానమేవసాధన మిత్యేకే,"—నారదభక్తిసూత్రములు; సూ. 28
2. "త్రిసత్యస్య భక్తిరేవగరీయసీ భక్తిరేవగరీయసీ," ,, సూ. 81
3. "అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ," ,, సూ. 58
4. భగవద్గీత—అధ్యా. 9, శ్లో॥ 30

రాముని పాదములకే బంధమైనాడు. శబరి యెంగిలి మ్రింగినాడు రాముడు. కొమ్మలెగిరే యుడుత ఒక్కటి కోదండరాముని చేతిలో చేయిగలిపె నానాడు. రామదాసు భక్తికి ఆ రాముడే ఆసామియైనాడు. ఏలుగెత్తి యేడ్చిన ఏనుగునకై విష్ణువు పడతి పైటనుబట్టుకొని యా సిరికి జెప్పక, పురికి జెప్పక, ఉత్తకాళ్లను గొట్టుకొనుచు ఉరికి వచ్చెను. పక్షి యొక్కటి రెక్కలెత్తి పట్టి యతనిని దిక్కులెల్లను ద్రిప్పుకొనివచ్చెను. తండ్రినేగాదని, తన్ను దలచే పిల్లవాని మాటలో మరొకమారు వేషము జూపెను. పురుగుజచ్చి తుట్టెపురుగుజచ్చి ఏనుగుజచ్చి సిరిగట్టుదొరచే మరల మరల పుట్టక యుండెడు మంచి మందును దొరకించుకొనెను. అందుకే భగవంతుడు భక్తసులభుడందురు. జన్మచే శూద్రులైనను వాల్మీకి వ్యాసాదులు ద్రష్టలై, దివ్యర్షులై మానవజాతికే మార్గదర్శకులైనారు గదా! ఇట్టి గాథలెన్నియో భక్తిమార్గమున సుబోధకములై యున్నవి. అట్లే పల్లీయులకు గూడ ఈ మార్గమే శరణ్యమైనది.

ఈ భక్తి కూడ, "గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్త్యాత్మనివేదనాసక్తి, తన్మయతాసక్త, పరమవిరహాసక్తి రూపాఏకధాప్యేకాదశధా భవతి" 1. అను ఏకాదశవిధ రూపములుగా నారద భక్తి సూత్రములందు జెప్పబడినది. నవవిధ భక్తిమార్గముల సర్వాత్మని నమ్మకొని సజ్జనుడై యుండుట భద్రమని భాగవతమువచించినది 2. మొత్తముమీద పల్లీయులలో నిట్టి రూపములు గన్పట్టుచున్నవి. వారిలోగల భక్తి, కర్మ, జ్ఞానమార్గములను గూర్చి ఆచార్య

1. నారదభక్తి సూత్రములు—సూ. 82

2. శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥
—భాగవతము।-స్కంధము 7, అధ్యా. 5 శ్లో. 23

బి. రామరాజుగారు విపులముగా తమ జానపద గేయ సాహిత్యమున చర్చించి యున్నారు. భక్తి పారవశ్యమున భజనలు, కీర్తనలు, కోలాటములు, జోలపాటలు లాలిపాటలు, మంగళహారతి పాటలు, మేలుకొలుపు పాటల వంటి ప్రక్రియలు రూపొందినవి. వీనిలో రాగతాళలయలు ఉట్టిపడుచుండును. అనగా సంగీతమున భగవద్దర్శనమగుననియే గదా! ఇదంతయు సహజస్ఫోరకమైనది. కోలాట మేళములు, భజన మండలులు ప్రతియూరనుండును. పర్వదినములలో, ప్రత్యేక సందర్భములలో నొకవంక భజనలుసేయుట మరొకవంక కోలాటములు వేయుట జరుగును.

శైవ వైష్ణవాది మత భేదములెన్ని యున్నను, పల్లీయుల కవియన్ని ఒక్కటే. "ఏకం సత్ విప్రాబహుధావదంతి", యను వేదసత్యము వారిలో కనిపించును. 12వ శతాబ్దములో శైవవైష్ణవ మత వైషమ్యములు చెలరేగి జన జీవితమును చీకాకు పరచిన కాలములో తిక్కన సోమయాజి శివకేశవాభేదమును చాటినాడు, పల్లీయులు గూడ—

"భూతి పూసినవాడు లింగడూ—పట్టెనామాలెట్టినవాడు రంగడూ

... ... ... ... ... ... ... ...

తోలుకట్టిన వాడు లింగడూ—పట్టుశాలుగట్టిన వాడు రంగడూ

... ... ... ... ... ... ...

ఎద్దునెక్కినవాడు లింగడూ—బొల్లి గద్దనెక్కినవాడు రంగడూ",* అని పాడుచు, కోలాటము వేయుచు, గంతులిడుచు శివకేశవాభేదమును పాటించినారు. శివకేశవులకేగాక, పార్వతి, లక్ష్మి యన్నను వారికి ఒక్కటే. తాత్త్విక వాసన లేనిదే యిట్టి తలంపు గలుగునా? వారనేకవిధములైన పౌరాణిక దేవతలను గురించి కీర్తించినను, భజించినను మనములందు భగవత్సర్వాత్మానుభవ మొక్కటియే. అప్పుడు భక్తుడు తన ఆత్మను భగవదర్పితముచేసి తదానందమున

నోలలాడుచుండును. ఇట్లోలలాడుట యందే గుణమాహాత్మ్యసత్త్వాది భక్తి భావములు వారి మనోగత భావములనుబట్టి ఏర్పడగ నాయా భావములలో భగవంతునర్చించుట, దర్శించుట జరుగుచున్నది.

రామానీనామము వేమారు వేడెద కామితార్థము లివ్వరా
రామయ్య కామితార్థము లివ్వరా
భూమిలో నీకన్న ప్రేమ గల్గిన వేల్పుస్వామి
ఎవ్వరూ లేరుగా రామయ్యస్వామి ఎవ్వరూ లేరుగా
పలుమారు ద్రౌపది తలపగ సభలోన వలువలొసగలేదా
అల కుచేలుని గుప్పెడటుకు లారగించి బలు వైనలచ్చినీవవా
పొంగుచు తెచ్చిన ఎంగిలి ఫలములు మ్రింగి శబరిని బ్రోవవా
కరిరాజు మకరిచే గాసిలి వేడగా గ్రక్కున రక్షింపవా
రంగూగనీపాద రజము శిరమున దాల్చు రంగమయి బ్రోవరారా
ధరణిలో బళ్ల సీతారామరాజుకు సిరులిచ్చి కృప జూడవా॥

ఇందు భగవంతుని యొక్క వివిధ గుణమాహాత్మ్యములు కొనియాడబడినవి. పురాణాది శ్రవణము వలననే పల్లీయులాతని గుణమాహాత్మ్యములెరింగి యున్నారు.

ఆ పూలూ యీ పూలూ పళ్లెములోబోసి
ఆ పళ్లెం యీ పళ్లెం బళ్లమీదబెట్టి
వెళ్లిందమ్మ ఆ బండి పెద్ద తిరుపతిదాక
... ... ... ... ... ...
ఆకులతో ఈ పూలూ ఆరువేలు
ముచ్చికలతో యీ పూలూ మూడువేలు
తొడిమెలతో యీ పూలు తొమ్మిదివేలు
అన్నీనీకిస్తాను ఆలించవయ్యా,,—ఇది పూజకై పూలప్రసక్తి.

భగవంతునిట్లు పూలతోనర్చించుట పూజాసక్తి. పూజాసక్తినిబట్టి దీపధూప నైవేద్యాది షోడశోపచారములు చేయుట భక్తికి నిదర్శనముగా భావింపబడు చున్నది. దేవతామూర్తిని కల్పించుకొన్న పిదపనే షోడశోపచారములు చేయుట ఆచారమైనది. దేవతార్చనలో పాడెడుపాటలు (మేలుకొలుపులు, మంగళహారతులు) పెక్కు గలవు.

ఎలుక వాహన మెక్కేవయ్యా—ఏకదంతము గలవాడవయ్యా
సాంబశివుని పుత్రుడవయ్యా—స్వామి శ్రీ గణనాయకా
తొండముతో నీళ్లుచీసి—తోరంపు బొజ్జగడిగీ
నిండు మోదముతోనుండు నిర్మలా గణనాయకా

రూపాసక్తికి పైపాట నుదాహరణముగ గ్రహింపవచ్చును. భక్తుడు తన ఉపాసనాదైవము యొక్క రూపమును వర్ణించుటలో మిక్కిలి ఆసక్తిని ప్రదర్శించుచు భక్తి పారవశ్యమున మునిగిపోవుచుండును.

,,గోవిందా గోవింద హరిగోవిందా గోవింద
ఎంచరెండు మూడు ఏకము తత్త్వము
కొంచెమూగాదదీ కొండంతరా
పంచ పంచ కరుణ ప్రకృతివాగ
దించివేయువాడు దేవుడురా హరి,,

,,హరి హరి విఠేల హరిలరంగ విఠేల
పాండురంగ విఠేల పండరినాథ విఠేల
విఠేల విఠేల విఠేల పాండురంగ విఠేల,,*—అనుచు భక్తుడు హరినామ స్మరణతో తనలోతాను మునిగి ఇహమునే మరచిపోవుచుండును. కొందరు అనుక్షణము హరినామ స్మరణగావించుచునే మనుగడ సాగించుచుండుట చూచెదము. స్మరణలో భగవత్పరమైన చిత్తైకాగ్రత కలుగుచున్నది కూడ.

ఆ ఏకాగ్రతలోనే పరమానందమనుభవించుట యొప్పును. భగవంతుని స్వామిగానెంచి యాతనికి దాసుడై సేవలుచేయుట దాస్యాసక్తి. ఏ మార్గము రుచికరముగ తోచినచో నామార్గమున భక్తుడు పరమాత్ముని సేవించుట పరిపాటి.

అన్నమెవ్వరూ బెట్టిరీ రంగ అర్ఘమెవ్వరు జెప్పిరీ రంగ
వన్నెకాడగు వీరపెరివిలివాస శ్రీరంగనాయక
ఆకులెవ్వరు యిచ్చిరీ రంగ పోకలెవ్వరు యిచ్చిరీ రంగ..............
సున్నమెవ్వరు బెట్టిరీ రంగ సురటు లెవ్వరు వేసిరీ రంగ
గంధమెవ్వరుపూసిరీ రంగ గంధొడెవ్వరు రాసిరీ రంగ... .... .... ...
పరుపులెవ్వరు వేసిరీ రంగ పానుపెవ్వరు వేసిరీ రంగ

ఇన్ని సపర్యలు చేయుటలో భక్తుడు నిరంతర మానక్తుడై ప్రభాతమున మేలు కొలుపు పాటనుండి రాత్రి పవళింపు వేళ మంగళహారతులు బట్టువరకును భగవత్కృపకు పాత్రుడు కాదలంచుచుండును. ఎంతటి పాపజన్ములైనను, శూద్రులైనను సర్వేశ్వరునాశ్రయించి సేవించినచో మోక్షము నిశ్చయముగ సిద్ధించును 1.

,,మండలమున ప్రఖ్యాతిగ వెలసిన పండరి పురికే పోవుదమా
పుండరీక వరదుని కన్నుల పండువుగ జూచెదమూ
దాసదాసులకు ప్రీతికరంబుగ దండము లెంతో బెట్టుదిమా
వాసుదేవ పద పద్మంబులనూ వరుసగ నందరు పట్టుదమూ.... .... ....
హరిపురిలో మనమందరు కూడుక ఆనందముతో నాడుదమా
కరుణాకర శ్రీ వేంకట విఠలుని కథలను బాడుచు ఆడుదమా,,

భగవంతుని మీద జానపద భక్తుని కుండెడు వాత్సల్యమునకిది యొక ఉదాహరణముగా జెప్పుకొనవచ్చును. అతనిమీద వాత్సల్యము పెరిగినకొలది

---

1. భగవద్గీత_అధ్యా. 9. శ్లో. 32.

భక్తుడు ఆడుచుపాడుచు మురియును.

"రాత్రి వచ్చిన సాంబమూర్తి వానిమాయ తెలియరాదే ఒసమ్మా
రాతిరతను నాతోగూడి వేదమంత విప్పిచెప్పి
విప్పిచెప్పి తెల్లవారి జూచితె కాశిలోవుండె ఈశ్వరుడాయె ఒసమ్మా
వేసుకొన్న తాంబూలమ్మ వేసుకోమని తానిచ్చిపోయే
వేసిలేచి తెల్లారిజూచితె అడవిలో ఉండె మారేడు దళమాయె ఒసమ్మా
కప్పుకొన్న పచ్చడంబు కప్పుకోమని తానిచ్చిపోయే
కప్పిలేచి తెల్లారిజూచితె వనములోని పులిచర్మమాయె ఒసమ్మా
... .. .... ... ... .. ... ...
వేసుకొన్న చంద్రహారంబు వేసుకొమ్మని తానిచ్చిపోయే
వేసిలేచి తెల్లారి జూచితె కాశిలో రుద్రాక్షమాలాయె ఒసమ్మా
చుట్టుకొన్న జరీరుమాలు చుట్టుకోమని తానిచ్చిపోయే
చుట్టిలేచి తెల్లారి జూచితె పుట్టలోవుండె నాగేంద్రుడాయె ఓసమ్మా

భగవంతుని కాంతునిగా నెంచి అనురక్తయై సర్వావస్థల యందాతనినే పలవరించుట, విరహతప్తయగుట యనునది పై పాటలో వ్యక్తమగుచున్నది. భగవంతునిట్లు తలంచు ఘట్టము లెన్నియో భాగవతాదులలో గలవు. స్త్రీలే గాక పురుషులు గూడ ఆతనిని కాంతునిగ భావించు సందర్భములు లేకపోలేదు.

"ఈశ్వరా పరమేశ్వరా జగదీశ్వరా కరుణించరా
శాశ్వతుడవని వేడితిని విశ్వాసముంచర ఈశ్వరా
ముందుజేసిన పూర్వకృతములు ఇందుబాపుము ఈశ్వరా
పొందుగా మీపాదపద్మము జెందియుంటిని ఈశ్వరా
కపటవిద్యలు నేర్చి పొట్టగడుపుచుంటిని ఈశ్వరా
నెపములెన్నక నన్ను నీకృపనేలుమీ పరమేశ్వరా
ఆరుగురు శత్రువులునాపై క్రూరమెంచిరి ఈశ్వరా

పరమ మంత్రముచేత శత్రుల నణచవలె పరమేశ్వరా
తొమ్మిది ద్వారముల కొంపిది నమ్మనేటికి ఈశ్వరా
బొమ్మలాట పాలుజేసి బ్రోవకుంటివి ఈశ్వరా
మూడుగుణములు విడువజాలక మోసపోతిని ఈశ్వరా
వేడ్కతో నీమాయ దాటనుపాయమేదో ఈశ్వరా
చంకదుడ్డెమ కింకరులకు జంకనేర్వను ఈశ్వరా
అంకమందున జేర్చి సద్గురు శంకజీర్చర ఈశ్వరా,,

ఇందులో భక్తుడు తానుజేసిన పాపపుణ్యములను నివేదించుకొనుట జరిగినది. దీనినే ఆత్మనివేదనాసక్తి యందురు. తనను తాను భగవంతుని ముందు ఏకరుపుపెట్టుకొనుట అవశ్యకర్తవ్యము. పాపములు జేసితినని పశ్చాత్తాపము జెంది క్షమాభిక్ష వేడుకొనుట భక్తుని చిత్తనైర్మల్యమునకు నిదర్శనమగుచున్నది.

భజించుటలో తన్మయుడగుటకు పరమానందమే మూలము. ,,పరమానందమే రామభజన—నిత్యానందమే రామభజన—హృదయానందమే రామభజన బ్రహ్మానందమే రామభజన,, భజనలలో, కోలాటములలో జానపద భక్తులు పొందెడు తన్మయము చూపరులను సహితము ముగ్ధులను గావించును. తన్మయావస్థయే భక్తికి పరాకాష్ఠయనవచ్చును. ఇట్టి వివిధ పౌరాణిక దేవతా భక్తి రూపములేగాక వారిలో భయమునుండి భక్తి ఏర్పడుటకు గ్రామదేవతారాధన ప్రబల సాక్ష్యముగానున్నది. నిత్యజీవితములోని నూతన సమస్యలనుండి కడ తేరుటకై పల్లీయులు, వారి ఊహాకల్పితమైన గ్రామదేవతలను రూపొందించుకొని పూజించుచుందురు. ప్రతి విషయమునకు గ్రామదేవతలే శరణ్యము. గ్రామదేవతార్చనలో వారి భక్తి అమాయకమైనట్టిది. ఏకైక విశ్వాసముతో గూడి యున్నట్టిది. ప్రకృతికి చేరువలో నుండిన ప్రాక్తన మానవుని తత్త్వము మిగిలి యున్నట్టిది. ఇట్టి భక్తి విధానమును గూర్చి ఆచారవ్యవహార స్వరూపమునందు చర్చించుటయగును.

## వినోదములు

వినోదములు శారీరక మానసిక వికాసములకు దోహదములు. శారీరకమైన చురుకుదనము, మానసికోల్లాసము పెరుగుటలో ప్రయోజనప్రదములు. వానివలన అవయవాభివృద్ధి, బుద్ధి స్థిమితము చక్కగా నేర్పడుచుండును. వ్యక్తి నింకొక వ్యక్తితో ముడివైచుట యందలి స్నేహప్రదములు. వ్యవహారజ్ఞానవిలసితములు. వారసత్వ స్థాపకములు. సామాజిక జీవన పౌష్టికములు. జాతీయ జీవన సంరక్షకములు.

తెలుగుజాతి పుట్టినప్పటినుండి రూపొందించుకొన్నట్టి వినోదములెట్టివో తెలిసికొనవలెనన్న పల్లీయులను దర్శించవలెను. వేయి సంవత్సరములనుండి నిర్మితమగుచు వచ్చిన ప్రాచీన తెలుగు సాహిత్యమందు పేర్కొనబడిన వినోదములెన్ని విధములో మనమెఱుగకపోలేదు. పాల్కురికి సోమనాథుడు తన గ్రంథములందు దడవిన వినోదములలో కొన్ని నేటికి నామమాత్రములైనను మరికొన్ని యించుమించుగా పల్లీయులలోనే చూడగలము. వినోదములలో ఆటపాటలు చేరియుండును. ముఖ్యముగా వారి ఆటలందు పాటలు గలిసిపోయి యుండును. ఆటననుసరించి పాటయో లేదా పాటననుసరించి ఆటయో రూపొంది నట్లుండుట సహజము. పిల్లలకును పెద్దలకును ప్రత్యేకమైన వినోదములుండి నప్పటికిని, వీరివి వారికిని, వారివి వీరికిని ఆనంద దాయకములే. పిల్లలకు సంబంధించిన కుటుంబ పరిమితమైన కొన్ని వినోదములను ద్వితీయ ప్రకరణములోనే తెలిసికొనియుంటిమి. కుటుంబదశానంతరము సమాజమున పిల్లలకు ఇరుగుపొరుగు పిల్లలతో పరిచయమేర్పడుటకు, సంఘీభావము కుదురుటకు సంబంధించిన కొన్నివినోదములను, ఆ తదుపరి పిల్లలు పెద్దవారైన దశలో వర్తించెడు కొన్ని వినోదములనిట తెలిసికొనుట జరుగును. ఆటలలో నాయా ప్రాంతీయమైన సూక్ష్మభేదములు కన్పించినప్పటికిని మౌలికత మాసిపోదు.

## బాలుర ఆటలు:- కోతికొమ్మచ్చి

,,కోతికొమ్మచ్చిఆడుదమా – కోరిపసంబుల జేరుదమా,, అనుచు దాదాపుగ పదిపంద్రెండుగురు ఇరుగుపొరుగు బాలుర కలిసి ఊరివెలుపల చేరువలో నున్న వనములోనికిబోయి ఎక్కుటకు, దుముకుటకు, వీలైన కొమ్మలు రెమ్మలుగల ఒక చెట్టునెన్నుకొని ఆటనారంభింతురు. ఊరి వెలుపల చెట్టు లేకున్నచో ఊరిలోనే ఒక చెట్టు నెన్నుకొని కూడ ఆడుదురు. కోతులవలె కొమ్మలెక్కి ఆడుటవలన నీ యాటకు ,,కోతికొమ్మచ్చి,, యనుపేరు వచ్చినది. హిందీలో దీనిని ,,ఝూక్ బందర్,, అనిపిలుతురు. ఆట ఆరంభించుటకు ముందు, బాలురంత గుండ్రముగ నిలిచి చేతులను ( ఒక్కొక్క చేతిని మాత్రమే ) ముందునకు చాచెదరు. ఆటపెద్ద (ఆటలో పెద్దయైన వాడు) ,,ఉడుము–తడుము తత్తళ–పిత్తళ–ముక్కా–చెక్కా–పాలు–పిరంగి – లాబ్మె – లాబ్మె–చెల్,, అనుచు గాని, ,,ఉసిరికాయ–ఊరుబిండె–లవ్వో–లాటో–చెంచో–బై టోటాంగు టూంగు–తుమ్మళ్ల పెద్దమ్మ తుసుక్కు,, అనుచు గాని, ,,అగ్గిపెట్టె–గిగ్గిపెట్టె టాంగు–టూంగు–తుమ్మళ్ల–పెద్దమ్మ–తుసుక్కు* అనుచు గాని, ఒక్కొక్క మాట కొక్కొక్కని చేయిని తనవ్రేలితో తట్టు చుండును. ఇట్లు తట్టుటలో చివరికి ,,తుసుక్కు,, అనుమాట ఎవనిచేతిని తట్టునప్పుడందురో ఆట్టి వాడా గుంపునుండి ప్రక్కకుబోయి నిలబడును. ఇట్లే పంతు ప్రకారముగ ,,తుసుక్కు,, అనిపించుకొన్న వారొకరి తదుపరి ఇంకొకరు ప్రక్కకు జరుగుదురు. ఎవడైన చిట్టచివరికి మిగిలి ,,తుసుక్కు,, అనిపించుకొనునో వాడు ,,దొంగ,,గా నియమితుడగును. ఇదీపద్ధతి స్కాట్లండులోని Fife-clackmannan, Kinross ప్రాంతములందు పిల్లల ఆటలలోగలదు.

Counting out Rhyme-Dollas:

Zeeny, meeny,-Feg, tae, beg
Deil's dirt-Dimmy, neg

Zan-Pan, Spin a rock-Zan Pan Toosh 1.

,,ఉడుము_తడుము_తత్తళ_పిత్తళ_ముక్కా_చెక్కా_పాలు_ఫిరంగి-లాబ్మె లాబ్మెచెల్,, అనుదానిలో చివర ,,చెల్,, అనిపించు కొన్నవాడు గుంపునుండి ప్రక్కకు తప్పుకొనవలెను. ఇట్లుగానే స్కాట్లండులోని పై ప్రాంతములో గూడనున్నది.

"Irka birka stoory rock
Ann tan tcosy jock-you stan oot" 2.

,,దొంగ,, ను నియమించుటకు ఏర్పడిన పై విధానము పెక్కు ఆటలలో గూడ ప్రవేశించుచున్నది. ఈ యాటలో చెట్టుక్రింద గుండ్రముగా గీటుగీచి అందులో నిలబడి ఆట పెద్ద ఒక మూరెడు పొడవుగల సన్నని వెదురు కఱ్ఱను లేదా మరేదైన కఱ్ఱముక్కని తీసికొని, ఒక కాలును కాస్త పైకి లేవనెత్తి దాని క్రిందినుండి దూరముగా పడునట్లు బలముకొలది విసరివేయును. దొంగగా నియమితుడైన వాడు ఆ కఱ్ఱను తీసికొనివచ్చుటకు పరుగెత్తు చుండ, ఆటలో పాల్గొన్నవారంత చకచక చెట్టు ప్రాకి కొమ్మలమీద కూర్చుందురు. దొంగ ఆ కఱ్ఱనుదెచ్చి గీటిలో బెట్టి కొమ్మలెక్కిన వారిని ముట్టుకొనదలచి చెట్టు ప్రాకుచుండును. అట్లు ప్రాకు చున్నప్పుడు కొమ్మల మీదున్న వారు వండ్లికిలించుచు, వెక్కిరించుచు, పకపక నవ్వుచు ఒక కొమ్మనుండి ఇంకొక కొమ్మకు తప్పుకొనుచుందురు. ఇట్లు తప్పుకొనుచున్నప్పుడు దొంగ వచ్చి ఎవరినైన తట్టినచో అతడు దొంగ యగును. ఆ లోపున ఎవడేని క్రిందికి దుమికి దొంగకు చిక్కకుండ కఱ్ఱను బట్టుకొని తిరిగి కాలిక్రిందుగా విసరివేయుచుండ కొమ్మలమీది వారిని దొంగ ముట్టుకొనగూడదు. కాని క్రిందికి వచ్చి విసరివేయు వానిని విసరునప్పుడు తాకినచో వాడు దొంగ కావలసియుండును. లేదా అట్లు తాకలేకపోయినచో మరల ఆ కఱ్ఱను దెచ్చుటకు దొంగ పరుగెత్తవలెను. ఇట్లే తిరిగితిరిగి తీవకాశమునుబట్టి

1. J. E. Simpkins: County Folk Lore Vol. VII P. 337
2. J. E. Simpkins: County Folk Lore Vol. VII P. 186

ఆడుకొనుట జరుగును. ఈ యాటవలన బాలురకు పరుగెత్తుటలో చెప్పెక్కుటలో నై పుణ్యమలవడుచున్నది. ఈ యాటను బాలికలు గూడ ఆడుదురని ఈ క్రింది పాటవలన దెలియుచున్నది.

,,తరువుల చాటున దాగుదము—కోతికొమ్మచ్చి ఆడుదము
కొమ్మల చాటున దాగుదము—తియ్యని గంధము తీయుదము
బాలిక మెడలకు పూయుదము,,

## తుడుంగు:-

దీనిని ,,ఉడుము తుడుము,, అనికూడ పిలుతురు. ఇందులో గూడ బాలు రెందరైనను పాల్గొనవచ్చును. ఆటలో ,,దొంగ,, నెన్నుకొను పద్ధతి ప్రకారము ఒకడు దొంగ యగును. పాల్గొనువారిలో నొకడు లేదా ఆటపెద్ద చుట్టు పట్టుల నున్న ఒక చెట్టు ఆకును తెమ్మని చెప్పగా ఆ దొంగ దానిని తెచ్చుటకు పరు గెత్తును. మిగిలిన వారందరుపోయి తమకు తోచిన తావున ఒకవైపున దొంగకు కనిపించకుండ దగి యుందురు. ఆకు పట్టుకొని వచ్చి వెదకుచు వెదకుచు నెవరినేని యొకరిని ముట్టుకొని ఆకును చూపించుచు ,,తుడుంగు—తుడుంగు,, అని కేకలు వేయుచుండ, దాగియున్నవారందరు పరుగెత్తుకొని వచ్చి గుమి గూడుదురు. అట్లు ముట్టుకొనబడినవాడు పై మాదిరిగనే చెప్పిన ఆకును తెచ్చుటకు పోవును. తిరిగి తిరిగి ఆటనెంతసేపైనను ఆడుకొనవచ్చును.

## చిరుతబిల్ల :-

దీనిని చిర్రగోనె, ఛిత్రబిళ్ల, చిటుతబిళ్ల, గూటీబిళ్ల, గోటిబిళ్ల, గోడుబిళ్ల బిళ్లంగోడు, (హిందీలో గిల్లీడండా) అని యందురు. కొద్దిమాత్రమిది క్రికెట్ ఆటతో పోలుననిపించును. సంస్కృత భారతకాలమ్మునకే వీటాఖేలన మనుపేర

చిఱతబిల్ల ఆటగలదు 1.

రెండు కొనలు మొనలు దేరునట్లు చెక్కబడిన 4, 5 అంగుళముల పొడవుగల ఒక కర్ర (దీనినే గిల్లి, చిర్ర, చిఱుతలనవచ్చును), ఒక వైపున మొన దేరునట్లు చెక్కబడిన సుమారు మూరమీద బెత్తెడు పొడవుగల మరియొక కర్ర (దండము, గోనె) ఈ యాట కుపకరించు సాధనములు. సాధారణముగ ఈ యాటను విశాలమైనచోటనే ఆడుదురు. ఏలన, చిర్రను గోనెతో ( గిల్లిని దండతో ) చిమ్మినప్పుడు దారినబోవు వారికి తాకినచో ప్రమాదమగును. ఆటలో పాల్గొను బాలురు రెండుద్దులు (రెండు పక్షములు)గా విడుపడి చిన్న నియమమును బెట్టుకొని, ఒక ఉద్ది వారు ఆట మొదలు పెట్టెదరు. ఆరంభించు వారిలో మొదట నొకడు మూడంగుళముల పొడవు, ఒక అంగుళము లోతుగల గుంటను (బద్ది) త్రవ్వి, గిల్లిని దానిమీద అడ్డముగబెట్ట గుంటలో దానినానుకొని యుండునట్లు దండనుంచి, ఎడమచేత పట్టుకొని కుడిచేత వెనుకవైపున గట్టిగా తట్టుచు చిమ్ముచుండును. చిమ్మినప్పుడ దండ మాత్రము జారిపోకుండ ఎడమచేతి యందుండవలెను. రెండవ పక్షము వారిట్లు చిమ్మ వాని కెదురుగ కొంతదూరమున నిలిచి, చిమ్మబడిన గిల్లిని పై పైన గుప్పిట పట్టుకొన ప్రయత్నింతురు. ఒకవేళ పట్టుకొన్నచో చిమ్మువాడోడినటుల భావింపబడును. పట్టుకొనలేకపోయినచో చిమ్మువాడు దండను గుంటలో నిలబెట్టుటయో లేదా గుంటకు మూరెడు దూరములో పడవైచుటయో చేయును. అట్లు పెట్టిన తర్వాత

---

1. ,,క్రీడంతో వీటయా తత్రవీరాః పర్యచరన్ ముదా
   పపాతకూపే సావీటా తేషాం వై క్రీడతాం తదా,,
   వివరణ:_వీటయా యవాకారేణ ప్రాదేశమాత్రకాష్ఠేన
   యత్ హస్తమాత్ర దండేన ఉపర్యుపరి కుమారాః ప్రాక్షిపంతి
   -భారతము:-ఆదిపర్వము-త్రింశదధిక శత తమోధ్యాయము. శ్లో. 17

రెండవ పక్షము వారు గిల్లిని ఆ దండకు తగులునట్లు విసరినచో చిమ్మువాడోడినట్లే లెక్క. తగులకుండగను గూడ ఆ గిల్లి గుంటకు దగ్గరలో దండ పొడవు మారమున పడినను ఓడినట్లే యగును. ఒకవేళ అది దండకు తగులకుండ గుంటకు దూరముగా విసరివేయబడినచో ఆ చోటునుండి గిల్లిని తగినంత పైకి దండతో నెగురమీటి కొట్టుట జరుగును. తిరిగి యట్లే మరి రెండు మారులు కొట్టుట యగును. ఆ తర్వాత కొట్టిన స్థలము నుండి యెన్ని లాలలగునో ఊహించి చెప్పుట పొసగును. దండతో ఏడు మారులు కొలిచెడు కొలమానమునకు 'లాల'అని పేరు. చిమ్మువాడు చెప్పినది యనుమానముగ ఎదుటి పక్షము వారికి తోచినని వాడు వెంటనే కొట్టిన స్థలము నుండి దండతో ,,ఏకీపామ్-సాతీపేడ్ ముర్రామూడు-నల్లింగోడు-ఐదురకన్ను-ఆరేగన్ను-ఏలంగ్‌చిక్క,,* అనియో ,,ఒంటీకాలు-చిటమటాల్-మూడోముచ్చి-నాల్గోనక్కి-ఐదోపెద్ది-ఆరోకన్ను ఏడోపొల్లు,, అనియో, ,,బోడికొడితే కండు-రుళ్ళ-ముళ్ళ-నాలగలి-ఐదిలి ఆరిడి, ఉల్లి,, అనియో పాడుచు గిల్లి పడియున్న చోటువరకు కొలుచుచుండును. పై పాటలో గుణింతమేడువరకే చెప్పబడినది. ఇట్లు కొలుచుచున్నప్పుడు పలుకు మాటలకు తగిన విధమున రెండవ ఉద్దిలోనివారు హేళనగా మారు బలుకుట పొసగును. ఒకవేళ చెప్పిన ప్రకారము కొలత తక్కువైనచో వాడోటమి నంగీకరించి ప్రక్కకు తప్పుకొనును. ఇదేవిధముగ ఆటలోని సంఖ్యాగణన పద్ధతి Fife Clackmannan మరియు Kinross ప్రాంత మండలి ఆటలలో గన్పించును 1. సాధారణముగ పిల్లల ఆటలలోని ఇట్టి పాటలలో చాలవరకు శబ్దము లర్థ విరహితములై, కేవలము లయబద్ధములై యొప్పుచుండును.

---

1. Kirkcaldy:- Wonery, twoery, tickery, seven- Alibi, Crackaby ten and eleven- pin, pan musky, dan- tweedle um, tweedle um, twentywan- Cerie Orie, Orie You are out-
-County Folklore Vol. VII. P. 187

పై ఆటలో మొదట ఓడిన వాని తర్వాత ఆ ఉద్దిలోని మిగత వారంద రిట్లే ఆడుచుందురు. వీరంత ఓడిన పిదపనే రెండవ పక్షమువారు మొదటి ఉద్ది లోనివారివలె చిమ్మట నారంభింతురు. ,,ఓనమాలు—కక్కాలు ఓడినదొంగ పాటిమీద కొంగ—కూతెట్టిపోయి—లాలా—అర్దా—లాక్కురా—మిదక్కురా—గూటీ బిళ్ల—ఘూబొడ్డు,, అనుచు మొత్తముమీద ఓటువడిన పక్షమువారిని ముందుకు నడుపుచు, వెనుకనుండి దండతో గిల్లిని గెలిచిన పక్షమువారు ఒకరి తర్వాత ఒకరు మీటుచు కొట్టుచు పోవుచుందురు. మీటునప్పుడు కొట్టలేనివారు తిరిగి మీటుటకు వీలులేదు. ఇట్లెంత దూరము కొట్ట గలిగి యుందురో అంతదూరము నుండి యెదుటి పక్షమువారు పరుగెత్తుచు కూతబట్టుకొని గుంట (బద్ది) వద్దకు ఒకరి పిమ్మట మరియొకరు రావలసి యుండును. కూత మరచినచో తిరిగి పట్ట వలసి వచ్చును.

కన్ను, ముక్కు, భుజము, చేయి, కాలు మొదలగు వానిమీద గిల్లిని ఉంచుకొని యెగురవేయుచు దండతో కొట్టుచు కొంచెము భేదముగా నిదే యాట ఆడుదురు. ఒక పక్షములోని వారొకరి తరువాత ఒకరు అట్లెగురవైచి కొట్టు చుండ రెండవ పక్షమువారు దానిని క్రింద పడకుండ చేతులలో పట్టజూతురు. పట్టుకొన్నచో కొట్టిన వానికి ఓటమి కలుగును. అదిచేయజాలక పోయినప్పుడు కొట్టినవారు దండను గుంటమీద నిలువుగ పడవేయును. ఎదుటి పక్షమువారు దండకు తగులునట్లు గిల్లిని విసరివేయుదురు. అది తగులకుండ గుంటకు దండ పొడవులోపున పడినచో గూడ ఓటమియే యగును. ఒకవేళ దూరముగబడినచో మూడు మారులు మీటుట, కొట్టుట జరుగును. ఇంతకుముందు మాదిరిగనే ఓడినవారు కూత పట్టుట నియమము.

## గోటీలు (గోలీలు):-

సాధారణముగ ఇది రెండు విధములుగ ఆడుదురు. ఒక విధమందు

మాత్రము రెండు గోటీలే వాడుదురు 1. అందులో పెద్ద దానికి తాతకాయ, చిన్నదానికి పిల్లకాయ అనిపేర్లు. ఇద్దరు లేక అంతకంటె నెక్కువమంది పాల్గొనవచ్చును. కాని ఆడునప్పుడు మాత్రమిద్దరేసి చొప్పున ఆడవలసియుండును. చిన్న నియమ మేర్పరచుకొని దాని ప్రకారము ఒకడు తాతకాయ, ఇంకొకడు పిల్లకాయను తీసికొని సుమారు మూడంగుళముల లోతు, జెత్తెడు వెడల్పుగల గుండ్రని గుంట (బద్ది) నొకటి త్రవ్వి, ఆ గుంటకు సుమారు 15 గజముల దూరమున నిలిచి ఆట నారంభింతురు. పిల్లకాయను తీసికొన్న వాడా కాయను తొలుతగుంటపై పునకుతగిన వేగముతో జారవిడుచును. జారవిడుచుటలో గోటీకాయ గుంటలో పడినచో వాడు పందును (గెలుచును). ఎవరికాయ గుంటలో పడదో వాడు మరియొకనితో ఆడుట జరుగును. లేదా ఇద్దరికాయలు గుంటలోనే పడినచో మరి యిద్దరు వచ్చి ఆటనారంభింతురు. ఒకవేళ జారవిడిచినప్పుడు మొదటి కాయను రెండవవాని కాయ వచ్చి తాకినచో వెంటనే ,,కీలుమాలు తూకాయ జాడీజాగ సరీసాట్,, అనును. అనగా మొదటివాని కాయను తాకుచు దాని యంచుననే రెండవ వాని కాయ పడినచో ఆ మాటకిటుకు ననుసరించి జెత్తెడు దూరమునకు జరుపుకొని ఆడుటకువీలగును. లేనిచో పొరపాటుగా

1. గోటీ కాయల ఆటలో దాగిన తాత్త్వికవాసన యెట్టిదో గమనింపదగును. తాతకాయ = పరమాత్మ. పిల్లకాయ = జీవుడు. బద్ది (గుంట) = నిశ్చల తత్త్వము. పిల్లకాయ అను జీవుడు మాటిమాటికి నిశ్చల తత్త్వమను బద్దిని చేరుటకు ప్రయత్నించుచుండును. బద్దిని చేరలేకపోయినచోనది పరమాత్మను (తాతకాయను) తాకుటకై యత్నించబోవు నప్పుడెల్ల దానికి కర్మరాహిత్యమగు నంతదాక తన్నుజేరకుండ తాతకాయ పిల్లకాయను నెట్టివేయుట జరుగును. కర్మబంధవిమోచనమగునంతవరకు పిల్లకాయ పదేపదే తాతకాయను తాకుచు తుదకు బద్దిలో పడును. అప్పుడు ఆటకట్టును. అనగా విముక్తి ప్రాప్తించినదని భావము. ఇట్లే చిఱుతబిల్ల, ముక్కుపుల్ల, బంతి పంటి ఆటలను అన్వయించు కొనవచ్చును.

గ్రహింపబడును. ఇద్దరి కాయలట్లు గుంటలో బడక, దానికెవరికాయ దగ్గరలో నుండునో వాడు మొదట ఆట మొదలిడుట తటస్థించును. వాడెడమ చేతి బొటనవ్రేలును భూమి మీద పూనిచి మూడవ వ్రేలు మీద కాయను కుడిచేతి వ్రేళ్లతో బిగబట్టి గుంటలోబడునట్లు గాని, రెండవకాయకు తాకునట్లు గాని విడుచును. ఆ తదుపరి తనకాయపోయి నిలిచినచోటు వరకు నియమము ప్రకారముగా బెత్తలతో ఏబదియో, వందయో గుణింతము చేయును. గుణింతములో నెవడు మొదట అనుకొన్నవరకు చేయునో వాడు పండును. మిగిలిన వానితో మరి యొకడు వచ్చి వానినుండి తాతకాయను తీసికొని వానికి పిల్లకాయ నిచ్చి యెప్పటివలె ఆడుట జరుగును. చిట్టచివరికెవడు మిగిలి యోడునో వాడు గెలిచిన వారందరికి ఆట పెట్టుచుండును. అనగా నొకని తర్వాత నొక్కడు తాతకాయను గుంటమీద బెట్టి కూర్చుండును. ఓడినవాడు పిల్లకాయను తీసికొని 15 గజముల దూరము నుండి తాతకాయకు తగులునట్లుగనో గుంటలో బడునట్లుగనో జారవిడువవలెను. అట్లుకాని యెడల జారవిడువ బడిన కాయను గుంట మీదున్నవాడు పిల్లకాయను తాతకాయతో నెన్నిమారులు కొట్టుటకు వీలగునో అన్నిమారులు కొట్టి విడుచును. అప్పుడా యోడినవాడు తన పిల్లకాయ పడియుండిన చోటునుండి గెలిచినవాడు చెప్పినట్లు మూరతోగాని, చేతివ్రేలుతో గాని దానిని గుంటలో పడవేయునంత వరకు డోకు (దేకు) చుండును. ఈ యాటకు చాల సమయము పట్టుచుండును. ఓడినవానికి మాత్రము మిక్కిలి శ్రమ గలుగుట తథ్యము.

ఇంకొక విధముగ నాడునప్పుడు ఐదారుగురొక్కమారే ఆటలో పాల్గొన వచ్చును. పాల్గొన దలచినవారు రెండేసి చొప్పున గోటీకాయలను తెచ్చుకొని ఒకటి చేతిలో నుంచుకొని మరొకటి గిజిమీద ఉంచుదురు. ఆ పిదప అందరు కలిసి సుమారిరువది గజముల దూరమున నిలబడి ఒకరివెనుక నొకరు గిజిమీద పేర్చబడిన గోటీల చెంతకు చేతనున్న గోలీలను జారవిడుచుచుందురు. జారవిడుచుటలో నెవరికాయ ముందరబోయి పడునో వాడాటమొదలు పెట్టి

గిజీ మీది కాయలను వరుసగా కొట్టుకొనుచువచ్చును. ,,సోప్సనకాము కాల్ అదూల్ బెదూల్ పేర్ బనాస్ ఛట్ ఫట్ కాసుకో,, అనుచు నిలబడి జార విడిచిన చోటును చేర్చుచుండును. అట్లు చేర్చబడిన దానిని ,,పిల్ల,, అందురు. మొదట చేర్చబడిన కాయలను మిగిలిన వారు దెచ్చి గిజీమీదనున్న వానికి ఇంచుక ఎడముగానుంచెదరు. కాయలను కొట్టువాడు వీనిని తాకకుండ తక్కిన కాయలను కొట్టవలెను. ఒకవేళ వానికి తాకినచో వాడోటమి నంగీకరించి ప్రక్కకు తప్పుకొనగా మిగిలిన ఆటగాండ్రు మొదటివానివలె నాడుదురు. ఇట్లాడుటలో నెవడెక్కువ కాయలను గిజీమీదినుండి జారవిడుచు స్థలమునకు చేర్చునో వాడు గెలిచినవాని క్రిందికి లెక్క. అప్పుడువాడు గిజీమీద కాయపెట్టుకొని కూర్చొనగా తక్కిన వారొకరి పిదప నొకరు వాని కాయకు తగులునట్లు జారవిడుతురు. అది తాకని పక్షమున దేకుచుండుటను చేయుదురు. ఇంకను కొద్ది భేదములతో గూడ ఆడుటయును గలదు.

బొంగరము:-

బొంగరమాట కూడ మిక్కిలి ప్రాచుర్యము వహించిన ఆటయే. చూపరులకు అది వినోదదాయకమైనది. సర్వసాధారణముగ వానకాలమునకు కొంచెము ముందునుండి రెండు మాసములవరకు ఆడుచుందురు. ఎంతమంది యైనను ఆడవచ్చును. గాని, కనీసమిద్దరును, ఎక్కువకంటె ఎక్కువ యెనమండుగురును కలిసి యాడుచుందురు. రకరకములైన బొంగరము లాయా పనితనమునుబట్ట చెక్కతో చేయింతురు. రంగులచేతను, ఉపరితలమున నిత్తడి బిల్లల చేతను అలంకరింపింతురు. దాని యాకారము త్రిభుజాకారముగా నుండి ఇనుపములికి అమర్చబడి యుండును. ములికినుండి దాని యుపరితలమంతయు సన్నని త్రాడుతో చుట్టబడి, వెలుపలికొన కుడిచేతి వ్రేళ్ల సందున నిరికించబడి యుండును. బొంగరము నేలపై విసరునప్పుడు త్రాడు చేతిలోనే యుండిపోవును. బొంగరము మాత్రము నేలపైబడి గిరగిర తిరుగుచుండును. ఒక్కడు కూడ

ఆడుకొనవచ్చును. కాని, అంత ఉత్సాహముండదు. కనుకనే కొందరు బాలురు కలిసి చిన్న నియమము నేర్పరచుకొని దాని ప్రకారమొకరిని „దొంగ„గా నియమించి వృత్తాకారముగ గిఱిగీచి వాని బొంగరమునందులో పడవైచి తక్కినవారు దానిపైన బొంగరమును విసరుచు „చిలుకు చిలాట్ ములుకు ములాట్ పావుసేర్ అద్దాసేర్ సవ్వాసేర్ గువ్వాదెబ్బ చూసుకో„ అనుచు నేవేవో మాటలు పలుకుచుందురు. విసరునప్పుడు బొంగరములు నేలపై తిరుగుచనే యుండును. అప్పుడా దొంగ తిరుగుచున్న బొంగరములలో నేదేనియొకదానిని తన యరచేతిలోనికి పట్టవలెను. అట్లు చేయుచున్నప్పుడు బొంగరములను త్రాడుతో పైకి తీసికొనుట గూడ జరుగును. అరచేత తిరుగుచనే యుండినచో పట్టుబడినవాడు దొంగ యగును. పూర్వమువలెనే వీని బొంగరము గిఱిలో పెట్టబడును. ఒక్కొక్కమారు గిఱి యందలి బొంగరము పగిలిపోవుట గూడ తటస్థించును. ఈ యాటవలన బాలురకు గురి యలవడును. ఒక్కొక్కమారు పోటీపడి ఒకరినిమించి యొకరు „గిరగిర తిరిగే బొంగరం—జరజర జరిగే బొంగరం—రంగు రంగుల బొంగరం—ఉంగరమ్ముల బొంగరం—చేతికొలది విసరినన్—మ్రోతపెట్టి తిరిగెడున్—గిరగిర తిరిగే బొంగరం జరజర జరిగే బొంగరం„ అనుచు పాడుచు దూరముగా బొంగరములను విసరు చుందురు. విసరినప్పుడెవనిది ముందుగాబడి తిరుగుచుండునో వాడు గెలిచినట్లు భావింపబడును. ఈ యాటకూడ ఆరుబయటనే ఆడవలసి యుండును. లేనియెడల సమీపమందున్న వారికి చాల ప్రమాదము సంభవించును. ఆడరానివారాడినచో వారికే ముప్పు వాటిల్ల గలదు. బాలచంద్రుడీ యాటనే యాడు చుండగా దారిన బోవు ఒక వనితకు తగిలిన విషయము విదితమే గదా!

ఈ యాటలేగాక బంతి, కర్రగానుగ, ఈత, గాలిపటము. ఉప్పుగిర్ర, చెడుగుడు, కోలాటము, పులి—మేక, లోలో తిమ్మప్ప వంటి ఆటలనేకమాడుచు బాలురు వినోదమందెదరు. ఆటలేగాకుండ, ఆకసమునబోవు పక్షులను జూచియో

దారినబోవు వ్యక్తులనో లేదా వారికంట ప్రత్యేకముగ జిక్కిన వారినో గూర్చి వేళాకోళముగా పాడుకొనుచు మురిసిపోదురు. ఇంటిపై బారులుకట్టి కొంగలు విహరించుచున్నప్పుడు చూచి పిల్లలు గోళ్లు కనిపించకుండ మూసికొని పిడికిళ్లు బిగించి, ఒక పిడికిలి మీదుగ నింకొక పిడికిలిని వేగముగ త్రిప్పుచు ‚‚కొంగమ్మ కొంగమ్మ గూట్ల రూపాయ—కొంగమ్మ కొంగమ్మ గూట్ల రూపాయ,,* అనియో, ‚‚కొంగ కొంగ పువ్వెయ్యే—దేవునిగుళ్ళో దెచ్చెయ్యే—రాయిచెట్టుమీద రప్పెయ్యే—తెల్లబియ్యమా—పచ్చబియ్యమా,, అనియో పాడుచుందురు. ఇట్లు పాడుచు చివరి చరణమును ప్రశ్నగా బలుకరించుకొని అందరు తమ పిడికిళ్లను విప్పి చూచుకొనుచుందురు. కొంగలవంటి తెల్లనిరంగుచుక్కలు గోళ్లమీదపడి యుండును కాబోలని వారు విశ్వసించి గోళ్లను చూచుకొనుట జరుగుచుండును. అది వారి విశ్వాసము.

‚‚చన్నంపల్లి సాయబు—సాయబు కున్నది గడ్డము
గడ్డానికున్నది గరక—గుర్రమొచ్చి పెరక
లబలబ మొత్తుకొని వురక,, అనిగాని—

‚‚పంతులు పంతులు పయ్యెక్కే—పంతులుపెండ్లము జుట్టెక్కే,,*అనిగాని

‚‚బ్రాహ్మడుబ్రాహ్మడు బెడ్డముక్క—బ్రాహ్మడి పెండ్లం సుద్దముక్క,,—

అనిగాని, ఆయా సంబంధములనుబట్టి హేళన జేయుచు, చేతులు చరచుచు ఆనందింతురు. ఏజాతిలోనైనను పిల్లల మనస్తత్త్వమిట్లే యుండును. స్కాట్లండులోని Fife మొదలగు ప్రాంతములలోని పిల్లలు భుజములమీద చేతులు వైచుకొని—

"Bubby Jock, Your wife's a witch
She's gaun to be burnt the morn
... ... ... ... .... .... ...." అనిపాడుచు

వీధులలో తిరుగాడు చుందురు 1.

## బాలికల ఆటలు:- ముక్కుపుల్ల

ముక్కుపుల్ల ఆటను దూదుంబుల్ల అనియును అందురు. సన్నని ఇసుక గలచోటచేరి బాలికలిద్దరభిముఖులై కూర్చుని మధ్యన దాదాపు గజము పొడవుగ, కాలుమందముగ ఇసుకతో కట్టజేసి, ఆట మొదలిడుటకు నిర్ణయము చేసికొన్న తదుపరి వారిలోనొక బాలిక ఆమట్టి కట్టను సమమట్టము చేయును. అప్పుడు రెండవ బాలిక అంగుళమున్నర నిడువుగల సన్నని కట్టెపుల్లను బొటనవ్రేలు మరియు చూపుడువ్రేలుతో పట్టుకొని మొదటి బాలికకు గన్పట్టకుండ చకచక ఆ మట్టి కట్టలో నొకచోట దూర్చి చెదరిన మట్టిని చేతులతో సరిచేయుచు ,,ముక్కుపుల్లవాయె—ముక్కుపుల్లవాయె — ముక్కు సిన్నవాయె — ముక్కు సిన్నవాయె,,* అనియో, ,,దూదుంబుల్ల—దుక్కుంబుల్ల—పాపిడిపుల్ల—పందుంబుల్ల,, అనియో పలికి గమ్మున నూరుకొనియుండును. అప్పుడు మొదటి బాలిక పుల్లదూర్చబడిన చోటునినుమానించి యచ్చట వెంటనే తన కుడిచేతి వ్రేళ్ళ సందున ఎడమచేతి వ్రేళ్ళ నిరికించుకొని ఆ చేతులను బోర్లించిపెట్టును. రెండవ బాలిక మొదటి బాలిక చేతులు గప్పినచోటును మాత్రమే విడిచి అటునిటు తక్కిన భాగమంత వ్రేళ్ళతో మట్టిని కెలికి వెదకును. ఒకవేళ తానుదాచిన పుల్ల తనకే దొరకినచో తానొకసారి గెలిచినట్లుగా తొడమీదనో, ప్రక్కచోటు మీదనో గుర్తుగానొక గీతగీచుకొనును. పుల్లను ,,కోడి,, యనియును, గెలిచినప్పుడు గీచుకొను గుర్తును ,,గుడ్డు,, అనియును పిలుతురు. ఒకవేళ పుల్ల తనకు దొరకక, ఆ మొదటి బాలిక చేతుల క్రిందనే యున్నచో అప్పుడా బాలికయే గెలిచినట్లు పరిగణింపబడుట జరుగును. పుల్ల ఎవరికి దొరకినచో వారే తిరిగి ఆటనారంభించుట నియమము. అనుకొన్న ప్రకారమెవ్వరెక్కువమార్లు గెలుతురో

1. County Folk Lore:- Vol. VII. P. 208

ఆ గెలిచిన బాలిక ఓడిన బాలిక దోసిలినిండ మట్టి యెత్తించి, అందు ఆ పుల్లను గ్రుచ్చి ఆమె రెండు కండ్లను చేతులతో మూసి పట్టి, దూరముగా నడిపించుకొని పోయి తోచినచోట ఆ మట్టిని పోయించి తిరిగి ఆటాడినచోటికి తెచ్చి విడిచి పుచ్చు చుండును. ఓడిన బాలిక యొక్కతే వెదకుచుబోయి దానెక్కడ ఇసుకపోసినది గుర్తించి పుల్లను తీసికొని వచ్చిచూపును. దానితో వోటమి తీరిపోవును. ఒకవేళ పుల్లను వెదకి తేలేకపోయినచో తిరిగి దోసిట మట్టిని, పుల్లను ఎత్తించు కొని కన్నులు మూయించుకొని ఆటపెట్టును.

బహుశః ఈయాట పుట్టిన దినములలో ముక్కునకున్న బంగారుపుల్లను తీసి ఆడినందులకీయాటకు ,,ముక్కుపుల్ల,, యని పేరు వచ్చియుండునని ఊహింపనగును. ఏలన, అలకాపురమునన్న మందాకినీ తటరుహ మందార ద్రుమచ్ఛాయలోని బంగారపుటిసుక మీద యక్షకన్యకలు కూర్చుండి ఆ యిసుక యందు రత్నమును దాచి (గూఢరత్నసికతమను ఆట) యాడుకొనుచుండిరని కాళిదాస మహాకవి తన మేఘ సందేశములో వర్ణించినాడు 1. నేడు వీనికి మారుగా కట్టెపుల్లనుపయోగించుచున్నారు. ముక్కునకు బంగారపునగలులేని పేద బాలికలు సన్నని చీపురుపుల్లనుగాని, కట్టెపుల్లనుగాని అమర్చుకొనుట నేటికిని గమనింతుము గదా! కాలానుగుణముగ మార్పులు సహజము.

## కాళ్ళగజ్జి:-

బాలికలు తమలో నొకరిని ఆటపెద్ద చేసికొనగా అప్పుడామె మిగత

1. మన్దాకిన్యాః సలిల శిశిరైః సేవ్యమానా మరుద్భి
ర్మన్దారాణా మనుతటరుహాం ఛాయయా వారితోష్ణాః
అన్వేష్టవ్యైః కనకసికతాముష్టి నిక్షేప గూఢైః
సంక్రీడన్తే మణిభిరమరప్రార్థితా యత్ర కన్యాః,,—
—మేఘసందేశము—సర్గ. 2. శ్లో. 6

బాలికల నందరినొక్కచోట వరుసగా ముందునకు కాళ్లు చాచుకొని కూర్చుండు నట్లుచేసి ,,కాళ్లాగజ్జి—కంకాళమ్మ — వేగుచుక్క — వెలగా మొగ్గ — మొగ్గగాదు మోదుగనీరు నీరుగాదు—నిమ్మలవాయి—వాయిగాదు—వావింటికూర — కూరగాదు గుమ్మడిపండు—పండుగాదు—పాపిడిమీసం—లింగూలిటుకూ — పండెమూలవటుకు రాజుగారితోట్లో ఏముందంటే—పువ్వో మొగ్గో—పుచ్చుకుంటె దెబ్బ—కాలుదీసి కడకుపెట్టు,, మని పాడుచు ఒక్కొక్క కాలును తట్టునప్పుడొక్కొక్కమాట పలుకుచుండును. ,,కడకుపెట్టు,, అనుమాట ఎవరి కాలును తట్టుచు అనునో ఆ బాలిక ఆ కాలును ముడుచుకొని యుండును. ఇట్లు ముడుచుకొన్న కాలును పండినదందురు. అట్లే తిరిగి ఆ మాటలుననప్పుడు కడకుపెట్టు మన్నమాట వచ్చినచో ఆయా బాలికలు తమ కాళ్లను ముడుచుకొందురు. చివరికొక బాలిక మిగిలియున్నచో ఆట పెద్దయైన బాలిక ఆమెకు తోడుగ గూర్చొని తన కాళ్లను గూడ చాచి పై విధముగానే పాట పలుకును. ఇద్దరిలో నొకరు తుట్టతుదకు మిగిలిపోదురు. మిగిలిన బాలికను ,,దొంగ,, లేక ,,ముట్టు,, అని పిలుచుచుందురు అప్పుడు ,,దొంగ,, అనబడు బాలిక యొక్క జడనుగాని, చేతినిగాని పట్టుకొని గిరగిర త్రిప్పుచు ఆటపెద్ద నిల్చుంటే ముట్టుకుంటవా? కూర్చుంటే ముట్టు కుంటవా? అనగాని, మీయమ్మ నిల్చుండి కన్నదా? పండుకొని కన్నదా? అనిగాని ప్రశ్నించుచుండును. ఆ బాలిక ,,నిల్చుంటే ముట్టుకుంట,, అన్నప్పుడు బాలిక లందరు కూర్చొనవలసియుండును. లేదా ,,కూర్చుంటే ముట్టుకుంట,, నన్నప్పుడు అందరు నిలిచియుండవలసియుండును. ఇందేదియో సమాధాన మివ్వగానే ,,దొంగ,, బాలిక విడిచిపెట్టబడను. ఆయాసమాధానములకు భిన్నముగా బాలికలందరు ప్రవర్తించుచుందురు. అటులగాకుండ ఆ నియమమునకు వ్యతిరేకముగా వర్తించినచో వెంటనే ఆ దొంగ బాలిక వచ్చి తాకును. తాకబడిన బాలిక మొదటి బాలికవలె ,,దొంగ,,గా మారి ఆడుచుండును. దొంగ బాలిక తాకవచ్చినప్పుడు బాలికలందరనేక విధములుగ నెక్క పక్కెములాడుట పరిపాటి. ఈ యాటలో నెంతమందియైన పాల్గొనవచ్చును.

ఇందు బాలికలు ,,దొంగ,, బాలిక సమాధానమునుబట్టి జాగ్రత్తగ మసలుకొన వలసియుండును. దీనివలన కొంతవరకేకాగ్రత కూడ కుదురగలదు. కొంచెమిదే సమాధాన పద్ధతిలో బాలికలు వెన్నెల రాత్రులలో వెన్నెలాట లాడుదురు. అప్పుడు, వెన్నెలకుంటె ముట్టుకొంటవా? నీడకుంటె ముట్టుకొంటవా? అని యడుగుదురు.

పిడికిలి మూయుట:-

బాలికలలో నిద్దరు ఆట పెద్దలుగానై బాలికలనందరిని సమముగ సగము సగము పంచుకొని రెండు పంక్తులుగా నెదురెదురుగాచేసి నిలుపుదురు. ఒక చింతపిచ్చెను పైకెగురవేసి దానిప్రకారమెవ్వరాట మొదలు పెట్టవలసియుండునది ముందు నిర్ణయించుకొందురు. ఆ నిర్ణయము ప్రకారమొక ఆటపెద్ద తన పంక్తిలోనివారి పిడికిళ్లను వీపువైపునకు పెట్టించి తానొక గవ్వనో, గచ్చకాయనో, గులకరాయినో తీసికొని వారి వెనుకవైపు నడచుచు ,,గట్టుమీదికోడి–గవ్వల్లకోడి తొక్కితే తొంబై పిల్లలకోడి–అల్లల్లకోడికి అకుమిరియంబు–పిల్లల్ల కోడిక్కి పిండి మిరియంబు,, అనిపాడుచు ఎదుటి పక్షము వారి పెద్దకు తెలియకుండ దానిని వారందరి పిడికిళ్లలో బెట్టినట్లు నటించుచు తోచిన బాలిక యొక్క పిడికిట గుప్తముగ పదిలపరచి ,,పిల్లల్లారా–జెల్లల్లారా–పిడికిలి మూయ్యండల్లా,, అనియో, ,,అప్పల్లారా–తెప్పల్లారా–చిప్పలు మూయండి,, అనియో బిగ్గరగ నరచుచుండును. అప్పుడందరు పిడికిళ్లను గట్టిగ మూసికొని ముఖమున గుట్టుతోపనీయక నిలబడి చూచుచుండగ రెండవ పంక్తియొక్క ఆటపెద్ద ఎవ్వరి పిడికిలిని కూడ చూడ కుండ ఉన్నచోటునుండే ఊహించి ఆ వస్తువెవరి పిడికిట నున్నదో ఆ బాలిక పేరు చెప్పును. అది నిజమైనచో తానుగెలిచినట్లు తలంచి ఇంతకుముందు వారి మాదిరిగనే తన పంక్తి వారి పిడికిట దాచును. ఒకవేళ కనుగొనలేకపోయినచో నెదుటివారే గెలుచుకొని తిరిగి యాడుచుందురు. ఇట్లెన్నిమార్లెవరెక్కువ

గెలిచినచో వారు గెలిచినట్లు గుర్తింపబడి ఓడినవారి ఆటపెద్దను చుట్టుముట్టి ఒక్కడుఃపున తేనెటీగలవలె గిచ్చిగిచ్చి వదలుదురు. కాని నెత్తురు వచ్చునట్లు మాత్రము గిచ్చుకొనుట జరుగదు సుమా! ఇట్టి ఆట అస్సామీ పిల్లలలో గూడ కన్పించును.

## కుంటి పీసు:-

దీనిని ,,తొక్కుడు బిళ్ల,, అనికూడ పిలుతురు. నలుగురయిదుగురు బాలికలు కలిసి దీనినాడుదురు. ఆటకుముందు సుమారు ఆరు గజముల పొడవు' గజమున్నర వెడల్పుగ, దీర్ఘచతురస్రాకారముగాగల దానిని గీచి తరువాత సమముగ నిలువుగ నొక గీతగీచి, ఆ పిమ్మట అడ్డముగా మూడు లేక నాలుగు గీతలు గీచి యుంచెదరు. అనగా నా దీర్ఘచతురస్రాకారముగల దానిని 8 లేక 10 చతురస్రాకారములుగా విభజింతురు. ఒక్కొక్క విభాగమును గది లేక ఇల్లు అని వ్యవహరింతురు. చింతపిచ్చె, బోకిపిచ్చె, కొబ్బెరపెంకు (చిన్నముక్క) వంటి వానిలో నేదేని యొకదానిని తీసికొని ఆటను మొదలిడు బాలిక తక్కిన బాలికలే గది చూపుదురో ఆ గదిలో పడవైచి, ఒక కాలును పైకి ముడుచుకొని, ఒంటికాలుమీదనే కుంటుచు నొక్కొక్క గదిని దాటుచు ,,పిచ్చె,, పడియున్న గదిలో కాలును మోపకయే ఒక్కచేతితోనే యా పిచ్చెనందుకొని ఆ మీదుగ ప్రక్కగదిలోనికి దూకి, పిదప మిగిలిన గదులుదాటి యావలివైపునకు పోవును. తిరిగి ఆ బాలిక గదుల దిక్కు చూడకుండ తలమీదినుండి తోడి బాలికలు చెప్పిన గదిలోనికి పడవేసి రెండుకాళ్లనొకమారే లేపి రెండెర్రెండు గదులలో అంగవైచుచు పిచ్చె యున్న గదినుండి దానినందుకొని ఆ గదిని తొక్కకుండ దూకుచు—

విశాఖ పట్నం వీశెడు బెల్లం
నీకొకపదలం నాకొకపదలం పదలం పదలం

బింబె నిండ కందులూ రంగసాని బొందులూ బొందులూ బొందులూ
సూరీ గుమ్మడికాయ సూరప్ప తలకాయ తలకాయ తలకాయ
ఆనపకాయ అచ్చమ్మ తలకాయ తలకాయ తలకాయ,, అనిపాడుచు మొదట ఆటనారంభించిన స్థలమును చేరుకొనును. ఇట్లు చేరుకొన్న బాలికను పండు పండినదందురు. ఆ తరువాత మిగిలిన బాలికలు గూడ ఆడుదురు. కాని పిచ్చె గదిలో పడవేయునప్పుడది యింకొక గదిలో పడినగాని, గీతమీద పడిన గాని పొరపాటగును. ఇంతేగాక, కుంటునప్పుడు ముడుచుకొన్న కాలు నేలమీద మోపబడినను, వంగి చేతులు మోపినను గూడ పొరపాటగుటయేగాక ఆటలో ఓడిపోయినట్లు పరిగణింపబడును. ఆటముగిసిన పిమ్మట ఓడిన వారాటస్థలము చుట్టు కొన్నితడవ లొంటికాలుమీద కుంటుచు ఆట పెట్టుదురు.

## బొమ్మల పెండ్లి:-

బాలికల యొక్క ఆటలన్నింటికంటె బొమ్మలపెండ్లియాట చూడముచ్చట గొలుపుచుండును. బాలికలు పొందెడు సామాజికీకరణమున కిది సరియైనప్రక్రియ. సంస్కృత భారత భాగవతాదులలో బొమ్మలపెండ్లిని గూర్చి చెప్పబడలేకున్నను తెలుగు భారత భాగవతములలో చెప్పబడి యుండుట వలన నిది తెలుగు వారి ఆటయై యుండవచ్చునని చెప్పుకొనవచ్చును. ఇరుగుపొరుగు బాలికలందరు కలిసి ఒకరి ఇంటిలో ఆడుకొనుటకు నిర్ణయించుకొందురు. ఆ యింటిలో నొక మూలకు పెండ్లిపిల్లను, మరొక మూలకు పెండ్లి కొడుకును కూర్చుండబెట్టి పిల్లవైపున కొందరు, పిల్లవానివైపున మరికొందరు చేరి ఒక్క దినములోనే పెండ్లి మొదలుకొని అప్పగింతలు, శోభనము, సంతానము వరకు తంతు నడుపుదురు. వీలునుబట్టి పెండ్లిపిల్ల నొకయింటిలోను, పెండ్లికొడుకు నింకొక యింటిలోను జేర్చి ఆ రెండు మూడు దినములవరకు ఆడుకొనుట చూడగలము.

పెండ్లి తలపెట్టిన వెంటనే గృహశుభ్రత, గృహాలంకరణ యనుపనులు

సాగిపోవుచుండును. అట్లే బాలికలుత్సాహపూరితులై "చిట్టి చిట్టి మిరియాలు చెట్టుకింద పోసి—పుట్టమన్ను తెచ్చి—బొమ్మరిల్లుకట్టి", లేదా "కుమ్మరింటికి పంపించి—కుమ్మరిమట్టి తెప్పించి", బొమ్మరిల్లు నిర్మించి పేదరికమును దలచి "బొమ్మరింట్లో పిల్లతలకు నెయ్యిలేదు—నా తలకు నూనెలేదు", అనుచువిచారించుట నటించుచు. పిదప, ఆడకూతురు పెండ్లిచేయుట కెంత వ్యయప్రయాసములగునో బాలికలు గ్రహించుచు యుందురు. అయినను నూరబద్ధములాడియో నూనెవ్వులు పెండ్లి కార్యము నెరవేర్చవలెను గదా! అందుచేత "అల్లవారింటికి పిల్లకుపోతె—అల్లవారికుక్క భౌమన్నది—నాకాళ్లగజ్జెలు ఘల్లుమన్నాయి", అనగా అల్లవారింటికిప్పుడుపోగా వారు లేదని యూసడించినట్లున్నది. గుండె గుటుక్కు మన్నట్లైనది. కాని పెండ్లియాపుటెట్లు? తొండిమో మొండిమోచేసి సంబంధము గట్టెక్కించవలెనుగదా: పెండ్లి పిల్లనుజేయుట ఆరంభమైనది, "బొమ్మలపెండ్లి", అందు తాటియాకు బొమ్మలే వాడుకొనుట పరిపాటి—

"తాటాకు బొమ్మకు కాటుకబొట్టుపెట్టి చీరసింగారించి పోటువేశారు
గాజుపూసలపేరు మెళ్ళోవేసారు—గౌరికల్యాణాల రేకుదిద్దారు
పానకం బిందెలూ సిద్ధపరిచారు—పాపపేరంటాళ్లు కాచుకున్నారు",

అట్టి బొమ్మకు కాటుకబొట్టు పెట్టి, చీర సింగారించి, గాజుపూసలపేరు మెడలోవేసి కల్యాణరేకుదిద్ది లగ్నమునకు సిద్ధముచేసికొన్నారు. పేరంటాండ్రు (ఇరుగు పొరుగు బాలికలు) వచ్చి లగ్నమున కెదురుచూచుచున్నారు. పానకపుబిందెలు తెచ్చి యుంచబడినవి. ఇంకొకవంక పెండ్లి భోజనమునకై "లక్కపిడతలో అన్నం ఉడికిపోయింది", మరొకచో 'లక్కచట్టిలో పప్పు ఉడికిపోయింది'. పెండ్లి కూతురు మేనమామ కలిగినంతవరకు వరునికి "కట్నాలకోసం చింతగింజలు లెక్క పెట్టి దాచినాడు", బొమ్మలపెండ్లిలో రూపాయలంటే చింతగింజలే. కాని, వరకట్నమో ఓలియో తక్కువపడియుండునుకాబోలు. పెండ్లికొడుకునుదెచ్చుటకు "కబురుపెడితే కబురువెళ్లింది గాని—పెండ్లికొడుకులవారు తిరిగిరాలేదు", పాపము! "ఉత్తి ఉత్తి అలజడి జరిగిపోతుంది—ఉత్తుత్త బాజాలు మోగుతున్నాయి".

సమాజములో నెక్కువ గారవము చేయువారే యుందురు. పెండ్లి సందర్భ మందలి వారి దైన్యావస్థలకు ,,బొమ్మలపెండ్లి,, నిలువుటద్దము పట్టినది. పెండ్లి కుమారుడు రాలేదని పిల్లపక్షమువారు వెళ్లి, పిల్లవాని పక్షము వారిని కలిసి సామరస్యమును కుదుర్చుకొని, పెండ్లి కొడుకును తోడుకొనివచ్చి పెండ్లి పీటలపై కూర్చుండబెట్టి, పెండ్లి కూతురునకు ముసుగువైచి చెప్పి జరపేయుదురు. పెండ్లికి ,,చూడవచ్చినవారు ఏమితెచ్చారు—పట్టాభిపుంగార్లు పెండ్లి జరుగునారు,, నటు. కన్నతల్లి మాత్రము చీరలు, రవలాంచేలు, పెట్టె తో సొమ్ములు పెట్టుట యగును. ,,నన్నుకన్నాతల్లి చీరెట్టినమ్మ—చీరకు చింకల అంచెట్టినమ్మ—మెడలకీ రవ్వల పేరెట్టినమ్మ—పేరుకీ పెట్టెంతో సొమ్మెట్టినమ్మ,,. సొమ్ములనగా చిన్న పూసలదండలు, గాజుపూసలదండలే. చూడవచ్చిన చుట్టములు, తల్లి, తండ్రి, మామ, వదిన, బావ, మరదులు మున్నగువారుగా బాలికలలోనే యుండెదరు. ఆ తరువాత విందులారగించుట నిర్వహింతురు. రావియాకులుగాని, మఱ్ఱియాకులు గాని తెచ్చి వరుసగా నొక్కొక్కరిని కూర్చుండజేసి లక్కపిడతలలో వండిన వంటకములను వడ్డింతురు. బంటి తమ్ములనెత్తుకొనివచ్చి పంక్తిలో కూర్చుండ బెట్టి, ,,కోడికొక్కెరాట—కొబ్బెరకాయ ముక్కలాట—పాలోసి చెల్లిమాట పంచదార చిలుకలాట,, యనుచు తినిపించెదరు. విందులో వియ్యాలు వారిని దెప్పిపొడుచుట, పెండ్లికొడుకును వెక్కిరించుట, ఆ తరువాత అప్పగింతలలో పెండ్లికూతురునకు బుద్ధులు గరపుట యను విషయము లింతకుపూర్వమే ద్వితీయ ప్రకరణమున జెప్పుకొనుట జరిగినందువలన వానినిట తిరిగి చెప్పుకొనుట చర్వితచర్వణమే యగును.

వెన్నెల రాత్రులైనచో ఈ సందర్భమున బాలికల యుత్సాహమునకు మేర యుండదు. బాలికలంత పిల్లపక్షమున, పిల్లవానిపక్షమున, రెండు జట్టులుగా నేర్పడి భుజముల మీద చేతులు వైచుకొని పరస్పరము పిల్ల మరియు పిల్లవాని యొక్క కులగోత్రాదులను గూర్చి, ఇచ్చిపుచ్చుకొను కట్నములను గూర్చి, పాటల రూపమున సంభాషించుకొనుట జూచిననేగాని తనివితీరదు. ఇట్టి

సంభాషణాత్మక రూపముగూడ ద్వితీయ ప్రకరణమున నుటంకింపబడినది. ఆట ముగింపులో నప్పుడప్పుడొక జట్టువారింకొక జట్టువారిని ,,ఎరుకలేనింటికి నా బిడ్డనిస్తి దమ్మదాలిమ్మలో-అప్పుడెందుకిచ్చినావు అరికాలు సెప్పుడమ్మదాలిమ్మలో ఎరుకలేకిచ్చిన ఎనుగొల బిడ్డా దమ్మదాలిమ్మలో—సిబ్బిలేనింటికి నా బిడ్డనిస్తి దమ్మదాలిమ్మలో,,* అని చెప్పిపొడుచుకొనుచుండుట చిలిపిహాస్యము చిలుకరించినట్లుండును.

ఆటనడుమ పారిపోయినవారిని వెక్కిరించుట, ఉపాలంభించుట మామూలే. ,,యేడినరుసూ యేడమ్మ నీ మొగుడూ—కోణ్ణిగట్టేసుకో కోడికిన్ని గింజలేసుకో కుక్కని గట్టేసుకో కుక్కకింత కూడేసుకో,,. అందరికి వేళాకోళముగ గన్పట్టినను గూడ ఏడిపించినంతపని చేయుదురు. అట్టిబాలిక తలమీద చూడకుండ కాగితపు ముక్కనో, కట్టెపుల్లనోవేసి ,,ఒగమ్మనెత్తిమీద కొండెంగా—ఒచ్చి పొయ్యెటోళ్లు తన్నంగా,, అనుచు మిగిలిన బాలికలెవ్వరట్టి విషయమును జెప్ప కూడదని బెదరించుచు నిట్లు పాడుదురు.

,,చెప్పకు చెప్పకు చెడిపోతావు— చెప్పితే నీముక్కు తెగ్గోస్తా
దూలంమీంచి దూకిస్తా—పందిరి మీంచిపాకిస్తా
కంచం అన్నం తినిపిస్తా—కడివెడు నీళ్ళుతాగిస్తా.

,,బొమ్మల పెండ్లి,, యను ప్రక్రియ మనోజ్ఞమైనది. తెనుగు భారతానువాద కాలమున రాకుమారికలు ,,బొమ్మలపెండ్లి,, యాటలాడినట్లు సాక్ష్యమున్నది. ఉత్తర తన బొమ్మపొత్తికలకు చిత్రవర్ణ భాసురములైన కౌరవ వీరుల కోకలను దెమ్మని అర్జునునకు చెప్పినది 1. బొమ్మరిండ్లుగట్టి, కూళ్లువండి, బొమ్మలుపేర్చి పెండ్లిచేసిన విషయము తిక్కన కంటె ముందుగనే నన్నెచోడుని కుమార

---

1. శ్రీమదాంధ్రమహాభారతము:—విరాటపర్వము—ఆ. 4. పద్య. 47

సంభవములో గన్పట్టుచున్నది 1.

బాలురకంటె బాలికల కధికముగా ఆటలున్నవి. వాని మొత్తమును గూర్చి యొక గ్రంథమే ప్రత్యేకముగ వ్రాయవచ్చును. మచ్చునకిట కొన్నింటిని చెప్పుకొనుటయే యుచితమగును. వెన్నెలకుప్పలు, కనుమూసిగంతలు, వప్పాకు, వెన్నెలాట వంటి వెన్నియో కలవు.

## కోలాటము:-

కోలలచేత ఆడుటను కోలాటమందురు. అనగా మూరెడు పొడవు గలిగిన సన్నని కఱ్ఱలచేత ఆడుట యని యర్థము. కోలాటము పల్లీయ నృత్యము. అనేక కళ. భరతార్ణవమునందు కోలాటమొక ప్రత్యేకమైన నర్తనగ చెప్ప బడినది 2. ప్రాచీన తెలుగు సాహిత్యములో దానిని దండలాసకము, దండ నర్తనము అనిపేర్కొన్నారు. తెలుగునాట కోలాటములు పాల్కురికి కాలము నాటికేయున్నట్లాతని బసవపురాణమొక సాక్ష్యము 3. ఇరువది ముప్పది మంది వరకు పాల్గొనవచ్చును. పిల్లలుగూడ ఆడునప్పటికిని దీనిని పెద్దల యాటగనే చెప్పుకొనవలె. ఆబాలగోపాలమునకు వినోదదాయకమైనది. సాధారణముగ రెండు చేతులతో రెండు కోలలు పుచ్చుకొని, కాళ్లకు గజ్జెలు గూడ కట్టుకొని, గుండ్రముగా నెదురెదురుగా నిలబడి, దరువు గలుపుకొనుచు, అడుగులు వైచుచు పాటపాడుచు దుముకుచు, చిత్రవిచిత్రముగ గతులు మార్చుకొనుటలో నైపుణ్యమును ప్రదర్శించుచు గంటల తరబడి యాడుకొనుచుండుట గాంచవలె ధరణియే దదరిల్లినట్లుండును. వారు వేయు అడుగుల వరుసలనేకములుగానున్నవి.

1. కుమార సంభవము:_ఆ. 3. పద్య. 36
2. భరతార్ణవము:_నందికేశుడు. అధ్యా. 7.
3. బసవపురాణము:_పాదములు 1056, 1057.

కోఁపికికి చిరుగజ్జెలుండుట వలన తాళములు మనోహరముగానుండును. పసి కూనలకొకవింతగా, ప్రజావళికి సంతమలుపు పలకరింతగా, పల్లెకు పులకరింతగా ఈ వినోద నృత్యము ప్రమథగణ నృత్యమును దలపించును.

పగలంతయు పనిపాటలలోనే కడచిపోవుటవలన నీ యాట సామాన్యముగ గూట దీపమెక్క గుడిసె గునిసియాడువేళ రచ్చపట్టున గాని, వాడకట్టునగాని మొదలు పెట్టుట జరుగును. రాత్రి ప్రొద్దుపోయిన తరువాత గాని వారిని పొట్ట పిలువదు. అయినను ఆకలి నరమరసేయక ఆడుచుండుట ఒక విశేషము. ,,కోలాటమేయంగ—కోడిగూయంగ,, అనుటవలన నొక్కొక్కమారు తెల్లవారు వరకు ఆడుటకు వారి యుత్సాహమే కారణము. కోలాటము వేయునప్పుడు ప్రత్యంగము చలత్తరంగమువలె చలించుటవలన మిక్కిలి దేహపరిశ్రమ యగుచుండును. కాని ఏ మాత్రమలసి పోయినట్లు పరికించము. తెల్లవారగనే తిరిగి నిత్యకృత్యములలో నిమగ్నులయి పోవుచుండుట యలవాటు. చలికాలము వేసవికాలములందు విశేషముగ నాడుదురు. దసరా, దీపావళి, సంక్రాంతి, ఉగాది వంటి పండుగ సందర్భములలో కోలాట బృందముల యొక్క సందడి కనువిందొనర్చును. వెన్నెల రాత్రులు మరింత ఆనందోత్సాహములనుపెంచును.

దంపుడు కోపు, గడికోపు, గణనాయకకోపు, జడకోపు శరణు శ్రీధర కోపు, లయినుకోపు, పాలపిట్టకోపు, మల్లన్నకోపు, కూర్చుండి చెరగుకోపు, రథయాత్రకోపు, తిరుగుడుకోపు, మూనకోపు, ప్రసవపునొప్పులకోపు, చక్రపు కోపు మున్నగునవి కోలాట నృత్యరీతులు. కోపు అనగా నృత్యభంగిమ రీతి. ప్రతి కోపు కించిద్భేదముతో ఆడుట యొప్పును. ఒక్కొక్క కోపు వేయు నప్పుడు వాని కీర్తనసుబట్టి గతులు, శ్రుతులు, రాగ, తాళలయలు ప్రత్యేకతను సంతరించుకొనుట విశేషమనిపించును. ఆయా కోపులలో కీర్తనల యొక్క భాగమెక్కువ. కొన్నింట పూర్తి శృంగారమే చిప్పిలును. కొంతెపాటలిందు కుదాహరణలు. భామలనుండి గొల్లభామల వరకిట్టివి పరిమితములే గాక దోమ

మీదనో, కోతిమీదనో కొంగమీదనో, కుక్కమీదనో, నక్కమీదనో, పిల్లిమీదనో, పిల్లల కోడిమీదనో అన్యాపదేశముగా కొంచెం తనములనల్లుకొందురు. గణనాయక కోపు, శరణు శ్రీధరకోపు, రథయాత్రకోపు వంటివి కీర్తనలతో గూడినవి. వారెంతకోతులో అంతభక్తులు. కొమ్మ లెగురుకోతి కోదండరాముని జూడగనే కొలిచినట్లు పల్లీయులు కొంచెం పాటలు పాడుచు వెంటనే కీర్తన లందుకొని తన్మయులగుచుందురు. ప్రతి కోపును గూర్చి వ్రాయుట అసంగత మగునని భావించి యిచట ఒండు రెండు మాత్రముదాహరింతును.

గణనాయకకోపు:– (తిస్రగతి–ఏకతాళము)

గణనాయకుడైన విఘ్నేశుని కీర్తించుచు–

రావయ్య గణనాయకా–మము–కావవేగణనాయకా
విద్యలకు ఆదివయ్య వేద్య శ్రీ గణనాయకా
ఎలుక వాహనమెక్కెవయ్య–ఏకదంతం గలవాడవయ్య

అనుచు పాడుచు తాళలయలు దాని కనుగుణముగ మేళవింపజేసి కోలలువేయుచు ఆడుచుందురు. గణపతిని గూర్చిన భంగిను కనుక ,,గణనాయకకోపు,, అని పిలుచుట జరిగినది.

శరణు శ్రీధరకోపు:– (తిస్రజాతి–త్రిపుటతాళము)

శరణు శ్రీధర గరుడవాహన–శరణు వేంకటనాయకా
పావన పదపద్మ గోవింద మాధవ–పద్మనాభ జననాయకా

శ్రీధరుని శరణువేడుటవలన దీనికి ఆ పేరు వచ్చినది. గణనాయక కోపునకును, దీనికిని అడుగుల లోను, తాళములోను, వరుసలోను, కోలలు వేయుటలోను ఇంచుక భేదము కనిపించును. చెప్పుకొన్న దానికన్న చూచినప్పుడే సులభ బోధమగును.

మల్లన్నకోపు:– (ఖండగతి–జంపెతాళము)

నాపేరు మల్లన్న నాది రేకల కుంట_కదిరి భూమండలమున
నదరేమున్నదన్నాడు మల్లన్న_భయమేమున్నదన్నాడు
సాలెవారి చిన్నవాడే మల్లన్న_భోగమోళ్ల చిన్నవాడే

మల్లన్న పేరునుబట్టి ఈ కోపున కిట్టి పేరు పెట్టుకొనుట సంభవించినది. పేరు వ్యవహారమునకై నను కోపు నడక పైరెండింటి కన్నను భేదించి యుండుట గమనించవలెను. భేదమునగా అడుగులో, గతిలో, కోలలువేయు వరుసలో, తాళ లయలలో, పాల్గొనువారి సంఖ్యలో అనిభావము.

గడికోపు:_(ఖండజాతి_ఆదితాళము)

,,ఎక్కాడిదానవే నక్కాని కోమలీ
ఒక్కాదాన వడవిలో_ఓసెంచితా_ఒక్కాదాన వడవిలో,,*_

కూర్చొని చెరిగెడు కోపు:_(చతురస్రజాతి_ఆదితాళము)

,,కూచోని చెరిగే చేటికురులపై
తుమ్మెద లాడిందో లాలా
ఘన తుమ్మెద లాడిందో లాలా

రథయాత్ర కోపు:_(చతురస్రజాతి_ఆదితాళము)

,,గుడ్లకోడి జంపుకోని గుజ్జంగ వండుకోని
గుత్తిలోన తెల్లవార వచ్చేనురా,,_ ఇట్టివి చూడగనే వాని వైవిధ్యము గోచరింపకపోదు. సంగీతవిద్య తెలియనవసరములేదు. ఇంచుక ఈ ప్రక్రియలలో పల్లీయులాడునప్పుడు గమనించినచో ఒక్కొక్క కోపునకెట్టి ప్రత్యేకత కలదో తెలియవచ్చును.

జడకోపు:_ ఇదొక ముఖ్యమైన కోపు. జడకోలాటము, జటకోలాటము అనికూడ పిలుతురు. ఒకపెద్ద వెదురుగడను తీసికొని, దానికి పైచివర చుట్టు రంధ్రములుగల గుండ్రని చెక్కబిళ్లను అమర్చి ఆ రంధ్రములకు జడవలె

అల్లుటకు తగినన్ని లెక్క ప్రకారముగా జనపనారత్రాళ్లుగాని, నూలుత్రాళ్లుగాని కట్టుదురు. తదుపరి యీగడను గట్టిగా భూమిలో పాతుదురు. కట్టబడిన త్రాళ్ల క్రింది కందునట్లు వ్రేలాడబడి యుండును. ఆటలో పాల్గొను వారొక్కొక్క త్రాడును పట్టుకొందురు. పట్టుకొనుచోట జారిపోకుండునట్లు చుంచులమరి యుండును. చుంచునొకచేత, కోలనురొకచేత పట్టుకొని త్రాళ్ల చిక్కువడకుండ పాయలు పాయలుగా చక్కగా జడ అల్లుకొనునట్లు లోపలికి వెలుపలికి దిరుగుచు-

"లక్ష్మన్న జడకోపెయ్యరే—సత్యభామ జడకోపెయ్యరే
ముగ్గురు వేసారు ముత్యాల జడముడి
నలుగురు వేసారు నవ్వుతూ జడముడి
ఐదుగురు వేసారు అందాల జడముడి" అని పాడుచుందురు. ముగ్గురేసి, నలుగురేసి, ఐదుగురేసి లెక్క ప్రకారమాడుదురని పైపాట వలన తేలుచున్నది. జడ అల్లబడిన పిదప తిరిగి అది ఏ వరుసలో అల్లుకొన్నదో అవే వరుసలో విడుపడునట్లు తిరుగుచు కోలాటమాడుట మనోహరముగా నొప్పును. బాలికలు గూడ దీని నాడుదురు.

దొమ్మరిఆట గూడ పల్లీయుల వినోదమునకు తావలమైనట్టిది. ఆటను బట్టి, అందు వేసెడు గంతులనుబట్టి, గడపైనుండి దుముకుటనుబట్టి ఆటకాండ్రకు దొమ్మరులను పేరు వచ్చియుండును. వీధినడుమ జనులు గుమిగూడుచోట ఈ యాటను ప్రదర్శించెదరు. కసరత్తులు, గమ్మత్తులు, గడమీద ఆరడి మాటలలో గారడి చూపుట వారి ప్రత్యేకత. డోలు ముఖ్యమైన సాధనము. జనులనాకట్టు కొనుటకిది మంత్రము వంటిది. డోలు మ్రోయించునప్పుడు "టననానా టంకు చెలో—టననానా టంకుచెలో" వంటివి ఊతపదములుగా విసరుచుందురు. ఒకడు భ్రమసి తన "తల్లి పిల్ల నిడిసివాడు సేసుకున్న భార్య నిడిసి—దొమ్మరదానెంట బోతే-డోలు మెడకు యేసె" నట. అందుకే దొమ్మరియాట రహస్యమంత డోలులోనే యున్నదందురు. స్త్రీలచేత చేయించు కసరత్తు లెక్కువగానుండును.

అవి కఠినవిద్యలు. అందుకే ఒక వనిత తన్ను దొమ్మరి వానికీయవద్దని తల్లితో జెప్పుకొనుచున్నది—

,,అమ్మ నన్ను కనకే దొమ్మరోడికియ్యకే
చాప సుట్టమంటాడు—చంక పెట్టు మంటాడు
ఇల్లెక్క మంటాడు—ఇద్దాలు చూపమంటాడు
గడెక్క మంటాడు—గంతులెయ్య మంటాడు,,*

భోగమాటను గూడ ప్రత్యేకమైన కళాకారుల మేళము ప్రదర్శించు చుండును. వారిని భోగము మేళములని అందురు. ఆ మేళములు ప్రదర్శించు ఈ యాటలు యక్షగాన ఫక్కిలో నడచును. రామాయణాది ఇతి వృత్తముల నాడుదురు.

,,ఈ ఏషా మెుద్దయ్య ఆ ఏషా మొద్దయ్య
రాములేషా మెయ్యయ్యో—నా భోగం భీమయ్య
సీతేషం ఏస్తైనూ ఆడీదనుకుంటారూ
రాములేషా మెయ్యయ్యో—నా భోగం భీమయ్య,,*—ఒక వనిత భోగము భీమయ్యను వలచినది. వాడు రాముని వేషము, సీత వేషము కూడ వేసి నటించును. కాని వాడేవేషము వేసినను ఆమెకు నచ్చలేదు, ఒక్క రాముని వేషము దప్ప. కనుకనే రాముని వేషము వేయుమని కోరినది. అట్లు వేసినచో బహుమతిగా ,,ప్యాటంచు నల్లాసీర పెట్టిన వొడ్డాలం—సీకూ నేనిత్త యొ్యా—నా భోగం భీమయ్యా,, అనుచున్నది. సాధారణముగా పండుగ సందర్భములందు గాని, పంటల సందర్భములందుగాని ఆడెడు ఇట్టి యక్షగానములను భాగోతములని భోగమాటలని జనులు పిలుచుచుందురు. ఇంతేగాక అడుగడుగున వారి హాస్యములు, చమత్కారములు వినోదములను గలిగించుచుండును. ఆయా పండుగలను గూర్చి తెలిసికొన నున్నప్పుడు తత్సంబంధమైన వినోదముల నచ్చటనే పేర్కొందును.

## విజ్ఞానము

జీవితమంతయు అనుభవముల పుట్టయైనచో ఆయనుభవముల మీద విజ్ఞానము పండుచున్నది. పల్లీయుల అనుభవములు నాగరకులకన్న ఫలప్రదములే యని చెప్పుకొనవచ్చును. ఏలన, వారు ప్రకృతి ద్రష్టలు. పల్లెపదములన్నియు పండిన వారి యనుభవముల కక్షరరూపములు. అనుభవము పండినప్పుడే వాక్కు ప్రస్ఫుటమగును గదా! వారి జీవితావస్థలలోని, వివిధ దేశకాల పరిస్థితులలోని, వివిధ మానసికావస్థలలోని, అనేకానేకాంశములు ఆ వాక్కులలో సార్వకాలికము లైనవన్నచో పల్లెపదము లెంతటి సంక్షేపములో చెప్పవలెనా? వారు సముపార్జించి పెట్టిన విజ్ఞానాంశముల కవి భద్రపేటికలు.

పిల్లల పాటలు మొదలుకొని ముదుసలుల ముచ్చట వరకును, రంకు బొంకు పాటలు మొదలుకొని విరక్తులైన జోగుల తత్త్వముల వరకును అటనట గన్పించు విజ్ఞాన విషయములలో గొన్ని అవగాహనములు, మరికొన్ని దురవగాహనములై యున్నవి. అతి ప్రాచీన కాలముననే వైదిక జాతి వివిధ శాస్త్ర విజ్ఞానములను గ్రహించినది. శారీరక, ఆధ్యాత్మిక, జ్ఞానమే గాక భూగోళ, ఖగోళ, జ్యోతిష, ఆయుర్వేద, భౌతిక, రసాయనాది శాస్త్ర విజ్ఞానములను గూడ సంతరించుకొన్నది. పల్లీయులాయా శాస్త్రసంబంధములైన విజ్ఞాన విషయములను అనుభవము మీద గడించుకొన్నారు. చంపుట, బ్రతికించుట యను రహస్యౌషధములు సహితము వారికి తెలిసియుండును. లభించిన పదములలో గన్పట్టినంత మట్టునకు స్థాలీపులాకన్యాయమున చూపుటయగును. పుట్టినప్పటి నుండి మానవునకు రకరకాల రోగాలు వచ్చుచున్నవి. వెంటనే నివారణోపాయ మరయుట సహజము. ఇట్టి నివారణాన్వేషణలో పలురకాల చికిత్సలు కనుగొనుట జరిగినది. అందువలన, ముందుగ వైద్య చికిత్స లెట్టివో గమనింతము. కొన్ని చికిత్సలకు చరకసంహిత ప్రమాణము.

శరీరములోని జీడివంటి జిగటు రసము సురుగుడు రూపమున బహిర్గత మగును. చెంపలమీదగాని చేతులమీద గాని ఏర్పడుచుండును. గోటితో గోకినచో చిమ చిమ మంటలు రేగుటయే గాక దురదగలిగి సన్నని రక్తబిందువులు పుటమరించుచుండును. ,,ఎవరి పిల్లాకో సులుగురయ్యింది-సున్నంగొండావొాయి సూసి వొత్తామ_కాసుగొండావొాయి కడిగి వొత్తాము,,* అనుటచేత అట్టి సురుగుడుకు సున్నము మరియు కాచు మందుగా జెప్పబడినది. అనగా ఆ రెండు వస్తువులను దానికి లేపనముగ పూయుదురు. సున్నము సురుగుడును హరించును. సున్నములోని దుర్గుణమును కాచు హరించును.

తలనొప్పి కలుగుటకు నల్లిరక్తపు వాసన ఒక కారణమగుచున్నదని ఈ పాట పేర్కొన్నది. ,,పిల్లికి తలనొస్తె నల్లికొచ్చిండు_పిల్లికి తలనొస్తె నల్లి కొచ్చిండు,, తలనొప్పి లేవగా నల్లి కొరకు వచ్చుట యను దానికి లక్ష్యార్థమును గ్రహించి, నల్లివాసన వలన తలనొప్పి తగ్గునని విపరీత చికిత్సగా తెలియవలెను. ఇట, పిల్లి అన్యాపదేశముగ జెప్పబడిన వస్తువు. దాని స్థానమున మనిషి యని గ్రహింపదగును. సహింపరాని దుర్గంధముల నాఘ్రాణించుట కూడ శిరోరోగ హేతువే 1.

,,చిప్ప చిప్ప గోళ్ళ సింగరాయని గోళ్ళ
మాతాత గోళ్ళ మండావరాళ్ళ_కొంగ కొంగ గోళ్ళ,,

అనుపాటయందు గోటిక్రింద జెట్ట పుట్టినపుడు చేతులు వడిగాద్రిప్పుటలో తాపోపశమనమునకు చేయదగు చికిత్స కలదని యందురు. కాని దీని రహస్య మవగతమగుట కష్టము. పిల్లలు పాడు పాటలలో చాలవట్టుకిట్టి రహస్యములు నామమాత్రములుగనే యుండిపోయినవి.

---

1. ,,గంధాదసాత్మ్యా ద్ద్రాఘ్రాణాత్,, చరకసంహిత:_సూత్రస్థానము_ —అధ్యా. 17_శ్లో. 6.

ఒకనెఱజాణ దొండపండువంటి పుత్రుని బుత్రుని పోషియను కానిని గూడగా గర్భమువచ్చినది. అట్టి జారకాంతలు మన్మథుని వాడి శరఘాతముల కోర్చుకొందురే గాని, గర్భధారణ మేర్పడనోర్చుకొనజాలరు. దాని కనేకమైన కారణము లుండవచ్చును. అట్టి గర్భమును దిగద్రోయుటకు ,,కారుమునగ గడ్డలంపు—కరుగతాగి నేను తిరిగివత్తు,,* నని వన్నెకానికి రహస్య మిచ్చినది. అనగా గర్భస్రావమునకు కారు మునగ గడ్డ ఉపకరించునని భావము.

,,అల్లము సొంటి బెల్లపు గడ్డ—యిసుపకల్లుది గోలుకొండ,, పైత్యమై కండ్లు గిర్రున దిరుగునప్పుడు గాని, అజీర్ణమైనప్పుడు గాని, అల్లము, సొంటి, బెల్లముతో గలిపి మ్రింగవలెను. ,,ఇసుపకల్లు,, కూడ వాడవలెనేమో? ,,ఇసుపకల్లు,, అనగా ఇప్పసారె లేదా తాటికల్లు కావచ్చునని ఊహింప వచ్చును. అంతేగాక, అరగని పదార్థమును దిన్నను లేదా గొంతు మట్టము మెక్కినను భుక్తాయాసముతో కడుపునొప్పి లేచుట సహజము. ,,చింతకాయ దప్పళం—పప్పేసి కలుపటం—కంఠమెల్ల మెక్కటం—కడుపునొప్పి రావటం,,. అప్పుడు వెంటనే సానరాతి మీద శొంఠికొమ్ము గంధము తీసి నాకినచో నది ఉపశమిల్లును. ,,కోమటింటి కెల్లటం—శొంఠికొమ్ము తేవటం—అప్పుడే సానమీద తీయటం—అరగతీసి నాకటం,,. ఇట్లు చేసిన కొంచెము సేపటిలో దొడ్డికివచ్చును. అప్పుడు ,,చెంబు చేతబట్టటం—దొడ్డికెళ్ళిరావటం,, మంచిది. తరువాత ,,మంచ మెక్కి దొర్లటం—నిద్రపట్టిపోవటం,, మామూలే. అల్లము, శొంఠి కిట్టి లక్షణములు గలవని చరకసంహిత నుడివినది 1. ,,దూలగొండితోని దులపరమ్మ,, అనుటవలన పిత్తశ్లేష్మ హరణమునకు దూలగొండి ,,దురాలభా పిత్తశ్లేష్మ ప్రశమనానాం,,2 యని యెఱుగదగియున్నది. అంతేగాక, విరహిణులకుగావించు

---

1. చరక సంహిత:—సూత్రస్థానము—అధ్యా. 27. శ్లో. 150

2. ,, ,, —అధ్యా. 25. శ్లో. 27

శిశిరోపచారములలో దూలగొండి చిగుళ్ళు వాడెదరు 1.

,,వొడినిండా పసుపేస్కో — ఓయ్యారమేమే గునాసారి గున్నమ్మా,, వనితలు జలకమాడువేళ శరీరమంతటను (ముఖ్యముగా ముఖమునకు) పసుపు పూసికొనుట గొప్ప సాంప్రదాయక విజ్ఞానము. రోమములు పెరుగకుండుటకు, ముఖబింబము నునుపారుటకు, శరీరము చాయ తేరుటకే గాక క్రుళ్ళిపోకుండ చేయుట (Antiseptic) కు కూడ అది ఉపయోగపడుచున్నది. ,,పసుపురాసి బాలెంత బైట నిల్చుంటే,, బాలెంతకు దేహము నిండ దానిని పూయుటలో నిదేయర్థమున్నది. ఇప్పటికిని తట్టు తాకినను, ఈలకత్తి (ఈలి)వంటి వానిచేత కోసికొన్నను వెంటనే పసుపంటించుట అనునది పల్లెలలో ప్రథమ చికిత్స. నిత్యము వంటలలో పసుపు వాడుట కూడ ఆరోగ్యమునకే. దానికి ఆయుర్వేదిక మైన గుణము లెన్నియో ఉన్నవి.

పచ్చి బచ్చలికూర దినుటవలన వయిసొప్పులగునని ఈ పాటలో చెప్ప బడినది. ,,పచ్చి బచ్చలి కూరొక్కటి—నమో నారాయణా రాములు.... ..... తిన్నవారు తీపుదీస్తున్నరూ—పన్నవారు లేవకుంటున్నరూ,,. తీపుదీయుట అనగా కీళ్ళు, పిక్కలు, వీపు గుంజునట్లగుట.

కాలు, చేయి వంటివాని యెముక విరిగినచో ,,వేపాకు, పసుపు, వెల్లుల్లిపాయ నూనెమ్మ బొట్టు నూటొక్క ధార.......పూయవోయి నూరి—పూటకొక్కతూరి,, అని మందు చెప్పుట యైనది. బహుశః విరిగిన అంగమును నూనెతో మర్దించి సరిచేయుచు వేపాకు, వెల్లుల్లిపాయలను తగినంత కలిపి నూరి పసుపు కూడ వేసి విరిగిన చోట పూయుటయో, కట్టుటయో జరుగును. రక్తము వచ్చినచో దానిని కరడు గట్టించు గుణము పసుపునకున్నది.

---

1. ,,కర్కశకుష్ఠవక్షంబున రేగటి దూలగొండి చిగుళ్ళు గీలుకొలిపి,,— —చంద్రరేఖావిలాపము:— కూచిమంచి జగ్గకవి. ఆశ్వా. 1. పద్య. 74

పాముకాటునకీపాట మంత్రముగానో తంత్రముగానో యున్నది. పాము కరచిన వానికి విషమెక్కి అంగిలి యందు నురుగులు తీవ్రముగ పేరుకొను చుండగా—

,,దిగుదిగుదిగు నాగ—దిగర సుందరనాగ
ముదముతో రేపల్లె—ముద్దుల నాగ
దిగితేనె దిగినట్లు దిగపోతె ఇగసూడు

పంటిపెద్దం తోటి మరణమవుదువు నాగ,,* యనునది మంత్రము వంటిదని యందురు. విషమెక్కిన వానికి వేపాకు, కొన్ని మిరియములు తిని పింతురు. ఏలన, అవి వాని వాని రుచులు గలిగి యున్నచో విషము తగ్గుముఖము పట్టినదని, రుచులుమారి తీపిగ తోచెనేని విషము తీవ్రస్థాయికి చేరుకొనుచున్నదని గుర్తింతురు. ,,ఏపాకు అంగిల్లు—తీపాయ మిరియాలు,,. అప్పుడు పామును వేడుకొనుట జరుగుచుండును. ,,అచ్చమావులపాలు—అరటి దొల్లల విండి—నీకు గలవనిపాలు—నీపుట్ట లిడుతును... ... ... ... ...ఈపూన ఇరువాయి తోకాన తొంబాయి—మచ్చ మచ్చకు వెయ్యి—మంత్రాలు గలనాగ ॥దిగుదిగు॥,,* అని వేడుకొందురు. పాముకాటున కొక మంత్రమైనచో చాలదు. పెక్కు మంత్రములు కావలెను. మంత్రములకు చింతకాయలు రాలవని యేమో ,,నాగ దొండ దుంపరసము పోసిన గానీ—మాచికాయ రసము బీసారి (విసిరిచెట్టు వేరు, వాడుకలో తెల్ల విసిరి) వేరుదెచ్చి—కాసిపోసినగాని కావారమణగాదు,,* అను దృఢ విశ్వాసముతో నిట్టి మందులు ప్రయోగించెదరు. పాములాడించువారు తెల్ల విసిరిచెట్టు (బీసారి) రసము నుపయోగింతురు. తేలుకుట్టినచో మంత్ర తంత్రము లున్నవి. ,,చీపురు కట్టొకచేత దీపమొకచేత—దిగదుడువ వచ్చిన బావను కుట్టె,,* తేలగాని, ఆకుతేలుగాని కుట్టినపుడు చీపురుకట్టతోను, దీపముతోను దిగదుడుచుటయును గలదు.

చంటి బిడ్డలకు ఉగ్గు పట్టించుచు అది తేలికగా జీర్ణమై పోవలెననుచు తల్లి

పాడెదరు: ,,జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం—గుత్తాలు తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై,, అను పాట మంత్రము కాకపోవచ్చును. కాని మంత్రతుల్యమై యుండును. వాతాపి యను వానిని చూర్ణముగావించి కల్లులో గలిపి అగస్త్యమునికి త్రాపుట జరిగినది. అతడది గుర్తించి ఉపాసనాశక్తితో ,,జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం,, అనుచు వానిని తనలో జీర్ణము చేసికొన్నాడు. ఉపాసనా బలముతో గూడిన యిట్టి ఉచ్చారణము మంత్రమువలె దలంపవచ్చును. దాని భావమే ఆ తల్లి పాడిన పై పాటలో చోటు చేసికొనియుండును.

చేంతాడలి కాయునప్పుడు పచ్చపురుగులకై, ఎలుకలకై, ప్రయోగించు మంత్ర తంత్రములను గూర్చి యింతకు పూర్వమే వ్యవసాయ జీవనములో పరిశీలించితిమి. మరల ఇట పేర్కొనుట అనవసరము. గజ్జివంటి చర్మవ్యాధులకీ క్రింది పాటలో మందు చెప్పబడినది.

కాళ్ళా గజ్జి కంకాళమ్మ—వేగుచుక్క వెలగమొగ్గ
మొగ్గకాదు మోదుగునీరు—నీరుకాదు నిమ్మల వాయి
వాయికాదు వాయింట కూర—కూరకాదు గుమ్మడిపండు
పండుకాదు పావడ మీసం—మీసం కాదు మిరియాలపోతు
పోతుకాదు బొమ్మలశెట్టి—శెట్టికాదు శామలమన్ను
మన్నుగాదు మంచి గంధంచెక్క—లింగులిటుకు పందెమాల పటుకు
కాలుపండినట్లు—కడకు దీసిపెట్టు,,

కాళ్ళ గజ్జి అను ఆట ఆడునప్పుడు పిల్లలీపాట పాడుచుందురు. ఈ యాటను గూర్చి వినోదములలో వివరించుటైనది. పిల్లల ఆటపాటలలో నిట్టి వైద్య చికిత్సలు ప్రవేశించుటకు పెద్దల శిక్షణయే కారణము. లేనిచో వారికిట్టి యనుభవములా చిరుతప్రాయమున కలుగజాలవు. దేశ కాల పాత్రములను బట్టి తెలిసియో, తెలియకయో ఈ నోట ఆనోట అట్టి పాటలు పాడుకొనుటచేత, అందు కొన్నిమాటలు ఋగ్గింగ బడుటయో అక్షరములరుగ బడుటయో జరిగి

యుండుట తల్లక్షణము. కొన్ని పట్టుల అర్థము కాకపోవుట విలక్షణము. ఆయుర్వేద చికిత్స పైదానిలోనున్నది. నాటు వైద్యమెరిగిన పల్లీయుల నడిగినచో తదర్థము చెప్పగలుగుదురు. కంకాళమ్మ వంటి శబ్దముల వివరణ ఆచార్య బి. రామరాజుగారు తమ తెలుగు జానపదగేయ సాహిత్యములో నిచ్చియున్నారు 1. చర్మవ్యాధి చికిత్సకు అవశ్యమైన దినుసులు కంకాళమ్మ (కచూరాలు, గంటు కచూరాలు), వేగులచుక్క (వావించాలు), పెంగమొగ్గ (పాదరసము). అవిగాక మోదుగునీరు, నిమ్మరసము, వావింటరసము, ఇంమక మిరియముపొడి, మట్టి చిగుళ్ళు, లోహరజము, మంచి గంధపుచెక్క వంటి వానిలో నేదేని యొక దానిని పై పాదరసమునకు బదులుగ వాడవచ్చును. మొత్తముమీద మందు చక్కగ సిద్ధముచేసి చర్మమునకు పూయుట గాని కట్టుటగాని జరుగవలెను. వ్యాధి కుదిరిన వెనుక కట్టును విడిచివైచుట యొప్పును. పల్లెలలో అక్కడక్కడ చెట్లక్రియల నెఱిగిన వ్యక్తులు లేకపోలేదు. ఇప్పటికిని కట్టు కట్టరానిచోట ఎముక విరిగినను చెట్లక్రియలతో నయమొనరించుచున్నారు. మంత్రములు వచ్చెడు ఒక బ్రాహ్మణునికి చెట్లక్రియలెన్నియో తెలియునట. వాని పిక్కలలో గూడ తాయెత్తులుండునట. "వానిచెట్లక్రియలెక్కువుండునట–వాని పిక్కల తాయెతులుండునట". పిక్కలలో తాయెత్తులుంచుకొనుట సామాన్యమైనపనికాదు. మా పాలమూరు మండలములోని పండుగసాయన్న అను ప్రాంతీయ వీరుని గాథలో గూడ "పిక్కలలో తాయెతు"లను ప్రసక్తి గలదు. పిక్కలుకోసికొని తాయెతులు పెట్టుకొనుట, తీయుట, వ్రణము వేగముగ మాసిపోవుట అనునది దివ్యమైన చెట్లక్రియలకే సాధ్యపడును. ఇట్టి మహాత్మ్యము పైబ్రాహ్మణు డెరిగి యుండినాడట.

దేహపుష్టికి, పుంస్త్వమునకు కొన్ని చిట్కాలు చెప్పబడినవి.

---

1. ఆచార్య బి. రామరాజు:- జానపదగేయ సాహిత్యము–పుట. 752

వానిని వాజీకరణయోగమందురు. ,,పచ్చజొన్నన్నంబు పెయ్యావుల పెరుగు_ యెడవ దొడ్డన్నంబు ఎఱ్ఱావుల పెరుగు,, తిన్నచో రాటుదేలిన అంగపుష్టి కలిగి దృఢశరీరుడగును. వాత్స్యాయన కామ సూత్రములలో గూడ వాజీకరణయోగము (వృష్యయోగము) లను దెలుపునప్పుడు తేనె, పాలు, నేయి, చక్కెర, చారపప్పు, మినపపప్పుల యొక్క ప్రాముఖ్యత వివరింపబడినది.

> ,,చెమ్మచెక్క చేరెడేసి బుక్క—అట్లుపొయ్యంగ ఆరగించంగ
> రత్నాల చెమ్మచెక్క రంగులేయంగ—ముత్యాల చెమ్మచెక్క ముగ్గులేయంగ
> పగడాల చెమ్మచెక్క పందిరేయంగ—పందిట్ల బాలుడు పారాడంగ,,*

ఎఱ్ఱని పూలు బూయు (రత్నాల) చెమ్మచెట్టు యొక్క చెక్క (బెరడు)ను దెచ్చి మెత్తగ పిండివలె చూర్ణముచేసి 'అట్లు' దిన్నప్పుడు చేరెడేసి బుక్కినచో కుసుమ రోగము, శూలనొప్పి (బహిష్టునొప్పి) వంటి గర్భదోషములు హరింపబడి రజస్వల కానివారు రజస్వలలగుదురనియు; తెల్లని పూలు బూయు (ముత్యాల) చెమ్మచెక్క చూర్ణమును బుక్కినచో నిస్సంతులకు గర్భధారణ కలుగుననియు పైపాటలో గుప్త పరచబడినది. రంగులేయంగ, ముగ్గులేయంగ, అనుమాటలు సమర్తకు, సంతునకు సూచనార్థకములు. పగడాల చెమ్మచెట్టునకు పందిరి, అందు పారాడు బాలుడు సంతానవతికి మాతృత్వానుభవసిద్ధి యని భావము. పై పాటకనుబంధముగ ,,పాలీయ వచ్చెనా పడతి పద్మాక్షీ,, అనుపాదమును గూడ చూపుచు తామర గింజలను పొడిచేసి, ఆవునేతితో కలుపుకొని, తగుమాత్రము బాలెంతలు మందువలె గ్రహించినచో వారికి పాలు పడవచ్చునని శ్రీ నేదునూరి గంగాధరం గారు తెలిపియున్నారు 1.

మందులు బెట్టి చంపుకొనుటకు రామజోగి వంటి యోగులో బైరాగులో తోడ్పడుట గ్రామములలో నప్పుడప్పుడు గన్పట్టుచుండును,

1. జానపదగేయవాఙ్మయ వ్యాసావళి_పుటలు 136, 137

,,మందులు మందులు మందూలు—మైరామజోగి
మచ్చులా మాయాల మందులు
భూమిలో భూదండ ఏరు—భూతవిల్లి రొమ్ము ఎముక
పుట్టమీద తెల్ల మొలక—కాశగంట మీని సిలక
ఏటి వొడ్డున ఉద్దిమాను—ఉద్దిఏరు కానుగేరు
కాశిలా జిల్లేడుఏరు—కండ్ల గప్పెడి కన్ను గుడ్డు
బండికింద కప్పనరము—బాలెంత బొడ్డుబొక్క
సన్నవిల్లల బుర్రమెదడు—అన్ని గూడా దంచుకోని
రామ లచ్చనుల పొనగూడి—నోట సదివి మూటగట్టి
ముందరీ సొర్గాము దాటి—రామజోగీ మందూలమ్మా
పుంటికూరల మందుపెట్టి—యింటి మొగన్ని సంపుకోని
నేనుపోతా సూడరమ్మ—మందులయ్యా ఎంబడీ,,*

బొరా! రామజోగి మందెంతపని జేసినది! ఈ పాటలో చావుమందున కుపకరించు వస్తువుల పట్టిక తక్కువేమికాదు. అసలవి సులభ సాధ్యములు కూడ కావేమో? బహుశః వానిలో కొన్ని దొరకినను పనికావచ్చును. సాధారణముగా నిట్టి మందులు తినుపదార్థములలోనే పెట్టుచుందురు. చంపుట కింకెన్నియో మందుల పాట్లున్నవి చూడుడు. ,,గాజుపొడి గన్నేరుపొడి కల్లులాకలుపమ్మ నాకూలిదానా—మర్రిపాలు జిల్లేడిపాలు బువ్వలా కలుపమ్మ నాకూలిదానా,,. మరొక విధమైన మందు క్రింది పాటలో వ్యక్తము. అది మచ్చుమందు. దానిని ,,పెట్టుమందు,, అని వ్యవహరింతురు.

,,కాకిరెక్కలు కలుపు రెక్కలు సికింద్ర పురిపాలు
నాకుతెలిసిపాయెను-నీవు తెచ్చియ్యే
చల్లునిగ్గు ఉమ్మెంత యిత్తులు నల్లగాడిదిపాలు
ఊసరెల్లిగొట్టి కారిజాలు గుండెబీసి
కాల్చి కషాయము కల్లులోన యిచ్చె,,— ఇట్టిమందు మెదడునకెక్కి

మందు పెట్టినవారి మాటకు చెవి యొగ్గును. మైలతుత్తురు (Copper Sulphate) అను మందును వాడినచో పోట్లు మంటలతో గిలగిల కొట్టుకొనిపోదురని క్రింది పాటలోనున్నది.

,,తొవ్వెంట బొయ్యేతోడ తెల్ల బట్టలోడ
మందులుబెడ్త నంటివి నామరిదికీ
మందులు బెడ్త నంటివి మైంతుత్తురు బెడితె

మంటలూ పోట్లాయె నామరిదికీ,, ఇట్టి వ్యవహారములన్ని వ్యభిచారము వలన సంభవించుచున్నవని పై ఉదాహరణఒక సాక్ష్యము. మరుగు మందులవలన మరణముకొని తెచ్చుకొనుటయును జరుగును.

,,నిమ్మచెట్టుకు నిచ్చెనేసి నిమ్మ పళ్ళూకొయ్యబోతే
నిమ్మముల్లు రొమ్ముకు నా చెనోయ్—ఓరందకాడా

రైకమూడీ రక్తమాయేరా,,*—నిమ్మచెట్టు లోని చలువ కామ వివశతను ఉపశమింపజేయును. విరహసందర్భములందు దాని ప్రసక్తి వచ్చుచున్నది.

,,కమ్మగెగ్గిరి వాసనాకేరా బంగారిసామి

ఉండలేదుర ముండ మనసు,,* కమ్మగెగ్గిరి (చంద్రతులసి) చెట్టు వాసన మిక్కిలి మైకమును కలించు నట్టిది. దానిచేత ఎన్నెలాడి మోహితు రాలగునని తెలియుచున్నది. ఉష్ణమును కూడ తగ్గించును.

,,కుంకుమూ కురువేరు దవనమూ దానింటి తడికె
వొంగిరారా సుంకు తగిలీసీ బంగారిసామి,,*

కుంకుమపువ్వు, కురువేరు, దవనము అనునవి కూడ సుగంధ ద్రవ్యము లైనప్పటికిని మరుగు మందుల వలె ఆ కట్టుకొనుటలో నుపయోగపడుచున్నవి. వానివలన మత్తెక్కి వశమగుట జరుగవచ్చును. ఇట్టి దినుసులచేత మోహితుల మధ్య సంబంధము లేర్పడుచుండును. అట్టివి విడెములందుబెట్టి ఇచ్చుటజరుగును.

వనితావశ్యౌషధమ్ములను కొన్నింటిని హంస వింశతికారుడు కూడ పేర్కొని యున్నాడు 1. ఓషధుల చేతనేగాక మంత్రములచేత గూడ కామించిన దానిని మలుపుకొనుట పల్లీయులందు ప్రచారము వహించియున్నది. ,,అంతురానా పొయ్యేదాన్ని—మంతురానా మలుపుకుందు—ఏరుదాటి పొయ్యేదాన్ని—ఏలమీనా దిప్పుకుందు,,*. వశీకరణమంత్ర తంత్రౌషధములను గూర్చి సత్యభామ ద్రౌపది నడుగగా నామె యవి మంచివి కావని, అభిలషితార్థములకు మారు అనర్థములకె దారితీయునని చెప్పినది 2.

,,చిట్ల పొట్లకాయ చీమనెల్లికాయ—గోదపుచ్చకాయ గోరుచిక్కుడుకాయ కొమ్మనిమ్మపండు అత్తకుపెట్టెద అల్లం—నేనేతిందును బెల్లం,, ఇందు కామూదుల యందు తృప్తి కలిగించు ఆహారపదార్థములున్నవి. ,,ఉమ్మెత్తకాయ తింటేను వెర్రేవెర్రే—మిరపకాయ నమిలితేను వర్రేవర్రే,, ఉమ్మెత్తకాయ తిన్నచో వెఱ్ఱి పుట్టుట జగద్విదితము. హంస వింశతిలో కూడ ,,కంతు మాయల నుమ్మెత్త కాయ దినిన—వెఱ్ఱి లెలగున వ్యసనంపు వెఱపు వొడమి,, 3 అని యున్నది.

పిత్తదోషము గలవాని దృష్టికిరణముల ద్వారా పిత్తసారము (చేదుబుడ్డ లోని చేదు) ఇతరులు తిను అన్నము (ప్రాధానముగ వేడి అన్నము)ను కలుషితము చేసి వాంతులు కలిగించును. అది సహజము. దానినే దృష్టిదోషమందురు. అట్టి దృష్టిదోషము తగిలినపుడు ,,జీడిగింజలతోటి—జిల్లెడాకులతోటి—మంగనిప్పుల తోటి—గోవు పెండలతోటి—తలెసెంబులతోటి దిష్టిదియ్యాయి పిల్లోరాములమ్మా,,* ఇట్లు ఆ దినుసుల పొగవేసిన అది నయమగును. వానిలో నేదేని యొక దినసైనను చాలును. ఇంతేగాక ,,నల్లకోడిపిల్లలతో—నాలుగు టెంకాయలతో—నిమ్మ

1. హంసవింశతి—ఆ. 5. పద్య. 133, 134, 135.

2. శ్రీమదాంధ్ర మహాభారతము—అరణ్యపర్వము—ఆ. 5. పద్య 296, 297.

3. హంసవింశతి—ఆ. 1. పద్య. 220

కాయ నీళ్ళతో నానదరు తియ్యయ్యో మామా కొడుక జంగయ్యో,, ఇట్లు దిష్టి తీసినచో గూడ ఆ దోషము హరించును. వంజురోగము. పాండురోగము, పిత్త దోషము గలవారికి నల్లకోడిమాంసముతో నయముగావింతురు. ,,లివర్,, వ్యాధికి నల్లకోడిమాంసము మిక్కిలి ఉపకరించును. దృష్టి దోషమగుటకు ఒక కారణ మిట్లున్నది-

,,తెల్లసీరె గడితె తెల్లరైకే తొడిగితె దిష్టి గొట్టిందిరో
నల్లసీరె గడితె నల్లరైకే తొడిగితె దిష్టి గొట్టిందిరో,,*
అనగా ఏచీర కావన్నె రవికె చక్కగా తీర్చి కూర్చి ధరించినచో దృష్టిదోషము తగులును. కానినేడిట్టి యుడుపు లందరు కట్టుటవలన దాని ప్రభావముండదు.

,,నేనొచ్చి నెలలాయె నెలలోన కలలాయె
నెలతప్పె నేమిసేతునే ఓయమ్మ నెలతప్పె నేమిసేతునే
రెండవ నెలవచ్చె మెండాయె వేగిళ్లు
మూడవ నెలవచ్చె ముద్దపిండంబాయె
నాల్గో నెలవచ్చె నలుపెక్కె కుచములు
అయిదో నెలవచ్చె అవయవాలేర్పడె
ఆరవ నెలవచ్చె అర్థ పిండంబాయె
ఏడవ నెలవచ్చె ఎదురు పిండంబాయె
ఎనిమిదో నెలవచ్చె వెనుబట్టి బరువాయె,,*—ఇందు గర్భిణి యొక్క శారీరక లక్షణములు, గర్భస్థ పిండము యొక్క క్రమపరిణామము చెప్పబడినవి. ఆనోట ఈనోట నలుగుట చేత పిండోత్పత్తి క్రమవికాస విషయమంత క్రమముగాలేదు. ఈ విషయమును గర్భోపనిషత్తులోను 1 బృహజ్జాతకము

1. ఏకరాత్రోషితం కలలంభవతి సప్తరాత్రోషితంబుద్బుధం భవతి
అర్థమాసాభ్యంతరేణ పిండోభవతి మాసాభ్యంతరేణ కఠినోభవతి
మాసద్వయేన శిరః కురుతే మాసత్రయేణ పాదప్రదేశో భవతి
అథచతుర్థేమాసే జఠరకటిప్రదేశో భవతి పంచమేమాసే పృష్ఠవంశో భవతి
షష్ఠేమాసేనాసాక్షి శ్రోత్రాణి భవంతి సప్తమేమాసే జీవసంయుక్తోభవతి
అష్టమేమాసే సర్వసంపూర్ణోభవతి నవమేzపీవతే,,—గర్భోపనిషత్తు.

లోను 1 చూడవచ్చును. పల్లీయులలో పిండోత్పత్తి శాస్త్ర విజ్ఞానమున కిది నిదర్శనము. ప్రథమ మాసమునుండి ప్రసవమగువరకు గర్భస్థపిండముయొక్క క్రమ పరిణామదశను గుర్తించుట సామాన్యమైనదికాదు. ఎంతయో యనుభవము మీదగాని తేలదు. ఈనాడు పెద్ద పెద్ద వైద్యశాలలలో అట్టి పరిణామ విషయమున అత్యాధునిక సాధన సంపత్తి నుపయోగించి కనుగొనుచున్నారు. పల్లీయుల కట్టి సాధనసంపత్తి యెక్కడిది? గడించిన అనుభవమును నిశితముగా పరిశీలించుటయే వారి సాధన సంపత్తి. గర్భిణియొక్క మానసిక స్థితిని బట్టి కోరబడు కోరికలను వారు ముందే తెలిసికొని యట్టివి సమకూర్చుచుందురు. మన ప్రాచీన తెలుగు సాహిత్యములో గూడ గర్భిణి యొక్క శారీరక స్థితిని గూర్చి యిటులనే వర్ణించుట జరిగినది. ఇంకను, పుట్టబోవు శిశువు ఆడశిశువా, మగశిశువా యన్ని కూడ తొమ్మిదవ మాసములో చక్కగా పల్లీయులు గుర్తించగలుగుదురు. ,,పాలు జావలు కాచరమ్మా — నాకు మంత్ర తీర్థము లివ్వరమ్మా,, అనుట సుఖప్రసవ దోహదక్రియ. ఇంతేగాక గుడిలో నందిని త్రిప్పుట, పాల జలక మాడించుట, భరింపలేని వేదన కలిగినప్పుడు తలకురులను నోటికందించుట (తద్వారా వమన వేగము కలిగి పిండము దూసి బయటపడుటకు వీలగును) వంటి ఆపత్కాల క్రియలు చేయుదురు. ,,తిప్పరే గుళ్ళోను నందిని తిప్పరమ్మా ఓయమ్మ నందిని తిప్పితే మంచి దందురేమో అమ్మ—జాగుచాయక పాలజలకము పోయరమ్మా అమ్మా తలకురులు నోటి కందియ్యరమ్మా,,. జలమును మంత్రించుటకు గల మంత్రములను ధర్మసింధు పేర్కొన్నది 2. ప్రసవించిన పిదప బాలెంతరాలు

1. శ్లో॥ కలిలఘనాంకురాస్థి చర్మాం గజ చేతనతాః
   సితకుజ సూర్య చంద్రార్కి బుధాః పరతః
   ఉదయప చంద్ర సూర్యనాథాః క్రమశోగదితా
   భవతి శుభా శుభంచ మాసాధిపతేస్సదృశమ్
   —వరాహమిహిరాచార్యుడు:—బృహజ్జాతకము—నిషేకాధ్యాయము. శ్లో. 16.

2. ధర్మసింధు:— పరి. 3. పుట. 248

దేహమునిండ (మేటిగా వేపాకు పసుపు పుయ్యారే) వేపపసరు, పసుపు పూయుదురు. వేపాకును నీట మరగించి స్నాన మాడించెదరు. దానివలన బాలెంత నొప్పులు తీరును. ఇవి Anti septic మందులుగా పనిచేయును. పురిటితో బాలెంత దేహపుష్టిని కోల్పోయినప్పుడు దేహమును తగిన ఉష్ణ స్థాయిలో నుంచుటకును, కఫవాతములను, శూలలను హరించుటకును, వీర్య వృద్ధికిని, క్రమముగా శక్తిని పుంజుకొనుటకును మున్ముందే పిప్పళ్లు, శొంఠి, మిరియాలు, లవంగాలు, జాపత్రి, తాటిబెల్లము, ఇంగువ సమకూర్చుకొని యుంచు కొందురు. ,,పిప్పళ్లు శొంఠీ మిరియాలు కొట్టి వుంచరే—ఎక్కువైన లవంగాలు పత్రి చేర్చరోయమ్మా—తాటిబెల్లము ఇంగువ తెచ్చి వుంచరోయమ్మా,,. ఈ దినుసుల యొక్క పనిని గూర్చి చరకసంహిత వివరించి చెప్పినది 1. ఇట్టి జాగ్రత్తలన్ని తీసికొనుట వలననే సూతికారోగములవంటి అపాయములు దూర మగుచున్నవి. ఇండ్లలోని ముసలమ్మలకీ విషయములు కరతలామలకములు. గర్భిణి నుండి శిశుపోషణ వరకు తీసికొనవలసిన జాగ్రత్తలను గూర్చి ఈనాడు పత్రికా వాణి, ఆకాశవాణి వెన్నుదట్టి చెప్పుచున్నను మతికెక్కవు. అట్లుకావలె నన్నచో పల్లె పదాల రూపమున అందించ ప్రయత్నము చేసిన బాగుండును. పూర్వము ప్రతి విజ్ఞాన మించు మించుగ పెద్దలనుండి పిన్నలవరకు పాటల ద్వారానే అందుచుండినది. దానివలన విషయము ముంజేతి యద్దమగుచువచ్చినది. ఇట్టి మన సాంప్రదాయక పద్ధతిని పునరుద్ధరించుకొన్ననేగాని కుటుంబ జీవనమునకు సామాజిక జీవనమునకు ఏకాత్మత కుదరదు.

,,నీ పిక్కలు దొడ్డున్నయి—నీ బొడ్ల సుడివున్నది

నీకు పిల్లలు కారమ్మో—కింటీగేరి బాలమ్మా,,—పిక్కలు దొడ్డుగ నుండి నాభియందున సుడిఉన్నచో ఆ స్త్రీకి సంతానముకాదు. ,,లో తొడల మచ్చుంటె,, కూడ అంతేనట.

---

1. చరకసంహిత।—సూత్రస్థానము అ. 27. ఆహారయోగి వర్గము. శ్లో. 297, 300.

పచ్చపొడుపు అనునది అతి ప్రాచీన కాలమునుండి సంక్రమించుచు వచ్చెడు ఆయుర్వేదిక విజ్ఞానము. వైదిగ యుగము నుండియు ఈ విజ్ఞాన మున్నదని చెప్పుదురు. అది తోటమిక (Totamic) మతసంబంధ ప్రక్రియగ బుట్టినదందురు గాని, అది మొట్టమొదట వాతపు నొప్పులు వంటివాని చికిత్సగా రూపొంది ఆ తరువాత దశలోనే మత సంబంధాది చిహ్నములను పొడిపించు కొనుట ఆచారమైయుండును. ఆయుర్వేదికమైన విలువగల పచ్చని ఆకులరసము నుపయోగించి సన్నని సూదులతో పొడిపించుకొనుట వలన పచ్చపొడుపు, పచ్చ బొట్టు అనుపేర్లు వచ్చియుండును. కాకరాకు, గుంటగలగరాకు, దొండాకు, ప్రత్తియాకు వంటి వాని పసరులుపయోగింతురు. పూర్వమింకెన్ని పసరులు వాడి యుండిరో తెలియదు. పచ్చపొడిపించుకొనుటలో పల్లీయులకు ఎక్కలి అభిరుచి.

,,పచ్చబోయించుబావా—ఆకుమల్లె పోకమల్లె
బొడ్డున పొన్నంగి మల్లె—బావా పచ్చబోయించు బావా—,,

ప్రేయసీ ప్రియులిది కేవలము సౌందర్యమునకే గాక పరస్పర ప్రేమానురాగ చిహ్నముల కొఱకు పొడిపించుకొనుచుందురు. పిక్కలమీద, దండరెట్టలమీద, చేతులమీద, చంకప్రక్కన పచ్చపొడిపించుకొందురని ఈ క్రింది పాటవలన తెలియుచున్నది.

,,నా పిక్కలమీద పొడిపించు—రాములు బావా
నా దండలమీద పొడిపించు— ,,
నా చేతులమీద పొడిపించు— ,,
నీ సర్దా తీరకపోతే— ,,
నా చంకల పక్కన పొడిపించు— ,,

ఇంతేగాక కొందరు ముక్కుమీద, మరికొందరు నొసటిమీద కూడ పొడిపించు కొనుట యున్నది. లంబాడీలెక్కువగా ముక్కుమీద, ముంజేతులమీద పొడిపించు కొందురు. మొదట పసరు అంటించి గాని లేక సన్నని సూదులతో పసరద్దుకొని

గాని పైచర్మమునకు సూది గ్రుచ్చుకొనునట్లు వివిధ ఆకారములుగ పచ్చ పొడుచుట జరుగును. ఈ విధానము నేటి ఇంజక్షన్ పద్ధతికి ప్రాథమిక రూపమై యుండును. పచ్చపొడుపెట్లు వచ్చినదను విషయమును ఇదమిత్థముగా తేల్చలేము గాని, ఒక పురాగాథను జూచినచో దాని ప్రాథమిక దశ యెట్టిదో నుంత ఊహింప వీలున్నది. అది భయమును దూరము చేయుటకై ఏర్పడినట్లున్నది 1. అయినను దీనిని సరియైన ఆధారముగా భావించుట ఎట్లు?

కలకలు, కీళ్ళనొప్పులు, వాతపట్లు, కణతలు మున్నగు వాని చికిత్సలకు పచ్చపొడుపు చేత నయమొనరింతురు. ఔషధము నేరుగ రక్తములో గలిసి పోవును. బహుశః శీఘ్రనివారణ కిట్టి పద్ధతి వ్యాప్తిగాంచియుండును. చరకుడు, సుశ్రుతుడు దీనిని గూర్చి నేటి ఇంజక్షన్‌ల రూపమున మందులను వాడు పద్ధతులను ప్రచారము చేసినారని నేదునూరి గంగాధరం గారు 2 చెప్పుచు సూచికాభరణ సూచీముఖరసములు, పాశుపతాస్త్ర బ్రహ్మాస్త్రాది రసములు మున్నగు నవి సూచీవ్యధనము చేత వాడదగిన ఔషధములని పేర్కొనుచు, వాటికి తగిన ఆధారములను రసరత్న సముచ్చయము, రసకౌముది, వైద్య చింతామణి

1. నేదునూరి గంగాధరం ,,పచ్చబొట్టు —ఆయుర్వేద విజ్ఞానము,,
   -ఢంకా- 1958 సెప్టంబర్ సంచిక 3 (రజతోత్సవ సంచిక)

2. "It is curious that so universal a custom as tottooing should be associated with so little mythology and that its patterns should usually have so little meaning. There is a Brahmin story that Lakshmi, the wife of Vishnu; told her husband that whenever he left her alone she became frightened. Vishnu therefore took his weapons and pressed them on her body, saying that the marks of his weapons would gaurd her against evil."

   -Campbell-The Indian Antiquary, XXVI. P. 126.

అనువైద్య గ్రంథములనుండి యెత్తిచూపినారు. కాని, చరకసంహిత, సుశ్రుత సంహితల విషయము మాత్రము మృగ్యము. ప్రపంచములో గూడ వివిధ జాతులలో నిట్టి పచ్చబొడుపు పద్ధతి యున్నది. పచ్చబొడిపించుకొనుటలో రాను రాను ఆయా జాతివారు తమ తమ ఆదర్శములకు, అభిరుచులకు తగిన చిహ్నములను వేయించుకొనుట ఆచారమైనది. అట్లే పచ్చబొడిపించుకొను టెట్లాచారమైనదనుటకొక పురాగాథ నిట పరిశీలింపదగును 1.

వానలు గురిసినప్పుడు భూమిగుణమును బట్టి ఏయే భూమి ఎంతెంత పదునగునో చెప్పుదురు.

"తువ్వ 2 చేలన్నియు తుళ్ళెపదునాయె
రేగాటి భూములన్ని బురద పదునాయె
పాటి భూములన్ని 3 పదును చక్కనాయె
పల్లపు భూములన్ని చల్లని పదునాయె

1. "One day Mahadeo invited the gods to a feast. A Gond God went with the others. The Goddesses seated themselves on the ground and Parvathi was amongst them. The Gond God went there to take his wife away but amongst so many he could not recognise which was his. By mistake he put his hand round Parvathi's shoulder to drag her away, and she began to scream. Mahadeo knew that it was only a mistake and laughed, but Parvathi was very angry. However, in the end Parvathi arranged that to distinguish the women of different casts they should be tottooed in different ways, and since then the custom of to ttooing, hascome in to the world".

-Myths of Middle India. P. 478

2. తువర = సువాసనగలభూమి; తెల్లఇసుకభూమి 3. మెఱకనేల

ఎఱ్ఱచెక్క భూములన్ని ఎంతో పదునాయె,,—భూసారమును బట్టి పండెడు పంటలయొక్క ఫలమును గూడ వారూహింతురు. మొక్కలకు, తోటలకు బట్టెడు కొన్ని తెగుళ్ళ నివారణకై ,,చాకలి పొయ్యిలబూడిది కాముని కంతల బూడిది—కుమ్మరోని ఆముల బూడిది,, తెచ్చి చల్లుదురు. ,,మోతుకుల్ల వాన గురిసె—మొదివె గంట 1 యిగురువేసె,,. వానలు గురియు నప్పుడొక వేళ మొదపదంటు మీద పిడుగు పడినచో అది దానిని భూమిలోనికి దూరిపోకుండ తనలో నిరోధించివేయును. మొదపదంటు భూమినుండి తలయెత్తి యించుక ఇగురు వేసినచో చాలు, అంతటి పనిచేయగల సమర్థత దానికి గలుగును.

,,పెద్దవాడు చిన్నవాడు మామతోను గూడిరేని
వంచనింత లేకుండ వానవచ్చునూ
గ్రుడ్డివాడు నడ్డివాడు మామతోను గూడిరేని
వంచనింత లేకుండ వానవచ్చునూ,, ఇట్టి పిల్లలపాటలలోగల జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానమును గూర్చి శ్రీనేదునూరి గంగాధరం గారు చక్కగ సమన్వయించి చూపినారు 2. పెద్దవాడు = సూర్యుడు; చిన్నవాడు = బుధుడు; మామ = చంద్రుడు; సూర్యుడు మరియు బుధుడు, చంద్రుడున్న రాశిలోనికివచ్చిన యెడల వానవచ్చునని తెలుపబడినది. గ్రుడ్డివాడు = శుక్రుడు, నడ్డివాడు = శని, శుక్ర గ్రహము మరియు శనిగ్రహము చంద్రగ్రహముతో గూడి ఏకారాశి యందున్న యెడల వానవచ్చునని భావము. ,,పంచమీ సోమవారం మంచి నక్షత్రం—మనసీత సమర్తై యున్నది వేళజూచి చెప్పవలె,,* తిథివార నక్షత్రాదులతో గూడిన జ్యోతిష విజ్ఞానము పల్లీయులకు సంప్రదాయ సిద్ధము. ప్రతి కార్యమునకు తిథి, వార, నక్షత్రములను విధిగా జూచుట యైనది.

---

1. మొదపదంటు, దర్భ.

2. జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి—పు. 140, 141.

అప్పుడప్పుడు చెంచుదొరలు వచ్చి భిక్షమడుగుచు కుటుంబికుల యొక్క హస్తములను పరిశీలించి జ్యోతిషమును చెప్పుచుందురు. "మారెమ్మ జాత్ర నుంటి మరణాము కద్దని—శ్రీశైలము చెంచుదొరా చెయ్యిజూసి చెప్పినాడు," మారెమ్మ జాతరనుండి మరణము సంభవింపనున్నదని ఒకానొకనికి చేయిచూచి శ్రీశైలము చెంచుదొర జ్యోతిషము చెప్పినాడు. అట్లు చేతులు జూపుకొని జ్యోతిషము చెప్పించుకొనుట పల్లీయులకు మిక్కిలి ఆసక్తి. ఆసక్తియే గాక ప్రాధాన్యమిచ్చెదరు. "అదిగదిగో చుక్కలు దబ్బ సిరిమొగ్గలు—పట్టవోయి సూత్రం త్రివ్వవోయి పుట్ట—దూలాలు చెక్కించి దుప్పట్లు పరిపించి," ఇందు వాస్తుశాస్త్ర విజ్ఞాన మున్నదని అనుమానించుటయును గలదు. ఖగోళమున నేవియో ప్రత్యేకమైన చుక్కలను (నక్షత్రములను) గమనించి వాని లక్షణములను గ్రహించి, ఇలు కట్టుకొనుట కనుకూలతను భావించి, పుట్టమన్ను త్రవ్వుకొని తెచ్చి కొలత త్రాడు (సూత్రము)ను బట్టి గోడలు బెట్టి దూలములమరించినట్లుగా అందలి భావార్థము నూహింపవచ్చును. "ఓ రందకాడా బంగారు మామా—దచ్చి నానా గాలితోనే—వచ్చె నల్లమబ్బుతోనూ— వన్నె వన్నె వార్త లంపుమురా," నల్లమబ్బుతో వార్తలంపుట సరేసరి, మేఘసందేశమువలె నున్నదనుకొన వచ్చును. కాని గాలితో వార్తలంపుట యన్నది నిస్తంత్రివార్త (Wireless) వలెనున్నది. దక్షిణమునుండి గాలితో మేఘములు వచ్చుట తీవ్ర వృష్టికి నిదర్శనము. (పూర్వమేనాడో మన యోగులు యోగశక్తిని ప్రయోగించి దూర శ్రవణము, దూరదర్శనము వంటివి సాధించి యుండిరి.) గాలికి చలనశక్తి, ధ్వని తరంగములను మోసికొనిపోవు గుణములుండబట్టియే గాలితో, మేఘముతో వార్తలంపుట విశేషము. ఇది ప్రేమైక జీవుల భావనాత్మక విజ్ఞానము.

నెల పొడుపు దినములలోని నెలవంక యొక్క స్థితినిబట్టి ధరల పెరుగుదలను తరుగుధరలను గుర్తించుటయును గలదు. "దక్షిణపుకొమ్ము హెచ్చు ధాన్యపుధరతచ్చు—ఉత్తరపు కొమ్ము హెచ్చు ఉప్పుధర తచ్చు,"

నెలవంకయొక్క రెండు కొనలందొక కొన (కొమ్ము) దక్షిణపు దిక్కు లేచి యుంచెనట్లున్నచో ధాన్యపు ధరలు తరుగునని, ఉత్తరపుదిక్కు లేచియున్నచో ఉప్పుధర తరుగునని నమ్మెదరు. కాలచక్రములోని కార్తుల ధర్మమును గూర్చి పల్లీయులు చక్కగా నెఱింగి యున్నారు. "రోయిని మృగ వొరుపాయె—రోళ్ళూ రోకండ్లు వగిలె; ఆర్ద్ర వొరుపాయె—అన్నికార్తుల కీడాయె". కాని "మొగ (మఖ) పుబ్బ వొరుపాయె మొగకానంబడిపాయె"* నందురు.

## వస్త్రాద్యలంకరణములు

అభిరుచి ననుసరించి దేహాలంకరణకు వేషభూషణములు రూపొందించు కొనుటయైనది. పరిసరములు బుద్ధిగతమై ప్రకృతి సౌందర్యము హృదయగతమైన పిమ్మట మానవుడు సౌందర్యోపాసన అలవరచుకొనుచు వచ్చినాడు. ఆ స్థితి యందే మొదట తనను తాను దిద్దుకొనుచు ప్రకృతి సిద్ధముగ లభించు ఆకులు, తీగలు, పూవులు మొదలగు వానిచేత దేహము నలంకరించుకొనుట జరిగినదని భావింపవచ్చును. వస్త్రధారణకు, నివాసగృహమునకు శీతవాతాతపాదులు కారణమైనచో వస్త్రాద్యలంకరణములకు సౌందర్యోపాసనయే కారణము క్రమ వికాసదశలో క్రొంగ్రొత్త అలంకరణములను కల్పించుకొన్నాడు. అదంతయు వాని నాగరకత. వేషభూషణాదులన్ని నాగరకత పరిధిలోనివే. అనుభవములోనికి ప్రకృతి వచ్చినప్పటినుండి నాగరకత వికసింపజొచ్చినది. ప్రకృతియే మానవునకు గురువు.

కాలానుగుణముగ మానవ మనస్తత్వమును బట్టి వస్త్రాద్యలంకరణము లలో మార్పు కనిపించుట సహజము. ఇట్టి మార్పువలన కొన్నింటి రూపము మాసిపోవచ్చును. కొన్నింటిగుణము నశించిపోవచ్చును. కొన్ని పూర్తిగ ప్రకృతి లో కలిసి జీర్ణమైపోవచ్చును. ఈకోవకు చెందిన వేషభూషణాదులు పల్లీయులలో జూచెదము. వానిలోకొన్ని అతి ప్రాచీనతను నిలుపుకొన్నవి. కొన్ని ఆధునికతను

కలుపుకొన్నవి. ప్రాచీనతను నిలుపుకొనుచు వచ్చినవి సంప్రదాయస్థితములు. సంప్రదాయమునకు పల్లీయులు వారసులుగ మిగిలినారు. వారు ధరించెడు వస్త్రాద్యలంకరణము లెన్నియో రకములున్నవి. నేటికివి మోటుగ అనిపించినను వానిలో కొన్నింటిని ఆధునికులు ధరించుచునే యున్నారు. అయినను, మన పూర్వులు ధరించినన్ని ఆధునికులు ధరించలేరు. దానికి కారణము, అవిమోటైన వని చెప్పుదురు. కాని, కాలపరిస్థితి, ముఖ్యముగా ఆర్థికస్థితి దగ్గర కొత్తుకొని వచ్చుట వలన వివిధ భూషణాదులకొరత ఏర్పడినది. ఉదాహరణ కీనాడాధునిక వనితలు నిండార కొంగును సింగారించుకొనజాలరు. గొజ్జెతోక యంత కొంగు మాత్రము వేతురు. ముక్కు కుట్టించుకొననివారు, చేతులకు సరిగా గాజులు తొడుగుకొననివారు లేకపోలేదు. ఇది నేటి వాడుక (Fashion ).

ఒక్కొక్క అంగమున కెన్ని భూషణములున్నవో పల్లె పదాలలో చెప్పబడినవి. మెడనుండి కీలు జడనిండ, చెవినుండి ముంజేతులనిండ, నడుము నుండి మడమనిండ భూషణ విశేషములే. ముఖ్యముగా ముక్కుమీద ముద్దు ముద్దు కొకముత్యము రాలెడు ముత్యాలపోగు ముద్దరాలి ముద్దులెత్తి మూట గట్టును.

ముక్కుసొమ్ములు:—

| | | | | |
|---|---|---|---|---|
| ముక్కుపోగు | ముక్కెర | ముంగర | ముక్కుపుడక | నత్తు |
| హంసనత్తు | ఆణిముత్యపుముక్కెర | ముక్కుతీగ | బులాకి | |

వీనిలో ముక్కెర, ముంగర ఒక్కటే. వీనిరూపము తెలియరాదు. నాసికాభరణ విశేషమనియే చెప్పుకొన వలసి వచ్చుచున్నది. ముక్కుపుడక, ముక్కుపుల్ల యన్నను ఒక్కటే. ముక్కుపోగు, ముక్కుతీగ యన్నను ఒక్కటే.

చెవిసొమ్ములు:—

| | | |
|---|---|---|
| చెవులపుల్లలు | గెంటీలు, లోలకులు | ముత్యంపుకమ్మ |
| పగడంపుకమ్మ | బావిలీలు, జుంకము | చెవుల వజ్రపురాళ్ళు |
| పత్తికాయ గెంటీలు | ,,గెంటీలకు జొంపాలు, జొంపాలకు జుంకాలు,, | |
| ముత్యాల బావిలీలు | తాటంకములు | తనుకులు |
| వెండి దొనుకులు | పైడి దొనుకులు | ముత్యపుజోడు |
| రవ్వలజోడు | దుద్దుల జత | రాళ్ళకమ్మలు |

వీనిలో బావిలీలు, దుద్దులు ఎట్టి రూపము గలవియో చెప్పలేము. దొనుకులు (తనుకులు) గూబ ప్రక్కనగల చిన్న చెవి భాగమున కమర్చబడు వెండి లేక బంగారు తునకలు. అవి ఉత్తుత్త తునకలుగావు. ఒక ఆకృతిని యేర్పరచు కొన్నట్టివి. ప్రతి ఆభరణమున కొక ప్రత్యేకమైన ఆకారముండుట సామాన్యము. ముత్యము, పగడము, వజ్రము, రాళ్ళు (కృత్రిమ గాజు రాళ్ళ) మున్నగునవి పొదిగింపబడుట చేత చెవికమ్మల కాయాపేర్లు వచ్చినవి.

తలసొమ్ములు:—

| | | | | |
|---|---|---|---|---|
| ,,నగిరెకుప్పె | నెత్తిబిల్ల | గజ్జెలజడ | రాగిడి | జడకుచ్చులు |
| కుప్పెసరితీగ | రవ్వల రాగిడి | మొగిలిరేకు | జడపువ్వ | జడగంటలు |

కొప్పుగొలుసులు కొప్పుబిళ్ళ నాగరము మాడబిళ్ళ,,—నెత్తిబిల్ల నాగరమొకటే. రాగిడి అనగా జడబిళ్ళ. మాడపట్టున ఆమర్చబడునది మాడబిళ్ళ. తలదువ్వు కొనుటకు దంతపు దువ్వెనలు, చిక్కులు తీయుటకు వెండి చిక్కంటెనిగాని, ఈర్పెనను గాని ఉపయోగించుచుందురు. జడకు గజ్జెలు కూర్చబడుటవలన బహుశః గజ్జెల జడయనుపేరు వచ్చియుండవచ్చును. జడవేసికొనువారు జడ చివర కుచ్చులు గాని, గంటలుగాని కట్టుకొని జడమీద జడపువ్వు, రాగిడి, రవ్వల రాగిడి వంటి ఆభరణములను ధరించుచుందురు. 'గడ' ఆకారముతో

చిన్నగానుండి సిగల ద్రిప్పుకొను ఆభరణము కుప్పె. కొప్పు (సిగ) వేసికొను వారు వివిధరకములైన కొప్పులు తీర్చి కట్టుకొని సగిరె (సవర) కుప్పె, కుప్పె సరితీగ, కొప్పుబిళ్ళ కొప్పుగొలుసులవంటివి తాల్చుచుందురు. తలకు తగిన కురులు లేనివారు సవరమును బెట్టుకొనుట పరిపాటి సవరములలో గూడ జల్లి సవరము, ముత్యాల జాలీ సగురము వంటి భేదములున్నవి. ఇక, కొప్పులెన్ని రకములో గమనింపుడు.

,,కురుసటి కొప్పది కుంకుమరై కది—కులముల సక్కనిబీ గొల్లదీ
తేనే గాజులు దొడిగింది—టెంకాయ కొప్పుపెట్టింది,,

,,మెడమీది కొప్పుదాన—మేస్త్రీ పెండ్లామ,,

,,లబ్బరి గాజులదాన జబ్బల కొప్పుదాన,,. ఇవిగాక, జారుకొప్పు, కోర కొప్పు, ఓరసిగముళ్లు వేసికొందురు. కోరసిగ పురుషులు కూడ ప్రాచీనకాలములో వేసికొనుచుండిరి. ఒక బవనీడు ,,దుసికిల జాఱు కోరసిగ,, వేసికొనినట్లు శుకసప్తతి 1 వర్ణించినది. కోయదొర లిప్పటికి నిట్టివి వేసికొనుట చూతుము.

మెడసొమ్ములు:—

| | | |
|---|---|---|
| నల్లపూసదండలు | పెద్దపూసలు, నాను | అరటినల్లలు |
| పూసలదండ | అద్దాలపూసలదండ | ఉల్లిపూసలపేరు |
| బంగారి గుండ్లు | గుండ్ల టిక్కి | గుండ్లపేరు, కాసులపేరు |
| పచ్చలదండ | పచ్చలబన్నాసరము | బంగారు మెడనూళ్లు |
| చెంద్రహారాలు | సూర్యహారాలు | మేలిముత్యాలసరులు |

1. శుకసప్తతి—ఆ. 2. పద్య. 414

| | | |
|---|---|---|
| రవ్వలపతకము | పట్టెడ, కంటెలు | నానుకోళ్ళు |
| అంబరాసుగొలుసు | పసిడిగొలుసులు | సన్నగుళ్ళపేరు |
| జామాలపేరు | పలకలచీరినపట్టెడ | జిగిసీబిళ్ళ |

నాను, నానుకోళ్లు ఒకటేయైనను సుంత భేదముండును. అంబరాసుగొలుసు అనగా నెట్టిదో తెలియుట కష్టము. జిగిసీబిళ్ళ విషయమున గూడ నింతియే. కాసుల పేరు అనగా నాణెములచేత కూర్చబడిన దండ కావచ్చును. లంబాడీ స్త్రీ లిట్టివే యెక్కువగా ధరింతురు. క్రింది పాటలో వివిధావయముల కున్న భూషణముల ప్రసక్తి యిట్లున్నది-

"గజ్జెల గుజ్జుం మావదిన_గుజ్జు స్వరూపం మావదిన
వేళ్ళకుంగరాల్ పెట్టింది_ఉంగ్రాల్ చూసుకవులికింది
కాలివ్రేళ్ళకును పిల్లాళ్లు_కంకనమ్రోగగ గెంతింది
చేతి కంకణాల్ చెకచెకలు_కాళ్ళకు అందెలు గునగునలు
గజ్జెల మ్రోతలు ఘలు ఘల్లు_బొజ్జ కదుపుకొనిపోయింది
ముక్కున ముక్కెర మెరిసింది_చెవులను కమ్మలు చెలరేగే
మెడలో హారాల్ మెలిపోగా_రావిరేకయే రంజిలగా.
రవ్వల రాగిడీ రవులుకొన_రంగులచీర రంగుల రవిక
తింగురంగా మా వదిన_కంగు కింగు మా వదిన
పింగారాల చిగురుబోడి_బంగారంపు పసుములలేడి
మెడలో గంటలు జడలో గంటలు_చేతికి గంటలు కాళ్ళకు గంటలు
గణగణ గణా కాలు కదిపితే గణగణ గణగణ తల ఆడిస్తే
గణ గణ గణ వంగుతులేస్తే గణ గణ" కేవలము గళం గళత్కటక

నూపురహార రవంబులే గాక నిలువెల్ల గళంగళ నినాదము లెసగు భూషణములు

గలవు. ఇట్టి భూషణములుగల స్త్రీ వర్ణనమొకటి హంసవింశతిలో జూడవచ్చును 1.

చెయ్యిసొమ్ములు:—

| | | |
|---|---|---|
| సందెటొంకు | దండకడెము | కీళ్ళకడియాలు, కంకణాలు |
| చేమంతి కడియాలు | పచ్చల కడియాలు | ముంజేతి కడియాలు |
| మొరుగులు | చేతివంకీలు | చెంకీలు |
| సేకటలు | బాజుబందులు | పోచీలు |
| ముద్దుటుంగరాలు | బటువు, యెండిటాకు | వెండుంగరాలు |

పోచీలు, బాజుబందులు అననెట్టివో చెప్పలేము. వెండిటాకు = వెండి ఉంగర విశేషము. సేకటలు = చేకట్లు, చేతికి కట్టుకొను భూషణవిశేషములే ("సేసంగి సేతులకు సేకట లంపోయ్‌రాజ—సేకటలంపోయ్,,). అన్నింటికన్న వడతిచేతికి గాజులందము. అవిముత్తైదువ తనమునకొక ముద్ర. వివిధ ప్రాంతములందు ప్రసిద్ధికెక్కిన గాజులు వాని రకముల విశేషములిట్లున్నవి.

| | | |
|---|---|---|
| నీలంపురిగాజులు | కాకినాడగాజులు | బళ్ళారిగాజులు |

1. సీ॥ కుప్పెరాగిడిబిళ్ళ కుంకుమరేఖ పాపటబొట్టు కమ్మలు బావిలీలు
లలిసూర్య చంద్రవంకలు సూసకము కెంపురవల పల్లెరు బూవురావిరేక
బుడగలు నాన్‌బీగె సొగసైన మెడనూలు కుతికంట్లు సరవణ గుండ్లపేరు
సరిగె ముక్కర బన్నసరములుత్తాందాలు కంకణంబులు తట్లు కడియములును
సందిదండలు నొడ్డాణమందమైన; ముద్రికలు హంసకంబులు మ్రోయగజ్జె
లలరుబొబ్బిలి కాయలుగిలుకు మట్టె; లాదియగుసొమ్ము దాల్చి యయ్యబలమెరయ

—హంసవింశతి:—ఆ. 2. పద్య. 191

వెంగుళూరుగాజులు
గుంటూరుగాజులు
మలకపురిగాజులు
నీలంపుగాజులు
తేనెగాజులు
సన్నగాజులు
చుక్కగాజులు
ఎట్టిగాజులు
పచ్చగాజులు
నల్లగాజులు
గుడ్లగాజులు
రాళ్ళ గాజులు
ఆకుపచ్చగాజులు
కనిగపూగాజులు
లబ్బరిగాజులు
శిలువరిగాజులు

వడ్డాణము సొమ్ములు:—

వొడ్డాలం
పలకాలొడ్డాలం
గజ్జెలొడ్డాలం
చిలుకలవొడ్డాణం
గంటలొడ్డాణం
రవ్వలవొడ్డాణం

మ్మలు:-

కడాలు (కడియములు)
కంచుమెట్టెలు
గురుగుమెట్టెలు
("గురుకుమెట్టెలమీద గజ్జెలుంటె సోకే")
గుళుకుమెట్టెలు
వెండిమెట్టెలు
చుక్కమెట్టెలు
మట్టెవాడమట్టెలు
పావుడాలు (పావడలు)
కాళ్ళపూసలు
పట్టిగొలుసులు
వేళ్ళకు పిల్లేళ్ళు

బొట్టు:—

కస్తూరిబొట్టు
సిరిగంధంబొట్టు
తుమ్మకాయసాదుబొట్టు
యాపకాయచుక్కబొట్టు
నిలువుబొట్టు
అడ్డబొట్టు
చుక్కబొట్టు
లాలిబొట్టు

ఇసుపపెంకుమీద తుమ్మకాయరసమును పిండి రంగరించినచో ఏర్పడెడు దానిని సాదు, సాదుబొట్టు అందురు. కుంకుమకాయ, కాటుక బరణి ప్రతి స్త్రీకి తప్పనిసరియైనవి. 'బుగ్గమీద బొల్లిచుక్క'ను 'చెక్కుల చెందిరేఖ'ను

దిద్దుకొందురు. ఇవి మకరికా పత్రముల వంటివి. చెంపకు చెంపపిళ్లలు కూడ అమర్చుకొందురట. కాని వీని రూపమెట్టిదో తెలియదు. యక్షగానమండలి స్త్రీ పాత్రయొక్క ఆకారమును గాంచినచో నిట్టివి కొంతవరకు బోధపడగలవు.

చీరలు, కొంగులు—వాని విశేషములు:—

| | | |
|---|---|---|
| కావిచీర | జిలుగువన్నె చంద్రకావిచీర | రత్నాలసీరా |
| చిత్తారుచీర | జల్తారిచీర | పట్టుసీరె |
| సీటిసీరె | అంచొన్నెసీరా | కమ్మలచీర |
| ఆకుపచ్చసీరె | నల్లజీరా | గుత్తపుసీరె |
| బొట్ల బొట్లచీర | మొవ్వాకుచీర | రగుపట్టుచీర |
| నాగవన్నెచీర | పట్టెకాళ్ళ పట్టుచీరె | ప్యాటంచునల్లసీర |
| కలిమిపువ్వులచీర | కనుముచీర | నల్లగొండచీరె |
| బాణాలచీర | చంద్రగిరిచీర | బనారసుచీర |
| సింహాద్రిచీర | బండార్లంకచీర | కర్ణాటచీర |
| సుక్కలకోక | ఈనులకోక | అద్దకాలకోక |
| కోటబొమ్మంచుకోక | సాలూరుసన్నకోక | గళ్ళకోక |
| కరకంచుచీర | విరజాజిపూచీర | శనిగపూలచీర |
| ఖాతసీరాలు (చేనేతచీరలు) | | నాగులచీర |
| చింతాకుచీర | కటారికోక | మువ్వంచుచీర |
| ఎల్లజల్తారుచీర | గవ్వాక్షులచీర | మిరపకాయపట్టుచీర |
| తోపుచీర | జిలుగుపు బేదల (బుటేదారి) చీర | |
| సిలకపూలచీర | గంగసరపూచీర | సిలివేరంచులపట్టుచీర |
| నీలంచుచీర | సలువసీర | జోడుపొప్పిళిచీర |
| వాలిపెం | పల్లెమొగ్గంచుచీరె | కొంగుజల్తారు |
| పెటపావడాలు | గుత పుసీరె | చీనాంబరాలు |

ఇన్ని విశేషములతో గూడిన చీరలన్ని పల్లీయుల కళాహృదయము నావిష్కరింప జేయుచున్నవి. కొంగులలో కురుసకొంగులు, జారికొంగులు, గజ్జెలకొంగులు గలవు. వానిమీద కోడిపుంజులు చిలుకలు మున్నగువాని చిత్రము లను వన్నె వన్నె దారములతో అల్లుట జరుగును. „అచ్చము నల్లాచీర అంచున మల్లెమొగ్గ—కొంగున కోడీపుంజు తెలుగోళ్ళ గున్నాదుర్గ”. „ముసుగుకొంగున రెండు ముద్దా చిలుకల్లు—కట్టు కొంగున రెండు కలికీ చిలకల్లు”. కొంగుమీద చీరమీద ఇంకెట్టి నేత ఉండెడిదో గమనించనగును.

„నంద్యాల నల్లంచు లంజపేటంచు—కందనోలు కరకంచు కందిబేడంచు”

„చీరెల్లి చిత్తారునేత—వాల్లెల్లి జవ్వాదిపూత”

„అద్దాల రవిక మీద అద్దకాల కోకో
పయ్యాట చెంగుమీద పావురాలనేతో—నారాచగుమ్మడీ
కుచ్చీల కొంగుమీద గువ్వల్ల కూహో
కరకంచు చీరమీద కస్తూరి మళ్ళో—నారాచగుమ్మడీ”

వివిధ వస్త్రముల మీద జలతారు గాని రంగు రంగుల దారములతో గాని ప్రకృతి సుందరములైన కొమ్మలు, తీగలు, ఆకులు, పువ్వులు కాయలేగాక గువ్వలు, చిలుకలు, కోయిలలవంటి పక్షులు, జింకలు కుందేళ్ల వంటి జంతువులు మున్నగు వాని బొమ్మలను నేయించుకొనుటలోను, కళాత్మకమైన అంచులను కోరు కొనుటలోను వారి యభిరుచి సువ్యక్తము. „అప్పారి కంకన్న నేసిన పట్టె కాళ్లపట్టు సీరె—పట్టుకుంటె పిడికిట్ల నుండ యిడిసితె యిరువాయి మళ్లు” ఇంత నాగరకమైన వస్త్రములు వింతచోద్యముగ నుండును. సనాతనకాలమునుండి గూడ మనదేశములో ప్రపంచ ప్రసిద్ధికెక్కిన వస్త్రములు నేయబడుచుండిన విషయము విదితమే. నత్తగుల్లలో, అగ్గిపెట్టెలో మడచిపెట్ట గలిగెడు చీరలు నేయబడెడివందురు. విదేశీయుల దుండగములతో అట్టి పనితనము మాసిపోయినది. నేడు ప్రపంచమున మచ్చునకైన కన్పట్టదేమో. మన ప్రాచీన కవులు కొందరు

తన కాలమునాటి వస్త్రములను గూర్చి పేర్కొనియున్నారు. అట్టివారిలో పాల్కురికి సోమనాథుడు మొదటివాడని చెప్పవచ్చును. తన కాలమునాటి వస్త్ర వితానమును గూర్చి బసవపురాణములో పేర్కొనినాడు 1. పొప్పళిచీర అనగా నెట్టిదో చెప్పజాలము. ఇట్టి వస్త్రమును హంసవింశతికారుడు „ఒప్పముయ్యంచుల పొప్పళ్ళ హొన్నంచు, వలువలు గరకంచు వస్త్రతతులు,, అని వర్ణించినాడు 2. „కాట్రేడు సీరగట్టి గోచేసినరైక దొడగి మాలచ్చో విగనుంటాయే,, కాట్రేడు 3 నిస్సంతులకు సంతానము ప్రసాదించు వనదేవత యట. „కొంతమంది స్త్రీలకు సాధారణముగా సంభవించే ప్రదర అనేవ్యాధి 'కాటేరి' అను క్షుద్రదేవతవలన కలుగుతుందని ప్రజల నమ్మకము,, 4 బహుశః ఇట్టి దేవతకు కట్నముగా అర్పించి కట్టుకొను చీరను కాట్రేడు చీర అని వ్యవహరించుకొని యుందురు. ఇటులనే పోచమ్మకు కూడ తెల్లని చీరను కానుకగా అర్పించుకొనుట గలదు. దానిని పోచమ్మ చీర, అమ్మవారి చీర యందురు. ప్రత్యేకమైన కొన్ని చీరలు ధరించుటలో స్త్రీలకు కొన్ని విశ్వాసములుండును.

రవికలు:—

| | | |
|---|---|---|
| మగ్గాలరవికె | కుంకుమరైక | బెల్లపచ్చులరైక |
| నింబోలురవికె | నల్లంచుజాకీటు | జాజిపూలరైక |
| మొగ్గలరైకె | ముచ్చాలజాకీటు | జల్తారురవిక |
| ఇప్పపువ్వులమొగ్గలరైకె | పూలరైక | సింతపూలరైక |
| పోతులరైక | మల్లెమొగ్గాలరైక | నెమలికండ్లరైక |

1. [illegible]

2. హంసవింశతి—ఆ. 5. పద్య. 359

3. కాటిఱేడు—కాట్రేడు = శివుడు(ఈ పదరూపము క్షుద్రదేవతకు వర్తించదు).

4. నేదునూరి గంగాధరం—మిన్నేరు—పు. 369

చిలుకముక్కలచీటి రైకె　చిలుకముక్కు అంచు రైక　చంటిముక్కలజాలె బూటాలరయిక

| | | |
|---|---|---|
| నక్కి (జరి) రైక | నాగుబడిగలరైక | కంచురవిక |
| గోచేసినరైక | గుజనపురవిక | లక్కరైక |
| చిక్కుల రైకె | పట్టు రైక | సన్నపురవిక |
| గుండీల రైక | అద్దాల రైక | మదనరైకె |
| ఎనకచిప్పలరైక (వెనుకముడిరైక) | | జెర్రిపోతులరైక |
| బోనాలరవిక | ముతకరవిక | చింతగింజలజీడిరవిక |
| నల్గొండనక్కిరవిక | సూర్యపేటరవిక | రాజమండ్రముగరవిక |

స్త్రీలకు గుత్తపు రవికలన్నను, వానిమీద చిలుక ముక్కుల, చంటి ముక్కలవంటి బుటేదారు అల్లిక యన్నను, చక్కని అంచులన్నను, అద్దములు, పూసలు మున్నగునవి పొదివించుటయన్నను మిక్కిలి యిష్టము. నిత్యజీవిత మందు పురుషులకన్న స్త్రీలు కళోపాసన (సౌందర్యోపాసన)లో నిమగ్నులగు చుందురు. ఒక పడుచుది,

,,కొత్తసారల గుడ్డకొని తెచ్చుకున్నాను—కొలపెట్టి అందంగ కట్టాలి
నాకొదులు బిగుతూలేక కుదురాలి—సంకలో వొదులెట్టి సారసుట్టాబెట్టి
వొంక వొయ్యారాలు వొలకబోసేటట్టు—సన్నఎన్నెల మంచి దారాలతో
చిన్ని వన్నెల పువ్వువేయాలి,, అని కోరుకొన్నది. రవికమీద దారములతో వన్నె వన్నెల పూవులల్లుటయే గాదట, జలతారుతో జాజిపూవులపోత పోయవలెనట. వీపున ,,బాసింగము,,ను, స్తనమధ్యమున ,,సందమామ,,ను వేయవలెనట. ,,జాలె వొయి జలతారు వొయ్యి—జాజిపూలా పోతవొయ్యి ఈపునా బాసింగ మెయ్యి — అందమైనా సండ్ల నడుమ సందమామను నిలుపవయ్యా,,. మరొక విశేషమును గమనింపుడు. ,,కుట్టియిబావా నా కుడిరొమ్మున కృష్ణలీల కుట్టియిబావా,, రవిక కుడి భాగమున కృష్ణలీల కుట్టించుకొనుట కమ్మని యభిరుచి.

కాని యిప్పటి పట్టణములలోని నాగరకస్త్రీల రవికలు కసుగొన్నచో ఏటవ బొమ్మలే కనిపించును గాని అంతటిదివ్యసౌందర్య మాశించినట్లగుపడుట అరుదు. చీరలమీద, రవికలమీద, రకరకములైన వస్తువులమీద నుండెడు నగిషీ పని యంతయు జానపద కళాత్మకము. తిరిగి నాగరకలోక మిప్పుడిప్పుడే పీనిపైన ఇంచుక మోజుపడుచున్నట్లు కనిపించు చున్నది.

## పురుషసంబంధములు:-

పురుషులు చెవులకు కపులాలు, డొల్లుపోగులు, ముండ్లాపోగులు, గుండ్ల పోగులు, ముచ్చాలపోగులు, నీలాలపోగులు_ చేతులకు దగదగా మెరిసేటి దండ కడియాలు, ఎడమచేతికి ఎండికడెము, ,,అయిదేళ్ళ జటువులు హనుమంతు బిళ్లలు, వ్రేళ్ళల్ల మెరిసేటి వెండుంగరాలు,,ను- మొలకు ,,మొలనిండ గజ్జెలు మోకాటి బిల్లలు,, బిల్లల మొలతాడు, బంగరిమొలతాడు, ,,ప్రక్కన్న మెరిసేటి సుక్క మొలత్రాడు,,ను భూషణములుగా ధరింతురు. కుచ్చుల సెప్పులు, అల్లిబిల్లి సెప్పులు, కిర్రు సెప్పులు, గిరక సెప్పులు, పాంకోళ్లు, కాళ్ళ కుపయోగింతురు. పురుషులు కాళ్ళకు తోడా మురుగులు కూడ పెట్టుకొందురు. ,,తొమ్మిదిపేలు పోసి తోడా మురుగులు తెచ్చినాను_పెట్టుకోవడం చేతగాదు పెంకి మొగం పెళ్ళికొడుకు,,.

కాయదోతి, గుండంచు దోతూలు, గోటంచు దోవతి, మల్‌మల్ దోతులు సీకాయ పంచెలు, సాలెపంచెలు, ముచ్చాలంచు దోవతి, కరకంచు దోతి, బొంచె లంగీలు, నిలువుటంగీలు, సిక్కుల అంగి, అంగీలకు యెండిగుండీలు, సిలుకుల సెల్ల, ఎఱ్ఱరుమాలు, చిత్రిరుమాళ్లు, పేసంగి రుమాలు, ముప్పై మూరలపాగ, బొమ్మంచుసెల్లా అనునవి పల్లీయుల వస్త్రవిశేషములు. అంచుదుప్పటి, కందు దుప్పటి, సన్నాపు వస్త్రము, నల్లాగొంగడి, గాజులపేట గొంగడి, గజ్జెలముడి గొంగడి, తెల్ల గొంగడి, పన్నెండు మూళ్ళ పట్టెలగొంగడి, భూచక్రకంబళి,

కుచ్చు గొంగళ్లు, జుంగి గొంగడి అనునవి వారు పరచుకొనునవి, కప్పుకొనునవి.

పల్లీయుల గృహాలంకరణ విషయమున నొండు రెండు అంశములే తెలియవచ్చినవి. విశేషాంశములు చెప్పుకొనక పోవుటకు బహుశః వారికింటిమీద శ్రద్ధ అంతగా లేకపోవుటయే కారణముకావచ్చును. ఇల్లు చిన్నదిగను, సామాన్యమైనదిగను ఉండును గదా. సామాన్యముగా వారు పొద్దుటనే ,,గోవుపెండా దెచ్చి గోలెములగలిపి,, ఇండ్ల ముంగిట సాన్పుజల్లి కళలుట్టిపడునట్టి ముగ్గులు పెట్టుట నిత్యకృత్యము. సంక్రాంతి సందర్భములలో వింతవింత ముగ్గులు గృహాంగణమందు చూడముచ్చటగొలుపును. ,,అలికింతు నీయిల్లు అచ్చమావుల పేడ–పెట్టింతు పసిడిముగ్గు,,. శనివారమున కొక్కమారైన ఇంటిలోపలి నేలను గోవుపేడతో (ఎఱ్ఱమట్టిని కలిపి) అలికి శుభ్రపరచి రంగు రంగుల ముగ్గులు వేయుటఅలవాటు–నిత్యము గడపలకు, ఇడుపులకు పసుపు కుంకుమలతో చేయు అలంకరణ శోభాయమానమై, శుభాస్పదమై ఒప్పును. ప్రతిదినము లేవగనే గడపను శుద్ధిచేయుట యనునది ఒక ముఖ్యమైన పని.

విషయ విస్తరణమును, వైవిధ్యమును బట్టి ఈ ప్రకరణ మిటమీద ఆచారవ్యవహార స్వరూపమును మరొక ప్రకరణముగ విభాగింపబడుచున్నది. షోడశసంస్కారములు, పండుగలు, పూజలు, వ్రతములు, నోములు, గ్రామ దేవతోత్సవములు, తదాచార వ్యవహారములు, విశ్వాసములు మున్నగునవందే పరిశీలించుట జరుగును.



# ఆచారవ్యవహార స్వరూపము

ఆచారము అనుమాట స్పష్టమైన ఆలోచనా విధానమును, ఆచరణను తెలియజేయుచున్నది. మానవుల నిత్యజీవితములో నలవాటుగా చేయుపనులు, ఆ పనులలో నంతర్లీనమై యున్న నియమములు, తరతరములుగా ఆచరించుట ద్వారా భావితరముల కందజేయు సాంస్కృతిక రీతులు, అందలి విశిష్టతలు, ప్రత్యేకతలు ఆచారముల క్రిందికి వచ్చును. శ్రుతులు (వేదములు) స్మృతులు ప్రమాణమగుట వలన మన ఆచారాదులకవియే మూలము. వానియందు జెప్పబడిన ఆచారములే పరమధర్మములని మనుస్మృతి చెప్పుచున్నది 1. జీవిత చక్రమున జననము నుండి మరణానంతరము వరకాచరింపదగిన ఆచారము (షోడశసంస్కారము)లను గూర్చి శ్రుతులు, స్మృతులు, గృహ్య సూత్రములు వివరించినవి. అవి సదాచారములుగా గ్రహింపబడుచున్నవి. వాటిననుసరించినప్పుడే శ్రౌతస్మార్త ధర్మములు కాపాడబడును. ఆచారభ్రష్టులు ధర్మపరాఙ్ముఖులు. అట్టివారు ధర్మమునాచరించినను గూడ ఫలితముండదు 2. ఆచారముల వలన దీర్ఘాయుస్సు, పుత్రపౌత్రాదులు, ధనము ప్రాప్తించుటయేగాక అపలక్షణములన్ని సమసిపోవును 3. అనంతరకాలమందలి పూజలు, వ్రతములు, నోములు కూడ వీని నాశించియే ఆచరించుట జరుగుచున్నవి. కనుక, ఆచారములావశ్యకములైనట్టివని ఋజువగుచున్నది. నేటికినవి జీవితమంతయు నలముకొని పరిపుష్టములై జాతి జీవనమును ప్రత్యేకించి చూపుచున్నవి. అవి వినా జాతీయ జీవనము ముందుకు సాగుట దుర్లభమైనది. సర్వతపములకును ఆచారమే మూలమని

1. మనుస్మృతిః—అధ్యా. 1. శ్లో. 108
2. పరాశరస్మృతిః—ఆచార నిరూపణము—శ్లో—37
3. మనుస్మృతిః—అధ్యా., శ్లో. 156

చెప్పుదురు 1. అందువలన దాని ప్రాశస్త్య మంతటిదని తెలియుచున్నది గదా. ప్రతి జాతి సంస్కృతీ సంప్రదాయములకవి మూలాధారములుగా గ్రహింపబడుచున్నవి. ఒక తరమునుండి యింకొక తరమునకు సంక్రమించుచు సామాజిక జీవనమును మిక్కిలి నియంత్రించుచుండును.

జానపద సమాజమున శ్రౌతస్మార్తములైన ఆచారములతోబాటు పురాణోక్తములైన ఆచారములుగూడ పెక్కుగలవు. అవియేగాక కులాచారములు, స్థానికాచారములు, తత్సంబంధవ్యవహారములు ప్రత్యేకముగా పాటింపబడు చున్నవి. ప్రధానముగానివి వివాహాదులలోను గ్రామదేవతోత్సవాదులలోను గన్పించును. పల్లీయుల నిత్య జీవితములోనివి నిలద్రొక్కుకొని నిలిచినవి. ఇవియే జానపదరీతులు లేదా పల్లీయ ఫణితులు. తాత్త్వికదృక్పథములు, జీవన పద్ధతులు నైతికవిలువలు, వానినుండి ఉద్భవించి జీవిత సంఘర్షణల ఫలితముగ గడించిన అనుభవములలో ప్రతిబింబించును. అవి సహజసిద్ధమైనట్టివి. స్వచ్ఛందముగా, అప్రయత్నముగా నాచరింపబడుచు వచ్చుచున్నట్టివి. జానపద సంప్రదాయబద్ధములైనట్టివి. శ్రౌతస్మార్తములైన ఆచారములును, జానపదరీతులును ఒక్కొక్కచోట విడదీయలేని విధముగా కలిసిపోవుట యొప్పినది. వాని స్వరూపస్వభావములనీ ప్రకరణమున దెలిసికొనుట యగును.

## వివాహము:-

వివాహమును దలపెట్టినప్పుడు మొదట వధూవరులను నిశ్చయించుకొనుట యొప్పును. అది జరిగినప్పుడు ఇరుపక్షములవారు తమతమ సంబంధములను గూర్చి ముచ్చటించుకొందురు. అట్టి విషయములలో ఆడపిల్లవారికే మిక్కిలి

1. ,,సర్వస్య తపసోమూలమాచారం జగృహుః పరమ్,,—

మనుస్మృతి—అధ్యా-1. శ్లో. 110

కలవరముండుట సహజము. కుమార్తె నిచ్చినచో కుశలముగా నుండవలెననియే గదా! అందువలన పిల్లవానిని, వారి కుటుంబ సంస్కారమును, ఆస్తిపాస్తులను గురించి తెలిసికొని మనసు కుదిరినచో సంబంధము నిశ్చయించుకొందురు.

"అల్లపూరివాడు పిల్లనడిగేను—పిల్లవానికి రూపురేఖలున్నాయి
ఏటేట పండేటి భూములున్నాయి—ఊరిపొలిమేర్లతోటలున్నాయి
చుట్టు కొల్లారంపుమిద్దెలున్నాయి—కుర్రవానికి మంచి సేద్యమున్నాది
పిల్లదానికి తగిన ఈడుజోడేను—కన్యనిస్తామని కబురంపుదాము
ఇల్లలికిముగ్గెట్టి పెళ్లి సేతాము"—ఇట్లు ఈడుజోడును, చక్కని పంటలు

పండు భూమిని, ఇంటి తీరును జూచి పిల్ల నిచ్చుట యొప్పును. వివాహమునకు ముందే వరవధూ వివాహ యోగ్యతను నిశ్చయించుకొనుట వేదోపదిష్ట సంప్రదాయము 1. వరకట్నముల తగవులు మాత్రము ఈనాటివే. వరకట్నములకు పూర్వము కన్యాశుల్కమిచ్చి వివాహము చేసికొను ఆచార ముండెను. నేటికిని కొన్ని జాతులలో నది లేకపోలేదు. వరుని పక్షము వారు కన్య నడుగవచ్చినపుడు "ఓలేమి తెచ్చారు ఓపెద్దలారా" అని వధువు పక్షము వారడుగగా, "అడుగుమీద అరవై ఓలిముప్పై—తల్లిగట్టెచీరతోచే తగునమ్మ ఓలి" అని వరుని పక్షము వారు సమాధానమిత్తురు. వారివారి స్థితినిబట్టి ఓలి యిచ్చుకొనుట పొసగును. సామాన్యముగా వధువునకు కన్యాశుల్కము, ఆమె తల్లికి విలువైన ఒకచీర తెచ్చుట పరిపాటి. కాని, శూద్రుడైనను ఓలి పుచ్చు కొనరాదని మనువు చెప్పినాడు. పుచ్చుకొన్నచో వాడు తన కుమార్తె నమ్ము

1. శుద్ధాఃపూతా యోషితో యజ్ఞియా ఇమా బ్రహ్మణాం హస్తేషు ప్ర పృథక్ సాదయామి— యత్కామ ఇదమభిషిఞ్చామి వోహమింద్రో మరుత్వాన్త్స దదాతు తన్మే— అథర్వవేదము:—6—122—5

కొన్నవాడే యగునన్నాడు 1. అదే మనుస్మృతిలోనే, వరునినుండి గోవృషభముల జతను గాని, రెండు జతలనుగాని తీసికొని ధర్మయుక్తముగా కన్యాదానము చేయుట ఆర్ష వివాహమని చెప్పినట్టి విషయము, ,,ఓలి,, అను ఆచారమును బలపరచి నట్లే యనిపించుచున్నది 2. హో జాతిలో ఓలియను ఆచారము, వారి సాంప్రదాయకమైన ,,అవులింత,, అను ఒక వింతగాథపై నాధారపడి వచ్చి నట్టిదియును పరిశీలింపదగును 3.

ఓలికంటె ముందు వధువు పక్షమువారు ,,అత్త మంచిదైన అనుకూలమైన మామ మంచివాడైన మాటకారైన_కాముడు లేనైన కన్యనిత్తాము,, అని అరసికొని నిశ్చయించుకొందురు. అత్తలు గయ్యాళులై యుండుటవలన నీ విషయము ప్రస్తావనకు వచ్చుట వాస్తవము, ఇదంతయు నూతన సంబంధము లరయునప్పటి వ్యవహారము. కన్యకు వివాహసంబంధము కుదుర్చుకొనునప్పుడు కుటుంబములోని పెద్దవారితో సంప్రదింపులు చేయుదురు. ఇరుగుపొరుగు వారి తోడను వూరిపెద్దలతోడను గూడ చర్చించుట జరుగును.

> ఊరిలో పెద్దలను అడిగిచూతాము_అందరికి మెప్పుగా అతివనిత్తాము
> ఊరిలో పెదరెడ్లు ఉన్నారు గాదా_పెదరెడ్లనడుగకా పెండ్లిచేతామా
> కర్ణాలు గొప్పగా కలరు ఊరంతా_కరణాలనడుగకా కన్నె పెండ్లవునా

ప్రతి విషయములో నిట్టి పరస్పర సహకారము పల్లీయులలో నైజము. అందరికి మెప్పుగా అతివనిచ్చుట, అందరికి మెప్పుగా మెలగుట యన్నది జానపద సామాజిక జీవనమున మౌలికాంశము.

---

1. మనుస్మృతిః_అధ్యా. 9. శ్లో. 98
2. ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః
   కన్యాప్రదానం విధి వదార్షో ధర్మః స ఉచ్యతే-మనుస్మృతిః_అధ్యా.3 శ్లో. 12
3. Myths of Middle India:- P. 469

తెలుగు జాతిలో వివాహ విషయమున నూతన సంబంధములకంటె మేన సంబంధములధికముగా నున్నవి. మేనత్త కుమార్తెను గాని, మేనమామ కుమార్తెను గాని, వివాహమాడు పద్ధతిని మేనరిక మందురు. మేనత్త కుమార్తెను చేసికొనుటకన్న మేనమామ కుమార్తెను చేసికొను ఆచారమే ప్రాచుర్యము వహించి యున్నది. మేనమామకాడ సంతానము కలుగగానే ఆ పురిటికందునకును, ఈడుగల మేనత్త పురుష సంతానమునకును వివాహసంబంధమును ముందుగానే మాట్లాడుకొనుట మనమెల్లర మెరిగినదే. బాల్యవివాహ కాలమున తొట్లెలకే బాసికములు కట్టుచుండిరి. మేన సంబంధమున్నప్పుడు వేరొక సంబంధమును జూచుకొనుట అరుదు. మనుస్మృత్యాదులీ సంబంధమును నిరసించినవి. సపిండ వివాహములు క్షేమదాయకములు కావన్నవి. కాని ,,కుల పరంపరాచార మున్న యెడ వివాహ మాడవచ్చును 1,,. శాస్త్ర విషయమెట్లున్నను మేనరికమనూచానముగ వచ్చుచున్నది. తెలుగు సాహిత్యములో మొట్టమొదటి సారిగా మేనరిక వివాహమును (శశిరేఖాభిమన్యుల వివాహమును) గూర్చి తెలుగు భారతమే తెలిపియున్నది. ఇది తెలుగువారి ఆచారమే గాక దాక్షిణాత్యులందరి కున్నట్లున్నది. హిందూజాతి పంచ గౌడులు, పంచద్రావిడులుగా విభక్తమైనది. వింధ్యకు దక్షిణమందున్నవారు పంచద్రావిడులు. ఈ పంచద్రావిడులందరి యందును మేనరిక మాచారమై యుండునేమో. మేనరికముతో వియ్యమంద లేని పరిస్థితి యేర్పడినచో వారితో అన్నివిషయములందు తెగదెంపులు చేసికొనుట కూడ గలదు. మేనరికమన్నది, మాతృస్వామిక సంబంధమైన వారసత్వముగా జెప్పుదురు2. అందుకేనేమో ఆడుబడుచు అన్నతో వియ్యమందుట ఒకహక్కుగా పరిగణింప బడుచున్నది. ,,కంచెమ కొడుకల్లు కాన్పేకనాలి – అందితే

1. ధర్మసింధు (తెలుగు అనువాదము)·–కొల్లూరి కామశాస్త్రి–పుట. 344

2, Inheritance from the mother's brother to her son, i. e. his nephew is also to be regarded as a matriarchal, though patriarchally influenced form of inheritance in the female line- Mother Right in india: P. 7.

అన్నతో వియ్యమందాలి,, అనుపాట దీనినే బలపరచుచున్నది.

మేనత్త కొడుకునకును మేనమామ కుమార్తెకును చిన్ననాటినుండి ఆట పాటలలో గలిసియుండెడు అవకాశముండుటచేత వారిమధ్య అరమరికలుండవు. కుటుంబములోని పెద్దలు కూడ అప్పుడప్పుడు ముద్దుకోముచ్చటకో వారి వివాహ సంబంధమును దడవుచుండుటను వినియేయుందురు. ఇంచుక వయసు తొంగి చూచిన క్షణమునుండి సిగ్గు మాత్రము వారిమధ్య దాగుడుమూత లాడుచుండును. ,,పొరజూచి కృష్ణమ్మ పట్టువచ్చెనాకొంగు—ఇడువిడువు కృష్ణమ్మ ఇదిరీతిగాదు,,- అను మేనమరదలి నోట వయసు వంపులొలుకు పలుకులు పల్లవింప, ,,మేనవారికి మనకు రీతేమిరీతి,, అనుచు మేనబావ మరదలి నోట పల్లవించిన పలుకులకు ప్రణయ పారిజాత పరిమళమంటించగా, ఆ మరదలు ,,మాపటికి రావయ్య మాట్లాడుకుందాము,, అని మర్మమిచ్చినది. వారి మధ్యగల స్వాతంత్ర్యము నెవ్వరు కాదనలేరు. ఒక్కొక్కమారు వారు ప్రణయసామ్రాజ్య పట్టభద్రులగుట రహస్యము. ఇట్టి ,,మేనమామ కూతురు మేళముగట్టి—మేళములాడుతూ మేడదిగ నీదు,, మేనమామ కొడుకును. పెద్దలు కాదన్నను వారివివాహమిక కుదరకపోవు టెట్లు? వరుని నెన్నుకొనుటలో కన్యల కుండిన స్వాతంత్ర్యమును 1 పూర్తిగా రూపుమాపినట్లుగాదా?

ఆడుబిడుచు లిద్దరు ముగ్గురున్నచో అన్నతో వియ్యమందుటకు పోటీ పడుటయును గలదు. ఆ సందర్భమున నొకరిద్దరికి నిష్ఠురములు తప్పవు. కడకు అనురాగము కుదిరిన ఒక్క మేనత్త కొడుకు మేనమామ కుమార్తెను పెద్దలు కానకుండ వివాహమాడుట జరుగును. ,,అబ్బాయికాచేడు మామయ్య యిల్లు—

1. కియతీ యోషామర్యతో వధూయోః పరిప్రీతాపన్యసా వార్యేణ
భద్రా వధూర్భవతి యత్సుపేశాః స్వయం సామిత్రం వనుతే జనేచిత్—
—ఋగ్వేదము:—10—27—12

కానకుండ వస్తే కష్టమని — తెలియకుండా తంత్రాలు పోతారని,, భారతములో శశిరేఖా పరిణయ జరిగినది.

మేనరికములో గూడ ఓలి యిచ్చుకొను పద్ధతి కన్పించుచున్నది. ఒక ఆడుబిడుచు ,,ఎంకిగొట్టంనిండ మేగన్లేపోసి—పైకి గొట్టంనిండ పైకమేపోసి,, కొని అన్నయ్యతో వియ్యమంద వచ్చి ,,ఎందుకోరన్నయ్య నీబిడ్డవాలి,,అన్నది. ఆమెయన్న ,,వాలొల్లి సాలొల్లి నాబిడ్డనియ్య—మేనొల్లకి మరాదు మెచ్చియరాదు,, అన్నప్పుడు, ,,ఇయ్యకుంటె నీసెదె ఇల్లాగిలెత్తు—కాకుంటె నీసెదె కవపలుంచి లెత్తు,,* నని ఆమె స్వాభిమానముగా బలికినది. మేనసంబంధముల వలన కలిగిన దుష్పరిణామములనుబట్టి తర్వాతి కాలమున ,,మేనొల్లకిచ్చిందాని కంటె మేడి జాయిలెయ్యాలె,, అను సామెత పుట్టినది. ఊరిలోపల వియ్యమందుట కూడ మంచిదికాదందురు, ,,ఊరిముందరిచేను కాకుల్లపాలు—ఊల్లోన వియ్యమ్ము మాటలాపాలు,, కాబట్టి ఈ సంబంధము జోలికిపోవుట అరుదు. మొత్తముమీద మేనసంబంధమో క్రొత్తసంబంధమో కుదిరినపిదప ముహూర్త నిర్ణయముమీద వివాహము నిశ్చయమగును. గృహము శుద్ధిగావింపబడును. సాధారణముగా కొట్నము (వడ్లుదంపుట)తో వివాహకార్య మారంభమగును (కొన్నికులముల వారు పసుపు కొట్టుటతో ప్రారంభింతురు దానిని పసుపు కొట్నలందురు.)

శ్రీకరముగ రాఘవులకు ఏకచిత్తమైనట్లు
ప్రాకటముగ విన్నవింతుర్రి జోకతోడను
పూనికర్పూర పదన ముత్యంపు ముగ్గులిడి
ఆణిముత్యంపు తోరణాలె గట్టిరి
పొన్నవనము చిలుకరావె పుత్తడి బొమ్మరావే
కన్నెలేడి కుదువరావె కాంతరాంగవే
భామలార రుక్మిణీభామ సత్యభామ
ప్రేమతోడ కృష్ణునికి పెళ్లిచేతమా

అనుచు పేరంటాండ్ల బిలిచి పసుపులిచ్చి
ఏందు దిసుసు కుంకుమాలు వినతపెట్టెను
కొమ్మపెట్టి కర్పూరంబు కొంగు బంగారు మెరయ
జిలుగువన్నె చంద్రకావి చీరలిచ్చిరీ
లేనె పుష్పమంజరుయి తేనె లొల్కురాదనాలు
నీరజాక్షులారా కుందెనాలు నించరే
ముత్యంపు రోకలెత్తి ముదిత వొక్కపడతి దంచె
ముత్యంపు కమ్మగదుల మొలకనవ్వుల
పగడంపు రోకలెత్తి పడతి వొక్క వనిత దంచె
పగడంపు కమ్మలొదుల పలుకనవ్వుల

కొట్నము గావించుటను "ఉలూఖపూజ" అందురు. అనగా రోలును పూజించుట యని అర్థము. ఇది ఋగ్వేదకాలమునుండియు గృహజీవనమున గుర్తింపబడుచు వచ్చుచున్నది. కొట్నము దంచుటకుముందు గృహిణులు గృహాంగణమున ముగ్గులిడుచుండ, మరొకవంక మంగళవాద్యములు మ్రోయుచుండ, పచ్చని కొమ్మలతో పందిరివేయుట, పచ్చతోరణములలంకరించుట జరుగును. పిమ్మట చతుశ్శాల మధ్యమున (పెండ్లిమంటపమున) బియ్యముతో వోలు (యజ్ఞవేదిక చిహ్నము కాబోలు) వ్రాసి పెండ్లిపీటలమీద వధువింట వధువును వరునియింట వరుని కూర్చుండబెట్టి వారియెదుట ముత్తైదువలు ( సాధారణముగా నైదుగురు ) తమ పుస్తెలకు పసుపు నంటించుకొని, పాదములకు పూయించుకొని, నొసట కుంకుమదాల్చి పరస్పరము మెడలకు గంధము పూసికొని, పూజింపబడిన జోటిపై కుందెన ఉంచి వడ్లుబోసి లేతనవ్వులొలుక, చిలుక పలుకులలో వొలి వలుక రోకండ్ల నందుకొని పైపాటనే గాక—

"సువ్వి సువ్వి సువ్వాలాలి—సువ్వి పరమ పురుషలాలి
సువ్వి శ్రీముఖలింగ చంద్రిరాగదే—కొండమీదపండినావి గోవర్ధనధాన్యాలు

పాడుకొ దంచరమ్మ సఖిరొ కొట్నం

వడ్లాన పంచినవి అవి బ్రహ్మ రాసికాలు

విస్తరించి దంచరమ్మ రామకొట్నము,,*— అనుచు ప్రత్యేకమైన ఇట్టి కొట్నము పాటలు పాడుకొనుచు కొట్నము దంచుదురు. పిమ్మట,

,,తరుణులా దోలరే తల్లులాబిలువ—తనరాములమీద సుంకులుచెరగ

అతివలా దోలరే అక్కలాబిలువ—అల్లవారిమీద సుంకులు చెరగ

వనితలా దోలరే వదినలాబిలువ—వరదరాయని మీద సుంకులు చెరగ

మగువలా దోలరే మరదండ్ల బిలువ—మనరాములమీద సుంకులు చెరగ,,*

అనుచు సుంకులు చెరగుట యొప్పును. కొట్నము దంచిన బియ్యమును పళ్లెరములో బోసి వధూవరులమీద చెరగుటను సుంకులు చెరగుట అందురు. తల్లినుండి మరదండ్ర వరకెవరైనను సుంకులు చెరగవచ్చునని పై పాటలో చెప్పబడినది. ఆ పాటలోని రాముడు, కృష్ణుడు, సీత, రుక్మిణి మున్నగు పేర్లాయాసందర్భములలో నామమాత్రములే గాని, మిగత వ్యవహారములన్ని పల్లీయుల జీవితమును (మనజీవితమును) వర్ణించునవియే. కొట్నము పెట్టించి సుంకులు చెరగుటన్నది మన్నారు దాసవిలాసము ప్రస్తావించినది 1.

కొట్నము తర్వాత ముత్తైదువలు పెండ్లికుమారునికి నలుగు పూయుదురు. కొన్ని వ్యవసాయ కుటుంబములలో నలుగుతోడనే వివాహకార్యమారంభింతురు. ఆ పిమ్మటనే కొట్నము దంచెదరు. (వివాహములో నలుగిడునప్పటినుండి వధువు సత్తువారింటికి సాగనంపువరకు మంగళతూర్యములు సెలంగుచుండుట సామాన్యము) పెండ్లి కుమారునకు—

,,నలుగిడరారే నలుగిడరారే నలుగిడరారే నలినాక్షులారా

నలిననాభునకు నవమోహనాంగునకు నలుగిడరారే,,

1. మన్నారు దాస విలాసము:—రంగాజమ్మ. ఆ. 5—పద్య. 26

అనుచు ముత్తైదువలను బిలుచుకొని ,,అత్తరులోన మేలిమత్తరులోన అంబరును గూర్చి—పచ్చకర్పూరము తోను పచ్చ కప్పురము పన్నీరును—మంచి హెచ్చైన గంధము అచ్యుతునకు నలుగిడరావే,, అనుచు; వధువింట ,,వనజాక్షి వేగరావే వనితా నలుగుకిపుడు—లావాణిచీగట్టిరంగైన రైక తొడిగి—లావణ్యముగ నీవు రమణిరో నలుగుకిపుడు... .... .... ....కామినీమణి వేగపీటకు లేచి రావమ్మా,, అనుచు వధువునకు అత్తరు సంపెగ నూనెలతో, కర్పూరాది సుగంధ ద్రవ్యములతో నలుగు పూయుదురు. వధువునకు ,,మిసిమి వెన్నెలదానా పసుపు బూసెదనే—కుసుమహారములతో కొప్పు వేసెదనే—పన్నీరుగంధాలుబాగా బూసెదనే సుందరీ నామీద సందేహమేలా,, అనుచు నించుక మేలమాడుచు నలుగుపూసి తలంటుదురు. ప్రతికార్యమునకు పెక్కుపాటలుండునని మరిమరి చెప్పనక్కర లేదు. తలంటునపుడు—

,,శుభమనుచు సతీపతుల దీవించి పాడిరి
చంచలాక్షులంతను అక్షంతలుంచి శిరసున
ముఖరునకు శ్యామలాంబకు—ముద్దుల మోముల కుంకుమనిడి
కోమలాంగులు బంగరుగిన్నియను బోసిన సంపెగనూనె

మంగళ కరమనుచు నంటిరి,,—అనుచు దీవించి శిరసున అక్షతలిడి, నొసట తిలకము దిద్ది, సంపెగనూనెలతో తలయంటి ,,అతివలు జలకమ్మార్చిరి అచ్చమాంబ కాహ్లాదకరమనుచు వేడిరి,,. వధూవరులను జలకమ్ములార్చి (మంగళ స్నానములు చేయించి)న వెంటనే ,,తిలకము తీర్చరే కలికి శ్రీ రుక్మిణికి—మొలకనవ్వుల చెలిమోమున కస్తూరి,, ,,తిలకము దిద్దరే పెండ్లి తిలకము దిద్దరే—శ్రీకరమైనట్టి పెండ్లికళల చిరుమొగమున,, అనుచు తిలకముదిద్ది క్రొత్తయుడుపులను గట్టింతురు. పెండ్లిపీటలమీద కూర్చుండబెట్టి పాదములకు పసుపు పూయుదురు.

,,పసుపు పుయ్యారాదటే భామా, శ్రీకృష్ణునకు

ఊరేగింపు ఉన్నదింకా వనితరో సిద్ధ చేయవే

భామా పసుపు తీసుకొని వయ్యారముతో వచ్చేవు. .........

పసుపు వాలకున్నా యింకా పద్మగంధిరో చెప్పావే

పసుపు పీటేకట్టు పసుపునలచేసు రారా,,—పసుపద్దిన వస్త్రములు కట్టించుటయును కలదు.

పీతాంబరములు కొనుసామర్థ్యములేక పసుపద్దిన వస్త్రములు కట్టించుట జరిగి యుండనోపును. పసుపుబట్టల వలన దృష్టిదోషము గూడ నివారింపబడునని యొక విశ్వాసము. పసుపలందిన అనంతరము పేరంటాండ్రు (ముత్తైదువలు)

,,గంధము పూయ్యారే ముందు రాములకు గంధము సీతమ్మకు,,

,,పునుగు జవ్వాజి ఘనమైన పుష్పరజము

వనితలందరు కలపుసీమేన ఘనముతో,, అనుచు గంధము పూయుదురు. దగ్గర బంధువులు తాము తెచ్చినట్టి యుడుపులు కట్నములుగా సమర్పింతురు.

లగ్నము పెండ్లికూతురింటనే జరుగుటవలన పెండ్లికూతురు పక్షమువారు పెండ్లి కొడుకును దోడుకుని వచ్చుటకు వారింటికి పోవుదురు. పోయిన రోజుండి మరునాడు పెండ్లికొడుకు నుదుట బాసికములంకరించి పల్లకిలోగాని మేనాలోగాని మోయించుకొని వత్తురు. ,,బాసికానికివెళ్ళిన బావలను చూచి మంగలి సుబ్బయ్య మంటలో దిగును,, అనుటవలన బాసికములను మంగలివారు చేసి యిత్తురని తెలియుచున్నది. పెండ్లి ప్రయాణమునకు బండ్లుపయోగించుటవలన ఒక్కొక్క మారే పది బండ్లవరకు కూడ బారుదీర్చి పోవునప్పుడును, కొందరు మువ్వల బండ్లను అహమహమికతో తోలునప్పుడును, పెండ్లి వారి సంబరమునకు మేరయే లేదనిపించును. దారినడుమ వనవృక్షముల క్రింద విశ్రాంతి గొనునపుడు మరింత ముచ్చటగా నుండును. అట్లు పెండ్లికొడుకును పెండ్లికుమార్తె యూరికి దోడుకొని వచ్చి నేరుగా గ్రామదేవాలయమున కొంతసేపు విశ్రమింప జేయుదురు. కొన్ని గ్రామములలో దేవాలయములు మర్రిక్రిందనో వేపక్రిందనో

యుండును.

పెండ్లికొడుకువారు ,,పచ్చరోకట్టుకాడ—పెదమర్రికాడ, పెంపుగా దిగినారు పెండ్లివారంత,,. అప్పుడు జోడు కంబళు రెండు జాడించి పరచి—రత్నకంబళు రెండు రవుణతో పరచి-కూరిమితో రామున్ణి కూర్చుండబెట్టి,,* మర్యాదచేయుదురు. ప్రయాణపు బడలిక తీర్చుటకై 'చల్లనంబళ్ళ' (మంచితీర్థము, ఉపాహారములు) పంపుదురు. కొంతసేపయిన తదుపరి పెండ్లికూతురు పక్షమువారు సన్నాయి చప్పుడులతో పెండ్లింటినుండి మంగళహారతులు, కుంకుమ, బుక్కాగులాలు మున్నగునవి తీసికొనివచ్చి పెండ్లికొడుకునకు తిలకమిడి, ఆకుపోకలతో తక్కిన బంధువర్గము నంతటిని పరిచయము చేసికొందురు. ఆ పిమ్మట ఇరుపక్షముల వారందరెదురెదురుగా నిలబడి పిడికిళ్ళనిండ బుక్కాగులాలు బట్టుకొని యుత్సాహమురకలిడ పరస్పరము చల్లుకొందురు. దానిని ,,ఎదురుకోళ్ళు,, అందురు. ఈ ప్రక్రియ, పరస్పరము హృదయములు విప్పుకొని అరమరికలు లేని బంధుత్వమును ప్రదర్శించునట్టిది. ,,మల్లెపే పువ్వులు కొయ్య వేళాయె మన్మథుని బాసింగం కట్టవేళాయె,,. విడిచియున్న బాసికమును తిరిగి పెండ్లి కొడుకు నుదుట అమర్చి, వైభవోపేతముగా నూరేగింపు టీసి పెండ్లి పందిటికి దోడుకొని (లగ్నముహూర్తము దూరముగానుండినచో అంతవరకు విడిదిపట్టున నుంచుటయగును) రాగానే అతివలు ,,పచ్చన్ని పచ్చన్ని పందిల్లలోన-మెరవణితో వచ్చిరే మాపెండ్లివారు—పగిడి పళ్లెంలోన పాదాలు కడిగి—ఆపరంజి పళ్లెంలో ఆర్తిపట్టిరి,,. కుడిపాదమెత్తించి గడపదాటించి పెండ్లిమంటపమున వేదికపై కూర్చుండబెట్టి, లాంఛనములు జరుపుచు పెండ్లికూతురునుదెచ్చి అభిముఖముగా గూర్చుండ జేయుదురు.

,,ముందుగ పురోహితులు మంత్రములు చదువగా
పొందుగ మేళతాళములు మోగియించగా
మందయానలు మంచి పాటలు పాడంగ,, వరునికి వరపూజచేసి,

పాదములుకడిగి, తలిదండ్రులు తమ కుమార్తెను దానము చేయుదురు. ఇట్లు దానము చేయుట మోక్షప్రదమందురు 1. పిమ్మట ప్రతిజ్ఞామంత్రోక్తముగా వధువుగళసీమ „పొంగుచు మంగళ సూత్రము రాముడు—తా గొప్పనగట్టె క్షేమముగను వేడ్క—తోడ,,. అప్పుడా శుభవేళ అందరు అక్షతలు చల్లిదీవింతురు. „ఎదుటను పార్వతి సరస్వతి ఇంద్రాణిదేవి అరుంధతి—అణిముత్యములు దోసలు చల్లగ తులలేని రతనాలు తలబ్రాలు పోసిరి,,. ఇక, ఆనందమానంద మాయెను మనరాముడు పెండ్లికొడుకాయెను—అల జానకి పెండ్లి కూతురాయెను,, అనుచు నందరు మురిసిపోవుదురు. „నూలుపోగుదారాన—తాళిబొట్టు పసుపుకొమ్ము,, కట్టించిన తర్వాత „చేయికల్పి కాలుత్రొక్కి—నేయిపాలు తాగుదాము,,. ఇందలి పాణిగ్రహణ పరమార్థమును గ్రహింపదగును 2. పిదప వధూవరులు „ముత్యాల గురువిందములు తలంబ్రాలుగా—ముదముతో నొకరొకరు మెుగిపోసికొనిరి,,. (అప్పటినుండి „కాలిమెట్టె తాళిబొట్టు—ఆలుమగల గుర్తులాయె,,). ఈ సందర్భమున బంధుమిత్రాదులు తెచ్చిన కానుకలు, కట్నములు చదివింతురు. „శివబ్రహ్మలిం‌ద్రాది వందతామరలు—కనిగూడి కానుకల్ కట్నముల్ దెచ్చి,, సమర్పించుకొనిరి. ప్రతి శుభకార్యము కడపట మంగళహారతి పట్టుట చక్కని ఆచారము. లగ్నాంతమున ముత్తైదువలు గాని, వదిన మరదండ్రు గాని, మంగళముబట్టి „శృంగారముగ సీతకు మంగళసూత్రముగట్టిన—రంగూగ రామా నీకు మంగళహారతులివిగో—ముత్యాల తలబ్రాలు ముదముతో సీతకు బోసిన సత్యస్వరూపులకు చంద్రహారతులివిగో,,* అనుచు మంగళహారతులు పాడుదురు.

---

1. „కన్యే మే పృష్ఠతో భూయాస్త్వద్దానాన్మోక్ష మాప్నుయాం,,

—ధర్మసింధు:-పరి. 3. పుట. 394

2. ఓం గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసః భగో అర్యమా సవితా పురన్ధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః

—ఋగ్వేదము:—10—85—36—1

ఇట్టి మన పెండ్లిళ్లు సీతారాముల పెండ్లిగానో, రుక్మిణీ కృష్ణుల పెండ్లిగానో, భావించుట మన సంప్రదాయ లక్షణము. లగ్నమైన వెంటనే మింట నరుంధతీ నక్షత్రమును జూపుదురు. అది ఆర్షసంప్రదాయమే 1.

లగ్నమునకు పూర్వమే వధూవరులను అవిరేణిముందర కూర్చుండజేసి పూజింపజేతురు. పూజకుండలే అవిరేణికుండలు. అవిరేణిని పూజించుట యనగా శ్రీ మహాలక్ష్మినిపూజించుట యని అర్థము. వివాహమునకును, ఉగాది, సంక్రాంతి వంటి పండుగలకును, గ్రామదేవతోత్సవములకును, శుభకార్యములకును, మరణమునకును మట్టిపాత్రలుపయోగించుటలో విశేషమున్నది. "మృణ్మయం దేవపాత్రం" అనుట దీనినే తెలుపుచున్నది. పైదిక యుగమున మట్టిపాత్రలే యధికముగా వాడబడినవి. (నేటికిని పల్లెలలోనంతే). మట్టిపాత్రలు పూజ్యము లగుట (ఆరోగ్యప్రదమగుట) యన్నది అవిరేణిపూజలో గూడ ద్యోతకమగు చున్నదనవచ్చును. లగ్నము రెండు రోజులుండగానే కుమ్మరింటినుండి అవిరేణి కుండలను దెచ్చి దేవునింటిలో నిలుపుదురు. అవిరేణి కుండమీదగల మూకుడులో నాముదముపోసి వత్తిని వెలిగింతురు. దీనిని హోమాగ్నిగా భావింపవచ్చునేమో? కుమ్మరి, ఒక పెద్దకొ్రొత్త కుండను, దానికి తోడుగా ఇంచుక చిన్నదియైన మరొక కుండను సిద్ధముచేసి, వానిమీద సున్నముతో మరియు జాజుతో పెండ్లి సంబంధమైన శుభకరమైన వివిధ చిత్రములనుచిత్రించి యుంచును. వానితోపాటు గడికుడుకలు (గడియలను లేదా ముహూర్తమును నిర్ణయించి చూపు ముంతలు) కూడ చేసి యుంచును. పెండ్లివారు ముత్తైదువలను పిలుచుకొని మేళతాళములతో మంగళహారతులతో కుమ్మరింటికిపోయి అవిరేణులకు కుంకుమబెట్టి, హారతిపట్టి, పాటలు పాడుచు భద్రముగా తీసికొనివత్తురు. "ఐరేనిగొని వచ్చి రైదువల్ పాటలుపాడుచు శుభవేళ వేడుకలర" 2 అని విజయ విలాసములో గూడ వరింప

1. గోభిలీయ గృహ్యసూత్రములు:—ప్ర. 2. ఖం. 3
2. విజయ విలాసము—ఆ. 3—పద్య. 95

ఒడినది. అవిరేణుల దెచ్చునప్పుడు, ముఖ్యమైన అవిరేణులందుండు సూడు వారియందుగా తెల్లని క్రొత్త బట్టను సలుపైపుల నిలుపును పట్టుకొనగా, నడుము నాకదు చెత్తనుతో వైకిరేపనెత్తి గౌడుగాటి పీడవట్టను పెంచి లేదా బంగారు గొలుసును గాని వొడ్డాణమును గాని అవిరేణి పంటకు తగిలించుదురు. అట్లు తెచ్చి నిలుపుటను మహాలక్ష్మి నావాహన చేయుట యందురు. ఆమె ప్రతి యింటి ఇలువేల్పు. ప్రతిగృహిణికి ఆరాధ్యదైవము. పేరంటాండ్రు పసుపుపదులను అవిరేణికి మ్రొక్కించి—

„జయమంగళం నిత్య శుభమంగళం
జయ జయమంగళం మహోత్సవమంగళం
దివ్యాంబరములుగట్టి దీపాలవెలుగున
నవ్వుచూ మహాలక్ష్మి నాట్యమాడా
ఇలువేల్పునీవు వెలసితివి మాయింట„ అనుచు మంగళము పాడి—

„కనకగద్దెమీద కదలక కూర్చుండి
అడిగినప్పుడు మాకు అభయమిచ్చి
కోరిన కోరికలు కొనసాగింతువని
బలువైన పట్టుమేం పడితిమమ్మా
కొప్పు చక్కగబెట్టి గొజ్జంగిలను ముడిచి
పమిడి జల్తారు పట్టు చీరనుగట్టి
రంగైన రత్నాల రవికను దొడిగిన
భక్తపోషిణి మమ్ము పాలించవమ్మ
ఆభరణములు దెచ్చి అలంకరించి నీకు
పసిడి గొలుసులు తీర్చి బాగుగావేసి
గంట లొడ్డాణము కన్నతల్లికి పెడుదు
కన్నబిడ్డలనుచు కరుణించుతల్లీ

అందముతో నీవు అవిరేణిలో నిల్చి
తప్పులను బట్టక దయచూడుమమ్మ
ఎప్పుడూ నీపాద సేవజేసేమమ్మ
గొప్పగా దయజూచి కోరికలు దీర్చులక్ష్మి,,

అనుచు కోరికలు కోరుకొందురు. వధూవరుల భావిజీవితమునకు మేలుకలుగ బూజింతురు. అవిరేణిని, అయిరేణి, ఐరేని అనికూడ అందురు.

పూర్వము పెండ్లిండ్లు ఐదురోజులు జరుగుచుండినప్పుడు నాలుగవరోజున నాకబలి కావింతురు. దానిని నాగబలి, నాకబలి, నాగవలి, నాగవల్లి, నాగవెల్లి, అనుటయు గలదు. గోదుమ పిండితోగాని, బియ్యపు పిండితోగాని, నువ్వుల పిండితోగాని నాగప్రతిమను జేసి శుభసంతతి వడయుటకై దానిని షోడశోప చారములచే బూజించి బలి యిచ్చుట యొప్పునని ధర్మసింధు పేర్కొన్నది. తద్విధి విధానమందులో వివరింపబడినది 1. వివాహమున నాగబలి యన్నది వధూవరులకై శుభమాశించి చేయు ఆచారము. నాకబలి సందర్భమున పెండ్లి కొడుకు విడిది గృహమునకు ,,ముచ్చాల గొంగడి ముదిముసుగువెట్టి,, కొనిపోయి అలిగి యుండును. దానిని ,,అలుకపోవుట,, అందురు. అనగా పెండ్లి కొప్పుకొని యిచ్చిన కట్నములు కానుకలేగాక అదనపు లాంఛనము లత్తగారినుండి రాబట్టదలచి అలుకపోవుటజరుగును. పెండ్లికొడుకు వెంటవచ్చిన అక్కచెల్లెండ్రు మున్నగువారు దొరకిన వస్తువులనెల్ల ఎత్తుకొని విడిదికి బట్టుకొని పోవుదురు. అత్తమామలు, బావమరదులెవ్వరేగాని వచ్చి అవియివి ఇచ్చిన దనుక అలుకవీడవలదని పెండ్లికొడుకునకు పురియెక్కించి యుంచెదరు.

మామగారువచ్చి అలుకవీడమన్న-వెయనూటపదహార్లు కట్నమిచ్చినగాని
అత్తగారువచ్చి అలుకవీడమన్న-అందమైన వెండిచెంబు లిచ్చినగాని

1. ధర్మసింధు:-తృ. పరి-పుట. 222

బావమరుదులు వచ్చి బతిమాలిపిలిచిన—మేలైన మోటారుసైకిలిచ్చినగాని
ఇంటికి ఎదురుగా వంటిస్తంభం మేడ—అంటు మామిడితోట అరణమిచ్చినగాని
పందిరిమంచము పట్టు పరుపులన్ని—నీకిచ్చిన ఇంకాలేవనునందాక
ఓ కృష్ణ నీభార్య చెలియ రుక్మిణివచ్చి—అందంతో కరములందించిందాక
అలుక వీడబోకుమా,,*

తగినవన్ని యిచ్చి యింకలెమ్మని అనుదాక అలుగవలెనని చెప్పుట జరిగినది. (మోటారుసైకిలు కోరుటన్నది ఇటీవలి విషయము). ఇంతలో అత్తమామలు వచ్చి ,,ఐదేళ్ల బటువులు చెవపట్టుశాలు,,ను, వదినమరదండ్రువచ్చి ,,నాలుగేళ్ల బటువులు పాగశెల్లాలు,,ను, ఇరుగుపొరుగులవచ్చి ,,వదేళ్ల బటువులు పెళ్లి కుంగ్రాలు,,*ను ఇచ్చెదమని బ్రతిమాలినను పెండ్లికొడుకలుకవీడక యుండుటను గమనించి తుదకాక్షణమున సామరస్యముగ నాతని కోరికలు తీర్చి, అలుకతీర్చి, అట్లే పెండ్లికొడుకుయొక్క అక్కాచెల్లెండ్రకు వెండికుంకుమకాయలు, దంతపు దువ్వెనలు, అద్దములు, అత్తరుసూనెలు, వాసనసబ్బులు, బొట్టుపెట్టెలు, పావెట పుల్లలు, క్రొత్త యుడుపులు మున్నగు లాంఛనములు చెల్లించగా, పెండ్లి కొడుకపుడు నాగవల్లికి సిద్ధమగును. కాని, పెండ్లియింటికి పోవుటకు పల్లకి లేదనియో, మేనలేదనియో, కనీసము గుర్రమైనా లేదనియో గునిసియాడువేళ బావమరదులైనవారు—

,,పల్లకి లేదని ఏలడిగినారూ—పందికొక్కునెక్కి లేచి రావయ్యా
మేనాలు లేవని ఏలడిగినారూ—మేకపోతూనెక్కి లేచిరావయ్యా
గుఱ్ఱాలు లేవని ఏలడిగినారూ—గుడ్డిగుఱ్ఱామెక్కి లేచిరావయ్యా,,*

అనుచు చలిపిగా సరసమాడుచు భుజముల మీదనెక్కించుకొని పెండ్లింటికి మోసికొనివత్తురు. అప్పటికిని ఇంచుక వెనుక ముందాడుట గమనించి బావ మరదులును, వదినె మరదండ్రును—

,,నంగినంగక లేచిరావోయి—పెళ్లికొడుకా నాగవల్లికి

ఎంతో మంచివాడవని ఎంచినీకుపిల్లనిస్తె
రంతులు మానవు రాద్ధాంతాలు చేసేవు
పోకిళ్లు పోతావు పోకిరీతనం మానవు

బర్రెమోదలాగ వెర్రి చూపులు చూస్తావు
లొ్రినోటి మాటలైనా తోచవేమయ్యా" అని నిష్ఠురములు పలుకుదురు. దీనివలన „నాగవల్లి నిష్ఠురము" అన్న లోకోక్తి వచ్చినది. „లోలకయింక నాకబలిలోపల నిష్ఠురమేల పల్కగన్" 1 అని విజయ విలాసములోను అట్టిది పేర్కొన బడినది. నాకబలి చివర „నాలుగోనాడు నాగవల్లికి యిపుడు—బల్కి గావించినస్వామి మీకు పచ్చల హారతులివిగో" అనుచు హారతులిత్తురు. ఆర్థిక పరిస్థితుల ననుసరించి నేడు పెండ్లిళ్లలో ఆ తంతులన్ని రెండు దినములకే సమాప్తమగుచున్నవి. నాకబలి ముగియుగానే కూరాటికుండ ముందర (కొందరు పెరటిలోని పెండ్లిపందిరి క్రింద) వధూవరులచే లాంఛనప్రాయముగా ప్రత్తి విత్తులు నాటింతురు. అది ముఖ్యముగా రైతుకుటుంబములోని యొక ఆచారము. ముత్తైదువలు వరునిచేత ములుకోల, నాగిటికోల, పగ్గములు, జ్యారెళ్లు, నాగలి కఱ్ఱు పట్టించి నేలమీద మట్టిని కెలగింపించెదరు.

„రామన్న లక్ష్మన్న రథము దోరెడ్లు—మూడువేలుచేయు ములుకోలకట్టె
నాల్గువేలు చేయు నాగటికోల—పదివేలు చేయు జ్యారెడుజోళ్లు
కుంకుమరేగళ్లు కదల దున్నించి—చంద్రంపురేగళ్ళు చెదర దున్నించి
విత్తనాల గుమ్మ మెత్తైన జీసి—పన్నెండు స్తంభాల పందిరిక్రింద"

వధువు చేత ప్రత్తి విత్తుల గుల్లపట్టించి వరునివెనుక నడిపించుచు ( „శ్రీరాముడున్నంగ సీత చాలేసు" ) విత్తనములు నాటింతురు. భూమిని దున్ని చక్కని

1. విజయ విలాసము:—ఆ. 3, పద్య. 72

విత్తనములు నాటి తగిన పంటలు పండించి లోకమును బ్రతికించు వ్యవసాయ కర్మము, వివాహములో ఆవశ్యకముగా పైరూపమున గ్రహింపబడినది. చక్కగా కాపురము చేయుచు జాతినుద్ధరించు బిడ్డలను గని కీర్తికెక్కవలెనని అన్యాపదేశముగా సూచింపబడిన దనవచ్చును. ఈ సందర్భమున ఆడుబడుచు "చీరెపెట్టేవన్న సారెపెట్టేవా—బిడ్డనిస్తావన్న వడ్లనిస్తావా" అని యడిగినప్పుడన్న "పత్తి పండిన వెనుక పట్టుచీర పెడతా—వడ్లనేవచ్చేను బిడ్డనిచ్చేను" అనును. కాని ఆమె "నీమాట నామాట ఒక్కటేగాని—అలుకతో ఒకమాట అనిపించుకొన్నావు" అనుచుండ ఆ మరదలు "కసరేమ పెంచరేమ గద్దించరేమ—పట్టిమాటలు నేను పట్టించుపడిన" అని మెల్లన పలుకగా, పుట్టినవాడైన "ఇస్తానని పలుకవే ఇయ్యారంపురాల" అనుచు ఆడుబడుచు వాగ్దానము చేయించుకొనును. దానికి "బాసింగం కట్టినా బ్రహ్మదేవసాక్షి—పెండ్లికి వచ్చిన పెద్దలేసాక్షి"* అనగా, ముద్దుగా కాపురముచేసి ముద్దులబిడ్డను గని మేనరికమియ్యవలెననెడు నిర్ణయము పెండ్లిలోనే జరుగుట, సంప్రదాయముగవచ్చు మేనరికమున కెంత ప్రాముఖ్యమున్నదో తెల్లమగుచున్నది.

ప్రత్తివిత్తులు విత్తిచతుర్థ్యాలలోనికి ప్రవేశించునప్పుడు గాని, కులదేవత పూజగావించుకొని తిరిగి వచ్చునప్పుడు గాని, పెండ్లికొడుకు చెల్లెలు ప్రవేశ ద్వారమును మూసి కోరిక చెల్లించుకొనుట ఒక ఆచారము. అట్లు తలుపుమూసి పాడెడు సంవాద రూపములను "తలుపుదగ్గరిపాట" అందురు. వెలుపల నిలిచి యున్న అన్న (పెండ్లికొడుకు) "ముత్యాలవానగురిసె ముగ్ధమెవదిన తడిసె తలుపుతీయండమ్మా చెల్లె తగవులెందుకూ" అన్నప్పుడు చెల్లెలు "ముత్యాల వానకురియలేదు ముగ్ధమావదిన తడవలేదు—తలుపుతియ్యమన్నమేము తగవు లుండంగ" అనుచు సెల్లె సంవాదము చేయుచుండ, అన్నగారు సొమ్ములు మున్నగునవి యిచ్చెదనన్నను తలుపుతీయుట జరుగదు. తుదకతడు "చేతిలో చేయివేసి యిపుడు చెప్పుచుంటిని గదమ్మా—తలపుకొక్కెల్లె దీస్తు తలుపు

టీయారే,, అనుచు మాటయిచ్చిన తక్షణమే ,,అన్నవదినెలు మీరు ఆడితప్ప బోకండి—అన్నావదిన మీపట్టినిచ్చి అరణమియ్యండి,,* అనుచు చెల్లెలు తన ముఖ్యమైన కోరికను (మేనరికమును) వెలిబుచ్చి తలుపుతీయును. ఇట్లే అక్క- తమ్ముని నడుగుటయు నొప్పును. తలుపు దగ్గరి వ్యవహారములలో నూతన వధూవరులు బాధ్యత పంచుకొని మసలుకొనుట కన్పించుచుండును. పుట్టబోవు బిడ్డను తనకొడుకున కివ్వవలెనని ఆడుబడుచు కోరినప్పుడు వారిరువురిమాట యొకటి యగుట చెల్లును. అట్లే మరదలిని (వధువును) వదినె (వరుని అక్క-) మేలమాడుటయు గలదు—

మరదలు:— ,,కులదైవంబుల పూజలుచేసుక—కూరిమితో మేమిటురాగా
తలుపులు మూసుక తంటాచేసేది—తగవులెంచరే ఓ వదినా,,

అన్నప్పుడు—

వదినె:— ,,ఇలలోనడిచేటి మరియాదకునే—ఇంటికి ఇలనడిపించితినా
తలిరుబోణిరో పతిపేరుచెప్పకను—తలుపుదీసి నిను రానివ్వనే,,

అని యింకను అనేకవిధముల విసిగించుచు వినోదించుచు నుండనామె—

,,సోలెడు సోలెడు ముత్యాలిత్తా—ఆరెలిత్తా సారెలిత్తా
ఆడిబిడ్డె గంపాలిత్తా—తలుపుదియ్యి వదినగారు తర్నుశాయకా,,*

అన్నప్పటికిని తుదకామెచేత పతినామమును జెప్పించుకొనియే తలుపుదీయును. పతినామము చెప్పుటకు నూతనవధువులు మిక్కిలి బిడియమున వెనుకాడుదురనియే అట్లుడికించుట జరుగుచున్నది. ఆ వేడుకలే అన్యోన్యమైన చుట్టరికమునకు వావి వరుసలకు వాడుకలగుచున్నవి. నాకబలితో వివాహములోని ప్రధాన కార్యము ముగియుచున్నది. ఆ సందర్భములోనే వధువు పక్షమువారు వరుని, వరుని పక్షమువారు వధువును పరిహాసము చేయుట చోద్యముగా నుండును.

,,ఎత్తారమ్మ హారతులు హెచ్చైన పళ్లెరంలో
అరుదుగ మాయింటి అల్లుళ్లకు
సీమలో ఎక్కడ చిన్నవాడె లేడని
చీకిరి కళ్ల పెళ్లి కొడుకవు దొరికితివా
భూమిలో ఎక్కడ పురుషుడు లేడని
బుర్రముక్కు పెళ్లి కొడుకవు దొరికితివా
మూడు రాజ్యాలు మా తండ్రి వెతికినాడు
ముప్పమ్యేళ్ల పెళ్లి కొడుకవు దొరికితివా,, అని పెండ్లి కొడుకునకు హారతు లిచ్చుచు వధువు యొక్క సోదరీజనమిట్లు మేలమాడుచు వెక్కిరించుటే గాక—

,,దేవతలేమో వుతికేరంటూ—దార్తనమేమోచేసేరంటూ
దోవనపొయ్యే దొమ్మరోనికి—వంగి దండం పెట్టే రంట
సీసీ మా బావ గారికి కుక్క మంగళం,, అనుచు వరుని గొప్పలను దెప్పి పొడుచుచు, తమ సోదరిని (వధువును) మెచ్చుకొనుచు ,,సక్కనీ మా అక్క గారికి జయమంగళం,, అని స్వాభిమానమును ప్రకటించుకొందురు. పంచన తిరుగనేర్చిన పెండ్లికొడుకు లక్షణమును కనిపెట్టి ,,మంచివాడని నీకు మావూరు పడుచునిచ్చె—పంచలా తిరిగేటి బుద్ధి కొంచమైనా మానకపోయె,, అన్నప్పుడతడు కాస్త విర్రవీగుచుండ నిట్లు వెక్కిరింతురు—

చాలు చాలు పెండ్లికొడుక చక్కనైన వాడవే
వీలుసాలు లేకయిటుల విర్రవీగ నేలరా
కోటుమీద కోటుతొడిగి కోరచూపు చూచుచున్
సీటుగా తలాడనొంగి గోటు (ఒయారము) చూపుచుండువా
జేబులోని వాచిగొలుసు చేతదీసి మాటికిన్
నీబడాయి తెల్పుకొనగా నీతిగాదు మానరా,,. ఈ పాటలోని

విషయములను బట్టి చూడనిది ఇటీవలిదై నట్లు తోచుచున్నది. అవియివి గొప్పగా నున్నవని వరుని పక్షమువారు డంబములు పలికినప్పుడు, ,,మేడలు మిద్దెలు గలవారని మీ వార్చెప్పిరి—ఇంత తాటాగుడిసెలో ఉన్నావారని ఎరక్క పోతీమి—కంచెలు కాసులు పెడతారని మీవార్చెప్పిరి—ఇంత పుస్తెబొందులు కడతారని ఎరక్క పోతీమి,,—అనుచు వధువు పక్షమువారు పరిహాసము చేయుదురు. ,,ఎక్కడ దొరికినాడమ్మ ఈ పెండ్లికొడుకు—అడ్డెడో మానెడో పోసినాము అరిసెలైన వండినాము—అంగుడైనా జూపడాయె—అరమొగము పెండ్లికొడుకు,, పెండ్లికొడుకునకు తినచేతకాదని, ఆకులు పోకిలిచ్చినచో వేసికొనడమే రాదని విసనకర్ర నిచ్చిన విసరుకొన రాదని, పరుపుమంచము వేసిన పండుకొనడము రాదని ఎక్క సక్కెములాడుచు ,,లక్ష్మివంటి బాలనిచ్చిన—ఏలుకొనడమే చేతగా,,దని చివరి కపహాస్యము చేయుటకు కూడ వెనుకాడరు. మొత్తముమీద పెండ్లికొడుకునకిట్టి లక్షణము లుండినను, లేకుండినను హాస్యమాడుట యన్నది వినోదాత్మకముగా చూడవేడుకగా నొప్పుచుండును. అట్లే వరుని చెల్లెండ్రు కూడ వధువును హాస్యము చేయుచు వెక్కిరింతురు—

ఎంతో సొగసు కత్తెవే ఇంతీ ఓ వదినే
కొంతైనా సిగ్గులేక గంతా బొంతాకప్పుకొని
నున్నగా తలదువ్వుకొని తిన్నగాయిటు రమ్మంటె
నుక్కబొట్టువెట్టుకొని సక్కగా యిటురమ్మంటె
తక్కిరి బిక్కిరి కుక్కలాగా వచ్చినావా
కన్నులా కాటూకదీర్చి వెన్నుమీరగ రమ్మంటె
కున్ని తమ్మగుడిపైనున్న కోతిలాగా వచ్చినావా
బానకడుపు గూని వీపు కోనబొట్టుదానవే,, అనుటయే గాక, వధువు పెంకెతనమును గమనించి—

,,నల్లఛాయ మెల్లకన్ను దాన చెలియా—నీ చొట బుగలు మిటనొసలుగా

సొంగకారునోరు దానా చెలియా—నీ తట్ట తలయు చొట్ట కాలుగా

మొగనిజూచి మూతివిరిచేవు చెలియా—నీ సొగసు కితడు తగడచే లలనా

పెండ్లి పెద్దలు నవ్వేదరు పెంకెతనముచేయకు,, మని మరింత సూటిగా హేళన చేయుచు కడుపుబ్బ నవ్వుకొందురు. పరస్పర మిట్లు వెక్కిరించుకొనుచు హాస్యమాడుచుండుట వలన పెండ్లి పందిరంతయు బహుచోద్యముగా నుండును. నూతన సంబంధములోని అరమరికలు దూరమై-అనురాగము చోటుచేసికొనును. ప్రతి జాతిలో నిట్టి వేడుకలు సామాన్యము. భారతజాతి యందంతటను కనుగొనవచ్చును. ఒండొరులు పరిహాసము లాడుచునే ,,బువ్వము బంతి,, కి పోవుదురు. బువ్వము బంతినే ,,బూజమ్మ బంతి,, అందురు. అనగా పెండ్లికి వచ్చిన చుట్టపక్కము లందరు కలిసి పంక్తి భోజనము చేయుటయని భావము. బువ్వముబంతి పచ్చని పెండ్లి పందరి క్రిందనే యేర్పాటు చేయుదురు.

పచ్చంగ గట్టిన పందిళ్ల క్రింద కృష్ణున కమర్చిరి బూజమ్మబంతి

తాళమేళముల సంగీతాలవారు

సత్యభాగవతులు తమరు గూర్చుండ్రు

తోట యరిటాకులే పయిడి పళ్లెరములు

వెండిగిన్నెలతోను వెలిసె బూజమ్మ

బువ్వము బంతిలో సంగీతపరులు, సత్యభాగవతులు గూడ పాల్గొందురు. విందు భోజనములో ,,కదళి చూతఫలములు ఘనచక్కెర మిళితములు—దధి మధుఫల రసములతో తరుణులు వడ్డించిరహో—భక్ష్యపూప సూపములు పాయస ఘృత మధురగా,, పదార్థములు ,,వన్నెమీరిన సన్నబియ్యపు టన్నమాత్మలో-నెన్న దరముకాని కూరలెన్నోచేసి,, వలదు వలదన్నను వడ్డించుచుండ ,,సుందరమగు బువ్వము చూడగ ఆనంద,, మాయెను. కాని కొందరు వివాహము చేసి, విందు సమయములో పిసినారితనముట్టిపడు బువ్వము బంతి కావించుట యున్నది.

,,సాగెనే బంతులూ సనగొండ దాంకా

యేసెనే ఇస్తర్లు యెమకోట దాంకా
ఇద్దరికి ఒకమెతుకు యిగ్గులాటాయె
ముగ్గురికి ఒకమెతుకు ముగ్గులాటాయె,, ఇట్లు విందుగావించిన పిమ్మట ,,పోకల్ల తిత్తిలో అయిదు పోకల్లుండ,,గానవి ,,అందంది యాబోతె అవి రెండు మిగిలె,,ను. తములమునకై ,,ఆకుల గంపల్ల అయిదు ఆకుల్లుండ,,గానవి ,,అందంది ఈబోతే అవిరెండు మిగిలె,,ను. ఇంత సంబరమైన పెండ్లిని,, బాపల్లు సదివేరూ భట్లుపొగిడేరు,, అనుచు పెండ్లివారిని విందారగించిన వారెత్తి పొడుచుట యగును.

,,ఆహాహా పెండ్లివారింట అందమైన విందుగా
ఉప్పులేదు పప్పులోను ఉడకలేదు కూరలు
చప్పని కమ్మని సున్నిచప్పిడి మెతుకులేగా
అజ్యమా చెవులలోని ధారయే అప్పడమైనా లేదాయె

ఎన్నికైనా పిండివంట యేనాడైనా లేదాయె,, అనుచు బువ్వము బంతిలోనే వెక్కిరించెదరు. పెండ్లికూతురు వారికే ఖర్చులెక్కువ కాబట్టి వివాహభోజనములో వించుక చేయిజారవిడిచి వడ్డించక పోవుట జరుగును. బంతిలో నందరితోబాటు కూర్చున్న వియ్యంపులకు మాత్రము ,,చూచివాడరమ్మా బచ్చెము,,లని వడ్డించు వారికి ముందుగనే చెప్పుదురు. భోజనానంతరము తములపాకులడిగిన వారిమీద కోపగించు కొందురు. ,,ఇంత ఖర్చు అయినదని అప్పుడే మామగారు—గుండెలు గుండెలు గుద్దుకోని—మొండి గోడలు దూకసాగె,,. ఇక, పెండ్లి కొడుకు వెంబడి వచ్చిన ఆడబలగమును, వియ్యంపురాండ్రను, బండిలో కూర్చుండబెట్టుకొని మేళతాళములతో విడిదినుండి విందున కాహ్వానించుకొని వచ్చుట అదొక మర్యాద. విందున కాహ్వానించుటకు పూర్వమే వేడినీళ్లు, పండ్లపుల్లలు, సబ్బు బిళ్లలు, అద్దము, దువ్వెనలు, వాసననూనెలు మొదలగునవి పంపించు మర్యాదలు కూడ ఉన్నవి. వారిని పరిహాసము చేయుచు నిట్లు పాడుకొందురు,

వియ్యమందిన వియ్యాలవారికి విడుదులు చూపితిమి
వివరము తెలియని వియ్యపురాండ్లు విడిదెక్కడనిరీ
పండ్లపుల్లలు పది బిందెల నీళ్లు విడిదికి పంపితిమీ
పాసుపండ్ల వియ్యపురాండ్లు పండ్లే తోమరుగా
వేడి నీళ్లు సబ్బు బిళ్లలూ విడిదికి పంపితిమీ
మురికివంటి వియ్యపురాండ్లు స్నానము చెయ్యరుగా
అద్దము దువ్వెన వాసన నూనెలు విడిదికి పంపితిమీ
బట్టతలల వియ్యపురాండ్లు తలలె దువ్వరుగా.

వారికి మర్యాదలు సరిగా జరుగకున్నచో అలిగియుండి, విందునకు పిలువవచ్చిన వధువు తల్లి మీద చీదరించుకొందురు.

వియ్యపురాలిని ఎంతో నెయ్యమునా పిలువబోతే
గయ్యాళి తనము జూపెనే సుందరులారా-కయ్యమునకు కాలు ద్రవ్వెనే
పుయ్యబోవ గంధము దయ్యమువలె జూచి
చెయ్యిబట్టి విదిలించెనే యో సఖులారా—తెయ్యి తెయ్యి మని ఆడెనే
కాలి పసుపు పుయ్యబోతే—తూటుమాట లాడసాగెనే రమణులారా
తాలిమి యింత లేకుండెనే—మొగమున కుంకుమబెట్ట పగబూనిన దానివలె
మొగమునటు దిప్పుకొనెనే వామాక్షులారా—అగడు సేయ కానె మానెనే,,.

ఈ వ్యవహారమును గుర్తించి పెండ్లికుమార్తెతల్లి ,,ఇట్టిదని మొట్టమొదట గుట్టు దెలిసినట్టయితే-కట్టుదిట్టములు సేతునే,, అనుచు విసుగు చెందును. చిట్ట చివరకు ఎట్లో యొకతీరున వియ్యపురాలిని, మిగతావారిని మెప్పించుకొని తెచ్చి విందారగింపజేతురు. విందులో కొంచము లోపమున్నను మగవారికన్న స్త్రీ లేమాత్రము ఓర్చుకొనజాలరు. వెంటనే ఇదిలేదు అదిలేదు అని సాగించుకొనుచు:

ఈలాటి వియ్యాలవారు-మాకెక్కడ దొరికినారో
ఈ అప్పడాలు అందరికొకటి-పప్పులేదు శాస్త్రానికైనా

చప్పని పచ్చళ్ళు వడ్డించి—చక్కగా భోంచేయమన్నారు
వడియము లెండబెడితె—తడిసి ముద్దయిపోయినవట
కొంచెము పరమాన్నము—కొండనాలుక కందలేదు— అనుచు వధువు పక్షమువారిని వెక్కిరించగా, వీరును ఊరకొనక తిరిగి—

ఎచట దొరికినారు—ఇంత చక్కని వియ్యాలవారు
తెచ్చిన నెయ్యంత నేడె—తీర్థముపలె తాగినారు
భక్ష్యములు బాగాచేస్తే—మెచ్చరేలకో వీరు
సన్నబియ్యము వీరు—యెన్నడు ఎరుగరేమో
ఎన్నిసార్లు వడ్డించినా—ఇంకా తెమ్మని అడిగేరు
అరటాకు అలవాటు లేక—చిరుగులు చేసుకున్నారు
పెరుగు పాలు చేర్చుకొని—జుర్రు జుర్రని జుర్రేరు
పప్పుకూరలు వద్దు—పచ్చళ్ళే తెమ్మనేరు
చెప్పుకుంటే సిగ్గుచేటు—గొప్పవారని వీరికి పేరు— అనుచు వరుని పక్షము వారిని వెక్కిరింతురు. నిజముగా నిట్లే జరిగినచో వారి మధ్య వ్యవహారము సిగపట్లకు ముదురదా! ఇదంతయు విందులారగించు నప్పుడొకరి నొకరు వావివరుసలు జూచుకొని మేలమాడుచు వినోదించెదరేగాని, విరసమునకు గాదు. అయినప్పటికిని ఇట్లు మేలమాడుటన్నది ,,వెలదిరో ఈ వియ్యపు వారిది ఎరుకలి కులమమ్మో—వీరిది యేనాది కులమమ్మో,, అను వరకు పోయినది.

భోజనానంతర విరామ సమయములో ఇరు పక్షముల వారు, ముఖ్యముగా ఆడబలగమంత వధూవరుల నభిముఖముగా కూర్చుండజేసి వారినడుమ అరమరికలు పోవునట్లు, అనురాగము పెరుగునట్లు, ఆకుపోకలందింపజేయుచు బంతులాట, సొగటాలాట, వసంతమాడుట వంటివి ఆడింతురు. ముందు వధువుచేత ఆకులుపోకలు (తాంబూల విడియము) వరున కందింప జేయుదురు. అందించుట లోను, చేతితోగాని, ఒకరు నోటబట్టిన దాని నింకొకరు నోటిచేతనే సగమందుకొని

నములుటగాని పొసగును. వధువందించునప్పుడు తత్పక్షపు స్త్రీలు—

,,ఆకు వక్కా మణపు అందిచ్చేరారా—మణపులిచ్చేరారా

నా కుల దైవమా రాజగోపాల—ఏలా లవంగమున ఎందుకొబ్బెరను

ఫాలలోచన నుత బాగుసున్నమున—ఏలాలవంగమున ఎందుకొబ్బెరను

తెల్లనాకుల మడుపు తెచ్చిచ్చేరారా,, అనుచు వరునికి జెప్పుచు పాడుదురు. అప్పుడు వరుడు వధువందించిన దందుకొనునప్పుడు లేదా అతడే అందించు నప్పుడు వరుని పక్షపు స్త్రీలు—

ఆకు మణపు లందవే అంగన నాపై కోపమేలనే

తుంబురు నారదులేపాడ తూర్యగోషములు సెలగ

రంభాదులెల్ల నాట్యమాడ రమణులెల్ల అందివ్వగా

ఆకు మణపు లందవే అంగన నాపై కోపమేలనే— అనుచు వధువునకు జెప్పుచు పాడుదురు. వధూవరులు విడియ మందుకొను వేడ్కను గూర్చి యయాతి చరిత్రము తడవినది 1. ఈ తంతు చక్కని వేడుకగా నుండును. సిగ్గులు చిడిముడివడ, వయసు నుడివడ, వధూవరులాకు మడుపు లందుకొనుటలో అలరువిల్కాడు వారి కనుగొల్కులందు కొసరి కొసరి కోలాటమాడుచుండును. తర్వాత వారిని పగడసాల లాడింతురు. దానినే సొగటాలాటందురు. ఈ ఘట్టమున ఆకు మడుపు లందించుటవలన సిగ్గు కొంత దూరమగుట చేత ఒకరి నొకరు గెలువ దలచి ఆడుదురు. వీరాడునప్పు డిరుపక్షములవారు కలిసి—

,,సొగటాలాడేరే రాముడు సీత సొగటాలాడేరే ..... ..... .. ,,

నగవు ఇంపుగానూ ముఖ బింబము తగు చొక్కముగాను

వర్ణింపగా తగును ఇద్దరికి ముజ్జగములు గొని

ముదముతోడుత గూడి మా రామచంద్రులూ

జగతిపై పాశీ యొప్పుగవేసి సమముగా

సొగటాలాడేరే రాముడు సీత సొగటాలాడేరే,, అనుచు పాడుచు

1. యయాతి చరిత్రము:- పొన్నిగంటి తెలగన-ఆ.4. పద్య-119

నుత్సాహమును రేకెత్తించగ, వారు ,,జోడుకచ్చకాయలై దు జోడుగట్టిరి—ఉల్ల మలర పసరగాయలయలు నడిపిరీ,,. అప్పుడు వారి సిగ్గులు ఇచ్చిపుచ్చుకొన నారంభింపగా లయలమీద కాయలను జారవిడుచుచుందురు. వధువుచేత 'దక్ష' పడగానే ఆ వైపువారు ,,దక్షపడెను ఇదిగోచూడు దానపేందిరా—అచ్యుతుడా పందెమిదిగో బొరా జాలకీ,, అనుచు మెచ్చుకొనుచుండ, వరుని వైపువారు ,,చెంతకేలరావె ముద్దుచంద్రవదనరో,, అన్నప్పుడావై పువారు ,,పంతగించ న్యాయమటర పల్లవాదర,, అనెడు సమయములోనే వరుడోటువడినది చూచి, ,,అమ్మచూడె మన ముద్దు చిన్నిరాములూ—ఆడలేక జానకితొ ఓడిపోయెను,, అని యెగసి మురిసిపడుచుందురు. ఈ యాటలో స్త్రీలకున్న నైపుణ్యము పురుషుల కుండకపోవుటకు కారణమేమన, వారు నిత్యములవాటు తప్పక తీరిక వేళలలో నాడుటయే. అందులో నీయాట గృహాంతర సీమకు సంబంధించిన గృహిణుల ఆటగా నొప్పుచున్నది.

అది కాగానే బంతులాడింతురు. పాన్పుపై వధూవరులభిముఖముగా గూర్చుండగా వారినొసట ,,తీరుగాను మంచి తిలకమేదిద్ది—ఆ వారగంటి చూపులా వయ్యారమే మెరయా—సన్నజాజులు సంపెంగ విరులూ—ఆ సంపెంగ విరుల చేమంతి బంతిచేతపట్టించ—బంతులాడేనే సత్యభామశౌరితో—సంతోషముగ పూల శయ్యపై జేరి—పొందుగ తనచేతిపూబంతి గొనుచు—కందర్పజనకుడు అందు కొనగ,, ఆడుట జరుగును. ఇదంతయు వధువింటనే జరుగుటవలన ఆ పక్షము వారి బలమధికముగానుండుటచేత—

,,బంతులాడెనే పూలబంతులాడేనే—మేల్
బంతులాడెనే ఎగసి గంతులాయెనే
బుర్రముక్కు తొట్టినోరు—బర్రెగొంతు పెండ్లికొడుకు
చిర్రుముర్రులాడి పూలచెండు లాడెనే,, అనుచు పెండ్లికొడుకు

నెక్కిరింతురు. ఒకరిచేతినుండి యింకొకరు బంతి అందుకొనుటలో, లేచి లేచి

విసరుకొనుటలో, వారిచేతులందు పుష్పశరుడు పూనిపూని విసరి విలాసమాడుట చూపరులకు సహిత మాగాలి సోకినట్లుండును. కన్నియల గుండెలు పూదొన్నెలై తేనియల చిందించును. ఆ పిమ్మట వసంతమాడుట యగును. అది మిక్కిలి విలాస మొలుకుచుండును. సిగ్గుమీద బిగ్గరగ దన్నిన ముసుగు పూర్తిగా తొలగి పోవుటవలన వారి వారి పక్షీయుల ప్రోత్సాహ మక్కరలేకుండగనే వధూవరు లిద్దరు వసంత మాడుదురు. ,,పున్నమ చంద్రుని వంటి ముఖకమలాములందు కలువరేకుల వంటి కన్నులాతో జూచుచు,, ముక్కుమీద ఆణిముత్యంపు ముక్కెర మురియ, కనక భూషణములు ఘల్లు ఘల్లున మొరయ, కాలి యందెల రొదలు నవ వధూవరుల యెదలు మీటగ పూలవసంతము లాడుదురు. వధూ వరులేగాక వచ్చిన బంధువులు కూడ వసంతము లాడుదురు. అట్టి సందర్భమున వసంతములాడుట యను ఆచారము పదునొకండవ శతాబ్దమునాటికె యుండినట్లు కుమార సంభవమున ఉమామహేశ్వరుల వివాహమహోత్సవ ఘట్టమున వర్ణింప బడినది 1. ,,ఉమామహేశ్వర వివాహోత్సవంబు తోడ మనసిజు పునరవతర ణోత్సవంబగుట నఖిల జనంబులు నానందంబున నగరు మృగమద కాశ్మీర ఘనసార హరిద్రాచందన కర్దమ జలకలశానేక పుష్పపల్లవాదులు తత్పురిరథ్యాకు రథ్యా పూర్ణంబులు సేసినందదుత్సవాలోకన పరులై హరిగిరిజలఖిలామర పరివృతులై చనుదెంచిరంత,, 2 అనుటవలన వివాహమున వసంతములాడుటకు మన్మథుని పునరవతరణోత్సవమే కారణమని భావింపవచ్చును. నూతన వధూ వరులలో నవమన్మథు నావేశింపజేయుటకే ఈ వసంతము లాడుట యన్నది ఆచారమైనది. వివాహములో నీ సన్నివేశ సందర్భ ఘట్టములన్ని వధూవరుల హృదయములనేకముచేసి పదిలపరచుట కెంతగానో తోడ్పడుచుండును. మనసు విప్పుకొని, కనులు కలుపుకొని, కరతలము లలముకొని అడుగులందడుగులు

---

1. కుమార సంభవము:—నన్నెచోడుడు ఆ—9. పద్య. 51—67

2. కుమార సంభవము:— ,, ,, పద్య. 50

వై చుకొని జీవితమున ప్రవేశించుటకు ప్రాతిపదిక లగుచున్నవి. ఈ విధముగ నిట్టి వేడుకలతో వధూ వరుల నడుమ అరమరికలు లేకుండ జేసి శోభనము (గర్భాధానము) గావింతురు. వయోవివాహాచారముల కాలమున అయిదురోజులు జరుగు పెండ్లి కార్యములోనే శోభనము గావించుచుండిరి. ఈ కార్యమును దలపెట్టినపుడు తిథి నక్షత్రమును జూపించి—

,,సిరిదేవిని లేపరే శృంగారించగ వలెను
కురులు విప్పి దువ్వారే కూర్చుండనుబెట్టి
పసుపొప్పా పుయ్యారే కుంకుమ దీర్చి
మల్లెపువ్వుల గూర్చి దండలు మెడవెయ్యరే

కన్నుల కాటుకలుంచి గంధమొప్పగబూసి,, ఇట్లు వధువును శృంగారించి పీటలమీద కూర్చుండబెట్టి, వధూవరులకు క్రొత్త యుడుపులు గట్టించి ,,పిన్నలు పెద్దలు గూడి—ప్రియముతో తీసుకవచ్చి—ఆశీర్వాదముచేసి,, అక్షతలు చల్లుదురు. అతివలందరు గూడి హారతి బట్టి,—

,,కుర్చిపీటలమీద కూర్చున్న వారెవరో
పండు ఫలహారములందె వారెవరో
కుర్చిపీటల మీద కూర్చున్నది నరసింహ
పండు ఫలహారములందె మారెక్క
పట్టెమంచం మీద పండె వారెవరో
పన్నీరు మడుపుల్లు అందెవారెవరో
పట్టెమంచం మీద పందేది నరసింహ

పన్నీరు మడుపుల్లు అందేది మారెక్క,,* అనుచు సంబరముగ పాడుచు శోభన గృహమున శోభిల్లు రీతిని సూచించుచుందురు. ఇట్టి విధానము నీలాసుందరి పరిణయము వంటి కావ్యములో గూడ చూడవచ్చును 1. శోభన

1. నీలాసుందరి పరిణయము:—ఆ. 3—పద్య. 90 నుండి

గృహములో నంతకుముందే ,,పట్టెమంచము వాల్చి పరుపొప్పు పక్కవెయ్యారే పండుటాకులు దెచ్చి పానుపున మంచారే,,. అట్లు పాన్పేర్పరచి పాలు, నెయ్యి ఫలములు, కొబ్బెరబెల్లము మున్నగు పదార్థములను సిద్ధపరతురు. పాన్పు సంబరముననే 'బొమ్మనందించుట' యను వేడుకయును గలదు. ఈ క్రింది సంవాద రూపమున ఆ తంతు నడుపబడును.

వధువు:- శ్రీకర ధరణీశశోభిత, వో రాజ! శిశువును పట్టండీ
వరుడు:- చేకొని రాజకచేరుకె పోవాలె నీవద్దనే వుండనీ
వధువు:- పాలుపోయగ పొద్దుబాయె చిన్ని గోపాలుని పట్టండీ
వరుడు:- నీలవేణిరో రాజ్యమేలగ పోవాలె నీవద్దనే వుండనీ
వధువు:- మెత్తని అభిలాష పొత్తులు బరువాలె పుత్రున్ని బట్టండీ
వరుడు: వెయ్యారు పనులు నాకియ్యాళ్లగలవింక నీవద్దనే వుండనీ

ఇట్టి వేడుక 'మన్నారు దాసవిలాసము' లో గూడ గాంచనగును 1. ఒక చెక్క బొమ్మను చేతికిచ్చి వారి నడుమ అట్టి వ్యవహారమును ప్రదర్శింపజేసి, వారిలో పడుచు కోరికలను రేకెత్తించి, సమాగమమున కుత్కంఠ కల్గించి, శోభన గృహమునకు పంపి ,,కాంతా లందరుగూడి ఘడియవేయు,,దురు. అప్పుడా శోభన గృహము వారికి ప్రణయ స్వాతంత్ర్య సామ్రాజ్యమగును. పురుషుడే ముందు ఫలహారాదులతో స్త్రీని సుముఖముగా జేసికొని, ,,హెచ్చు మెడనున్న పచ్చల హారము లిచ్చేనే ..... ..... ..... వేలి ముద్దుటుంగర మున్నయమున దీసి,, ఇవ్వగా మీటిన వీణియ తీగవలె స్పందించునట్టిదయ్యును పడతి తలవంచి మారుపలుకకుండ నుండ ,,పలుకవటెందుకే-మారు పిలిచిన-పలుక వటెందుకే,, అనుచు పురుషుడు కౌగిట చేర్చుకొని ఆయింత సిగ్గును సాంతముగా దోచుకొనుట యొప్పును. శోభన కార్యానంతరము వేకువజామున పడకగది వీడి వచ్చిన పడతి వాలకమును జూచి వదినె మరదండ్రు చేయు పరిహాసములు

1. మన్నారు దాసవిలాసము:- ఆ. 5- పద్యము 70.

మిక్కిలి చిలిపిగా నుండును. ప్రతి పలుకరింపులోని అప్పటి చిలిపితనము వ్యంగ్యాత్మకమై యలరారును. ఇట్టి శోభన కార్య వ్యవహారములో వైదిక గర్భాధాన సంస్కారవిధి గర్భితమై కన్పించుచున్నది 1.

వివాహములోని చివరి దినమున నూతన వస్త్రములు గట్టించి, ఒడివింపి సారెవోసి, వధువు నత్తవారింటికి పంపువేళ, తల్లి తన బిడ్డకు నీతులు గరపి అత్తమామల చేతుల కప్పగించుటను అప్పగింతలందురు. అప్పగింతల ఘట్టమున కరుణరసము పొంగిపొరలును. ఆడబిడ్డను కని కనులారపెంచి, చెయ్యెత్తు దానిని గావించి ఒక అయ్యచేతులందుంచు చున్నప్పుడు ముంచుకొనివచ్చు తల్లి దుఃఖమున కెల్లలులేవు. ఆడబిడ్డ వివాహమగుట గట్టెక్కినంత పని యైనప్పటి కిని ఆమె నింకొక యింటిదానిగా జేసి సాగద్రోలు నప్పుడు సహజముగా తల్లి గుండె కొట్లాడకుండ ఎట్లుండగలదు! తండ్రి కనురెప్పల క్రింద దుఃఖము తెప్పలు తెప్పలు గట్టునన్నచో తల్లి గుండెతీపిని వేరుగా జెప్పవలెనా! రాతి గుండెకైన చెమటరాక తప్పదు. చూపరుల మనస్సు చెమ్మగిలక మానదు. బొట బొట కన్నీరు దుముక తల్లి, తన బిడ్డనాలింగనము చేసికొని కట్టతెగిన చెఱువు నీరైపారు కన్నీటిని ఆమె చేతులతో నదుముచు— "అత్తవారింటికి ఆనందముగా బొమ్మ-అత్తమామల భక్తి చిత్తంబులో నిలుపు—వారిపై ప్రేమ వాసుదేవుని పూజ" అనుచు మొట్టమొదట అత్తమామలపట్ల మెలగు విధమును బోధించును. ఇట్లే దేవకి "ఎంచంగాదగు నత్తమామలను దానిల్వేల్పులంగా మనఃప్రాంచద్భక్తిని"2 యని మొదటనే సుభద్రకు తెలుపుటయైనది. కుటుంబమునకు అత్తమామలే యజమానులు కాబట్టి వారికి తలయొగ్గియుండుట తగును. వారివలననే గదా కోడలికి కీర్తిగాని అపకీర్తిగాని. అందుకే అత్తవారింటికి ఆనందముగా

---

1. అథర్వవేదము:- 14-2-31, 32, 36, 38, 66.
2. విజయ విలాసము:- ఆ-3- పద్య. 121.

బోయి వారిపైన భక్తి గలిగి యుండవలెనని చెప్పుట యొప్పినది. అత్తవారి స్థితినిబట్టి— ,,పేదరికమును జూచి ప్రీతి దప్పకు తల్లి— కలిగి యున్న తల్లి కనిపెట్టి తిరుగాలె,, నని ఉత్తమమైన ఉపదేశము నిచ్చును తల్లి. ఆ తదుపరి

,,ఇరుగు పొరుగిండ్లకు తిరుగ బోవద్దమ్మ

తన చక్కదనమును దాచుకొని తిరుగాలె,, నని చెప్పును. లేకపోయినచో లేని కయ్యములన్ని ఇరుగుపొరుగుల వలన లేచి కూర్చుండును. చక్కదన మున్నదని నిక్కి తిరుగుట కూడ నిందలకు నెలవగుట తప్పదనుచు— ,,సాధు సత్పురుషులు సమయాని కొచ్చినా-అన్నపానాదుల ఆదరించుము తల్లి,, అనుచు అతిథి సత్కారమును దెలిపి, ఏదేని మాట్లాడు నప్పుడును, పనిచేయునప్పుడును,

,,మాట జారినంక మళ్లింక రాదు—అందుకే ముందు ఆలోచనుండాలె
ఏది చేసినగాని, ఏదిచూసినగాని—చేసేటి పనులందు చిత్తంబు నిలుపాలె
చెడిపోయినంకను చింతింప ఫలమేమి?—పలికి బొంకరాదు పానాలుపోయిన
సత్యంబు చేతనే స్వర్గానికీ పేరు,, అని సత్యము యొక్క ప్రాశస్త్యము

నుగ్గడించి, బిడ్డతలను నిమురుచు—

గడపపై కూర్చుండి జడవిప్పబోకూ
కూర్చున్నప్పుడే తల్లి కురులు దులుపాబోకు
వెండి మెట్టెలకాలు ఎత్తి నడువకుమా
నడచి నప్పుడు తల్లి చేయూచకమ్మా
పతి కంటె ముందుగా లేచి పనులెల్ల దీర్చి
పతి పాదముల సేవ భక్తితో చేయుమా,,

యని అణగి పొదిగి యుండుటను, పతి భక్తియును తేటపరచి—

,,ఎవ్వరేమాడిన ఎదురాడకమ్మా-పలుమారు పలుదెరచి నవ్వబోకమ్మా
ఆకలి వుంటేను అడుగ బోకమ్మా—అత్తగారితో పోరు చేయబోకమ్మా
నాతోటిచేసిన మంకు పోరెల్ల— ఎరుగని అత్తింట్లో చేయబోకమ్మా,,

అనుచు హిందూవనిత పాటింపదగు హితమార్గము నిర్దేశించి—

,,మాననీయులకు మానమే ప్రాణము—మంచికీర్తి కొంచెమైనా చాలు

అత్తగారింటికి అమ్మగారింటికి — మంచిపేరు తెమ్మ,,ని ధర్మోపదేశము చేయును. ఆడపిల్లల గన్నవారి హృదయభార మంతటిది. కణ్వమహర్షి యంతటి వాడే శకుంతల నత్తవారింటికి నంపుచు నిట్టే దుఃఖ మనస్కుతతో నీతులు చెప్పుట 1 సంస్కృత సాహిత్యమున గలదు. పాదములంటి మ్రొక్కుచున్న బిడ్డను తల్లి ,,కొడుకులూ బిడ్డలు కొమరొప్ప గలుగనీ— నిండు ముత్తైదవై ఉండవే తల్లి,, అనుచు దుఃఖానురాగ గర్భితమైన చిరునవ్వుతో దీవించును. ఇట్టి దీవన వేదోక్తమును దలపింప జేయుచున్నది 2. అనంతరము బిడ్డను అత్త మామల చేతుల బెట్టుచు అత్త నుద్దేశించి—

,,వదినరో మాబాల నిదె అప్పగింతూ
సదయవై గైకొమ్మ సరగూన రమ్మా
ఎన్నొ నోములు నోచి కన్నాను దీన్ని
కన్నులలో బెంచుకొన్నాము తల్లి
కననేమి నాబిడ్డ కాదు నీబిడ్డ—ఎనలేని ప్రేమతో నెట్లు పెంచెదవో... ....
నీలవేణిరో దాని నీటముంచెదవో—పాల ముంచెదవో నీ పాల వైచితినీ
బిగరగా బిల్వ బెదరి చూచెడినీ—దగ్గర రమ్మన్న తర తర లాడు
మాయ లెరుగదు మర్మ మెరుగదు—పాయక ఈనలుసు బ్రతికించుకొమ్మా
మనసు మర్మము జెప్పుకొనజాలదమ్మా
పనులేమి నేరదు పసిబాల యబలా—తెలివి లేమిని నేరములు చేసేనేని
చలము పూనకుమమ్మ సాగిల బడుదు,, నని వేడుకొని, మామతో

---

1. అభిజ్ఞాన శాకుంతలము:— అంకము-4—శ్లో-17.

2. యే పితరో వధూ దర్శా ఇమం వహతు మాగమన్
తే అస్యై వధ్వై సంపత్న్యై ప్రజావచ్ఛర్మ యచ్ఛంతు.
అథర్వ వేదము:-14-2-73

,,అన్నయ్య నీకిస్తి నా చిన్నికన్య—పీఁళ్ళ పంచిన మీరె పాలముంచిన మీరె,, యని మనసంత బట్టబయలు చేసికొని, వరునితో ,,రద్ది సేయకు యీడు కొద్ది సుమ్మీ—మీ యిద్దరికి ఈడు జోడు సుమ్మీ—బుద్ధులు నేరదు మాపట్టి ముగ్ధసుమ్మీ-బుద్ధి వచ్చినదాక దిద్దుకో నా స్వామి,, అని మనవి చేసికొనును. శర్మిష్ఠను యయాతి కప్పగించుచు నిట్లే చెప్పుట జరిగినది 1. అప్పగింతలప్పుడు పాలలో చేతిని ముంచి తల్లిదండ్రులు ఆ వధువు చేతిని అత్తమామల మరియు వరుని చేతిలో బెట్టుదురు. దానికి మంత్రము కూడ ఉండును. బిడ్డను వరుని వెంబడి కుడి కాలుతో గడప దాటించి—

,,సెల విచ్చి మాయమ్మ సెలవిచ్చినాము
చెలగి మీ అత్తింట బుద్ధి కలిగుండు

ఎన్నడూ నిన్విడిచి యెడబాయనైతి,,— ఇకమీద బొమ్మరిల్లు గట్టువారెవరో, ఇరుగు పొరుగులతో .బొమ్మపెండ్లిండ్లు చేయువారెవరో, నోములు నోచు వారెవరో, వీణియ మీటు వారెవరో, పాటలు పాడువారెవరో యని దిగులు పడి నిలుచుండ, వధూవరులను పల్లకిలో కూర్చుండబెట్టుకొని మంగళతూర్యములతో నూరుద్రిప్పుకొని మగపెండ్లివారు వెళ్లిపోవుదురు. పెండ్లికుమారుని చేత అడకత్తెర పట్టించుట కూడ ఒక ఆచారముగా వచ్చుచున్నది. పెండ్లిగావించుకొని భార్యాసమేతుడై తిరిగి వచ్చినప్పుడు పెండ్లికుమారుడు తల్లిదండ్రులకు, బావలకు, అక్కలకు మున్నగువారికి మ్రొక్కును. ,,అడొకొత్తి ఓచేత ఆలినొకసేత-అక్కలకు దండమనీ లేర శంకరయ్య,,. ఆయుధము (కత్తి) పట్టించు ఆచారమునకు ప్రత్యామ్నాయముగ అడకొత్తు పట్టింతురు. ఇంతటితో ప్రధానమైన పెండ్లికార్యము ముగిసినట్లే. తర్వాత తిరిగి వధూవరులు మాత్రము వధువింటికి వత్తురు. అప్పటికి కళ్యాణ మంటప మట్లేయుండును. ఒకటి రెండు

1. యయాతి చరిత్రము:- ఆ. 4—పద్య.146—148.

దినముల పిమ్మట వరుడు మాత్రమే తన యింటికి తిరిగి పోవును. పెండ్లి ముగిసిన పదునారవ దివసమునాడు 'పదహారవ పండుగ' చేయుదురు.

క్రొత్త సంబంధము చేసినప్పుడు, వివాహమునకు ముందు వరుని సంబంధమును గూర్చిన వివరములు వివాహములో దెలియవచ్చుటచేత వధువునకు దగిన వరుడు దొరకలేదని ఆమె తల్లిదండ్రులు వధువు దురదృష్టమునకు చింతించుచుందురు—

ఏమి సేతుమే నీపూజా ఫలమాయె
కత్తి భూముందాని కబురుచేసినారు
కలిగిన సంబంధమాని కన్యనిచ్చినాము
కత్తి భూమిలోన కుంచెడు ధాన్యమాయె
కొలపోసి చూపితే రుణబాధ సరిపోయె
రుణబాధ లేదాని రూఢిగా జెప్పేరు
మంచి సంబంధమాని మగువ నిచ్చేము
చిన్నవాడని ఎంతో ఏళ్లని అడుగ
చాల తక్కువేనని చెప్పినారు
లగ్నమైన వెనుక మేము చూపితేను
పన్నుగా సూసితే పాతికేళ్లుండేను
పన్నెండేళ్లు పెంచి పరవార్ల కిచ్చి

ఈలాంటి సంబంధమేల వచ్చెనమ్మ ... ఇట్టి సంబంధ వ్యవహారముల వలన మొట్టమొదట వధువునకొక విధమైన మనోవైఖరి యేర్పడుచుండును. మున్ముందు సంసార జీవితమున నది ఒడుదుడుకుల కాస్కారమగును. అట్లే వధువు పక్షమువారు వరునికి అనుకొన్న కట్నము లివ్వక పోయినప్పుడును పరస్పర బంధుత్వము ప్రశాంతముగా నుండదు. ఇదంతయు ఆడకూతురునకే ప్రాణసంకటముగా పరిణమించుట సహజము.

## సమర్త :-

కన్యలు 13 నుండి 15 సంవత్సరముల ఈడున సమర్తాడుట సామాన్యము. అనగా ప్రథమ ఋతు దర్శనమగునని యర్థము. జీవితములో వారికది వింత యనుభవము. సమర్తాడినప్పుడు వారిలో సిగ్గు, భయము అమాయకత అనునవి ముప్పిరిగొని యుండును. ఎవరికి చెప్పుకొనవలె నన్నను అవి అడ్డువచ్చుచుండును. ,,అంటాక ముట్టాక మూలల్ల నిలిసి,, యుండుటను గమనించి వెంటనే ,,తల్లి జూచి చెప్పెనమ్మా—తలవంచినవ్వెనమ్మా,,. ఒకవేళ కన్య అత్తగారింటనే సమర్తాడినచో సిగ్గు భయములు మరింత చోటుచేసికొనును. ఎట్టకేలకు కొననాలుక తోడనో, కనుచూపుల వాలకముతోడనో, ,,సిగ్గుపడి సీతమ్మ సీరామునికి చెప్పింది,,. అతడు తల్లికి తెలుపుట జరుగును. సమర్త కాక పూర్వమే వివాహము చేయుట మధ్యయుగ ధర్మము. పరాశరుడు కూడ సమర్త కాక పూర్వమే కన్యకు వివాహము చేయవలెనని చెప్పినాడు 1. కాని, రజస్వల యైన మూడు సంవత్సరముల పిమ్మటనే వివాహము తగిన వానితో చేయుట యుక్తమని మనుస్మృతి ప్రామాణీకరించినది 2. అసలు వేదకాలమున రజస్వలానంతరమే వివాహములు చేసెడువారు 3. రజస్వలానంతర వివాహములుండుట వలననే పెండ్లి మంత్రములందు గర్భాధాన మంత్రములు చెప్పబడుచున్నవి. ఇంతకుముందు వివాహ సందర్భములో గూడ శోభన గీతాలు చదివితిమి. లభించినంతవరకు పల్లె పదాలలో వివాహానంతరము సమర్తయైన కన్యల విషయమే అధికముగా గన్పించుచున్నది.

సమర్తయైన వెంటనే బ్రాహ్మణుని పిలిపించి పంచాంగమును జూపించు

1. పరాశర స్మృతి:—ప్రాయశ్చిత్త కాండము—అధ్యా. 7. శ్లో. 6
2. మను స్మృతి:—అధ్యా. 9. శ్లో. 90
3. ఋగ్వేదము:— 10—85—40, 41

కొని ముహూర్త విశేషమును దెలిసికొందురు. "విప్రవరుని బిలువరమ్మా—విడియము సమర్పించరమ్మా—విప్పిపంచాంగము చూడగానే—యుక్తమైన నక్షత్రమానె". బ్రాహ్మణుడట్లు పంచాంగమును జూచి తిథివార నక్షత్రములు మంచివే యని తెలిపి—

శుక్రవారంనాడు సుక్కలోలె బిడ్డలు
శనివారంనాడు శని వెంట బడ్తది
ఆదివారంనాడు అందరికి మంచిది
సోమవారంనాడు సోముడెంట వడ్తడు
మంగళవారంనాడు మగువలకు మంచిది
బుధవారంనాడు పుచ్చు బిడ్డల్లు

బేస్తవారం నాడు పెద్దలకు మంచిది". ఏ యే వారమునాడు సమర్తయైన ఎట్టి విశేషముండునో కూడ వివరింపగా నా శుభవార్తను "భాసురాంగి అత్తవారికి శుభలేఖలు" పంపెదరు. పంచాంగము చూపించిన పిదప చాకలిని పిలిపింతురు. "వచ్చేనే సాకల్ది వానతుల్లమీద—నిలిచేనేసాకల్ది నిండు పందిట్ల". ఆ చాకలిదానితో "సందుల్లు గొందుల్లు వూడ్పించి—ముత్యాల ముగ్గుల్లు వేయించి అకిళ్ల వూడ్పించి ముగ్గులే" యింతురు. అలికి ముగ్గిడిన ఒక మూలను సమర్తాడిన కన్యను కూర్చుండ బెట్టుదురు. ఇరుగు పొరుగు ముత్తైదువలైన "పణతుల్ల పిలిపించి పసుపు కుంకుమలు ఏయించి—పణతుల్ల పిలిపించి నువులు నూకలు ఏయించు"దురు. వచ్చిన ముత్తైదువలందరు హారతిపట్టి పాటలు పాడుదురు. ఆశీర్వదింతురు. పేరంటాండ్రకు పసుపు కుంకుమ, ఆకువోకలు, సెనగ గుగ్గిళ్ళు పంచుట యొక మర్యాద. మొదటి రోజునుండి ఐదు రోజుల వరకు ఇరుగు పొరుగు వారును దగ్గఱ బంధువులును, కుడుకలు బెల్లమే గాక వివిధములైన తిను పదార్థములను దెచ్చి సమర్పించుకొందురు. ఆ పదార్థము లన్నియు వాజీకరణమున కుపకరించు నట్టివిగా నుండును.

సమర్తయైన కన్యను కొన్ని కులములలో పదునొకండు దినములు, మరికొన్ని కులములలో పదుమూడు దినములు మూలకు కూర్చుండబెట్టుట కట్టుబాటు. మొదటి నాలుగు దినములవరకామె నెవ్వరును ముట్టుకొనరు. కాని ,,అయిదొద్దుల నాడంత ఏడేడు గోళాలు_నీళ్ళుకాసిపోయించి_యిరుగుపొరుగుల పిలిపించి_తీపొంటపెట్టిరి_ఆశ్రిత బంధువులకు భోజనంబిడిరి,,. చివరి దినమున మాత్రము మరింత పెద్ద మొత్తమున వేడుక జరుపుకొందురు. బంధుమిత్రాదులు దెచ్చిన కట్నములను, కానుకలను కన్యకు ఒడినింపుదురు. ,,చదువరారమ్మ సమర్తకట్నాలు_చదరాలు అమ్మాయి సమర్త మాయింట,, ఇట్లే మరి మూడు సమర్తలవరకు ఆచారవ్యవహారములు పాటింపబడును. వివాహమునకు ముందే నమర్తయైనచో ఇదివరకు వివాహ సందర్భమున జెప్పుకొన్న ప్రకారము గర్భాధానము గావించుట జరుగును. వివాహానంతరమే సమర్త యయినచో ఒక శుభముహూర్తము జూచి మగని రప్పించి కట్నము లిచ్చి గర్భాధానము చేయింతురు.

## సీమంతోన్నయనము:-

షోడశసంస్కారములలో సీమంతోన్నయన మొక స్త్రీ సంస్కారము. దానివలన గర్భిణీస్త్రీకి ఆరోగ్యపుష్టి, మనస్సంతుష్టి, గర్భస్థిరత్వము చేకూర్చుట యగును. స్త్రీ గర్భవతియైన నాల్గవ 1, ఆరవ, ఎనిమిదవ 2 మాసములలో నేదేని యొక మాసములో సీమంతము చేయుట నియమము. అత్తవారింట నున్నచో పుట్టింటివారు, పుట్టింట నున్నచో అత్తగారు సీమంతము జరుపుట పొసగు చుండును. దగ్గఱ బంధువులు గూడ దీనిని జరుపుదురు. అత్త వారింటనున్న ఒక

---

1. ,,చతుర్థే గర్భమాసే సీమన్తోన్నయనమ్,, :_ ఆశ్వలాయన గృహ్య సూత్రములు:_అధ్యా. 1 ఖం. 14 సూ. 1.

2. పారస్కర గృహ్య సూత్రములు;_కాం. 1. కం. 15. సూ. 2-3

యువతి ,,చూలాలి కోరికలు తెలియరు కాబోలు—సూడిదను కావిళ్ళ పంపరు కాబోలు,, అనుచు పుట్టింటివారి జాప్యమునకు చింతించును. సీమంత కార్యములో సూడిదలు దెచ్చుట ప్రధానముగా నేడు గన్పించుచున్నది. అనగా చూలాలి కోరికల కనుకూలమైన వివిధములైన తినుపదార్థములు, పండ్లు, నూతన వస్త్రములు కట్నములుగా దెత్తురు. ముత్తైదువలు గర్భిణీస్త్రీని పీటపై కూర్చుండజేసి పాదములకు పారాణిపూసి, నొసట తిలకము దిద్ది. గంధమలది, పాటలు పాడుచు హారతి యిచ్చుచుండ, సూడిద లామె కర్పింపబడును. ప్రతి శుభకార్యములో తిథి వార నక్షత్రములను జూచుట, ముత్తైదువలు పాల్గొనుట, పసుపు కుంకుమ లందుకొనుట, హారతులు బట్టుట సర్వ సామాన్యమైన వ్యవహారములు. ఆర్షోక్త సంస్కారవిధి ననుసరించి భర్త తన భార్య వెంట్రుకలకు సుగంధ తైలమంటి, షేడిపుల్లతోగాని మెత్తని వాడిమొన గల మరే పుల్లతోగాని కురులు సవరించి పాపటదీసి, సొగసొప్ప సిగవైచి యజ్ఞశాలకు తోడుకొని రావలయునను ఆచారము నేడు మృగ్యము. ప్రాధానముగా గర్భస్థ శిశువునకుత్తమ సంస్కార మందింప దలచియే సీమంతోన్నయనము గావించుట యగును 1.

## గర్భిణీ కోరికలు:-

నెలతప్పి గర్భమేర్పడినప్పటి నుండి విచిత్రమైన కోరికలు పుట్టుట సహజము. ఈ యవస్థలో శారీరకముగా, మానసికముగా వినూత్నమైన మార్పులు పొడచూపును.

,,ఒకోమాసంనెల తన గర్భిణి ఓనగాయగోరే చెలియా ఓనగాయగోరే
రెండోమాసంనెల తన గర్భిణి రేగుపండ్లుగోరే చెలియా రేగుపండ్లుగోరే,,

1. అథర్వవేదము:— 10—2—27

ఇట్లే మూడవ మాసమునములకపండ్లు (రామములక), నాలుగవ మాసములో నారికేళము, అయిదవ మాసములో అరటిపండ్లు, ఆరవ మాసములో ఆవుపాలు' ఏడవ మాసములో వెన్న, ఎనిమిదవ మాసములో వెలగపండ్లు, తొమ్మిదవ మాసములో దోసపండ్లు కోరుట యగును. ఇంతేగాక, బియ్యములోని రేగటి పెల్లలు, బొగ్గు తునకలు మున్నగునవి తినుటకూడ చూచెదము.

ప్రసవము:-

తొమ్మిది మాసములునిండి పదియవ మాసము నడచుచుండ ప్రసవించుట జరుగును. ఒక్కొక్కప్పుడు ఏడవమాసమునగూడ ప్రసవించుటయును అగును. సకాలమునకు దినములు తక్కువ మోసిన మగబిడ్డ, యెక్కువ మోసిన ఆడబిడ్డ కలుగునని చెప్పుదురు. కాని, ఎనిమిదవ మాసమున పుట్టిన బిడ్డ బ్రతుకదు. ప్రసవవేదన చెప్పతరము కానిది. స్త్రీకది రెండవ జన్మవంటిది.

,,నడుమూ కళుక్కు మనెనమ్మా—అమ్మా ఓ యమ్మలారా
ఘడియ ఘడియకు కళుక్కుమనె నడుము—కడుపులో నులివెట్టె తల్లీ
కడుపు కొంచెము నొక్కరమ్మా—కడుపులో కల్వరించెనమ్మా
పిండమ్ము దిరిగెనోయమ్మ—అండబాయక నుండరమ్మా
దూరబారము చూడరమ్మా—దూలాన తాడేయరమ్మా
ఉరుములే ఉరిమినట్లయ్యె—ఓర్వలేనో ముద్దుగుమ్మా
కూర్చుండి ఓపలేనోయమ్మ—కుదురైన పెక్కెము
దెచ్చి వెనుకను వుంచరమ్మా—కూర్చుండుటకు కుదురదు ప్రాణము
తీర్చరే కష్టము నేర్చిన వారలు,,. ఇట్లు కలుగు అనేకమైన నొప్పులను భరింపలేక మంత్రసానిని, ముసలవ్వలను ఓదార్పు కొరకు దగ్గరకు పిలుచు కొనును. ,,ఏసంతుకైనా యిటు బాధలుండిన—ఈసడింతునమ్మ దోసకారిపనిని,, అని పలికెడు గర్భిణి పలుకులు ప్రసవించుసంతవరకే వర్తించును. ఆ తర్వాత ఎప్పటి మాదిరే. దీనినే ప్రసూతి వైరాగ్యమందురు.

సుఖప్రసవమునకు కొన్ని చికిత్సలు చేయుదురు. అవి గృహపరిమిత మైనవి. వానిని గూర్చి తృతీయ ప్రకరణము చివర 'విజ్ఞానము' అను శీర్షిక క్రింద చర్చించుటయినది. ప్రసవించిన బిడ్డకు మంత్రసాని బొడ్డుకోసి స్నానము చేయించి తుడిచి, చేటయందు పరుండబెట్టి దిగదుడిచి, మసిబొట్టువెట్టి, తల్లి పొట్టన వేయును. బాలెంతను ఉడుకునీట స్నానము చేయించి తనువెల్ల పసుపు పూయును. అందుకే "బాలెంత వస్త్రాలు పసుపుల్ల చివుకు"ను. పురిటి బిడ్డను పీడించకుండునట్లు "ఎన్నెమ్మ" (ఈమె పురిటింట నుండు నందురు) వంటి భూత విశేషములను "రావె రావె ఎన్నెమ్మా–నీవు పోవె పోవె ఎన్నెమ్మా–నీకు చీరెడతా మెన్నెమ్మా–నిన్ను పూజిస్తా మెన్నెమ్మా" అనుచు స్మరించుచు పూజించుట యొక విశ్వాసము. పుట్టిన బిడ్డ బ్రతికి బట్ట గట్టినచో ఆ బిడ్డ తలనీలాలర్పించు కొందుమని ఇష్టదేవతలకు మ్రొక్కుకొనుటయును జరుగును. ప్రసవించిన నాడు బ్రాహ్మణుని బిలిచి బిడ్డ జాతకమును గూర్చి చెప్పింతురు.

## నామకరణము:-

ప్రసవించిన పదునొకండవనాడు గాని, ఇరువది యొకటవ నాడు గాని నామకరణోత్సవము గావింతురు. మనుస్మృతిలో ఈ విషయమున ఆయా వర్ణముల వారికి వేరువేరు తిథి వారములు చెప్పబడినవి. నేడు మాసాంతము వరకు నియమిత కాలమున చేయుట గమనింతుము. నామకరణోత్సవమునే బారసాల, ఇరవై యొక్క దినము అని పిలుతురు. గృహశుద్ధిచేసి ఆనాడు ఇంటికి పసుపు పంచుదురు. "గడపకు కావెడు పసుపని చాటండి"– ప్రతి శుభకార్యమున పసుపుకుంకుమ యొక్క ప్రాముఖ్యము గమనింపదగినది. ముత్తైదువ తనమునకది చిహ్నము. ఈ ఉత్సవమునకు బంధువులు వత్తురు. తల్లికి బిడ్డకు నూతనవస్త్రములు "బాలునికి పట్టంగి పాల్దాగు గిన్నె"లు, "పుట్టు టందెలు బూని పులిగోళ్లు బూని", "అంగికుల్లలు దెచ్చు అంబ్రాసు దెచ్చు"ట

లాంఛనములు. పసిబిడ్డ మెడకు పులిగోరు గట్టుట దృష్టిదోషహరణమునకే గాక వీరత్వమునకు చిహ్నమై యుండును.

బిడ్డకు శిరసంటి ,,సన్నీళ్లు వేన్నీళ్లు సమముగాబోసి_మూడు దోసిళ్ళు ముందుగాబోసి,, జలకములార్చెదరు. పొడిగుడ్డలతో తడియొత్తి, నుదుట మసిబొట్టు దిద్ది, తల్లిబిడ్డలకు క్రొత్తబట్టలు గట్టించి, సాయం సమయమున ,,పెద్ద ముత్తైదువల ప్రేమతో బిలిచి-పసుపు కుంకుమలునూ పరిమళాలిచ్చి-దొడ్డ ముహూర్తమని తొట్టెలో ఉనిచెద,,రు. ఇట్టి ఉపచారములే గాక సీమంతము, గర్భదోహదము, ప్రసవము లపుడు పాటించు ఆచారములును శివరాత్రి మహాత్మ్యము, సింహాసన ద్వాత్రింశిక వంటి కావ్యములలో వర్ణితములు. బిడ్డ పొత్తిట గుగ్గిళ్ళు. చిల్లరదుడ్లు కూడ పోయుట యున్నది. తొట్టెల క్రింద వామపొట్టుతోను, సాంబ్రాణితోను ధూపము వేయుదురు. తల్లి, తల్లివైపు పెద్దలు తండ్రి, తండ్రివైపు పెద్దలు-తమ తమ యభీష్టములకు తగిన పేర్లు బెట్టుచు, పసిబిడ్డ చెవిదగ్గర ,,కూక్,, అనుచు మురిసిపోవుచు ,,చిలుకపలుకులను పాటలు రంజిల్ల_చెలువుగా లాలియూచెదరు చెలులెల్లా,,. ఇదంతయు చక్కని వేడుకగా నుండును. వచ్చిన పేరంటాండ్రకు ,,పసుపు కుంకుమలునూ పరిమళాలిచ్చి గుగ్గిళ్ళు పంచెనే కుసుమ శ్రీగంధీ,,.

బిడ్డను తొట్టెలో పరుండబెట్టుటకు ముందు బాలెంతను చేదుడుబావి చెంతకు తోడుకొనిపోయి, బావికి పసుపు కుంకుమలచేత బొట్లు పెట్టించి మ్రొక్కించి మూడు చేదలు చేదించుట వ్యవహారము.

,,గోరింత పువ్వంటి కొడుకునెత్తుకోని_బాలెంత వచ్చింది బావినీళ్లాకు
ఏదేది బాలెంత ఎంతచక్కనిదో_మాసిన పట్టుచీర మణమలకు పసుపు
కళ్లకు కాటుక పళ్లకు ఎరుపు_మావాడ బాలెంత అబ్బాయి తల్లి,, *

ఇట్లు బావినీళ్లకు తీసికొనివచ్చుట బహుశః ఆ దినమునుండి ఆమె నిత్యకృత్యము లారంభింపదగిన దని కాబోలు.

సంతానమగుట పుణ్యఫలమందురు. దానధర్మములవంటి పుణ్యములు చేసిన అది సిద్ధించును. ఎంత పాపముచేసిననో ఆ స్త్రీ గొడ్రాలుగ మిగిలిపోవుట యగును. పుణ్యకార్యములలోను, శుభకార్యములలోను గొడ్రాలి మొగము చూచుటగాని, పిలుచుటగాని పొసగదు. అందుకే ,,గొడ్రాలి బ్రతుకేల కోటిధన మేల,, యని సామెత. గొడ్రాలు చేసెడు పాపములలో కొన్ని యిట్లుండును.—

సామినాకు సంతానం దయ చేయరాదా
పాడుంచె పదిమంది కోస్త్రరట జనులు
ఓసి నువు పోసి నవ లేదే
పాడుంచె పదిమంది కోయలేదుసామి
తలుపేసుకొని యింట్ల దాగున్నసామి
ఓసి నీకు సంతానమిక యాడగలదే
గూట్ల దీపం వెట్టి మొక్కేరు జనులు
ఓసి నువు మొక్కినవ లేదే
గూట్ల దీపం వెట్టి మొక్కలేదుసామి
సేతులు నొత్తా యని ఊకున్నసామి
ఓసి నీకు సంతాన మిక యాడగలదే
వాడలో బాలుడు ఆడుచుండంగ
ఎలవెట్టి పండ్లుకొని యిచ్చేరు జనులు
ఓసి నువు యిచ్చి నవలేదే
ఎలవెట్టి పండ్లు గొని యివ్వలేదుసామి
కోల కట్టెలతో కొట్టినాను సామి
ఓసి నీకు సంతాన మిక యాడగలదే.*

గొడ్రాలింత పాపము చేసినది కనుకనే, సంతానము కలుగలేదు. సంతానము కలుగవలె నన్నచో ,,పాలల్లొ పంచదార కలుపవేతల్లి—భాగ్యాన నీ కడుపు

ఫల మందవలెను,,. అనగా కనీసము మంచికి మంచి, పుణ్యమునకు పుణ్యము చేయవలెను గాని, పుణ్యమునకు పాపమంట గట్ట గూడదు. పాపాత్ములాంధ్రు గంగస్నానము లు చేసినను, వ్రతములు చేసినను, ఈశ్వరుని గుళ్లకు ఇటుకలు మోసినను, రావిచెట్టుకు ప్రదక్షిణము చేసినను ఫలముండదు. సంతాన మాశించు వారనేక దేవతలకు పూజలుచేయుట, నోములు పట్టుట జరుగును.

,,సింహాద్రి అప్పన్నగుళ్ల ముందార—పడ్డారు గొడ్రాళ్ళు ప్రాణచారాలు...
సింహాద్రి అప్పన్నకు లంచాలు ఏమి?
గుడితిర్గు వస్త్రాలు గుమ్మడి పళ్ళు—దాగళ్ల వడపప్పు దండు బెల్లాలు...
ఈశ్వరుని గుళ్లకు రాళ్ళు మోసేవు—రావిచెట్టుకు ప్రదర్శనలు చేసేవు,,

నిత్యము గుళ్లకు, రావిచెట్లకు ప్రదక్షిణములు చేయుట, గుమ్మడిపండ్ల నర్పించుట, గుళ్ల నిర్మాణమునకు రాళ్లను మోయుట మున్నగునవి ఆచారములైనవి. రావిచెట్టును పూజించుటలోని ప్రత్యేకత విశేషముగానున్నది. ఏ జమ్మిచెట్టుపై రావిచెట్టు మొలచునో దాని వేరును గర్భాధానము నాటినుండి రెండు మూడు నెలల వరకు స్త్రీకి ఔషధముగా నిచ్చుటచేత పుత్రసంతానప్రాప్తి యగుననెడు వైదిక విజ్ఞానము 1, నేడు రావిచెట్టు ప్రదక్షిణముగా మిగిలినది. సంతానములోను మగ సంతానమునకే యెక్కువ ప్రాధాన్యమున్నది. ,,కొడుకుల కనని కడుపేమి కడుపు—కొడుకుల గంటెను కోటి లాభమ్ము,, అనులోకోక్తి వైదిక సంప్రదాయానుగతమై వచ్చినదే. ఇంతేగాక ,,కన్న కానుపులెల్ల కడు

---

1. శమీమశ్వత్థ ఆరూఢస్తత్ర పుంసవనం కృతం
తద్వై పుత్రస్య వేదనం తత్ స్త్రీష్వాభరామసి (1)
పుంసీవై రేతో భవతి తత్స్త్రియామనుషిచ్యతే
తద్వై పుత్రస్య వేదనం తత్ప్రజాపతి రబ్రవీత్ (2)
—అథర్వవేదము:—6—11—1,

చక్కనయితే_కన్నుల పండుగే కన్నతల్లికిని,,. ఎల్లప్పుడు తొట్లె కలుగుట గృహసౌభాగ్యముగా నెంతురు.

నామకరణానంతరము ఆరవ, ఎనిమిదవ, పదివ, పండ్రెండవ మాసములలో నేదేని యొక మాసమున బిడ్డకు అన్నప్రాశనము చేయుదురు. అనగా బిడ్డకు క్రొత్తవస్త్రములు తొడిగించి, తల్లి తన తొడమీద కూర్చుండ బెట్టుకొని పెరుగు, నేయి, పాలతో కలిపిన అన్నమును మెత్తగ రంగరించి మొదటిసారిగా తినిపించును. పేరంటాండ్రు హారతులు బట్టి పాటలు పాడుదురు. ఆ పిమ్మట వివిధములైన వస్తువులను బిడ్డ ముందర వేయుదురు. వానిలో దేనిని బిడ్డ తన చేత గ్రహించునో దానివలన బిడ్డ మనుగడ ఆధారపడి యుండునని విశ్వసింతురు. అట్లే చౌలము ,ఉపనయనమువంటి ఇతర సంస్కారములు కూడ ఆచరింపబడుచున్నవి. వానిని గురించిన పాటలు లభించనందున నామ మాత్రముగానే పేర్కొనుట తప్ప వివరింప వీలుపడదు.

## పండుగలు - ఉగాది:-

ఉగాది మొదలు సంక్రాంతి వరకు గల జాతీయమైన పండుగలన్ని పల్లెలలోనే చక్కగ జరుపబడును. కాని, నాకు లభించిన పల్లెపదములలో మాత్రము ఉగాది, సంక్రాంతి, కామునిపున్నమలను గూర్చిన విషయములే ముఖ్యముగా నున్నవి. వీనిని సుంత గమనింతము.

ఉగాది మనకు నూతన సంవత్సరాది. చైత్ర పాడ్యమితో ప్రారంభ మగును. ప్రకృతిలో క్రొంగ్రొత్త చైతన్య మట్టిపడుచుండును. వసంతమాకాల మార్గమున నిండు సంత జరుపుకొనుచుండుట విశేషము. ప్రకృతి యంత పరవశించి నాట్యమాడుచుండును. వేసంగి పంట లింటికి నిండుదన మాపాదించి పెట్టును. ఇట్టి విలక్షణమైనశోభతో_

ఉగాది పండుగ వచ్చింది_ఊరికి అందం తెచ్చింది
ఉగాది పండుగ వచ్చింది_ఊరంత ఎన్నెల గాసింది
పెరటి ఏపచెట్టు పూసింది_ప్రేమతో కోయిలకూసింది
తుమ్మెద బృందం లేచింది_సొంపుగ గానం చేసింది
కోయిల కో అని పిలిచింది_కొమ్మలు చిగురులు వేసినవి
కలకల పూవులు విరిసినవి_కమ్మని గాలులు విసరినవి
కిల కిల చిలుకలు పలికినవి_ఫలములు రసములు చిలికినవి

ఉగాది వచ్చి యింత చైతన్యము నిచ్చుచుండ ఒక కొమ్మమీది పిట్ట ఇంకొక కొమ్మమీది పిట్టతో కలిసి యాడునట్లు, సంబరమున బంధుమిత్రాదు లందరు కలిసి పండుగ జరుపుకొందురు.

అక్కలు బావలు ఆసలతో_చక్కా వచ్చారు పండుక్కి
అమ్మా వేకువ లేచింది_అందరికి తలలు కడిగింది
సరిపడే నగలు యిచ్చింది సరికొత్త బట్టలు పెట్టింది
కొత్తాకోడండ్ల పిలిచింది_కోరి తలలకు నీళ్ళు పోసింది
అత్తారు పన్నీరు లలదింది_కొత్త సీరెలు కట్టబెట్టింది

పెందలకడనే లేచి స్నానము చేసి క్రొత్తబట్టలు కట్టుకొనుట, పచ్చ తోరణము లలంకరించుట ప్రతిపండుగకు సామాన్యమైనది. పండుగలు పిల్లలకు మరింతఉత్సాహ జనకములు. ఉగాదినాటిఉత్సవము, ఊరేగింపు, పూజలు, వారి నురకలెత్తించును. తొలుత ఇలువేల్పును పూజించి దీపధూపనైవేద్యము లిచ్చిన పిదప అమ్మఅందరికి ,,వేపపసాదం పెట్టింది,,. క్రొత్త కుండను దెచ్చి అందులో క్రొత్త చింతపండు రసముతీసి క్రొత్త బెల్లమును కలిపి తగినంత వేపపూతను మామిడి ముక్కలను వేసి చేయు దానిని ఉగాది పచ్చడి యందురు. అది తీపి, పులుపు, చేదు, వగరులతో కూడియుండును. జీవితములోని సుఖ దుఃఖములకది నిదర్శనము. ఉగాదినాటి సాయంత్రము ,,ఉత్సవాలతో దేవుళ్లకు ఊరేగింపులు

సాగాయి—గుడిలో దేవుని పూజించి—గురువుల పెద్దలరావించి—పంచాంగాలను చదివించి—మంచీ చెడ్డలు,, విందురు. పూజానంతరము గుడిలో బ్రాహ్మణునితో నూతన సంవత్సర ఫలితములను గూర్చి తెలిసికొనుట ఆనాటి ప్రత్యేకత, ప్రాధాన్యత. ప్రజలు తమ తమ గ్రహచార మెట్లున్నదో తెలిసికొనగోరి ఒకరి కంటె ఒకరు తహతహ లాడుచు ,,పంచాంగ మిప్పిచూడు బాపనయ్యా—నా బలా బలము సూడు బాపనయ్య,, అనుచు అతనితో తమ అదృష్ట దురదృష్టములను చెప్పించుకొనుట ఆచారమైనది. పండుగ దినమున నెటుచూచిన భజనలు, కోలాటములు, ప్రజలసందడి, పచ్చతోరణముల సొగసు కనువిందొనర్చు చుండును.

## సంక్రాంతి:-

సంక్రాంతి యనగా ప్రవేశించుట. అనగా జగన్మిత్రుడైన సూర్య భగవానుడు ఒకరాశినుండి యింకొక రాశిలోనికి ప్రవేశించుట యని అర్థము. ముఖ్యముగా మకరరాశిలోనికి ప్రవేశించుటను మకర సంక్రాంతి యందురు. అది పుష్యమాసములో వచ్చుచుండును. గొప్ప జాతీయ పర్వదినము. హిమగిరి నుండి కన్యాకుమారి వరకాబాలగోపాలము పాల్గొని ఉత్సాహమున మునిగిపోవు చుండ భారతమాత ముగ్ధురాలగుచుండును. మార్గశీర్షమాసము వరకు దక్షిణాభి ముఖుడై పయనించిన సూర్యభగవానుడు పుష్యమాసమునుండి ఉత్తరాభిముఖుడై సాగిపోవును. అప్పటినుండి ఆరుమాసముల కాలము ఉత్తరాయణము. ఉత్తరాయణమున మరణించువారు స్వర్గము చేరుకొందురని విశ్వాసము అంపశయ్య మీదుండిన భీష్ముడు ఉత్తరాయణము వరకు వేచియుండి ఆనాడసువులు విడిచెనని భారతము చెప్పుచున్నది. మకర సంక్రాంతికి ముందు రోజున జరుగుభోగి పండుగనాడు భోగి మంటలతో ప్రాతదనమునకు వీడ్కోలు పలికి క్రొత్తదనమునకు స్వాగతము చెప్పుట జరుగును. ,,భోగి మంటలుకాగి మాగుస్నానాలుచేసి — భోగిపుటగాములు — బాగుపరమాన్నంబు,, వండుకొని

తిందురు. దృష్టి దోషాదికమును హరింప జేయుటకై పసిబాలురకు రేగుపండ్లు (ఓరుగల్లు మండలములో బుడ బుడ పండ్లు పోయుట అందురు) తలమీదినుండి పోయుదురు. వీనినే భోగి పండ్లందురు. ,,శశిముఖులారా రారే–పసిబాలలకు భోగిపండ్లు పోతాము,, అని పాడుచు పీటలపై కూర్చుండబెట్టి తిలకము దిద్ది పండ్లు పోయుదురు. వేడుకతో ,,మురియుచు హారతి చిరుత బాలలకిచ్చి–దీవించి శిరసున సేసలుంచు,,దురు.

పెక్కు పండుగలు కాలగమనమును, ప్రకృతిని బట్టి యేర్పడినట్టివి. ఆయా పండుగల కాయా కాలపరిస్థితులు ప్రత్యేకములు. సంక్రాంతి దినములలో ప్రకృతి ప్రశాంతముగా నవోఢవలె ఒప్పును. చంకలు ముదురుకొనజేసిన చలి లెంకలు వేయుట మానుకొని డొంక దారిని చూచుకొనును. అనగా చలి కాలమునకు వీడుకోలివ్వబడి వేసవి కాలమునకు స్వాగతము పట్టినట్లుండును. వాన కాలపు పంటలన్ని కళ్ళములలో కలకలలాడును. కోసిన మళ్లలో గిత్తలు తోకలెత్తుకొని గంతులిడును. పేదలు పరిగలేరు కొందురు. కందిచేలు కాతబట్టి కోతకెదురు చూచుచుండును. గరికపోచల కొనలమీద మంచు ముత్యములు ప్రభాత కిరణస్పర్శచే నిగనిగ మెరయుట సహజము. బంతి పూదోటల బంగారు ఛాయలు శోభాయ మానముగా నొప్పును. ఆనాడు–

,,పొద్దు పొద్దున లేచి దిద్దీముంగిలి తీర్చి–పసుపు గడపలకు రాసి నిసపూవల్లికబెట్టి–గుమ్మాల బంతికట్టి తోరణాలు దుస్తరించి,, వాకిండ్లలో ,,చక్కన్ని ముగ్గులువెట్టి ఎక్కువైన రథాన్ని నిల్పి,, కళలీనునట్లు చేయుదురు. బాలికలందరు పోటీపడుచు నిండ్లముందర ఒకరినిమించి యొకరు రామాయణ భారతాది కథలను దెలుపు చిత్రములను రంగు రంగుల ముగ్గులతో చిత్రింతురు. యమద్వారములు మూయుట, 'సంకురు' ని చిత్రమును గీయుట రంగవల్లులలోని మరొక విశేషము. బాలికలు గోవుపేడతో గొబ్బిళ్లచేసి పసుపు కుంకుమ బొట్లు దిద్ది, బాలురుదెచ్చిన పిండికూర కొనలు, గరికపోచలు, తంగెడు పూవులు

అలంకరించి, గడపలమీదను, ఇంటి ముందర ముగ్గులమీదను బెట్టి రేగుపండ్లు పోయుదురు. గొబ్బిళ్లచుట్టు గుండ్రముగా దిరుగుచు ,,గంగమ్మ గౌరమ్మ అప్ప చెల్లెండ్రో – గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో – ఒకతల్లిపిల్లలకు వైరములేదు గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో,,* అని పాడుదురు.

సుబ్బి గొబ్బెమ్మా సుబ్బడివ్వియ్యావే–చామంతి పువ్వొంటి చెల్లెల్నియ్యావే
తామర పువ్వొంటి తమ్ముడ్నియ్యావే–మల్లెపువ్వొంటి మొగుడ్నియ్యావే,,

అనుచు కోరుకొనుచుందురు. ,,గొబ్బియళ్ళో,, అనగా పూజలు, నుతులు అని అర్థము. బాలికలను సంస్కారవంతులను జేయుట కిట్టి పూజావిధానములు తోడ్పడుచుండును. గొబ్బి తట్టుట యన్నది సాగరసీమలో గన్పట్టుచున్నది. అన్ని పండుగలవలెనిది చక్కని పరమార్థము నాశించి చేయబడునట్టిది. సమస్త జీవకోటికి చైతన్యము ప్రసాదించు సూర్యుడు నిష్కామ కర్మయోగి. ఆయన రథమున కొకటే చక్రమట. రథసారధి కుంటివాడట. పాములే పగ్గములట. ఏడు గుఱ్ఱముల స్వారియట. క్రింద ఆధారములేని దారియట. అట్టి కర్మసాక్షి తీక్షణమైన కాంతిని ప్రసరింపజేయుచు మహావేగముగా అలసట గిలసట లేకుండ సాగిపోవు చున్నాడన కారణమేమైయుండును? ,,క్రియాసిద్ధిః సత్వేభవతి మహతాంనోపకరణే,,. క్రియాసిద్ధికి సత్వమే కావలెను గాని మహోపకరణము లుండుట చేతనే అది సిద్ధించుననికాదు. కాబట్టి, రకరకములైన పంటలు పండించుకొని పండుగలు చేసికొని సంబరపడుటయే ముఖ్యముకాదు. సమాజమునకు సత్వము, క్రియాశీలత కావలెను. సమాజ సంఘటనమునకు పాటుపడుచు స్నేహమును,మంచితనమును పంచుకొనవలెనని ఆనాడు పరస్పరము పంచుకొను నువ్వుల బెల్లములోని భావము.

తెల్లవారగానే సంక్రాంతినాడు బుడుబుడుక్కలవాడిల్లిల్లు దర్శించి డమరకమును ,,బుడుబుక్ బుడుబుడు బుడుబుక్,, అని మ్రోగించును. ,,అంబ పలుకు జగదంబ పలుకు_కంచిలోని కామాక్షిపలుకు కాశిలోని అన్నపూర్ణపలుకు,,

అని పలుకుచు కుటుంబినులను మేలుకొలిపి ,,అయ్య మతిలో ఆలోచనలు–అమ్మ తలపులో అనుమానాలు—అదిగదిగో అంబ కరుణతో–అన్ని చెబుతా ఆలకించండీ,,* అని వారికించుక జోస్యము కూడ తెలిపి వారిచేత దానము పరిగ్రహించి పోవు చుండును. ఆ వెనుక బాలసంతువాడు, పెద్దమ్మలవాడు వచ్చిపోవుచుండును. గంగిరెద్దులవాడు వచ్చి గుమ్మము ముందు గంగిరెద్దు నాడించుచు—

,,డూ డూ డూ డూ బసవన్నా–అమ్మగారికి దండంబెట్టు
అయ్యగారికి దండంబెట్టు—బాలదొరలకు దండంబెట్టు,, అనుచుండ, గంగిరెద్దు తన ముందుకాళ్లను మోకరించి దండమిడును. గంగిరెద్దే నందీశ్వరుడు, బసవన్న. గంగిరెద్దులవాడు దానిని చక్కని వేషభూషణములతో నలంకరించి తెచ్చును. చూపరులందరు మురిసిపోవుచుందురు. ,,ఎండి గిట్టలు యిస్తారంట పైడికొమ్ములు కడతారంట—పట్టు శాలువలు కప్పుతారంట,,* అనుచు మరొక మారు కుటుంబ యజమానులకు దండము పెట్టించును. ఆ లోపున వారు పాత వస్త్రమో, పట్టుశాలువో, ధాన్యమో దానముచేయుట జరుగును. కొందరు మహారాజులు వెండిగిట్టలు, పయిడికొమ్ములు కూడ చేయించెడివారట. తమకున్న దానిలో కొంత సమాజపరము చేయుట యను కర్తవ్యమా దానములో గర్భితమై యున్నది. తర్వాత జంగమదేవర గంట వాయించుచు—

,,సంక్రాంతి పండుగొచ్చె సిద్ధేశ్వరా—తల్లిపిల్ల చల్లగాను సిద్ధేశ్వరా
సాంబమూర్తి కరుణకల్గి సిద్ధేశ్వరా—కలకాలం వర్ధిల్లు సిద్ధేశ్వరా,, అని పాడుచు వచ్చుచుండును. ఈ మొదలగువారి పాటలలో భక్తి, భుక్తి, దాతలకు ముక్తి, పండుగకు రక్తి ఆపాదింపబడుచున్నవి. సాధారణముగా వారందరు సంక్రాంతి సందర్భముననే తరచు కనిపించుచుందురు. అంతేగాగ, ఆ దినమంతయు కోళ్లపందెములు, పొట్టేళ్ల పందెములు వేడుకగా ప్రదర్శింపబడు చుండును. పందెములన్ని వీరత్వమావేశింపజేసికొనుటకు తోడ్పడునట్టివి.

## కాముని పున్నమ:-

చలిమలన మన్మథుడు ముక్కంటి కంటిమంటలలో మలమలమాడిన విషయమే కామదహన మనుపేర పండుగ జరుపుకొనుట యగుచున్నది. దానిని తమిళములో ,,కామన్ పండిగై,, కన్నడములో ,,కామనహబ్బ,, అందురు. ప్రతిసంవత్సరము ఫాల్గున మాసములో వచ్చెడు పౌర్ణమినాడు ఇంటింటినుండి కొన్ని కట్టెలను ఐదేసి పిడకలను పోగుచేసి, గ్రామమధ్యమున గాని వెలుపలగాని వేసి నిప్పంటించి దానిలో కాముని నావాహనముచేసి, కేకలిడుచు ఆనందమున గంతులు వేయుచు పాడుచుందురు.

,,మదన కాముడోయ్—కాముని దుప్పట్లు కాలిపోయెనేమొ
మదన కాముడోయ్—కాముని అందెల్లు కాలికూలెనేమొ
మదనకాముడోయ్—కాముని దోతుల్లు కాలి కూలెనేమొ
మదనకాముడోయ్—కాముని చెప్పుల్లు కాలికూలెనేమొ

మదనకాముడోయ్-కాముని గొంగళ్లు కాలికూలెనేమొ,,*. ఇట్టి భావములు రతీదేవి కన్నీటి వలపోతలు కాబోలు. కామదహనమునకై అనాడు బాలురంత పెక్కుచోట్ల కట్టెలను దొంగిలించి తెత్తురు. కాల్చినపిదప ఆ బూడిదను తెచ్చి దాచుకొందురు. చేని తెగుళ్లను చర్మవ్యాధులను నివారింప దాని నుపయోగింతురు. కాముని గాల్చి ఆ బూడిదను గంధము (మైపూత) గా శివుడు దాల్చెనందురు. కామ దహనమునకు ముందే రెండు మూడు రోజులు వసంతమాడుట ఆచారము. అనగా వివిధములైన రంగులు చల్లుకొందురు. పౌర్ణమి నుండి వసంతఋతువు ఆరంభమగును. కామునిరాకకా ఋతువు చిహ్నము. కాముని పండుగను వసంతోత్సవమని హోళి యని అందురు. గుజరాతి ప్రజలలో హోళి పండుగ యొక్క ఆరంభమును గూర్చి నేటికిని పురాణసంబంధముగా కొన్ని వింత

గాథలున్నవి 1. ధర్మసింధు, నిర్ణయసింధు, భవిష్యత్పురాణము వంటి గ్రంథములు గూడ ఇంచుమించుగానిదే పద్ధతిలో చెప్పట జరిగినది. ఇవి యన్నియు సమంజసములనిపించవు (కామదహనము = కామమునణచుట)

సుమారు రెండువేల సంవత్సరముల క్రిందటి గాథాసప్తశతి దీనిని ఫాల్గునోత్సవ (హోలాక) మని 2 మదనోత్సవమని 3 వర్ణించెను. ఫాల్గున పౌర్ణమి వెన్నెలలో ఉదకక్ష్వేడికల (వెదురు పిచికారీల) తో రంగునీటిని చిమ్ము కొనుచుండిరనియు, చైత్ర శుద్ధ చతుర్దశి నాడు మదనోత్సవము చేయుచుండి రనియు వాత్స్యాయన కామసూత్రములలో గలదు 4. భారతదేశములోని తూర్పు ప్రాంతీయులు హోలికోత్సవమును జేయుచుండిరని జైమినీయ న్యాయమాలలోని విస్తరమను వ్యాఖ్యలో జెప్పబడినది 5. అయిన నించుమించు

---

1. In ancient times there lived a demoness named Dhunda who prayed upon children. Her misdeeds caused great misery to the people, who went to Vasishtha the preceptor of Rama and implored him to tell them some remedy for the mischief wrought by Demoness. Vasishtha told them to light a pyre in honour of the godess Holika, which he said, would consume the demoness. The people accordingly lighted a huge fire, into which the demoness was driven by the boys, who led her to the spot by abusing her and troubling her in many ways. She was reduced to ashes by the fire and the people were saved.

   -Folk lore Notes. Vol-I-Gujarat
   (The Folklore of Gujarat) p. 155

2. గాథాసప్తశతి:_4_69.　　3. గాథాసప్తశతి:_6_45

4. వాత్స్యాయన కామసూత్రములు:_1_4_42

5. "హోలాకాదయః ప్రాచ్యైరేవక్రియంతే వసంతోత్సవోహోలాకా"
   _జైమినీయ న్యాయమాల:_ అధ్యా. 1. పాదము 3. హోలాకాధికరణము

దేశమంతట నేదో యొక రూపమున నిది యుండి యున్నది. అట్లే తెలుగువారిలో గూడ బహుళ ప్రచారము నందినజీయుత్సవము. శ్రీకృష్ణదేవరాయలు ప్రతి వర్షవసంతోత్సవములకు మిక్కిలి కుతూహలముతో వచ్చెడు సుకవుల కావ్యములు విని పులకితాంతరంగుడయ్యెడు వాడు1. నేడు సాగరసీమ, రాయలసీమ లలో చైత్రపాడ్యమి నుండి నవమి వరకు (వసంత నవరాత్రులు) ఇష్టదేవతా పూజలు చేసికొనుట వరకే పరిమితమైనది. కాముని పున్నమునకు పక్షము రోజుల ముందుగానే తెలంగాణములో వెన్నెల రాత్రులందు పసుల కాపరులు, వారిలో నొకనికి ఎలుగుబంటు వేషము వేసి నడుమునకు గంటలమర్చి ఇంటింటి ముందర ఆడించుచు పాటలు పాడుచు బిచ్చమెత్తుకొనుచుందురు.

ఆవులన్నా గోవులన్నా—ఆవులేడా దోలినావూ
దిద్దెకుంట్లా నీళ్లుదాపి—మల్లెడమ్మా బోడువట్టి
మల్లిమల్లీ మేపంగా—ఈరన్న కర్రెకోడే
బండి గట్కా నేనుపోయి—శెంద్రుస్నీ సూడవోతే
పుట్టలున్నా బూసిపాము—దొడ్డిదాకా తిప్పుకురికే
దొడ్లున్న దోరావు—ఆవులించీ వుచ్చవోసే
ఆనగంటి చెఱువునిండె—గోకారం వడ్లు వండె
అన్నిగూడ వోసుకూనె—గుండ్ల బుచ్చన్నా
గాస్నానికోతే మీసాల్దువ్వే—మీసాల్దువి నోడూకుండపాయె
మూలవాసం దీసి ముడ్లురుగగొట్టె—ముడ్డికి పట్టెర అడ్డాడు నూనె
అడ్డాడు నూనెకు పైకము లేదు—పైకాము లేకుంటె పయ్యకోడె నమ్మ
పయ్యకోడె నమ్మితే బండికి లేదు—బండికి లేకుంటే గుర్రాన్నమ్మ
గుర్రాన్నమ్ముకుంటె ఎక్కనీకే లేదు—ఎక్కనీకె లేకపోతే గాడ్దినమ్మ
గాడ్దీ నమ్మితే గంతాకు లేదు—గంతాకు లేకుంటే కోడినమ్మ
కోడ్డిని అమ్మితే గుద్దూకు లేదు—గుద్దూకు లేకుంటె గుద్దూకుసావు *

1. పారిజాతాపహరణము:— ఆ. 1. పద్య. 139.

ఇట్టి పాటలు మిక్కిలి ప్రచారమున నున్నవి. ఇందలి కల్పనలో పసుల కాపరుల యవస్థలు సహజముగా చోటు కల్పించుకొన్నవి.

,,అగుండీ గుండిత్తడి గుండు—గుండువోయి కొండ మీద మోతలేసె
మోతరాజువోయి తాడూరెక్కె—తాడూరంత తండ్రై నిలిచె
నిలిచి కొట్టెరా నీలపురాయి—తలచి కొట్టెరా తలారిగాడు,, *

,,జాజిరి జాజిరి జాజిరిజాజి—జాజిరి కిలకిల జానకితాడు
సూల చందురుగాడు—సుతరుగాడు (సుతారి, నేర్పరి)
రత్నాలమీదో దెవ్వడో కాని—ఢిల్లీరాముడు ఢిల్కొండ రాముడు,,

,,జోజర జోజర గాజాలపాపా—గాజుల్ గీజుల్ సన్నాయి సాపా
సాపగాదూరో సర్వాయి కోట—కోట కోటాకే కొమ్మాల బంటు,, *

వంటి పాటలు వారి అద్భుత కల్పనలకు దృష్టాంతములు. వానిలో చారిత్ర కాంశములు గూడ తడవ బడుచుండును. కాని, అన్వయ సాధ్యము కాని విధముగా మలచుకొని పోయినవి. ఆపాటలను జాజరి పాటలని, చర్చరీ గీతము లని యందురు. అట్టివి వెన్నెల రాత్రులలో భీమనాథుని యెదుట వీణియలు మీటుచు అచ్చరలు బాడిరని శ్రీనాథుడు వర్ణించినాడు1.

,,జాజిరాడుదాం జమకూడుదాం—ఎప్పుడెల్లినా యైనుబయిమంది
ముందుకు నడిచే ముప్పయిమంది—ఇంటి ముందర ఇరువైమంది
జాజిరి జాజిరి జాజిరి జాజ,, — గుంపులు గుంపులు గట్టి వెన్నెల

రాత్రులలో నింటింటిముందర జాజరలాడుట వినోదదాయకముగ, హాస్య గర్భిత ముగ, శృంగారాభినయముగ నొప్పుచుండును. కొన్నిచోట్ల కోలలు వేయుచు జాజర పాటలు పాడుదురు. కుంకుమ, బుక్కా, కస్తూరి మొదలగు వాని పొడులు అంది అంది చల్లుకొనుచు, ప్రాచీన కాలమున జాజర లాడుచుండెరి.

---

1. భీమేశ్వర పురాణము:— ఆ; 5. పద్య. 103

కామదహనమునకు కడపటి దినమున నేడు విపరీతముగ రంగు నీటిని గుప్పు కొనుట జరుగుచున్నది. జాజర లాడుచుండిన పసుల కాపరులకు గృహస్థులు బిచ్చమిడుదురు. బిచ్చమిడక విసిగించినచో ,,అయింటమ్మ జెల్లలు బెట్టె—ఈ యింటమ్మ పరకలు బెట్టె—పులుసు గాయవోయి పురుకున బిత్తె,, అనుచు వేళా కోళము లాడుచు అర్ధరాత్రి వరకు గూడ వీధి వీధులు తిరుగుచుందురు. పగలంత పసుల గాయుటతోనే గడచి నప్పటికిని ఈ సందర్భమున ఏమాత్రము అలసి పోయినట్లు కన్పట్టరు.

మరొక వంక చిన్న కులములనబడు వానిలోని బాలికలు, స్త్రీలు జట్టు కట్టి ఒక క్రొత్త కుండకు చుట్టు చిల్లులు పొడిచి, అందులో దీపమును వెలిగించి ఒక్కరి శిరసు మీద దాని నెత్తించి గడప గడపకు బోయి—

,,గూడు గూడె గూనసింత—దిగినాడె దొమ్మరోడు
దొమ్మరింటి దొడ్డ బిడ్డ—మా యింటి ఆడబిడ్డ
సిక్కు దీసి కొప్పువెట్టి—సిరి గంధం బొట్టు వెట్టె,,

,,జొన్నాగింజా బండారమాయె—జోగులు జొంపులు జోలాటలాయె
మురుసుకుంట మురుసుకుంట రావయ్యా—
కామయ్యా నా ముచ్చాల పందిరి కిందికీ,,

కామ కామయ్యో కాముడొచ్చిండు—కాముడొచ్చిండు కాళ్ళు కడుగండి
భీముడొచ్చిండు పీటలెయ్యండి—మేము వొచ్చినము సెనగలు పెట్టండి *

అనుచు చక్కని కంఠముతో సన్నని రాగములతో పాడుచు బిచ్చమందు కొందురు. ఊరంత ఆ వెన్నెల రాత్రులలో నాపాటలు రతీదేవి సంప్రార్థనలవలె నొప్పినట్లుండును. రాతిరి పూటయేగాక పగలు సహితము—

,,హోళీర రంగ హోళీ_చెమ్మకేళిల హోళీ[1]
గుట్ట గుట్ట దిరిగినాడు హోళీ ,, ,,
గుమ్మడి పువ్వు తెచ్చినాడు హోళీ ,, ,,
చెట్టు చెట్టు దిరిగినాడు హోళీ ,, ,,
సెమ్మపువ్వు దెచ్చినాడు హోళీ ,, ,,
వావిలేదు వరుసలేదు హోళీ ,, ,,
వాసంత మాడినాడు హోళీ ,, ,, *

ఇట్లు హోళీ ఆడుచుండ వీధులలో చిన్న పెద్ద భేదములేకుండ రంగులు చిమ్ముకొనుట కనువిందొనర్చును. రంగులు చిమ్ముకొనుటలో వావివరుసల పట్టింపులు కూడ నుండవు.

,,సెల్లెలొచ్చి గంగా కాముడు_సెలిపి జోదరాడే కాముడు
మరదలొచ్చి గంగా కాముడు_మలిపి జోదరాడే కాముడు,, *

ప్రేమికులు, దంపతులు, బావ మరదులు, మరదంధ్రు, వదిన మరదులు మరదంధ్రు, రంగులు గుప్పు కొనుచున్నప్పుడు చూడవలె వారి సరసమొయ్యారమొలికించును. రంగులు చిమ్ముచు ప్రియురాలు_

,,ఉంగరాల జుట్టు మీద హోళీ_చెమ్మకేళిల హోళీ
రంగుపోసి పోతాను హోళీ_చెమ్మకేళిల హోళీ,, అన్నప్పుడు ప్రియుడు
,,బొంగరాల చంద్లమీద హోళీ చెమ్మకేళిల హోళీ
రంగు పోసి పోతాను హోళీ చెమ్మకేళిల హోళీ,,

---

1. హిందీలోని ,,శ్యామ్ ఖేలేరే హోలి,, అనునదే మనము ,,చెమ్మకేళిల హోళీ,, అని పలుకుచున్నాము. అనగా నీలగగన శ్యాముడగు శ్రీకృష్ణుడు హోలి ఆడెనని భావము.

అనుచు అంది అంది యిటు వంగి అటు వంగి రంగులు చిమ్ముచున్నప్పుడు గోపికా కృష్ణులు రంగులాడి నట్లుండును. ఆనాడు పురుషులందరు కాముని రూపులే. స్త్రీలందరు రతీదేవులే. కాని నేడు నగరములలో నాగరకులాడు కొను వసంతము వెగటుగా మోటుగా పరిణమించినది. వార్నీసుల నుండి బూటు పాలీసుల వరకేగాక తుదకు మురికి పూతల నుండి మురుగు కాలువల బురద వరకు నిలువెల్ల పూసికొనుట జరుగుచున్నది. ఇదంతయు అనారోగ్యమైనది. ఉపాధ్యాయులు విద్యార్థులు సహిత మెగిరెగిరి రుద్దుకొనుట మామూలైనది. అంతకు పూర్వము స్పర్ధగలవారి సందర్భమున కసికొలదిగా పూసికొనుచు, కడకు శరీరము మీది వస్త్రములను గూడ చింపివైచి యెత్తుకొనిపోవుట విపరీతమైనది. అసభ్యకరమైన కూతలు కూయుచు, బొబ్బరించుచు వీధులు దిరుగుట, ఇండ్లతలుపులూడ బీకి లోనికి జొచ్చుకొనిపోయి మగవారి నీడ్చుకొని వచ్చుట మరింత బలాత్కారముగా గన్పించుచుండును. విలాసము పోయి విరసమే మిగులుచున్నది. అంతేగాక పాడెగట్టి త్రిప్పుచు పైనలడుగు కొనుట అశుభముగా నుండును. ఇట్టిలక్షణములు చాలకాలమునుండియు సంక్రమించుచు న్నట్టివే. గ్రీస్, రోము, జర్మనీ, పర్షియా, వంటి దేశములలో సహిత మీలక్షణ ములతో నీయుత్సవముండినది.

## పూజలు-వ్రతములు-నోములు

వేదభూమియైన మన దేశమునకు కర్మ భూమియని మరొకపేరు. యజ్ఞ యాగాది వైదిక కర్మలిందుకు తార్కాణము. ఆ కర్మల వెనుక పరమాత్మోపాసన సామాన్యము. జీవులకు కర్మాను బంధము కలిగించువాడు పరమాత్ముడే[1]. కనుక వానినాచరించు మార్గమే కర్మమార్గము. కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠకు సాధనము.

---

1. మనుస్మృతిః— అధ్యా, 12. శ్లో 119

ముక్తి వడయుట కిది యొక మార్గము. పల్లీయుల కందుబాటులో లేని యజ్ఞయాగాది కర్మలకు మారుగా వారిలో పూజలు, వ్రతములు, నోములు, రూపొందియున్నవి. ఈ కర్మలు చిత్తశుద్ధినాశించి ఆచరించుటగును. వాని పట్ల నియమ నిష్ఠలు, ఆచార విధులు సర్వత్ర పాటింపబడును. అవి జీవితము నంతయు నలముకొని యుండును. ప్రత్యేకముగా స్త్రీ జీవితమున అల్లుకొని పోయి ఒక క్రమపద్ధతిని నేర్పుటలో తోడ్పడు చుండును. వారుపాడెడు పెక్కు పాటలలో నిక్షిప్తములై, మనసంస్కృతీ సంప్రదాయములలో జీర్ణమై జాతీయ జీవనమును ప్రతిబింబించుచున్నవి.

శైవవైష్ణవ మతముల పరముగా అనేక రకములైన పూజలు, వ్రతములు, నోములు మనసమాజమున చోటు చేసికొన్నవి. కల్పిత విశ్వాసములు పాదుకొన్నవి. నాగపూజ, తులసిపూజ వంటిపూజలు, వరలక్ష్మి వ్రతము, ఏకాదశి వ్రతము వంటి వ్రతములు, శ్రావణనోములు, కార్తీక నోములు, గౌరి నోములు, వంటి నోములు లెక్కకు మిక్కిలిగానున్నవి. ఏడు పొడవున చేయదగినన్ని కలవు. అవి భక్తి విశ్వాసములమీద ఆధారపడియున్నట్టివి. 'పత్రం పుష్పం ఫలం తోయం' అన్నట్లు భక్తికొలది శక్తికొలది పూజింపవచ్చును. వ్రతమాచరింపవచ్చును. నోముకొనవచ్చును. పవిత్రముగా నెంచబడుమాంగల్య మును కాపాడుకొనుటకై, మెట్టినింట మెలగదగు రీతిని అలవరచు కొనుటకై సంతానప్రాప్తికై వనితాలోకము పూజలు, వ్రతములు, నోములను ఆచరించు చున్నది. వానిలోకొన్ని ఏకవార్షికములు మరికొన్ని బహువార్షికములు. లెక్కకు మిక్కిలిగానున్న వీనిలో ముఖ్యమైన వానిని కొన్నింటిని తెలిసికొందము.

## నాగపూజ:-

ఇతిహాసపురాణములలో నాగదేవతకుచితస్థాన మీయబడినది. శ్రీమహావిష్ణువు మేనువాల్చినది నాగతల్పముపైననే. కాళింది మడుగున అడుగువైచుచు

అందియల రవళిచిందించి తాండవమాడినది నాగన్న పైననే. శివుడు తనసిగచుట్టు దండగా, మణికట్టు కడెముగా దాల్చినవి నాగభూషణములే. నాగలోకమను నొక లోకమే గలదట నాగులకు. అట్లు పూజ్యమైన నాగదేవతపేర జాతికికూడ నాగ జాతియను పేరు వచ్చియుండును. బౌద్ధకథలలో చెప్పబడినట్లు దాదాపు 2500 సంవత్సరములనాడు తెలుగు దేశము నాగరాజుల యేలుబడిక్రింద యుండినది. వారివలననే యీ దేశమునకు నాగభూమియను పేరువచ్చినది. నాగపూజ మనకు పరంపరగా వచ్చుచున్నది. తత్ఫలితముగా నాగయ్య నాగమ్మ యను పేర్లు పెట్టుకొనుట జరిగినది. నాగార్జునాచార్యుని పేరులో గూడ నాగశబ్దమున్నది. ఆనాడు నాగులు బౌద్ధులు పరస్పర ప్రభావములకు లోనైయుందురని ఊహింప వీలున్నది. వ్యక్తులకే గాక నాగనూరు, నాగపట్టణము, నాగవరము నాగులపాడు అని ఊర్లకును, నాగులేరు అని ఏరులకును, నాగరము, నాగులజోడు అని నగలకును, నాగుల చీర, నాగుబడిగల రైక అని వస్త్రములకును పేర్లువచ్చినవి. నాగశబ్దమింత వ్యాప్తిలో నున్నదనగా దాని ప్రాశస్త్యమెట్టిదో తెలియుటలేదా. మొహంజోదరో శిథిలములందు పైభాగము మానవాకారముగా, క్రింది భాగము సర్పాకారముగా నున్న శిల్పములు దొరకినవి. అమరావతీ స్తూపనిర్మాణా రంభము అశోక చక్రవర్తికి పూర్వము నాంధ్రదేశమునేలిన నాగరాజు చేత గావింపబడినదందురు. అట్టి అమరావతీ స్తూపమున తెలుగు ,,ము,, ప్రత్యయము యొక్క పూర్వరూపమైన ,బు, అనునది ,నాగబు, అనుమాటతో కూడియున్నది. అనగా నది తెలుగువ్యవహారమున విరళప్రచారమునంది యుండిననేగాని శాసన స్థముకాదుగదా! అంతేగాక, అమరావతీ శిల్పములలో గూడ మానవశిరోభాగముల మీద పడగవిప్పి పట్టినట్లు చెక్కబడినవి కన్పించును. అవి నాగరాజుల చిహ్నములనియు నాగపూజ నాగుల ఆచారమనియు చెప్పుదురు 1.

---

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి :– ఖండవల్లిసోదరులు పుట. 59

నాగార్జున కొండ మీది శిల్పములందు సహితము తలల మీద పడగ విప్పబడిన సర్పములున్నవి. గర్భస్థ శివలింగయుక్త నాగేంద్ర శిల్పములుగూడ గన్పించ గలవు. పెక్కు దేవాలయ బాహ్యాంతర్భాగముల మీద వాని ప్రతిమలు చెక్క బడినవి. ఇప్పటికిని పురాతత్వ ఖననము వలన వెలుపడిన శిల్పములలో నాగ ప్రతిష్ఠలధికముగా నుండుట విశేషము. మొత్తము మీద మనకు నాగపూజ యనునది నాగజాతి నుండి సంక్రమించినదని భావించినను, వైదిక ముద్రపొందిన అనార్య సంస్కృతి చిహ్నమన్నను, నేడది తెలుగు దేశమననేగాక భారతదేశ మందంతటను గన్పించుచున్నది.

నేడు సాగరసీమలో కార్తీక శుద్ధ చవితినాడు నాగపూజ చేయుదురు. దీనిని నాగులచవితి యని పిలుతురు. శ్రీమహావిష్ణువు చాతుర్మాస్యానంతరము నిద్రనుండి లేచు ఉత్థానైకాదశికి ఈ నాగులచవితి దగ్గరగా నున్నందున కార్తీక శుద్ధ చవితినాడే నాగపూజ చేయుట ఆచారమైనది. ఆనాడు జ్యోతిర్మండలమున అనంతశయనాకృతి కన్పట్టునని చెప్పుదురు. తెలుగుసీమ (తెలంగాణము) లో శ్రావణ శుద్ధ చవితినాడు నాగపూజ చేయుదురు. ఇది మహారాష్ట్రుల నుండి వచ్చిన సంప్రదాయము కావచ్చును. మహారాష్ట్రమేయననేల ఉత్తర భారతదేశమంతట నీ సంప్రదాయమే గలదట. ధర్మసింధులో శ్రావణ శుద్ధ చవితినే నాగుల చవితియని, మరునటి దినమును నాగపంచమి యని చెప్పబడినది.

పూజాధికములు స్త్రీల ప్రత్యేక కర్మలు కాబట్టి శుచిగా ఆచరించుట పరిపాటియైనది. "నాగుల చవితికి నాగన్న – స్నానం సంధ్యలు నాగన్న పువ్వులు పడగలు నాగన్న–మడిబట్టలతో నాగన్న", ఆరోజు స్నానము సంధ్యలు వార్చుకొని మడిగట్టుకొని వనితలు పుట్ట దరిచేరి "అచ్చమావుల పాలు అరటి దొల్లల పోసి నీరుగలవని పాలు నీ పుట్టలో బోతు–నాగుల చవితీన పూజలు గొనేవు–బుస్సు మనకు నాగ మోస మొచ్చేని," * అనుచు మ్రొక్కి పుట్టలో పాలు జార విడుచుచు "ఏడాది కొగ దినము నాగుల దినము – నూబిండి

ముద్దలు నూలుపోగుల్లు—చలిమిడి ముద్దలు సదు(సజ్జ)నానబాలు—పుట్టలోనాగులయ్యా పూజగొనవయ్యా,, అనుచు పాడుచు నువ్వులపిండి, చలిమిడియేగాక వడపప్పు పండ్లు మున్నగునవి నైవేద్యముగా నర్పించుట ఆచారమైనది. పూజించునప్పుడు హారతి వెలిగించుట ఆచారమైనను నాగపూజ కది పనికిరాదు. నాగన్నకు అగ్ని శిఖయన్న భయము. అందుచేత హారతి పట్టుటగాని వేడి వేడి పదార్థము లారగింపుచేయుట గాని పొసగదు.

నాగప్రతిమను చేసి చవితినాడుగాని లేక మరుసటి దినమైన నాగపంచమి నాడు గాని పుట్ట వద్ద నిలిపి యథోచితము గా పూజించుట జరుగును. తెలుగు దేశములో ప్రత్యేకముగా నాగదేవాలయము లున్నట్లు గాంచము. కాని తమిళ దేశములోని తిరునల్వేలి జిల్లాలో శంకర్ నయనార్ కోయల్ అనుచోట 'పాంబుకోయల్' అను పేరుతో నాగదేవాలయమున్నది. దానికి నిత్యము పూజలు జరుగుచుండును1. నాగపూజ సేయుటలో గూడ కొన్ని ఫలములాశింపబడినవి.

,,మా నువ్వులు పండితే చిమ్మిలేసేము
మా పత్తి పగిలితే వంచె లెట్టేము—మాయావు లీనితే పాలు పోసేము
పడగ లెత్తకు పాము పగవారమంకాము
నీపూజ చేసెదము నీకు మ్రొక్కెదము,, అనగా పాడిపంటలు

సమృద్ధిగా ఫలించవలెనని ప్రార్థించుటయైనది. ,,మాపూజలందుకో నాగేంద్రుడా సిరిసంపద లీయవా శ్రీనాగన్న,, అనుచు సకల సిరిసంపదల నాశించుట తత్ఫలములో కొంత నాగమయ్య కర్పించుట యొప్పును. ఇంతేగాక, ఇంతుల కడుపు చల్లని పంటగా ఇల్లెల్ల పిల్లలు కలిగి కలకిలలాడవలెనని కాంక్షించుచు ,,పుట్టలోకి పోవయ్యా—పూజలు గొనవయ్యా—పుట్టిందే (పుట్టి యుండె) బాలునికి పూజగొనవయ్యా,, అనుచు పూజింతురు. ,,మావాళ్ళు చీకటి వాకిట తిరుగుతారు—

1. G. Subramania Pillai:- Tree worship and ophilatry- Page. 96.

నడుము త్రొక్కితే నావాళ్ళనుకో – పడగ త్రొక్కితే పారిపో తండ్రీ,, అని ప్రార్థింతురు. ,,పాము నన్ను జూచి పడగ నెత్తిందిపడగ నెత్తకు నాగు పగ వారముకాము,, అనుచు పల్బతి పట్టినచో అది పడగ దించుకొని ప్రక్కదారి బట్టి పోవును. ఇట్టి అనుభవమొకటి నా చిన్నతనమున గాంచితిని. ఇది మనలోని యొక విశ్వాసము. పామన్నచో భయము చెంది దానిని భక్తి భావముతో పూజించుట ప్రాక్తనమానవ లక్షణము. మతమునకీ లక్షణమే మూలమగుచున్నది కనుకనే ఆదర పూర్వకముగా–

సామా బొడ్డాల మీద సాగీ పండిననాగ–సామల్ల పురుగాని సంపేతురేమో
అలుకూ కుండాలకాడ అలిగీ పండిననాగ–ఆల్రిద పురుగానీ సంపేతురేమో
వా్రీ కుప్పలమీద వొరిగీ పండిననాగ–వడ్లల్ల పురుగానీ సంపేతురేమో
సల్లాకుండాల కాడ సాగీ పండిననాగ–సామల్ల పురుగానీ సంపేతురేమో *

అనుచు దాని క్షేమమును అరయుటలో నాగమయ్య మీద మన వారికి గల భక్తి యెంతటిదో తెలియుచున్నది.

## తులసి పూజ:

తులసి పూజ యనునది వృక్షపూజకు సంబంధించినది. వృక్షపూజకును నాగపూజకును ఆరంభదశ నుండియే సంబంధముండి యుండునని కూడ చెప్పుదురు1. భారతదేశమంతట చెట్టు క్రింద ముఖ్యముగా రావిచెట్టు క్రింద

1. The connection of serpent-worship with treeworship may have originally arisen from the fact many snakes like to establish themselves in the roots of the trees, especially in those of huge old ones.

-Tree worship and ophilatry: P. 95

నాగవిగ్రహములు స్థాపితమైయున్నవి1. వృక్షపూజ (అనగా మానవ హితార్థమై వృక్షములను పెంచుటయే వృక్షపూజ) మనకు వైదికయుగము నుండి వచ్చుచున్నది. అది ప్రకృతి పూజయేగదా. వృక్షపూజ ప్రపంచమంతట నున్నది. నేటికిని రావి, జమ్మి, మారేడు, మఱ్ఱి, తులసి, వేప చెట్లను భక్తితో పూజించుచున్నారు. రావి (అశ్వత్థ)చెట్టు, జమ్మి (శమి) చెట్టు ప్రాముఖ్యత వైదికోక్తము. ఒకే పాదున రావిని వేపనుబెంచి వివాహము చేయు ఆచారము వైదికావైదిక సమ్మేళనమున కొకనిదర్శనముగా చెప్పుకొనవచ్చును. సురలకు కల్పవృక్షమెట్లో నరులకు రావి, తులసి పూజనీయములు. తులసి ఔషధవిలువగలదియేగాక లక్ష్మిగా భావింపనగుచున్నది. శాంతిని ప్రసాదించునదనికూడ నమ్ముదురు. కనుక దానిని పూజింతురు. ప్రతి గృహాంగణమున గృహకల్పకమై కామితార్థముల నిచ్చుచున్నదనెడు విశ్వాసము పాదుకొన్నది. రామతులసి, కృష్ణతులసి, లక్ష్మీతులసి వంటి మరికొన్ని తులసి భేదములున్నవి.

తులసీమహాత్మ్యమును గురించి కొన్ని విశేషాంశములున్నవి. 'శ్రీకృష్ణ తులాభారము'లో నారదుని సలహాను పాటించి సత్యభామ పుణ్యకవ్రతమునుజేసి, నాథుని నారదునకు దానమిచ్చి, తిరిగి గ్రహింపదలంచి యాతని యెత్తు వివిధ భూషణములనుంచి తూచినగాని సరిపడక పోవుటవలన రుక్మిణీ సతిని వేడుకొన్నది. ఆమెవచ్చి భక్తి పూర్వకముగా తులసీ దళమిడ కృష్ణుని యెత్తునకు సమానమైనది.

జలంధరాసురుని భార్యయగు బృంద పాతివ్రత్య మహాత్మ్యము కతమున కృష్ణుడతనిని హతమార్చలేక పోయినాడు. తుదకు తానే జలంధరాకారుడై ఆమె పాతివ్రత్యమునకు కళంక మాపాదించి వానిని హతమార్చి దేవతలకు మేలు చేసినాడు. ఆ బృంద యే తులసిగా మారినది. కృష్ణుడామెను వివాహమాడినాడు.

1. Tree worship and ophilatry:- P. 96

ఆమె లక్ష్మిగాగూడ భావింపబడినది. లక్ష్మీతులసి యను మాట దీనిని తెలుపు చున్నది. అంతటి మహాపతివ్రత యైనందుకు తులసిని స్త్రీలు ఆదర్శముగాగొని పూజించుట జరుగుచున్నది. తులసీ విష్ణువుల కుద్వాహము చేయు ఆచారమొకటి గలదు. విష్ణువునకు తులసిని దానము చేయుచు "మయా సంవర్ధితాం యథా శక్త్యాలంకృతా మిమాం తులసీదేవీం దామోదరాయ శ్రీధరాయ వరాయ తుభ్య మహం సంప్రదదే"[1] అని ఆ దేవుని విగ్రహ మెదుట అక్షతలను, జలమును విడువవలెను. తులసిపూజ వలన సంతానము కలుగునని, దాని మీదుగా వీచెడు గాలివలన ఆయురారోగ్యములు, పుణ్యలోకము ప్రాప్తించునని విశ్వసించెదరు. ముత్తైదువలేగాక వితంతువులుగూడ పూజించుట మరొక విశేషము.

తులసికోట (బృందావనము) గట్టి అందులో సీరుపోసి ఒక శుభముహూర్త మున తులసి మొక్కను నాటుట ఆచారము. వేకువజామునలేచి స్నానమాచరించి పూజ ప్రారంభింతురు. "వేకూరు ఉదయమున గోమయమును గొంపోయి-ప్రేమతోతులసి ముందర అలికి-రమణీయముగా ముగ్గులిడిన రమణుల పాపములు తూలగొట్టు", తొలుత తులసికోటచెంత గోవుపేడతో అలికి రమణీయముగా పంచపద్మములను ముగ్గులతో చిత్రించి, వనరుగా నచట నొక జ్యోతిని నిలిపి దానిలో నైదు వత్తులు వెలిగించి, ప్రదక్షిణముచేసి తులసికోటకు మ్రొక్కినచో తులసమ్మ ధన ధాన్యసంపదలొసగి పాపములను తూలగొట్టును. పూజించునప్పుడు "తులసి నిన్నే పూజించెద సంతతము-శ్రీతులసి నిన్నే ధ్యానించెద"నని పాడుచు ఆభక్తియందలి తత్త్వమును గూడ తడవుచుందురు.

> "తులసి బృందావనములో తులసి మొలచినదీ
> మొదటి మంత్రము చేత మొలక పుట్టినదీ
> ఆచార మనియేటి ఆకు పుట్టినదీ

1. ధర్మసింధు:- ద్వి. పరి- పుట-167

యెక్కి నిబుపా వలెను శుక్రవారపు లక్ష్మీ,, యని వరలక్ష్మి నావాహనము గావింతురు. చెంత నిమ్మ, దానిమ్మ, అల్లనేరేడు అరటిపండ్లే గాక ,,అందముగా గవ్వాక్షుల చీర — కుందనపు పూవుల రవికె,, కట్నముగా సమర్పించుకొని దీపధూప నైవేద్యము లిడుదురు. వ్రతాంతమున ,, హారతిగొను వరలక్ష్మీ— కర్పూరహారతి గొను వరలక్ష్మీ—చల్లని నీచూపు లెన్నమాకు ప్రొద్దు,, అనుచు హారతి నిచ్చెదరు. పిమ్మట ముత్తైదువులకు వాయనమిచ్చుట, (వాయనము లిచ్చు కొను పద్ధతిని గాథాసప్తశతిలోను చూడదగును.) బ్రాహ్మణునిచేత ఆశీస్సులందుట యొప్పును. శ్రావణమాసములో ప్రతిదినమిట్లు వ్రతమాచరించుట జరుగును.

శుక్రవారపు లక్ష్మి వలలో — మాయింటికొస్తే వలలో
సుదతికి తాంబూలం ,, — చూసి నేనిత్తూ ,,
శనివారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
చేడెకూ చేమంతి ,, — దండాసిగ గడుదూ ,,
ఆదివారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
ఆమే మెడనిండా ,, — గందామూ పూతూ ,,
సోమవారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
శోధించి నేనొక్క ,, — సొమ్మైనా పెడుదూ ,,
మంగళవారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
మగువాకు మల్లెపూల ,, — దండా సిగ గడుదూ ,,
బుధవారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
పూజించి నేనొక్క ,, — పుస్తైనా గడుదూ ,,
బేస్తవారపు లక్ష్మి ,, — మాయింటి కొస్తే ,,
ప్రేమాతొనే బెడుదు ,, — పెట్టెల్లా సొమ్ము ,, *

శ్రావణమాసములో క్రొత్తగా పెండ్లియైన వధువునకు అత్తవారు "శ్రావణపట్టి" అను పేర సొమ్ములు వస్త్రములు తెచ్చుట ఆచారమై యున్నది. పెట్టెల నిండ సొమ్ములు కోరుటయన్నది పైపాటలో వ్యక్తము చేయుటయినది.

## ఏకాదశి వ్రతము

ప్రతి పక్షమందలి పదునొకండవ తిథిని ఏకాదశి యందురు. ఒక్కొక్క ఏకాదశి కొక ప్రత్యేకమైన గాథ కల్పింపబడినది. ఆషాఢ శుద్ధ ఏకాదశికి మార్గశిర శుద్ధ ఏకాదశికి మిక్కిలి ప్రాముఖ్యమిచ్చుట యగును. మార్గశిర శుద్ధ ఏకాదశినే వైకుంఠ ఏకాదశియని మోక్ష ఏకాదశి యని అందురు. ఆనాడు మరణించినవారు మోక్ష మందెదరని విశ్వసింతురు.

చావుముఖమున నున్న పడతిని ఆమె భర్త ,,కలికి చిలుకల కొలికి పోయెదెక్కడికే—ఘనమైన పయనాము గట్టెదెక్కడికే,, యని అడిగినప్పుడు ,,ఏమయ్యా నాసామి నన్నిపుడడిగేవు — ఏకాదశి మరణమెంత వారలకైన పుణ్యంబూ,, అని ఆమె భర్తకు సమాధానమిచ్చి, ,,నాకు స్వర్గము పోయెవిధ మెచ్చినాది–గోవుపెండ మీరు దెప్పించరయ్యా–గోవ శుద్ధి మీరుచేయించరయ్యా–వేదాంత బ్రాహ్మణుని పిలిపించరయ్యా — జీవ ప్రాయశ్చిత్తంబు చేయించరయ్యా,, అని జీవప్రాయశ్చిత్తము చేయించుకొని ,,అడిగో పూల రథము వస్తువున్నది–నేనుపోదు శ్రీశైలదేవసన్నిధికి,,* అనుచు దేహమును చాలించినది.

వ్రతాచరణమునకు వివిధాచారములు పాటించి నప్పటికిని, అన్ని తెలిసి నప్పటికిని, స్వర్గము లభింపదు. ,,అన్ని తెలిసినోడు అమాసనాడు సచ్చె–ఏమెరుగనోడు ఏకాదశినాడు సచ్చె,, నన్న సామెత దీనిని బలపరచుచున్నది. కావున పుణ్యము కట్టుకొనవలెను. ఎత్తులు జిత్తులు ఎరుగని వారెక్కువగా ఏకాదశినాడు చచ్చుటనుబట్టియే పైసామెత వచ్చియుండును. ఇట్టి పుణ్యదినమును పురస్కరించుకొనియే స్త్రీలు ఏకాదశి వ్రతము చేయుదురు. వ్రత విధానమును గూర్చిన పాటలెక్కువగా దొరకలేదు. ఈ క్రింది పాటలో వ్రత విధానమును గమనింపుడు—

,,చిత్తమ్మ ఏకాశి చిలుకు దాదోశి—మాదుమ్మ ఏకాశి మంచిదాదోశి
దక్షుని ఏకాశి ఇంక నెల్లాలు—కాసెపుల్లలు దెచ్చి కసువారబీసి

ఆవు పెండాదెచ్చి అరుగుల్లు అలికి—గోవు పెండా దెచ్చి గోలెంలగల్పి
ధరణిమీద సొన్పు దట్టంగచల్లి—కాళ్లుమొగము కడిగి కడపలు గడిగి
కడపకు ఆ కాంత యేమానిమొక్కె—అష్టసంపదలిష్వ అతిభాగ్యమిష్వ
కోటి సంపదలిష్వు కోమాండ్లనిష్వు—ఎప్పటికి ముత్తైదతనము నాకిష్వు,,

అని కడపకు మ్రొక్కి సంతానమును, సంపదలను, ముఖ్యముగా ముత్తైదువ తనమును గోరుకొందురు. వ్రత విధానము లన్నిటిలోను సాధారణముగా శక్తి లోపమైనను భక్తిలోపము కారాదు. కథలోపమైయైనను వ్రతలోపము కారాదు. ఈ మాత్రము నియమము పాటించిన ఫలితము దక్కును. ఇట్టి నియమముల లోను భర్త యనుమతిని గ్రహించి స్త్రీ వ్రతాదులు నిర్వహింపవలెను. ఏ స్త్రీ తన భర్త జీవించియుండగ శుశ్రూషగావింపక నోములు ఉపవాసములు చేయునో ఆమె తన భర్త ఆయువును హరించును. నరకము పొందును1. అట్లే భర్త యనుమతిని పొందకయే వ్రతాదుల నాచరించినచో, ఆ చేసినదంతయు రాక్షసులకే చెందును2. కాని, వ్రతమనగా సత్యనిష్ఠయేగాని కేవలమాచార వ్యవహారములను జూపుట కానేరదు. మానవులు వ్రతము వలన దీక్షాబద్ధులై, తద్వారా సత్యవ్రతులై తుదకు మోక్షము వడయుట జరుగవలెను3.

## గౌరమ్మ నోము:-

స్త్రీలు గౌరమ్మ నుద్దేశించి చేయు నోములే ఎక్కువ. సుమారేబదికి పైన గలవు. అవి వీరశైవ సంప్రదాయమున రూపొందినవి. వ్రతములు నోములు

1. పరాశరస్మృతిః— ప్రాయశ్చిత్త కాండము—శ్లో. 17
2. ,, ,, ,, 18
3. వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణాం
దక్షిణా శ్రద్ధామాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే—
—యజుర్వేదముః— 19—30

అన్నియు శైవ వైష్ణవ మతవ్యాప్తి దృష్ట్యా కల్పింపబడి యుండినవే. అట్టి వ్రతాదుల కొక్కొక్క కథకూడ కల్పింపబడినది. శైవ వైష్ణవ మతోజ్జృంభణ ఫలితముగా వైదిక కర్మలడుగంటినవి. నోము అనగా యజ్ఞము అని ఒక అర్థము కూడ గలదు. అయినప్పటికిని, యజ్ఞమునకును నేటి నోములకును పోల్చుకొనలేని వ్యత్యాసము కొట్టవచ్చినట్లు కన్పించును.

శ్రావణ, ఆశ్వయుజ, కార్తిక మాఘ మాసములలో గౌరమ్మ నోము లెన్నియో వచ్చును. శ్రావణ మాసములోని ప్రతి మంగళవారము గౌరమ్మనోము నోముదురు దానిని శ్రావణ మంగళవారము నోము అందురు. ఈ నోము యొక్క మహిమను దెలుపు కథ యొకటి సవిస్తరముగా శ్రావణ మంగళవారము పాట1లో నిట్లు వివరింపబడియున్నది.

ఒకానొకరాజు సంతాన విరహితుడై యుండ నతనికిహపరముల నిత్తమనుచు పరమేశ్వరుడు ,,లింగము తానొక్క జంగమాకారుడై — గురుధర్మ ఘోరాండమనుచు,, వచ్చెను. అప్పుడా రాజు భార్య మేడమీది నుండి బంగారు పళ్లెరములో భిక్షమిడుకొని యొయ్యారముగా నడచిరాగ, చూచి నిలువక పరమ శివుడు తిరిగి పోయెను. అందులకు చోద్యమంది మరునాడామె, ముందుముందే కాచి యుండగా ఎప్పటి వలె శివుడువచ్చి మరలి పోనున్న అతని వదమంటి కారణమడిగెను. ,,పుత్రపౌత్రులు లేని మీచేత భిక్షం హరహర అంటరా,,దని శివుడు పలుకగా నారాజ దంపతులతనికి సాష్టాంగ దండమిడి సంతాన మర్థించిరి. పరమ శివుని గూర్చి తపస్సుచేసిన అది సిద్ధించునని చెప్పి శివుడు వెళ్ళిపోయిన వెనుక వారు రాజ్యము గిజ్యము విడిచి తపమాచరించిరి. శివుడు ప్రత్యక్షమై వరమీయగా పుత్రుని గోరుకొని అచిరకాలములోనే కొడుకును బడసిరి. వానికి

1. స్త్రీల పాటలు:— ప్రకాశకులు: ఎస్. వి. గోపాల్ అండ్ కో, మద్రాసు—1 పుట. 44

నారాయణుడని పేరిడిరి. వాడు పెరిగి పెద్దవాడైన తదుపరి రాజతనిని దోడ్కొని కాశీపట్టణమునకు ప్రయాణమైపోవుచు దారిలో నొక పట్టణములోని పూదోటలో నిలిచెను. ఆరోజు శ్రావణ మంగళవారము కనుక ఆదేశపు రాకుమారి సత్యవతీ దేవి శ్రావణ మంగళ గౌరిని పూజింప చెలికత్తెలతోగూడి ఆ తోటలో పూలు గోయవచ్చి రాకొమరుని గాంచెను. తత్ఫలితముగా వారికి వివాహము గావింప బడినది. తర్వాత శోభన మేర్పాటు చేయబడ "తూగుటుయ్యాలపై దంపతు లిద్దరూ—శయనించి నిద్రలు చేయగానె," వరుని ప్రాణముదీయ కాలసర్పము వచ్చెను. అంత మంగళగౌరి సత్యవతీదేవికి స్వప్నమున కనిపించి విషయమును దెల్పగా నామె మేల్కొని దిగ్గున లేచి చూచి నవ్వుచు స్వర్ణకలశమును దెచ్చి యుంచెను. సర్పమందుబోయి పరుండగా ముత్యాల రవికెతో మూత గట్టి ప్రదక్షిణము చేసి తిరిగి పరుండెను. ఉదయమున ఆమె భర్త నిద్రనుండి లేచి చెప్పకయే తండ్రిని కలిసికొని కాశికిబోయెను. సత్యవతీదేవి తండ్రి మరొక వరునకిచ్చి పెండ్లి చేసెదనని యతని దోడుకొనిరాగ, ఆమె తృణీకరించి మంగళగౌరి నోముపట్టి కాలయాపన చేయదొడగెను. ఈ లోపున నారాయణుడు తండ్రితో కాశిని దర్శించుకొని తిరిగి సత్యవతీదేవి పురమునకు వచ్చెను. కాల సర్పము బారినుండి తన్నుకాపాడుకొనిన వృత్తాంతమును నివేదించుకొనెను. అప్పుడాయిరువురికి మహావైభవమున పెండ్లి చేసిరి. సత్యవతి భర్త వెంట అత్తగారింటికిపోయెను. తన కుమారుని ప్రాణము కాపాడిన కోడలి పాతివ్రత్య మునకు పరమానందమంది అత్త "ఏమినోము నోచితే వ్రతము చేసితి— పుత్ర బిక్షంబెట్టె పుణ్యశాలి," అని యడుగ "సత్యము తప్పకా మాంగల్యములుగదా— మంగళగౌరిని పూజించితే," యని కోడలు చెప్పెను. అట్లు మంగళగౌరిని పూజిం చువారికి సకల సౌభాగ్యములు చేకూరును. స్త్రీకి ఐదువతనము ముఖ్యము కనుక "చాలు ఐదువతనము సంతానబలము —కోటి ఐదోతనము కొమారులా బలము,"

అని కోరు కొనుట జరుగును. ఇట్లు కోరుట స్మృత్యుక్తమైనది1. గౌరమ్మ యంతటి ఐదువ తనననుగ్రహించుట యన్నది గౌరీ నోముల ప్రత్యేకత. మంగళ గౌరిని ఐదు సంవత్సరములదాక నోముకొందురు. షోడశోపచారములు చేయుచు ఆమెను మారేడు దళములతోడను పువ్వులతోడను అర్చించుచు కాంతలు —

ఒక్కొక్క ముత్తెంనేన్నోమినాను
ఒక్కొక్క ముత్తెం పేరు నేన్నోమినాను
గంగాల ఘన పత్రి లింగాన అచ్చంతలు
ఎంపల్లి బంగారు నేన్నోమినాను
ఎర్ర కుచ్చుల దండ నేన్నోమినాను
మాపటివి భోజనాలూ గౌరమ్మా
పొద్దుటివి రాజనాలు గౌరమ్మా,, * అనుచు పాడుచు నైవేద్యమిడుదురు.

,,సావిత్రి గౌరి దేవమ్మ తల్లి నీ దండన మాకు ఎల్లప్పుడు కావాలి ,, అని మ్రొక్కుదురు.

## చిక్కుళ్ళ గౌరినోము:-

మాఘ పౌర్ణమిలో వచ్చు రథసప్తమి మొదలుకొని సంవత్సర కాలము చిక్కుళ్ళ గౌరినోము నోచెదరు. నోముకొనునప్పుడు-

,,ఎత్తుకొన్న బిడ్డా ఎడబాయకుండా — చంకన బిడ్డా సడలాకుండా
పక్కన బిడ్డా పాయాకుండా — కంటి కాటుక కర గాకుండా
చేతి గాజులు చెరగాకుండా — కాలి మెట్టెలు కదలాకుండా
కట్టిన బట్టా తొలగాకుండా — తొడిగిన రవికా మాయాకుండా
వెంట పురుషుడు విడువాకుండా —చిక్కుళ్ళ గౌరిదేవి నాతల్లి
వెండి చిక్కుళ్లు భమిడి (పైడి) చిక్కుళ్లు పంచి పెడుతా,, ననుచు

1. మనుస్మృతి:- అధ్యా. 5 శ్లో. 154, 155

అక్షతలు వైచి మ్రొక్కి, వెండితో గాని, పైడితోగాని చిక్కుడు పువ్వులు చేయించి తాంబూలముతో ముత్తైదువలను సత్కరించెదరు. అట్లు చేసిన వారికి సంతానము వర్ధిల్లును. ముత్తైదువతనము నిలుచును. ఆయురారోగ్యములు కలుగును గౌరమ్మ నోము కథలు వినుటతో నెట్టి లాభమున్నదో వినక పోయిన నెట్టి కీడు కలుగునో ఈ పాటను పరికింప వచ్చును.

శ్రీ గౌరిదేవమ్మ నారాయణో — నోములే నోమాము నారాయణో
ఏడు కొండలవాడు ,, యేదములే చదువంగ ,,
ఏడుగురు కన్యలు ,, యేటి నీళ్లకే బోయిరీ ,,

ఆ యేడు గురిలో నొక కన్య నిలిచి ఆ కథనంతయు ఆలకింతమన్నది. మరొకతి పోవుచు విందమన్నది. ఇంకొకతి ఆ కథ వినుటవలన ఫలమేమి యని ప్రశ్నించినది. మరి యింకొకతి వినక పెడచెవిన బెట్టినది. అప్పుడా యేడుగురి కన్యలను యముడు తోలుకొనిపోయి, నిలచి ఆలకింతమన్న దానికి నిలువుటద్దములను, పోవుచు విందమన్న దానికి పూలదండలను యిచ్చెనట. నిర్లక్ష్యము చేసిన మిగత వారికి సంకెలలు వైచెనట. ఇట్లుగాక, గౌరి నోము కథలు ,, బాలలు పాడితే భాసింగములు గల్గు, వయసోల్లు పాడితే వైభోగములు కల్గు, ముసలోల్లు పాడితే మోక్షంబు కలుగును.

సంసార బంధములో జిక్కి యిడుమలు గుడుచుట యన్నది వ్రతములు నోములు చేయక పోవుట వలననే యగును. నోచుటలో గూడ లోపమున్న ఫలితము సున్న. ,,ఏకొంటి నోముల ఫలమో ఈ యాపద,,లని వనితలు భావించుట సామాన్యము. తన మీద భర్తకు దయలేకున్నను ,,పురుషునికి దయలేక పూజలిట్లుండె,, నను కొనును భార్య. ఇట్లే తన్ను దుష్యంతుడు నేకొన నొల్లక బొమ్మనినప్పుడు శకుంతల —

,, తడయక పుట్టినాడ తల్లిచే దండ్రిచే విడువ
బడితినిప్పుడు పతిచేతను విడువ బడియెదనొక్కొ

నుడువులు పేయి నింకేల యుప్పాటి నోములు వొల్లి
కడగి నోచితిని గాకేమి యనుచును గంపె డెందమున,, 1

ప్రవరుడు దయా విహీనుడై తన్ను ద్రోచిపోవగా వరూధినియు, ఈకొలి నోములు నోచినట్టి నేనెక్కడ,, అని కుందినది.

## బొడ్డెమ్మ

తెలుగు సీమలో వినాయక చవితినాడు లేదా భాద్రపద బహుళ పంచమి నాడు కన్యలందరు కుమ్మరి మన్నుదెచ్చి చెక్క పలకమీద అయిదంతస్తుల బొడ్డెమ్మను రూపొందించి, పసుపు కుంకుమ బొట్లుపెట్టి, తమలపాకున పసుపు ముద్దనుంచి దానిని శిఖర భాగములో నిలిపి గౌరమ్మగా భావింతురు. కొన్నిచోట్ల బొడ్డెమ్మల మీద కలశమును, ఆ కలశముపై నొక క్రొత్త రవికె బట్టను పెట్టుట యును గలదు. సాయం సమయమున ఇంటి ముంగిట గాని లేదా వాడలో నొక చోటగాని అలికి రంగురంగుల ముగ్గులిడి బొడ్డెమ్మలను నిలిపి, పసుపు కుంకుమ పూలు చల్లి కన్యలు దాని చుట్టు గుండ్రముగ తిరుగుచు చేతులు తట్టుచు పాటలు పాడుచుందురు. బొడ్డెమ్మ గౌరమ్మయే, తగిన వరుడు లభించవలెనని గౌరమ్మను గూర్చి పాడుచు మబ్బుపడుదాక ఆడుకొని, తెచ్చిన పప్పు ఫలహారములను పంచిపెట్టి బొడ్డెమ్మల నిండ్లకుకొనిపోయి దాచుకొందురు. తొమ్మిదవనాడు మరల బొడ్డెమ్మలను పూజించి, నిత్యము బాలికలు బియ్యము దెచ్చి కలశములో బోసినవి, బెల్లముబ్బు, పండి ప్రసాదముచేసి పంచిపెట్టుదురు. తర్వాత పాటలు పాడుచు బొడ్డెమ్మలనొక బావి లేక చెఱువు చెంతకు తీసికొనిపోయి—

" బొడ్డెమ్మ బొడ్డెమ్మ బిడ్డలెందారే – బావిల పడ్డ వారికి బారిద్దరమ్మా
చెర్ల పడ్డవారికి చెరిద్దరమ్మా – కుంట్ల పడ్డావారికి కోరిద్దరమ్మా
నిద్రపో బొడ్డెమ్మ నిద్రపోవమ్మా – నిద్రకు నూరేండ్లు నీకు వెయ్యేండ్లు,,

అనుచు నీట జారవిడచి తిరిగి యిండ్లకు వత్తురు. బొడ్డు + అమ్మ = బొడ్డెమ్మ

---

1. శ్రీమదాంధ్ర మహాభారతము — ఆదిపర్వము అ. 4; పద్య. 103

కావచ్చును. సంతానార్థమై బొడ్డెమ్మ నాడుదురని పై పాటవలన ధ్వనితము. రాయలసీమలో గూడ నీయాట కన్పించును. సాగరసీమలో గన్పించదు.

బ్రతుకమ్మ:-

చల్లని బ్రతుకునిచ్చు తల్లిగా గౌరమ్మను బ్రతుకమ్మ(బ్రతుకు + అమ్మ) అను పేరున తెలుగు సీమలో నంతటను మహిళలు వైభవోపేతముగా పూజించి పండుగ జరుపు కొందురు. అన్ని నోములకన్న బ్రతుకమ్మ నోము గొప్ప పర్వదినముగా పరిగణింప బడుచున్నది. తమ కున్న క్రొత్త వస్త్రములు సొమ్ములు ధరించి ,,బాలలు వృద్ధులు ప్రౌఢాంగనలు కన్యప్రాయంపు కాంత,, లెల్లరు ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి(కొన్నిచోట్ల నవమి)వరకు బ్రతుకమ్మ రూపమున గౌరమ్మను గొలుతురు. అవి విజయ దశమి దినములు. పల్లెలుత్సాహమున మునిగి తేలుచుండును. పళ్లెరములలో తంగేడు, కట్ల, గునుగు, గన్నేరు గోరెంక వంటి పూవులతో పేర్చి పైభాగమున పసుపు ముద్ద తో చేసిన గౌరమ్మ నుంచుదురు. బ్రతుకమ్మను పేర్చుటలో నొకరినిమించి మరియొకరు ఎత్తుగా నేర్పుగా పేర్చుకొని ప్రజలంత గుమిగూడగల చోట చేర్చుదురు. ఒకరు చక్కగా గాత్రమును విప్పి పాటలు చెప్పుచుండ మిగత వారందరందుకొని గుండ్రముగా తిరుగుచు చేతులు తట్టుచు పాడుచుందురు. ఈ సందర్భమున గౌరమ్మ దిగివచ్చినట్లుండును. ఆడవారి ముఖమున నిత్య కల్యాణ మలరియుండును. చూచువారి యానందమున గౌరమ్మ లాస్యము చేసినట్లుండును. ప్రాచీన కాలమందున్న గొండ్లియాట విధానమే బ్రతుకమ్మ బొడ్డెమ్మ ఆటలని భావించుచున్నారు. 1

బ్రతుకమ్మ పాటల్లో ,,శ్రీరామ జేరామా వలలో - శ్రీసీతారామా,, వంటివి రామాయణ సంబంధముగను, ,,బాజార్న కృష్ణయ్య వలలో - బలితూ

1, సురవరం ప్రతాపరెడ్డి:- ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట 205.

లాడంగా వలలో - బంతిపోయి గొల్లడాని వలలో - పంచేట నిలచే వలలో,, వంటివి భాగవత సంబంధముగను - ఇల్లలికి ముగ్గెట్టి వలలో - ఇంటి సుందారి వలలో - ఈ యింటి సుందారి వలలో - ఎందూపోయిరంటి వలలో,, వంటివి నిత్య జీవితసంబంధముగను; ఇంకను భారతాదుల పరముగను పాడుకొనుట జరుగును. "శ్రీలక్ష్మి నీమహిమలూ గౌరమ్మా - చిత్రమై తోచునమ్మా" అని పాడుకొనుటలో లక్ష్మియే గౌరి; గౌరియే లక్ష్మి; పల్లీయులలో నింత చక్కని ఆదర్శముండుట అది వారి నిర్మలమైన నిరాడంబరమైన జీవితమునకు ప్రత్యక్ష సాక్ష్యము. ఉయ్యాల, వలలో, చందమామ, గౌరమ్మా వంటి పదములలోనే నేదేని యొకటి పాటలలోని ప్రతిపాదమునకు పల్లవిగా వచ్చును.

బ్రతుకమ్మలాడిన పిదప వానిని గ్రామమునకు చేరువలో నుండెడు కుంటలోగాని, చెఱువులోగాని జారవిడుచుదురు—

"ఒక్కొక్క అచ్చంతలే గౌరమ్మా - ఒక్కొక్క మల్లెపూలూ గౌరమ్మా
చిన్న చిట్టి వత్తులూ ,, - సన్నని దీపాలునూ ,,
నీలాటి జలధి వద్దా ,, - నీనోము నీకు భల్లే ,,
నీనోము ఫలము జెప్పె ,, - బాలునీ పెండ్లాడవే ,,"

అనుచు పాడుచు, నీటి అలలపై తేలియాడింతురు. పిమ్మట ప్రసాదమ్మును అకు పోకలను పరస్పరమందించుకొని పాటలు పాడుచు నిండ్లకు తిరిగివత్తురు. పెద్దల పాదములకు మ్రొక్కి దీవనలందెదరు. వివాహము నాశించి కన్యలు బ్రతుకమ్మను పూజింతురని పైపాట వలన తెలియుచున్నది. ఇంతేగాక, బాలికలు మొదలుకొని వృద్ధాంగనలవరకు నీయాటలాడుదురు. విజయదశమికి ముందురోజున (కొన్నిచోట్ల తర్వాతి రోజున) ఆడెడు బ్రతుకమ్మను "చద్దుల బతుకమ్మ" "సద్దులబతుకమ్మ" అందురు. ఆనాడు చద్దులు ఫలహారముగా దెచ్చి పంచుకొనుట వలన నది చద్దుల బ్రతుకమ్మయైనది. నేటికిని కోమట్లు పెరుగు చద్దులు పంచుకొనుచుందురు. క్రొత్తగా పండిన పాలసజ్జలను ప్రసాదముగా పంచుకొనుటవలన సద్దుల(సజ్జల)

బ్రతుకమ్మ యనబడుచున్నది. ఇది రైతు కుటుంబినులు చేసెడివారు. ఆ తర్వాత మూడవనాటి రాత్రి స్త్రీలు వరుని పక్షముగా వధువు పక్షముగా రెండు జట్లు ఏర్పడి వేరు వేరు చోట్ల బ్రతుకమ్మలకు మారుగా మంగళహారతులు ముట్టించి బ్రతుకమ్మ ఆటవలెనే ఆడుచు పాడుచు కొంతసేపటికి అందరొక్క చోట కలిసికొని పరస్పరము బుక్కా గులాలు చల్లుకొందురు. దీనిని ఎదురుకోళ్లు అందురు. ఈ పండుగ సందర్భములో గన్పట్టు సామాజిక చైతన్యము మరే యితర వ్రతాములలో గన్పట్టదు. కళాత్మకమైన సమాజ పూజా విధానముతో గూడి భక్తి మరియు వినోదమిశ్రితమై యొప్పును. వర్ష శరదృతువుల సంధి కాలమున నిట్టి పూజా విధానములు ఋతులక్ష్మిని ఆరాధించి నట్లుండును. పండుగలు వ్రతములు మున్నగునవి ఋతువుల క్రమమునుబట్టి రూపొందినవియే.

## గ్రామ దేవతలు

వైదిక పౌరాణిక సంబంధమైన దేవత లెందరున్నను పల్లెలలో పోచమ్మ, మైసమ్మ, ఎల్లమ్మ, ఈదమ్మ, గెల్వలమ్మ, ఈరనాగమ్మ, బాలమ్మ, పోలేరమ్మ, అంకాలమ్మ, అద్దంకమ్మ, ముత్యాలమ్మ, గోగులమ్మ, పసుపులమ్మ నూకాలమ్మ. పెద్దమ్మ, చిన్నమ్మ, పంటలమ్మ, చల్లలమ్మ, సవారమ్మ (సరోజనమ్మ) వంటి గ్రామదేవతలు వెలసి యున్నారు. వారికి కేవలము పల్లీయుల జీవితము తోడను తద్వాతావరణము తోడను మాత్రమే సంబంధ మున్నది. అందువలన వివిధ ప్రాంతములలో వివిధములైన గ్రామదేవతలు గన్పట్టుచుందురు. అవి పల్లీయుల భక్తికి ప్రత్యేకమైన రూపకల్పనలు. గ్రామ దేవతారాధన మాతృస్వామికమునకు చెందినదనిచెప్పుదురు. అందుకే కాబోలు గ్రామదేవతలలో నొండు రెండు తప్ప అన్నియు స్త్రీ మూర్తులే. ప్రతియూరి వెలుపల చేరువలోనున్న చెట్టు క్రిందనో చెఱువు కట్ట మీదనో వానికి గుళ్లు ఏర్పరుపబడి యుండును. ఇట్లేర్పడుటకు గల మూలహేతువులు గొన్ని

యున్నవి1. ఇట గుడి యనగ పెద్ద నిర్మాణముకాదు. కేవలము నాలుగు బండ చెక్కలతో రూపొందించుట యని అర్థము. అట్లే దేవతా ప్రతిమ యన్నను పసుపు కుంకుమ బొట్లు దిద్దిన చిన్నరాయి మాత్రమే. (కొన్ని ప్రాంతములలో పెద్ద గుళ్లు, ప్రతిమలు గూడ నిర్మితమై కన్పించును). తెలుగు దేశమంతట "చిన్న చిన్న రాళ్ళ చిల్లర దేవుళ్లే", కాని, ప్రత్యేకమైన ఆకారములు గలవి అరుదు. తొలుదొలుత ఆరంభదశలో బలి ఇచ్చుట కొరకు ప్రత్యేక స్థలము నెన్నుకొనుట జరిగినదని, కాలక్రమమున ఆస్థలమును గుర్తించుటకు కొన్ని రాళ్లుగాని రాతిస్తంభములుగాని, యుంచుట యొప్పినదని తదుపరి ఆరాళ్లే దేవతాప్రతిమలుగ పరిగణింపబడి పూజాదికముల నందుకొనుట ఆచారమైనదందురు2. గ్రామములకు సంభవించు గొప్ప అంటువ్యాధులకు, కరువుకాటకములకు అవియే రక్షకములు. ప్రతిబాధకవియే శరణ్యములు. తలంపునను కలవరింపునను వాని శక్తియే పొడగట్టును. వాని పూజావిధానములో వ్యత్యాసమంతగా గన్పట్టదు. గ్రామదేవతలావేశింపగా పూని సిగమూగువారు ఒకరిద్దరు స్త్రీలు గాని పురుషులు గాని (ఎక్కువగా స్త్రీలు) ప్రతియూర నుందురు. సాధారణముగా గ్రామదేవతోత్సవములలో దేవత పూనగా వారు వేపమండలుబట్టి సిగమూగుచు కేకలిడుచు

1. The tree was the only known house for the primitive man. it was the tree that sheltered him from sun and rain. so man gave his first house to his God as well. To begin with, no object was placed under the tree to represent the diety, for the tree it self was regarded as huge natural temple in which the spirit dwelt in suffusion. Latter on, a time advanced, it was thought necessary to keep some image under the tree to evoke the reverence of all strangers and passers by.
   -Tree Worship and Ophilatry- P.5.

2. R.R.H. White head- The Village Gods of South India:- [2nd Ed-revised] P. 149.

"గట్టెక్కి నిన్ను దలతూ కట్ట మైసమ్మా - పోత నిన్నుదలతూ పోతలింగామా ఊరెల్లి నిన్ను దలతూ - పూర పోశమ్మా-ఏడుకోట్ల దేవతల దలతునా - శివుడ నిన్ను దలతునా- .... .... ..... ..... ఉన్నదున్నట్లు సెపుతా వినరే మీరు— నేను మీకండ్లకు కననురానా-నాఅగ్గిలంమీద గుగ్గిలం ఏసినారా-నల్ల మ్యాకలతోన శావ సేసినట్లయితే - మీ ఇంటి ఇల్లాదులు ముక్కోంచ కుండ వుంటరే ,,* అనుటయేగాక, "గనమైన భాగోతం గట్టిగా కట్టించు_సద్దిసై పద్యాలు ముప్పూట బెట్టించు-ముంగిట దివ్వెలు ముచ్చటగ వెలిగించు - పందిట్లో బాజాలు బాగుగా వాయించు - వేపాకొమ్మలతో వెనుబోతు పూజించు - పసుపు కుంకుమలతోటి నజగోమో పెట్టించు _ గడప గడపలో నాకు గండాలు మొక్కులు _ బొండాపు కాయాలు మండిగల పారాణి దండిగా పెట్టించు,, మనుచు గ్రామదేవతలకు కావలసినవి అడుగుచుందురు. అరుదుగా నరబలి కోరుటయును జరుగును. దానికి తోడుగా నీసందర్భమున కల్లు సాకపోయుట, బలులిచ్చుట తప్పెటలు కొమ్ములు మ్రోయించుట భయానకతర లీల యొప్పను. గ్రామదేవత పూజలో శాస్త్రీయ సంప్రదాయ లక్షణములున్నవి. ఉత్సవములలో అన్ని కులములవారు పాల్గొని మొక్కులు చెల్లించుకొనుట పరిపాటి. తెలుగుసీమలో గ్రామదేవతల పేర్లు పెట్టుకొనువారెక్కువ. ఆయా దేవతల కరుణాకటాక్షముల మీద ఆధారపడి ఆ పేర్లు పెట్టుకొందురు. ఏదేని ఒట్టు తినవలసి వచ్చినప్పుడు ఆ దేవతల మీదనే ఒట్టు తిందురు. దేవతోత్సవములందలి ఆచారాదులు జానపదరీతులే. అవి వారి జీవితమునందల్లుకొని యుండును. అట్టి గ్రామదేవతలలో ప్రాధాన్యము గల కొందరి నిట పరిశీలింతము.

**పోశమ్మ :-**

పోశమ్మ (ప్రోచు + అమ్మ = ప్రోచమ్మ — పోచమ్మ — పోశమ్మ) ను అమ్మవారు, అమ్మతల్లి, ఆటపాటలమ్మ, తట్టుతల్లి అనికూడ పిలుతురు. ఆమె స్ఫోటకమను భయంకరమైన అంటువ్యాధి కధిదేవత. స్ఫోటకము సోకినప్పుడు

పోశమ్మ పోసింది, అమ్మవారయ్యింది, ఆటపాటలమ్మ వచ్చింది, తట్టుతల్లి అయ్యింది అని పల్లీయులు వ్యవహరించుకొందురు. స్ఫోటకముచేత పెద్ద వ్రణము లేర్పడినచో ,,బొగ్గలమ్మ పోసింది,, అని కూడ అందురు. ఇప్పటికిని ఎవరిపైన నైనను కోపమువచ్చినప్పుడు స్త్రీలు "బొగ్గలమ్మపొయ్యా" అని తిట్టుచుందురు. ఉత్తర భారతములో పోశమ్మ 'శీతలా' అనుపేర బరగుచున్నది. స్ఫోటకము వలన శరీరమంతట వ్రణములేర్పడును. వానిచేత ఆకారమంత వికారమగు చుండును. అవి తీవ్రస్థాయిని చేరుకొన్నప్పుడు ప్రాణాపాయము కూడ సంభవించును. వ్యాధిగ్రస్తుల కితరములైన ఔషధములిచ్చినచో అది మరింత తీవ్రమగునని విశ్వాసము చేత ఆతల్లికి మ్రొక్కి తగిన ఆరగింపులు పెట్టు చుందురు. ఒక్కొక్కమారా వ్యాధి గ్రామమంతటనేగాక చుట్టుముట్టు గ్రామము లకు సహితము వేగముగా వ్యాపించును. దానివలన గ్రామములట్టుడికి పోవు చుండుటవలన పల్లీయులు స్ఫోటకవ్యాధి సోకక పూర్వమే పోశమ్మను తగిన విధముగా పూజించి శాంతింప జేయుదురు.

పోశమ్మ తల్లీ వో పోశమ్మ తల్లీ —మమ్మ<br>
పోషించి రక్షించు ,,<br>
గండ దీపంబులు ,, —నీకు<br>
నిండుగా బోనాలు ,,<br>
పువ్వుల దండా ,, —నీకు<br>
పెద్దపాలు కల్లుబెల్లపుసాక ,, —నీకు<br>
మ్యాకపోతుల దెచ్చి ,, —నీకు<br>
హారాలు బెట్టేము ,,<br>
కుంకుమ పసుపూలు ,, —నీకు<br>
ఎంతో ఆనందమమ్మా ,,<br>
వూరంత కాపాడె ,, —నీవు<br>
చల్లని తల్లి వమ్మ ,,

కొత్త బట్టలు నీకు ,, —నీకు
ఒడిబియ్య మమ్మ ,,
పోశమ్మ తల్లీ వో పోశమ్మ తల్లీ —నీకు
పదివేల దండాలు పోశమ్మ తల్లీ *

ఇంటింట క్రొత్త కుండలకు పైభాగమున సున్నముపూసి పసుపు కుంకుమబొట్లు అలంకరించి అందులో ,,బెల్ల బువ్వ, తగిన నెయ్యి పప్పు నైవేద్యముగా నిడుకొని తలలపై మోసికొని ఊరేగుచు పోశమ్మ గుడి చెంతకు పోవుదురు. వానిని బోనము (బోనాలు) లందురు. ఊరేగింపులో సన్నాయి మోతలు' తప్పెట దరువులు, మతసంబంధగానములు అతిప్రాచీనకాలము నుండి కన్పించు చున్నవి. అట్టివి గ్రామదేవతోత్సవములలో నేటికి మిగిలియున్నవి. ప్రతి యేడు పోశమ్మకు బోనాలు చేయుటను 'బోనాల పండుగ' 'పోశమ్మ పండుగ' అందురు. బోనాల వెంబడి గండదీపములను, మొలకతొట్లనుగూడ తీసికొనిపోయి పూజగావింతురు. పోశమ్మ గుడికి పూలదండలుగట్టి బోనాలు అర్పించి గుగ్గిలము పొగవేసి గుడిముందర పెరుగు పాలతోగాని, కల్లుతోగాని, బెల్లపు పానకముతో గాని సాక (చారక) పోయుదురు. పిడికెడు బియ్యమును ఒడిబియ్యముగా నిడి క్రొత్త బట్టలను కట్నములుగా అందించి, పసుపు కుంకుమలు చల్లి, కోళ్లను మేకపోతులను బలియిచ్చి వాని తలలను కాళ్లను గుడిముందరి చెట్టుకొమ్మలకు వ్రేలాడగట్టి వంగిదండములు బెట్టుదురు. ఇట్టి ఆచారములు దక్షిణ భారతదేశ మందంతటను నించుమించు గలవు. గ్రామదేవతలకు పూజలు జరుపుటలో కుమ్మరి, చాకలి, బైండ్లు (బవనీలు) పూజారులుగా పనిచేయుట సంప్రదాయ ముగా వచ్చుచున్నది. కాని మహిషమును బలి ఇచ్చునప్పుడా కార్యమును బవనీలే నెరవేర్చుదురు. కోళ్లను మేకలను మాత్రము చాకలివారు గుడిముందర కోయుదురు. గ్రామదేవతోత్సవములలోనేగాక, పండుగలలోను వివాహాదులలోను ఆబాలగోపాలము కులమత వివక్షతలేకుండ వ్యక్తిగతమైన అంతస్తుభేదములను ఈర్ష్యాద్వేషములను మరచిపోయి కలిసిమెలసి పాల్గొనుటచేత సౌభ్రాతృత్వము,

సామాజికశక్తి, సంప్రదాయము, సంస్కృతి అలవడుచున్నవి. పోశమ్మకు పసిబాలలమీద యెప్పుడు కన్ను గాబోలు తరచు వారికి స్ఫోటక వ్యాధి సోకు చుండును. ,,ఇది యెవ్వారి మాయగాదు పోశవ్వ తల్లిదే,, అని తక్షణమే తెలిసి కొని కల్లుసాకబోయుట, కూతకుఎచ్చిన కోడిపుంజును బలియిచ్చుట గావింతురు. ఒకవేళ వ్యాధి ,,సల్లంగపడితె సల్లసల్ల సాక1 బెట్టుదు,,రు. ఇరుగు పొరుగు ఇండ్లలో నీవ్యాధి కనిపించగనే మిగతవారు ,,నాపిల్లలు నాకు మంచిగా వుంటే-ఇవ్వన్ని పెట్టుతానుతల్లే,, అని మ్రొక్కుకొందురు. వారమున కొకమారు ఇంటికి ఎచ్చేడు కుమ్మరికి తగిన సాహిత్యము (నైవేద్యమునకు తగిన వస్తువులు)నిచ్చి ఆమెకు నైవేద్యము పెట్టింతురు. అత్తవారింటికి వెళ్ళు వనితలు బండి యెక్కునప్పుడు పోశమ్మ తల్లికి సాక పోయించుడని పైసలిచ్చి కదలెదరు. సాక పోయుటను గూర్చి కొఱవి గోపరాజు కూడ తడవినాడు2.

పోశమ్మ జన్మవృత్తాంతమును గూర్చి ఈ క్రింది పాటను పరిశీలింపదగును.

శివలోక పట్నాన ఉయ్యాలో – తండ్రి శీపూడమ్మ ఉయ్యాలో
తండ్రి శీపు ,, – తల్లి పార్వద్దేవి ,,
పార్వతీ దేవికీ సంతాన మేడుగురు
ఏడుగురి ఎనుకనూ ,, – ఏ సోద్యమే లేదు ,,
రాయిసెట్లకు రెండు ,, – టీపాలు ముట్టించి ,,
రాజ్యాలేలేటి ,, – తండ్రి శీపూడమ్మ ,,
మర్రి చెట్లకు రెండు ,, – టీపాలు ముట్టించి ,,
మాలోక మేలేటి ,, – తండ్రి శీపూడమ్మ ,,

---

1. చల్లని సాక, పెరుగు సాక.
2. సింహాసన ద్వాత్రింశిక:– ప్రథమభాగము. ఆ.4. పద్య.259

ఏడుగురు బిడ్డలూ ఉయ్యాలో — సంతాన ముండటీ ఉయ్యాలో
ఏడుగురి ఎనుకనూ ,, — ఏ సోద్యమే లేదు ,,
కడ్పులా పోశమ్మ ,, — జన్మించినాదమ్మ ,,
కడ్పులా పోశమ్మ ,, — జన్మించినంకనూ ,,
వాగులూ దాటంగ ,, — వాకరింతాలాయె ,,
కొల్వలూ దాటంగ ,, — కడ్పులా ఏర్పాడె ,,
మూడేసి నేలల్లు ,, — ముద్ద లేరూపాడె ,,
నాగ్లేసి నేలల్లు ,, — నవ్వసందామాయె ,,
ఐదేసి నేలలు ,, — అవుసుల్లే పోసె ,,
ఏడేసి నెలల్లు ,, — ఏర్పాడె పిండమూ ,,
తొమ్మిదేసి నేలల్లు ,, — తొలికాడె పిండమూ ,,
మూడేసి నేలలు ,, — ముల్క పండ్లడిగెనే ,,
నాగ్లేసి నేలల్లు నారింజ పండ్లడిగె ,,
ఐదేసి నేలలు ,, — అరటి పండ్లడిగెనే ,,
ఏడేసి నేలలు ,, — ఎల్క పండ్లడిగెనే ,,
తొమ్మిదేసి నేలల్లు ,, దోస పండ్లడిగెనే ,,
నందిమీద శివుడు ,, సాల పడ్డాడమ్మ ,,
పట్టీరి నందినీ ,, పగ్గాల తోడనూ ,,
కట్టీరి నందినీ ,, గాజు తంబాలకే ,,
ఏపిరీ నందినీ ,, ఏయిసొప్పాకట్టా ,,
వొచ్చేటి నందికీ ,, — ఏమి వందనాలు ,,
ఎర్రన్ని డెక్కలకు ,, — ఎయ్యి వందనాలు ,,
నల్లన్ని డెక్కలకు ,, — నాడె వందనాలు ,,
పచ్చన్ని డెక్కలకు ,, — పగిడి వందనాలు ,,
తండ్రి శివూడమ్మ — తల్లి పార్వద్దేవి ,,

ఏడ్గురు సంతానం ఉయ్యాలో — ఆమె కయినంక ఉయ్యాల
అన్నించి పార్వతి ,, — ఏమడిగీనాది ,,
ముప్పయి కూరాలు ,, — ముల్క సారులన్ని ,,
అరువయి కూరాలు ,, — అల్లమూ పచ్చడా ,,
డెబ్బయి కూరాలు ,, — దండి పాలపెరుగు ,,
సుట్టుముట్టూ కూరలు ,, — నడుమనే అన్నాము ,,
నడుమ అన్నామందు ,, — నల్లావులా నేయి ,,
చక్కని పార్వతీ ,, — భోంచేసినాది ,,
కుడిసెనే పార్వతీ ,, — గుండెల్లు ముగుస ,,
ఆకులూ పోకలూ ,, — ఇడియము సేసెనే ,,
దాగెనే ఇడియమ్మ ,, — దంతాల సందునా ,,
కడ్పూలు నొచ్చెనే ,, — కలవార్ని పిలిచెనే ,,
దయ్యాలు భూతాలో ,, — కడ్పుల పోశమ్మ ,,
కలగోటి బిడ్డననే ,, — కడ్పుల పోశమ్మ ,,
అమ్మలో పార్వతీ ,, — అదిరిపడకమ్మ వూకెనే పుట్టను
ముత్తెము బండారు ,, — ముంగలోడి కావాలె ,,
నల్తెము బండారు ,, — నడుము వోడికావాలె ,,
పందుము బండారు ,, — పక్కవోడి కావాలె ,,
ఏడేడు పటాలు ,, — ఎల్లనే రాయాలె ,,
కలియాప పటాలు ,, — కలియనే రాయాలె ,,
సెందప్మ పటాలు ,, — సెదురనే రాయాలె ,,
పచ్చపిండి పటాలు ,, — పాటిగా రాయాలె ,,
తెల్లపిండి పటాలు ,, — తెలివిగా రాయాలె ,,
వారంచు సీరలూ ,, — అవి నాకు కావాలె ,,
అద్దాల రవికలూ ,, — అవి నాకు కావాలె ,,

కొబ్బెరి కాయలూ ,, — కోటిగా కావాలె ,,

నిమ్మవీ కాయలూ ,, — నిలువునా కోయాలె ,,

బయిండ్ల రాముడూ ,, — బాగుగా రావాలె ,,

ఎండివీ జమిడికెలు ,, — ఏపాకు రిల్లలు ,,

గవదరిసెనాలు ,, ఘనముగా కావాలె ,,

బొడ్డు గురిగీలమ్మ ,, — బొందే కోలాలు ,,

మున్నూరు పుటువాపు ,, — ముందలారావాలె ,,

ఎయినూరు పుటువాపు ,, — ఎనుకాలె రావాలె ,,

అరసేత బొడ్డమిరి ,, — బయటపడ దుంకి ,,

పుడితివే పోశమ్మ ,, — దుడ్డు గట్టాలమ్మ ,,

పట్టనే పట్టింది ,, — చెట్ల సెంచారము ,,

ఎల్లినాదోయమ్మ ,, — ఎగ్గిరంగా వాయె ,,

కోరెంత పొదలల్ల ,, — కూకున్న దోయమ్మ ,,

అడవుల్లనే వుండి ,, — శివుని పొట్టా మీద ,,

అంతంత బొగ్గపుట్టించే ,, — అందరికమ్మ వారాయె ,,

పుట్ట బాధలొపె ,, — పోశమ్మనే మెప్పించి ,,

పూరికే తెచ్చిరో ,, — ఊకుంచి నిల్పిరి ,, *

ఇట్టివి పల్లీయులలో గన్పట్టు పురాగాథలు. వీనిని సమగ్రముగా పరిశోధింప దగినంత వస్తువున్నది. వాని వలన వివిధ విశేషాంశములు లభింపగలవు. పై గాథయందలి విషయ మించుక వెనుక ముందరగా నున్నప్పటికిని దాని ప్రకారము పోశమ్మ తల్లిదండ్రులు శివపార్వతులు. ఆమె పుట్టినప్పుడు పార్వతికి దయ్యములు భూతములు పట్టినంత నొప్పులు కలిగినవి. ప్రసవవేదనకామె అదరి పడుచుండ కడుపుననున్న పోశమ్మ ధైర్యమిచ్చినది. తాను పుట్టుటకు ముందు పందుము బండారు (పసుపు) కోరుకొని, పచ్చపిండితో, తెల్లపిండితో

ఏడేసి చొప్పున కలియాప ( వేపమండలతో వేసెడివికావచ్చును ) పటములు, సెందమ్మ ( చందనముతో వేసెడివి కావచ్చును ) పటములు వ్రాయింపజేసి, వారంచుచీరలు, అద్దాల రవికెలు, నిమ్మకాయలు, కొబ్బెరకాయలు తెప్పించుకొని బైండ్ల రాముడు జమిడికె వాయించుచుండగా పుట్టినది. అదేమి వింతరోగాని పుట్టి పురుడు వోసికొన్నదో లేదోగాని అడవులుబట్టి కోరెంత పొదలో తిష్టవేసి కొన్నది. శివుని పొట్ట మీదనే పెద్ద బొగ్గ పుట్టించి పెక్కు మందికి స్ఫోటకము సోకించి యెన్నియో ఇడుమలపాలు జేయుచుండ శివపార్వతులు ఆమెను మెప్పించి యూరికి దెచ్చి నిలుపుట జరిగినది. ఆమెకు పసుపు వేపాకు అన్నచో మిక్కిలి యిష్టమున్నట్లున్నది. గవ్వలచేత చతురస్రాకారముగా అరచేతియంత పరిమాణములో బట్టమీద పొదివించబడిన దానిపైన బండారు పోయించుకొనుట చూతుము. దానిని చూపుటయే గవ్వదరిసెన' మందురు. ఎరుక చెప్పు ఎరుకత దానిని జూపి పోశమ్మ అనియో ఎల్లమ్మ అనియో చెప్పి దాని మీద బండారు వేయించుకొని యెరుక చెప్పుట యొప్పును. పోశమ్మకు వారంచుచీర కట్నముగా బెట్టి మరల ఆమె పేరుమీద కట్టుకొని శుచిగానుండుట నేటికిని చూచుచుందుము.

పోశమ్మ భర్త పేరు దేశపతిరాజు. కొంతకాలమతనిని దైవముగా జూచు కొన్నది. కాని అతడు నీలగిరి దండుపోయినప్పటినుండి ఆమెను విడిచిపెట్టుట జరిగినది. ,,పోశమ్మ నీమొగుడు దేశపతిరాజు — నీలగిరి దండుపోయి నిను వల్లడంట,, ఒల్లక పోవుట కామె వికృతాకారమే కారణము.

,,చేదెనిను వలాడు చెడలు ముఖమాని
గుణపతి నిను వల్లాడు గొగ్గిపండ్లాని
పతి నిను వల్లాడు వల్ల జడలాని
నాతి నిను వల్లాడు నల్లముఖమాని ,, స్ఫోటకము మచ్చలతో గూడిన చదలవంటి ముఖము, గొగ్గిపండ్లు, వల్లజడలు నల్లని ఆకారముండుట వలన పోశమ్మను విడిచిపెట్టగా నామె మాత్రము తనకు ముత్తైదువతనమున్న చాలు

ననుకొన్నది. దీనినిబట్టి చూడగ పోశమ్మయను పడతి స్ఫోటకమునకు గురియై మరణించియో లేక తత్ఫలితముగా వికృతరూపము దాల్చియుండ భర్త యేవగించు కొని విడిచిపుచ్చుటచేత కొన్నాళ్ల కాత్మహత్య చేసికొనియో యుండవచ్చును. ఆ పిమ్మట భూతశక్తిగామారి గ్రామముల మీద విరుచుకొని పడుటచేత ఆమెను శాంతపరచుట జరిగి యుండవచ్చునని, రాను రాను గ్రామదేవతయై కొలుపు లందుటగా పరిణమించియుండునని ఊహించుట కించుక వీలున్నది. పోశమ్మ భర్తను చంపినట్లు గాథలు, పాటలు ఉన్నవి. అందుకే „మొగుణ్ణి మింగిన పోశమ్మ„ అను సామెత తిట్టుగా వ్యాపించినది.

„పోశమ్మ అత్తగారికి బహుమంచి లక్క మేడ„ గలదట. కాని, అత్త గారి ఊరేమిటో తెలియదు, ఆమె పుట్టిన ఊరు మాత్రము మాహురము. „పోశమ్మ పుట్టినాది కొండల్ల మావురాల„. ఒకనాడు అటుకులు బెల్లములు కట్టు కొని అక్క పిల్లలను జూడబోయినది. ఆమె అక్క „పాపకారి చెల్లెలు వస్తుం దని— అరలో కమ్మింది బాలలను„ ఇట్లు తనజాగ్రత్తలో నుండినను ఆ„కమ్మిన బాలలకు తల్లిఅయింది„ అప్పుడామె „తమ్ముడా పోతలింగ1 ఇదియేమి మాయ నోయి„ అని తమ్ముని నడుగగా నతడు „ ఇది యెవరి మాయగాదు — అక్కా పోశవ్వాది„ అన్నాడు. అంతలోనే పోశమ్మవచ్చి పిల్లలేరని అడిగినది. „ఈనాటి వారుకారు — ఆనాటి వారుకారు ఇంటికిరారు„ అని అక్క పలికినది. పోశమ్మకు అక్కమీద కోపము ముంచుక వచ్చినది. తెచ్చిన „కుల్లలు అంగీలు చిరేసింది చెల్లెలి అటుకులు బెల్లాలు ఎగసల్లింది„. ఉగ్రురాలై నిలువగా, గజగజలాడుచునామె

„తప్పితే తడిబట్ట స్నానాలు చెల్లెనీకు
ఒప్పితే ఓరంచు సీరా నీకు చెల్లె

---

1. పోతురాజు = ఇతడు పోచమ్మ తమ్ముడు. ఊరి ముందరి 'బొడ్రాయి' పేర గ్రామదేవతయై కొలుపు లందుచుండును.

కొక్కొ న కూసేటి కోడిపుంజు నీకు చెల్లె
'మ్యా' అని పల్లేటి మ్యాకపోతులు నీకు చెల్లె
వేయిగల టీపాలు నీకు చెల్లె
పిలువకుంటె బాలబోనాలు నీకు చెల్లె
నా పిల్లలు నాకు మంచిగావుంటె

ఇవ్వన్ని పెట్టుతాను చెల్లె,, అని మొక్కుకొన్నది. పోశమ్మ తనవారిని కూడ దయచూచునది కాదని దీని వలన తెలియుచున్నది. ఆమె పార్వతి సంతానమనియెడు విషయము శైవ వాఙ్మయమున మృగ్యము. ఆ వాఙ్మయము కన్న జానపదవాఙ్మయమే కడుపురాతన మైనందున దీనిని పై విషయమున కాధారముగా (ప్రమాణముగా) గ్రహింపవచ్చును. ఇది జానపదుల కల్పితమని త్రోసివేయజనదు. ఏలన, శైవ వైష్ణవాది వాఙ్మయములకు కూడ ఇంతే గతి పట్టునుగదా.

## ఎల్లమ్మ:-

ఎల్లమ్మ (ఎల్ల (రకు) అమ్మ, వెల్ల+అమ్మ) జమదగ్ని భార్యయైన రేణుక. ఆమెను ఏకవీర, మాహూరమ్మక్కసాని యనికూడ పిలిచెదరని క్రీడాభి రామమున పఠితము. మాహూరమ్మను మారెమ్మ లేదా (మారి-అమ్మ)గా పలుకు చున్నది. మారెమ్మయే రేణుక1. ఆమెకు తండ్రియైన శివుడు అరణముగా నిచ్చి నట్టి మైసాపురమే మాహూరము. అదియే మావురమను రూపాంతరము పొందినది. అది ఆదిలాబాదు మండల పొలిమేరలోనున్నది. అచ్చట రేణుకాలయము కూడ ఉన్నది. ఈనాటికది గొప్ప శక్తి క్షేత్రము. పోశమ్మ కూడ మాహూరముననే పుట్టినదని యింతకు పూర్వమే తెలిసికొంటిమి. ఎల్లమ్మ పోశమ్మకు తోబుట్టువు.

1. The Village Gods of South India-P. 116

శివుని చిన్న బిడ్డవమ్మా ఎల్లమ్మా—నీవు శివనెల్లి మాతవమ్మా ఎల్లమ్మా
పార్వద్దేవి బిడ్డవమ్మా ,, —నీవు పరంజోతి తల్లివమ్మా ,,
పుట్టలో బుట్టినావూ ,, —నీవు పుడమిపై బడ్డవమ్మా ,,
నాగవన్నె చీరలమ్మా ,, —నీకు నెమిలికండ్ల రవికెలమ్మా ,,
ఏడుము గవ్వాలు తల్లీ ,, —నీకు ఎనుక నీకు దరిసెనమ్మా ,,
గవ్వలాది కంకణమ్మ ,, —నీకు ఘంటలాది రాథమమ్మా ,,
నాగుబాముల బట్టినావూ ,, —నీవు నడికట్టు వేసినావు ,,
జెర్రిపోతుల బట్టినావూ ,, —నీవు జడకొప్పులు వేసినావు ,,
కాలిగజ్జెలు గల్లుమనిపిస్తే ,, —నీవు ఓరుగల్లు తల్లడిల్లే ,,
ఓరుగంటి రాజులాకు ,, —నీవు, ఓంకార మడిగితివి ,,
ఎల్లు ఎల్లు ఎల్లమ్మా ,,—నీవు ఎల్లునీవు ఎదురైనచో తల్లీ ఎవరమ్మా,,*

దీనిని బట్టి ఆమె శివపార్వతుల చిన్నకుమార్తె. (పోశమ్మ జన్మవృత్తాంతమును జూడ ఆమెయే చివరి సంతానముగా తెలియవచ్చినది. బహుశః ఆమె తర్వాతనే ఎల్లమ్మ పుట్టినచో అప్పుడు పార్వతియొక్క చిన్నబిడ్డగా గ్రహింపవచ్చును.) పుట్టలోపుట్టి పుడమి పైకివచ్చినది. ఆమె నాగవన్నె చీర, నెమలికండ్ల రవిక ధరించును. నాగుబాములను నడుమునకుచుట్టుకొని, జెర్రిపోతులను జడకొప్పున బెట్టుకొని యుండును. నాగుబాములతో ఎల్లమ్మకు పుట్టుకతోడనే సంబంధ మున్నది. ఇప్పటికిని కలలో సర్పము కనిపించినచో ఎల్లమ్మ దర్శనమిచ్చినదని చెప్పు కొనుటకు పై విశేషమే కారణము. గవ్వలీమెకభీష్టము. చేతి కడియము గవ్వల కంకణము. ఆమెది ఘంటల రథము. కాలిగజ్జియ గల్లు మన్నచో ఓరుగల్లు తల్లడిల్లినదట. ఓరుగల్లు రాజులను ఓంకార మడిగినదట. ఆమె ‹ఓరుగంట వసించె నీలోత్పలాక్షి — కాకతమ్మకు సైదోడు ఏకవీర,,1. కనుక

1. క్రీడాభిరామము:- వినుకొండ వల్లభరాయడు—పద్య. 128.

నామె మహాత్మ్యము ఓరుగల్లు చవిచూచియేయున్నది. ఎల్లమ్మను గిరిరాజనందన, ఫణిరాజమండన, ఆదిశక్తి, వేదవేదాంతసార అని క్రీడాభిరామములో గొంతియాడ బడిన విషయములకును1 పైపాటలోని విషయములకును పొత్తుకుదురుచున్నది. నేను సేకరించిన మరొక సుదీర్ఘమైన ఎల్లమ్మ కథాగేయములో అనేక విషయము లున్నవి. వానినిట ఉదాహరించుట అనౌచిత్యముగా నెంచి, ప్రత్యేకముగా పురా గాథలను పరిశోధించువారికై వదలుచున్నాను.

ప్రతి యింట ఎల్లమ్మకొక గూడు యేర్పరుప బడియుండును. ఒక గుండ్రని రాగిచెంబునకు గంధముపూసి పసుపు కుంకుమ బొట్లుదిద్ది గవ్వలను గూడ అమర్చి ఆ గూటిలోదానిని 'ఎల్లమ్మ' అని నిలుపుదురు. కొన్నిచోట్ల చెంబునకు మట్టిపాత్రనుంచెదరు. గూటికి జాజుపూసి గంధము చిలికి అలంక రింతురు. కట్టినముడుపుల నాచెంబులోవేయుదురు. పరశురాముడు నరుకగా నేల బడిన రేణుకాదేవియొక్క శిరమునకు ప్రతీకగా నీళ్లుచెంబుంచి దానిని పూజించుట యొప్పుచున్న దనుకొనవచ్చును. లేదా ఇసుకతో కడవగావించి నీరుదెమ్మని జమదగ్ని రేణుకకు జెప్పగా అట్లుచేసిన ఆమె మహాత్మ్యమునకు నిదర్శనముగా నైన మట్టిపాత్రనుంచుట జరిగియుండును. ఆమెకు జరుపు ఉత్సవములలో ముఖ్యమైనపాత్రి బైండ్ల ( బవనీలు — పంబలవారు ) వారిది. వారు జమిడికలు వాయించుచు ఎల్లమ్మకథలు, పరశురాముని కథలు ఆవేశపూరితముగా జెప్పు

1. సీ॥ వందనంబిందిరా వరుగన్న తల్లికి-దండంబు ఫణిరాజ మండనకును

జోహారు రమణీయ శోభనాకారకు-నమితంబు గిరిరాజ నందనకును.

తే॥ నిత్యకల్యాణి కలికుల నీలవేణి - కాదిశక్తికి వేదవేదాంతసార

కేకపీరకు పూర్ణరాకేందుముఖికి-నఖిల జననికి సాష్టాంగ మనుదినంబు.

క్రీడాభిరామము.- ప. 127.

మందురు. బైండ్ల వారికి మాదిగ (మాత) లకు ఆమెమీద అమితమైన భక్తి. ఉత్సవములోగాని, ఉపద్రవములోగాని, వీరిలోనామె ఆవేశించి సివమెత్తించుట జరుగును. అప్పుడామెకు బలులిచ్చుట సాకపోయుట పొసగుచున్నది.

,,సాకబెట్టి నీకు మొక్కే మేకవీర-మమ్మ సాకి సంతరించమ్మ ఏకవీర
చల్లనితల్లి మీకు జాతరలు సేసేమమ్మ
నల్లావులపాలు పొంగళ్ల పెట్టేమమ్మా,, అనుచు ఉత్సవములలో మొక్కబడి చెల్లించుకొందురు. కాని, తమిళదేశములోని ప్రతియూర స్ఫోటక దేవతగా నామెపూజలందుకొనుచున్నది1. ఎల్లమ్మ గొడ్రాండ్రకు పిల్లలనిచ్చు దేవతయని అలంపురీ మహాత్మ్యమను స్థానిక లభ్యమాన లిఖిత పుస్తకమునందు వర్ణితము. ఈమెకు మేలుకొలుపులు పాడుటయును గన్పట్టుచున్నది2.

ప్రతి గ్రామదేవతోత్సవములో నూరేగునప్పుడు మొదట "బొడ్రాయి" చుట్టు తిరిగిపోవుట, కడవతో నీరుదెచ్చిపోయుట, పసుపు కుంకుమలు జల్లుట, దూపమిడుట, ఆచారములు. ఊరిముందర అడుగు ఎత్తున పైకగుపడునట్లు పాతబడియుండు నున్నని, నల్లని రాతినే బొడ్డురాయి (బొడ్రాయి, పోతురాజు) అందురు. (పోతురాజు-పోశమ్మ ఎల్లమ్మలకు సోదరుడు) అతనికి ప్రదక్షిణము

---

1. The Village Gods of South India-P. 32
2. ,,ఎడమన కుడమన ఏపవనమ్మ-ఎదురుగాను నిమ్మల వనమూ
నిమ్మల నీడన నిలిచినావమ్మా-ఏయ్‌కన్నుల ఎల్లమ్మ తల్లి
మేలుకోయె మేలుకోవమ్మా
పుట్టలోనా బుట్టినావూ-పడ్లవారింటిలో పుటుబడయ్యె
తేరుమీద నిలిచినావమ్మా-ఏయ్‌కన్నుల ఎల్లమ్మతల్లి
మేలుకోయె మేలుకోవమ్మా,,
—తెలుగులో కొత్త వెలుగులు।— టి. దోణప్ప—పుట. 195

చేసిన సంతానము, శుభము చేకూరుననని విశ్వసింతురు. ఉత్సవమునాడు శూద్రులు (బవనీలు) ఎల్లమ్మగుడి నుండి ఒక వేపకొమ్మను పట్టుకొనివచ్చి తప్పెట మ్రోయించుచు బొడ్రాతిని దర్శించుచుందురు. ఎల్లమ్మ గుడిద్వారము ,,నింబ పల్లవ నికురుంబ సందానిత నందన మాలికాలంకృత,,1 మైనదని క్రీడాభిరామము లో గూడ వర్ణితము. స్వగ్రామము నుండి ఇతర గ్రామమునకు పోవునప్పుడును మరియు పరగ్రామమును ప్రవేశించునప్పుడును బొడ్రాయికి ప్రదక్షిణము చేయుటయగును. ఈ నియమము నేడు చాలమటుకు సన్నగిల్లిపోయినది.

## మైసమ్మ:-

మహిషమే మైసమ్మ. మహిషదేవత. పశువులకధిదేవత. కట్టమీద స్థాపితమైనచో కట్టమైసమ్మయని, కోటప్రక్కన స్థాపితమైనచో కోట మైసమ్మ యని పిలుతురు. పసులకు విపరీతముగ రోగములు వచ్చినప్పుడును ఒక్కొక్క మారు పందలు నుందలుగ చనిపోవునప్పుడును మైసమ్మకు పూజలు, ఉత్సవ ములు గావింతురు. ఒక మహిషమును చిన్నప్పుడే బలిపశువుగా విడిచి (బలి పశువెక్కడ తిరిగినను ఎక్కడ మేసినను ఎవ్వరు దానిని కొట్టరు) పెద్దదైన పిదప ఉత్సవమునాడు మైసమ్మ ఎదుట ఒక్క వ్రేటున దాని మెడ నరికి రక్తతర్పణము చేయుదురు. పెద్ద మొత్తమున బువ్వవండి ఊరిచుట్టు పోయుదురు. ఆ నా డా యూరి వారు యి త ర ఊ ర్ల కు పోవుట గాని ఇ త రు లా ఊ రి కి వ చ్చు ట గా ని పొ స గ దు. ఇదొక కఠిన నియమము. నియమోల్లంఘన జరిగినచో బలియిచ్చుట నిష్ఫలమగునని భావింతురు. ఉత్సవములో ఊరనున్న బండ్లనలంకరించి గిత్తలను, ఎద్దులను దున్నలను తలేరు గట్టి ఆదేవత చుట్టు త్రిప్పుదురు. అందరా గుడి సమీపమున

1. క్రీడాభిరామము:- పద్యము-126.

వృక్షముల క్రింద వంటలుచేసికొని, మైసమ్మకు కోళ్ల మున్నగునవి బలియిచ్చి ఆనాడక్కడే భుజించుట వ్యవహారము.

ఏ పశువుగాని దారి తప్పిపోయినను, దొంగలు పట్టుకొని పోయినను ‹‹ ఊరుముందలవున్న ఓ వూరమైసమ్మ—కోడెపోయినజాడ నీవన్నగంటివా ›› అని యడిగి అది తిరిగి వచ్చుటకు మ్రొక్కుకొనుట జరుగును. ఎవరేని గుడి ముందరగా పోవుచున్నప్పుడు నిర్లక్ష్యము చేసినచో వారు చేయబోవుపనికి మైసమ్మ ఆటంకము కల్పించునను దృఢ విశ్వాస మొకటి యున్నది. బిల్లోడ మాసన్న యనువాడు గోపన్న పల్లెలో (పాలమూరు మండలం) గోపురము గట్టి యందు హనుమంతుని విగ్రహముదెచ్చి ప్రతిష్ఠింపజేయ సంకల్పించి యొకనాడు దివిటిపల్లె (పాలమూరుమండలం) గడ్డన వెలువడిన ఆవిగ్రహమును బండి మీది కెత్తించి తెచ్చుచుండ—

నీవొచ్చే తొవ్వాన నల్లాచెరువు కట్టాన
మైసమ్మా సూసేరా ఓ బిల్లోడ మాసన్న
బండీకడ్డమొచ్చింది ఓ బిల్లోడ మాసన్న

బండీ చాల జరుగదుర ఓ బిల్లోడ మాసన్న,, అట్లు బండి కదలక నిలిచి పోయినది. అప్పుడా బిల్లోడ మాసన్న ‹‹సుట్టుముట్టు సూసీనావు — కుడిసేత అంజనేయుని పట్టినావు-కిందికేమో వంగినావు-ఎడమకాలు మన్నుతోటి మైసమ్మకు మంత్రించి,, * నాడు. చల్లగా బండి కదిలినది. ఇది మంత్రగాని వలన నగు కార్యము. మంత్ర తంత్రములు రానివారు కనీసము గుడి వైపునకు తిరిగి శ్రద్ధగా మ్రొక్కినచోచాలు, ఆటంకము లడ్డురావన్న నమ్మకము ప్రజలలో బలముగానున్నది. పిల్లలుకానివారు కూడ మ్రొక్కుకొందురు.

‹‹కట్టమీది మైసమ్మ కలలోనే వచ్చింది—కాయ సక్కెరం పన్న
మొక్కంగా మొక్కంగా మొగబాలుడు వుట్టిండు
మేలగజ్జెలు సేపియర,, *

బాలమ్మ:-

సామాన్యముగా పెక్కుచోట్ల ఇంటి యిడుపున ఒకగూటిలో బాలమ్మను నిలుపుకొందురు. గ్రామదేవతగా పరిగణించుటకన్న నామెను ఇడుపు దేవతగా జెప్పుకొనుట సమంజసము. ఆమెకు గృహపతిమితముగానే పూజలు జరుగును గాని, పై దేవతలకువలె మొత్తము గ్రామమంతయు గలిసి యుత్సవము గావింపరు. పుట్టిన బాలలకు, పుట్టనున్న బాలలకు బాలారిష్ట దేవత కావున నామెను బాలమ్మ, బాలదానమ్మ అని పిలుతురు. ఆమె—

,,ఏమేమి కోరినాదమ్మ ఈబాలదానమ్మ—ఏమేమి కోరినాదమ్మ
ఇండ్లు ఇండ్లు కోరినాది—ఇంటికొక్క యిడుపు గోరె
ఇడుపుకొక్క గూడుకోరె—గూట్లా సిందూలుగోరె
మూతికొక్క బట్టగోరె—ముంగల టెంకాయగోరె,,

ఇడుపునగల గూటిలో బాలమ్మ దేవతా ప్రతిమలను (సిత్తారివారు పేడతోజేసి ఎండబెట్టి రంగులు చిత్రించిన ప్రతిమలు—సిందులు) నిలిపి ఆ గూటి ముఖభాగమున తెల్లనిబట్టను తెరవలె కట్టుదురు. టెంకాయ లర్పింతురు. ముఖ్యముగా ప్రతి శుక్రవారమునాడు దీపధూప నైవేద్యములారగింపు చేయుదురు. ఆమెకు చేయు పూజలలో లోపము జరిగినను లేదా నిర్లక్ష్యము చేసినను ఇంటికి వచ్చు బంధువులనుగాని పురిటి తల్లిని గాని పిల్లను గాని ఏడిపించుటయో ప్రాణము పోగొట్టుటయో గావించును. ,,సూడనీకె వచ్చిన చుట్టపక్కాలను – ఒక పిల్లతల్లిని వౌనరుగ కోరినాడి—తల్లిని యేడ్పించి పిల్లాను దుఃఖించె,,. అప్పుడది బాలమ్మ మాయగా గుర్తించి ,,నా పిల్ల బతికుంటె నేనొక్క గొర్రెమ్మ,, ను బలిగా నిచ్చెదనని మ్రొక్కుట చేత,,అప్పొడు మెచ్చేర ఆ బాలదానమ్మ,, *. బాలమ్మ దేవత తెలుగు సీమలోనే యున్నది. ఇతర ప్రాంతములలో మృగ్యము.

ఈ విధముగా గ్రామదేవతల ప్రాచీనత ప్రజలలో నిక్షిప్తమైన మత

భావనలు, పల్లెపదాలలో పదిలపరచబడినవి. అయినను గ్రామదేవతల పుట్టుక నెఱుంగుట కొంత కష్టమే. అవి శివశక్తులుగా తలంపవచ్చును. వానిలో కొన్ని ప్రాచీనతను మరికొన్ని అర్వాచీనతను సంతరించుకొన్నవి.

## జాతర:-

యాత్రను జాతరగా వికృతి యర్థమున స్వీకరించినప్పటికిని ఈనాడు తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలము వంటి పుణ్యక్షేత్రములనే యాత్రలను చున్నారు. అంతకన్న చిన్నక్షేత్రోత్సవములు జాతరలుగా వ్యవహరింపనైనవి. జాతరలను తిరునాళ్లన్ని కూడ పిలుతురు. ప్రతి మండలములో నాలుగైదు జాతరలు సాగుట మన మెరుగుదుము. ఆజాతరలలో పల్లీయులే ముఖ్యముగా గన్పింతురు. అసలు పల్లీయుల సందడే జాతర. జాతరలో రథోత్సవము మొదలుకొని దోపు వరకు వారిచేతనే కిటకిట లాడిపోవుచుండును. అదంతయు పల్లెవాతావరణమే. పిల్లల ఉత్సాహము, పడుచువారి పరవళ్లు, ముదుసలుల భయ భక్తులచట పెనగొనిపోయి సంబరమొప్పును. జాతర దినములలో అక్కడి మార్గములన్ని వారి రాకపోకలచేతనే జాతరసాగినట్లలరారును. వివిధమైన జాతర లున్నను, అందలి విశేషములన్ని యించుమించు సామాన్యమైనవే. కనుక ఉదాహరణమునకొక జాతరను గూర్చి తెలిసికొందము.

కోటప్పకొండ జాతర సాగరసీమలోని ఒక పెద్ద జాతర. అది గుంటూరు మండలములోని నరసరావుపేట తాలూకాలో నున్నది. కొండమీదగల దేవుడు కోటప్ప (కోటేశ్వరస్వామి). ప్రతియేడు శివరాత్రి కొకమారాయనకు జాతర చేయుదురు. వచ్చిన „పేదప్రజలందరు సోపానములు నిండు — కొండ చుట్టును రెండు కోసులా దూరాన—నిండి యుండునంటా జనము". కాబటి „ఏ దారి చూచినా చేదుకో కోటయ్య—అంచునాదము వినబడు చుండును". మరొక వంక „అందమున జనులు బృందావన భజన—పొందుగ చేయుచున్నారు". గుండమున

మునిగి తడిబట్టలతోడనే దేవాలయము సొచ్చి కొబ్బరికాయలర్పించి మ్రొక్కి ,,చాలగనుతియించు వారు—పుష్పమాలలు వేసేటివారు — జనము వేలకు మించి యున్నారు,,. భక్తజనము ,,ఈశుని కృప ఉపవాసంబులు వుండి చేసేరు జాగరంబు,, సంతానార్థమై ,,చేదుకో కోటయ్య చేదుకోవయ్యా—ఈయేటికిద్దరము నీసేవకొచ్చాము—ముందునాటికి మేము ముగ్గురం కావాలి,, అనుచు మ్రొక్కు కొందురు.

దొమ్మరి యాటలను, బహురూపములను, కోలాటములను, పలురకము లైన వినోదములను తిలకించు వారి వినోదమే వినోదముగా పదర్శితమగును. బంధుమిత్రాదులందరు కలిసికొనుట కూడ జరుగును. జాతరనిండ వివిధ వస్తు సంభారముతో నొప్పెడు దుకాణములు వెలసియుండును. దైవదర్శనానంతరము ,,తిరిగి వచ్చి దుకాణాల బారుజూచి— జడకుచ్చులు కొనువారు — కాలిమెట్టెలు వేయించువరు — మంచిగాజులు తొడుగువారు — ఓ దైవమా మము కనిపెట్టు మనువారు,, ఈ విధముగ ఆయా వస్తువులను గొనుటలో మునిగి పోవుదురు. పిల్లలు లక్క బొమ్మలు చెక్క బొమ్మలు కొనుటలో సంబరపడుచుందురు. తిను పదార్థములు కొనుట అందరికి సామాన్యమైనది. పిమ్మట వారి వారి వీలునుబట్టి తిరిగి ఇండ్లకు చేరుకొందురు.

జాతర సంబరములోబోయి తీర్థమాడిన పడుచువారి అనుభూతులేవేరు. ఒక పడుచుది ,,తిరునాళ్లనే బోయి తీర్థామాడినాక — టెంకాయనే కొట్టి దీప మెలిగించి—ఉల్లడం క్రిందుగా ఊరేగుతుంటె,, కావలసిన ,,చిలిపి వాడెవ్వడో చిన్నంగెనకొచ్చి—పంకలో చెయిపెట్టి సరసమాడేడే,,. అప్పుడది యులికిపడి ,,ఎనక్కి చూసే తలికి యెల్లిపోయినాడే—మాచెర్ల చెన్నాడే మాయల్లవాడే,,.నట. అట్లు సరసమాడిన ప్రియుని ఆ జాతర దేవునిగనో లేదా ఆదేవుడే యట్లుచేసి నాడని పయసు పొంగున అనుభూతి పొందుటయో తటస్థించుచుండును.

## మరికొన్ని విశ్వాసములు:-

ఆయా ప్రకరణములలో నింతవరకే ప్రాసంగికముగా పల్లీయులలో గల పెక్కు విశ్వాసములను పరిశీలించితిమి. మరికొన్నింటినిట తెలిసికొందము.

ఎరుక (సోది) చెప్పుట యన్నది. జ్యోతిషమువంటిది. పల్లీయులు ఎరుక చెప్పించుకొనుటలో మిక్కిలి ఆసక్తి కనబరతురు. గాలిసోకి నప్పుడుగాని గ్రామదేవతల వలన కష్టము కలిగినప్పుడుగాని చూపించుకొనుట జరుగును. ఎరుక చెప్పునది ఎఱుకత. ఎరుక అనగా జ్ఞానము. అదిచెప్పువారు ఎరుకలవారు. యక్షగానమునకు తొలిరూపముగా భావింపబడు కొరవంజియే ఎఱుకత1. కొప్పు వారకు చుట్టి, ముక్కున గుందుపోగు వ్రేలాడగ, అడ్డబొట్టు పెట్టుకొని, మూరెడు పొడవుగల సన్నని యొకసోదికోలను పట్టుకొని గవ్వదరిసెనముగల సోదిగంపను చంకనిడుకొని వంకచూపుల యొయ్యారముతోవచ్చి—

ఎరుక సెప్పింతువా అవ్వోలవ్వ—ఎరుక సెప్పింతువా అవ్వోలవ్వ

ఎరుక సెపుతాను ఎనుకముందలవినీ

-ఎరిగి ఎరుగని కతలు ఎల్లనూ తెలియగను,, అనుచు గృహములను దర్శించును. ఒక పడతివచ్చి చేయిచూపగా మొదట గవ్వదరిసెనము మీద బండారు వేయించుకొని, ఒకసేత సోదికోల పట్టించి యూపుచు ,,కుడిసేయి సూవవే దుండి—గొప్పకోరికే నీకుందండి,, అనుచు చూచి ,,ఎడమసేయి సాపు దుండి—కఱ్ఱ ఇడువక పట్టుకొండి,, అనుచు ఆ చేతినిగూడ చూచి ,,ఇదిగో గడ్డము దాక ఇంటి యాతడువచ్చు-ఇడువక జోకవే వెలది ఐదువతనమె- అదిగో

---

1. కం॥ ఎఱుకో యఱుక యటంచు
గొరవంజి నటించెనొక్క గురుకుచ చంకన్
బురుగురు బంగరు చుట్టియు
జొరిదిన్ గొల్లాపురమ్మ సుద్దులు వెలయన్.
—దశావతార చరిత్ర:— ధరణిదేవుల రామయమంత్రి-ఆ.7. పద్య.287

నాచేయి సాయదిక్కునుండి — చెయ్యటు లెత్తవేదుండి,,* అనుచు సోదికోల నెత్తించి కంఠము క్రింద స్పృశింపజేయును. అట్లు చూపుట అతివక్తైదువతనము నిండుగ ఉండునని భావము. అట్లే వారి వారికి తగినట్లు ,,అవోయమ్మ బాగ్గెంగల సేయి దానధర్మముగలసేయి దండిగలసేయి-శివరాత్రికి శివుడికి జపము చేసుకో-కొడుకు పుట్టాలని కోరుకోతల్లి- ఆదివారమునాడు అమవాసనాడు—ఆ పోశనమ్మ అణగిమణగుండు,, అనుచు సోదికోలను పొట్టమీద స్పృశింపజేసి సాముద్రికము జెప్పి గడుసరితనము ప్రదర్శించి పాతచీరగాని, పట్టురవికెగాని, సోలెడుధాన్యము గాని ఇప్పించుకొని, సోదిగంపకు మొక్కించుకొని పోవును. మన్నారు దాస విలాస నాటకములో గూడ నిట్టి విధానము వర్ణితము1. అడవి ద్రిమ్మరులైన కోయదొరలు (చెంచులు) అప్పుడప్పుడు పల్లెలకువచ్చి ,,కుయ్య తోకన్న మల్లన్న—యాడవుండవురసామి— సెయిసూస్తాం— సేమంగ సెపుతాం,, అనుచు హస్తసాముద్రికము చెప్పిపోవుచుందురు. ఇట్టి విషయములమీద దృఢవిశ్వాసము పెట్టుకొని యొకరి వెనుక ఒకరు చేయి చూపించుకొనుటకు ఆరాటపడుదురు. జానపదులేగాక నాగరకులుసైతమిట్టి జోస్యమును చెప్పించుకొనకుండ ఉండలేరు.

అపశకునముల మీద విశ్వాసము లీనాటివికావు. ఏనాటి నుండియో అనుశ్రుతముగా వచ్చుచున్నవి. ,,నొష్టబాసింగం గట్టినప్పుడు బల్లిపలికె పందిరిలోన బల్లిపలుకు యెవ్వడోవిని పట్టి ప్రాణము దీసె,, — ,,కానరాని గట్లమీన మన

1. ,,అమ్మాయమ్మ, అమ్మాయమ్మ, శెయిసూపు, శెయిసూపవేదుండి, ధనము గలశెయ్యే.ధాన్యముగలశెయ్యే బంగారుశెయ్యే బాగ్గెముల శెయ్యేదుండి, అటు నిటు సూడకనే శెప్పేగురి ఊంకొని వినపేదుండి, కండ్లంటే తోడు, కడుపంటె కొడుకు, కంటెంటె మగండు, వొండే రెండే వొండు ......,,.
మన్నారుదాస విలాస నాటకము:— రంగాజమ్మ- ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము- పుట. 37

యిద్దరికీ తలంబ్రాలు– బాయిలోన బల్లి పలికె బన్నసరము కొలుకులూడె,,* శుభసమయమున బల్లి పలుకుట అశుభమని, ముఖ్యముగా పెండ్లిపందిటపలికినచో వధువు విధవయైపోవునని విశ్వసింతురు. శరీరముమీద బల్లిపడినగూడ మంచిది కాదందురు. అది విషతుల్యమైనట్టిది.

,,కడపాదాటి నువ్వొంగ కనతల్లితుమ్మింది
బాజూన నువ్వొంగ బాపానొళ్ళు ఎదురైరి
సందూన నువ్వొంగ సాకలిది ఎదురాయె
దొడ్డెళ్లి నువ్వొంగ దోరాపుతుమ్మింది,,* ఏదేని పని ఆరంభించినప్పుడు గాని ఎవరేని తుమ్మినను, దోరాపుతుమ్మినను, బాపడు, చాకలి, పిల్లి యెదురైనను అపశకునముగా భావింతురు. అసలు తుమ్మినప్పుడు ఏపనికూడ చేయకూడదట. ఒకవేళ అట్టివి పాటింపకున్నచో అమంగళమగునని దృఢముగా విశ్వసింతురు. ఇంతేగాదు–

,,సాకలింటి ఓసమితిబిడ్డ–సలువ బట్టాలెదురుంగదేవే
కుమ్మరింటి గుండన్నకొడుక–కుండగురిగి ఎదురుంగదేర
కంపనాటె ఓకాపు కొడుక– గడ్డపార లెదురుంగ దేర,, * చాకలివాడు ఉతికిన బట్టలను, కుమ్మరివాడుకుండలను, కాపువాడు గడ్డపారలను, ప్రయాణమై పోవునప్పుడెదురుగా గొనివచ్చినచో అవి అపశకునములుగా తలంపబడుచున్నవి. మంగలివాడు కూడ అడ్డమువచ్చినచో అట్లే తలంతురు. ,,గొడార్లు సూరంత దుయ్యకురకొడుకా–గొడ్రాలు సాపెన గొడ్డలైతగులును,, గొడార్లు శపించినచో గొడ్డలితో గొట్టినంత పనియగునందురు. అందుకొరకే అట్టి వారిని శుభకార్యములకు పిలుచుటగాని పొద్దుననే మొగము చూచుట గాని మంచిది కాదందురు. ,,బొట్టులేదు జుట్టులేదు సిన్నవాడ – మొలన మొలత్రాడు లేదు సిన్నవాడ,,* ముఖమున బొట్టు, తలన జుట్టు, మొలన మొలతాడు లేనిచో అరిష్టదాయకమని నమ్ముదురు. ,,కాటుక చుక్క–బొట్లు కడిగినాబోదు– నొష్ట

వ్రాసిన వ్రాత తుడిచినా పోదు,, నొసట వ్రాసిన బ్రహ్మయ్య వ్రాతకు తిరుగు లేదందురు. పెరటి చెట్టు కొమ్మమీదనో ఇంటి గుమ్మము మీదనో వ్రాలిన కాకి అరచినచో శుభశకునముగా భావించుట యొప్పును.

కొమ్మమీద గుమ్మాకాకీ_ఇంటిమీదా దంటుకాకీ .... .... .... ....

మావాళ్ళు వస్తారంటే_మాయింటి మగవారొస్తారంటే

చుట్టాలొస్తారంటే_పక్కాలొస్తారంటే,, అని అడుగుచుండ ,,దండెం గెడమీద అరుస్తూ కాకమ్మగంతేసింది,,. అట్లు గంతేసి అరచినంతనే బంధువు లొచ్చెదరని మురిసి పోవుదురు. కాకి శకునములు పెక్కు విధములుగా కూడ నుండును. ,,చిన్నొద్దు సందూన సిలుక పలికింది_సిలుకమ్మ సకితోన ఎవ్వ రొస్తారు,, చిలుక పలికిన శకునమునగూడ చుట్టములు వత్తురనెడు మరొక విశ్వాసముగలదు.

,,నీతోనే లచ్చిమి నాకు వచ్చినదే - నువురాక ముందమ్మ నాకేమిలేదు

నువువచ్చిన గడియ యిల్లుపెరిగినదే-మరుదాల లచ్చిమి నీకుదండాలే,, *

క్రొత్తగా భార్య యింటికి వచ్చిన గడియనుండి ఆయింటి సంపద పెరిగినచో ఆమెను గృహలక్ష్మిగా అదృష్టదేవతగా భావింతురు. ఒకవేళ ఆయిల్లు నెగడక పోయినచో ఆమెనరిష్టదేవతగా తలంతురు. ఎండకాయుచుండగానే వానకురిసినచో కుక్కల, నక్కల, పిట్టల పెండ్లి యగునని యొక విశ్వాసమున్నది. కప్పలు గడప త్రొక్కినను, కప్పలెగిరినను వానరాకతో శుభము చేకూరి పొలములో కనకము పండునని గట్టిగా నమ్ముదురు.

,,కప్పమ్మ గడపతొక్కినాదీ శుభమన్న-సూచనలు చూరు చెప్పినదీ

కప్పలెగిరె వానలమ్మా పొలములో-కనకమే పండుతాయమ్మా,, కప్పలకు వానరాకడకు గల సంబంధ మెట్టిదో ఒక అస్సామీ జానపద గేయము చక్కగా

సృష్టికల్పించినది. అది సంప్రదాయాది ఆచారముల మీద దృఢవిశ్వాసమును పాదుకొల్పు చున్నది.

బాలలు నిదురపోక బెదరి బెదరి చూచినచో గాలి సోకినదందురు.

,,నిదుర పోదమ్మా మదవతీ తానెంతో
నిదుర బుచ్చినగాని బెదరీ బెదరీచూచు
లోలాక్షిరో పసిబాలలతో గూడి

ఆడుకో బోగానె గాలి సోకినదేమో,, అప్పుడది ,,భూతవైద్యుని పిలిచి వాతీ_రక్షరేకు చేతాగట్టినగాని గట్టిగా మనము వశిష్ఠుని పిలిపించి_దిష్టి విభూతైన నుదుట పెట్టినగాని_పచ్చిపసుపూ సున్నం తెచ్చి_వసంతం చేసి ఎర్రనీ నీళ్లు పోసినగాని,, * (ఇట్లు చేసినగాని) నయముకాదందురు.

చేతబడి మీద పల్లీయులకు మిక్కిలి భయాత్మక విశ్వాసములున్నవి. ,,మాయ మంత్రగాడు మందిని ఒంపెటోడు_ఆడె వందరోడు దేశందిరిగెటోడు,, మంత్ర తంత్ర యంత్రములను ప్రయోగించి గిట్టనివారిని చంపుట, వారి పశువులను చంపుట, వారి పొలములలో పంటలు పండకుండ చేయుటవంటి కృత్యములను చేతబడియందురు. అట్టి మంత్రగాడనినచో బెదరిపోవుట జరుగు చున్నది.

పాములచేత సూర్య చంద్ర గ్రహణము లేర్పడు చున్నవని పల్లీయులు ఇప్పటికిని విశ్వసింతురు. ,,ఊదల్లమర్రికింద కోరన్నపుట్ట_ కోరన్న పుట్టలో

---

. ... ... ... ... ... ... ...

O! Cloud, O! Cloud - Why do you pour?
The Frog croaks, - Why should I not pour?
O! Frog, O! Frog - Why do you croak?
The custom of my fore fathers, - Why should I give it up?
- Folk Literature of Assam. P. 41.

కోడెనాగన్న,, గలడు. పసులగాచెడు బాలుడొకడు అప్పుట్లో పాముల గ్రుడ్లన్ని పగులగొట్టుచుండ ఆ నాగన్న వాని వెంబడి పడినాడు. అప్పుడు ,,సూరన్న చంద్రన్న (సూర్యచంద్రులు) అన్నదమ్ములూ-ముత్యాల చాపలు ముందరేపరచి-చేయిచేయి కలిపి జూదమాడంగ — ఇద్దరీ చాటుకే బాలుడు,, వెళ్లి నిలిచినాడు. అతనిని పట్టిక్కకు త్రోయుటకు మనసొప్పలేదు. ,,పదదోయమేమంత పావ కారులమా-ఏడాదికొకసారి సూర్యగ్రహణము-ఏడాదికొకసారి చంద్రగ్రహణము,, అనుచు సూర్యచంద్రులు పలికినారు. పాము మ్రింగుటవలన ఈ గ్రహణములు కలుగుచున్నవని నేటికిని తాతలు మనుమలకు కథలు చెప్పుట మన మెరుగుదుము.

విజయదశమి వెళ్ళిన తరువాత రెండుమూడు రోజులు పసుల కాపరులు నూవుల కట్టెతోగాని కందికట్టెతోగాని చొప్పతోగాని సుమారు పది యడుగుల పొడవుగల, కాలుమందముగల కట్టలను కట్టుకొందురు. వానిని "కొట్టంగోల" లందురు. రాత్రిపూట కొట్టంగోల కొక కొనన నిప్పంటించి మరియొక కొనను చేతబట్టుకొని వారి వారి పసులమీదుగా త్రిప్పుచు ,,కొట్టంగోల కోడిగుడ్డుకోల-మాపసుల పిర్దులన్నీ మాతాతనువట్టా,, అనుచు పాడుచు అటు పిమ్మట వీధుల వెంబడి తిరుగుచు ఊరి వెలుపల పారవైతురు. అట్లు గావించినచో పసులకు పట్టెడు పిర్దులు, జొర్రీగలు (జొరు+ఈగలు), దోమలు వానిని విడిచి పెట్టి పోవునని విశ్వాసము. ఇట్టి విశ్వాసమే యించుక భేదముతో గుజరాతీ ప్రజలలో గన్పించుచున్నది1. అచ్చటనేగాక ఉత్తరభారతదేశ మంతటను గలదు2. మానవ జీవితములో నిట్లనేకమైన విశ్వాసము లడుగడుగున పాదుచేసికొనియుండును.

1. Folk Lore Notes:- Vol. I. P. 154
2. W. Crooke:- The papular religion and Folk lore of northern India: Vol. I. P. 71

# శృంగార జీవనము

స్త్రీ పురుషుల సంప్రయోగమును శృంగారమందురు. శృంగారమునకు రతిస్థాయిభావము. అది సంభోగ విషయికమగు ఇచ్ఛా విశేషము. అనగా యువతీ యువకుల అన్యోన్యవిషయికమగు ఇచ్ఛ. దీనినే స్త్రీ పురుషులయొక్క అన్యోన్యమైన ప్రేమరూపమగు చిత్తవృత్తి విశేషమని రసగంగాధర మౌచిత్య భాసురముగ నిర్వచించినది1. ప్రేమరూపమగు ఆ చిత్తవృత్తి విశేషమే విభావాదులచేత పరిపుష్టమై శృంగార రసముగా నిష్పన్నమగును. రత్యర్థముగా సాగు స్త్రీ పురుష నిష్ఠమైన లైంగికసంబంధ జీవనమే శృంగార జీవనము. హైందవ జీవనము ధర్మార్థ కామమోక్షముల మీద వ్యవస్థితమై యున్నందున కామము (ఇట శృంగారము) కూడ ధర్మబద్ధమై యుండవలసినదే. అప్పుడు సంభోగమనునది సంసార సాధనమైనప్పటికిని శృంగారజీవనమున ధర్మావిరుద్ధ మగు శృంగారమే ఉత్తమమైనది. ఉపాదేయమైనది. ఆనందజనకమైనది. మానవ జీవితములో శృంగారము వసువతించి సాగు జీవన మహౌక చలత్తుంగ తరంగ పూరము. తద్వాతావరణ మంత నిరంతరమైన విందువసంతము. శరచ్చంద్రికా విలసితము. మకరందతుందిలము.

ఇంత వరకే ఆయా ప్రకరణములలో ప్రసంగవశమున జానపదుల శృంగారమును గూర్చి తడవుటయైనది. ఇట సమగ్రమైన వారి శృంగారజీవన మెట్లు పల్లెపదములలో ప్రతిబింబితమైనది తెలిసికొందము. పల్లీయులు తమనిర్విరామ కృషిలోని శ్రమను నివారింపజేసికొనుటకై సద్యస్ఫూర్తిగా నల్లుకొనుపదము లందు శృంగార పదములే అమితముగానుందును. అది వారి సహజ కామేచ్ఛను

1. ,,స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషోరతిః స్థాయి భావః,, —జగన్నాథపండితుడు— రసగంగాధరము—ప్రథమాననము

దెలుపును. కనుక, వారి కామేచ్ఛా ఫలితమైన శృంగారజీవనమును ప్రత్యేకముగ దెలిసికొనుట అవశ్యము. పల్లెపదములలో నడుగడుగున శృంగారము నవనవ లాడుచుండును. అదిపల్లీయుల నిత్యజీవితములోని సత్యము. తదభిముఖముగా వివిధ కులములలోని వైవిధ్యమునకు ఏకాత్మత కుదురటయేగాక సామాజిక ప్రగతి చేకూరుచున్నది. ఇప్పట్టున వారి మనస్తత్త్వ రహస్యములు కొన్ని అప్రయత్నముగా, అనాలోచితముగా బహిర్గతములగును. శృంగారజీవనమునకు వర్తించు వలపుపాటలలో స్త్రీని గూర్చి పురుషుడు, పురుషుని గూర్చి స్త్రీ పాడు కొనునవియేగాక, పరస్పర సంవాదరూపకములు, మన్మథావస్థలు, ఉద్దీపనములు, సంభోగశృంగారము, విప్రలంభ శృంగారములనుదెలుపు పాటలునుగలవు. అవి నిత్యచైతన్యవీచికలు, రసమయానంద డోలికలు.

పల్లీయుల శృంగార జీవనమంత వ్యవసాయ పరిసరముల తోడనే ముడివడి యుండుట సహజము. చెట్టుచెంతన, పుట్టపొంతన, కుంటకట్ట మాటునః బావిగట్టున, కంచెమలుపున, మంచెమారున, చేనిలో, తోటలో, పూదోటలో, వారి విలాసజీవనమ మొగతొడిగి, మొగలిపూవై పరిమళించును. చిట్టి పొట్టి చిన్న వాడొకడు చిన్నదానిని జూచి గుటకలెన్నియో మ్రింగి, చెట్టు చాటున సద్దుసేయక ముద్దుమురిపెములాడినాడు—

సిట్టి పొట్టి సిన్నవోడా—సిన్నదాన్ని సూసినావా
గుట్టులేక మట్టు విప్పి—గుటకలెన్నో మింగినావా
సెట్టుసాటు సున్నదాన్ని—సద్దూసేయద్దురో బావా నాబావా

ప్రేమకలాపములకు చేలు రహస్య స్థావరములు. గాంధర్వ వివాహములకు దోహదములు. నిండువలపులు పండు పంటకళ్ళములు.

కందిసేన్ల నిలబాడి—కన్నుగీటవే పూసలోళ్ళరాజమ్మ
సెనిగెసేన్ల నిలబాడి—చేయిజాపవే పూసలోళ్ళ రాజమ్మ *

చేని వంపులలో మేని సొంపులతో కంటిబాసకు, చంటియాసకు, చేయిచేయి

కలిసి పోవుట జరుగుచున్నవి. అదిచూచి కందిపూసెనేమో? కాసెనేమో! గడ్డి మోపు ఎత్తుమన్నదాని కొంగు కొసరిలాగుట యది ప్రియునిచేతి చిలిపితనము.

"ఎగువసేలో గడ్డికోసి—దిగువసేలో మోపుగట్టి

ఇట్లమోపెత్తి పొమ్మంటే—కొంగులాగి పోయేవేమిరో," ఇట్టి శృంగారాత్మకమైన చిలిపిచేతలు వ్యవసాయ శ్రామికులలో సామాన్యము.

ఎందుకో నినుకొంటి గోంగూరకి — అమ్మ
ఎందుకోనినుకొంటి గోంగూరకి
పుట్టెక్కి సూశాడు గోంగూరకి —వాడు
చెట్టెక్కి సూశాడు గోంగూరకి
చెట్టుదిగి నవ్వాడు గోంగూరకి —వాడు
మోపెత్తమన్నాడు గోంగూరకి
పట్టుపట్టమన్నాడు గోంగూరకి —వాడు
ఎత్తు ఎత్తుమన్నాడు గోంగూరకి
చేయి పట్టుకున్నాడు గోంగూరకి —వాడు
చెక్కిలిని పుణికేడు గోంగూరకి
కళ్లలోకి సూశాడు గోంగూరకి —అమ్మ
ఒళ్లు పులకరించింది గోంగూరకి,

గోంగూర తోటకు వచ్చిన పిల్లదాని చూపులో ప్రియుడు సుడిగొన్నాడు. ఆ విలాపములు సహజకోమలములు.

కట్టమీద కలిగావసెట్టుమామ—సెట్టు కింద ఎల్లమ్మ పుట్టమామ
నాటీగెంటీల జోడుమామ—నీ పక్కలన్న పడ్డదేమొ సూడుమామ

నాటీ గెంటీల జోడు మామ * కట్టమీది చెట్టు క్రింద గల పుట్టచెంత పడుచువారి సంభోగ శృంగార మభివర్ణితమైనది. రత్యవస్థలో నది భోగావస్థ. కాని, అది ధ్వన్యాత్మకముగా వారి గుండె నుండి ధ్వనించినది. గెంటీలజోడు

ఊడిపోయి ప్రక్కలోబడుటయన్నప్పుడే ఆమధురభావము వారితన్మయత్వమును దెలుపుచున్నది. మేనమామను వివాహమాడు ఆచారముండుటవలన చెలికానిని 'మామ' అని పిలుచుటయైనది. సాగరసీమ పాటలలో నిట్టి వ్యవహారమెక్కువగా గన్పించును. పడుచువాడు గోంగూరకు పోవుచున్నదానిని ,, కంచవతల నుండి పొంచి పొంచి చూచినాడు—నుంచుంటే నాజాద నూగుమీసం దువ్వినాడు,, అది కట్టమీదుగ బోవుచుండ, ,,కట్ట పొంటీ పోయేదాన కాటుక చీర ఆడదాన—కట్టు కొంగుకు మరకలేమో,, అడుగగా నది ,,అన్నెమెరుగ పున్నెమెరుగ చిన్ననాటి జీడిమరక,, యని చెప్పినది. ఇట్టి కొంటె మాటల తోడనే కొంగు కొంగు ముడివైచుకొనుట యగును. అప్పుడు కొంగువరువనిదినమే యుండకపోవును. ,,కొత్తకుంటా కోపిలోనా నాసామి—కొంగువరువని దినమె లేదు నాసామి,, *. కొన్ని పల్లెటూళ్లలో త్రాగునీటికై చేరువలో నుండెడు చెరువునకో, కుంటకో పోవుటయగును. అట్లు పోవు పడుచుది ప్రియునికి కొంగుపరచి కొడుకును గనుట తటస్థించినది—

,,కడియాల కుంటాకు నీళ్లాకు నేబోతే-కవిలిముల్లు దగిలి కడుపాయెరాజ
తుమ్మల కుంటాకు నీళ్లాకునేబోతే—తుమ్మముల్లు దగిలి తిమ్మణ్ణినేగంటి,,

వంగతోటకు వచ్చిన గంగమ్మను జూచి దాని వలపుకాడెట్లు వలచినాడో చూడనగును.

వంగసెట్లా పక్క గంగమ్మా — నీవు వంగి సూత్తుంటె గంగమ్మా
పానం జల్లుమనె ,, — నీవు పక్కకెందుకురావు ,,
పక్కాన నిలుసుండి ,, — నీవు ఒక్కసారి ముడితె ,,
నీ కంట్లోకి సూత్తానె ,, — నేనొల్లు మర్సిపోతానే ,,
అనుమాండ్ల గుడికాడ ,, — నువు వంగి మొక్కంగా ,,
నీకొంగు జారెనే ,, — బుద్దితీరంగ జూస్తినే ,,
మాయింటి యెన్కాల ,, — పూలసెట్లల్లోన ,,

పూలు తెంపుతుంటె ,, — నీ సీర సినిగిపోయె ,,
సీర పోతేపోయె ,, — ఒక్కసారి రావె ,,
వచ్చిసూడకుంటె ,, — నేన్నచ్చి పోతానె ,,

వంగతోటలో గంగమ్మవంగిచూచినప్పుడు ఆ వయసు పొంగును కనులారగాంచి వలపుకాడు వలజిక్కినాడు. ఒకమారదివచ్చి యెదుట నిలుచున్న చాలునట. దాని కనులలో నొడలు మరచి పోవునట. అంతకు పూర్వమే యొకమారు హనుమాండ్ల గుడిచెంత వంగి వంగి మ్రొక్కుచుండ జారిన అకొంగు చాయన స్తనమండల రుచిని బుద్ధితీర రుచి చూచినాడు. పూదోటలో పూలు తెంపు వప్పుడు చినిగిన దాని చీరపాటున సింగారమును పసిగొన్నాడు. కనుకనే యట్టిదొకమారైన వచ్చి చూడకపోయినచో చచ్చిపోయెదననక మరేమి యనును! ఎలచుటలో నిట్టి విశేష ములను పటకించుట పల్లీయులలో సామాన్యము. మన్మథ దశావస్థలలో 1 చక్షుః ప్రీతి మనస్సంగములను నవస్థలు పై పాటలో గోచరించును. ప్రబంధ నాయికా నాయకులకేమాత్రము తీసిపోరు జానపద నాయికా నాయకులు. ఒక్కొక్క పట్టున వారికి దెలియని నర్మభాషణములు, అనుభవములు, ఊహలు వీరికి దెలియును. పూదోటలో, బండ్లబాటలో, మర్మమిచ్చి మంచి మాటలిన్ని పంచు కొని మరులు పెంచుకొనుట పొసగుచుండును. ,,పూలతోటలో బండ్ల బాటమ్మి పెరుమాళ్ళచిన్న—బండ్ల బాటల మంచి మాటమ్మి,,. అపుడు ,,కొత్త కుండలో సీరుతీపి-కోరిన మగవాడు తీపి,, యగుట వలపుల దొంతికి లెస్స.

ప్రేయసీ ప్రియులకు వెన్నెలలు, అవన్నెలు, పైర గాలులు, పూల గాలి తరంగములు, కనుగొలుకులకులుకులు, తళుకులు మున్నగునవి కామోద్దీపకములు.

1. చక్షుః ప్రీతిః మనస్సంగః సంకల్పోత్పత్తిః నిద్రాచ్ఛేదః తనుతా విషయేభ్యో వ్యావృత్తిః లజ్జాప్రణాశః ఉన్మాదః మూర్ఛామరణమితి తేషాంలింగాని.
—వాత్స్యాయన కామసూత్రములు; అధికరణము. 5. అధ్యా. 1. సూ. 5.

ఆ మనోహర పరిసరములలో చేనిచెంత కలిసికొనుట పరిపాటి. సంకేతమును జేర బోవునప్పుడు ప్రేయసిని, ,,తెల్ల జొన్నల రొట్టె యెన్నబూసి యెంటతేవే— పల్లె దగ్గర తోటకాడ మంచి మల్లెపూలు తేవే,, అన్నాడు ప్రియుడు. పిదప ఆ పండు వెన్నెలలోని ,,నేడేడు సీడలోన నీ బారెడంత జడనుజూపు,, మని కోరుకొన్నాడు. అప్పుడు ,,అందమైన నీదుమోము చందురుణ్ణి మించింది,,. * వారు ప్రేమించుకొని పలుకరించుకొనుట యిట్లున్నది—

పు: అయ్యేది మందూ నాగూలయ్యేది మందూ
రంగాడియ్యావెమందూ మింగానియ్యెదె మందూ

స్త్రీ: మూడూ సింతలకాడా మూలామలుపులకాడా
ముచ్చాటాడవు పిలగో నల్లా సారంగులయ్యా

పు: మూడూకాల్వలు దాటీ మూడూ మడతలుదాటీ
మూలా మలుపుకురాయే రంగూ రింగుల లింగీ

స్త్రీ: అడ్డాబాటల కాడా బుడ్డానిమ్మల కిందా
బుద్దీ సెతిరెను పిలగో నల్లాసారంగులయ్యా

పు: వారా వారమునాడు సుక్కూరారమునాడూ
గుడెపూ యంగడిపిల్లో రంగూ రింగుల లింగీ

స్త్రీ: గుడెపూ యంగడివోయి గుత్తెపు పీరలుదేరా
గుండిల రైకలుదేరా నల్లాసారంగులయ్యా

పు: గుత్తెపు సీరలు గట్టుక గుండిల రైకలు తొడుగుక
మోతూ కుళ్లకురాయే రంగూ రింగుల లింగీ

స్త్రీ: వొస్తే వొస్తనుగానీ పోతే పోతనుగానీ
మందే వోర్వరు పిలగో నల్లాసారంగులయ్యా

పు: జొన్నలు మనవీ జొన్నారాసులు మనవీ
రాసుల కాడికి రాయే రంగూ రింగుల లింగీ

స్త్రీ: వాస్తే వాస్తానుగనీ పోతే పోతనుగానీ
మందే వోర్వరు పిలగో నల్లా సారంగులయ్యా *

పొలమునకు బోవునప్పుడు అడ్డబాటలోనున్న బుడ్డనిమ్మల క్రింద సారంగులయ్యను జూచినది తడవుగ లింగికి బుద్ధిచెదరినది. వానిమీద మరులుగొన్నది. మూడు చింతలున్నచోట మూలమలుపు బాటలో ముచ్చటలాడుటకు సంకేతమును బెట్టుకొన్నది. శుక్రవారమంగడికిబోయి గుత్తపుచీర, గుండిలరైక తెమ్మన్నది. వాడవి తెచ్చియిచ్చి మోదుగు పొదలోనికి బోవుదమన్నాడు. కాని, మంది ఓర్వజాలరని లింగి మారు బలికినప్పుడు, వాడు కళ్లములోని రాసులచెంతకు రమ్మనుట జరిగినది. వారట్టి సంకల్పోత్పత్త్యవస్థలో తారాడుటయైనది. ఈ విధముగా వారి ప్రేమ కలాపములు ప్రకృతిలో పరవళ్లు త్రొక్కుచుండును. పచ్చని పంట పొలములే వారికి రమణీయ బృందావన సీమలు. నందన వనసీమలు. పొలములందే గాక, అంగళ్లకు బోయినప్పుడు గూడ వారి మధ్య ప్రేమ చిగురించుట, పెండ్లికిదారి తీయుట జరుగును. ,,ఏలూరు సంతలోన వీరగౌరు — నిన్నెంచి ప్రేమించలేద వీరగౌరు— కోరుకొండ బజారులోన వీరగౌరు — నిన్ను కోరి పెండ్లాడ లేద వీరగౌరు,,. నగర వీథులలోని నాగరకుల కన్న అంగళ్లలోని జానపద ప్రేయసీ ప్రియుల ప్రేమలో నిష్కల్మష మెట్టిపడుచుండును. వారి వీధిలోని ప్రేమ వీధి పాలేగాని, వీరి అంగడి ప్రేమ కొంగున గట్టుకొనుట ప్రశంసార్హము. బ్రతుకు ఛిద్రమైనను ప్రేమలో కొదవగన్పట్టదు. వీరు ప్రేమించుకొనుటలోని అభిరుచి, అనురాగము, అపూర్వముగా నుండును. చూచుటకు మోటు మనుషులుగా గన్పించెదరేగాని, శృంగార విషయమునగూడ వారు నాగరకుల మనుకొనువారికే తనుగుట్ట గల చేష్టలు గలవారు. నఖశిఖ పర్యంతము వారి చూపులు మన్మథుని తూపులై ప్రియుక్తములగును.

గైరమ్మో లేగైరమ్మా — విన్నే తల్లిగన్నదే గైరమ్మా
సీముకెక్కంత చక్కనే గైరమ్మా—సీముక్కు నత్తెంతఅందిమే గైరమ్మా

నీ నడుమెంత చక్కనే గైరమ్మా-నీ కాలి అందెలెంత అందమె గైరమ్మా
నీ వొల్లెంత ,, ,, నీ వొల్లుమీద నగలెంత ,, ,,
నీ కళ్లెంత ,, ,, నీ కళ్ళ కాటుకెంత ,, ,,

తొలుదొలుత చూపులు ముక్కు మొగముమీద పోవును. అవి చక్కగా నున్నచో వానికి మొదటితృప్తి. పిమ్మట తక్కిన అవయవ సౌష్ఠవముమీద కన్నువ్రాలును. ముక్కు, ఆముక్కుమీద నత్తు, నడుము, నడుముమీద యొడ్డాణము, కాలు, కాలియందెలు, ఒడలు, ఒడలిమీద నగలు, కండ్లు, ఆ కండ్ల కాటుక ఎంతో అందముగా నుండవలెనని ప్రేమికుడు కోరుకొనుట స్వభావము. పురుషునకు రతినుద్దీపింపజేయు స్త్రీ యొక్క అంగాంగవర్ణనమీ క్రింది పాటలో గలదు.

కందిరీగ నడుముదాన్ని ఎట్టాపోనిత్తురా
వాలుచూపు కళ్ళదాన్ని ఎట్టాపోనిత్తురా
పికిలి పిట్ట గొంతుదాన్ని ఎట్టాపోనిత్తురా
చింతపువ్వు రంగుదాన్ని ఎట్టాపోనిత్తురా
అట్టా ఇట్టాటిదాన్ని ఎట్టాపోనిత్తురా *

పిడికెడు నడుము, పికిలిపిట్టగొంతు, చింతపూవన్నె మేని సొగసుగలది చిక్కని అందకత్తె. అది ఓరచూపులతో జూచిన కరుగని మగవాడుండగలడా! కనుకనే దాని వలజిక్కుటయైనది. పల్లీయునికి శృంగారజీవనమున అనుభవములుపెక్కు. పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని వంటి స్త్రీజాతి భేదములలో వానికి సాధారణముగా పద్మినీ జాతిలక్షణములుగల దాని మీదనే మిక్కిలి మక్కువ. అనేకమైన పదాలలో నీ విశేషము గోచరించును. „కాలు కురుచదీ కంచురవికదీ—కనుమలో ఎదురాయె—దానీ కన్నుసైగలు తిప్పుతుంటె—నా మనసు చెదరిపోయె„ * నట. అది సంకల్పోత్పత్త్యవస్థ.

విన్నా నేను మరువలేనే మరువనన్నా మరువలేనే
అందాలదాన ఆనందాలదానా

చారెడేసి కళ్లదానా సంపంగి ముక్కుదానా
పసిమీ వన్నెలదానా మిసిమీ బుగ్గలదానా
తెల్లనీ పలువరుసదానా తేనె తేట పలుకుదానా
హంసా నడకలదానా అందమైన నడుముదానా
అందాచందాలదాన చందురు మొగముదానా
కారుకేశాలదానా తీరు కనుబొమలదానా

ప్రేమికుని చూపులు ప్రియురాల చంక మూలల సొగసు మీద, చంటి ముకుళల వయసుమీద ఉక్కిరి బిక్కిరగుచుండును. లేడికన్నులకు, లేతనవ్వులకు, హంస నడకలకు, ఆ నిలువు సక్కదనమునకు సొక్కి ,,కంచు గుబ్బలు కదులమీట,, నుత్సహించును. తాను కామించిన పడుచు కనుల నిండ కమ్మగ కన్పట్టవలె ననెడు భావమున తలమునకలు వేయుచుండును. అట్టిది దారికడ్డము వచ్చినప్పుడు తన మీదుగ దాటి పోయినను, తొక్కి పోయినను, ఇంచుక నిలిచి పోయినను, ముఖమెత్తిచూచినను అమృతమందించినట్లగును.

దారికడ్డం బండుకుంటా మర్దాలా మలమ్మ
దాటెన్నా వోరాదే ,, ,,
తోవకడ్డం బండుకుంటా ,, ,,
తొక్కెన్నా వోరాదే ,, ,,
నిన్న దెస్తి నీలిసీరె ,, ,,
నిలిసెన్న వోరాదే ,, ,,
మొన్నదెస్తి మొగ్గలరైక ,, ,,
మొకమన్న సూపరాదే ,, ,, * ఇటు లజా ప్రణాళనావసలో దగులు కొనుట యగును. కాని, ప్రేమయే కుదురనిచో స్త్రీ—

,,మావూరు లేలా మాపల్లెలేలా – నాతోని ముచ్చట్లు నీకేలపోరా
నా ముద్దు పలుకులు నీకెందుకు—నావూసు నాజోలెందుకయ్యా నీకు

,,నోటి పట్టపు కూతలు కూసావు — మోటుమనిసిపేటి అయ్యా నీవు,,* అని పురుషుని తీసి తీసిపెట్టుట జరుగును. అదే కరగినచో వెన్న, లేనిచో సున్న. కానీ, మోటుసరసమే చేసినచో మూతిపండ్లు కూడ రాలకమానవు. ,,మామిడిచెట్టు మాటునున్న మాలపిల్లనీ నీవేచూసీ పళ్లయిమ్మనీ సైగచేశావా — ఓరోరి మామ పళ్లలోనే పళ్ళు రాలాయా,,. ఇట్టి మనస్తత్త్వము గలవారు పల్లెభామినులు. అట్లే స్త్రీ ఎంత ప్రేమించినను, యత్నించినను లొంగని పురుషులు లేకపోలేరు—

చిక్కులా సిరిచాపలో నే నొక్కదాన్నె పండుకుంటి
చిక్కుదీసి కొప్పుపెట్టి సిరిగంధం బొట్టుపెట్టి
మంచిగంధం మల్లెపూలు డొల్లలోనెపోసుకోని
అంది అంది పూయబోతె అలిగిపోతాడేమె లచ్చు .... .... .... ....
ఉప్పునీళ్ల బాయికాడ మరుమల్లె తోటకాడ
ఉత్తుత్త మాటలాడి ఊకెపోతాడేమె లచ్చు
కుచ్చుం కుచ్చుం నేనుబెట్టి కుచ్చులాంటి చెప్పులుగొని
పట్టి పట్టి తొడుగబోతె పారిపోతాడేమె లచ్చు—

వీడెవడో ప్రవరాఖ్యునివలె నున్నాడు. వన్నెలాడి యెంత వగలు సేసినను సుంత కరుగనైన కరుగలేదు వాని మనసు. దానికి వరూధినికి పట్టిన గతి పట్టినట్లున్నది.

ప్రియకాంతలను జేరబిలుచుటకు ఈలవేయుట, అన్యాపదేశముగా కేక లిడుట, పాటపాడుట జరుగును. ఆ యా పనులుచేయుచున్నప్పుడు సహితము పిలుపులు ఆయా సన్నివేశములను బట్టియుండును. ,,దొరగారి జీతగాడు దొరెద్ల మేపెటోడు—దొడ్డెక్కి సీటిగొట్టేనే — పటేండ్ల జీతగాడు—పైయెద్ల మేపెటోడు బండి మీద సీటి గొట్టేనే,,. * ఎద్దుల మేపువాడెద్దుల కొరకు వేయు కేకలో ముద్దరాలి రాకడ ముద్దుగ ఉండును. ,,ఎడ్లామేపే చిన్నావాడా ఎడ్లాకేపే పోలికేకా నాకుయేస్తే నేనురానా,,. మోటకొట్టువాడు ,,కొవళ్ళు బలమాయె కల్లలడ్డమాయె—

కాచిన ఫలమేమి లేదిపో చిలకా,, అనుచు తన్ను జేరవచ్చెడు ప్రియకాంతకు సూచన యిచ్చును. చేని కావలికాయుచు డేగ పిలుపులో చేడెను పిలుచును. ,,నిన్నుజూడక నిలువలేను—నీళ్లరేవున జొన్నచేనూ—జొన్నమీదా డేగనీడువూ—డేగపిలుపుల నన్నుబిలువూ,,.* కలిసికొనుటకు సమయముకూడ కలిసిరానప్పుడు ,,సెనిగెపూలా చీరదానా—సెందురొంకా నుదురుదానా—అంచవంటీ నడుముదానా—మంచు(మనసు) వోయే మాల్లిరాయే,, అనుచు కూనరాగము లాలపించుచుండును.

ప్రియులను వలచుటలో ప్రియభామినుల కభిరుచులు, మర్మములు ప్రత్యేకముగానున్నవి—

,,ఆదండు యెల్లిపోంగా పొగబండీ నట్టనడుమా
అరె|శానతనము జేస్తావు మొగడా వన్నెకాడా
నీ తెల్లదోతిమీద నీ నల్లరుమాలు మీద
నమ్మె నామనసు వన్ను ఇడిసిపోకు,,— తెల్లదోవతిని, నల్లని రుమాలును జూచియేగాక, ప్రియుని మోమును చంద్రబింబముగా దలచి ఆ నగుమోమును వలచి, వ్రేళ్లనిండగల ఉంగరములను, బంగారుమొలత్రాడును ఉంగరాలజుట్టును, ఓరగజుట్టిన తలపాగను, కావిపంచెల కట్టుతీరును, నూనూగు మీసపు కట్టును పసిడివన్నెను, పిక్కసొగసునడకను, మున్నగునవి చూచిప్రేమించుటయొప్పును.

పిక్కల సన్నంపు బిగువైన మగవాడు చందమామో—వాడి
భుజాన వున్నది భూచక్రి తంబళి ,, ,,
కల కలా నవ్వాడు కన్నెత్తి చూడడు ,, ,,
కావిపంచెల మీద కస్తూరి తాపిస్తు ,, ,,
బంగారు చెక్కిళ్ళు రత్నాలు మెరిపిస్తు ,, ,,
ముద్దయిన మోముపై ముత్యాలు విరబోతు ,, ,,
నూనూగు మీసాల వలపు తీగలు పాకిస్తు ,, ,,
బంగారు మొలతాడు పె పెన మెరిసింది ,, ,,

ఉంగరాల జుట్టు రంగైన మగవాడు చందమామో,,

అట్టి ప్రియుడు జూచిన చాలు స్వర్గమే దరిదాపగునట. పలికినచాలు ప్రాణముచే వికసించునట. ఆ మగవాని కౌగిట మరణించిన చాలునట. ప్రేయసి కౌగిట ప్రియుడు, వాని కౌగిట నది వెన్నవలె కరగిపోవుట సహజము. తుదకు ప్రియుని కౌగిట మరణించినను మహాభాగ్యమే యని కోరుకొనుట మహోన్నతమైన అనురాగ లక్షణము. అట్టివాడు కంటబడకున్నను, విడిచి పుచ్చినను చచ్చినంత పనియేయగును. ఈవిధమైన అనురాగ బంధములు పల్లీయులలో సాధారణము. పరస్పరము ప్రేమించుకొనుటకు ప్రథమాకర్షణము రూపరేఖల ప్రభావమే. పరస్పర రతిసుఖమునకది ప్రబలోద్దీపనమగుచున్నది.

పు: రూపాయి కావాలా రూపాయి చిల్లర కావాలా పిల్లా

స్త్రీ: రూపురేఖ సల్లగుంటె రూపాయెందుకు

రూపాయి సిల్లరెందుకు నా నల్లజీలకరి మొగ్గ

పు: పావలా కావాలా పావలా డబ్బులు కావాలా పిల్లా

స్త్రీ: పాదాలు సల్లగుంటె పావలెందుకు

పావలా డబ్బులెందుకు నా సల్లజీలకరి మొగ్గ

పు: సీరెలు కావాలా సిల్కు సీరలు కావాలా పిల్లా

స్త్రీ: సిరిగల నీమోము సూత్తె సీరెలెందుకు

సీరలెందుకోయి బావా నా నల్లజీలకరి మొగ్గ

పురుషుడెట్లు స్త్రీలో రూపురేఖలకై ప్రాకులాడునో అట్లే స్త్రీకూడ అతనిలో సిరిగలమోమమరు రూపురేఖలనే ఆశించును. ఇక రొక్కమెందుకు? ఆ తరువాత మనసు మంచిదయితేచాలు. అదేపదివేలు. అయినను కొందరు స్త్రీలు చీరలు, నగలు, కూడ కోరుకొందురు.

చంద్రగిరి సీరలంపారా ఓరందగాడా బంగారిమామా ॥చం॥

కాకినాడ కర్ణాటపుకోక రాజమండ్రి రవ్వలజోడు

పెద్దాపురం దుద్దుబజత ఉప్పాడ జరీరవిక
కచ్చాలా కుచ్చుగట్టి కూకుంటె నీవొళ్ళొ
కూకుంటే నీ సందిట్లో కునుకు వీత్తే
నా గొంతులొ కూనిరాగల్ పలుకుతాయి—

చీరలు, నగలు అలంకరించుకొని ప్రియుని సందిట కూర్చొనగానే కునుకు తీయుటయేగాదట, గొంతులో కూనరాగములు కూడ పలుకునట. ఇట్టి తన్మయావస్థకా చీరలు నగలుకూడ ఉద్దీపకములగుచున్నవి.

వలచిన వన్నెకాడు బండిమీద పోవుచుండుటగాంచి, „అపునెద్దు బండ్డికట్టి— పడువు పరువున పోయెవాడ — బండి నిలిపి బాసలాడరా„ అనుచు బండివెనుక పోవుచునే, „నిలవర బండోడో నీబండిమీన నేనొస్తా—నిలవర బందోడో నీబండి మీన సోకుంది„ * అనుచు చంగు చంగునచేరి బండియెక్కి అందలి సోకేమిటో అనుభవించును. ఏపని చేయుచున్నను ప్రియునికై దెసలంటజూచుటయొప్పును. „నే తొక్కనూరే దిక్కడా—నా తొక్కలాటంతక్కడా—నేకాటుకెట్టే దిక్కడా— నే కన్నుగీటేదక్కడా„* పడుచుది పచ్చడి నూరుచున్నను వాని మీదనే దానికి త్రొక్కలాపైనది. కాటుక దిద్దుకొను చున్నను వానికై కన్నుమీటుచున్నది. పాపము! ఆడ్డగోడ మీద నుంచియైన అందుకొని ముద్దులివ్వదలచ, మొగమంత కన్నులై పండువెన్నెలై చందురుడు నూచి దాని గుట్టు బయలువెట్ట పట్టపగలు సేసినాడు. „అడ్డగోడమీదికెల్లి అందిముద్దులిత్తమంటె— పాపకారి సందమామ పగులు సేసేరా„. సద్దు మణగిన త్రోవలో కంచెదాటి పోదామనుకొన్నను కడకు గజ్జెల పైటకొంగు ఘల్లుమన్నది. ఒడలు జల్లుమన్నది. „ఎలుగు (కంచె) మీద కొంగువరసీ ఎలుగు (వెలుగు) దాటివత్తమంటె — గజ్జెలాది పైటకొంగు ఘల్లు మానెరా—ముచ్చాలాది పైటకొంగు ముల్లువాకి జల్లుమానెరా„. *

ప్రియుల రాకపోకల సన్యాపదేశముగా నిర్దేశించుటలో స్త్రీల నెరజాణలు. „రావే పోవే నల్లతుమ్మెదా—నీవు రాగాలుతీయకె నల్లతుమ్మెదా—వాడ నెవ్వరులేరు

తుమ్మెదా— పచ్చి వాలలాడిపోవే తుమ్మెదా,, * ప్రియుద యెదలోని రొదను తుమ్మెద మీద మోపుట యది ప్రియుని యెదమీటు పదమే. వన్నెకాని హొయలకు, కన్నులయెఱకు జిక్కిన చిన్నదాని తనువునందణువణువు పరవశించి పోవుటవలన, చేయనున్న పనిచెల్లక మిగులుచున్నది—

వొద్దొద్దుమామా ఓమామయ్యా—రావొద్దు మామా ఓమామయ్యా
ఈదుల్ల పాడితే ఇంటికినవడె మామ
పదమిన్నప్పటి నుంచి పనిసెయ్య బుద్దికాదు
కట్టెల కొయ్యంతాన కన్నుగొట్టకుమామ
కన్నుగొట్టితె కట్టె ఇరుగాదె ఓమామ
వొడ్లుదంచింతాన వొగలు సెయ్యకు మామ
వొగలు సేసిన వొడ్లు వాయి మెదుగదు మామ
సీళ్లకొయ్యింతాన నిందెగట్టకు మామ
నిందె గట్టిన బిందె నిండాదె ఓమామ
సల్లసేసింతాన సైలసెయ్యకు మామ
సైలసేసిన యెన్న యెల్లాదే ఓమామ * ఇంత మనోహరముగా ప్రేమైక తత్త్వముగలదిగుట అపూర్వము. మోడు వెడదను చివురింపజేయు మోహన మురళీరవము గోపిక యెదలోపలి యెదలో మారుమ్రోగినట్లు, ఈ జానపద సుందరుని పాట అతని సుందరి డెందమున కందళిత పుష్ప మకరందము చిప్పిల జేసినది. తత్ఫలితముగ చేయదగు పనులమీద నిట్లయిష్టమేర్పడుస్థితియే విషయవ్యావృత్త్యవస్థ. ,,పిల్లన గొయ్యి పాడుకుంట పిల్లబాట కెల్లిరాంగ పిల్లంగొయ్యి పిలుపులకయ్య నా రామయ్యా—పిక్కలో జల్ జల్ మానెనయ్య,,* వాడూదిన పిల్లనగ్రోవినాదము దాని తనువులోని అణువణువును స్పందింపజేసినది. ,,నాగసరం బాడుకుంట నడిబాటల కెల్లిరాంగ—నాగసరం వాదులకయ్య నా రామయ్యా—నడుములో జల్ జల్ మానెనయ్యా,, వాడు నాగస్వర మూదుచు రాగ అదినాగుబాము సదకతో దరిజేర బోవక యుండగలదా? పిల్లనగ్రోవి

నాగస్వరముల నాదములు దాని కుద్దీపనమును గలిగించినవి. లయాత్మకములైన పల్లెపదములెంత అందమో, తీయనో అట్లే వాటిహొయలు అందముగా తీయగా నొప్పును.

పొట్టిగా నల్లగా నున్నందున, తన్ను వలచుటలో వెనుక ముందాడెడు ప్రియునకిట్లు విడమరచి చెప్పుచున్నదొక ప్రౌఢ-

పొట్టిగా నే వుండనాని పొందకా పొయ్యేవురార
పొట్టిదాని గట్టితనము పట్టెమంచ మెక్కిచూడు
నల్లనల్లగ వుండనాని పొందకా పొయ్యేవురార
నల్లరాగడి దున్నిసూడు తెల్లజొన్నలు పండవేమొ-

పల్లెపడుచులు భూవికారానభిజ్ఞులనుట సర్వత్ర పొసగదు. అందరివలె వారిలోను హావభావ యుక్తమైన సైగలున్నవి.

సీరెగట్టాకు గజెలమ్మా సింగులు దిప్పాకు గజెలమ్మా
మంటీ వారువజాలరు బిడ్డో సైకిలు కిష్టన్న భారియా
మెట్టెలు వెట్టాకు గజెలమ్మా మెడిమలు ఉప్పాకు గజెలమ్మా ॥మంటీ॥
గాజులు దొడుగాకు గజెలమ్మా సేతులు దిప్పాకు గజెలమ్మా ॥మంటీ॥
బొట్టూవెట్టాకు గజెలమ్మా బొమ్మలు దిప్పాకు గజెలమ్మా ॥మంటీ॥
దాసెనపెట్టాకు గజెలమ్మా దౌడలు దిప్పాకు గజెలమ్మా ॥మంటీ॥
అత్తరపెట్టాకు గజెలమ్మా ఆసన గొట్టాది గజెలమ్మా ॥మందీ॥

చీరగట్టి సింగు (చుంగులు) లొయారముగా ద్రిప్పుచు నడచుట, మట్టెలు పెట్టుకొని మడమలు ద్రిప్పుట, గాజులు దొడుగుకొని సేతులు సెన్నలర ఆడించుట, బొట్టుదిద్దుకొని కనుబొమలలోని విలాస విభ్రమములనుజూపుట, దాసెనపండ్లతో దవడలు ద్రిప్పుచు పలుకరించుట, అత్తరు పూసికొని మత్తెక్కించుట వంటివి శృంగార చేష్టలు. ఇంతేగాక, చేని మలుపుల కంటి గిలుపు లెన్నియో! సీటికై బోయి ,,రెండు సేతులు కడువమీదా నాసామి- వాలుగన్నులు వానిమీదా,,

వైచుట పరవశత్వము. కాని, ఈ సైగలు, వగలు వద్ద పురుషుడున్నప్పుడే ఫలము. ,,వాసనలేనిపూవు పూసేమి ఫలము? వద్దపురుషుడులేని వగలేమివగలు,, ఆ శృంగార చేష్టలు పురుషున కుద్దీపన విభావములు.

పిడికెలకాని నేనువొస్త భీమయ్య-పిట్టెలసికాడ్కి నీవురావు దొరభీమయ్య
కట్టెలకాని నేనువొస్త భీమయ్య-కంఖాల వేటకు నీవురావు దొరభీమయ్య
నీవుగొట్టే మోటకాడ భీమయ్య- బట్టాలుతుకా బండలేదు దొరభీమయ్య
బట్టాలుతుకా నేనువొస్త భీమయ్య-ఎద్దులగొట్కా నీవురావు దొరభీమయ్య-*

ఇట్లు సంకేతస్థలము నేర్పరచుకొని, చేరబోయి ప్రేమించుకొనుట సామాన్యము. ఒకవేళ వన్నెకాడచటికి రాలేకున్నచో నావిప్రలబ్ధ యొక్క ,,కన్నీరేమొ కడువనిండె దొరభీమయ్య,,.

ఇంట సవతితల్లి, దారిలో పిచ్చికుక్కల వంటి పరవనితలు ఉండుట చేత, ప్రియుడొంటిగా తన్ను జేరవచ్చుట ప్రమాదమని హెచ్చరించుచు తానే వచ్చెదనని తెలుపుకొనుచున్నది-

ఇంటిముందు ఈతరువ్వ యింటి యెనకా గచ్చతువ్వ
ఒంటిగాను రాబోకు ఐమూల జిక్కిపోదువురా
సవతితల్లి పెట్టుపోత పగలు రేయి కత్తికోత
గుమ్మమైన దాటనీరు గుసగుసలూ ఆడనీరు
రాతిరెండు జాములాకు రాయిచెట్టూ కిందనుండూ
ఇంట్లోవోరు సూడకుంట ఎట్లోనిన్ను కలిసెదరా
వచ్చిపోయే దారిలోన పిచ్చికుక్కలున్నాయిరా
మచ్చుజల్లి పోయెదరు మాయలో పడబోకురా- మరియు తన నిశ్చితాభిప్రాయమును దెలుపుచు,

నీకు నాకూ జోడుగాన నిమ్మపూల తెప్పమీద
తేలిపోవ మనసు పుట్టె తెల్లవారు చెప్పుడురా

ఎప్పుడిల్లు యిడిచెదనో ఎప్పుడు నిన్ను చూచెదనో

చిత్తమంతా చెదరిపోయే కత్తికోతలాగునుండి— నిమ్మపూల తెప్పమీద తేలిపోవుదమని ఊహలందించుచు చెదరిపోయిన చిత్తముతో తత్తరపడు చున్నది. ఎన్ని ఇరకాటములున్నను కన్నుల జిక్కిన వన్నెకానిని జేరబోవుట యందలి సాహసము ప్రేమికులలోనుండును. ,,ఇద్దరికి యిష్టమైతే ఎవరంటేం భయము,, అనుకొను ప్రేమికులు కూడ లేకపోలేరు. ఒక నెఱజాణ లజ్జా ప్రణాశావస్థలో జిక్కి అదరు బెదరు లేకుండ ఆర్భాటముతోడ తన చెలిమికాని నాహ్వానించుచున్నది—

కిరకిర చెప్పులోడ కిన్నెరమోతలోడ

మాపటికొచ్చేటోడ డప్పులతోటిరార

చెన్నూరి గట్లానడుమ సున్నందంపబోతె

గాజులు ఘల్లుమానె పానం ఝల్లుమానె

వవ్వరె సిపాయోడ నెలకూ రూపాయోడ

మాపటి కొచ్చేటోడ డప్పులతోటిరార * వీరిద్దరికి చెన్నూరి గట్లనడుమ ప్రేమకలిసినది. గాజులు పగిలినవి. వన్నెకానితో జాతరలు సేయదలచి ఈ ప్రౌఢాంగన—

కోటయబావా నాకు కోరిన బిన్నూలుదేరా కోటయబావా

నందికొండ బిన్నుబట్ట అజ్జలపురం మిసనుకుట్టు

కుట్టియిబావా నా కుడిరొమ్మున కృష్ణనీల కుట్టియిబావా

మాచెర్ల జాతరకు మందెంత వోతున్నరు

రావేమయ్యో ఓ కత్తెర జుంపాలబావా పోదామయ్యో

వొద్దేమగువ మనరద్దీసాల మోయుసుండె

రద్దయినా రగుతమైన అన్నింటికి నేనెవుంటె

రావేమయ్యో ఓ కత్తెర జుంపాల బావా పోదామయ్యో * ఇట్లు కోరుకొని తోడుకొని పోయినది. ప్రేయసీ ప్రియులకు జాతరయన్నచో పరమసంతోషము.

అసలు జాతరలోనే కొందరికి ప్రేమలు కుదురును, ముదురును. మరొకనికి ప్రియురాలు చేసినమర్యాద ఇట్లున్నది:—

గుండ్లపల్లి గురివిరా—దాని—చేతకీలు కడియమురా
కీలుకడియం పెడాగొట్టి—కిన్నెరా సేయించెరా
కోతినిస్తా మానెరా—కోడిపెట్ట నిస్తామానెరా
కోడినమ్మిన కాలురూపాయి—కోరియిస్తా మానెరా
వారవరము దినమురా రామ—నవురెపల్లె నంతరా
నవురేపల్లె సన్నామల్లెలు—కుచ్చులాన్నాల్నర దుడ్డురా
ఊరిపడమట బాటరా—నే బాట కూలికి పోతరా
అందరాకు మూడుదుడ్లు—నాకు నాల్నర దుడ్డురా *

గుండ్లపల్లి గురివి శ్రీమంతురాలు. ప్రియుడు మాత్రము కూలినాలిపేద. తన చేతి కడియము పెడగొట్టించి ఆతనికి కిన్నెర చేయించినది. తన చేని కూలికి వచ్చిన వారందరికి కూలి మూడు దుడ్లయిన వానికి నాలుగున్నర దుడ్లిచ్చుకొన్నది. వలచినవానికి వలసినన్ని యిచ్చుకొనుటలో వింతలేదు. ప్రియునికి కిన్నెర యుండుట ప్రేయసికి మహదానందము. రాధికను మాధవుడు రాగ మొలికించినటులు, జానపద ప్రేయసి తన ప్రియుని చేతికిన్నెర కాదలంచుట, దానిని చేయించుటలోని ఆంతర్యము.

జానపద శృంగార జీవనమున ప్రేయసీ ప్రియుల సరస సల్లాపము లెట్టివో సుంత గమనింపదగును—

తంగెడు పువ్వుల్లరో నా బావా రాజమల్లు
పూలేరా పోతెరో నాబావా రాజమల్లు
వొంగనియడె దుర్గమ నన్నాల నియడె దుర్గమ
పూలేరనియడె దుర్గమ దండగుచ్చనియడె దుర్గమ్మో నాబావా రాజమల్లు
బంతీ పువ్వుల్లరో నాబావా రాజమల్లు

పూలేరా వోతెరో నాబావా రాజమల్లు ॥వొంగ॥

గన్నేరు పూవుల్లరో నాబావా రాజమల్లు

పూలేరా వోతెరో నాబావా రాజమల్లు ॥వొంగ॥

మల్లెపూవుల్లరో నాబావా రాజమల్లు

పూలేరా వోతెరో నాబావా రాజమల్లు ॥వొంగ॥

జాజీ పువ్వుల్లరో నాబావా రాజమల్లు

పూలేరా వోతెరో నాబావా రాజమల్లు ॥వొంగ॥

కొండీ పువ్వుల్లరో నాబావా రాజమల్లు

పూలేరా వోతెరో నాబావా రాజమల్లు ॥వొంగ॥ *

తంగెడు, బంతి, గన్నేరు, మల్లె, జాజి, కొండి పూవులేర బోయినచోట ఆ తోటలో ప్రియుడు ప్రియురాలి నిటువంగనీయడు. అటుబ్రాలనీయడు. పూలేర నీయడు. ఏరినను దండకూర్చనీయడు. దానిని చేతులమీదనే పూలచెండాడినాడు. పూపొదల దారుల గోపికను గోపాలుడు ఓలలాడించి నట్లున్నదిది. అంతటి ఒయారమైన సరసమున వారు రసలోలురు. ఏపంపున ఏసొంపున ఇంపు ననుభవించిరో అది వర్ణనాతీతము. ఇట్టి శృంగారక్రీడలు ఛాయాచిత్రమునకు కూడ చిక్కవడవు. అది స్వేచ్ఛాయుతమైన, అమలినమైన అమోఘసరసము. అందలినాయిక ముగ్ధ.

కత్తెరజుంపాలు కండ్లకు అద్దాలు దవుడన ఇడియాలోయి బావా

ఆహా దవుడన ఇడయాలోయి బావా

నీ సేతుల అద్దము నాసేతుల దువ్వేన

బాలువుతా రావోయి బావా—ఆహా బాల్దువుతా రావోయి బావా

నీ సేతుల పోందరు నాసేతుల కాటికె

కాల్కెవెడ్తా రావోయి బావా—ఆహా కాల్కెవెడ్తా రావోయి బావా

నీసేతుల సెండూ నాసేతుల దస్తీ

సెండాడ్దం రావోయిబావా ఆహా సెండాడ్దం రావోయి బావా

నీకాళ్లకు సెప్పులు నాకాళ్లకు బూట్లు
సేన్నడుస్తా సూడొయిబావా ఆహా సేన్నడుస్తా సూడొయిబావా
నీ సేతుల బొట్టూ నా సేతుల అద్దము
బొట్టుపెడ్తా రావొయిబావా—ఆహా బొట్టుపెడ్తారావొయిబావా*

అంతటి అన్యోన్యానురాగముతో సరస విలాసముగా జీవించుటలోని జీవిత మాధుర్యము ప్రేమజంటలనుభవించుచుందురు. ఆ నాయికలో మధ్యాలక్షణములు గలవు. „కందిరీగె నడుముదానా కదులా సియ్యావు భామా— కొబ్బెర వొంటి గుబ్బలదాన పట్టానియ్యావుభామా ముట్టానియ్యావు భామ„ * పిడికిటకువచ్చు కందిరీగవంటి నడుమును పెనవేసికొని, కొబ్బెర వంటి గుబ్బలనుబట్టి సరస మాడుటలోని శృంగారబంధముల నొకరు నేర్పనక్కరలేదు. అందులకు ప్రకృతి యే సాక్ష్యము. నాగరకులు కొక్కోకాదుల జదివినను కృత్రిమ సరసమునకే యలవాటు పడుచుందురు. కాని, కనుమరుగున చేనివరుసన పల్లీయుల సరసములు వారి సరసప్రియత్వమును చాటును. ఇంచుక చెట్టుకొమ్మ మోపైనను, చేనిగట్టు దాపైనను, కంచెయొంటరిదైనను, మంచెతుంటరిదైనను వారిలో నఖక్షతములు (ఏసింది ఎడుమల పేరు—దావి—ఎడుమ సంటిమీన గోరు……), దంతక్షతములు (కోడూరి శింతల్ల కోలాటమాడంగ నాకొంగులో దూరిందే కొంటె తుమ్మెదా— మన్నెవారి తోటలోన మల్లెలు కోయబోతె—నాచెంప కొరికిందే నల్లతుమ్మెదా) పైటకొంగు దాపున చోటు చేసికొనును. (ఇట్టి శృంగార వర్ణనలు పెక్కు క్షేత్రయ్య పదములలోగలవు.) శృంగార రసావిష్టుడైన ప్రియుడుబిరబిర వచ్చి తన బిబ్బోకవతి యొక్క బిగుతు గుబ్బలుపట్టి నగుతు గంధము పూసి బిత్తరముసేసి, అంకమున కూర్చొని, తొడకంకణము పొంకముగ కట్టినాడు—

„బిరబిరా వొచ్చేను బిగుతు గుబ్బలుపట్టి
నగుతగంధం పూసెనే ఓ సెలియా—నగుత గందం పూసెనే
సరసరా వొచ్చేను తొడమీద కూసోని—తొడకంకణం గట్టెనే ఓసెలియా
తొడకంకణం గట్టెనే * ఇట్లుచెప్పుకొన నేర్చునది ప్రౌఢయే. ముక్కు

నకు గల ముత్తైపుపోగు నుండి ముద్దు ముద్దున కొక ముత్తెము రాలిపడుట అన్యోన్యము. (ముద్దూ ముద్దూకు వొక ముత్తెము రాలిందిరో). వారి సంభోగ శృంగార పరంరంభము ధ్వన్యాత్మకము. ప్రకృతియే వీరిని నేర్పును. ఆ చేను ఈ చేను అల్లాడుచుండుట, పిట్ట పిట్ట కలిసి ముద్దాడుచుండుట, పూరెమ్మపై తుమ్మెదలు రిమ్మగొనుట, కొమ్మలపై చిలుకలు, గోరువంకలు, కోయిలలు కొసరాడుట, కొండలలో కోనలలో కోటతెప్పలను జూచి నెమళ్లు చిందులు ద్రొక్కుట, మెరుము—ఉరుములకు లేళ్లు త్రుళ్లింతలిడుట, ఆయేరు ఈయేరు ఏకమైపారుట, ఆయలలు ఈయలలు జోలలై యూగుట కలలైకరగుట నిత్యమును వారు కనులార జూచుచుండుట చేతనే ఆ పరవశ శృంగారమున మలకలెరిగి యుందురు.

ఇంతవరకు సంభోగ శృంగార సంబంధముగా చర్చించుకొంటిమి. ఇక విప్రలంభ శృంగారమును సుంత పరికింతము. అది అభిలాష, ఈర్ష్య, విరహ, ప్రవాస భేదములచే నాలుగు విధములుగా గన్పట్టును. పల్లీయ ప్రేయసీ ప్రియులు పరస్పరాను రాగములతో గూడి యొకరిని విడిచి మరియొకరుండ జాలరు. వారిది చేదోడువాదోడుగల జీవనము. అమలినత్వము, అమాయకత్వము వారి మౌలిక జీవన తత్త్వము. వారి మధ్యసాగు ప్రణయరాగము సంస్కృత కావ్యనాయికా నాయకులను, తెలుగు ప్రబంధ నాయికా నాయకులనుదలపింప జేయను. క్రింది పదములో అభిలాష విప్రలంభమభివర్ణితమైనది.

వేళజూడ వెన్నెలాయె వెండికట్ల కిన్నెరాయె
మల్లెపూల పందిరాయె వయ్యారిరావె—నవ్వులోనె తెల్లవారును
కొండగోగులు పూసెనేమో కొండనిమ్మలు కాసెనేమో
దొండపండువంటి పెదిమె వయ్యారిరావే—మనసు ఎవరిపాలుజేతును
మల్లెపూవులు పూసినట్లు మళ్ళిమళ్ళి మాటలాడు
మల్లెపూవువంటి మనసు వయ్యారిరావే—పూవులెవరి పాలు జేతును

కందిపూసె కందికాసె కొండికొనలు నందిమేసె

అందమైన మేలినడల పయ్యారిరావే గంధమైన పంపబోతిని

వెన్నెలలోని మల్లెపందిరి క్రింద వన్నెకాడు వెండికట్ల కిన్నెర మీటుచున్నాడు. పరిసరములన్నియు పరవశము గొల్పునవియే. చుట్టు కొండగోగులు పూచినవి. కొండనిమ్మలు కాసినవి. కాసిన కందిచేని కొనలొకవంక నంది మేయదొడగినది. కనుక, దొండపండువంటి పెదవులుగల తన ఒయారిని అందముగా మందమంద గమనమున చేరరమ్మన్నాడు. మల్లెపూవులు విరిసినట్లు మరలమరల మాట లాడుచు, మల్లియవంటి మనసునువిప్పి ఆమెనవ్వినచో వానిబ్రతుకు తెల్లవారును. వానికేగాదు, ప్రకృతియే తెల్లవారును. జగమంతయు మల్లెపూవై గుబాళించును. పల్లీయులు మల్లెపూవుకిచ్చిన ప్రత్యేకత మరొకపువ్వున కిచ్చినట్లులేదు. వారి శృంగారజీవనమున వాని ప్రసక్తి ఆసక్తిదాయకము. "మల్లె పొదనూ ఇంటపెంచుకోవాలీ — మల్లెతో మనసార పాడుకోవాలీ — మల్లెపొద మాటున మాటిచ్చినాను", మల్లెలు తలకురులకు, వీర్యమునకు, కన్నులకు పుష్టి నిచ్చునని చెప్పుదురు. అల్లెప్రియురాలి ఊహలుగూడ రమ్యమైయొప్పును. అందలి జిగిబిగి రసికులకు బిగి.

ఉల్లిపూలా పడవాగట్టి మామ—మల్లెరేకుల తెరను దించి

నాగులేటివాగులోన మామ తేలిపోదామా

మొగిలి పూలా తేరుగట్టి మామ—మొగిలిరేకుల గొడుగూపట్టీ

మొగులుమేసే కొండామీద మామా ముద్దుగానే ఎళ్ళాదామా", ఈకోమలి—

"ఎందేదెందము గందళించురహిచే నేకాగ్రతన్ నిర్వృతిం

జెందుంగుంభగత ప్రదీపకళికాశ్రీదోప నెందెందుబో

కెందే నిందిృయముల్ సుఖంబుగను నాయింపు[1]", ను గోరక ఉల్లిపూల పడవమీద మల్లెరేకుల తెరచాపదించి, నాగులేటి వాగులో తేలిపోవుదమనియు,

---

1. మనుచరిత్రము;— ఆశ్వా. 2. పద్య. 62.

మొగలిపూల తేరుమీద మొగలిరేకుల గొడుగుబట్టి మొగులుమేసే కొండమీదుగ ముద్దుముద్దుగా విహరింతమనియు, మనోహరునితో మనోజ్ఞముగా కోరుచున్నది. ప్రియుని గలిసికొనక పూర్వమే యిట్లు ప్రేయసి అనుభవించు విరహము అభిలాషవిప్రలంభము. ఇట్టి ప్రేయసి హృదయమెంతలోతైనదో ఊహింప గలమా? వారియూహల కవధులులేవు. ( నాగరకుల మనుకొను ఆధునిక ప్రేమ జంటల కిట్టిరహస్యములు, రమ్యోహలు పొడకట్టునా? అసలింత గుండెలోతుగ ప్రేమించి యుండనేర్తురా?).

ఈ క్రింది మరొక పాటను జూచినచో స్త్రీ పురుషులెట్లు ప్రేమించుకొని, ధర్మబద్ధముగా పరిణయమాడుదురో తెలియగలదు.

చిలుక: మొవ్వాకు చీరగడతా మొగలి రేకులు పెడతా
నన్ను పెండ్లాడుతావా ఓ కన్నెగోరా ॥నన్ను॥
గోరువంక: ముత్యాలపేరు పెట్టి ముద్దూ టుంగరము పెట్టి
నిన్నే పెండ్లాడుతానూ ఓచిన్ని చిలుకా ॥నిన్నే॥
చిలుక: మల్లెపువ్వులు చుడుతా మొలకు వడ్డాణం పెడతా
నన్ను పెండ్లాడుతావా ఓ కన్నెగోరా ॥నన్ను॥
గోరువంక: పసుపున పాదాలు కడిగీ పచ్చాపట్టంగిదొడిగి
నిన్నే పెండ్లాడుతాను ఓచిన్ని చిలుకా ॥నిన్నే॥
చిలుక: గజ్జెలందియలు పెడతా పచ్చాకు తాళిగడతా
నన్నూ పెండ్లాడుతావా ఓకన్నె గోరా ॥నన్ను॥
గోరువంక: మణులు దీపాలుదెచ్చి మంగళహారతులిచ్చి
నిన్నే పెండ్లాడుతాను ఓచిన్ని చిలుకా ॥నిన్నే॥

చిలుకా గోరువంకల నిట ఆదర్శముగా గ్రహించుటైనది. పరస్పర మిట్లు వ్యవహరించుట అన్యోన్యము.

పల్లీవల్లకవాడు వాడకేరాడే చందమామా

మేనత్త కొడుకోయి మేలంపుగాడే చందమామా
వల్లీవల్లకవాడు వాడకేరాడు ,,
వాని మొలలోవున్నాయి మోమంచి గజ్జెలే ,,
మొలకా గుబ్బలమీన మోపినా చాలోయి ,, — ఇట్లు భరింపరాని వలపుకాకకు జిక్కిన పిర్రియురాలు కనీసము ప్రియుని మొలగజ్జెలు తన మొలక గుబ్బలపైన మోపివోయిన చాలునన్నది. ఇదియును అభిలాష విప్రలంభమున కుదాహరణమే.

ప్రియుడలుగగా విరహతప్తయై జలదరించిన పడుచుది—

నాసామి నామీన అలిగినదమ్మ—ఇంటికి రమ్మన్న రాడాయెకొమ్మ
చెరకు తుంటెలోలె సేతులుండాయి—సేతూలు ఎవ్వారి మీదేతునమ్మ
పసినిమ్మ పండోలె పాయముండాది—పాయాము ఎవ్వారి పక్కలేతమ్మ*
అనుచు పర్రిణయమానవిప్రలంభమున దగులుకొన్నది. ఇది ఈర్ష్యా విప్రలంభము లోని యంతర్భాగము. పిర్రియుడు చేరరాకపోయినప్పుడు కోయిలతో రాయబార మంపుచు దానికి విలువైన ఆభరణములు లంచమిత్తునన్నది. ప్రాధేయపడినది.

నామాట ఇనవమ్మా కోయిాల—నాప్రాణ—నాథున్ని దేవమ్మ కోయిాల
వొలుపు నిల్పగజాల కోయిాల—దేని— వొలల జిక్కినాదో కోయిాల
సీరాలు సీకిత్తు కోయిాల ..నా— రైకాలు సీకిత్తు కోయిాల
సెంద్రున్ని సీకిత్తుకోయిాల —సెందర్రి—హారాలు సీకిత్తు కోయిాల
సూర్యున్ని సీకిత్తు కోయిాల —సూర్య—హారాలు సీకిత్తుకోయిాలా *

కాని, చంద్రుని, సూర్యుని, ఇచ్చుట కీమెకేమి హక్కున్నదో? అది విరహ దోదూయమాన హృదయులకే యెరుక. పిర్రియుడెంత ఆలస్యము జేసినచో ప్రేయసి హృదయము అంత అనుమానమునకు తావలమగును. ఎదురు తెన్నులుసూచి కన్నులు సిన్నవోవును. అప్పుడిట్టిరాయబారములకు కోయిల, చిలుక, తుమ్మెద, హంస, కొంగ, గువ్వ, కాకి, చంద్రుడు, ఒక్కటేమిటి పరిసర ప్రకృతిలోని

ప్రతి సజీవ, నిర్జీవ వస్తువుతోడ్పడుచుండును. ఇట్లే ప్రాచీన సాహిత్యములో చిలక రాయబారము, హంసరాయబారము వంటివి ఎఱుంగుదుముగదా?

పు: ఎన్నాళ్ళో ఈబందికానాలు మాకెన్నాళ్ళో
కదిలి వచ్చేనాడే కొరుమబ్బేసింది
కలికిరో నాయెల్లి వెలవెలా బోయింది
కందిన సెక్కిళ్ళు కడవలో బోసింది
కాటుక కన్నీళ్ళ నీలాలు నాయెల్లి

స్త్రీ: గడియ సేపయిన నన్ విడిసినోడుగాడు
పదనార యేడాది పాశైన కాలేదు
నడిమంత్రమున యింత మిడిమేలమైపోయె
కడకు నాకాపురము కడగండ్ల పాలాయె

పు: సీలమండాదాక సిందాడు తలకట్టు
కలవపూలూపెట్టీ కడవంత కొప్పెట్టి
వొలుపైన కుంకుమ్మ బొట్టుకాటుకపెట్టి
గున్నయేనుగుమల్లె గునాగునా నడకలు నాయెల్లి

స్త్రీ: వలరాజు అందాల వన్నె చిన్నెలరాజు
నిలువెత్తునట్టిల్లు నిండినారాజు
మెలిరాని నూనూగు మీసాల నారాజు
కలలో రాతిరివచ్చి కనిపించిపోయాడు

ఏలకో యెల్లిని పుట్టింట విడిచివచ్చినట్లున్నాడు దానిభర్త. కాని, అక్కడ అది, ఇక్కడవీడు విరహము ననుభవించుచున్నారు. స్త్రీపురుషులిట్లు సంభోగసుఖమును బొందిన పిదప నేదేనియొక కారణము చేత వియోగమునకు గురియైన యెడల ఆ విరహమును విరహవిప్రలంభమందురు. కోపమునగొట్టి కనుగొలుకుల నిండ నీరు దెచ్చుకొన్నట్లు వీడే కారణమునసో యెల్లినటు ద్రోలి యిట్లు కుమిలిపోవు చున్నాడు. అది మిక్కిలి అనురాగ సూచకము. విరహమున వారివారి వలపులు

మరింత ముదురు పాకమునబడుట సహజము. తుదకు కలలో పరస్పరము కలిసికొనుట తటస్థించును. విప్రలంభముచేత సంభోగమునకు పుష్టిచేకూరును. (నవినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే) కనుక ప్రేయసీ ప్రియులలో అప్పుడప్పుడు వియోగముండి తీరవలసినదే.

ఎరుపురంగూ ఎదురుచుక్కారా నాసామిరంగా
ఎన్ని దినము లెదురు చూతురా ,,
వలపు నిలుపజాలలేనురా ,,
కలలోనైనను కావవేమిరా ,,
కాలుకురచ ఆడదానిరా ,,
వీలుసాలు చూడవేమిరా ,,
మూరతక్కువ చీరలంపారా ,,
ఆకులతో పోకలంపారా ,,
ఆలసించి అంపబోకురా ,,
అలపగానికి చెడుపు బుద్ధిరా ,,
పోయేటిరువులు వచ్చేటప్పుడు ,,
పాలపిడతలో విషములుండేరా ,,
గువ్వచేత గురుతులంపారా ,,
కాకిచేత కబురులంపారా ,,

కనీసము గువ్వచేత గురుతులైనను, కాకిచేత కబురులైనను పంపుమని కోరినదీమె తనప్రియుని. అంతేగాదు, ,,గోటంత సీటన్న పంపమాన్నాదిరా— గోటంతసీటి ఎల్లసదువక మున్నె—దాని కురులనురిబోసి సస్తనన్నాడిరా,,. ఇదియును విరహ. విప్రలంభ శృంగారమే. మరొక ఉదాహరణ గాంచనగును. ప్రియునిబాసి నెల యైనది. కంచిమేకలపాలు పోసిపెంచిన తన అరాళకుంతలము లు వానికి హంస తూలికా తల్పము చేసినది—

ఉంగురామ ఉంగురామ జోడుమదు— టుంగురామ వొలసందమామా— నీ జోడుకన్నులు ఎడబాసినేటికి—నెల దినములాయే వొలసందమామా

కంచి మేకల పాలుపోసి పెంచితీని—జాజికరులు వొలసందమామ
వొన్నెకాని వొలపులాకు పక్కకింది—పానుపులాయే వొలసందమామ
గోలకొండ కొన గుజ్జారిలోన కొంటినమ్మ—కొనమొగ్గాలరైకే ,,
మడత మడత ఇచ్చిసూస్తే వొన్నెకాని—వొలపులుండూ ,, *

దాచుకొన్న తన కొనమొగ్గల రవికను విప్పిచూచుకొనగా మడత మడతలో వన్నెకాని వలపులే గుబాళించినవట! ఎంత రసభరిత హృదయవేదనయది!

మగువకు మనసిచ్చి యొకడు వలపుమంటలు రగిలించి, మాటమరచి మాయజేసి పోయినపుడా మగువ గుండె పగిలినది—

నీయడుగులే నమ్మినారా నాసామి నన్ను విడనాడి పొయ్యేవా
చిన్నజాబిలిముందు చేతిలో చెయ్యేసి
వొట్టేసి పెడదారి వంపుకాసించేవా సామి
పుచ్చపూవూలాటి పున్నమీ యెన్నెల్లో
అచ్చంగ సరసాలు ఆడుతూ మెడపేరులు తెచ్చేవాసామి
సరులు తెగిపోతేను సరసాలు మానేసి పరసకు రాకుంటె
వీపుచరచీపోయి మరిచావా నాసామి
సీతమ్మ జడతెచ్చి చెరివి నాజడలోన
నీతోడె వోపిల్ల నిన్నువిడువ నన్నావు నాసామి—

పాడెవడోకాని చంద్రునిసాక్షిగా చేతిలో చెయ్యివేసి, అచ్చముగా సరసములుచేసి, మెడసరులువేసి, ఒట్టుతిని, దానినొంటిజేసి, పెడదారిబట్టినాడు. వాని యడుగులనే నమ్ముకొని ఎడదలో తన స్వామిగా నమ్ముకొని యుండ అది వమ్మాకాగా దాని విరహమెంతటిదో యట్టివారికే బోధపడగలదు. ఒట్టు తినుటలో "పాలనేతుల బాసలాట" కూడ చేయుదురు.

అలిగిపోయిన ప్రియురాలికై ప్రియుడిట్లారాట పడుచున్నాడు.

పన్నెండుడబ్బాల ప్యాసెంజరూ పోయింది
నువ్వే డబ్బాలున్నావే ధర్మాపురి దానమ్మా
పొద్దెక్కె ఏళ్లాయే సద్దికూడురాదాయే
సద్దెవరూ తెస్తారే ధర్మాపురి దానమ్మా
నువ్వునేను పెట్టినా ఆ పువ్వుల తోటంత
అదివాగుల పాలాయెనె ధర్మాపురి దానమ్మా
చలిగంటి తాళ్లల్ల తాక్కుంటూ నేనుంటే
నువు రాయకంటి పూరెల్లా వున్నాయే
పెంబట్లా జాతర్లో పేడాలు తెస్తుంటే
నువ్వు పేరంటాలు పోతీవా ధర్మాపురి దానమ్మా
మల్లన్న జాతరకు మళ్లిమళ్లి రమ్మంటే
నామాట మర్సితివా ధర్మాపురి దానిమ్మా
జగిత్యాల అంగట్లో గొంగళ్ళు కొనుక్కోని
డబ్బాలన్ని ఎతికితినే ధర్మాపురి దానమ్మా *

ఇహ్యాళ: కొంతకాలము జరిగిన పిదప ఏలకో వారి నడుమ మాట కుదరకుండ పోయినది. ప్రియునికాదని రైలెక్కి స్థలాంతరమునకు పోగా దానిమీద వానికి ప్రేమ కొట్లాడినది. రైలుబంఢిలోని డబ్బ డబ్బ వెదకి చూచినాడు. కాని, విరహమే మిగిలినది. ఇది ప్రవాస విప్రలంభము. పల్లె పదములలో పురుషుని కన్న స్త్రీలే యెక్కువ విరహమునమభవించిన సాక్ష్యములున్నవి. ఈ క్రింది పదమును గూడ ప్రవాసవిప్రలంభమునకు నిదర్శనముగా గ్రహింపవచ్చును.

నేరంగమెల్లి పోతానె నారాయణమ్మ—నేనబ్బరెల్లి పోతానె నారాయణమ్మ
నువునబ్బరెల్లిపోతేనో నాయుడుబావా
అబ్బనాకు తోడెవరో నాయుడుబావా
రంగమెల్లి పోతేనూ నారాయణమ్మ నీకు
రంగుసీరెలంపుతానె నారాయణమ్మ

నన్నిడిసిపోకోయి నాయుడుబావా మన_కిద్దరికీ జోడోయి నాయుడుబావా,, తనతో గూడియాడి తోడునీడయై మెలగిన చెలికాడసువులు బాయగా, ఆ వియోగ దుఃఖమున పొరలుచు నొకబాల ,,బొంగురాలాడేటి బొగుడల్లా నాయిరాజా, యాడలెంకిన (వెదకిన) లేదె యెడదారి నాయిరాజా_చిగురగోనెలాడేటి చింతల్లా నాయిరాజా, యాడలెంకినలేదే యెలదారి నాయిరాజా,, అనుచు వానితో నాడి యున్నతావులెల్ల అరసి యరసి డీసురాలై యుండ నెవరికైనను మనసు చెమ్మగిల్లును. ఇట్లే చెలినిగోల్పోయిన చెలికాని కన్నీటిపాట గతానుభవముల మూట విప్పినది.

,,సుద్ద బొందలకాడ నీసుద్దిడియ్యంగానె
సద్ది దివ్వట్టాయెనే సిలకా సిన్నారి సిలకా
ఇంతెల్ల మెడబాసెనే సిలకా_ఎంతపాపపు దేవుడే సిలకా
నమ్మైన నీవు సాటుకూకుంటె
సత్యభామావందురే సిలకా సిన్నారి సిలకా
పసిద్దయి నువ్వొక్క పందిట్లో కూకుంటె
పార్వతీదేవందురే సిలకా సిన్నారిసిలకా
ముత్తైదవై నువ్వొక్క మూలకూ కూకుంటే
ముద్దబంతీవందురే సిలకా సిన్నారి సిలకా
ఇద్దరము తినేటి అబొద్దు గిన్నెల
ఒక్కనికి ఒనరాయెనే సిలకా సిన్నారి సిలకా
ఇద్దరము కప్పేటి మద్దికాయల దుప్పటి
ఒక్కనికి వొనరాయెనే సిలకా సిన్నారి సిలకా_

ఇట్టి చిర వియోగములు కరుణాత్మకములు.

ఈ సందర్భమున అన్యోన్యమైన ఒండు రెండు ప్రేమజంటలను గూర్చి తెలిపికొనుట అవసరము. చల్ మోహన రంగ, పెంద్రొమ్మ _ యెంకయ్య,

సెతిద్రి—బాలయ్య వంటి ప్రేమజంటల గూర్చిన పదములు తెలుగుదేశమంతట బహుళ ప్రచారమంది యున్నవి. ఏనాటి నుండియో తెలుగుజాతి హృదయములో చోటు కల్పించుకొన్న ఆ ప్రేమైక జీవులను గూర్చి సుంత పరిశీలింతము,

## చల్ మోహనరంగని ప్రణయరంగము:-

చల్ (పదరా) మోహనరంగ పదము పెద్దది. అదొక ప్రియురాలి జిలిబిలి ఊహలతో గూడిన ప్రేమలోకము. ఆ ప్రియురాలి పేరేమిటో తెలియదు. ఆమె స్వీయనాయిక. ప్రియుడైన మోహనరంగని నుద్దేశించియే ప్రణయ పరిపాకమున బడినది. తన్నుతానే మరచినప్పుడు తనపేరెట్లు చెప్పుకొనును? ప్రేమలోకమున వానిని సింహాసనాధిష్ఠితునిజేసి ఏకచ్ఛత్రాధిపత్యమేలింప సంకల్పించుకొన్నది. దానికి తగిన రాచబాటగా పూలబాట పరచి—

రంగారు చెట్టుమీద బంగారు గోరువంక
వినిపించె కథలు విందము పదరా చల్ మోహనరంగ
చివురాకు పళ్లెరములో మివుల పండిన పండ్లు
సవిరించి ఆరగింతము పదరా చల్ మోహనరంగ
పొగడపువ్వులుగోసి పొందుగా నేదండగుచ్చి
దండ నీమెడను వేసుకరారా చల్ మోహనరంగ
చిరిమంచుకోటలోన గురుతైన మంచెమీద
శిరిపాట పాడుదాము పదరా చల్ మోహనరంగ

గోరువంకల కథలు వినుచు, చివురాకు సందుల పొడిగిన పండ్లారగించుచు పొగడపూదండలు మెడలో వేసికొని, మంచుకోట (మంచుకురిసెడి చేనిలో) లోని మంచె మీద కమ్మని సిరిపాట పాడుదము రమ్మని మోహన రంగని నాహ్వానించినది. ఆ రంగడుత్త రంగడుకాడు. మోహనాకారుడు. అనుకూలనాయకుడు. సాధారణముగా స్త్రీచుట్టు పురుషుచే తిరుగుటబోయి, ఇట పురుషునిచుట్టు

స్త్రీ తిరుగుట మోహనమేయగును. దనికి వాడొక సూదంటురాయి. రంగడెటు పోయినాడో? ఈమెయే వానిని వెదకి వెదకి ఒకమారు ,,శనివారం సంతలోన పని బూని వెదకివెదకి పరుగెత్తి పట్టుకొని" ,,బొండుమల్లె పూలదండ నిండుగా నీమెడన వేసి నిండార కౌగిలించి,,నది. వాడు ,,చిరునవ్వు నవ్వితేనూ, కుతియూపువ్వాల వాన,,. కనుకనే కన్నార సొక్కినది, మనసార చిక్కినది. ,,గుబురూ చింతాల మీన కబురూ తెచ్చేటి చిలుక సొగసైన గూడు కట్టేను గదరా,, మనకొరకని మదనపడినది ,,ఎన్నాళ్ళకైనగాని చిన్ని నీమొగము చూచి — నిలువెల్ల సొక్కి పోతినిగదరా నీకు నాకు నేస్తమైతె మల్లెపూల తెప్పగట్టి—తెప్పమీద తేలిపోదము గదరా చల్ మోహనరంగ,, యనుచు తనతోడి సౌఖ్యమును గుండె నుండి తోడి పోసికొన్నది. మొత్తముమీద వారిరువురు స్వేచ్ఛా ప్రేమికులే. వారి పరిణయ మునకెదురాడు వారిరువంకల నెవరునులేరు. అందుచేత, ,,నీకు నీ వారులేరు నాకు నావారులేరు — ఏటి ఒడ్డున ఇల్లు కడుదాం పదరా చెల్ మోహనరంగా— ఏరువస్తే యీదిపోదం పదరా చెల్ మోహనరంగా పదరా చెల్ మోహనరంగా,, యనుచు గుండె బలమును పంచిఇచ్చినది. కాని, వాడింకను కంటబడలేదు. దానికన్నీరేమో కడవనిండిపోయినది. ఇరువురేకమైనప్పుడు చంద్రుడు చూపులకు దాపగుట, మోహము మోపగుటతో ముగ్ధమోహన సౌందర్యమావిష్కృతమైనది. ,,నీవునేను ఏకమైతె నిండుచంద్రుడు—నవ్వి మేఘాలదూరె గదరా చల్ మోహన రంగా,, ప్రియునితోకలిసి నరులుకన్పడనిచోట, సురలు చెన్నారుచోట, అందముగా నాడుకొనుచు, తెల్లతామరాకు రెక్కముగల పూలరథమున దేశదేశములు తిరిగి రావలయునని దలచినది. ,,నేనొక్కపక్షినైతె నారెక్కలందు నిన్నుపూని— లోకములు ద్రిప్పుదుకదరా—పూలతోటి బుట్టగట్టి బుట్టకు ముత్యాలుచుట్టి — బుట్ట లోనె యెగిరిపోదము పదరా చెల్ మోహనరంగా— అమృత ప్రవాహమైన ఆకాశ గంగలోన సతిగంగాలాడుదాము పదరా చెల్ మోహనరంగా,, యన్నట్టి ఆ ప్రియురాలి రమ్యోహాలోకపథమెట్టిదో ఊహాతీతము. వాని మొగము సందమామ. కండ్లు కలువపూలు. కాబట్టియే ,,నా మొగము తోటిచేర్చి చూడు—నీ నోట నున్న

మురళి నానోటవుంచిచూడు – నేనొక్క పాటపాడెద వినరా,, యని తన రసైక హృదయజలధిని అనురాగ వీచికలందించినది. మోహనరంగని ప్రత్యక్షమువలన దాని యానందమూహాలోకపుటంచులు దాటి పోయినది. శుభస్య శీఘ్రమన్నట్లు వెంటనే వానినొసట కల్యాణ తిలకముదిద్ది, శిరసున కలికితురాయిపెట్టి, కళ్యాణ మందిరమున కనకంపుగద్దియపై పట్టపురాజును జేసికొని, మంగళహారతి బట్టినది.

> కస్తూరి బొట్టుపెట్టి కలికీ తురాయిపెట్టి
> నీవే నారాజుపై తివిగదరా చల్ మోహనరంగా
> కల్యాణమందిరమున కనకంపు గద్దెపైన
> మంగళహారతి చెప్పెదరారా చల్ మోహనరంగా

ఇకవారి ప్రణయజీవనము మూడుపూవు లారుకాయలగును. ఇంతటి యనురాగ బద్ధమైన, ఆదర్శవంతమైన ప్రేయసీ ప్రియులు ఉదాత్త ప్రణయభావసిద్ధులు కోమలస్వభావులు. ప్రాచీన సాహిత్యమున క్వాచిత్కముగా కన్పట్టెదరు. లేనిచో ఈపాట తెలుగు పొలిమేరలెట్లు దాటగలిగినది? ప్రేమించి పెండ్లి చేసికొను గాంధర్వవివాహ పద్ధతి పల్లీయప్రేమైక జీవులలో ప్రాచుర్యము వహించినదని చెప్పవచ్చును. అట్టివారిమధ్య ఆస్తి–అంతస్తులు గాని, కులము పట్టింపులు గాని అంతగా అడ్డురావు అసలు శృంగార జీవనములోనే యీ యంతరువులు అంతరించిపోవుట ముదావహము. ఈనాడు నాగరక సమాజములో నిట్టి ఉదాత్త ప్రేమైకజీవులెందరుండగలరు? ఉన్నచోనట్లు ప్రేమించి ఊహించి యుండగలరా?

## సెంద్రమ్మ-యెంకయ్య:-

తెలుగునాట సెంద్రమ్మ-యెంకయ్యపాట తెలియని పల్లీయుడుండబోడు. సెంద్రమ్మ కాపువడుచు, యెంకయ్య పంచముడు. వారిమధ్య ప్రేమతీగవారినది. వ్యవసాయ జీవనములో కాపు, పంచమ కులజులమధ్య శృంగారమెట్లు నడచినది సుంతపరికించియుంటిమి. కాపువారివద్ద వారుజీతముండుటవలన పరిసర ప్రభావ

ములకులోనై అదరు బెదరున ప్రణయము పెంచుకొనుట జరుగుచుండును. ఆప్లే యెంకయ్య, సెంద్రమ్మ పొలము మీదుండు జీతగాడు. వానికి కూడ చిన్నపాటి సొంత సేద్యమున్నట్లున్నది. వారే మండలమువారో యిదమిత్థముగా తేల్చిచెప్పలేము. నేను సేకరించిన ఆ పాటలో 55 పాదములున్నవి. అందలిశైలి, నుడికారము, భావములుజూడ తెలుగుసీమ (తెలంగాణము) వారని యించుక అనుమానింప వీలున్నది. కాని, వారు గోదావరి మండలము వారని నేదునూరి గంగాధరంగారభిప్రాయ పడినారు (మిన్నేరు). ఏదియెట్లున్నను వారు సమస్త తెలుగు దేశమునకే వర్తించువారైనారు. సెందర్రమ్మ ధైర్యముగలది. యెంకయ్య కన్న ఉన్నత కులజురాలు కొబట్టి అమాత్రముండకపోవుటెట్లు? కులముచిన్నది, బలము సన్నదగుటవలన వాడేమో బెదరుకొనుచున్నాడు. సెందర్రమ్మ—

,,ఓరో రెంకన్న వొంకజుట్టెంకన్న—ధెంకపోతవు ముండకొడుకో రెంకన్న

పాలసద్దులుపెడుత రారోరెంకన్న-పారిపోతవు లంజకొడుకో రెంకన్న,,*అని వానిని ప్రేమతోబిలిచినది. పిలుపులోనేవచ్చి చెంతవ్రాలుటకు వానికి అనురాగమున లోటులేదు. కాని ఆమె తల్లిదండ్రులు జూచినచో ఏరుగదన్నుదురని భయము మాత్రమున్నది. ,,సెయ్యి యిరిగితె యేమిసేతే సెందర్రమ్మ,, అన్నాడు. అందులకామె ,,సెయ్యి యిరిగితేను సెట్టు వెట్టిస్తాను — కాలు యిరిగితేను కట్టు గట్టిస్తాను,, రమ్మన్నది. వాని యందము కనువిందైనదట. అందుకే పొంగి పోయినది. ,,నీయందము సూసి నీచందమూ సూసి నే పొంగి పోయానురో యెంకయ్య నేపొంగిపోయానురో,,. పొంగిపోయిన సెందర్రమ్మ వాని తోడమీద శిరసువెట్టి చిరునవ్వునవ్వగా వాని చింతలన్ని మాయమైనవి. పరచుకొన్నపక్క మల్లెసెజ్జగా మారిపోయినది. వారి కౌగిలి బంధమునకు చుక్కలే పక్కున నవ్వినవి. తబ్బిబ్బులై క్రిందరాలినవి।

శిరసు తొడమీదెట్టి చిరునవ్వు నవ్వితే

సింతలన్ని మాయమైనాయే సెందర్రమ్మ

వంతలన్ని మాయమైనాయే సెందర్రమ్మ

పండువెన్నెల్లోన పక్కేసి పడుకుంటె
మల్లెసెజ్జగ మారిపోనాదే సెంద్రమ్మ
పూలసెజ్జగమారిపోనాదే సెంద్రమ్మ
ఒక్క కౌగిలిలోన ఏకమైపోతేను
పైన సుక్కలు నవ్వినాయే సెంద్రమ్మ
కింద సుక్కలు రాలినాయే సెంద్రమ్మ

భద్రాద్రి రాముని జూడ, గోదావరి తీరమునగల కోటిలింగముల స్వామికి కొబ్బెరలర్పింప, ఏడుకొండలవానికి మొక్కులు చెల్లింపబోవుదమనుకొన్నారు. ,,మనకి పెళ్ళైతేను కనకదుర్గకు పళ్లిచ్చి తీరాలిరో రెంకన్న,, అన్నప్పుడు సెంద్రమ్మ ముఖములో ముఖముబెట్టిచూచు యెంకయ్య గుండె వెనుక ముందాడినది. వానికి మనసులో నొకప్రక్క తాను పంచమకులజుడనన్న భీతియున్నది. ,,నిన్ను పెండ్లాడితే నిలువనియ్యరూ నన్ను కులము తక్కువవాని కొట్టవస్తుంటారు-ఏడకెళ్ళినగావి ఈసుతో సూస్తారు-ఎందుకొచ్చినబతుకే సెంద్రమ్మ ఇంక నేబతుకిలేనే సెంద్రమ్మ,, అనుచు యెంకయ్య నిరాశతో చిన్నబోయినాడు. కాని సెంద్రమ్మ అట్టి పట్టింపుల కదరునదికాదు. ప్రౌఢ. ,,మనసైతెను మాలోడి మాటేల కులమేమన్న కోలేదురో రెంకయ్య గుణము నే చూశానురో రెంకయ్య-ఇద్దరము కలిసి ఏకముగ పుంటేను ఏడులోకాలు మనకాడనే ఉంటాయి ఎక్కడికి ఎల్దొద్దురో రెంకయ్య,, అని వానిగుండె దిటవు పరచినది. వాడందులకంగీకరించినాడు. ,,వెండికొండలాగా వెన్నెల్లోన మిలమిల మెరిసేటి చెరువు కైరటాలలో కాళ్లు కడుగుకొందామా యెంకయ్య కబురు లాడుకుందామా యెంకయ్య,, అనుచు వారన్యోన్యముగా నుండసాగినారు. ఇంతలో తల్లితండ్రులు సెంద్రమ్మ నింటి నుండి వెడలగొట్టి కులమునుండి వెలివేసినారు. ఒకవంక ఆమె యెంకయ్యను విడువజాలదు. మరొకవంక సామాజికమైన అగచాట్లను భరింపవలనుకాలేదు. ఇక ఈపాడులోకమున బ్రతుకుటకన్న కడతేరుటయే సౌఖ్యమనుకొని ,,గోదావరికి బోయి గోయిరద్దునకు ఎక్కి కడతేరి పోతానురో రెంకయ్య కడసారి చూపిదిరో

రెంకయ్య" అనుచు యెంకయ్యను కన్నీట ముంచినది. వాడును "నువ్వు సచ్చి పోతె నేను బతికుంటాన నేను కూడ వస్తనే సెంద్రిమ్మ నీతోటె నేనుంటనే సెంద్రమ్మ—సొరగలోకములోన సల్లనీ సోటులో సరసమూలాడుద మే సెంద్రమ్మ సందమామను సూత మే". ఇట్టియనురాగ జీవుల ప్రణయము మరణావస్థ వరకు సాగి, తుదకు గోదావరీ నదీమతల్లీ పొట్టన శాంతించినది. వారి ప్రణయ గాథా ప్రవాహమున శృంగారకరుణములు దరులొరసి పొంగినవి. నిష్కల్మషమైన వారి పరిణయమును అగ్రికులములవారు హేయముగ దలపరాదు. వారు శిరీష కుసుమ పేశల హృదయులు, కులాతీతులు. నాగరకులకు సహితమాదర్శప్రాయులు.

## సెంద్రి-బాలయ్య:-

బాలయ్య చక్కని పడుచువాడు. సుందరియైన సెంద్రిని ప్రేమించినాడు. ఆమె లేడికన్నులది, లేతనవ్వులది, తీగసొగసుది, చక్కని పలువరుసగలది. ముగ్ధ. దానినడకలో మలకబడినాడు. "ఆనడక జోరులేమె సెంద్రి — నీ నడుము సన్నమోలె సెంద్రి—రంగుపింగులుసూత్తె రంబలాగున్నావు— రంగంపెడదామోలె సెంద్రి". అన్నాడు. కూలి నాలికి పోవువారి కొకప్పుడు రంగం (రంగూన్) స్వేచ్ఛాయుతమైన ప్రణయ రంగము. కనుకనే యిట్టి ప్రేమికులచ్చటికి పోవ నుత్సాహపడుదురు. కాని, సెంద్రికి మాత్రము స్వేచ్ఛలేదు. తల్లిదండ్రులు లేనిది. మేనత్త పోషణలోనున్నది. "నా మేనత్త సాకుతుంది బాలయ్య — నాకు మేనరికమున్నది బాలయ్య— ఇరుగు పొరుగు సూత్తె ఏమనుకుంటారో — ఎంట రాకురోరి బాలయ్య" అన్నది. "నలుపురిలో తనబతుకును నవ్వులపాలుసేయకు— నేకైకాల సిన్నదాని బాలయ్య" అనుచు వాస్తవమును దెలిపినది కమ్మవారి బావి వద్ద కడవనెత్తుకొని సందు గొందులనుండి చిందులు ద్రొక్కుచు సెంద్రి పోవు చుండగా దాని కొప్పు తిప్పులకు సొక్కియుండిన వాడెట్లు మనసు మార్చుకొన గలడు? "సూపులో సూపెడితె సుక్కలాగున్నావు — లక్కరైకలిస్తా సెంద్రి"

అన్నాడు అప్పటికిని సెంద్రి మారుబలుకలేదు. పెంచిన వారింటి మేనరిక మొకటియుండగా నెట్లు పల్లెత్తి పలుకగలదు? వానిలో మాత్రము మరులు పురులు గొన్నవి. ఉన్మాదావస్థలోబడినాడు.

,,మత్తుమందూ జల్లేవెళంద్రి—నావి ఉత్తమాటలు కావెళంద్రి
నాకెర్రెత్తి పోతుందెళంద్రి—నువ్వు ఎంత పాపివోలెళంద్రి
సేతిలో సెయ్యేసి సందిట్ల కొస్తేను—సంకగొడతానోలెళంద్రి,,*

అన్నాడు. నిజముగావాడు ప్రేమపిచ్చిలో బడినాడు. వారి నడుమ నడచిన ప్రేమ అంతవరకే ఆగినది. పిదప ఏమైనదో తెలియరాదు. ఒకవేళ మేనరికమునకే సెంద్రి నిచ్చియుండినచో బాలయ్యకు మిగులునది ఆ పిచ్చియే. అది తెలియ రాకుండుటయేముద్దు.

## శృంగార నాయికలు:-

అవస్థాభేదమునుబట్టి శృంగారనాయిక లెనమండుగురని లాక్షణికులు గుర్తించినారు. స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక యని వారిపేర్లు. ఇట్టి నాయికలేసాహిత్యము నందైనను, ఏ సమాజము నందైనను ఉందురు. జానపద సాహిత్యములో నిట్టి నాయికలెట్లు కనిపింతురో సోదాహరణముగా పరిశీలింతము.

స్వాధీనపతిక:— అన్యకాంతలను గోరక కేవలము తనపైననే యనురక్తుడై యుండెడు పతిగలది స్వాధీనపతిక.

నామాట ఇంటాడు తుమ్మెదా—నాయెంట వుంటాడు తుమ్మెదా
సందమామ వాడు ,, —సల్లంగ వుంటాడు ,,
సందిట్ల కూసోని ,, —కథలేమొ సెప్తాడు ,,
ఊకొట్టుతుంటేను ,, —జోకొట్టుతుంటాడు ,,
కన్నుమీన కనుగప్పి ,, —అన్నిమర్సి అల్సితిమి ,,

ఇంటు నాయకుడు నాయికమాట వినుచు, వెంబడి తిరుగుచు, చల్లగా నామెను జోకొట్టుచు మిక్కిలి అనుకూలుడై యుండినాడు.

వాసక సజ్జిక:— ప్రియుడు వచ్చువేళకు ఇంటిని, తనువును సింగారించుకొని సిద్ధముగా నుండునది వాసక సజ్జిక.

"నేరమేమొ తెలియనైతిని సామి
భారమేమియొ తెల్పరా చేరిమన్ననసేయరా
పడకటిల్లు నే కడుశృంగారముగా జేసి
యుంటిని నాయకా కంటజూడుము బాయకా
తెల్లనైన మంచిమల్లెపూలు పాన్పునల్లాన
ముగా జేసితి నల్లదేకను శ్రీపతి
సకల గంధములను సమకూర్చి ముదమున
సర్వాలంకృతనైతిరా సంశయ మింకేలరా,,

ప్రియురాలు తన పడకటింటిని కడుశృంగారముగా తీర్చిదిద్ది, మల్లెపూల పాన్పు పరచి, సుగంధములను సమకూర్చియుంచి, తాను సర్వాలంకృతయై ప్రియునిరాక కుత్కంఠతహించి యున్నది. ఈ పాటలో నాగరకతా వాసన నిండి యుండుట వలన నిది పల్లెపదము కాదేమోయను అనుమానము కలుగవచ్చును. ఇది నేదునూరి గంగాధరంగారి సేకరణలో కన్పించుచున్నది (మున్నీరు-పుట 125).

విరహోత్కంఠిత:— చెప్పిన సమయమునకు ప్రియుడు రాకున్న యెడల తహ తహ చెందునది విరహోత్కంఠిత.

చందమామయ్యో మామా చందమామయ్యో
రాతిరి రాతిరి వొస్తావాని
రాతీగంధం తీసీవుంచితి
రాతీగంధం రగిలీపాయే
ఎప్పూడెప్పుడు వొస్తావాని

ఎలగాచెట్టు సీడానుంటి చందమామయ్యో
ఇప్పొడిప్పుడు వొస్తావాని ,,
ఇప్పాచెట్టు సీడానుంటి ,,
ఇప్పొడిప్పుడు రాకుంటేను ,,
ఇప్పాపువ్వూ రాలీనాది ,,
మళ్ళీమళ్ళీ వొస్తావాని ,,
మల్లేపొదనా నిలిచీవుంటీ ,,
మల్లేపువ్వే రాలీనాది ,,

వచ్చెదనన్న ప్రియుడేలకో ఆలస్యముచేయగా ప్రియురాలు విరహతప్తయైనది. ఆచెట్టు ఈచెట్టు క్రిందికిపోయి ఎదురుతెన్నులుజూచి పరితపించినది. మల్లె పూవులు వ్రాలిపవనగా తెల్లవారినదనియర్థము. ప్రియునిరాకకై తెల్లవారుదనుక వేచియుండినది.

విప్రలబ్ధ:— సంకేతస్థలమున ప్రియుని యరసి కానక వంచితయై చింతిలునది విప్రలబ్ధ.

,,నిమ్మలబాయీ మోటాగొడ్తే—నీళ్లాకంటా నేనేవొస్తే
నీళ్ళాలేవూ నీవూలేవు—కంటనీరూ కడువానిండే,, * ప్రియుడు నిమ్మల బావి మోటవద్ద నుండెదనన్నాడు. ప్రేయసి నీళ్ల కడవ చంకనిడుకొనిపోయి చూడ, వాడచట కన్పించలేదు. కన్నీరు కడవనిండినది.

ఖండిత:— పరస్త్రీని గూడి సంభోగ చిహ్నములతో ప్రియుడింటికి రాగా జూచి కుందునది ఖండిత.

ఉరుములు మెరుములు తరుముకవచ్చెను
తలుపన్నదియ్యవెభామా, ఇంత ముఖమన్న జూపవెలేమా
అర్ధరాతిరి నిద్దురపొద్దున ఎవరని లేతునోయి సామి ఎవరని తీతునోయి
చిన్నతనంబున గోవులకాసిన చిన్నికృష్ణుడనేభామా

నేను వెన్నెల కృష్ణుడనేభామా
బంగరయ్య నీ నన్నపు శెల్లకు రంగులు ఎక్కడివోయీ
కృష్ణ-రంగులు ఎక్కడివోయీ
బాలులంతగూడి బాసంతలాడంగ
గాలికి చిల్లెనెభామా అది ఊకెనె చిల్లెనెలేమా
నల్లవి నాసామి ఎంతమాటంటివి—న్యాయంబు నీకేమిగాదు

ధర్మంబునీకేమిగాదు * అన్యకాంతనుగూడి ప్రియుడర్ధరాత్రి నిద్రి పొద్దున దిరిగిరాగ పిర్రియురాలతనిపై కినుకవహించి కుందుచు తలుపుదీయక విలదీసి యడిగినది.

కలహాంతరిత:— పట్టరాని కోపమున పిర్రియుని ధిక్కరించి పంపియో లేక వాడు సిన్నవోయి యుండిననో, మన్మథబాధకు గురియై పిర్రియునిపట్ల గావించిన కార్యమునకు పశ్చాత్తాపము జెందునది కలహాంతరిత.

యెందుకలిగి నావురా రారానాసామి
యెందుకలిగినావో యెందుకంటిరా నిన్ను
ముందుజేసిన బాసాలెందుబోయెరా
పచ్చికొబ్బెరవాలె పాయమున్నది సామి
పాయమెవ్వరి పాలూజేతూర జాణా *

పోర్రిషిత భర్తృక:— ప్రియుడు పరదేశమునకు బోయినప్పుడా వియోగమునకు చింతిల్లి కృశించునది ప్రోషిత భర్తృక.

తొలకరి ఒకమబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒకమెరుపు మెరిసిపోయింది
పెరటిలో ఒకజల్లు కురిసిపోయింది
వీధిలో ఒకగాలి విసిరి పోయింది
ఏకొమ్మ మీదనో ఎండతాకిన పిట్ట

ఏటితోవలుబట్టి యెగిరి పోయింది_ఏరువాకనాటికే ఏడాదిదాటింది
ఎదురుచూచిన గుండె చెదరిపోయింది_పిట్ట పిట్టా ముద్దు పెట్టుకొన్నాయి
గోవులన్నీ యిల్లు చేరుకొన్నాయి_ఏటిగాలికి చిలుక లెగిరిపోయాయి
ఎందుకో నాఆశ లిగిరిపోయాయి_ఏటిఒడ్డుననేను పాటపాడేవేళ
నవ్వుతు మాబావ పూవులేరే వేళ_కొంప కోయిల పైన కూతకూసేవేళ
లేతమనసువిచ్చి పూతపూసేవేళ_బావొచ్చి నాతోటి బాసలెన్నిటొనాడి
ముద్దిచ్చి నాతోటి మురిసిపోవాలి

ఈ ప్రేయసి ప్రియునిబాసి యేడాదియైనది. అతడు దేశాంతరమేగి తిరిగిరాకుండుట చేత దానిగుండె చెదరిపోయినది. ఆశ లిగిరిపోయినవి. తొలకరి దినములలో తదాగమనమును దలచుకొని తలచుకొని తపించినది.

అభిసారిక:_ ప్రియుని చెంతకు స్వయముగ తానేపోవునది లేక ప్రియుని బిలిపించుకొనునది అభిసారిక.

చీకటి రాతిరినాడు_కోకనల్లది గట్టుకోని
ఊడల మర్రికింద_మోద్దైన తుమ్మజూచి
చీకట్లో యుడుసుకొంటిని గదరా
గట్టుదాటి పుట్టదాటి ఘనమైన అడవిదాటి
అన్నిదాటి అలిసి తరిలితి గదరా
ఒంటిగా పోవొద్దు వద్దని పైటబట్టిలాగగానె
పైటజారి సిగ్గుపడితిని గదరా * పల్లీయులలో అభిసారికల సంఖ్యయే ఎక్కువ యనిపించును. జ్యోత్స్నాభిసారిక, తమోzభిసారిక, దివసాభిసారిక యని అభిసారికలు ముత్రివిధములు. పైపాటలో నల్లని వస్త్రములు గట్టి చీకటిలో ప్రియుని గూడ బోయినది కాన అది తమోzభిసారిక. స్వయముగా ప్రియుని తన యింటికి రప్పించుకొను సందర్భములెన్నియోకలవు.

రారనాయింటికీ వొంటిగ నిదుర_రాదు నాకంటికి

కూలికోతె నాకెరార—నాలికోతె నాకెరార
సొప్పగోసి గూడుకట్టా—గూట్ల నిన్ను కూకొవెట్టా ॥రార॥ *

ప్రవత్స్యత్పతిక:— అష్టవిధనాయికలేగాక తొమ్మిదవ నాయికయగు 'ప్రవత్స్యత్పతిక' కూడగన్పట్టుచున్నది. ఈ నాయికా భేదమును కొందరు లాక్షణికు లంగీకరింపకున్నను, దీని లక్షణమిట్లుండును. అగ్రిమక్షణమున ప్రియుడు దేశాంతరగమనమునకు సంసిద్ధుడైయుండ విరహ దుఃఖితయగునది ప్రవత్స్యత్పతిక.

"తలెనిండ బువ్వబెట్టి తనమోకమటుపెటి— కంటకన్నీరు దీసేవా ఓభామా
గోటమున్నలూ గీరేవా—ఈనాడు యీపూళ్ల రేపేమో అవూళ్ల
మర్నాడు మానంధిలా ఓభామా—మర్నాడు మానందిలా
సింగోతం కట్టమీద నరసిమ్మ గుడికాద, పూలునల్లితె పుణ్ణేమాఓభామా
బుక్కానల్లితె పుణ్ణేమా,, * ప్రియుడు దేశాంతరమునకుబోవ సిద్ధమై భోజనము చేయుచుండ, ప్రియురాలు తన ముఖమును ప్రక్కకుద్రిప్పి కన్నీరు దీయుచు, తోచక కాలిగోటితో నేలగీకుచు నిలిచినది.

## రంకుతనములు:-

రంకుతనములు చిన్నకులములనబడు వానిలోనే యధికము. ఒకరి భర్త ఇంకొకరి భార్యతో, ఒకరిభార్య ఇంకొకరి భర్తతో లేదా ఇతరులతో రంకాడుట జరుగును. రంకుటాండ్రందరు పరకీయనాయికా లక్షణములు గలవారు. స్వేచ్ఛాయుతమైన సామాజిక ఆర్థికాది పరిసర ప్రభావములనేగాక, స్వార్థమన్నది అంతగా వారిలో నుండకపోవుటనుగూడ దానికి హేతువుగా గ్రహింపవచ్చును. ఆ వ్యవహారములలో ప్రాక్తనమానవ సమాజ వ్యవస్థయొక్క మౌలికలక్షణము లించుక మాత్రము మిగిలియున్నవని చెప్పుకొనవచ్చును. నాగరక సమాజములో సహితము రంకుతనములు లేకపోలేదు. కాని, యవి రంకుతనములనిపించుకొనని

విధముగా నాగరకముగా పలచబడియుండును. మీద మెరుగు లోనపురుగు వంటి వ్యవహారమది. పల్లీయులలో మాత్రము మెరుగు మెరుగుకొరకే పురుగు పురుగు కొరకే. వీరిమాట పుల్లవిరిచినట్లేగాని, నారసాగినట్లు కాదు. కాబట్టియే నిత్య జీవితములోని మంచిచెడ్డలు, రంకు బొంకులు మున్నగునవి పల్లీయుల నోటి నుండి ఉన్నదున్నట్లు బహిర్గతములగుచుండును.

రారా నాముద్దులయ్యా సెలియా పోరా నాముద్దులయ్యా
ఏపూరు సంతాకు మాపే పయినాములో ॥రారా॥
అందలేదు పొందలేదురో సెలియా వొట్టిదూరు వొందెనేమిరో
కచ్చకాయల సెట్టుకింద కాసెపుల్లలాడ్తినంట ॥రారా॥
అత్తపెట్న ఆరడికిరా సెలియా మొగడుపెట్న బాధలాకురో
బాయిలన్న పడ్దమంటె పిల్లలాగుడైతరమ్మ ॥రారా॥
అత్తపెట్న ఆరడికిరా మొగడుపెట్న బాధలాకురో
పురిపెట్టుకుందమంటె మిండడాగుడైతడమ్మ ॥రారా॥
ఎదురింట్ల యాకపైతె ఎదురింట్ల నీళ్లాడితే
నీవొక్క పుణ్యాన నాకొక్క కొడుకో ॥రారా॥
రెడ్డిగారి యింటికాడరా సెలియా నీపుగానముంటిపేమిరో
నీవొక్క పుణ్యాన నాకొక్క కొడుకో ॥రారా॥ *

ఈయాడుది రంకాడు చుండిన కారణమున నిత్యము అత్త, మగడు బాధించుచునేయున్నారు. అటు మానుకొనజాలక, యిటు బాధలు పడజాలక మరణింతమనుకొన్నది. కాని, తనపిల్లలు, మిండడు అగడగుదురని యెంచి ఆ ప్రయత్నమునుండి విరమించుకొని, ఏపూరి సంతకైనబోయి సరసమాడుకొన వచ్చునని ఎదురింటనున్న మిండని బిలుచుచున్నది. దానికి మగని మీద అయిష్టము. అయినను దాని రంకుతనము వాడు గుర్తుబట్టి కట్టుదిట్టములలో నుంచగా నది—

ఇంటిమొగ డింట్లుండాడు ఇదుపునొక్క రాయుండాది

రాయిజూసి రాకయ్యో ఓతెలుగోల్లబాలయ్య
ఇంటంచున యిల్లుండది విరోదం సానుండది
నీయింటీ సందూన నాయింటీ సందూన
సన్నసికలు పోసిన్రు జాదలు వడరాకయ్యో ॥ఓతెలుగోల్ల॥
నీబాయి దూరముశాన నేను కట్టెలకొస్తామరి
కనుగలిగివుండయ్యో ఓతెలుగోల్లబాలయ్య
బొమ్మమేడి సెట్టుకింద బొట్టునీవు పెట్టుకోని
ఒట్టుదీసుకుంటివిహొ ఓతెలుగోల్ల బాలయ్య *

అనుచు పరిస్థితిని దెలిపి తానే వచ్చెదనన్నది. అందుకు వానితో గట్టి ఒట్టు పెట్టుకొన్నది. కాని, వానిని చేరబోవు ఉపాయమొకటి ప్రయోగించి, తనకు తేలుగుట్టినట్లు నటించి జారవైద్యు (ఉపపతి) నిల్లచేరుకొనుటయైనది.

,,తేలుగుట్టిందే వోయత్త తేలుగుట్టిందే
యాడగుట్టిందే కోడలయాడగుట్టిందే
నడిమేలు గుట్టిందే ఓయత్త నాబికెక్కిందే .... .... .... ...
ఎదురింటి పిల్లోడే ఓయత్త యాపసెట్టింటోడే
ఆడుబెట్టే మందయితె సల్లగ దిగిపోద్దే *

ఇట్లు చిత్తమున కనుకూలమైన వాడెవడుండునో వానిని కామతృష్ణాదిక్యతకులోనైకూడు రంకుదానిని 'పునర్భువు, అనుట బాభ్రివ్యుని మతము1. ఇంతటి చాకచక్యము రంకుస్త్రీకే చెల్లును. ఇట్టి సంఘటనయే గాథాసప్తశతిలో గూడ జూడవచ్చును2.

---

1. వాత్స్యాయన కామసూత్రములు ( హిందీ అనువాదము_కవిరాజవిపినచంద్ర బంధు.) పుట. 133.
2. హాలుడు:_ గాథాసప్తశతి_3.37.

తన్ను దోడుకొనిపోవ భర్త వచ్చినచో తోలవద్దని యొక పడుచు, తన తల్లితో జెప్పుకొనుచున్నది.

అమ్మానేను పిన్నదాన్ని—అల్లుడో స్తే తోలవాకే
యింతా యింతవి నాసండ్లూ— సింతాగింజ అంతలేవు
ఢిల్లీపట్నం సల్లాగుంటె—దినాం రూపాయి నేనెత్తూ
సిల్లరప్పులు దుల్లాసేతు—సిన్నాతమ్ముని పెండ్లీసేతూ
ఇంటిమొగనికి సుట్టాకుపొవ్వాకు—బయిటీ మొగనికి బీడీలకట్ట
నడుమ దిరిగే కుంటెనకానికి నల్లగొండ సిగిరేటుడబ్బి
ఇంటిమొగనికి యీతాకుసాప—బయిటిమొగనికి తాటాకుసాప
నడుమ దిరిగే కుంటెనకానికి నల్లాగొండా దూటీపరుపు,, *

చిన్నకులములలో ఆడుబిడ్డ తల్లివారింట నెన్నాళ్లున్నను బరువేమికాదు. అందరి వలె నామె కూడ సంపాదించి తెచ్చును. ఎన్నాళ్లుండ దలచినచో అన్నాళ్ళుండ వచ్చును. పైపాటలోని పడుచు, తల్లిగారియూరనే రంకునేర్చినది. భర్తవచ్చినను తానింక చిన్నపిల్లనే యని చెప్పి అతని వెంట తోలించ వద్దని చెప్పుకొన్నది. అప్పుడు చిల్లరప్పులుదీర్చి చిన్నతమ్ముని పెండ్లికూడ చేతునన్నది. అది తన మగనికంటె బయటిమగనికి, వానికంటె కుంటెనకానికి మిగుల మర్యాదచేయుటలో నెరజాణ. లంజె మిండల దంటకూర్చువాడు కుంటెనకాడు. నాయికా నాయకులను కూర్చుటలో నేర్పుగల విదూషకునితో నించుకపోలగలుగువాడు వీడు. కాని, వీడు సామాన్యుడుకాడు. లంజెను తనవైపునకు గూడ మార్చుకొన నేర్చువాడు. బయటిమగనితో సంబంధముగూర్చిన సందర్భములలో కుంటెనకానితో చేదోడు వాదోడు చెలిమి యేర్పడగానది అందరికన్న వానికే అధికముగ నాదర మిచ్చుట యగుచున్నది. దానిభర్త వచ్చి యింటనున్నప్పుడు వచ్చిపోయెడు రంకుపతికి—

వస్తావు పోతావు నాకొరకూ—వచ్చి కూకున్నాడు నీకొరకూ
సగం సచ్చున్నాను నీకొరకూ—సాలీం(సాంతం) వస్తావు నాకొరకూ

అనుచు నన్యాపదేశముగా సూచన లిచ్చుచు—''మిట్టలెక్కి చూసువాడ—మష్టి కాకరచెట్టుకాడ—ముద్దుముద్దూ కలిసి పోయేరా దయగల్లసామి—రేపు పయనామాని దెల్పారా,, అనుచు సమాచారమునుగూడ అందించినది. ఇది ''అత్తవారూరికి పంపేరు మావారు— అయ్యో నేనేమి సేతూర,, అను క్షేత్రయ్య పదమునకు (క్షేత్రయ్య పదములు — ద్వితీయ భాగము) చక్కగా సరిపోలుచున్నది. ఈ పడుచుది అన్యోఢయైన పరకీయనాయిక. అత్తవారింటికి పయనమై భర్తవెంట పోవుచుండ, దాపుదాపున దాని వెన్నంటియే ''పోతావ్ పోతావ్ పిల్లో మొగనెంట పోతావ్పిల్లో—పొద్దన్న దట్టదేపిల్లో—అడ్డమున్న బడవేపిల్లో—మోదుగులు సాటామే పిల్లో — మొగమన్న జూపించు పిల్లో ,, అనుచు రంకుపతి పరితాపమున బల్కుటయైనది.

ఒకముదుసలివాని పడుచుభార్య, వాని నిస్సహాయస్థితికి నొచ్చుకొని మరొకనితో కూడుకొనుటగాని మారుమనువు పోవుటగాని జరుగును.

ఇంట్లాపంతే ఉడుకాబోసే ఈవల వంతే సలిగాచ్చే
లోపలిగొళ్లెం బీయితాతా ముసలయో ముసలయో
కోనాపురం మాదిగోడు కోతిముఖమూ రాజిగాడు
కనకమా మారుమను మడిగినాడు మారుమనుమడిగినాడు
మంచీమొగడూ దొరకాపాయే ముసలయో గతిమల సంసారామాయే
మ్యాకామేయని చెట్టూలేదు సేనూ తిరుగని భూమీలేదు
నల్లగొండ తీరుతముల కొంగువరుపని జాగాలేదు
నీవేగత్తైపోతివిరో ముసలయో ముసలయో
నెలమీద పదిరోజులాయె కనకమో ఆరునెల్ల కడుపెక్కడిదే
నామొగడూ ముసలోడూ నాదెగ్గరికి రాలేదు
నీవుచేసిన కడుపేరో రాజిగో,, * ఈ పడుచుదానికి మారు మనువు బోవుట కిష్టమనిపించలేదు. ఉన్నమగడే యట్లుండ మారుమనువు బోయినచో

ఆ మగడెట్లుండునో యను అనుమానము చేత, కంటికి నచ్చినవానితో కలిసి ఎటు తిరిగినను ఏమిచేసినను చింతలేదనుకొన్నది. చిన్నకులములలో మారుమనువు పోవుట అనూచానమైన ఆచారము. భర్త చనిపోయినను, నిస్సహాయుడైనను, రాసిరంపానబెట్టువాడైనను వానితో తెగదెంపులు చేసికొని మరొకని పెండ్లాడుట జరుగును. ఇట్టిది నేటి ఆధునిక యుగమున నాగరక సమాజములో విడాకులపేర చట్టబద్ధమైనది. నాగరక సమాజ ప్రభావమున కట్టుబొట్లు కొంతవరకు మార్చుకొని కులుకు దొముకులాడి (ఎన్నెలాడి) ని జూచి పల్లీయుడూరుకొనడు. కృత్రిమమైన వగలొలుకబోసినను కవ్వించిపెట్టకమానడు. ఆధునికమైన అట్టి రంకువాలకములను కొన్నింటినిట్లు తూర్పారబట్టుట యొప్పును.

"ఏమిచిత్ర మేమిచిత్రమూ పాపంచమంతా
ఏమిచిత్ర మేమిచిత్రమూ పాపంచమంతా
కొత్తపన్నె చీరలాయే గోసుల్లేని కట్టుడాయే
ఉత్తరాలు రాసుడాయె తొత్తులాకు సదువులాయే
రంకుకథల ముచ్చట్లు రాత్రింబగలేచాట్లు
పంకరదువ్వే పాపట్లు కుంకుమ సరిపడనీ బొట్లూ
తీరుతీరు పలారాలు తీరకుండ కలయామూలు
వేరవేర సంసారాలు పేలముండల పపంచాలు
ఆడవారి సదువుల్లు ఆరగింపులేనిగుళ్లు
అదర బెదర చూసుడాట అద్దంలో సూసుడాట
సిన్నపెద్దల తెలుపకుండ సీరలిడిసి కట్టుడాట
ముడిలేని రైకలాట లోపల బాడీలాట
ఇగ్గిగ్గికట్టుడాట ఇరిసి ఇరిసి నడుసుడాట
ఆదర బాదర సూసుడాట ఆపలబడి దుంకులాట
మూడు ఆమెడలు సూడకుంట ముండరాండ్లకు పెండ్లిఆట *

ఇందలి సామాజిక విమర్శ ఆధునిక సమాజమంతటికిని వర్తించును. దీనిని బట్టి

చూడ, పల్లీయునకు సహితము నవనాగరపు పోకడలు నచ్చవని తెలియుచున్నది. నేటి చదువులు తొత్తులపాలయినవని వారి అభిప్రాయము.

రంకు చేష్టలలోని కిటుకులెన్నియో? మరొక పడుచు తన అవ్వతో—

పొట్టిముక్కలుదంచె అవ్వా వోయెల్లి—పొట్టనిండవెయ్యే అవ్వావోయెల్లి
రొయ్యలకూర వండే ,, —రొయ్యాలు వెయ్యే ,,
పరిసె గొంగడి తేవె —కాళ్ల నిండ గప్పే ,,
చేసుకున్న వాడొస్తె ,, —చెల్లిపోయిందని సెప్పే ,,
అత్తమామలొస్తె —అయిపోయిందని సెప్పే ,,
బావమరదులొసె —బతుకదాని చెప్పే ,,

ఇటు చెప్పుచు "ఉంచుకునోడొస్తే ఉన్నదని చెప్పు" మని మాత్రము ఉత్సాహముతో బలికినది. ఇంకొకస్త్రీ, చేతినిండ అందమైన గాజులు తొడుగుకొని, గంధమలదుకొని, చెంపన సంపెంగపూనె యంటుకొని, ఉపపతికై వీధులరసి "కూడుపెడ్తా తినిపోరా—కూడవస్తా తీసుకుపోరా—మల్లులేని మల్లెకింద—ముద్దులాడీ మల్లపంపారా" * అన్నది. ఒక రంకుదాని అత్తమామలు, మగడు బాధపెట్టినను గూడ ఆపని నుండి విరమించుకొన లేదు. తిరుగ మరిగిన దాని నెవరేమి చేయలేరు. మరింత ధైర్యముగా చెలగి వర్తించును.

"అత్తగొట్టె మామగొట్టె గొట్టెపొదల దాగవోతె
గొట్టెపురుగు గొల్లిగొట్టేరా—ఓచిన్నవాడ గొల్లికొరికి ముల్లువీకారా
ఊగి ఊగి దెంగబోకు—ఉట్టివంక చూడబోకు ఉట్టిమీదపాలమీగడ
ఊకెదెంగు నీకె పెడతారా" మితిమీరిన రంకువ్యవహారములు స్త్రీపరము గానె యున్నప్పటికిని ఇట్టి అశ్లీల శృంగారములల్లువారు మాత్రము కోదెవయసు కొంటె దుడ్డెగాండ్రే. వినుటకు వెగటైన అశ్లీల శృంగారమును బట్టియే జానపద సాహిత్యము నింతవరకు కొందరు పండితులనబడువారు ఈసడించుచు వచ్చినారు. ప్రాచీన సాహిత్యమున గూడ అశ్లీల శృంగారమును వర్ణించిన

కవులు లేకపోలేరు. కచకుచములను, కామకేళిని కసిదీర వర్ణించినారు. అంగాంగ సౌందర్యమును బరిబత్తల చేసినారు. తారాశశాంక విజయము, సారంగధర చరిత్రము, అహల్యాసంక్రందనము వంటి ప్రబంధములలోనేగాక, ముఖ్యముగా చంద్రరేఖావిలాపములో „లంజెముండ యిచటికేల వచ్చెను„1 „వెసదానిని దోకొని వచ్చి చూపుమా నాకెదలోని మన్మథ కనద్ఘన పావక తాపమాఱగన్„2 వంటి అశ్లీలమైన శృంగారము వర్ణింపబడినది. ఇంతేగాక, చంద్రరేఖయు సింగన్నపాలుడును క్రీడించిన విధము అసభ్యతరముగా వర్ణితము. క్షేత్రయ్య పదములలో సాధారణముగా ప్రతిపదము అసభ్య శృంగార వర్ణనతో ఒప్పును. రతికేళిని గూర్చిన విషయముండని పదములేదన్నచో అతిశయోక్తి కానేరదు.

„ఏమి సేతు కన్నెప్రాయము నెడజేసె దైవము
అముకొన్న రతిసుఖము అనుభవించే దెన్నటికో„3.

„నిక్కు నాగుబ్బల గోటనొక్కి యెదజేర్చుకోరా
యెక్కువైన రతులచే గ్రక్కున నన్నేలు కోరా„4

„కొఱికి కెమ్మోవి చవిజూతునుగాని
గుబ్బలు కొన నొక్కుటకు వెరతునమ్మా,
సారెకు జొచ్చిల్లు తేనెలూర జాణగ విందునోయని
కూరిమి నుపరతి సలుపుదుగాని,
కూడ సమ్మతించుటకు వెరతునమ్మా„.5

---

1. కూచిమంచి జగ్గకవి:-చంద్రరేఖావిలాపము—ఆశ్వా 2. పద్య. 87.
2. „ „ —ఆశ్వా. 3. పద్య. 59.
3. క్షేత్రయ్య పదములు— ఆంధ్రగానకళా పరిషత్ప్రచురణ, పదము. 122
4. „ „ „ 76
5. „ „ „ 74

,,సందేహమేల ఇకశయనించి సురతులు
జెందిననన్ను పరతులు సేయుమనకు మెండైన నీకు ఆనందమయ్యేచోట
కందర్ప జనక చక్కని మువ్వగోపాల,, 1 వంటి పదములు మచ్చునకు
గ్రహింపవచ్చును. ఇంకను, ,,తొడ తొడ సోకియుంటిమా, ఉదుటు గుబ్బల
పోటు బరసి రొమ్మున మెరసె, కుసుమాస్త్ర గృహముపై కొనరి చేవేయగానె,
చిరుతొడలపైన చేసోకనీడాయె, కులుకు గుబ్బలపైన గోరులుంచడాయె, పమ్యెద
తొలగించి పాలిండ్లపై నొక్క చెయ్యైన వెయ్యనొప్పేవా, ఆ రతి కూజిత
మాపెవినేనంటి, మరుసిల్లు చెమ్మగిల్లుట, చొక్కపోడి చల్లినట్లాయె,,వంటి పెక్క
అశ్లీల పదప్రయోగములు ఔచిత్యము నతిక్రమించి కన్పించును. మహాశివు
లనబడు వారికే యిటులున్న మామూలు ప్రజానీకపుమాట చెప్పవలెనా? అయినను
జానపద సాహిత్యమున నిట్టి అశ్లీల కవిత్వము శతాంశమే. అంతమాత్రమున
ఆ సాహిత్యమంతటిని ఈసడించుట అన్యాయమగును. పల్లీయులున్నదున్నట్లు
బహిర్గతముచేయుటలో సిగుపడరు. అదివారి కల్లకపటమెరుంగని మనస్తత్వము.

,,యాశికినన్ను తోలబోకు యెక్కసం మాటలాడకు దొరో
యెరుకలోల్లింటికి ఎరువుకనిపోతె, యెర్రికుక్కవచ్చి యాటాడెదొరో
మామిడితోటకు పండ్లకంటపోతె తోటకావలున్న
తెనుగురాజిగాడు పండుఇస్తనాని పండుమనె దొరో
కాపువాళ్లింటికి చల్లకనిపోతె చల్లపోస్తనాని చంకలుపట్టెదొరో
కుమ్మరోనింటికి కుండకంటపోతె కుండిస్తనాని గుల్లిచ్చెదొరో
అవుసలోనింటికి మట్టెకంటపోతె మట్టెలిస్తనాని మంచమేసె దొరో
మాదిగోనింటికి తాడుకంటపోతె, తాడిస్తనాని తట్టేసె మొగడో
బెస్తోనింటికి చాపలకనిపోతె చాపలిస్తనాని సాపేసె మొగడో
ఆరునెలలాయె నీవుపోయిమొగడో—ఎచ్చెటాలకు కడుపాయె మొగడో

1. క్షేత్రయ్యపదములు;—ఆంధ్రగానకళా పరిషత్ప్రచురణ— పదము. 122

ఇది యెంతయోగాని మగడు దేశాంతరగతుడైయుండ కలిసిన వానితోనెల్ల చెలిమి చేసి గర్భము దాల్చినది. ఏయే సందర్భములలో దానికెట్లు వివిధ వ్యక్తులతో తొడపరిచయము గలిగినదో తిరిగివచ్చిన మగని యెదుట పూసగ్రుచ్చినట్లున్నది. వాడందులకు కోపగించగా, తన్నొంటరి జేసిపోవద్దని, అక్కడిక్కడికి పంప వద్దని, ఆమీద ఎకసక్కెము లాడవద్దని విన్నవించుకొన్నది. ఇది మిక్కిలి రంకాడనేర్చిన దానివలె గన్పించును. బహునాయక రతికిది నిదర్శనము. దాని కింతమంది ఉపపతులున్నచో వారి మధ్యకూడ కీచులాటలు తప్పవు. అప్పుడది ఇరకాటమున బడి—

,,వాడంటడు నాలంజెని వీడంటడు నాలంజెని
నేనెవ్వని లంజెనురో ఇంజనుమీది గుంజన్న
అయిదుగాడు సయిదుగాడు అయిదున్నర జీతగాడు
లంజెను రమ్మంటడురో ఇంజనుమీది గుంజన్న
ఇంజనుమీది సెయ్యుంచు లంజెలమీద కన్నుంచు
ఇంజనుబాగ దించయ్యో ఇంజనుమీది గుంజన్న,, *

అనుచు వారిలో ముఖ్యుడైన ఇంజనుమీది వానికి నివేదించుకొన్నది. అంతేగాక మిండలమాట నమ్మకొని మగని జంపుకొనుటకూడ జరుగును.

,,చేటడంత మొగులుసూసి—చెర్లనీళ్లు సల్లుకుంటి
మిండెలార ముమ్మసూసి—ఇంటిమొగని సంపుకుంటి,, * అట్లే మగని చేత తానుగాని, మిండడుగాని చంపబడుటయును జరుగును. మరొకతి ఉపరతికై యెంతకు సాహసించినదో చూడవచ్చును.

,,మొక్కిన మొక్కులు సల్లాగుండీ—మొగుని కళ్ళుపోతే
కట్టామీది అంకాళమ్మకు—పెట్టాకోళ్లనిస్తా
దండుకువోయిన ఇద్దరు మరదులు—గుండ్లూతగిలిస్తే
సాతులూరి ఆపోతరాజుకు—మేకపోతులిస్తా
సంకనవున్నా సంటిబిడ్డకు—సన్నిగొట్టిపోతే

సత్తెనపల్లి గోపాలునికి నిత్తె పూజ సేతూ,,— ఇట్టి వారు కోటి కొక్క రుందురు. వారికి హృదయమన్నది ఉండదు. 'కామాతురాణాం నభయం నలజ్జా' కదా! కనుక వారు 'మగనికన్న దొంగమగని పొందెమేలు' (క్షేత్రియ్య పదములు) అని నిశ్చయించుకొందురు. ఒక్కొక్కమారు పురుషుడే స్త్రీని బలాత్కారముగా మాయజేయుట యన్నది తోట మూలకు, మోట దారికి, గుడిసె మూలకు పరిచయమే.

,,నేనెల్లకెల్ల కెల్తినమ్మ గోంగూరకి— మాయదారి నాకొడుకు గోంగూరకి
నన్ను పాకచుట్టు తిప్పాడె ,, పాకలోకి లాగాడె ,,
కొంగుబట్టి లాగాడె ,, రయికముడి యిప్పాడె ,,
మాయదారి నాకొడుకు ,, నన్నుమాయజేసి ముంచాడె ,,

గోంగూరకని వచ్చినదాని నొకడు కొంగుబట్టి కళ్లమునను్న గుడిసె లోనికి పట్టుకొనిపోయి మాయజేసి మర్మము దెలిపినాడు. ఆ మర్మమునహితమూ పకుచు దాని నోట దాగలేకపోయి పాటగా నవతరించినది. విటకానితో క్రీడించినప్పుడు గాజులు, మట్టెలు వ్రాలిపోయినవి. ఒడలెల్ల దంతక్షతములు, నఖక్షతములు ఏర్పడినవి. ముక్కు నత్తూడిపోయినది. ముఖమునగల తిలకము చెదరి పోయినది. అప్పుడవియన్ని చూసికొని, తనభర్త యేమనునో యను భయముచేత అది విటకానినడుగ, వాడిట్లు సమాధానముజెప్పుచు భయనివారణ చేయుచున్నాడు.

స్త్రీ: చేతిగాజులుపోయెనూ చినవాడ రాజడిగితేమందునూ
విటకాడు: సెనగపూ రోకలనుమీ చినదాన చెయిజారి పోయెననుమీ
స్త్రీ: కాలిమట్టెలు పోయెనూ చినవాడ రాజడిగితేమందునూ
వి: మనగడప పెద్దదనుమీ చినదాన గడపదగిలి పోయెననుమీ
స్త్రీ: ఒళ్లెల్లరక్కులాయ్యె చినవాడ రాజడిగితేమందునూ
వి: మనఇల్లు చీకటనుమీ చినదాన మనపిల్లి రక్కులనుమీ
స్త్రీ: నొష్టబొట్టువోయెనూ చినవాడ రాజడిగితేమందునూ
వి: చిరుచెమట లెక్కెననుమీ చినదాన చెమటకు కరిగెననుమీ

స్త్రీ: ముక్కునత్తు పోయెనూ చినవాడ రాజడిగితేమందునూ
వి: ముత్యాల చెరువులోన చినదాన మునిగితే పోయెననుమీ

ఇట్లు శిక్షణ పొందినస్త్రీ బొంకుటలో నేర్పరియగును. చీకటి తప్పుచేసి ఇంటికి వచ్చినప్పుడు మరది చూసి యడుగగా అది సమాధానమిచ్చిన తెరగెట్టిదో పరికింపుడు.

మరది: ఒదినే ఒదినే ఓసిన్నవాదినే_సీరెట్ల సినిగిందో వాదినే
వదిన: పాపేలింటికి పాలకుపోతే పలుగడి పట్టిందో మరిదీ
మరది: ఒదినే ఒదినే ఓసిన్నవాదినే_రైకెట్ల ఏకిలిందో వాదినే
వదిన: గజాన రోకలి బుజానపెట్టుక_ఊటుకు ఏకిలిందో మరిదీ
మరది: ఒదినే ఒదినే ఓసిన్నవాదనే_బొట్టెట్ల సెదిరిందో వాదినే
వదిన: ఉగాది యెండల వుపూపికొత్తె_సెమటకు సెదిరిందో మరిధీ *

కనుకనే రంకాడిన బొంకాడునన్న సామెత వచ్చినది. మరొక నెరజాణ, భర్త యడిగినప్పుడిచ్చిన సమాధానము గడుసుదనమొలుక వోయుచున్నది.

భర్త: నీళ్లకు నిన్ను బొమ్మన్నగాని_చెంపాన కాటు యాడిదెభామా
భార్య: ఒయ్యారికడువను పంచినే ముంచంగ
జెల్లపచ్చి చెంప కొట్టెరా మొగుడా
భర్త: అంగడినే నిన్ను బొమ్మన్నగాని_యీపునగడ్డలు యాడివేభామా
భార్య: అంగడి తొవ్వలా అచ్చమావులమంద
పోతుల్లకల్లపోతు గుద్దెర మొగుడా
భర్త: ఊరికేనిన్ను బొమ్మన్నగాని_ కొప్పున పువ్వులు యాడివేభామా
భార్య: వడిగాలి సుడిగాలివచ్చి_కొమ్మవిరిగి కొప్పునిండెరామొగుడా *

రంకుతనము నెంతపొంకముగా బింకముగా బొంకుట యన్నది అట్టి స్త్రీలకు కరతలామలకము. మిండలిట్టి స్త్రీలను లేవదీసికొని దేశాంతరమునకు పోవుట యును జరుగును.

"సలికేసార లమ్ముకోని గాడికర్సు కట్టుకోని
దేశంబోద మంటీవే ఓగొల్లోల్ల సెన్నమ్మ
బొట్లబొట్ల డబ్బాలాడి బొంబాయిగాడి వోతున్నాది
బొంబయి సూతమంటీవే ఓ గొల్లోల్ల సెన్నమ్మ .... .... .... ....
కాసే పూసే కందిసేను పంటాపండే జొన్నాసేను
గొంగడి ఎరువ మంటీవే ఓ గొల్లోల్ల సెన్నమ్మ .... .... .... ...
మాదిగోని బాయికాడ మారెడుకాయ సెట్టుకింద
మాటసెప్తనంటీవే ఓ గొల్లోల్ల సెన్నమ్మ
తల్లీగారి ఇంటికాడ బొమ్మామేడి సెట్టుకింద
బోగమోల్లపిల్లావె ఓ గొల్లోల్ల సెన్నమ్మ
సేనుకొయ్యే డొంకలోన గట్టుకొయ్యే తెరువులోన
కానీసూత మంటీవే ఓ గొల్లోల్ల సెన్నమ్మ". సుదూర ప్రేమికుడొకడు పడుచుదానిని లేపుకొని పోలేక అప్పుడప్పుడు రాకపోకలు ఘటించుచుండుట చేత వాని సంపాదన మంతయు గాడి ( రైలు ) ఖర్చులకే సరిపోవుచున్నది. తనకొరకింతగా పైసపాడుచేసికొనుట తగదనుచున్నవా పడుచు.

"నువ్వేడా నేనేడా నెల్లూరిదేశమ్మురో మాదిగోల్లపోరడా
మాదిగోల్లపోరడో మాలోల్ల పిల్లమీద
మనసెట్లా పొందెరో మాదిగోల్ల పోరడా
గడ్డిమ్మిన పైకమంత గాడి కర్సుకాయెరో .... .... .... ....
ముప్పయి రూపాయిలటీ ముక్కుపోగుందిరో
ముద్దూముద్దూకు ఒక ముత్తెంరాలిందిరో ॥మాదిగోల॥
నలుపయి రూపాయిలటీ నడుముకు డాబుందిరో
గుద్దూ గుద్దూకు ఒక గజ్జెరాలిందిరో ॥మాదిగోల్ల॥ "
మాదిగ పోరడు ఆ మాల పిల్లను సొంతము చేసికొన్నాడు. వాడు ముద్దాడిన ఆ ముద్దులకు దాని ముక్కుపోగున గల ముత్యములే రాలినవట. ఆ ముద్దులలో

తిర్యక్చుంబన, ఉద్భ్రాంతచుంబన, అవపీడితచుంబన, ఆకృష్టచుంబన క్రియలు[1] క్రియాత్మకములైనవి. అవన్నియు కామోద్దీపక చుంబనములే. తత్ఫలితముగ వారిలో కామోత్తేజమైనది. సురతక్రియలో ఒడ్డాణపు గజ్జెలురాలినవి. సంభోగ సాఫల్యము ప్రాప్తించినదని భావము. ఆ మాధుర్య శాస్త్రమవ్వారికి అనుభవైక వేద్యము. ప్రబంధ నాయికా నాయకులు సహితమా చుంబన కళనెఱుంగరు. మొత్తముమీద పల్లీయులలోగల రంకుతనములను పరిశీలింపగానట్టి వానికిమొదట స్త్రీచేతనే ప్రేరణయగుచున్నది. అట్టి స్త్రీలు సహితము పరిసరములకులోనై జారిణులగుచున్నారు. అత్తమామల పోరువలనగాని, తగని మగని వలనగాని, నిర్వీర్యుడైన మగని వలనగాని, పెద్దకాలము మగడు దేశాంతరగతుడైనగాని కొందరు స్త్రీలు వ్యభిచారమునకు పాల్పడుచున్నారు. అట్లు స్త్రీ చెడిపోవుటకు గల కారణములు వాత్స్యాయనకామసూత్రములలో గూడ చెప్పబడినవి[2]. కేవలము కామవాంఛలకు గురియై వ్యభిచరించి వ్యాపారముగా మలచుకొన్న ఉదాహరణలు నాగరకులలోనే మిక్కిలిగా గన్పించును.

,,రమ్మంచును నమ్మించును, బొమ్మంచు గోకలాకు పోకల్ రూకల్
కొమ్మించు సొమ్ములెమ్మం, దెమ్మంచును లాగులంజె తెగివిటుమీదన్,,

(చంద్రరేఖా విలాపము—ఆశ్వా. 2 పద్య. 30) వంటి వేశ్యలు నాగరక సమాజములోనే యుందురు. వారిలో నుత్తుత్త మీది మెరుగులు గన్పట్టునే గాని పల్లీయుల లోవలె ప్రేమగన్పట్టదు. ఎంతరంకాడినను పల్లెవనితలలో మోసపున్నది స్వల్పము. ఇప్పట్టున గాథా సప్తశతి (4-16) లో నుడివినది అక్షరాల సత్యము. లావణ్యముకన్న ప్రేమయే పల్లెటూరలభించునని దానిభావము.

---

1. వాత్స్యాయన కామసూత్రములు:— అధికరణము. 2. అధ్యా. 3.
2. ,,అతిగోష్ఠీ, నిరంకుశత్వం, భర్తుస్స్వైరతా, పురుషైస్సహ నియంత్రణతా, ప్రవాసేఽవస్థానం, విదేశేనివాసః, స్వవృత్త్యుపఘాతః స్వైరిణీ సంసర్గః, పత్యురీర్ష్యాళుతా, చేతిస్త్రీణాం వినాశకారణాని—,, అధి.5 అధ్యా. 6 సూ. 49



# కవితాస్వరూపము

తెలుగు సాహిత్యములో నన్నయాదుల కవిత్వముకన్న జానపద కవిత్వము ప్రత్యేకమైనది. విలక్షణమైనది. అచ్చమైనది. తెలుగులో ఆదికవిత్వమేది యన్నప్పుడు అది జానపద కవిత్వమేయగును. ఏలన, ఏభాషలోనైన తొలు దొలుత పుట్టిన కవిత్వరూపము పదమే (పాట) యగును గాని మరొకటి కానేరదు. అట్లే తెలుగులోను మొట్టమొదట పదకవిత్వమే పుట్టినది. ఆ పదమైనను తాళ లయాత్మకమైనట్టిది. ప్రకృతిలో నొకానొక సన్నివేశములో తబ్బిబ్బైన సనాతన జానపదుని యొక్క నిసర్గమై నిగుడేరు కమ్మని పూలగుండియనుండి చిలికించిన పలుకుల పొందికంత కవిత్వమే. అదియును చిందులువేయుచు, కూనరాగములు తీయుచుండినవేళ బహిర్గతమునావించినట్టిది కాబట్టి నేటికిని జానపద గేయోత్పత్తి యిట్లే జరుగుట చూచెదము. అందుచేత నెచ్చటనుగూడ తాళలయలు కుంటుపడి యుండవు. అందలి భావముగాని, వస్తువుగాని, రచన (భాష) గాని ఏమాత్రము కృత్రిమమొలుక బోయదు. అసలు జానపద కవితాభావ పరిమళమును మోసికొని పోయి దెసల కంటించునది పైరగాలివంటి లయ. లయ సర్వత్రి వ్యాపించు గుణముగల వాదముయొక్క ప్రధానలక్షణమేగాక తత్సౌందర్యమూలకము. అట్లు పరిమళాత్మకమైన భావము, పైరగాలివంటి లయ ఉండుటచేత ఆ కవిత్వము సార్వజనీనము, సార్వకాలికము నైనది. తోడినకొలది చెలమలో నీటి యూట తేటగ ఊరినట్లు పల్లీయుల ఎదలోపలి యెదనుండి సహజ కవితాస్రవంతి పిచికలెత్తి వచ్చుచుండును. కనుకనే యది మానవాళికి మధుర కవిత్వమైనది. మానవతకు మంచి యద్దమైనది.

జానపద కవిత్వమునకొక కర్తయనువాడు తెలియనందున తత్కర్తృత్వ నిర్ధారణచేయలేము. అంతేగాక, అది దేశకాలవిభజన కతీతమైనది. పంచభూతముల వంటిది. పండితాదరణముగాని, రాజపోషణముగాని అవసరము లేక పోయినది.

అవసరము లేకపోయినను దాని నాదరించుచుండిన వారు లేకపోలేరు. పూర్వము కొందరు పండితులు జానపద కవిత్వము నుండే దేశికవిత్వరూపమును ఏర్పరచి ఆదరించినారు. నన్నయ్య ఏముహూర్తమున వ్యాసభారతమును తెనిగింపగడంగెనో అప్పటినుండే తెలుగు సాహిత్యము సంస్కృత ప్రభావమున చిక్కి అనువాద మార్గమును ద్రొక్కినది. దానితో ఆనాటి జానపద సాహిత్యముయొక్క రూపరేఖ లెట్టివో తెలిసికొనుట కష్టమైనది. కాని, పాల్కురికి సోమనాథుడు తనకాలమునాటికెన్ని విధములైన పదములుండినవో తెలిపినాడు. ప్రజలలో వాని ప్రచారమే యెక్కువ. ఆనాడు "కరమర్థి నూరూర సిరియాళు చరిత్ర"-పాటలుగా గట్టి పాడెడువారు"2. అంతకు పూర్వమేయుండిన నన్నిచోడుడు ఆనాటి గీతభేదములను పేర్కొనుచు వానినేయే సన్నివేశ సందర్భములలో బాడుచుండిరో కుమారసంభవములో పెక్కుచోట్లవర్ణించినాడు. నన్నయకు పూర్వము జనులలో రామాయణ భారతాది కథలు పల్లీయ ఫణితులలో ప్రచారమైయుండవచ్చును. ఆ జనులే వానిని ఆదరాభిమానములతో పోషించియుందురు. ఇప్పటికిని పల్లెలలో తోలుబొమ్మలాటలు, యక్షగానములు మున్నగునవి ఈ కోవలో జీవముపోసి కొన్నవే. జానపద కవిత్వము ఏ ప్రజలలో బుట్టినదో ఆ ప్రజలలో నిలిచి యున్నది. కాని, ఏకొందరుబ్బులు కుందపోతగా కురియునోయని నోరుచాపక

---

1. "పదములు తుమ్మెద పదముల్ ప్రభాత-పదములు పర్వతపదములానంద పదములు శంకరపదములు నివాళి-పదములు వాలేశు పదములు గొబ్బి పదములు వెన్నెల పదములు సంజ-వర్ణన మరి గుణవర్ణన పదము లర్ణణ ఘోషణ ఝూర్ణిలుచుండ-బాడుచు నాడుచు బరమ హర్షమున . గూడి సద్భక్త సంకుల మేగుదేర"
   -పండితారాధ్య చరిత్రము:- వాదప్రకరణము- పాల్కురికి సోమనాథుడు.
2. బసవ పురాణము:- పాల్కురికి సోమనాథుడు.

యెడతెగక పారుజీవనది వలె జానపద కవిత్వము ఏ రాజసభలను జూడగోరక చిరంజీవత్వము సంపాదించుకొన్నది. దానికి కారణము— జానపద కవిత్వమే జీవితము ఆ జీవితమే కవిత్వము. అందువలననది పల్లెలలోని ప్రజాజీవనమును సూటిగా సంపూర్ణముగా నెట్లు ప్రతిబింబింప జేసినదో ఈ పరిశోధన వ్యాస మంతయు నిదర్శనము. అది పరంపరాగతమైన తెలుగువారి సంస్కృతీ సంప్రదాయములను ప్రత్యక్షము గావించినది. సామాజిక చైతన్యజీవనమున కూపిరి పోసినది. అచ్చపు తెలుగు హృదయము నావిష్కరింపజేసినది. తెలుగు సరస్వతీ సౌందర్యమిట్లుండునని లోకమున కెలుగెత్తి చాటినది. తెలుగు దినుసుల ఘాటు చెడకుండ కాపాడగలిగినది. సమాజశ్రేయస్సున కంకితమైనత్యాగి తన్నుగూర్చి పట్టించుకొననట్లే జానపదకవి తన్నుపూర్తిగా మరచిపోవుట వలననే ఆతని కవిత్వమంత మిన్నగా, సమాజపరముగా వెలయుచుండుట యొప్పినది. వాల్మీకి మహర్షి తన్నెంత మరచి రామకథలో లీనమైపోయినాడో దానికి కావ్యమే సాక్ష్యము. ఆ మహర్షివంటి పూర్వకవుల అంతఃకరణ పారిశుద్ధ్యము, లోకహితైక చింతన జానపద కవులలో గన్పట్టును, శ్రుతులు, స్మృతులు, రామాయణము వంటి వానిలోవలె శబ్దసౌష్ఠవమునకు గాని, అలంకార చమత్కారమునకు గాని, అర్థగౌరవమునకుగాని, వృత్తవిస్తారమునకుగాని ప్రయత్నించినట్లు గోచరింపదు. అప్రయత్నముగా, సూటిగా, బుద్ధికందిన విధముగా హృదయమున మాగి నట్లనుటయే జానపద కవిలక్షణము. ఇట్టి లక్షణములున్న కవుల కవిత్వము జీవితమంతయు నలముకొని పోవుట జరుగును. అప్పుడది నిసర్గరామణీయకమై నిర్మలమై, నిరుపమానమై, నిజమై, ఆత్మప్రేరితమై యలరారును. కనుకనే జానపదకవిత్వము వినువారిహృదయములలోనికి నేరుగాప్రవహించి రసానందతరంగ డోలికల నూగించుచుండును. కవిత్వమల్లు వానికెంత సద్యఃపరనిర్వృతియో వినువానికంతేయగును. 'తేనెసోకనోరు తియ్యనయగురీతి–దోడనర్థమెల్లదోచు'[1]

1. మొల్లరామాయణము:– పీఠిక–పద్య. 17

నదే కవిత్వమని మొల్ల నుడివినది జానపద కవిత్వమున కన్వయించు కొన వచ్చును. తేటతేనియలొలుకు పాటలద్వారనే మన సంస్కృతీ సంప్రదాయములు మలినముకాకుండ నిలచుటయైనది. బాలనాగమ్మకథ, బొబ్బిలియుద్ధము, పలనాటి వీరచరిత్రము వంటి దీర్ఘకథా గేయములలోని నవరసము లొక్క జానపద గాయకుని రసనమున ఊరుచుండి నప్పుడు, వివిధ పాత్ర పోషణము లొక్కని యందే మూర్తీభవించి యొప్పినప్పుడు చూడవలె — రేయింబవళ్లనక పల్లీయు లురూత్రిత లూగిపోవుచుందురు. జాతిజీవితము నన్నికోణములందు దర్శింపజేసి ప్రబోధించుటయను సాహిత్యోద్దేశము జానపద కవిత్వముతో నెరవేరుచుండుట చేత ఆ కవిత్వమును జీవితతత్త్వమును ఒక్కటియైనది.

కవితా హేతువులు:— శక్తి, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణ (పరిశీలన)ము వలన లభించు నిపుణత్వము, కావ్యజ్ఞులైన విజ్ఞులచేత శిక్షపొంది అభ్యసించుట అనునవి మూడు ప్రాచీన కావ్యములకు హేతువులుగా చెప్పబడినవి1. అనగా ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములని అర్థము. వానిలో ప్రతిభ యన్నది ప్రధానమైనది. అది నవనవోన్మేషశాలిని యగుప్రజ్ఞ2. ప్రతిభ దేవతానుగ్రహము వలన సిద్ధించి నప్పుడే అది శ్రేష్ఠతరమైనదని, తత్కారణమున పుట్టు కవిత్వమే ఉత్తమ మైనదని చెప్పుదురు. కాళిదాసాది మహాకవుల కట్టి దేవతానుగ్రహముండ వచ్చునేమో గాని జానపదుల కదియుండదు. వీరికి నైసర్గికమైన ప్రతిభయే యుండును. కావ్యసంపత్తికా ప్రతిభ కారణమని దండి వచించినాడు గదా3.

---

1. "శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
 కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుద్భవే" —కావ్యప్రకాశము:—1-3
2. "ప్రజ్ఞానవ నవోన్మేషశాలినీ ప్రతిభామతా":— భామహాలంకారము-భామహుడు
3. "నైసర్గికీచ ప్రతిభా శ్రుతంచ బహు నిర్మలమ్
 అమందశ్చాభి యోగోzస్యాః కారణం కావ్యసంపదః"
 —కావ్యాదర్శము:— దండి—ప్రథమ పరిచ్ఛేదము. శ్లో. 103

క్రౌంచిరోదనము వినుచున్నప్పుడు వాల్మీకి మహర్షి నోట వెలువడిన కవిత్వము అప్రయత్నమైనది. దానికి బ్రహ్మవరప్రసాదముండినను నైసర్గికమైనప్రతిభయే నిదర్శనము. జానపద కవుల నైసర్గిక ప్రతిభకొక మచ్చునిటు పరికింపదగును.

"కాలుమీన కాలంటివా డిలికాంచాయి_కంచుమేడ వాదంటివా డిలికాంచాయి

| | | | |
|---|---|---|---|
| ఏలుమీన ఏలంటివా | ,, | ఏండి మేడ నాదంటివా | ,, |
| సెయ్యిమీద సెయ్యంటివా | ,, | సెరుకుతోట వాదంటివా | ,, |
| కూసునెమ్మ కుర్చీలమీదా | ,, | తెచ్చెనమ్మ మొగ్గలరైక | ,, |
| మొగ్గలరైకె ఇచ్చిసూస్తే | ,, | పెండ్లి మొగని పేమాలుండే | ,, |
| పెండ్లి మొగని పేమాలుండే | ,, | _నీటుకాని నీడాలుండే | ,, |
| నీటుకాని నీడాలుండే | ,, | _బయిటి మొగని బాధాలుండే | ,, |
| బయిటిమొగని బాధాలుండే | ,, | _వాన్నెకాని వొలపూలుండే | ,, " |

మొగ్గల రవిక విప్పిచూచుకొన్నప్పుడా మడతలలో పెండ్లిమగని ప్రేమలు, నీటు కాని నీడలు, బయటిమగని బాధలు, వన్నెకాని వలపులు గుబాళించినవి. అట్లే "నీటి మీదా కొంగువరిసీ నిద్దురే నీ కిచ్చిపోతా,,_ "మడి రవికెలవిప్పి కృష్ణుడు మైల సేసినాడు,, అనునవి గ్రహింపదగును. ఇందలి కవితా భావములు నిసర్గమైనవి. వాడని వీడని పారిజాత పరిమళమువలె, వెన్నెలవలె నిత్యనూతనమై అలరారుచున్నవి. ఈ భావములు గుండె లోతులలో మాగినట్టివి. తలచుకొనిన తారుణ్యముట్టిపడునట్టివి. దానికి నవనవోన్మేషమైన, నైసర్గికమైన ప్రతిభయే కారణము. అనుభవించిన దానిని సూటిగా, అప్రయత్నముగా వాక్కుద్వారా అనుటయే దాని లక్షణము.

రెండవ హేతువు, లోకశాస్త్ర కావ్యాది పరిశీలనా నిపుణత. అనగా వ్యుత్పత్తి. ఇది జానపద కవులలో లేదనియే చెప్పుకొనవలెను. ఒకవేళ ఉన్నచో అది అనుభవముమీద గడించుకొన్నదే కాని శాస్త్ర కావ్యాది పరిశీలనవలన కాదు. ఇంచుక లోకజ్ఞత వలన కూడ లభించుచుండును. అదియును పరిణతమైన

వయస్సు, బుద్ధి గలవానిలోనే గన్పించును. పిల్లలుపాడే పాటలకు ఏ వ్యుత్పత్తి తోడ్పడినది? కవిత్వమితరుల కొరకు చెప్పదలచినప్పుడు శాస్త్రజ్ఞత అవసరము. జానపద కవి తన కొరకు (ఆత్మాశ్రయముగా) చెప్పుకొన్నను ఎక్కడో కొండ లలో, కోనలలో పుట్టిపారు జీవనదియెట్లు లోకమును సస్యశ్యామల మొనర్చునో అట్లు అతని కవిత్వము సమస్త జనులకు వర్తించుచుండును. ఒకానొక పడుచు వాని శృంగార భావములు అందరిని శృంగారించును. దానికి వాని వయసే ప్రబోధహేతువు. కాని అల్లసాని పెద్దన వలె కావ్యరచనకు, నిరుపహతి స్థలము, రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము, ఆత్మకింపయిన భోజనము, ఉయ్యల మంచము, ఒప్పు తప్పరయు రసజ్ఞులు, ఊహతెలియంగల లేఖక పాఠకోత్తములు కావలయునని కోరుకొనరు. హృదయమును కదలించే అను భవముండిన చాలు. ఆకదలిక నుండే పాటలూరును. కవిత్వము చెప్పుమని అడిగే వారుండరు. ఒప్పు తప్పులరయువారుగాని, లేఖక పాఠకోత్తములు గాని వారి కక్కరలేదు. రసజ్ఞుల తరగతి యన్నది వేరుగానుండదు. తమ కష్టసుఖములలో పాల్గొనువారే వారికి రసజ్ఞులు. అట్లు కానిచో ఆ కవిత్వమే లేదు.

ఇక మూడవహేతువు అభ్యాసము. దీని ప్రసంగము కూడ వీరికి పట్టదు. పనికట్టుకొని ఈ ఈ లక్షణములుగల కావ్యమును వ్రాయవలెననుకొన్న కవులకే అభ్యాసమవసరము కాని తమలోతామై అల్లుకొను జానపదకవుల కవసరముండదు. జీవితానుభవముల నభ్యసించుటయే అభ్యాసము. ఆ అభ్యాస ఫలితమే సామెతల మూట, నుడికారములతోట, పొడుపు కథలకోట, పాడిపస్రితి పాట.

<u>కావ్యాత్మ</u>:— కావ్యమున కాత్మ ధ్వనియని మొదట హేతుబద్ధముగా నిరూపించిన వాడు ఆనందవర్ధనుడు. అది రసధ్వని, అలంకారధ్వని, వస్తుధ్వని అను మూడు భేదములచే నొప్పును. వానిలో రసధ్వనియే ఉత్తమమైనది. శబ్దము తన యర్థ మును అర్థము తన్నును అప్రధానముగా జేసి అర్థాంతరమును దెలుపునో యది

ధ్వని1. అనగా వ్యంగ్యార్థ ప్రాధాన్యమున్నచో ధ్వని యగును. అప్పుడా కవిత్వము ఉత్తమమైనదిగా విలసిల్లును. జానపద కవిత్వమునకు రసమే (రస ధ్వని) ఆత్మ. అది సర్వత్ర గోచరించును. అసలు ధ్వని ప్రధాన కావ్యముల కుదాహరణగా ఆ కవిత్వము నంతటిని గ్రహింపవచ్చును.

కంచి మేకల పాలువోసి పెంచుకుంటి నావి కురులు వాలసందమామా
ఒక్కవాటి వాలపులాకు పక్కనేసి చెడుపుకుంటి ,,
సిన్నది శ్రీరాముల తలుపు పెద్దది బేడీల తలుపు ,,
రాగి తమలపాకు ద్వారబంధం ఒంగిరారా సింగుదలుగ ,,
అవతాలానే అత్తమంచం ఇవతాలానే మామ మంచం ,,
నట్టనడుమా నాదిమంచం పక్కలోనే పడదుంకకుర ,, *

ఈ పాటలోని శబ్దములు తమ అర్థములను, అర్థములు తమ్ముతను (వాచ్యార్థమును) అప్రధానము చేసికొనగా ,,నట్టనడుమనున్న నాదుమంచముపై బడదుముకుము,, అను వ్యంగ్యార్థము వ్యక్తమైనది. "పడదుంకకుర" అను నిషేధము వలన "పడదుముకుము" అను విధ్యర్థము ధ్వనించినది. ఇట్టి భావముతో, కూర్పుతో సరిపడు పద్యము (గాథ) ఒకటి అచ్చముగా గాథాసప్తశతిలో గన్పించుచున్నది. దాని నానందవర్ధనాచార్యుడు ధ్వని కుదాహరణగా స్వీకరించినాడు. ధ్వనిని నిరూపించుపట్ల అతడు అందలి గాథలనే ఏరుకొన్నాడు. ఒక విధముగా జూచినచో అవి యన్ని ఆనాటి ప్రాకృత జానపదుల పాటల రూపములేయని తోచును. ఆగాథలలోని వృత్తాంతములు చాలమటుకు జానపద శృంగార ఘట్ట ములనే వర్ణించుచున్నవి. కనుక ధ్వని కుదాహరణగా గ్రహించిన ఆ గాథలు గమనించదగినవి. ధ్వని భేదములేగాక ప్రాచీన సాహిత్యములోని ప్రక్రియలెల్ల

---

1. ,,యత్రార్థ శ్శబ్దోవా తమర్థ ముపసర్జనీ కృత స్వార్థౌ
వ్యంక్తః కావ్య విశేషః సధ్వనిరితి సూరిభిః కథితః
—ధ్వన్యాలోకము:— ఆనందవర్ధనుడు—ప్రథమోద్యోతము—శ్లో. 13

జానపద సాహిత్యములో నున్నవి. వానికై ప్రత్యేక పరిశోధన అవసరము.

అందమైన చీరెగట్టి అంగడంగడి పోగా
నాఅందమైనా అంచుచీరె గంధమాయెను గదరా
పట్టుచీరె కట్టుకోని పట్నమమ్మట పోగా
నాపగడంపూ పట్టుచీరె పసుపాయెను గదరా

ఒక పడుచుది అందముగా నలంకరించుకొని అంగడికిబోయి ఒకనితో సంభోగించి అతనితో లేచి పట్టణము పోగా సంతానవతి యయ్యెనను అర్థము స్ఫురించు చున్నది. ఆఅర్థమిట్లు తేల్చి చెప్పినచో పేలవముగా నుండును. అట్లుగాక 'అంచు చీరె గంధమాయెను', 'పట్టుచీరె పసుపాయెను" అనుటలో అందలి వాచ్యార్థములు గుణీభూతమై "సంభోగించెను'. 'సంతానవతి యాయెను' అను సర్థాంతరములు రమణీయముగా వ్యక్తమైనవి.

,,కుట్టియి బావా నా కుడిరొమ్మున కృష్ణలీల. కుట్టియి బావా,, అనుచు మరదలు పొడిపొడి మాటలతో బావనెంత కమ్మని కోరిక కోరినదో నెమరు వేసిన తెలియును. కుడిరొమ్మున కృష్ణలీల కుట్టించవలెనట. భాగవత దశమ స్కంధములోని కృష్ణలీలల భావమంతయు ఆ ఒక్క మాటలో మూటగట్టినట్లు న్నది. ఎడమరొమ్ముమీదుగా పైటవేసికొందురు కాబట్టి ఆ రొమ్ముమీది భాగమున కుట్టించినచో శోభించదు. అందుకే కుడిరొమ్ముమీద రవికెకు కృష్ణలీల కుట్టించి నచో బావకు సూటిగా గన్పించును గదా. అది కంటినిండ కన్పించగానే బావలో గోపాలుడు ఆవేశింపవలె, అప్పుడు తనలో గోపికపరవసించవలెనన్న వ్యంగ్యార్థ ప్రాధాన్యము లోకోత్తరమైనది.

,,కాటీనం పంపుల్ల లేపు సైట్[1] గుంతల్ల
లేవల[2]న్న సూతామా మాదిగొల్ల మాణెమ్మ,, *

గుంటలో సమతలము చూచుట వాచ్యార్థము. ఇది అప్రధానమైనది. ఆ ,గుంట

---

1. Site= ఎంచుకొన్న స్థలము, 2. Level= సమతలము.

లోనికి బోయి రమింతమా" అను అర్థమే ప్రధానముగా వ్యక్తమగుచున్నది. రోడ్డుపనిచేయు పాటకజనుల శృంగారమిందు వర్ణితము. ఇదే విధముగా "కన్నె చేప వలల బడితేనో అల్లుమ్మరాజ–గండిచెర్ల పొద్దు బొడిచేనో" అన్నది కూడ ధ్వనికి ఉదాహరణగా స్వీకరింపనగును. ఇట్టివి కోకొల్లలు.

"సిక్కుడూ నీవెంత సిత్రాంగివమ్మో–కూసున్న సోటంతా కప్పుకొన్నావే
కాకెరా నీవెంత గయ్యాడివమ్మో–కన్న ఎలుగూలన్ని కప్పుకొన్నావే
గుమ్మడీ నీవెంత గుడుమదానా వే–కూసున్న సోటంత గుత్తగొన్నావు" *

చిక్కుడు, కాకర, గుమ్మడి తీగలవ్యాప్తి యన్నది వాచ్యార్థము. దీనికన్న కూర్చున్నచోటనే యుండి అక్రమముగా అందరిమీద చేయిమోపి ఆస్తిపాస్తులు పెంచుకొను అవినీతిపరులను గూర్చిన భావము అన్యాపదేశమైనది. ఇది ప్రస్తుతార్థము. ప్రస్తుతార్థము తోచునట్లు అప్రస్తుతమైన చిక్కుడు, కాకర, గుమ్మడి తీగలవ్యాప్తి వర్ణించబడినది. కావున, దీనిని అలంకారధ్వనిగా చెప్పుకొనవచ్చును.

కడుపు నిండిన కవిత్వము కన్న కడుపు ఎండిన కవిత్వము మిన్న. అది మిక్కిలి ప్రభావమును వేయును. ఈ దిగువ వేదనాత్మక కవిత్వమెంత బిగువుగా వ్యంగ్య ప్రధానముగా పల్లీయుల గుండెనుండి ఆవిష్కృతమైనదో పరిశీలింపదగును.

మాకెపోతంటదీ గొట్ట గొట్టపోతంటదీ మాకె
మందాలా శాలోల్లు మాట మాట్లాండంగ
చూడవచ్చిరని తామురిసెమాకె–దోసిట్ల రూపాయలు గొంగట్ల బొయ్యంగ
వరదవచ్చెనని తా మురిసెమాకె–మెడకు తాడుబెట్టి గొరగొర గుంజంగ
కంటెబెట్టిరని తా మురిసెమాకె–గొరగొర గుంజుకొచ్చి పందిట్ల కట్టేత్తె
పెండ్లిపందిరాని తా మురిసె మాకె–అచ్చిపోయేటోల్లు ఆటీటు నడువంగ
చూడవచ్చిరాని తామురిసెమాకె–కాళ్ల సేతులు బట్టి కంట్లంబుగొయ్యంగ
కైలాసపురమని తా మురిసెమాకె–ఏడు రూపాయలకు ఏడు కుప్పాలేసి
ఎవ్వలింటికి వాళ్ళు కొంచబోతుంటేను

కుడుక కసుమూలాని తాముదిసె మాకె
కార్జాలు దొబ్బలు కలిపి వేయంగానే
ముసలోళ్ళు పై సోళ్ళు బొక్కాలు కంకరిగ
అచ్చంతలని తాముదిసెమాకె—సీకినా బొక్కాలు బౌతలా బారేస్తె
కుక్కానక్కాలచ్చి ఎత్తుక పోంగానే—వైకుంట పదమని తా ముదిసెమాకె
మిగిల్న బొక్కాలు గద్దలెత్తుక పోంగ—పూలరథమాని తా ముదిసెమాకె

మేకను చంపుక తినుటయన్నది వాచ్యరూపమైనది. తుదకు మాంసరహితమైన తన ఎముకలను గ్రద్దలెత్తుకొని పోవుచుండ పూలరథము మీద వైకుంఠమేగు చున్నట్లు తలపోయుట అమాయకమైనది. దయనీయమైనది. హాస్యరస మిందొలికినప్పటికిని, మేకయొక్క అమాయకత్వమను వస్తువు ధ్వనించుచుండుటచేత ఇది వస్తుధ్వనిగా భావింపవచ్చును.

కంపకింద రొండు బక్కటి ఎలుకలు— కడుపు నొచ్చేనని పండిందెగా
మంచం కింది మ్యావురువిల్లి—మంతరిస్త ఇటు రమ్మానెగా
సెరులా రొండు బుడ్డన్న పరుకలు—సెంగన్న గంతులు కొడ్తుండగా
వొద్దున్న కూసున్న గుడ్డీపాలకొంగ—ముద్దిస్త యిటు రమ్మానెగా
మ్యాకపోతులు మ్యాలము గట్టుక—కందనూలి సంత వోతుండగా
తొవ్వలవున్న తోడేలు బావ—సంత జేస్త యిటు రమ్మానెగా *

ఈ పాట ధ్వనికి చక్కని యుదాహరణ కాకపోయినను ప్రతీకాత్మక కవిత్వమున కొక మచ్చుగా స్వీకరింపవచ్చును. ఎలుకలు, చేపలు, మేకలు, పేద వర్గమునకు ప్రతీకలు. పిల్లులు, కొంగలు, తోడేళ్ళు దోపిడి ధనిక వర్గమునకు, క్రూరులకు ప్రతీకలు. వీనివలన వ్యక్తమైనఅర్థము నియమితమైన వ్యంగ్యార్థము. సామాజిక విమర్శ.

అడుగడుగున జీవితమునుండి పుట్టుకొని వచ్చెడు పెక్కు సామెతలు పల్లీయుల సొత్తు. నిత్యము మనవేడుకలో వాడుకయైన సామెతలెల్ల పల్లీయుల

నుండి సంక్రమించినవే. అవి విలువెల్ల ధ్వని ప్రధానములు. "పేరిన్న నేతులూ బెల్ల పచ్చుల్లూ—పేదవారంపితే బేఫరములాయె—కరివేప కాయల్లు కంచాన పోసి-కలవారు అంపితే గగనంబులాయె—కోటకేపిన కంచె దుముక బోకన్న—గుమ్మళ్ళు కూలేను వంగ లొరిగేను,,* వంటివి పల్లీయుల నోళ్లలో జుబ్బ మాగినవి, రమణీయార్థ ప్రతిపాదకములైనవి. సద్య: పరనిర్వృతి నిచ్చునవైనవి.

వస్తువు:— జానపద కవిత్వమునకు వస్తువు ప్రఖ్యాతమా? మిశ్రమమా? ఉపపాద్యమా? అన్న ప్రసక్తేలేదు. కావ్యనాయికా నాయకాదుల కిట్టి లక్షణము లుండవలెనను నిర్దేశముండదు. రసాది విషయములందుకూడ మీమాంస అక్కర లేదు. నిషిద్ధములను లక్షణమా కవిత్వమునకే గిట్టదు. జీవితమే కవితా వస్తువు. సకల చరాచర జీవకోటి, పంచభూతాత్మక ప్రకృతియంతయు వస్తువే.

శైలి:— పదముల పొందికను శైలి, శయ్య అందురు. అనగా ఏ పదము వెనుక ఏపదమును పొదివించిన అందమొప్పునో, రసవ్యంజకమగునో గమనించవలసి యుండును. పొత్తుపొసగిన సత్తువ ఎసగినట్లు శైలి ఎంత చక్కగా కుదిరినచో అంత చిక్కగా భావనాబలము అట్టు కట్టును. కవిత్వమునకు భావనయే ముఖ్యమైనను దాని నందించు పట్ల చక్కనిశైలి అవసరము. జానపద కవిత్వమెట్లు సహజసిద్ధమో అట్లే జానపద శైలియును అప్రయత్న శిల్పముతో కూడి స్వాభావికమై యొప్పును. పెక్కుపాటలలోని అప్రయత్న శిల్పసౌందర్యమునకు అజ్ఞాతభావుకులే కారణము. నదీ ప్రవాహములో దొరలుచువచ్చు గండశిలలు గుండ్రాళ్లుగా మారునట్లు జీవిత ప్రవాహములోబడి అజ్ఞాత జానపద భావుకుల నోళ్లలో నానుచు, నునుపెక్కుచు, తాళలయల కనువుగా దిద్దబడుచు వచ్చుటచేత వాని సౌందర్యము అరవిరిసిన మల్లియల సౌరభమువలె దెసల నింపినట్లుండును. శైలియందు మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అను గుణములు ముఖ్యముగా గన్పించునట్టివి. అవి రసధర్మములు. ఏ రసధర్మమును పోషించుట కా శైలి యుండవలెను. జానపదులకివి తెలియకున్నను అవే గుణములు సహజముగా

వారి నోటినుండి వెలువడునప్పుడంటుకొని వచ్చును.

,,తంగెడు పువ్వుల్లలో నా బావా రాజమల్లు
పూ లేర పోతెరో నా బావా రాజమల్లు
పొంగనియడె దుర్గమ _న న్నాలనియడె దుర్గమ _పూ
లేరనియడె దుర్గమ -దండ_ గుచ్చనియడె దుర్గమో నా బావా రాజమల్లు,,*
,,మిద్దెమీద మిద్దెగట్టి మిద్దెకు రంగూలూ వేయా
మిద్దెమీద ఎవరు లేరయ్యో మిద్దెసిన్నబోయినాదయ్యో
కల్యాణరాయా మిద్దె సిన్నబోయినాదయ్యో
దంచి దంచి నిన్నేసూతూ దంచలేక నిన్నే సూతూ
దండివయసు నిలువలేనయ్యో
కల్యాణరాయా ధరణి వయసు నిలువలేనయ్యో .... .... .... ....
కోరి కోరి నిన్నేసూతూ కొమిరె కొయ్యా లెక్కిసుతూ
కోడె..యసు నిలువలేనయ్యో_ కల్యాణరాయా కోడెవయసు నిలువలేనయ్యో,, *

వంటి పదాలలోని రసము శృంగారము. దాని కనుకూలముగా సరసమైన పద జాలము కూర్చబడినది. ఇట్లు సరసమైన పదజాలముతో నొప్పెడు శైలిని మాధుర్య గుణకలితమందురు.

అమ్మమ్మ ముసలోడు ఆడెంతబెరికోడు-సారాయిదాగొచ్చి నడుగిరుగదన్నె
సీర్ల పండుగనాడు పిలవనంపె ముసలోడు
సంక్రాంతి పండుగాకు సభసెప్పె ముసలోడు
నాగుల పండుగనాడు నగెసెమ్మ ముసలోడు
దసర పండుగనాడు దంచెనమ్మ ముసలోడు
ఉగాదిపండుగాకు పూకెపండె ముసలోడు
మల్లొచ్చె పండుగాకు మంచమెక్కె ముసలోడు *

ఇందులో భావము, వస్తువు, శైలి మూడును మెప్పిరి గొన్నవి. భావములు హాస్యరస వ్యంజకములు. ముసలి మగడు వస్తువు. దానికి తగిన మాధుర్యగుణ

కలితమైన శైలి శ్రుతి సుభగమైనది.

> టీగుల్ టీగుల్ మంటాది—పులిమామిడికోట—అగుల్ బూగుల్ మంటాది
> అత్తె కాదురా పత్తె కాదురా కనుమనూరి గుడెపుగాడు
> కత్తి లేదు కఠారిలేదురా మనుబోతు కాపోన్ని జంపిన
> అదే కత్తి నాసేతిలవుంటె కొల్లంపల్లి తాటిమాకుల
> కొట్టి కొట్టి ముర్దాలు సేతురా కోలువోదు పులిమామిడికోట ॥టీగుల్॥
> వాడు ఏసిన గుండు గాదురా వీడు ఏసిన గుండు గాదురా
> మదాపురాయుడు ఏసినగుండు శెట్టు సేమకు తగలకుండరా
> పానుగంటికి పగులు సుక్కరా మూసప్యాట మూకచేసెరా
> అల్కజల్క పాతాలమోడురా అజ్జిలిక జివిలీక తిమ్మడు
> కురకుర మీసం బయిరి గడ్డము రొంటిపూలబాకుసేతుల
> బంగారి ముచ్చాల వాడురా ॥టీగుల్॥
> ఎక్కడెక్కడి దండువచ్చెరా ఎల్లమ్మ గుడ్డాలు వట్టవు
> మల్లమ్మ గుడ్డాలు వట్టవు సూసినట్టి పులిమామిడికోట
> సూసినప్పుడె బెక్కటిల్లెరా ॥టీగుల్॥
> మాడిపండురా దుప్పుమానెరా మడుగునీళ్ళురా జల్లుమానెరా
> మదాపురాయుని డేరముందల గజ్జలగుర్రం గల్లుమానెరా ॥టీగుల్॥ *

ఇది వీరరస ప్రధానమై, గమనవేగముగలదై ఓజోగుణమును ప్రదర్శించు చున్నది. దీర్ఘసమాసాది బంధురమైనది ఓజోగుణము. కాని పై పాటలో దీర్ఘసమాసచాలన లేదు. అసలు జానపద కవిత్వమున దీర్ఘసమాసములుండవు. లేకపోయినను, పొడిపొడి పలుకులతో వీరావేశమును ప్రదర్శించినను గూడ ఓజోగుణము భాసించును. పై పాటలో అడుగడుగున అడుగు (గమనము) మార్చుకొన్న ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, పాదాంతదీర్ఘములు వీర రసమును పోషించు ఓజోగుణ స్ఫోరకలక్షణములు.

ప్రసాద గుణమునకీ క్రింది పాటను ఉదాహరణగా తీసికొనవచ్చును. పెక్కు పాటలీకోవకే చెందును.

,,కొండకొండలరాము కోదండరాము_నల్లగొండలపైని నన్నిచ్చినారు
నన్నిచ్చినకన్నోరు ననుచూడరారు-బూరుగులుపూచాయి బూమికొరిగాయి
మావుళ్ళపూచాయి మన్నుకొరిగాయి-తంగెళ్ళు పూచాయి ధరణికొరిగాయి
తోవలెరుగా మానినారు కన్నోరు_వానల్లు కురిసాయి వంతరలుతేరి
గాలులేసినాయి చెట్లు విరిగాయి_గట్టున్ను పుట్టున్ను యేక వదునాయి
బూములెరుగామాని రారుకన్నోరు_చిన్నన్న యిచ్చాడు చిన్నావుపడ్డ
నడిపన్న యిచ్చాడు నానుపట్టేడా_పెద్దన్న యిచ్చాడు పెద్దావు పడ్డ
పడ్డయిన పెరిగింది రారుకన్నోరు_ఈ నల్ల కొండలకు నన్నిచ్చినారు
నన్నిచ్చిన కన్నోరు ననుజూడరారు,,_ అందరకు తేటతెల్లమైన విషయమును పైవిధముగా ప్రసన్నమైన పదజాలముతో చెప్పుట జరిగినది. భావము మందగమనమున సాగినది. ఇందలి ప్రసాదగుణము కరుణరసోపస్కారకమైనది. జానపద కవితాశైలిలో మాధుర్యగుణమును, ప్రసాద గుణమును ప్రత్యేకించి చూపదలచినను అభేదము సుంతయే.

పాడుచున్నప్పుడు పాటలోనేదేని యొకచోట అక్షరముగాని, పదముగాని, పాదముగాని తాళలయలకు ఇంచుక సరిపడనప్పుడును, అభిరుచికి దూరముగా నున్నప్పుడును అజ్ఞాత జానపద భావుకులు వానిని సవరించుకొనుటకు చేయు ప్రయత్నములో శైలి విషయమున వడు జాగరూకత కన్పించును.

ఒకటవ రకము:_ కొండమీద వెండిగిన్నె_కొక్కిరాయి కాలువిరిగె దానికేమి
మందు? వేపాకుచేదు, వెల్లుల్లిగడ్డ నూనెలోని మడ్డి నూటొక్కసారి
పోయవోయినూరి పూట కొక్కతూరి

రెండవ రకము:_ కొండమీద వెండిగిన్నె_కొక్కిరాజు కాలు విరిగె దానికేమి

మందు? వేపాకు చేదు, వెల్లుల్లిగడ్డ నూనమ్మబొడ్డు నూటొక్క ధార.

మూడవ రకము:— కొండమీద గుండుజారె—కొక్కిరాజు కాలు విరిగె

దానికేం మందు? వేపాకు పసుపు, వెల్లుల్లిరేక నూనెమ్మబొట్టు నూటొక్క ధార

నాల్గవ రకము:— కొండమీద వెండిగిన్నె—కొక్కిరాజు కాలు విరిగె

విరిగి విరిగి రెండాయె వీధుల్లో మూడాయె

పడమటి చుక్కలు పండేయి—భళ్లున తెల్లవారింది.

మరొక విధమైన పాట:—

ఒకటవ రకము:— కోడలా కోడలా కొడుకు పెండ్లామా

పచ్చిపాల మీది మీగడేమాయె—వేడిపాల మీది వెన్నలేమాయె

తేనె కుండలమీది తెప్పలేమాయె—నూనెకుండల మీది సురుసులేమాయె

రెండవ రకము:— కోడలా కోడలా కొలికి ముత్యమ్మా

గంగరేగుపండు బంగారుబొమ్మా—దిష్టెట్టి నాకొక్క పేరు నొక్కమ్మా

కూటికుండ మీద గుర్తులేవమ్మా

పచ్చిపాల మీద మీగడేదమ్మా—వేడిపాల మీద వెన్నలేవమ్మా *

పై వానిలో ఒకే విధమైన పాట యందెన్ని మార్పులు చేర్పులు జరిగినవో తెలిసికొనవచ్చును. ఒకటవ రకములోను తక్కిన రకములలోను జరిగిన ఆమార్పు చేర్పులు ప్రాంతమునుబట్టి కూడ కలుగుచుండును. ఆయా మార్పుల క్రింద గుర్తులుంచబడుటను గమనించదగును. ఒక్కొక్కమారు కొన్ని పాదములు పూర్తి క్రొత్తవి చేరుచుండును. పెక్కుచోట్ల శ్రుతి లయల ననుసరించుట యగును. ఇవి వ్రాయసకాండ్రు ప్రాచీనకావ్యములను వ్రాతప్రతులుగా వ్రాసికొన్నప్పుడు తమఅభిరుచికి, సందర్భమునకు తగినట్లు అక్షరమునో, పదమునో,

యతినో, ప్రాసనో మార్చి పాఠాంతరములుగా జూపఁబడ్డవి యనవచ్చును. చిన్న పిల్లలు పాడుకొనుటలో గూడ నిట్టి విధానమున్నది.

1\. గుడుగుడు గుంచెం గుండేరాగం—పాముల పట్నం పడిగే రాగం

చిన్నన్న గుర్రం చిట్టికివాయె—పెద్దన్న గుర్రం పెండ్లికి వాయె
మంగలోని గుర్రం మాడులవడె—సాకలోని గుర్రం సవుట్లవడె *

2\. గుడుగుడు కుంచం గుండా రాగం—పాముల పటం పడగా రాగం

అప్పలార్జు గుర్రం ఆడుకోబోతే—పేపే గుర్రం పెళ్లికిబోతే
నీ గుర్రం నీళ్లకుబోతె—నా గుర్రం పాలకుబోతే

3\. గుడుగుడు కుంచెం గుండేరాగం—పాముల పట్టా పడగా రాగం

చిన్నన్న పెండ్లి చిట్టేరాగం—పెద్దన్న పెండ్లి పెట్టేరాగం

4\. గుడుగుడు కుంచం గుండేరాగం—పావడ పటం పడగే రాగం

అప్పడాల గుర్రం ఆడుకోబోతే—పేపే గుర్రం పెళ్లికి బోతే
అన్నా అన్నా నీ పెళ్లెపుడంటే—రేపుగాక ఎల్లుండి.

జానపదకవిత్వము సాధారణముగా ద్రాక్షాపాకమైనది. సూటిగా ఎదకంటుకొనును. తేనె (లో) నాగిన తేట తెనుగున ఆ కవిత్వము తేటతెల్లము. తత్త్వములు చెప్పుపట్ల, తట్లుపేయుచోట్ల మాత్రము నారికేళపాకము గన్పించును.

కవిసమయములు—: సమయమనగా సంప్రదాయము, ఆచారము, మర్యాద అను అర్థములున్నవి అనగా పూర్వకవి ప్రయోగ సంప్రదాయముల ననుసరించి వారి యడుగుజాడల నతిక్రమింపక నడచుకొనవలసి యుండును. లోకవిరుద్ధమైన కవిసమయము ప్రసిద్ధికెక్కినచో దానిని గ్రాహ్యముగానే గుర్తించుట జరుగుచున్నది ఒక వస్తువునందున్న ధర్మమును ఉన్నట్లు రచింపకుండుట (చందన వృక్షమునకు పుష్పములు, ఫలములు ఉన్నట్లు రచింపకుండుట), ఒక

వస్తువునకు లేని ధర్మమును వర్ణించుట (ప్రతి కొలనులో హంసలు, పద్మములు లేకున్నను వర్ణించుట), కొన్ని సందర్భములలో కొన్నింటికి నియతధర్మములను కూర్చుట (ప్రత్యేకముగా వసంతముననే కోయిలలు కూయునని వర్ణించుట), వంటి మూడురకములైన కవిసమయములను ప్రాచీనకవులు పాటించినారు. ఇంతే గాక, కలలో దేవుడు కన్పించి కావ్యరచనకు ప్రోత్సహించుట వంటి దొక కవి చెప్పుకొనగా ఆతర్వాత కవులెందరో తమకు నట్లేజరిగినదని కావ్యస్థముచేయుట, ఒక వస్తువును మరొక వస్తువుతో పోల్చిన సాధన సంపత్తిని అనూచానముగ గ్రహించుచుండుట, సామాన్యమైనది. ప్రబంధకావ్యములలోనిట్టిది ప్రస్ఫుటము. అందుచేత, వానియందలి వస్తువుగాని, భావముగాని, రచనగాని ఒకే మూసలో అచ్చుపోసినట్లుండుట గన్పించును. జానపద కవులకీ విధమైన సంప్రదాయ ముండదు. ఒకడు చెప్పినట్లు ఇంకొకడు చెప్పవలెననుట పొసగదు. ఎవనికివాడు స్వచ్ఛంద భావుకుడు. ఒకడు స్త్రీ స్తనములనుచూచి "బొంగరాల సండ్లు" అన్నచో మరొకడు 'ముండ్ల రీతిగ సండ్లు ముందుకు పొడిచినావి' అనును. ఇంకొకడు "గిన్నెరొమ్ముల సెందురమ్మో,, అన్నచో వేరొకడు,,నిమ్మకాయల రొమ్ముదాన,, అనును. ఇది వారి వారి దృష్టి వైచిత్రి విశేషము. వానిలో స్వభావోక్తులే గన్పట్టును. కాని, ప్రాచీనకవిపుంగవులు స్తనములను గిరులనుట కుంభములనుట సంప్రదాయము. అవి అతిశయోక్తులు. అట్టిది వారి కవి సమయము. వారు తరుణి అంగాంగ వర్ణనలు చేయుపట్ల ఉన్నవి లేనివి యన్ని యును పట్టికప్రకారము వర్ణించుచుపోవుదురు. కాని పల్లీయులు నిత్యానుభవమున నున్న వస్తువుతోడనే కన్పించిన తరుణి అంగసౌష్టవమున కలంకరించుకొందురు. అప్పుడవి ఔచిత్యభాసురములై యొప్పును. వీరి విషయమున కవిసమయములనుట కన్న అవి ఉపమానములని చెప్పుకొనుట సమంజసము. తరుణి యంగవర్ణనమున నివి యెట్లు ప్రయుక్తములైనవో కనుగొనవచ్చును.

## స్త్రీ సంబంధములు:-

ముఖము:— ముద్దుల మొగముదాన అద్దానబోలు, మొగము మీవదినమ్మ పున్నేను బోలు, సెందరొంక నుదురు, ముఖకమలము, పసరుమొగము, బొండుమొగము.

చెంపలు:— అద్దాల చెక్కిలి, పచ్చికొబ్బెరవంటి చెంపలు, చొట్టబుగ్గలు.

కండ్లు:— ఈ కాటుక మీవొదినె కన్నులాబోలు, ఈకాత మీవొదినె కన్నులాబోలు, పువ్వు మీవొదినె కన్నులాబోలు, గురివింద పూసల కళ్ళు, కనులు కలువరేకులు.

కనుబొమలు:— ఈ మొగ్గ మీ వొదినె కనుబొమల బోలు.

పెదవులు:— పెసరకాయవంటి పెదిమె, దొండపండు పెదిమె.

పండ్లు:- ఈ పిందె మీ వొదినె పలువరుస బోలు, అలరుబోడి పలువరుస అచ్చ మల్లెమొగ్గలు, దానిమ్మ పన్నులు, బియ్యమొంటి పండ్లు, వరికి ముళ్ల వంటి పళ్లు, పారపండ్లు.

చెవులు:— కలికి వొడిసె వీ ఎలుకల చెవులు.

చూపులు:— బర్రోదూడ లాగ వెర్రి చూపులు, తలుకూ సేపల వల్లె కులుకూ సూపులదాన.

గొంతు:— పికిలిపిట్ట గొంతుదాన్ని.

తల, కురులు:— కనకబద్ది కురులు, కుంచసిగ, తట్టతల, కొండంత కొప్పు, నలినాక్షి కొప్పుచాయ నల్లమబ్బు నిగ్గులే, తవ్వంతకొప్పు, టెంకాయ కొప్పు.

చేతులు:— తామరలె చేతలు, సేనంగి సేతులు, సెరుకుతుంటెలోలె సేతు లుండాయి, బచ్చనకోలలోలె సేతులుండాయి, మొక్కిన సేతులు మొగిలిరేకుల్లు, నీదొబ్బా సేతులకు అద్దాలగాజులకు, బోలు చేతులు.

రొమ్ములు:— నిమ్మకాయ రొమ్ము, గిన్నెరొమ్ములు, కరక్కాయల రొమ్ములు,

నీబండీ కుండాలు–నాయెదమీది రొమ్ములు, మొలక గుబ్బలు, కోరగుబ్బలు, కంచు గుబ్బలు, కొబ్బెరవంటి గుబ్బలు, చనుబంతులు, సింతగింజలంతసండ్లు, బొంగరాల సండ్లు, ముండ్లరీతిగ సండ్లు ముందలికి పొడిచినాయి, సెందర్రివమ్మ సండ్లంట పసినిమ్మ పండ్లంట పట్టుకుంటే పలుగురాళ్ళు.

నడుము:_ కందిరీగె నడుముదాన్ని, వల్లని చెరుకువంటిదే మునలవ్వ నీనడుమేల వొంగెనే, వొంగినా నడుములు సింగాడిలవోలు.

తొడలు:_ బెడకు కొమ్మలవంటి తొడలు, అరటిబొందెలవాలె తొడలువున్నాయి.

పిక్కలు:_ వరిపొట్టలతో అడరు పిక్కలు.

కాళ్ళ–అడుగులు:_ గుజ్జారికాళ్ళు, తప్పాకాలు, అడుగులు మొగిలి రేకులు, ఆకు మీవొదినెమ్మ అడుగులను బోలు.

నడక:_ అంచవంటి నడక, నడక నాగబంధము.

తనూ విలాసము:_ చింతపువ్వు రంగుదాన్ని, గురిగింజ ఎరుపుదాన్ని, తీగ మీవొదినెమ్మ తీరులను బోలు, తొలకరి మెరుపైన తునకసుమ్మి, తీగ మెరుపుల బోయది, మెరపుకన్నె, గంగరేగుపండు బంగారుబొమ్మ, లేతమామిడి చిగురు, సంపంగి మొగ్గ, నల్లజిలకరి మొగ్గ.

వయసు:_ దాటుగుర్రామొంటి వొయిసు, పసినిమ్మ పండోలె పాయము.

## పురుష సంబంధములు:-

కోతిమొకము, అటికెమొఖము, బుడిగె మొకము, చేరెడుకన్నులు చింత నిప్పుల్లు, కందికాయలవంటి కనుబొమలవారు, బుర్రిముక్కు, దిబ్బముక్కు, దొప్పచెవులవాడు, బంగారు జులపాలు పాముల పడగళ్ళు, పలక బొజ్జల నాన్న, బానకడుపు, దోనెకడుపువాడు, కొంగకాళ్ళు, దొడ్డికాళ్ళు, నేరేడు పండంటి అన్న, కదలడు మెదలడు కరుకోలలాగ_ఉలకడు పలకడు ఉలవ గింజల్లె, మొకమెల్ల కప్పింది ముత్తేల సెమటా, మిరపకాయవంటి మీసాలు.

ఇతరములు:-

కొండంతచెట్టు, గొడుగంతచెట్టు, పుచ్చపూవులాంటి పున్నమీ యెన్నెల, గంపంతమబ్బు, గొడుగంత మొయిలు, చేటంత మొయిలు, రవ్వముప్వలతెప్ప, పొన్నపువ్వ దేరాల చందమామా, తమలపాకోలె తలవంచుకోని, తవ్వంతదాన్ని, అడ్డంతదాన్ని, మాడంతదీపము, మేకులోలె మెతుకులు, గుమ్మడికాయ వంటి గురువు, పిందెలు మనయింట్లో బిడ్డలు, కూలింది మాకుప్ప కుంభకర్ణుని మల్లె, తుమ్మకాయలబారు, పత్తికాయలబారు, జాజికాయలబారు, ఉసిరికాయలబారు, నీమెడనిండకట్లు కర్నూలిఏటిమెట్లు, చిందు కన్నీటికాల్వ బందరుప్పెనయయ్యె, కొమ్మడుగి కొప్పునిండె_ ఇత్యాదులు వస్తువును, వాలకమును, సన్నివేశ సందర్భములను, రసమును అనుసరించి ప్రయుక్తములగుచుండును. ఇంతేగాక, రసపృన్యాత్మక కవిత్వమను చిప్పిలు పదప్రయోగ నైపుణ్యము అపూర్వమైనది. దానిని భాషాస్వరూపములో పరిశీలింపనగును.

అలంకారములు:-

శబ్దాలంకారములు:_ శబ్దవిన్యాసము చేత కవిత్వమున కలంకారము కూర్చుట.

వృత్త్యనుప్రాసము:_ ఒక వర్ణము (అక్షరము) పెక్కుమారు లావృత్తియైనచో వృత్త్యనుప్రాసమందురు.

రారె సూడగ పోదాము_రాములపెండ్లి_రారె సూడగ పోదాము
గోత్రిక ఎలకదిర్చి గోత్రాటీకుల పెండ్లి ॥రారె॥
మేలు మెచ్చుల పల్లకీలు గుర్రాలపంద
నాలు బుడులు సుట్టాలు దొరలు మ
స్త్రీలు పీచెడు కాపురాలు పట్టెడు గొడు
గూలు ఓలు బోనాలు మతాబీలు_రమణుల రామున్నాపెండ్లి ॥రారె॥

మంచి మొగని వద్దీ—నుంచి వొచ్చిన మెర్పు
దించి విష్ణుల పిల పించి కట్నాలు సే
పించి రమణుల రామన్న పెండ్లి ॥రా౦౹౹*

ఇందులో 'లు', 'ంచి' పలుమారు లావృత్తియైనవి. మరియు ప్రాసలో ప్రాస విన్యాస మందముగా నొప్పినది. పల్లీయుల తిట్లాటలో కొట్లాటలో, రంకు గొంతులలోను అలంకారములు కొట్టు వచ్చినట్లుండును.

వాడంటడు నాలంజని—వీడంటడు నాలంజని
నే నెవ్వని లంజనురో—ఇంజనుమీది గుంజన్న
ఐదుగాడు సైదుగాడు—ఐదున్నర జీతగాడు
లంజను రమ్మంటడురో—ఇంజనుమీది గుంజన్న *

ముక్తపదగ్రస్తము:— (పాదాంతపాదాది ముక్తపదగ్రస్తము) మొదటి పాదము చివరనున్న పదమును రెండవ పాదము మొదటను, రెండవ పాదము చివరది మూడవ పాదము మొదటను ఇట్లే వరుసగా గ్రహించుచు కూర్చుచు బోయినచో దానిని పాదాంత పాదాది ముక్తపదగ్రస్తమందురు.

ఇంతింత పరిగింజ ఇల్లు మప్పేడిగింజ
దంతాన తరిగింది ద్వారబంధపు చెక్క—
చెక్క—కిందున్నాది చీమలమేడ—చీమల మేడకింద వాయలతుప్ప
తుప్పకిందున్నాది తుమ్మికి మాను—మానుకిందున్నాది మామిడి కొర్రు
కొర్రుకిందున్నది కొడుపలి గిద్ద—గిద్దకిందున్నది గిన్నెడు చల్ల
చల్లకిందున్నది చట్టెడు పెరుగు—,, ఇట్టి అలంకారములు పిల్లల పాటల లోను, పొడుపు కథలలోను చాలఉన్నవి.

1. నల్ల నల్ల ఏమినల్ల—బొగ్గు నల్ల ఏమి బొగ్గు
   కచె బొగు ఏమి కచె—మామిడి కచె .... .... .... ....

2. అంభాల మీద కుంభాలు—కుంభాల మీద కుడితొటి

కుడిత్తొట్టి మీద గుండ్రాయి—గుండ్రాయి మీద కోరింతా
కోరింతమీద ఆరిక అప్పురూ—అవురు గడ్డిలో ఆవులువేలూ *

జానపద కవిత్వములో అంత్యప్రాసలు, ద్విప్రాసలు, మున్నగునవి కోకొల్లలు. అడుగడుగున అలంకారములు సహజస్ఫోరకములు.

అంత్యప్రాస:— పాదాంతమున ప్రాసగలది—

నారాయణ నారాయణ నక్కతోక—నామొగడు తెచ్చింది కొత్తకోక
నేనా లుండేని కట్టుకోక— అదే లుండేని చినిగిపోక
వాడే లుండేని కొట్టుకోక—నానా లుండేని మొత్తుకోక
వాడే లుండేని పారిపోక—నారాయణ నారాయణ నక్కతోక

అంత్య ద్విప్రాస:— పాదాంతమున రెండక్షరముల ప్రాసగలది—

చింతచెట్టుమీద చిగురు—వాలుగొమ్మ మీద పగరు
అన్నయ్య బట్టలకు తొగరు—పదినెకు వచ్చింది పొగరు *

అంత్యప్రాసలేగాక యతులు, ప్రాసయతులు ప్రతిపాటలో, మాటలో పరపల్లె తొక్కుట స్వభావసిద్ధము.

1. ఏనుగు ఏనుగు నల్లన—ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగు మీద రాముడు—ఎంతో చక్కని దేముడు

2. దారెంట పోయేదానా—దారాలరైకదానా
దారాల రైకలోకి—దూరింది నామనసు

3. తొక్కితెరాయి మొక్కితె దేవుడు

4. అమ్మాజీ కన్నులు తమ్మిపువ్వులు—తమిమ్మిపువ్వుల్లోని కమ్మతేనెల్లు

5. రాచవాడనుంచి—లేచు మా తమ్ముడు
చూచికన్నుగీటె—లేచిపోయె చిలుకలూ,,

ఇట్టి లక్షణములు నన్నయకు పూర్వముగల అద్దంకి, ధర్మవరము, కందుకూరు శాసనములవంటి వానిలోను గన్పించుచున్నవి.

<u>అర్థాలంకారములు:</u>— అర్థముచేత కవిత్వమునకు శోభ కూర్చుట—

<u>ఉపమ:</u>— ఉపమానోపమేయములకు సాదృశ్యము చెప్పుటను ఉపమాలంకార మందురు. ఉదా:— ,,నల్లపూస దండోలె తొలిమీస మేర్పావె,,. దీనిలో నల్ల పూసదండ ఉపమానము. తొలి మీసము ఉపమేయము. నల్లదనము, సన్నని కూర్పు అనులక్షణములు రెంటికి సమముగా పోలినవి. ఇట్లే మరొక ఉదాహరణ:— ,,తమలపాకోలె తలవంచుకోని,,. అసలు జానపదులలో ఉపమాలంకారములే ఎక్కువ.

<u>రూపకము:</u>— ఉపమేయమునకు ఉపమానముయొక్క అభేదము చేతను తాద్రూప్యముచేతను రంజనముకూర్చుట. ఉదా:— ,,చిందు కన్నీటి కాల్వ బందరుప్పెన అయ్యె,,. కన్నీటి కాలువ ఉపమేయము. బందరుప్పెన ఉపమానము. వీనికి అభేదము కల్పించబడినది.

<u>అతిశయోక్తి:</u>— గోరంతను కొండంతలుగా జేసి వర్ణించుట. సంబంధము లేకున్నను సంబంధమున్నదని చెప్పుట.

ఉదా:— మామగడ్డాము బగిరిగడ్డాము—ఇదిలిచ్చి చూస్తేను ఈపిపేనుండు
పారపట్టి చూస్తేను పందికొక్కుండు—మూడూర్ల మంగళ్ళు ముందుబిల్లంపి
... ... ..... .... —వొగతట్టు గొరిగితే వొగ గోనెడాయె
వాళ్ల సెల్లెండ్లకి సవరాలు ఆయె— .... .... .... .....
దూడలకి తలగాయె దుక్కి మోకాయె— .... ..... ..... ....

<u>దృష్టాంతము:</u>— ఉపమానోపమేయ వాక్యముల వేఱువేఱగు ధర్మములను బింబ ప్రతిబింబ భావముచే చెప్పుట.

ఉదా:— ,,ఇశనగిరీ నిమ్మపండూ—చేతబడితే చెమ్మగించూ
మామగారీ కన్నెపడుచూ గుబ్బపడితే బెబ్బరించూ,, *

మొదటి వాక్యము ఉపమానము. రెండవ వాక్యము ఉపమేయము. మొదటిది (నిమ్మపండు)చేతబట్టిన "చెమ్మగించూ" రెండవది (కన్నెగుబ్బ) "బెబ్బరించూ"

అనునవి చేసినవారు ధర్మములు. చెమ్మగించు బెబ్బరించు అను వానికి బింబ ప్రతి బింబత్వము ఆపాదించబడినది.

సమాసోక్తి:- ప్రస్తుతమును వర్ణించునప్పుడు అప్రస్తుతము తోచినచో అది సమాసోక్తి.

ఉదా:- అమురావాదా మలలామీదా ఆడీనాదిర ఆడీ నెమిలీ
పొంగీదానీ గుబ్బల నడుమా పొదిగీనాదిరా పోతూ నెమిలీ,

నెమళ్ళ జంట యొక్క సంభోగ శృంగారము ప్రస్తుతాంశము. కాని, ఆ విషయమును వినుచుండగనే ఒక కోయ కామినితోగూడి కాముకుడొకడు రమించుచుండెడు అప్రస్తుత విషయము స్ఫురించుచున్నది కనుక ఇది సమాసోక్తి.

లోకోక్తి:- లోకోక్తులను చెప్పుటను లోకోక్త్యలంకారము అందురు.

ఉదా:- అరచేతి బెల్లము చిరుచేదులాయె

నిజముగా బెల్లము చేదగుట పొసగదు. దగ్గరివారు (సన్నిహితులు) అయిష్టులయినారని అర్థము.

వ్యాజస్తుతి:- నిందవలన స్తుతిగాని, స్తుతివలన నిందగాని స్ఫురించునట్లు వర్ణించుట.

ఉదా:- ఏమయా స్వామి శివశివా కైలాసవాసా -
ఏమయా స్వామి సొమ్ములేమి లేకపోయె నీకు
పాములను ధరించుటెంత పాపమో శివశివా
వెర్రివాడ వయితెకావు వెండికొండ దొరవునీవు
పుర్రెలో భుజించుటెంత పుణ్యమో శివశివా - - - - - -
ఎల్లవేల్పులకు ఆదిమూలమైన వేల్పునీవు
బిచ్చమెత్తుకొనుట ఏమి కర్మమో శివశివా

పాములను ధరించుట, పుర్రెలో భుజించుట, ఎద్దునెక్కి తిరుగుట, బుగ్గి పూసికొనుట, బిచ్చమెత్తుకొనుట అనునవి శివనిందాత్మకములు. కాని లోతుగా వితర్కించినచో అవి నిందలు కావు. లెక్కలేని సొమ్ములు, వాహనములు,

పరిమళములుగలవాడై, వెండికొండ దొరయై ఎల్లరకు నాదిమూలమై వెలసినట్టి వాడని కొనియాడుట జరిగినది.

ఈ విధముగా పరిశీలించుచు బోయినచో అనేకమైన అలంకారములెత్తి చూపవచ్చును. మచ్చునకివిచాలు. పల్లీయులలోని అలంకారములన్నియు సహజ శోభితములు, శిరీషకుసుమపేశలములు, ఔచిత్యభాసురములు.

## చిత్రకవిత్వము:—

ఖడ్గ చక్రబంధాది బంధకవిత్వమును చిత్రకవిత్వమందురు. జానపద కవిత్వములో నిట్టి కవిత్వము కానరాదు. కాని పొడుపు కథలలోని కవిత్వమును భావబంధ కవిత్వముగా చెప్పుకొనవచ్చును. అందలి భావము బుద్ధిగమ్యము. పొడుపుకథలను తట్లుఅని వ్యవహరింతురు. బుద్ధిని తట్టుచు అర్థమును రాబట్టుట, ప్రశ్నరూపముగా పొడిచి అర్థమును విప్పించుట అని దానికర్థము. వీనిని సంస్కృతములో ప్రహేళికలందురు. పిల్లల నుండి ముదుసలుల వరకీ తట్లు చమత్కార పూర్వకమైన ముచ్చట్లు. వీని వలన పిల్లలలో బుద్ధి వికాసమగు చుండును. తట్లువేసికొనుపట్ల ఒకరిని మించి యొకరు గెలువజూతురు. అర్థము నేమాత్రము చెప్పక దాని భావమును గుప్తముగాసూచించుటయన్నది తట్లయొక్క లక్షణము. భావము, విషయము, పదము గుప్తములై అన్వయము అనూహ్యమై యొప్పుట తట్లప్రత్యేకత. అవి వినోద విజ్ఞానదాయకములు. కావ్యాదర్శములో, సాహిత్య దర్పణములో వాని భేదములు చర్చింపబడినవి.

సమగ్రముగా తట్లను సేకరించిననాడు వానిని జానపద సాహిత్యములో ఒక ప్రత్యేకశాఖగా గుర్తించి పరిశోధించుట కవకాశము చిక్కును. వానివలన నిగూఢ జీవితరహస్యములు విశేషించి వెల్లడి యగును. కవిత్వములోని భావ మాధుర్యము, శిల్పసౌందర్యము, పదప్రయోగ నైపుణ్యము కన్నులకు కట్టును.

మచ్చునకీ దిగువ కొన్ని తట్లను గమనించదగును.

సుందరిముఖం అందరు సూసిరి (అద్దము)

ఆడఎడ్లు ఈడపగ్గాలు (దోసకాయలు—దానితీగలు)

పలుగురాళ్లల్ల పాము పొర్లాడె (నాలుక)

బొచ్చోని గూట్ల బోడోడు పుట్టె (కోడిగ్రుడ్డు)

అమారె సెల్కాల తుమారెసెట్టు—ఇత్తురాలిని ఆరునెళ్ళకు పూతపూస్తది
(గునుగుచెట్టు)

నాలుగు వర్ణాలకాయన్నా సీతాభిరామా—నారులేవి పూతబూసెన్నా

సందకాడా సషుర్తాయె—సగంపొద్దు యాగటాయె

కోడికూసే కొడుకు బుట్టె తెల్లవారే పేరుబెట్టె
దీని అర్థమేమి తెలుసుకోండి జ్ఞానులైతె (పాలు, పెరుగు)

చీకివారి కోడలా, సిరిగలవారి ఆడపడుచు
పయసులాకులక్క ఎయ్యారి, వైశాఖమాసంలోవస్తుంది (మామిడిపండు)

తండ్రినిచంపి తాతనుగూడి—తండ్రిని కన్నది తలోదరి (చల్ల)

అంతులేని చెట్టూకూ—అరవైనాగ్గే కొమ్మలూ
కొమ్మకు కోటిపువ్వూలూ—పువ్వుల్లో రెండే కాయలు
(సూర్యచంద్రులు)



# భాషాస్వరూపము

పల్లీయుల భాష నిత్యవ్యావహారికమైనది. నన్నయాదుల భాషకు భిన్నమైనది. కృతకము కానిది. వ్యాకరణ మరగించుకొనలేనిది. పునాదిపైద కాలానుగుణముగా సహజమైన మార్పుల నంగీకరించునట్టిది ఒక్కొక్క మండలమును బట్టి స్వరూపమున నించుక రూపభేదమును జూపునట్టిది. కొత్త పోకడలు పోవునట్టిది. భాషాశాస్త్రజ్ఞులకవసరమైనది. పరిమిత నిఘంటువుల పరధిని పెంచజాలునది. పల్లీయుల మనస్సు, జీవనము, కవిత్వము ఎట్లు నిసర్గమో, నిరాడంబరమో అట్లే వారి భాషకూడ. అది అచ్చపు తెలుగు మాటకు బ్రతుకుబాట. జీవకళయుట్టిపడునది. ప్రాచీన భాషా స్వరూపమును గూడ నిలుపుకొనునట్టిది. అట్టిది పల్లెపదాలననుసరించి తెలిసికొనదగును. జానపద సాహిత్యమును పరిశీలించినచో కవితా స్వరూప సౌందర్యమే గాక భాషయొక్క స్వస్వరూప నిరూపణము తత్క్రమ పరిణామ వికాసము కూడ బోధపడగలదు. కనుక ప్రజాజీవనమును తెలిసికొనుపట్ల భాషా స్వరూపమును గూడ నంతగమనించుట న్యాయము దానిని స్థాలీపులాక న్యాయమున పరిశీలించుట యగునేగాని సమగ్ర స్వరూపము నందించుటకాదు. దానికై ప్రత్యేకమైన పరిశోధనమవసరము.

## క్రియారూపములు:-

భూతకాలము:- ప్రథమ పురుష:-

| ఏకవచన రూపము | బహువచన రూపము |
|---|---|
| 1. తెలుగుసీమలో - | |
| వచ్చిండు, వొచ్చిండు, అచ్చిండు, (మహత్తు) - | వచ్చిండ్రు, వొచ్చిండ్రు అచ్చిండ్రు |
| వచ్చింది, వొచ్చింది, అచ్చింది (మహతి) - | వచ్చిండ్రు, వొచ్చిండ్రు అచ్చిండ్రు |
| వచ్చింది, వొచ్చింది, అచ్చింది, (అమహత్తు) - | వచ్చినయి, వొచ్చినయి అచ్చినయి |

2. రాయలసీమలో -

వచ్చినాడు, వొచ్చినాడు - వచ్చినారు, వొచ్చినారు
వచ్చినాది, వొచ్చినాది, వచ్చింది - వచ్చినారు, వొచ్చినారు
వచ్చింది, వొచ్చింది - వచ్చినాయి, వొచ్చినాయి
3. సాగరసీమలో -
వచ్చాడు, వొచ్చాడు, అచ్చాడు, వచ్చేశాడు - వచ్చారు, వొచ్చారు, అచ్చారు,
వచ్చేశారు
వచ్చాది, వొచ్చాది, అచ్చాది, వచ్చేశాది,-వచ్చారు, వొచ్చారు, అచ్చారు,
,, ,, ,, ,, వచ్చాయి, వొచ్చాయి, అచ్చాయి

-:మధ్యమపురుష:-

1. వచ్చినవు, వొచ్చినవు, అచ్చినవు - వచ్చినరు, వచ్చిండ్రు, వొచ్చినరు,
,, ,, ,, ,, ,, అచ్చినరు
2. వచ్చినావు, వొచ్చినావు - వచ్చినారు, వొచ్చినారు
,, ,, ,, ,,
3 వచ్చావు, వొచ్చావు, అచ్చావు - వచ్చారు, వొచ్చారు, అచ్చారు
,, ,,

ఉత్తమపురుష:-

1. వచ్చిన, వొచ్చిన, అచ్చిన - వచ్చినం, వొచ్చినం, అచ్చినం
(వస్తిని) (వస్తిమి)
,, ,,
2. వచ్చినాను(వచ్చినా), వొచ్చినాను-వచ్చినాం, వొచ్చినాం, అచ్చినాం
,, ,, ,, ,, ,,
3 వచ్చాను(వచ్చా), వొచ్చాను - వచ్చాం, వొచ్చాం, అచ్చాం
,, ,,

వర్తమానకాలము:- ప్రథమపురుష:-
1. వస్తున్నడు(వస్తుండు), వొస్తున్నడు, అస్తున్నడు(అత్తున్నడు) -
వస్తున్నరు, (వస్తుండ్రు), వొస్తున్నరు, అస్తున్నరు, (అత్తున్నారు)

వస్తున్నది (వస్తుంది) , వొస్తున్నది, అస్తున్నది- వస్తున్నారు, (వస్తుండ్రు) వొస్తున్నరు, అస్తున్నరు.

వస్తున్నది, వొస్తున్నది, (వస్తుంది)-వస్తున్నయి, వొస్తున్నయి, అస్తున్నయి

2. వస్తున్నాడు (వస్తుండాడు), వొస్తున్నాడు - వస్తున్నారు, వొస్తున్నారు

వొస్తున్నాది (వస్తుండాది) వొస్తున్నాది-వస్తున్నారు, వొస్తున్నారు

వస్తున్నాది (వస్తుండాది) వొస్తున్నాది-వసున్నాయి, వొస్తున్నాయి.

3 వస్తున్నాడు, వొస్తున్నాడు -వస్తున్నారు, వొస్తున్నారు, అత్తున్నారు

వస్తున్నాది(వస్తున్నది) వొస్తున్నాది-...స్తున్నారు, వొస్తున్నారు,(అత్తున్నారు

వస్తున్నాది, (వస్తూంటి-వస్తోంది) వొస్తూన్నది-వస్తున్నాయి, వొస్తున్నాయి (అత్తున్నాయి)

-: మధ్యమపురుష :-

1. వస్తున్నవు(వస్తుండవు), వొస్తున్నవు, అస్తున్నవు-
వస్తున్నరు (వస్తుండ్రు), వొస్తున్నరు, అస్తున్నరు

,, ,, ,, ,, ,, ,,

2. వస్తున్నావు, వొస్తున్నావు - వస్తున్నారు, వొస్తున్నారు

,, ,, ,, ,,

3. వస్తున్నావు, వొస్తున్నావు - వస్తున్నారు, వొస్తున్నారు, అత్తున్నారు
వచ్చేస్తున్నారు

,, ,, ,, ,, ,,

-: ఉత్తమపురుష :-

1. వస్తున్నాను (వస్తున్నా), వొస్తున్నాను, అస్తున్నాను (అత్తున్నా) -
వస్తున్నాం, వొస్తున్నాం, అస్తున్నం

2. ...స్తున్నా(...)వొస్తున్నాను - వస్తున్నాం, వొస్తున్నాం

,,

3. వస్తున్నాను (వస్తున్నా), వొస్తున్నాను - వస్తున్నాం, వొస్తున్నాం,
- ( ... ) (వచ్చేస్తున్నాను) (చేస్తున్నాం)-(అత్తున్నాం)

,, ,, ,, ,,

భవిష్యత్కాలము;- ప్రథమపురుష:-

1. వస్తడు, వొస్తడు, అస్తడు - వస్తరు, వొస్తరు, అస్తరు
వస్తది, వొస్తది, అస్తది - ,, ,, ,,

2. వస్తాడు, వొస్తాడు - వస్తారు, వొస్తారు
వస్తాది(వస్తది), వొస్తది ,, ,,

3. వస్తాడు(వచ్చేస్తాడు-వచ్చేడు), వొస్తాడు -వస్తారు(వచ్చేస్తారు-వచ్చేరు)
వస్తది (వచ్చేస్తాది), వొస్తది, అత్తది - ,, ,, వొత్తారు

-: మధ్యమపురుష:-

1. వస్తవు, వొస్తవు, అస్తవు - వస్తరు, వొస్తరు, అస్తరు
,, ,, ,, ,, ,, ,,

2. వస్తావు. వొస్తావు - వస్తారు, వొస్తారు
,, ,, ,, ,,

3. వస్తావు, వొస్తావు, వత్తవు(అత్తవు) - వస్తారు,వొస్తారు,అత్తారు
,, ,, ,, ,, ,, ,,

-:ఉత్తమపురుష:-

1. వస్తను(వస్త), వొస్తను,అస్తను - వస్తం,వొస్తం,అస్తం(అత్తం)
,, ,, ,, ,, ,,

2. వస్తాను, వొస్తాను - వస్తాం, వొస్తాం
,, ,, ,, ,,

3 వస్తాను(వచ్చేస్తాను), వొస్తాను,అత్తాను - వస్తాం(వచ్చేస్తాం), వొస్తాం
అత్తాం

,, ,, ,, ,, ,,

దీనిని బట్టిచూడ తెలుగుసీమకు, రాయలసీమకు కొన్నిచోట్లలో దగ్గర పోలికలున్నవి మరికొన్ని సందర్భములలో రాయలసీమకు, సాగర సీమకు దగ్గరపోలికలు గన్పించుచున్నవి. అన్నిటికన్న సాగరసీమ క్రియా రూపములెక్కువ మార్పులకులోనై దాదాపు ఒక సాగటీయ బడుటయినది. నన్నయనాటి భాషనుండి క్రమపరిణామము చెందుచు వచ్చినందు చేతనే

నాటికిని నేటికిని ప్రామాణిక భాషలో కొన్ని భేదములు కన్పించుట సహజము. ఉదాహరణకు నాటిక్రియారూపాలలో వచ్చినవాడు> వచ్చినాడు అయినది. ఇదే నేడు వ్యావహారిక భాషలో వచ్చిండు > వచ్చాడు అయినది ఇట్టి మార్పులు గ్రామ్యములని కావ్యములలో నిషిద్ధములని అప్పకవి నుడివినప్పటికిని, కూచిమంచిజగ్గకవి తనచంద్రరేఖావిలాపము(2-83)లో వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు చస్తాడు వంటి ప్రయోగములు గావించినాడు. అయినను పై క్రియారూపములలో 'వచ్చు' అన్న ధాతువు నేటికిని మూడు ప్రాంతములకు సమానమే. ఇటు ధాతువు భ్రష్టము గాకుండ దానిమీద కాలానుగుణమైన మార్పులకు లోనగుట సహజమైనది దానిని గ్రామ్యము, అగ్రామ్యము అనుట పొసగదు ధాతువు భ్రష్టమైనచో అప్పుడట్లనుట తగునేమో. ఇట్టి జానపదభాష ప్రామాణిక భాషకు పునాది. అదిసంస్కరింపబడిననే ప్రామాణిక భాషయగును గాని, మొదటనే సంస్కార రూపమేర్పడదుగదా. పై క్రియా రూపములవలెనే, చెప్పిండు, చూసిండు, చదివిండు, నవ్విండు, తెచిండు, ఉరికిండు మున్నగు క్రియారూపములను గ్రహింపనగును. వ్యతిరేక క్రియారూప విషయమున మూడు ప్రాంతములకు చెప్పుకొనదగిన భేదము గన్పించదు. అయినను వ్యతిరేకవిధిలో చెప్పకు / చెప్పవాకు / చెప్పబాకు చెప్పాక వంటివిలేకపోలేదు.

## ధ్వని పరిణామము:-

ధ్వని భాషకు జనకస్థానము. అది మానవుని స్వరపేటిక నుండి వెలువడు ఉచ్చారణరూపము. ఉచ్చారణలో కొన్ని మాటలను తేల్చి యును, ఒత్తియును, సాధారణరూపముగను పలుకుట సహజముగా జరుగును. అదిస్వర సంబంధము. ఉచ్చరించునపుడు కంఠమందలి నాదతంతువులు ప్రకంపించిన వేగముననుసరించి స్వరము ఏర్పడును. అనాదతంతువులు సాగిన దూరము

ననుసరించి ఊనికయేర్పడును ఈ స్వరఊనికల కారణముగా ఉచ్చారణలో పరిణామము జరుగుట సహజము. భాష పుట్టినప్పటినుండియు ఈ పరిణామము క్రమముగా గన్పించుచునేయున్నది. తెలుగులో ప్రాఙ్నన్నయ యుగమందలి భాషను పరిశీలించినచో మనకది తెలియగలదు. ఈ క్రింద జానపద భాషలోని ధ్వని పరిణామమును గమనింతము.

పల్లీయులు తాలువులైన ,,ఇ, ఈ,, లను ,యు, కారముగా పలుకుదురు. యకారము కూడ తాలజమే. మానవుడెప్పుడు సౌకర్యమాశించును గనుక ఉచ్చారణలో ఒత్తిపలుకదగిన ,,ఇ, ఈ,,లను తేల్చి పలుకుటచేత యకారము వచ్చి, ఇల్లు>యిల్లు; ఇతడు>యితడు; ఈగ > యీగ; ఈయన> యీయన, అను విధముగా రూపొందును. ఇట్లే కంఠ్యములైన ,,ఎ,ఏ,, లు కూడ యకారముగానగును. ఎవరు>యెవరు; ఏది> యేది; ఏపూరు > యేపూరు. ఇంకను మార్పుచెంది ,,యవరు, యాది, యాపూరు,, అగును. ఇట్లు పదాదిని యకారముండుటను కొందరు నిషేధించినను నన్నయ పేర బరగు ఆంధ్రశబ్ద చింతామణి మాత్రమంగీకరించినది (సంజ్ఞా-సూ-24) ,,ప్రాచీన కాలంలో ఆంధ్ర ప్రబంధకర్తలూ లక్షణ గ్రంథ కర్తలూ ఒక్కరేమిటి కవులందరూ పదాది ,యు, కారాన్ని వ్రాతలో సైతం వ్యవహరించారు,, 1 అనుట యేగాక శృంగార శాకుంతలము, శివ తత్వసారము, పరశురామ శతకము వంటి గ్రంథములనుండి పదాది యకారముగల,, యర్రన, యంబిన, యబ్బగుడి యుగ్ద,, అను ప్రయోగములను గూడ శ్రీ పిడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ఎత్తి చూపినారు 2. పదమధ్యమందలి ,ఎ, కారము ,యె,య, గా మారు ప్రయోగములు ప్రాచీన గ్రంథములలో గలవని సర్వలక్షణ సార సంగ్రహము చెప్పుచున్నది 3. బాల వ్యాకరణ కర్త కూడ ఆప్రయోగములకు సూత్రము చెప్పినాడు 4

1 ధ్వని-లిపి-పరిణామం-పిడ్లమూడి గోపాలకృష్ణయ్య-పు 5

2 ధ్వని లిపి-పరిణామం- ,, ,, పు 18

3 సర్వ లక్షణ సారసంగ్రహము:- కూచిమంచి తిమ్మకవి. ఆ 1 పు 63, 64

4 బాల వ్యాకరణము:- చిన్నయసూరి-ప్రకీర్ణపరిచ్ఛేదము-సూ 5

ఓష్ఠ్యములైన 'ఉ,ఊ' లు దంతోష్ఠ్యమైన 'వ' కారముగ మారి 'వు,వూ' లుగా నుచ్చరింపబడుచుండును. ఉన్నది> వున్నది; ఉడుకు> వుడుకు ఊరు> వూరు; ఊగు> వూగు. అట్లే కంఠ్యములుగాను ఓష్ఠ్యములుగాను బలుకబడు 'ఒ,ఓ' లు ఏకారత్వమంది 'వొ, వో' లుగా నగును. ఒప్పగ> వొప్పగ; ఒల్లక> వొల్లక ఓయి> వోయి; ఓడ> వోడ. ఇట్టి ప్రయోగములు పాల్కురికి సోమనాథుని కాలమున కుండినవి. అతడు పదాదిని 'వ' కారమును వాడినాడు 1 'ఒ' మారుగ 'వొ' ను పదాదిని వాడుట కూడ కొన్ని గ్రంథములందు గన్పట్టును 2. దానికి యతిమైత్రిని కూర్చుట యన్నది లాక్షణికమైనది. పల్లీయులు 'ఒ' కారమును 'వ' కారముగా జేసి పలుకుటయును గలదు.

ఒ> వ; ఒంటితంబము> వంటితంబం; ఒల్లక> వల్లక; ఒక్కడు> వక్కడు

క> గ = కడప> గడప; రాకిడి> రాగిడి

గ> వ = త్రాగు> త్రావు; పోగులు> పోవులు.

వ> గ = నవరము> నగురం; శివము> సిగం.

చ> స = చంపెను> సంపెను; చూచె> సూసె; పలచి> పలిసి

చ> శ = చంద్రి> శంద్రి; చిలక> శిలక

స> శ = సేవ> శావ; సెనగలు> శెనగలు; సేలు> శేలు

శ> స = శంఖము> సెంకము; శొంటి> సొంటి

జ> ద = జంట> దంట; నజరు> నదరు; సజ్జలు> సద్దలు

త> ద = బ్రతుకు> బదుకు

ఱ> డ = ఋఱము> ఋడం; సింగిఱి> సింగిడి

న> ల = మునుగ> ములుగ

ల> న = లేత> నేత

ప> బ = చెప్పుత> చెబుత

బ> మ = కబురు> కమురు

---

1 వృషాధిపశతకము:- పాల్కురికి సోమనాథుడు-పద్య 98

2 నవనాథ చరిత్ర:- గౌరన (మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణ) పు 92

బ > వ = గూబ > గూవ (గువ్వ)
య > వ = తెలియదు > తెలువదు; కుదియదు > కుదువదు.
వ > య = పోవమ్మ > పోయమ్మ; గోవింద > గోయింద
య > అ = యంత్రాలు గట్టు > అంత్రాలుగట్టు
ర > ల = శిఖరము > శిఖలం
వ కారము స్వరముగా మారుట సామాన్యము:
వ > అ = వచ్చిండు > అచ్చిండు;
వ > ఆ = వాడు > ఆడు; వాన > ఆన
వ > ఇ = వినెను > ఇనెను; నావి > నాయి
వ > ఈ = వీడు > ఈడు
వ > ఎ = వెన్నెల > ఎన్నెల
వ > ఏ = వేరుబడు > ఏరుబడు; వేగిరము > ఏగిరం.
వ > ఐ = వైభోగము > ఐభోగం > వొయిభోగం
వ > ఒ = వొడిసె > ఒడిసె (ఈమార్పులే పల్లీయ యాసలు. ఈ విధమైన మార్పులు ప్రాచీన కావ్యభాషలో గూడ చూడవచ్చును)
పదాంత, పద మధ్య మకారము వకారముగ మారును.
మామ > మా(వ; భామ > భా(వ
ఏమే > ఏ(వే; రాముా > రా(వూ
భీమయ్య > భీ(వయ్య; మామిడి > మా(విడి
ఇంతేగాక మరెన్నియో పరిణామములు గూడ యుండును. పెక్కు ధ్వని పరిణామవిధానములు ప్రాచీన కావ్యములలోను గన్పించును. తెలగు సీమలో అక్కడ, ఇక్కడలు గక్కడ, గిక్కడలు గాను ఆడ, ఈడలు గాడ, గీడలు గాను అది, ఇది, గది, గిది, గాను అప్పుడు, ఇప్పుడులు గప్పుడు గిప్పుడు గాను, అంత, ఇంతలు గంత, గింతగాను అట్ల, ఇట్లలు గట్ల గిట్లగాను ఉచ్చరించుటయునగును. మహాప్రాణాక్షరములను పల్లీయులు సాధారణముగా పలుకరు. ఉదా: సుఖము > సుకం: మేఘం > మేగం; ఇట్లే తక్కిన రూపములను గుర్తించునది. ఇట్లు ధ్వని యొక్క పరిణామ మన్నది తత్ జన్య స్థాన సామ్యమును అనుసరించియే జరిగిన దనుట స్పష్టము.

**స్వరభక్తి:-** పల్లీయుల వాడుక భాషలో పదమధ్యమున అచ్చుచేరి సంయుక్తమైన అక్షరము విడువడి శబ్దరూపమున మార్పు జరుగును.
ఉదా:- కలెక్టర్ > కలకటేరు; వర్షము > వరుషము
సమర్థ > సమురుత; రక్తము > రగుతము.

**వర్ణసమీకరణము:-** విజాతీయమైన రెండు హల్లులుగాని, అచ్చులుగాని దగ్గరగా చేరినప్పుడందులో నొక అక్షరము సమీపాక్షరమునకున్న ఉచ్చారణ ధర్మములను పొందుటను వర్ణసమీకరణమందురు.
ఉదా:- మంచె > మచ్చె; నంబి > నమ్మి; చెంబు > చెమ్ము.
సంయుక్తాక్షరములు పెక్కుచోట్ల ద్విత్వాక్షరములుగా మారుచుండును. పదాంత మువర్ణము అనుస్వారమగుట సామాన్యము.
ఉదా:- సత్యము > సత్తెం; నిత్యము > నిత్తెం; మధ్యన > మద్దెన;
వజ్రము > వజ్జిరం.
శుక్రవారము > సుక్కురారం; దక్షిణము > దచ్చనం.
ద్విత్వాక్షరములు సంయుక్తాక్షరములగును.
ఉదా:- చెప్పుత > చెప్త; ఇప్పుడు > ఇప్డు; పచ్చితి > వస్తి.
ప్రకృతులు వికృతులుగానగుట పల్లీయులలో నెక్కువగా గాంచగలము.
ఉదా:- భక్తి > భత్తి (బగితి); పంక్తి > బంతి; బ్రహ్మ > (బొ)బమ్మ
పదాది సంయుక్తాక్షరములను తేల్చి పలుకుదురు. పదాది క్రియాదులు వదలి వేయుదురు. ఉదా:- న్యాయము > నాయం; స్వామి > సామి
ప్రతిది > పతిది; ప్రొద్దు > పొద్దు.
సంయుక్తాక్షరము కాని దానికి సంయుక్తమును చేర్చుటయును గలదు.
ఉదా:- నేత > న్యాత; లేత > ల్యాత; బేరం > బ్యారం.

**వర్ణవ్యత్యయము:-** భిన్నాక్షరములకు వర్తించు హల్లులుగాని అచ్చులుగాని పరస్పరము వినిమయమగుటను లేదా ఒక క్రమములోనుండిన పదమందలి అక్షరములు ఉచ్చరించువాని అజ్ఞానమువలనగాని అశ్రద్ధవలనగాని తత్తరపాటు వలనగాని ఆ క్రమము తప్పుటను వర్ణవ్యత్యయ మందురు.

ఉదా:- బర్రెలు > బఱ్రు; చెరువులు > చెఱ్రు; తగులు > తఱుగు;
పగులు > పఱుగు; అనక > నాక.

**వర్ణలోపదీర్ఘత:-** దుముకు > దూకు; కొరకు > కోసం
కుబుసం > కూసం, బియ్యము > బీము ఇట్టి లోపదీర్ఘతకార్యము నన్నయకు పూర్వమే ఆరంభమైనది.

పొలతి > పొత్రి: చిలుక > చిల్క: కొలికి > కొల్కి వంటి పదమధ్యాచ్లోప రూపములు పల్లియ భాషయందు పెక్కుగలవు. ఈరూపములు ప్రాచీన భాషాపరిణామమును గమనించినచో గూడ తెలియవచ్చును

మాత్రా ఛందస్సు మూలమున పాటలలో హ్రస్వములు దీర్ఘములుగా నగుచున్నవి. ఉదా:- బిడ్డను > బిడ్డాను; పతేలు > పాతేలు;
రాముడు > రామూడు.

ఇట్టి లక్షణము ప్రాచీన కవుల గణబద్ధ కవిత్వమునగూడ కన్పించును. సర్వలక్షణసారసంగ్రహములో పై ధ్వని పరిణామ రూపలక్షణములన్ని ప్రాచీన కవులెట్లు ప్రయోగించిరో సోదాహరణముగా వివరింపబడినవి.

**విభక్తిప్రత్యయములు:-** జానపద భాషలో ప్రథమా విభక్తి, సప్తమీ విభక్తి ప్రత్యయములు మార్పునకు గురికాలేదు. మిగత విభక్తి ప్రత్యయములలో గొన్నమాత్రమెటు మార్పులు చెంది ప్రయుక్తము లగుచున్నవో గమనింతము

ద్వితీయా విభక్తి:- న్ని (న-ని) ఉదా:- అతన్ని, అతనినిన్ని,
తిమ్మడిన్ని, కట్టెల్ని.
తృతీయా విభక్తి:- తోని, తోటి, తోడి (తో) ఉదా:- వానితోని,
వానితోటి, వానితోడి (లోపవిభక్తికములు).
చతుర్థీ విభక్తి:- కోసరం, కోసం (కొరకు). ఉదా:- ఎందుకోసరం
ఎందుకోసం.
పంచమీ విభక్తి:- వల్న, వల్ల (వలన) ఉదా:- నీవల్న, నీవల్ల.

షష్ఠీ విభక్తి:- ల, ల్ల, ల్లో (లో, లోపల). ఉదా:- మనసుల, పల్లెల్ల, సందుల్లో, ఇవేగాక మరికొన్నిరూపములిట్లున్నవి -

దాంట్ల > దాంట్లో > దాంట్లోను (దానిలో)

ఇండ్ల > ఇండ్లో > ఇండ్లోను (ఇందులో)

మంట్ల > మంట్లో > మంట్లోను (మంటలో)

సాధారణముగా ,కా, ప్రత్యయము స్వార్థమున, ప్రేమార్థమున పురుషుల పేర్లతో కూడుచున్నది. ఉదా:- ఎల్లిగాడు, పుల్లిగాడు, ఎంకటిగాడు చిట్టిగాడు మొదలగునవి.

ప్రథమేతర విభక్తులు చేరినప్పుడు, ఎల్లిగాడిని, ఎల్లిగాన్ని, ఎల్లిగాడితో, ఎల్లిగానితో మున్నగురూపము లేర్పడుచుండును. ఎల్లి, పుల్లి ఇత్యాదుల కత్వముపచ్చి ఎల్లడు, పుల్లడు, ఎంకడు అగును. కాని చిట్టి, చిట్టడు కాదు. ఇతర విభక్తులు చేరినపుడు ద్రూత అత్వమునకు లోపముండదు ఉదా:- ఎల్లని, ఎల్లన్ని, ఎల్లనితో, మొదలగునవి. కని పిల్లవాడు అనునది ,పిలవాడని తేల్చిపలుకబడును సంబోధనయందు ,కా, ప్రత్యయము మీపి డు పర్ణము వైకల్పికముగా లుప్తమగుటచేత పిల్లగా! పిల్లగాడా! ఎల్లా! ఎల్లిగాడా! అనురూపములు సిద్ధించును.

బహువచన ప్రత్యయమైన ,లు, పరమగు పుం పదాంత మువర్ణము తరచుగా అనుస్వారమగును. ఉదా:- పజ్రములు > పజ్రంలు; పుస్తకములు > పుస్తకంలు.

ప్రథమేతర విభక్తులు పరమైనపుడు మువర్ణమనుస్వార మగుట బహుళము. ఉదా:- పుస్తకం కోసం, పుస్తకంచేత, పుస్తకంను, పుస్తకంపల్ల పుస్తకంతో. బహుళగ్రహణముచేత సప్తమియందు కాదని తెలియవలెను.

లు, ల, న లు పరమైనపుడు సర్వసామాన్యముగా పదాంత మువర్ణము లుప్తమగును. ఉదా:- జత్రములు > పజ్రాలు; మీసములు > మీసాలు

పజ్రిములను > పజ్రాలను; మీసములను > మీసాలను
పజ్రిమున > పజ్రాన; మీసమున > మీసాన

ఇట్టివి ఒకానొకచో వైకల్పికముగా నగునేగాని నిత్యముగాదని చిన్నయసూరి సూత్రీకరించినాడు (తత్సమ. సూ. 43). అసలు భాషననుసరించినపుడే వ్యాకరణము బ్రతుకునుగాని వ్యాకరణముననుసరించినచో భాషబ్రతుకజాలదు. భాష అనేకమైన మార్పులకు గురియయినను ధాతువును విడిచిపెట్టదు. అది సహజము

బహువచన ,లు, ప్రత్యయమునకు ద్విత్వము వైకల్పికము.

ఉదా:- చిలుకలు - చిలుకల్లు; పాపలు - పాపల్లు; 11వ శతాబ్దికి పూర్వము కొన్ని శాసనములందిట్టి కార్యములు గన్పట్టును. (ఇందుకూరు శాసనము- - ,చోళమహారాజుల్లేళన్,).

## సంధి కార్యములు:-

ఉకారసంధి:- పదాంత ఉకారమున కచ్చుపరమైనపుడు (వాడెక్కడ, మనమంటిమి) సంధి నిత్యముగా జరుగుటయన్నది సహజము. ఇంతేగాక మరొక విధముగా విలక్షణమైన ఉకార సంధికార్యముకూడ ఉన్నది.

వాడు + వచ్చెను > వాడు + ఒచ్చెను = వాడొచ్చెను.
కాపు + వాళ్ళు > కాపు + ఒళ్ళు = కాపోళ్ళు, కాపొళ్ళు
మనము + వెళ్ళితిమి > మనము + ఎళ్ళితిమి = మనమెళ్ళితిమి.

ఇచ్చట ఇంతకు పూర్వము చెప్పుకొన్న ప్రకారము వకారము ఉచ్చారణలో స్వరముగా (అచ్చుగా) పలుకబడుటచేత వైరీతిగ ఉకారసంధి జరిగినది. ఇట్లు సంధి విషయమున సహితము క్రమపరిణామము కన్పట్టుచునేయున్నది

యడాగమ. వగాగమసంధి:- సంధికానిచోట అచ్చుమీద పరమైన అచ్చునకు అనగా అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, లు పరమైనపుడు యడాగమము, ఉ, ఊ, ఒ, ఓ, లు పరమైనపుడు వగాగమమును వచ్చును.

మా + అమ్మ > మాయమ్మ; మా + ఇల్లు > మాయిల్లు.

ఆ + ఎలుక > ఆయెలుక; నా + ఔషధము > నాయవుషధం,
మా + ఊరు > మావూరు; నీ + ఒడి > నీవొడి

కొన్నిచోట్ల ఈ ఆగమములు గన్పించవు -
మా + అక్క > మాఅక్క; మీ + ఉప్పు > మీఉప్పు

అకారసంధి:- అకారమునకు సంధినిత్యము.

మేన + అత్త = మేనత్త (మేనయత్త కాదు)
మేన + అల్లుడు = మేనల్లుడు (మేనయల్లుడుకాదు)

స్త్రీవాచకముల మీద కూడ సంధినిత్యమే.
బొమ్మ + ఎక్కడ > బొమ్మెక్కడ; అమ్మ + ఇచ్చెను > అమ్మిచ్చెను. రామయ్య, రంగన్న, లక్ష్మమ్మ, ఇత్యాదులు నిత్య సంధులు. ఇట్టి వానిని ప్రౌఢ వ్యాకర్తయు గమనించినాడు (సంధి. సూ - 1).

వానంటారు = వాన + అంటారు; ఇంకావూరు = ఇంక + అవూరు; కానకుండె = కానక + ఉండె; తనెట్లు = తన + ఎట్లు: పుంటాకు = పుంట + ఆకు; తల్లిదండ్రాదులను = తల్లిదండ్రి + ఆదులను; పెళ్ళిపోతింక = పెళ్ళిపోతి + ఇంక; నూనంటి = నూనె + అంటి; వంటి అచ్సంధులు, కట్టొద్దు = కట + వద్దు; కాకులెంట = కాకుల + వెంట; పిల్లొచ్చె = పిల్ల + వచ్చె; మొగునెంట = మగని + వెంట; ఇంట్లోకి = ఇంటి + లోకి; మూన్నెళ్ళు = మూడు + నెల్లు; నీకంటెచ్చయినోడె = నీకంటె + హెచ్చయినోడె; వంటి హల్సంధులు పల్లీయ భాషలో సర్వసామాన్యముగానుండును. ఈ విధమైన సంధిరూపములు హంసవింశతి, విజయవిలాసము, రసికజన మనోభిరామము, చంద్రికా పరిణయము, శుకసప్తతి, మన్నారుదాసవిలాసము, మల్లభూపాలీయము వంటి పెక్కు ప్రాచీన కావ్యములలో గోచరించుచున్నవి. అనగా జనుల నిత్య వ్యావహారిక ప్రయోగముల ప్రభావమును కావ్యకర్తలునాడు కూడ తప్పించుకొనజాలక పోయినారు

ఇకారసంధి:- ఏమ్యాదుల ఇకారమునకుగాని, క్రియాపదముల ఇకారమునకు గాని సంధి నిత్యమే యగును. వైకల్పికముగాదు. యడాగమముండదు.
ఏమి + అంటివి > ఏమంటివి; వచ్చిరి + ఇక్కడ > వచ్చిరిక్కడ.
క్త్వార్థంబైన ఇకారమునకు సంధి తరచుగానగును.
చెప్పి + ఇచ్చెను > చెప్పిచ్చెను; వ్రాసి + ఇచ్చెను > వ్రాసిచ్చెను.
ఇట్టి సంధికార్యమును ప్రాచీనకవులు కొందరు తమ గ్రంథములలో చేసినారు అనించుకించుక (ఆంధ్రనైషధము- 1 - 18), చించిచ్చు (ఆముక్తమాల్యద 1 - 19)

వచ్చు, ఇచ్చు, చేయు, వ్రాయు, చూచు, మున్నగు క్రియలపై తద్ధర్మార్థక ప్రత్యయములైన ఎడు, ఎడి, పరమైనచో గడ్డిపీకే గిడ్డదాన (గడ్డిపీకు + ఎడు + గిడ్డదాన), వచ్చేటి(వచ్చు + ఎడి), చూసేటి(చూచు + ఎడి) అను రూపములు కలుగుచున్నవి. వచ్చుచుబొయ్యేటి1, విటకోటినెనసేటి2, తిరిపంబె త్తేవానికి3, నుయిదాటేవానికి4 వంటి వ్యావహారిక ప్రయోగములు ప్రాచీన కావ్యభాషయందున్నవి. వచ్చు + ఎడు + అప్పుడు > వచ్చేటప్పుడు, వచ్చేటప్పుడు, వచ్చేప్పుడు వంటివానిలో టి వర్ణాగమము వైకల్పికమైనది.

పదాంత ముచర్ణము అనుస్వారముగా మారుటవలన దనిమీద సంధికార్యము పొసగుటలేదు.
ఉదా:- గంధంఇచ్చె, మనంఉందాం, కర్పూరంఅమ్మవారికి

నన్నయకాలము నాటికే శాసనములందు గన్పించు "అవివారంనాణ్డు; అపంద్రి తారకం" వంటివి మచ్చునకిట గ్రహింపవచ్చును.

---

1. హంసవింశతి ఆ 2. ప. 162; 2 హంసవింశతి. ఆ. 3. ప. 74
3. రాధికాసాంత్వనము. ఆ. 1. ప. 65; 4. పాండురంగమహాత్మ్యము ఆ 4. ప. 275.

సంధివిషయమున మరికొన్ని క్రొత్తరూపము లిట్లున్నవి. అంచేత (అందు + చేత), చూన్నన్ను (చూడు + నన్ను), చూచ్చెప్పు (చూచి + చెప్పు) గీద్దగ్గర (గీత + దగ్గర), రాచ్చిప్ప (రాతి + చిప్ప) రాసుబడ్డాయి (రాసులు + పడినవి), మొదలగునవి. ఇవిగాక గసడదవాదేశ సంధికార్యము పల్లీయ భాషలో నమితముగా జరుగుచున్నది.

అవగాగమము వలన ఒకటి + అవ = ఒకటవ (ఒకటవది) వంటి రూపము పల్లీయభాషలో ఒకటోది అగుటయేగాక 'అవ' 'ఒగ'గా మార్పుచెంది ఒకటొగ వంటి రూపమేర్పడుచున్నది. ఇదంతయు ఉచ్చారణా సౌలభ్యాపేక్ష వలన జరుగుచున్నది ఈ కారణముచేత పదునాలుగు > పద్నాల్గు; పదునెనిమిది > పద్దెన్మిది; ఇరువది > ఇర్వై; అను రూపములు సిద్ధించు చున్నవి. ఉపమావాచకమైన 'వలె' శబ్దము తెలుగుసీమలో ఓలె, లాక, లేక లుగా మారి దాని + వలె > దానోలె, గొర్రెలాక, గొర్రెలేక అగుచుండగా అదేశబ్దము రాయలసీమ సాగరసీమలలో లా, లాగా, లక్కు లుగానయి దాని + వలె > దానిలా, గొర్రెలాగా, గొర్రె లక్క అనురూపము లేర్పడు చున్నవి. వలయును అను అర్థమునిచ్చు 'వలె' శబ్దము క్రియాపదముల మీద వచ్చినప్పుడు తెలుగుసీమలో చెప్ప + వలె > చెప్పాలె కాగా ఇతర సీమలలో 'చెప్పాలి' అగుచున్నది. అటుల, ఇటుల, ఎటుల శబ్దములు తెలుగుసీమలో అట్ల, ఇట్ల, ఎట్లగా మార్పుచెందుచుండ నితర సీమలలో అలా, అలాగా, అల్లాగ; ఇలా, ఇలాగా, ఇల్లాగ; ఎలా, ఎలాగా, ఎల్లాగ; వంటి విధముగా మరికొంత మార్పునకు గురియగుచున్నవి. అట శబ్దము తెలుగుసీమలో అంట (చెప్పినాడంట) గాను ఇతరసీమలలో అట, ఉట, అట్ట (చెప్పాకట, చెప్పాడుట, చెప్పాట్ట) గాను పలుకబడుచున్నవి.

**మాండలికములు:-** భాషకూడ సహజమైన పరిణామము చెందుచు,

వైవిధ్యమును నిలుపుకొనుచు సాగుచుండును. భాషాశాస్త్రసంబంధముగ తెలుగు దేశమును సూక్ష్మవైవిధ్యము ననుసరించి ప్రతి జిల్లానొక భాషా మండలముగ చేయవచ్చును. కాని, తెలుగుసీమ, రాయలసీమ, సాగరసీమ, అని స్థూలముగ మూడు మండలములుగ విభజించుట సామాన్యము. ఆయా మండలములయొక్క పొలిమేరలు కలియుచోట రెండువిధములైన మాండలిక పదములు వాడుకలోగన్పించును. ఒక మండలములో ఏర్పడిన ప్రత్యేక పదములను, మార్పులను మాండలికములందురు. ఈ దృష్టితో స్థూల విభజనకు వర్తించిన పైమూడుమండలములందలి మాండలికములను ఇట గమనింతము.

| తెలుగుసీమ | రాయలసీమ | సాగరసీమ |
|---|---|---|
| చెంపలు | బుగలు | బుగ్గలు |
| పోరి | | అమ్మాయి, గుంట |
| పోరడు, పొట్టెగాడు | | అబ్బాయి, గుంటడు |
| పిల్ల | పిల్ల | పిల్ల, బుల్లెమ్మ |
| పిల్లగాడు | పిల్లకాయ (పిల్లోడు) | పిల్లాడు, బుల్లోడు |
| బుడది | సిన్నది, గిడ్డది | సిన్నది, బుల్లిది |
| కొంటెపిల్లలు | కొంటెపిల్లలు | కొంటెపిల్లలు |
| | | చిత్రకూటగుంటలు |
| పుంటికూర | గోంగూర | గోంగూర |
| పప్పులు | పేడలు | పప్పులు |
| [illegible]లు, (సగలు) | సొమ్ములు | సొమ్ములు (ఫలువులు) |
| గుంట (గంటగోయి) | గుంట (గుంత) | గుంట (ఆడపిల్ల) |
| ముప్పావల | ముక్కాలు | ముప్పావల |
| మోట | కపిల | మోట |
| దుడ్డు (పైకం) | కర్ర (కట్టె) | కర్ర (కట్టె) |

| | | |
|---|---|---|
| తలుపు (ద్వారబంధము) | వాకిలి | వాకిలి |
| పూటగ | పూటగ | లాజిగ |
| గుంజు | గుంజు (లాగు) | లాగు |
| పెండ | పేడ | పేడ |
| తమిదెలు | రాగులు | తమిదెలు (రాగులు) |
| జోలి (ముచ్చట) | ముచ్చట | ముచ్చట |
| సమర్తయింది | పెద్దమనిషయ్యింది | ఇల్లుపట్టింది<br>కందులపాతరతీసింది |
| పెద్దమనిషయ్యింది | | |

ఇవన్నీ ఆయామండలములలోని మాండలిక పదములు. ఒకరి మాండలిక మింకొకరికి అర్థమగుట కొంత కష్టము. కాని, అవి పర్యాయ పదములుగా చెప్పుకొనవచ్చును. ఒక మండలమున కింకొక మండలముతో రాకపోకల సంబంధము లేని కాలమున అవి కొంతవరకు వైవిధ్యముతో బహురూపతతో వింతగానే తోచును. ఈనాడట్లుగాక పరస్పరమైన కలయిక వలన అవగాహనము తేలిక యగుచున్నది. అవి పర్యాయ పదములని గుర్తించుట జరుగుచున్నది. ఒక మండలములోని కొన్నిపదముల కితర మండలములలో వేరొక అర్థము వచ్చును. ఉదాహరణకు రాయలసీమలో బుగ్గలు (చెంపలు) అను మాటకు తెలుగుసీమలో పిల్లలు ఊదెడు రబ్బరు బుగ్గలు అని అర్థము. రాయలసీమ, సాగరసీమలలో ఇంటి తలుపును వాకిలి యందురు. తెలుగుసీమలో దానికి ఇంటి ముందరి చోటని భావము అట్లే అచ్చట పప్పును బేడలనగా నిచ్చట పెండలాలని అర్థము.

**నుడులు:-** సరసమైన, చమత్కారమైన పలుకుబడులే నుడులు (నుడికారములు) అవి ప్రజల గుండెలోతుల నానుచు, నానుచు రసగుళికలవలె నోటినుండి వెలువడుచుండును. పల్లెపదాలలో వానిదొక ప్రత్యేకమైనసొంపు.

నుడులను విన్నపుడవి శబ్దార్థములకన్న విలక్షణమైన విషయమునకును, భావమునకును ప్రాధాన్యమిచ్చినట్లు గన్పడుట సహజము. మచ్చునకు కొన్ని గమనార్హము.

| నుడులు: | | అర్థములు: |
|---|---|---|
| గజ్జలగుర్రాం | - | మంచి చురుకైనది అను అర్థమున వాడుదురు |
| తెల్లారింది | - | బ్రతుకు గట్టెక్కినది |
| కాయా? పండా? | - | చేసిన ప్రయత్నము వ్యర్థమయ్యెనా? ఫలించెనా? అనుట |
| పట్టు సేసినాడు | - | బలవంతము చేసినాడు |
| కొని పట్టు పట్టాడు | - | తగని మొండికెత్తినాడు (శృంగారసంబంధమున వాడబడినది) |
| కూడుదాము | - | రమింతాము |
| ములములసెయ్యకు | - | ఒదలంతవలపు కాకనబడ వేయకుము |
| మనసులొకటల్లేను | - | ఇద్దరిప్రేమ లొకటాయెను |
| కాలుదువ్వింది | - | కయ్యమునకు రమ్మని పిలిచింది |
| నలుగురి నోళ్ళలో నానకే | - | నలుగురిలో పలుచన కాకూడదనుట |
| మడమతిరగబట్ట | - | కాళ్ళకు నిండార అందముగా చుట్టుకొనదగు చీర |
| శిరసుకాటి కొరిగెను | - | చనిపోయెను. |
| బుద్ధిగడ్డితినెను | - | తప్పుచేసెను |
| తూటుమాటలు | - | లోతుపైన మాటలు |
| గుండెకాలిపంట | - | గొంతెండిన బాధ, హృదయతాపము |
| సంతలోన మారిపోదాం | - | ప్రేమికులు సంతనెపమున కూడ బోవుదమనుట |
| కొప్పు సేరమయింది | - | వెలపు వేశ్య కుదిరినది |

పైట చెరగు కుంకుమాయె - కూడికొనరాదు వేళ నుదుటి కుంకుమ
పైట కొంగున కంటినదీ

కనులకు వలలొడ్డేను - ప్రేమించెను

పానం సల్లబడు - కుదుటపడు, శాంతి చేకూరు

శోకమును చంక పెడితిని - దుఃఖమును భరించితిని

బత్తెంటిరె - చనిపోయెను

తాళం పొందికొచ్చె - పెత్తనము వచ్చె

మల్లెపే జిల్లేడులాయె - మిత్రులే శత్రువులైరి
మంచివి చెడువులాయె

సంకగొడుతా - రమించువేళ చేయు శృంగారచేష్ట

సుంటిమాటలు - ఎగదోయు మాటలు

ఎల్లసదువకమున్నె - ఆమూలాగ్రముగా చదువకముందే

తలదింపుదొచ్చె - అవమానము వచ్చె

సెయిమూలగ ఇస్తాడు - చేతినిండ సరిపడునంత ఇచ్చును

కంటిబాసలు - సైగలు

పచ్చిమిరపపాలుపోయు - మిక్కిలి కోపము తెప్పించు

కౌగిలి గుంటడు బుట్టె - ఒక మగవానితో గూడగా కొడుకు బుట్టె

పెళ్ళం సూరకత్తి - మాటలో పనిలో తిరుగులేని
పెండ్లము (పౌరుషవంతురాలు)

గంజిముంత బతుకు - గంజియో. మెతుకో ముంతనిండి
యుండుట

సూపులకు సున్నమేయించింది - చూడకుండ చేసినది, ప్రేమచెడినది

కత్తి మెరుపుల పందెం - గొప్ప పోరాటము

కాటసోకం - మరణ దుఃఖము

వెలుగు సల్లిండు - కీర్తిని వ్యాపింపజేసినాడు

ఎలుగందినది - కీర్తికెక్కినది

రాగము౨ ఓపోటు ఎయిర - అనురాగము సందుకొని అనుభవించుమనుట

పైటకొంగుపక్కాసపడ్డాది - ప్రియునికౌగిట చిక్కిపోవుట, ప్రియునిపాన్పునదగిలియుండుట

కొల్లుపొంగింది - కాపురమెదిగినది

భాగ్యము నిండినది

దగ్గుమొగ్గులాడుట, ఇగ్గుమొగ్గులాడుట - గుంజులాట, ప్రేమికులపెనగులాట

రవికెపిక్కిలె - గుబ్బలుబలిసినవి, ప్రియుని మోహమున తలమునకలగుట

పచ్చగాజులాట - పడుచు దానితో రమించుట

కొంపతింటివి - చంపితివి, కాపురమును రూపు మాపితివి

ఇటువంటి నుడికారపు సొంపులు పల్లీయుల నిత్యవ్యవహారములో నిత్య నూతనములు, అసంఖ్యాకములు. ఇంతేగాక, నుడికారములను, మాటలను గూడ ప్రయోగించుటలోని పదప్రయోగ నైపుణ్యము అపూర్వమైనది.

**పదప్రయోగములు:** నిలువుటద్దంలోన నీదురూపు నిలిచిపోయెను గదరా, బేడాకు దానికొప్పు బేరమయ్యింది, కలికి గోపాలుడే కొమ్మనాసామి-కనులకు వలలొడ్డేనమ్మ, పేమగిరి మల్లెలు తెచ్చేరు అక్క - తెచ్చి పానుపుపై విప్పేరు అక్క, చెక్క టద్దాలలో చెటిరినే సంజ, వాని మొలలో వున్నాయి మోమంచి గజ్జెలే చందమామా - నా మొలకా గుబ్బలమీద మెపిన చాలోయి చందమామా, గుబ్బలిత్త గుత్తగొను, గుండుకొప్పును గుత్తకడిగె, కోర గుబ్బలు కొల్లబోయె కొడుకునీరా వెంకటేశా, రొమ్ము కుసుమల మొగ్గ సిన్నదిరా, కుందనపుబొది కుమ్మరి చిన్నదిరా, వొగలకాడూ వ బలేసువొన్నె సీరేను దుమ్ముసేసె, మాయవరం సంతలోన మారిపోదాం మంగమ్మో, కన్ను దింపుతావి కాటుక పెడుతావి, కామిడా నీశిరసు కాటి కొరిగేను,

దాని సండ్లు నామొగుడు సెండ్లాడెనమ్మా, పొడల పొడల గట్లమీద పొడిసినాది సందమామ, గట్టుమీటి పెద్దమ్మ గటిరిచ్చిపెట్టె, చింగు తగిలి చిన్నబోయేవు, సింగులమీద సిలకలాడేను, కుంచ బోసి కట్టబోతె కులుకు నడుమయిలుకు బట్టె, నిలువెత్తు నట్టిల్లు నిండినారాజు, రంగమంత భంగపుచ్చె, గురిగి దింపి మెరుగు బిద్దె - ముంత జింపి ముద్దులాడె, చేపనిస్తా చేరసియ్యి - జెల్లనిస్తా గిల్లనియ్యి, చిత్రమైన బొమ్మమీదాను - చిలిపి మనసు చిందులాడేను, మీసం గీటుకోని మీది పడ్డాడో, నెత్తిమీద చందమామ నెలలు గాసెరా, గుమ్మంబొచ్చె యాళ్ళాయె గుడిసె రెండు గనుములాయె, గుడారిమొత్త గుబ్బ కొట్టె, కోరెంత పొదల్ల కొప్పిచ్చరాదా, దెసలెళ్ళి తనకాంతి బీసలు నింపిందె, ఎర్రని గుడ్లకు ఎత్తె కోపమ్ము, అంగట్ల కల్లుదాగి సింగుల్ల కక్కెరో, పొడువ నేర్చిన కోడె పొడిసెరాజాణ, కాటికే కన్నూలు జెటిరే - కట్టుకున్న చీర జినిగె, చెన్నరాయుని గుట్టమీదా సన్నగాజుల సప్పుడోయి, కన్నె గుమ్మల కింటిసీరు కంచుగుబ్బల దుంకిపారె, చీంలోన మూర చింపురా, నడుములో బంగారు ఉయ్యాల లూగునో, దూడగడ్డికి నేనెపతు వొచ్చిపిల్లగో - దుమ్ము దులిపి ఎల్లడోలు, సుక్కలన్ని పొక్కటాయె సూరుదే బాసింగమాయె రామలక్షిణ పెండ్లిలాయె కొంగుడకా కోక్కెటీరె, కాపులు కరణాలు కట్ట మెదెల్తుంరెపె - నిండబెట్టె అడిగింటి నిన్నపువ్వాకో, బి నగిరి బోగమొల్లు బొట్ల సీరెల బొట్టు సిలిపె, సుడి గాలివలె నాకు సుట్టుకుందువా, పున్నమి వెన్నెల పువ్వారె పూసింది దాని ఎద రొమ్ముల మీద ఎదజల్లినటాయె, కొప్పు బిప్పె తిప్పులాకె కొడుకు రంగయ పుట్టెరా. ఇటు ఆలోచనను, ఊహా కల్పనను, భావ పరీమళమును చక్కగా తగినట్లుగా మోపికొని పోగల సామాన్యమైన పదజాలముతో కూడినటి పల్లీయుల భాష యున్నదని పైవానిని బట్టి తెలిసి కొనదగును

**జాతీయములు:-** కేవలము ఒక జాతికి వర్తించు అర్థవిశేషములను

అభివ్యక్తము చేయు పదములను, వాక్యములను, జాతీయములందురు. అవి ఆ జాతి సంస్కృతీ సంప్రదాయముల పాదున బుట్టి పెరుగుచుండును. సంస్కృతీ సంప్రదాయములను బట్టియే జాతికొక ప్రత్యేకత సిద్ధించును. ఆ ప్రత్యేకత నడుగడుగున కడుపున దాచుకొని తరతరముల వారికి దెలిపి స్ఫూర్తినిచ్చు పదములే జాతీయములు. వానివలన జాతిగత జీవిత గాథలు విదితములై యొప్పును. ఉదాహరణకు 'పల్నాటి సింహము' అనగానే మనకు పలనాటి వీరుల వీరలక్ష్మీ విన్యాసము, ఆచారిత్రకాంశములు మున్నగునవి తెలియ వచ్చునుగదా. భాషా సాహిత్యములలో జాతీయముల యొక్క పాత్ర విశిష్టమైనది. అవిలేనిచో భాషా సాహిత్యముల సొగసు పొల్లుపోయినట్లుండును. అవియుండి నప్పుడే ఆ జాతి భాషా సాహిత్యములు శాశ్వతముగా నుండగలవు. జాతీయముల సృష్టికి కూడ పల్లీయులు, వారిపదాలు పరమ ప్రమాణములు, పరిపోషకములు. మచ్చునకు కొన్నింటి నీ దిగువ పరిశీలింపదగును.

పనులు విచారించబోతె భారతా భాగోతామాయె, గంజిముంతకు బరువులేదు గంగచెలువకు తిరుగులేదు, పచ్చి అచ్చితలు, గజ్జ గట్టిన కాలు, ఒడినిండ బియ్యము, కుంభకర్ణుని నిద్ర, నీ పండు సింహాచల శిఖర మెక్కింతు, నెయ్యిపాలు నెయ్యి కడిగె, కూలింటి మాకుప్ప కుంభకర్ణుని మల్లె, సీత పుట్టి లంక చెరచినట్లయ్యె, అకులలములు తిని బతుకొచ్చు, పాలనేతుల బానలాట, శ్రీరామరక్ష, అందమైన సందమామ అవిసెన్ని కదువ, గట్టు మీది పెద్దమ్మ గటిరిచ్చి పెట్టె, నీలంపుగాజుల్లా సిదుంబెసాలు, రాలేటి సుక్కలు రంభ తల్వాలు, గొంతెమ్మ కోరికలు, చిత్రకూటాలన్ని చిన్నవాయినవి, తీర్థ ప్రసాదం దే ముడికి తిరుపం కట్టుకొకులకి.

**జానపద వ్యుత్పత్తి:-** పదములో గాని పదబంధములో గాని అపరిచిత ముగానో అననుకూలముగానో ఉండెడి పదభాగమును తొలగించి ఆ స్థానమున పరిచిత పదమునుగాని, అక్షరమునుగాని చేర్చి పలుకుట పల్లీయుల నూతన

పదసృష్టి. అదివారి వినూతన వ్యుత్పత్తి. దానివలన అర్థవిశేషముకూడ మార్పుచెందును. ఉదా:- అరంజ్యోతి (అరుంధతి)
గజ్జిమూర్తి (గజమూర్తి), సారస్వతమ్మ (సరస్వతమ్మ)
అసరేటికార్తె (ఆశ్లేషకార్తె), చందమామ (చంద్రిమస్)
సివకుర్తి సమ స్తరం (శుభకృతు సంవత్సరం)

**నిఘంటువునకెక్కదగిన శబ్దములు:** తెంకు = వెదపట; పొంటి = అనుసరించి; నంబి = సుండి; పలుగు = తెల్లని చిన్నచిన్నరాళ్ళుగలనేల, పలుగురాళ్ళు; కొమిరె = నాటుగుంజ; బద్ది = గోళీలు, బంతి, చిరుతపిళ్ళ వంటి ఆటలు ఆడునప్పుడు పిల్లలు ఏర్పరచుకొను గుంట-బండ చెక్క - గుర్తింపురేఖ. సురటిమాటలు = ఎగదోయుమాటలు; జాజపుమాటలు = తగవులాటమాటలు; గుత్తులు సత్తులు = పొలము వస్నులు (కౌలు); మట్ల (పట్లు) = బారెడు (లోతుకొలిచే ప్రమాణము) గుల్లెద్దు = చిన్నఎద్దు; సిగిలిచ్చు = పుంజపట్టుపట్టు; జబ్బారు = తెద్దుజారుడువంటకం; లొట్ట = కుండ; దాగిరి = అంగుగల పెడల్పైన పెద్దపెదురు జల్లెడ-బేనిమీద తిరుగలి పెట్టి పిసురుదురు; సుంగు = చూరు; చేటికద్ద = కల్లుముంత; మట్టిబోల = మట్టిముంత; ఈతబసపి = ఈతచెట్టు; గగ్గులు = పిప్పికంకులు; మొదలగునవి. ఇట్టివానినెన్నింటినో స్వీకరించినచో పదకోశములు పరిపూర్ణములగును

**సామెతలు;-** అత్తచేసి కోడలు ఓర్పములాలు-కోడలులేనత్త గుణవంతురాలు, అరచేతి బెల్లము చిరుచేతులామె, అవుడంటె తవుడన్నరీతి, ఆడవారి బుద్ధులు అపర బుద్ధులు, ఆడవారెంతున్న ఆలిసరిరారు - మొగవారెంతున్న మొగనిసరిరారు, ఆషాడమాసే బూసోసిమేసె, ఇనుము ఇరిగితె అతుకొచ్చు మనసు ఇరిగితె అతుకరేము, ఏటిమీద ఇసుక సల్లినట్లాయె-

ఏరునుగుల దాలి యేసినట్లుంది, గతిలేనమ్మకు గంజేపానకము, నొసట రాసిన రాత తుడిసినాపోదు, పుంటికూర ఉన్న పుట్టినిల్లు, పడమానుకు గొడ్డలేలా -పాతముండకు షైకమేలా, వన్నెకాని మాట చింతకాయ-మూట, బలపంతునికి నోటియరాదు-అర్థి వానికి ఆశెసూపరాదు, వంటివి పల్లీయుల నిత్యవ్యవహారములోని కొన్ని సామెతలు. వారిభాషలో సామెతలదొక విలక్షణమైన సొగసు. అవి జీవితానుభవసారమును ఎల్లప్పుడు సారవంత ముగానుంచెడు సూత్రములు. పల్లీయుని పలుకరించినచో క్రొంగ్రొత్త సామెతల నెన్నింటినో వినగలము. పల్లెపదములలో సామెత లడుగడుగున భాసించుచుండును.

**అన్యదేశ్యములు:-** ఒక ప్రవాహములో మరికొన్ని ప్రవాహములువచ్చి కలిసినప్పుడవి కూర్చుకొని ప్రవహించుట సహజము. ప్రవాహవేగముకూడ పెరుగును. నడుమవచ్చి కలిసెడు ఆ ప్రవాహములు పెద్దవైనచో తొలీ ప్రవాహరూపమే మారిపోవును. అప్పుడు దానిని నిర్దిష్టముగా గుర్తు పట్టుట కష్టము. అటే ఒక భాషలో, విజాతీయ భాషా సంపర్కమేర్పడినపుడు దాని ప్రభావము పడుచుండును. అదిబలవత్తరమైన యెడల మొదటిదానికి మోసము వచ్చును. మోసము వాటిల్లకుండ జరిగినచో అదిమేలే. సమాజములో నితరులను జూచి మంచినలవరచుకొనుట ఆరోగ్యదాయకము భాష విషయమున గూడ అంతే. భాషను పెంచుకొనవలెనన్నచో తనలోలేని పదజాలమును అన్యభాషలనుండి గ్రహించుట శ్రేయస్కరము కాని తన భాషను చంపుకొని దని స్థానమున అన్యభాషను పెంచుకొనుట అన్యాయము ఆత్మద్రోహము నాగరకులలో కంటె జానపదుల భాషలో అన్యదేశ్యములైన ఉర్దు, ఇంగ్లీషు భాషాపదములు చిల్లరపాటిగానె కన్పించును. అట్టి వానిలో కొన్ని తెలుగుదనమున మాగిపోయినవి. ఉ:- గులాపోన్ని, యాదిలేదు (ఉర్దు), గిలాస; లోటు(ఇంగ్లీషు) మొదలగునవి. కొన్ని అనువాద రూపము లైనవి. ఉదా:- పొగబండి, తొక్కుడు బండి, రబ్బరుబండి వంటివి. అన్యదేశ్యములను గ్రహించునప్పుడు దానికి తెలుగుదనమును కలుపుకొని వ్యవహరించుట ముఖ్యలక్షణము. అన్యదేశ్యములలో ఉర్దు, ఇంగ్లీషు భాషపదములే ప్రధానములైనవి.

# సింహావలోకనము

## ( జాతీయ ఆయం జానపదగేయం )

పల్లెపదాల ననుసరించి జానపదుల మనసునుండి మాట (భాష) వరకు సాగిన పరిశోధనలో వారి జీవితమే కవిత్వము కవిత్వమే జీవితము అయినదని తెలిసికొంటిమి. అది పల్లెపదాలలోని ప్రత్యక్ష ప్రమాణము. దానివలన కవిత్వోద్దేశము అక్షరాల సిద్ధించినది. ప్రజాజీవనములోని ప్రతి సంఘటనను పల్లెపదాలు మూటగట్టి ముద్రవైచినవి. తెలుగు వారిజీవనమును తేటపరచినవి. సంస్కృతీ సంప్రదాయముల అచ్చపుదనమును అచ్చుగుద్దినవి. జాతీయ పునర్వికాసమునకు పునాదులైనవి

మనోవృత్తుల వాగ్రూపమైన అభివ్యక్తియే కవిత్వమనియు, తత్ఫలితముగా వృత్తి, ప్రకృతి, పరిసరములు, దేవుడు, శృంగారము ననుసరించి జానపదుల మనస్తత్త్వమును శాస్త్రీయముగా పరిశీలించుట జరిగినది. ప్రాక్తన మనస్తత్త్వ బీజములు చర్చించుటయినది.

వ్యక్తి సంస్కార నిర్మాణమునకు మూలమైన పరస్పర సంబంధముల కొలవాలమైన కుటుంబతత్త్వమును సంపూర్ణముగా దర్శింపజేయుటయినది.

వ్యవసాయ జీవన ప్రాతిపదికగా నొప్పిన సమగ్ర జానపద సామాజిక జీవనములో వేదోక్తముల నుటంకించుచు, ఇతర వృత్తుల సంబంధములను, నావికజీవనమును, తాత్త్విక జీవనమును, వినోదములను, విజ్ఞానాంశాదులను వివరముగా పరిశోధించుటయయినది.

వేదోక్త షోడశ సంస్కారములు, పురాణసంబంధమైన పూజాదికములు, పండుగలు, గ్రామదేవతల పుట్టుపూర్వోత్తరములు, జాతరలు మున్నగువాని సంబంధముగా పల్లీయుల ఆచారవ్యవహారస్వరూపమును పరిశీలించుటలో వారి శ్రుతి స్మృత్యుక్త జీవనమును నిర్ధారించుట జరిగినది.

వివిధకోణములలో పల్లీయ శృంగార జీవన తత్త్వమును, కవితా స్వరూపమును, భాషా స్వరూపమును సోపపత్తికముగా చర్చించుటతో సప్త ప్రకరణయుక్తమైన నా పరిశోధన పరిసమాప్తమగుచున్నది.